# వందేమాతరం

(18 ఖండాల-పద్యకావ్యం)

ఖండఖండ సుధావర్షి

కవి పండిత వాచనం



## స్వాతంత్ర్యోద్యమ చరిత్ర
## (1860 - 1906)



రచయిత

ముదిగొండ వీరభద్రమూర్తి

ప్రథమ ముద్రణము
1000 ప్రతులు
ఆగస్టు 1977



ప్రతులకు :-

1) ముదిగొండ వీరభద్రమూర్తి

18-6-675
కులికంపురా
హైదరాబాద్-500267

2) ఆంధ్ర సారస్వత పరిషత్

తిలక్ రోడ్
హైదరాబాద్-1

వెల. రు 36-00

ముద్రించినది

శ్రీ వరలక్ష్మి ప్రెస్
ఖైరతాబాద్
హైదరాబాద్-4
ఫోన్ 34711

# హృదయంగమం

ప్రజలకు అంకితం ప్రబంధం,
విభిన్న దృక్పథాలతో దీనికి సంబంధం
కలక ఒక్కటే, కావ్య పుట్టాలను కన్నులతో విన్నవారు
సత్యనారాయణ,మాధవశర్మ సమయానికి లేరు
కథ,వర్ణన,కల్పన
పాలు, డికాక్షన్, పంచదార
కాయంలో దివ్యత్వం, కథలో నవ్యత్వం
ప్రాణానికైనా, ప్రతిభకైనా అప్పుడే అగ్రగణ్యత్వం
ఎన్నిచోట్లనో! తెంపు లేకుండా పరిభ్రమించింది
ఎక్కడనుండి బయలుదేరిందో కథ అక్కడనే విశ్రమించింది
సంవిధాన మొక 'టెక్నిక్', సహభావులకు 'పిక్నిక్'
ఆదిలో ఆర్తి.అంతాన స్ఫూర్తి
అన్ని భావాలు అవయవాలు, ఉత్సాహం మూర్తి
వాగ్గగనిలో నిగ్గుదేరిన వజ్రమూ లభిస్తుంది
రాజకీయ ఉపన్యాసంలో రమణీయార్థమూ భాసిస్తుంది
అంద్రంలో 'అనుష్టుప్పు' ఆవకాయతో పప్పు
పద్యకావ్యంలో ద్విపద గద్యంకంటే మెప్పు
అందందు పాటింపబడలేదు ఛందోవ్యాకరణనియమాలు
దొరవరి శైలి వారిదే, యెన్నో పద్యాలలో 'కామా'లు
పూర్వకవిత్వంమీద పుష్పవర్షం కురిసే అబ్దం
అర్థాన్ని ప్రతిధ్వనింపే శబ్దం

"Sound echoing sense
mind reckoning at *once*
sense revealing sense
Soul recurring o*n* pounce
రామాయణంతోపాటు ప్రజారాజ్యస్థాపనారామాయణమూ తెలిస్తే
ప్రీతితోపాటు లోతులు వెతికే శక్తి మొలిస్తే
వర్తమానకవనంలో భావికోసం త్రవ్విన గుర్తులా కనిపిస్తవి
పఠించి చెప్పు నేస్తం! శరించక పొరపాటు సర్దుకొంటుంది యీ హాస్తం

*ము॥వీ॥మూ*

# ముద్రణ ద్రవ్య సహాయకులు

| | |
|---|---|
| ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం | 2000-00 |
| ఆంధ్రప్రదేశసాహిత్యఅకాడమీ | 2500-00 |
| శ్రీకండె వేంకటనారాయణగుప్తగారు Coalmerchants,సికింద్రాబాద్ | 251-00 |
| శ్రీ జూలూరి వీరేశలింగం గుప్తగారు, సికింద్రాబాద్ | 250-00 |
| శ్రీ జి. పుల్లారెడ్డిగారు, హైదరాబాదు | 250-00 |
| Amar Chitfunds, Secunderabad | 216-00 |
| శ్రీ ఆకారపు రాజచెన్న విశ్వేశ్వరరావుగారు, వరంగల్ | 216-00 |
| Messers Seshadri And Company, Forest Contractors, warangal, | 216-00 |
| శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, హైదరాబాద్ | 200-00 |
| శ్రీ కరుటూరి సత్యనారాయణగారు, Assitant Commissioner, Commercial Taxes Appeals, కర్నూలు | 200-00 |
| శ్రీ నాగిళ్లలింగం, మాణిక్యరావుగార్లు, సిల్కునూలుజరీవర్తకులు, సికింద్రాబాదు | 200-00 |
| శ్రీ బుక్కా వీరేశంగారు,సిల్కునూలు జరీవర్తకులు, సికింద్రాబాదు | 200-00 |
| శ్రీ గంప వేంకటయ్యగారు, Yarn Merchants సికింద్రాబాదు | 151-00 |
| డా॥ వి. శేషగిరిరావుగారు, Eye Specialist, కరీంనగర్ | 150-00 |
| శ్రీ కందుకూరి శివానందమూర్తిగారు, నయీంనగర్, హనుమకొండ | 116-00 |
| శ్రీ సముద్రాల నాగభూషణంగారు Principal S.V.T College, కరీంనగర్ | 116-00 |
| శ్రీ రాజరాజేశ్వర ప్రభుత్వ కళాశాలసాహితీసమితి, కరీంనగర్ | 116-00 |
| శ్రీ విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాల పాలకవర్గం, వరంగల్ | 116-00 |
| శ్రీ దుర్గేశ్వరమహిళాసంస్కృతాంధ్ర కళాశాలపాలకవర్గం, వరంగల్ | 116-00 |

| | |
|---|---|
| శ్రీ భూపతి సోమలింగంగారు, వరంగల్ | 116-00 |
| శ్రీ వెనిసెట్టి చంద్రశేఖరంగారు, వరంగల్ | 116-00 |
| శ్రీ తోట భద్రయ్యగారు, వరంగల్ | 116-00 |
| శ్రీ కొండూరి శేషయ్యలింగంగారు, వరంగల్ | 116-00 |
| శ్రీ కొండూరి జగదీశ్వరయ్యగారు, వరంగల్ | 116-00 |
| శ్రీ ఏడియాల పుల్లయ్యగారు, పొగాకువర్తకులు, వరంగల్ | 116-00 |
| శ్రీ కాసుకంటి రాజేశ్వరరావుగారు, Advocate, హనుమకొండ | 116-00 |
| శ్రీ తమ్మన సీతారామాంజనేయులు అండ్ కంపెనీ, వరంగల్ | 116-00 |
| శ్రీ పైండా వేంకటరత్నంగారు, Income tax Practitioner, ఏలూరు | 116-00 |
| శ్రీ మాదిరాజు రాంకిషన్‌రావుగారు, Advocate, ఖమ్మం | 116-00 |
| డా॥ దమ్మాలపాటి రామారావు గారు, M.L.A., విజయవాడ | 116-00 |
| శ్రీ M.P. సదాశివరావు గారు, National Steel Industrial Estate, విజయవాడ | 116-00 |
| డా॥ ముక్కామల అమరేశ్వరరావుగారు, గుంటూరు | 116-00 |
| శ్రీ అంబడిపూడి శివశంకర పూర్ణానందశాస్త్రిగారు, చినమక్కెన (గుంటూరు జిల్లా) | 116-00 |
| కీ॥శే॥ శ్రీ మాదలలక్ష్మీకాంతంగారి భార్యరాజ్యలక్ష్మమ్మగారు, మాదల | 116-00 |
| D. Rama Rao And Company, Guntur | 116-00 |
| శ్రీ జూపూడి నరసింహారావుగారు, ఖమ్మం | 116-00 |
| శ్రీ జూపూడియజ్ఞనారాయణగారు, Advocate, M.L.C. గుంటూరు | 101-00 |
| శ్రీ V. కృష్ణమూర్తిగారు, Auditor, ఖమ్మం | 101-00 |
| శ్రీ గునిశెట్టి నాగలింగంగారు, వరంగల్ | 101-00 |
| శ్రీమతి పబ్బతి శంకరలక్ష్మిగారు, వరంగల్ | 101-00 |
| శ్రీ భండారు చంద్రమౌళీశ్వర రావుగారు, Advocate, వరంగల్ | 101-00 |
| శ్రీ యంసాని కృష్ణమూర్తిగారు, వరంగల్ | 101-00 |
| శ్రీ లింగమల్లు శ్రీ రామప్రసాద్‌గారు, ఏలూరు | 101-00 |
| శ్రీ యడవల్లి శివరామశాస్త్రిగారు, Advocate, హైదరాబాదు | 101-00 |

శ్రీ తాడికొండ వీరభద్రయ్యగారు, Advocate, హైదరాబాదు 101-00
శ్రీ సత్తిరెడ్డి వెంకటరెడ్డిగారు, Advocate, హైదరాబాదు 101-00
శ్రీ బి. సుభాషణ్‌రెడ్డిగారు, Advocate, హైదరాబాదు 101-00
శ్రీ వేదుల జగన్నాథరావుగారు, Advocate, హైదరాబాదు 101-00
Sree G.S. Madhava Rao garu, Chartered Accountant, Hyderabad 101-00
శ్రీ యమ్. రామమోహనరావు గారు, Advocate, సికిందరాబాదు 101-00
Sree Nerlakanti Lakshmayya And Brothers, Petrol H.P. Dealers, Hyderabad. 101-00
శ్రీ బచ్చువెంకయ్యగుప్త గారు, వెండి, పాల్మోరా ఆయిల్ వ్యాపారస్థులు, హైదరాబాదు. 101-00
శ్రీ Y.V. ఆంజనేయులుగారు, Advocate, హైదరాబాదు 101-00
శ్రీ కొక్కొండ జ్ఞానేశ్వరరావుగారు, B.Sc., L.L.B. హైదరాబాదు. 101-00
Venkata Ramana Banaras Silk House, Secunderabad 101-00
Sree Gajanand Yarn Trading Company, Secunderabad 101-00
Sri Kalva Yellayyagaru, for Sri Krishna Trading Company, Secunderabad, 101-00
శ్రీ సిద్ధంశెట్టి ఈశ్వరయ్యగారు, సికిందరాబాదు 101-00
శ్రీ కె. పుల్లయ్య నాయుడుగారు, సికిందరాబాదు, 101-00
శ్రీ C H. నారాయణగారు, సికిందరాబాదు, 101-00
Sri S K Nagulugaru, Coal Depto, Secunderabad 101-00
శ్రీ తెలుకుంట సత్యనారాయణ అండ్ సన్సు, సికిందరాబాదు 101-00
శ్రీ గాదేపల్లి జగదీశ్వరయ్యగారు, సికిందరాబాదు 101-00
Sree Lakshmi Textiles Company, Secnuderabad 101-00
శ్రీ జవ్వాజి రామారావు గారు, సికిందరాబాదు 101-00
శ్రీ K Y. నందకుమార్ గారు, సికిందరాబాదు 101-00

# అభినందనం

ఈ కావ్యముద్రణమునకు ఆర్థిక సాహాయ్య మొనరించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారికి, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారికి,

ఈ గ్రంథముద్రణమునకే కాక మదితర గ్రంథముద్రణమునకు కూడ ఆర్థికసాహాయ్య మందించిన పట్టికలోని అందఱకు,

తాము ద్రవ్య మిచ్చుటయే కాక పలువురచేత నిప్పించిన డా॥ దివాకర్ల వేంకటావధానిగారికి, శ్రీ తాడికొండ వీరభద్రయ్యగారికి, శ్రీ కంది వేంకట నారాయణగుప్తగారికి, శ్రీ నాగిళ్లమాణిక్యరావుగారికి, వరంగల్‌వాస్తవ్యులు శ్రీ భండారుచంద్రమౌళీశ్వరరావుగారికి, జాతీయసాహిత్య ప్రచార ఆసక్తులైన అడ్వకేట్, శ్రీ భండారు సదాశివరావు గారు, శ్రీ ముదిగొండ శంకరశాస్త్రిగారు మున్నగుఆప్తవర్గమునకు, వరంగల్‌లో నాకు స్వగృహము లేని లోటుదీర్చిన శ్రీ శ్రీవగుంటసీతారామస్వామిగారికి, కరీంనగరంలోని శ్రీ P. సుబ్బరాయ శాస్త్రిగారికి

కాగితమును సరసమైన వెల కొసంగిన "సిరిపూర్ పేపరుమిల్సు" వారికి,

గ్రంథమును ముద్రించిన "శ్రీ వరలక్ష్మీ ప్రెస్" అధినేత సుభాష్ చంద్రకు, అరగ్రుడ్డిని అసహాయుడ నౌటచే దొరలిన అచ్చుతప్పులను పరిశీలించి చూపించిన కవిశేఖరులు శ్రీకరుటూరి సత్యనారాయణగారికి.

ఈ ప్రజాకావ్యమును ప్రతిఖండ కవితా పరిచయ వ్యాస సంయుతముగా ప్రకటించ వలసినదే అని పట్టుబట్టి నూత్న పద్ధతిలో పుస్తకశోభను విస్తరింపించిన మిత్రులు శ్రీ గోపాల చక్రవర్తిగారికి, శ్రీ కుందుర్తిగారికి,

కథకు సహాయపడిన ఆంధ్రాంగ్లేయగ్రంథముల రచయితలకు,

ఇందు ఖండ ఖండ కవితా పరిచయవ్యాసవిరచన మొనరించిన కవి పండితులకు,

ఈ కావ్యమునందలి ఎక్కువభాగము "ఆంధ్రప్రదేశ్" పత్రికలో ప్రచురించిన ప్రభుత్వ సమాచార పౌర సంబంధ శాఖవారికి, కొన్ని ఘట్టాలు ప్రసారం చేసిన "ఆలిండియా రేడియో" వారికి

నా కృతజ్ఞతాపూర్వక అభినందనములు.

*ముదిగొండ వీరభద్రమూర్తి*

# విషయసూచిక

DR. B. GOPALA REDDI GARU,
President
A.P. Sahitya Akademy, Hyderabad

12-4-1977

# KSHAMA KHANDAM

## (క్షామ ఖండము)

Sri Mudigonda Veerabhadra Murthy is one of our old guards in literary compositions. He has many poetic compositions to his credit and some translations from Sanskrit. He is known in literary circles of Andhra Pradesh for a long time.

He is a patriot and a freedom fighter. He is now engaged in writing a modern Epic in the traditional style of poetry. He wants to capture current political impulses into customary style of poetry. Instead of themes from Puranas, he has taken inspiration from the people and described their problems in verse.

People with their aspirations, attempts and disappointments, their sorrows and miseries are a perennial source of inspiration to poets, with a human compassion and insight. They are the central figures on the terrestrial stage. No two people are alike in their inner wealth of feelings and emotions. Life is complex with innumerable situations and man's reactions to them should always be fascinating study.

Sri Murthy's latest book is entitled "Vandemataram" and the opening chapter is called 'Kshama Khandam' describing the harrowing tales of starvation in Bengal. Famine due to drought conditions is aggravated by businessmen and officials dealing with food distribution.

Lakhs of people died of starvation in our country in our own living memory: that is one of the black chapters of British administration in India.

Sri Murthy dealt with the theme deftly and in clear language. I commend the chapter and the book to the discerning public of Andhra and I hope they will welcome it as one dealing with contemporary life. I congratulate the author on his work.

BH. KRISHNAMURTI GARU
B.A. (Hons.) (Andhra), M.A., Ph.D. (Penn.)
professor & Head
Department of Linguistics
Osmania University

Hyderabad
16-4-77

శ్రీ ముదిగొండ వీరభద్ర మూర్తిగారు తాము రచించిన 'వందేమాతరం' కావ్యంలో ప్రథమఖండానికి పరిచయవాక్యాలు రాయమని కోరారు. ఇతర ఖండాలకు వేర్వేరు పండితులు రాస్తున్నారని అన్నారు. ఇది నా యోగ్యతకు మించిన పని అని చెప్పినా 'కాదు, గూడదు' రాయాలన్నారు. వారికి నామీద ఉన్న ఆదరాభిమానాలకు కృతజ్ఞత చెప్పుకొంటూ మొదటిఖండం చదివినమీదట నాకు కలిగిన అభిప్రాయాలను కింద పొందుపరుస్తున్నాను.

ఈ ఖండంలో మొదట అవతారిక, తరవాత వంగదేశంలో నీలిపైరుపండించే రైతులతో తెల్లవారికి వచ్చిన పేచీ, వర్షాభావం వల్ల దుర్భిక్షం, 'గదాధరఛటర్జీ' పీడితప్రజలకు చేసినసేవ, 'దాదాభాయినౌరోజీ' వదాన్యత మొ.వి వర్ణితాలు. ప్రధానంగా బెంగాలులో వచ్చిన కరువును సుమారు నలభై పద్యాల్లో వర్ణించారు.

అవతారికలో వసుచరిత్రకారుడు 'మహి మున్ వాగను శాసనుండు' అనే పద్యంలో ఆంధ్రకవుల పేర్లు కలిసివచ్చేట్టు శ్లేషించి రాసిన తీరును జ్ఞప్తికి తెచ్చే పద్యాలు కొన్ని శ్రీ వీరభద్ర మూర్తిగారు రాశారు: ఉదా:-'నాయని చెప్పికోఁ దగినవాఁ డొకండు' (14) అంటే నాయని సుబ్బారావుగారు. వీరి అభిమాన కవులు మిత్రులు జాబితాలో సర్వశ్రీ విశ్వనాథ, సన్నిధానం, రామానుజరావు, మొ॥ వాళ్ళు ఉన్నారు.

ఇటీవల సాంప్రదాయికఛ్ఛందస్సుల్లో దేశచరిత్రను కథనాత్మక కావ్యంగా రాసినవారు అరుదు. బహుశా "శివభారతం" 'ఆంధ్రపురాణం' తరవాత శ్రీవీరభద్ర మూర్తిగారి రచనే ఆకోవకు చెందింది కావచ్చు. శ్రీ మూర్తిగారి పద్యాలను వారి చేత చదివించుకు వింటే చాలా ఆనందంగా ఉంటుంది. ఈ వయస్సులో గూడా వారిది కంచుగొంతు.

కరువు వర్ణనలో ఆముక్తమాల్యదలోలాగా సహజోక్తి చక్కగా కనిపిస్తుంది(౬౪–౬౯):ఉదా:

"పల్లెటూరినుండి పట్నవాసమునకు
బ్రతుకు తెరువుకొఱకు బడుగు చేరె
వానికన్న మున్నె భాగ్యవంతుడు చేరె
నడిమిరకము రైతు నడువలేడు" (౬౯)

క్షామకాలంలో సర్వజీవులకు వచ్చిన ప్రళయాన్ని వర్ణించిన సీసపద్యంలో చివర—

"కన్న భూమాతయే తన కడుపు నెత్తి
గొట్టి సృష్టిని లోగొన్న గుట్టు తెలిసె"

అన్న పాదాలు అల్పాక్షరాల్లో అనల్పార్థరచనను ప్రదర్శిస్తాయి. వర్ణనలో పూర్వకవుల రచనల్లో గోచరించని కొత్త ఉపమానాలు, ఉత్ప్రేక్షలు శ్రీ మూర్తిగారి ప్రతిభకు ప్రతీకలుగా కనిపిస్తాయి;ఉదా:

ఆకాశం శివాలయంలాగా ఉందిట, "చిలుమొగిళ్ళు విభూతివంక్తుల్" (శ్రీ వీరభద్రమూర్తి గారు శైవులు) "స్నానీయజలమ్ముమాట శంకరు డెఱుగున్" బహుశా నీళ్ళు లేక ప్రజలు అభిషేకాలు మానేసి ఉంటారు; గంగ ఎక్కడన్నా ఉంటే తన నెత్తిన ఉన్న దని శివుడికే తెలిసిఉండాలి. "అందుండి శీతాద్రి..."మొ. వాటికి చేరినట్లు ప్రజలకు ఆధారం లే దని చమత్కారం.

తెల్లమబ్బులే కాని నల్ల మబ్బులనక గూడా కనిపించటం లే దనటానికి;
"మందలుమంద లావు లొక మబ్బును గేదె యుకాద యేవిరేమన్
బిందువు రాల్పవుం బయను, బీడువడెన్ హృదయమ్ము భూమి.."
(౪౬)

బెంగాలులో ఏమోగాని తెలుగుదేశంలో గేదె ఎండిపోతున్నా కాస్తోకూస్తో పాలిస్తుంది; ఆవు అలా ఇవ్వదు.కవిగారి ఈ అనుభవం పైపాదాల్లో ప్రతిబింబించింది. హృదయం, భూమి గూడా 'బీడుపడెన్' అనే ఏకక్రియతో సమన్వయించటం రమణీయంగా ఉంది.

అన్నిటికన్నా దేశ్యపదఘటితసమాసాలు వీరభద్రమూర్తి గారి రచనమీద తిక్కనశిల్పప్రభావాన్ని తెలియజేస్తాయి; ఉదా:

ఉమ్మ్రితడికన్నుల్ (54), అంపపువంతెన (88) రాచవెజ్జు (64) (అంటే గవర్నమెంటు డాక్టరు!),ఈరువు ముక్కలు (74)— ఈ చివరి మాటను (ఈరువు) తిక్కన ఒక్కడే ఒక్కచోట మాత్రం వాడాడు.

ఇంత పెద్దతనంలో గూడా ఒపిగ్గా రాసి ఈ దేశభక్తికావ్యాన్ని తెలుగువారికి అందించినందుకు శ్రీ వీరభద్రమూర్తిగారిని నేను అభినందిస్తున్నాను.

# ఉభయ వాక్ప్రౌఢి

పద్మశ్రీ. డా॥ సి. నారాయణరెడ్డిగారు
Professor Of Telugu, Osmania University

Hyderabad
27-4-77

'వందేమాతరం' ఒకజాతి గుండెలో నుంచి ఉబికిన నినాదం. ఒక అస్వతంత్రవంశవ్యవస్థను వేళ్ళతో కుద్దాలించిన ఉద్బోధం. ఆ నినాదం, ఆ ఉద్బోధం ఒకనాడు మేషకంఠాలకు కంఠీరవత్వాన్ని సంతరించినవి. అదే నినాదం. అదే ఉద్బోధం ఈనాడు ముదిగొండవీరభద్రమూర్తిగారి కలంలో చౌరవారి కావ్యకవాటాలను తెరుస్తున్నవి.

ముదిగొండవారి వాణి ప్రతిభానవోదం. వ్యుత్పన్నతా ప్రౌఢం ఆ ప్రౌఢి ఉభయవాఙ్నిరూఢి. కావ్యావతారికలోనే 'శ్రీగోఖేలు' అంటూ ఇష్టదైవతస్తవం ఎత్తుకోవడం తోనే మూర్తిగారి అమరవాక్ప్రౌఢి ధ్వనిరమ్యంగా సాక్షాత్కరిస్తున్నది.

"శ్రీగోఖేలు భజన్నరేంద్రతిలకశ్రేయస్పదాదానసం
వేగిన్ శ్రాతసురేంద్రు శైలజపతిన్ ప్రీతారవిందాక్షు ర
క్షోగర్వఘ్ను దయామయున్ పరమహంసాపూర్వున్ మహాదేవు నెం
తో గొల్తున్ ధృతచంద్రు బ్రోచిబలవంతున్ భారతున్ జేయగా"

పోతన్న 'శ్రీకైవల్య పదంబు' లోని వస్తుధ్వనిని పుంజీకరించుకున్న పద్య మిది. అది భాగవతపరం. ఇది పాశుపతపరం. కవి ఇష్టదైవమైన శివమే కాదు ఇందులో ఉన్నది? భారతజాతీయవిమోచనశివకరమూర్తు లెందరినో స్ఫురణసుందరంగా ప్రతిబింబిస్తున్న పద్యముకురం. 'గోఖేల' శబ్దంలో గోఖలే, "నరేంద్రతిలక"పదంలో వివేకానందుడు, తిలక్, 'శ్రాతసురేంద్రు' నిలో సురేంద్రనాథ్ బెనర్జీ, 'ప్రీతారవిందాక్షు'నిలో అరవిందుడు, 'దయామయున్'లో

దయానందసరస్వతి. 'పరమహంసాప్యన్' లో రామకృష్ణపరమహంస 'మహాదేవున్'లో మహాదేవ గోవింద రానడే, ''ధృతచంద్రున్'లో ద్వారబంధాల చంద్రయ్య, 'బలవంతున్'లో వాసుదేవబలవంతఫడకే, చేతనా కేతనాలుగా కదలాడు తున్నారు. ఇది వందేమాతరం కావ్యానికి ఎంత సముచిత మైన వస్తునిర్దేశమో వేరే చెప్పాలా?

ఈ నిర్దేశం ఇంతటితోనే ఆగిపోలేదు. అవతారిక అంతటా సమకాలీనకవి పండిత సమభినందన స్పందకంగా! సాగిపోయింది.

వంగదేశం రంగవాసంగా 'ఖామఖండం' రూపొందింది. ఈ ఖండంలో మూర్తిగారి ఉభయవాక్ప్రౌఢి, పరిణతభావరూఢి పంతాలుపోయినవి.

తెల్లదొరలు సేద్యగాండ్రను 'రాస్కెల్స్' అన్నారు. అప్పుడు పాలిత స్వరం అన్నది 'ఏదో గనమైన భాస బిరుదున్ దయచేసిరి మాక దేల? మీరే గయికొండయా! తగుదు రెంతటికైనను దేనికైనను" అని. ఈ పొడి మాటల్లో ఎంతటి కదలిగర్జన ఉన్నదో! మరి వంగీయజనత కోపోద్రిక్త మైతే పరిణామం!

''దూకును వ్యాఘ్రి వంగప్రజ అత్యుగ్రభూతహాణాస్యమై'

వీరభద్రమూర్తిగారు పద్యంకోసం పద్యం వ్రాయరు. చెప్పదలచుకున్నది మరందకోశంలా చిప్పిలితేనే, ప్రతిపదం భావాస్పదంగా హావణిల్లితేనే కల మందుకుంటారు.

సంస్కృతాంధ్రభాషాపురాకావ్యయోషా సర్వకామనీయకాన్ని సంపుటీక రించుకున్న వీరభద్రమూర్తిగారి కృతి; సమకాలీన సామాజికచేతనను కూడా సముచితంగా సంతరించుకోవడాన్ని అభినందిస్తుంది ఈ తరం.

'వందేమాతరం'

# హోళీఖండ సమీక్ష

శ్రీ అన్నాప్రగడ శ్రీరామమూర్తిగారు
M.A (Ling) M.A (Tel) B.L.

పింగళ॥చైత్ర శు॥సప్తమి
భాగ్యనగరం.

ఈ కాలపు సంప్రదాయకవులలో శ్రీముదిగొండవీరభద్రమూర్తిగారు మహాకవులు. వీరి యీ "వందేమాతరము" మహాకావ్యము. కవిత్రయము వారి మహాభారతము ప్రాచీనకావ్యములలో నెట్టిదియో యాధునికకావ్యములో నిదియు నట్టిది. ఇది స్వాతంత్ర్యమహాభారతము. ఈ యాధునిక మహాభారతమునకు వీరిచే రచింపబడి యితఃపూర్వము ముద్రింపఁబడిన "భారతస్వాతంత్ర్యసంగ్రామము" ఆదిపర్వము.

"కవివృషభులు మహాకావ్య" మనిన భారతము రెండురాజవంశముల చరిత్ర.ఇది భారతదేశప్రజల చరిత్ర. ఆదితెలిసినంతలో తెలుఁగులో నాదికావ్యము ఇది జాతీయకావ్యములలో నాదికావ్యము. అది యితిహాసము. ఇది మన నిన్న మొన్నటి చరిత్ర. "శివభారతము" "రాణాప్రతాపసింహచరిత్ర" మున్నగునవి చారిత్రకకావ్యములు. కనుక నిది జాతీయకావ్యములలో నాదికావ్య మనుట నిర్వివాద మనుకొందును.

సంప్రదాయకవిత్వమున కివి రోజులు గావని విద్వాంసులు దిగులు పడుచున్న యీ సమయమున నీ కావ్యము వచ్చుట యమావాస్యనాఁడు పూర్ణచంద్రునిఁ జూచిన ట్లున్నది. వేయి సంవత్సరముల వయస్సు గలిగిన తెలుఁగు పద్యశిల్పసుందరి యీకవిచేతిలో నిత్యయౌవనవతి యనిపించుకొన్నది. సరిక్రొత్త యందములు దిద్దుకొన్నది. కొన్ని యొయ్యారములు నేను చూపెదను మిగిలినవి మీరు చూడుఁడు.

ఇది హోలీఖండము. స్వాతంత్ర్యోద్యమపురోజులలో నొక హోలీపండుగ యిట్లు జరిగినట్లు కవి చిత్రీకరించినాఁడు. ఇది యొక మనోహరకల్పన. ఆనాటి పాశ్చాత్యపరిపాలకుల మనోభావములు భారతీయులను గూర్చి, భారతీయ స్వాతంత్ర్యార్హతను గూర్చి, తమ పాలనము యొక్క యావశ్యకతను గూర్చియు,

వ్యంగ్యరూపమున నిందు వివరింపఁబడినవి. పగటివేషములు ప్రవేశపెట్టుటలోని యీ మహత్తరకావ్యప్రయోజనము శ్లాఘ్యముగ నెరవేరినది. ఈ దృశ్యమునకు వంగభూమి రంగభూమి యైనను పగటివేషము లాంధ్రదేశ్యములు. కవి యాంధ్రుడు కనుక నిది సహజము.

ఈ జాతీయమహాకావ్యమును పఠించినంతనే మన కీ క్రింది కావ్యశిల్పాంశములలోఁ బ్రత్యేకతాముద్ర గోచరించును.

1. కథాకథనము: ఇది కథనుఁ జెప్పెడితీరు. ఇది రెండువిధములు, ప్రత్యక్షవిధానము పరోక్షవిధాన మని. కవి స్వయముగాఁ జెప్పుట మొదటిది. పాత్రముఖమునఁ జెప్పించుట రెండవది. ఈ కావ్యవిశేష మేమనఁగా నీ రెండు విధములు మేళవించుట. హోలీఖండమున పండుగవేడుకలు మొదటి విధమును పగటివేషములు రెండవ విధమును గలిగియున్నవి.

"నిఖిలపశుపక్షిమృగముల నిస్వనములు
చేసి కామదాహార్థము మోసినారు
మొద్దులను కొందఱ, లోక తెగ మొనసి రాజ్య
విదులు పగటివేషమ్ములు వేసినారు."

ఇందు మొదటి విధమునకుఁ జెందిన శిల్పము ధ్వనియుక్తముగ నున్నది. "మొద్దులు" అను శబ్దము కేవలము కట్టెంకే కాక తెలివి లేని మొద్దులను గూడ ధ్వనించుచున్నది. జరుగునది కామదహనమే కాక పాశ్చాత్యపాలనదహనముకూడ. పగటివేషములు రాజకీయవిదులు వేసిరి. ఇందు నాఁటి ప్రభుత్వవ్యవస్థపైని నిరసనము, జాతీయభావప్రబోధము ధ్వనిరూపమున సూచింపబడినవి. మొదటి విధమునకుఁ జెందిన కథాకథనశిల్పమునకుఁ బయి పద్యము సారవంతమైన యుదాహరణము. దానిని ధ్వనిమంతము చేయుట విశేషములో విశేషము.

"కావలె నాంగ్లు లేలు తెలగమ్మున నంచు 'హలు సేనుసా హో బ'
న్నా! వచియింపవేమె! యని స్వాప్నుని 'జక్రయ' చూడనాతఁడే
చ్ఛా! వివరింతు మా గురువుసంతతివారిని సంప్రదించి వా
భావము నాంగ్లులేలుటయొ భారతమున్ మఱి యెవ్వ రేలుటో"

ఈ పద్యము రెండవ విధమైన కథనశిల్పమునకుఁ బ్రతీక. భారతమును నాంగ్లు

తెలుపయునా? లేక యెవరేనావలయు? నని. యొక మహామ్మదీయ [illegible] గు భారతీయుం డేలవలె నని చెప్పుట కిష్టము లేదు. హైగా [illegible] వానిని సంప్రదించునట. ఆ గురువు జిన్నా యేమొ! ఇందులో [illegible] భారత విభజన కథకు బీజము వేయఁబడినది.

(౮). కావ్య శిల్పాంశము లలో రెండవది పాత్రపోషణము, [illegible] శిష్టుని వేషమును వేసి పైకి నాంగ్లపాలకగణముకు వాని [illegible] వ్యంగ్యముగఁ జూపుట కిథా పయోజనమునకును, పా[illegible] సరిపోవు చున్నది, "[illegible] బ్బా! [illegible] వలు [illegible] భాలకు సహజ మైన యూతపదమును ప్రయోగించుట [illegible] నొకటియు నొక గుణము.

"మాచే భారత మాదుగోలు[illegible] 'హైగాడ్!" [illegible] వ
వ్యాచైతన్యము తాండవించదో కో! పిండారీల గ [illegible] న్
దోపిస్ రారో! మీరు కత్తులు కత్తుల్ వారి వౌచ [illegible]
[illegible] విద్విద్యను ముక్కనేర్ప వపుడేమొ! నిం డ [illegible]

ఇది యా గ్లేయుని వేషమున నున్న యతనిచేతఁ బలి[illegible]. ఇందలి యన్యదేశ్యములు వ్యావహారికములు. పాత్రకు గదుంగ[illegible].

౫. శైలి. ఈ కావ్యము ప్రసన్నకథాకలిత మైన యర్థయుక్తి[illegible].

నక్షరరమ్యతకును దుల్యప్రాధాన్య మిచ్చినది.
శైలి యన్నను శయ్య యన్నను నక్షరరమ్యత
యన్నను, నా దృష్టిలోఁ బర్యాయపదములు.

కవియొక్క వ్యక్తిత్వమును తన కవితా శైలి ప్రకటించును. కవికి శైలి యొక ఛాయాచిత్రము. అది లేని వాఁడు మృతకవి. ఈ కవి వ్యక్తిత్వవ. దలు పద్య పద్యము నఁ బడియున్నవి. తెలుఁగుపద్య మొక సువర్ణమండప వు. వేయి సంవత్సరములనుండి నన్నయ మొదలుకొని విశ్వనాథవఱకు నెందఱో శిల్పులు నగిషీలు చెక్కి పోయిరి. అయినను సమాప్తి యన్నది లేదు. శ్రీముదిగొండ కూడఁ జేయివేసినాడు. కతనుబట్టి, భావమునుబట్టి, పాత్రనుబట్టి, శైలికి రూపభేద మేర్పడుచుండును. తత్సమపదముల యొక రకమైన పోకడలనుబట్టి, మిశ్రసమాసముల పొదిగింపునుబట్టి, తద్భవదేశ్యముల యిమిడికనుబట్టి, పద్యము

యొక్క యెత్తుగడనుబట్టి, ముగింపునుబట్టి, శైలి పలు వొయ్యారములు వోవును. వీనిని వర్గీకరించుట వివేకించుట యిచ్చట పరిమిత స్థానికములు. శైలి యొక నాట్యసుందరి యై యీ కావ్యమున ననేక భంగులు ప్రదర్శించినది.

వర్ణనశైలి, ప్రసంగశైలి, సంభాషణశైలి, సూత్రశైలి, యని నాలుగు విధముల వర్గీకరింపవచ్చును. అన్నికావ్యములలో నన్నివిధములు కనిపింపవు. ఇతివృత్తము దానికిఁ దోడ్పడవలయును. తిక్కన సోమయాజిగారు తమ మహాభారతమునఁ బయి నాలుగువిధములు పరిష్కృతభంగులఁ బ్రదర్శించిరి వందేమాతర యుగాలపు మహాభారతము. ఇందుగూడ నన్నివిధములు యథాస్థానముగ బ్రదర్శింపబడినవి. కొన్ని యుదాహరించెదను.

'శ్యామశ్వేతపలాశపీతముఖవర్ణాక్తాంగమై ఘీంకృతి స్థేమస్నిగ్ధనినాదహూతమిథమై" అనునది వర్ణనోచితశైలికిఁ బతాకము. ఈ పద్య కుసుమములోని ప్రాబంధికసౌరభము విద్వజ్జను లాఘ్రాణింపగలరు.

"దేవుడు మనుష్యులన్ భరతదేశము నోమెడు శాంతిదూతలన్‌గా వెలయించు పూర్వము'' అనునది ప్రసంగశైలికిని;

కావలె నాంగ్లు లేలుకై జగమ్మునఁ నంచు వానసేనుసాహెబన్నా వచియింపవేమొ! యని'' యీ పద్యమంతయు భిన్నపాత్రల సంభాషణశైలికిని;

''తన పెత్తనమునఁ దా న

ష్టిని బొందిన నేమి నరుడు చింతింపడ''

అను ఈ పద్యము సూత్రశైలికిని మకుటములు.

ప్రాచీనాలంకారికులు కొందఱు కావ్యాత్మ యలంకార మనియు కొందఱు వక్రోక్తియనియు, కొందఱు రసమనియు, కొందఱు ధ్వని యనియు, సిద్ధాంతించిరి. ఇది సాహిత్యసిద్ధుల ప్రవచనము. సాధకుని భాషలో నే నొక మాట చెప్పెదను. కళాత్మకభావప్రకటనము (Artistic Expression) ఉన్నచోఁ బైవన్నియు నందే కననగును.

ఏమి తెలియు మీకు నెన్నెన్ని వంకరల్
పోవునో కవిత్వమును ప్రభుత్వ
మున్న దున్నయటులు కొన్నింట సనరాద
యనిన శిఖర మందుకొనవ యవ్వి''

కవి యీ పద్యమున వక్రోక్తిప్రాధాన్యము చెప్పినారు. దీనిని వారు తమ కావ్యమునందుఁ బ్రదర్శించినారు. కవియుఁ బ్రభుత్వనేతయు వక్రోక్తిప్రయోగింపవలె ననును. ఇందలి పూర్వార్ధములో భంగశ్లేషము ''పదస్తోమస్యైవచేత్ పృథగర్థతా''యను లక్షణమునకు లక్ష్యభూతముగ నున్నది, ఈ పద్యమునందలి యుత్తరార్ధము ''వ్యాజస్తుతి''ని దెలుపుచున్నది. ఇది బ్రిటిషుప్రభుత్వము వంగ్యముగ సమర్థించు వాక్యము. అస లిది పగటివేషము కదా, "నిందాస్తుతిభ్యాం స్తుతినిందయో:" అను లక్షణము కనిపించినది గదా!

ఈ కవి తెలుఁగులో నూతనచ్ఛందమును ప్రవేశపెట్టినాడు. ఇది యొక మౌలికత. సంస్కృతములోని జాతులు ఉపజాతులు చాలవఱకు తెలుఁగులో పూర్వకవులు ప్రవేశపెట్టిరి. మొట్టమొదటి జాతి నేలఁ వదలవలెనని యీ కవి నూతనముగా అనుష్టుప్పు చేర్చుట నందము; ఔచిత్యము, రెండు వచ్చినవి.

"అష్టాదశపర్వనిర్వహణసంభృతమై పెంపొందు"నీ
కావ్యమును "కవివృషభులు మహాకావ్య మని
సర్వథా గుర్తింతు రని నా యాశాభావము.

ప్రొఫెసర్
తూమాటి దొణప్పగారు, ఎం. ఏ., పిహెచ్. డి.,
తెలుగు శాఖాధిపతులు
నాగార్జున విశ్వవిద్యాలయం.

పింగళ - శంకర జయంతి
నాగార్జుననగర్

## కుమార సంభవ ఖండం

# ప్రశస్తివచనం

ప్రకృతికీ, మానవప్రకృతికీ మార్పు నిసర్గమైన లక్షణం. ఈ మార్పు పాక్షికం కావచ్చు; పరిపూర్ణం కావచ్చు. మానవసృష్టిలో మహనీయ మైన సాహితీవ్యవసాయం ఈ మార్పున కపవాదం కాదు. వాగర్థాల సమ్యక్సమ్మేళనం సాహిత్యానికి మూలభూమిక. సాహిత్యంలోని మార్పు భావపరం కావచ్చు; భాషాపరం కావచ్చు. ఒక్కొక్కతూరి రెంటికీ సంబంధించిందిగా కూడా ఉండ వచ్చు. మంచిని పెంచే యే మార్పునైనా సహృదయులు స్వాగతించి తీరుతారు. భావపరంగా మార్పుల కంగీకరించినా, భాషాపరంగా సడలింపులకూ, సర్దు బాట్లకూ అంగీకరించని తత్త్వం కొందరిలో గోచరిస్తుంది. కొంత సంస్కరణా భిలాష, కొంత సంప్రదాయానురక్తియూ కొందర విశిష్టలక్షణం. భారతజాతీ యోద్యమంలో అంతోయింతో పాల్గొన్న చాలమందిలో ఈ ద్వైధీభావం కొట్టవచ్చి నట్లు కనిపిస్తుంది. ఇదే ధోరణి ప్రకృతకృతి 'వందేమాతర' ప్రబంధాంతర్గత మయిన 'కుమార సంభవ ఖండం'లో పదేపదే మనకు ప్రత్యక్ష మవుతుంది.

సాహితీ సమరాంగణంలోనూ, స్వాతంత్ర్య రణరంగంలోనూ సామాజిక సేవాప్రాంగణంలోనూ సమానప్రతిభతో, సమరసప్రతి పత్తితో అసమానంగా రాణించిన కొద్దిమంది విశిష్టవ్యక్తులలో ఏతత్కృతికర్త అయిన శివశ్రీ ముదిగొండ వీరభద్ర మూర్తిగా రొకరు. సంప్రదాయ జగత్తులో, సంస్కృతి తపస్సులో 'ముదిగొండముదిమిని స్వీకరించిన కుదురు ముదిగొండవారిది. సిరిసంపదలతో పాటు శీలసంపదా, ఇందిరా సుందరీ మందహాసరుచులతో పాటు శారదాహీర మంజీర ఘలంఘలలు కుదురుగా జతనువర్ధ ఆరాధ్యపీఠం వీరిది. శాస్త్రసీమల

పారం ముట్టి, సాహితీభూముల మేరలు చుట్టి, సర్వతంత్ర స్వతంత్రులుగా, సాహితీసేవా పరతంత్రులుగా జగా బిరుదా లందిన జగదారాధ్యులు వీరభద్ర మూర్తిగారి తాతముత్తాతలు. ముక్త్యాల సంస్థానాధీశ్వరులు 'వాసిరెడ్డి' వంశ వర్ధనుల దీక్షాగురువులు శివశరణులు- పూజ్యచరణులు మల్లికార్జున శాస్త్రిగారు ముదిగొండవారి వంగడానికి చెందినవారే. వారే శ్రీ మూర్తిగారి దీక్షాగురువులు. యక్షగానాలను, 'సాగరేశ్వర మాహాత్మ్య' ప్రభృతి ప్రబంధాలను రచించి పేరు పెంపులు గన్న బ్రాహ్మీభూషణులు ముదిగొండ మల్లికార్జునశాస్త్రిగారు వీరభద్రమూర్తిగారి పితృపాదులు.

గుంటూరుమండలంలోని 'మాదల' అన్న జనపదం శ్రీ వీరభద్రమూర్తి గారి అభిజనం. 1908 ఆగష్టు 8వ తారీఖున సనాతనసంప్రదాయబద్ధులైన ఆరాధ్యశైవాచారపరుల కడుపుపంటగా వీరి జననం. షష్ఠి సనే (?)దేళ్ళు వెళ్ళాయో లేదో 1921లో మహాత్మగాంధి పిలుపుచే ఆకర్షితులయి బానిస కొలువుచదువులకు స్వస్తిచెప్పి బెజవాడ స్వచ్ఛంద సేవాదళంలో చేరి సంఘసేవలో ఓనమాలు దిద్దుకున్నారు. పండితవంశంలో జన్మించినను, అటు గురుకులపద్ధతిలో చదువుసంధ్యలు ఒంటబట్టలేదు; ఇటు ఆగర్భశ్రీమంతుల అల్లారుబిడ్డగా పెరిగినను ఇసుకోలుబళ్ళ యినకపాతరచదువులు అచ్చిరాలేదు. ఉమ్మడికాపురపుగుల ఇంటిలో పిన్నపెద్దల పోరు పడలేక 1926లో చెన్నపురి వెళ్ళి ప్రయివేటుగా సీనియర కేంబ్రిడ్జిపరీక్షకు హాజరయి తప్పి కూర్చున్నారు. సంపన్నుల బిడ్డ కాబట్టి ఇంగ్లండు వెళ్ళి సరదాగా సరదారులా కొన్నాళ్ళు గడిపి యే పట్టం పుచ్చుకోకుండా యింటిపట్టుకు వచ్చి చేరారు. ఎందుకోగాని, చట్రాలబిగింపుచదువులంటే ఆయనకు ససేమిరా పడలేదు. అయినా, అసలు చదువులపై ఆస్థ అడుగారలేదు. అందుకే స్వయంకృషితో ఆంధ్రభాషాసాహిత్యాన్ని అవలోడనం చేశారు. కళ లాకళించారు. ఇంత చేసినా గురువులేని విద్య గుడ్డి విద్య అంటారని నిగమసముద్రులూ, వరసారస్వత పట్టభద్రులూ అయిన ముదిగొండవంశాగ్రణి వీరభద్రశాస్త్రిగారితో గీర్వాణభాషాసాహిత్యాలు పఠించారు; ఆధ్యాత్మిక గ్రంథపాథోధిని మథించారు. దీక్షాశిక్షలే దివ్యరక్షగా సాగిన యీ నిరంతరకృషి మూలకంగా సిద్ధించిన వ్యుత్పత్తి నవనవోన్మేషమైన వీరి ప్రతిభకు తోడయింది.

"తెనుగున నేనే నా గురు
వును, గీర్వాణమున గురువు పూజ్యజనకులో

మణి మద్వంశాగ్రణి, వా

నిని గొలిచెద వీరభద్రు నిగమసముద్రున్" (వందేమాతరం,) పీఠిక అన్నమాట ఈ యంశాన్నే ఆమ్రేడిస్తున్నది.

ఇలా డిగ్రీలూ, డిప్లొమాలూ లేని పాండిత్యం వీరిది; బిరుదులు, సనదులు కోరని సాహిత్యపరిశ్రమ వీరిది. డిగ్రీల చదువులు లేకపోయినా, వీరు చదురైన చదువరులు; లౌకికమైన పదవులు లేకపోయినా వీరు ఉత్తమపదస్థులు ముదిగొండ వారు అంతర్ముఖులు కావున వీరభద్రమూర్తిగారిది అలక్షితశీలవృత్తం. ఇలాగా కావ్యకరణ సామగ్రిని కావలసినంత సమకూర్చుకొని గాని కావ్యరచనారంగంలో వీరు కాలుపెట్టలేదు. ఇంత నేపథ్యం రూపొందేసరికి నలభయ్యేళ్ళు నిండాయి. ప్రకాశం పంతులు గారి జీవితరేఖలు చిత్రిత మయిన 'ఆంధ్రకేసరి' కాకితి చక్రవర్తుల కళ్యాణగాథాసంపద నుపశ్లోకించే 'మహామరకతము', ప్రకృత ప్రబంధానికి పూర్వపీఠికాప్రాయమైన 'భారతస్వాతంత్ర్య సంగ్రామము' వీరి మౌలిక రచనలలో పరిగణించదగ్గ పద్యరచనలు. 'వాసవదత్త' వీరి అనూదితకృతి.

ఏతత్కృతి 'వందేమాతరం' కేవలం కల్పనాకథ కాదు. అలాగని పురాభారత చరితం కాదు. అచ్చంగా నిన్నా మొన్నా మన కళ్ళయెదుట జరిగిన వాస్తవ చరిత. భారతజాతీయోద్యమంలోని కొన్ని ఘట్టాలకు అద్దంపట్టిన చారిత్రికకావ్య మిది. పురాభారత పునీతగాథా చక్రంతో సంవాదులైన నవభారతేతిహాస సన్నివేశాలను జోడించి దేశీయుల నత్తేజపరచిన పుణ్యశ్లోకుల ప్రచార రీతులను, ప్రబోధ పద్ధతులను, చమత్కార చారువులుగా, కావ్యకళా మేరువులుగ దిద్ది తీర్చిన పద్దెనిమిది సాహితీ ఖండాల ఉత్తమకళాఖండ మిది.

చరిత్ర పుటలలోని వాస్తవసంఘటనలకు కావ్యకళాశిల్పాన్ని కల్పించడం మాటలు కాదు. యథార్థఘటనల అనువర్ణనం ఒక నివేదిక అవుతుంది. ఉన్నదున్నట్లు వర్ణించడం చిలుకపలుకు అవుతుంది. ఉన్మాదవాదాలు, ఉకామువాదాలు రసవత్కావ్యాలు కాజాలవు. అందుకే చారిత్రిక కావ్యరచన కత్తిమీది సాము. కథనం చరిత్రగతికి విరుద్ధం కారాదు; గ్రథనం కావ్యలక్షణాల మేరలు మీరరాదు. ఎటు మొగ్గినను ఆ పక్క బరువెక్కి రెండోపక్క చులకదనం పొడసూపక మానదు. లోకవ్యవహారానుశీలిని యైన పలుకు వక్రవ్యాపార శాలినిగా స్థిత్యంతరం చెంది

నపుడే అచ్ఛమయిన కవిత అవతరిస్తుంది. ఇట్లు చారిత్రిక సత్యం, సాహితీ సౌహిత్యం సరియైన పాళ్ళలో సరియైన సమ్మేళనం చెందినపుడే ఆ రచనం చక్కటి చారిత్రిక కావ్యంగా రాణిస్తుంది; పురాణిస్తుంది. ఈ మోస్తరుగా అన్నిటి ఔననిపించుకోగల నేర్పూ, ఓర్పూ సుప్రతిష్ఠితులయిన ఏకొందరకో తప్ప అల్పబోధను అందరికీ అబ్బవు. ఈ అసిధారా వ్రతాన్ని అనన్య సామాన్యంగా నిర్వహించిన సాహిత్య సత్యవ్రతులు శ్రీ వీరభద్రమూర్తిగారు.

'వందేమాతరం' అన్న చారిత్రిక కావ్యంలోని మూడో విభాగం కుమార సంభవ ఖండం. సత్రయాగ పరిపూతమై, శౌనకాదిమహర్షిగణ సంసేవితమైన నైమిశం వలె- కలకత్తానగరంలో 'సంజీవని' అన్న జాతీయోత్సవసంస్థ సకలకళాకలాప నిర్వహణకు ఆటపట్టయిన సాంస్కృతిక వేదిక. దాని ఆధ్వర్యవంలో 'ధర్మమ్మ్రబోసు'గా పేరందిన 'రాజనారాయణబోసు' మహాశయుల ఆధ్యక్ష్యంలో కలకత్తా నగరమందు 'హిందూమేలా' గమణీయోత్సవ శుభసమయాన క్రమశిష్యులయిన ఆనందచంద్రుడు రవీంద్రుడు, భారతీదేవి గారాబు(పట్టి) బంకిం చంద్రబాబు, అమృతబజార్ పత్రికా సంపాదకులు 'శిశిరకుమార్ ఘోష్' సర్వవిద్యా సాగరులు 'ఈశ్వరచంద్ర విద్యాసాగర్' వంటి హేమాహేమీలు కొలువుతీరిన సదస్సులో శుభచరిత్రులయిన 'నవగోపాలమిత్ర' ముఖ్తసరిగా అరిసూదన మోదనంగా కావించిన ఉపన్యాస విన్యాస మీ ఖండంలోని కథాకథన విధానం. హోళీపండగకు మూలభూతమైన కామదహన కథ ఇందలి ప్రధానకథాశరీరం. కామదహనాదిక గాథలు పురాణేతిహాస ప్రసిద్ధాలు. కామదహనంతో పాటు గిరిజాకల్యాణం, కుమారసంభవం, తారకాసురహననం, మొదలయిన ఘట్టాలు మన సీమలలో ఆబాలగోపాలానికి కొట్టిన పిండి. కథాచ్ఛలంతో సామాజికులను కర్తవ్యపరాయణులుగా దిద్దడమే యీ యెత్తుగడలోని పరమార్థం.

గీర్వాణ గీరాంధురంధరులు కాళిదాసోద్భటులూ, తెలుగు కవిశ్రేష్ఠులు నన్నెచోడ శ్రీనాథులూ ఈ ఘట్టాలను చేపట్టి పులకిత దిగంతకమనీయంగా వెలార్చిన కళాకుశలులు. వీరభద్రమూర్తిగారు ఈ సాహితీమార్తాండుల వచఃశ్రీవిలాసాలను గాఢంగా అనుశీలించి ముమ్మూర్తులా వారిపోకడలను మధురార్థశ్రీకంగా ఈ ఖండంలో మలచారు.

లోకకళ్యాణం నిమిత్త మయిన ఒక మహార్థాన్ని పురస్కరించుకొని ముక్కంటి కంటిమంట సమిధయై ఆత్మబలికి ఆదర్శమూర్తిగా నిలిచిన పూలబాకులదొర, భారతజాతీయ స్వాతంత్ర్యసమర సైనికులకు ఒక ప్రతీకగా, హిమగిరితపస్వికీ, హిమగిరి వర్ధనికీ జనించి, క్రౌంచగిరిని భేదించి, తారక దుశ్చారకుని సంహారించి, రాక్షసప్రభుత్వంనోట రాయిగొట్టి, సర్వజన సంక్షేమాన్ని సమకూర్చిన ఆరుమొగాలసామి, ఐహికభోగభుక్తికి వశంవద మయిన పరాయి ప్రభుతను 'సత్య ముపాయమున్ జదువు శౌర్యము నభ్యుదయమ్ము శౌర్యమున్'– ఈ యారు ముఖా లయిన గుణాలతో ప్రతిఘటించిన విశిష్టభారతజాతికి సంకేతంగా శ్రీవీరభద్రమూర్తిగారు వ్యాఖ్యానించి తమకవితాకళను శ్లేషశైలూషిగా శిల్పించారు.

వచనరచనకూ, వచనకవితకూ గిరాకీ పెరిగిన యుగ మిది. అట్లని ఛందోబద్ధ మైన కవితపై గౌరవం లేదని కాదు. ఛందస్సునే కవిత్వంగా చెలామణీ చేద్దా మనుకున్న వారి జల్లిమాటల బిగింపుపట్ల ఆసక్తి ఎట్లా ఏర్పడుతుంది? చందస్సు కవిత్వం కాదు, కవిత్వానికి వాహకం మాత్రమే. అంచేత ఛందోబద్ధ మయిన దంతా కవిత్వం కాదని తాత్పర్యం. అలాగే ఛందోబద్ధ మయినంత మాత్రాన అది కవిత్వం కాదని వాదించడం కూడా యుక్తియుక్తం కాదు. అచ్చపు వచనంలో కవిత్వం చెప్పడం ఎంత కష్టమో ప్రాచీన చ్ఛందాలలో కవిత్వం చెప్పి ఒప్పించడం కూడా అంతే కష్టం. ఈ కావ్యం ప్రాచీనలక్షణబద్ధ మయిన రచన. రచయిత పద్యవిద్యలోని అన్ని పొలకువలూ మెలకువలూ తెలిసినవారు.

లోకవ్యవహారంలో వీరభద్రమూర్తిగారిది కోమలప్రకృతి. కాని కవితాలోకవ్యవహారంలో–

'మొరసి శబ్దము లర్థముల్ మెఱసి, రసము
కురియునట్టి కావ్యమునకు కుదు రయిన స
రస్వతిని భజింతును, తదారాధనమ్ము
నందు మ్రోయు ఘంటకు నాల్క నాదు నాల్క'

అని చెప్పుకోగల ఉద్ధత ప్రకృతి వీరిది. ఉత్సాహభరిత మయిన ధర్మవీరం ప్రతిపాదిత మవడంచేత వీరరస ప్రధానంగా రూపొందిన యీ కృతి కవిప్రకృతికి సమ్మసరిపోయింది.

దృఢవ్యుత్పత్తి నిరూపకాలయిన సంస్కృత సమాసాలూ, నిలువెల్లా తెలుగుదనం నిండిన అచ్చపు తెలుగుపలుకుబళ్ళూ సౌందర్యాన్ని సమకూర్చే భాషావిశేషాలుగా వీరి కావ్య మంతటా మస్తుగా విస్తరించి వున్నాయి. 'తదీయతపఃకల్పితులము', (పు.60), 'రుచిష్య మహోశిషము' (పు.70), 'ఝరీఝుజ్యత్సమరిణ మధుభ్రమర భ్రమరీ ఝంకృతి దృశీ శ్రవంబు' (పు.88), రుచిర సాంద్ర పల్లవిత సైక విభేద లతాలతాంత సుందర తరుషండ కాననము' (పు.90), 'జంటను గని తొలగి లోంగి యొంటరి గని మీదిమీది కురికెడు చలి (10), 'అంబరమున కెక్కి విన్ను యను మా పొడిపించిన వందు రుక్కివుల్' (89), 'అగ్ని కేమి తెలియు! బూడిద' (6.), 'రాజకీయ రంగమ్ముల రంగు వేసికొన్న తల' 65), 'జవరాలి మోవి గొన కేవిస మానునో చూతము '(66), 'రెండే శాఖలు తాము పరుండిన మంచమున కందురో మొండఘటాల్' (66)"పూలచాకులదొర' (72), 'స్వర్గముగోడ బల్లులము' [ 8], 'అడుగుండియ యిడు కూయి యాడు దెబుగు' [94], పూల కొరడా (81), 'పలుక నోడి చావలేక బ్రతుకజాలక యుండు జనంబు (102), 'సృష్టి కందని యందాల బరువు మోయు చూపు' (104), 'బెల్లము కొట్టిన రాయి' ( 42), 'మొగమ్మున మూడ్చు కొను' (161), 'కన్నీళ్ళ పర్యంతము'[158], 'కన్నుపండుగ యగు బిడ్డ' [.54], 'కలియక మనలేవు... కలిసియు మనలేవు' [166], 'సంద్రపుగటిపచ్చివిసమ్ము ద్రావిన కూలి' [170], 'లేలేగు లావీజిగన్ లేలే యన్న మెఱుంగు బుగ్గలు' (178), 'నోట రాయి గొట్టు' [205], వంటి పలుకుబళ్ళు అందరి కలాలకు అందరానివి.

కుహనావటువు ప్రసంగం పరమరమణీయం,

"పొట్టకు లేదా పాముల

పట్టుక యాడింపవచ్చు,వానిని చావన్

బుట్టయు లేదా! మొలకున్

బట్టియునున్ లేద యెట్టివాడు దొరకెనే!" [166]

తెలుగుపలుకుబడికి పరాకాష్ఠ,

"కొండవీటిజంగమ్ముద కొక్కరుఢు వలదొ

పార్వతీ! నీకు నొంటెద్దుబండియ గతి

వీని దక్క నే వేలుపునేని పెండ్లి

యాడితివొ భద్రగజము వాహనము నీకు" [167].

అభ్యాసబలం, ఆచార్యోపదేశం మాత్రమే దీనికి చాలవు. నిసర్గప్రతిభావైభవానికి తోడు నిశితలోకపరిశీలనం, నిధిధ్యాసపూర్వక మైన నిశ్చయకజ్ఞానం చాల అవసరం.

ప్రకరణోచితంగా, పాత్రోచితంగా ఇంగ్లీషు, ఉర్దూ, మరాఠీ, మొద లయిన ఇతరభాషాపదాలను ప్రయోగించడానికి కూడ వీరభద్రమూర్తిగారు వెనుదీయ లేదు. పైథాగరస్ [1౪]. మాక్సుముల్లర్ [19]. రెసిడెంటు (౧), లావా [147], సర్కసు (1౨౪, 20౮), సెకండు(1), సెడిషన్(4౪) వంటి ఇంగ్లీషుభాషాపదాలు ఊదా (1౬0), ఓణీ (19౨), కండువ (192), కొరడా (91), గడియారము (1౦౨), గుడారము (7౯) గులాబీ (173), చాకు (7౩), జరీ (112), జీబు (4), తుపాను(61), త్రాసు(4), పసందు(11౪), పావడ(190), బజారు (౬), బాబు(18), భళి(1౬9), భేష (161), ముఖసరి(116), మేలా(2), రోజు(111), షాజహాన్ (1౪), హిందూ(౨), హోళీ(1), మొదలయిన అన్యదేశ్యాలు వీరి ప్రయోగశక్తిలో రుడితిస్ఫూర్తి నిమిత్తం ప్రయుక్తమయ్యాయి. 'అహేయ మన్యదేశీయం యత్త్రదేవ ప్రయుజ్యతే' అని శాబ్దికుల సమ్మతి సయితం ఉంది.

కాళిదాసాది కవికుల గురువుల శిల్పవిన్యాసాలను పుడికిపుచ్చుకున్న యీ ఖండం సహృదయుల నలరించక పోదు. పెద్దపెద్దయేరుల పక్కపక్కల చిటిపొటి సెలయేరులు సైతం ఉరవళ్లు పరవళ్లుగా ప్రవహించ వచ్చు. వేటి అందం వాటిది. వంపు వంపున నొక్కొక్క సొంపు వచ్చి యెన్నెన్నో సొగసులు వోయి సూక్తిమతి యయిన యీ కవితాసరిత్కన్య అంద చందాలు మెచ్చిన రసికకోలాహలులు రసభంగం కాని తీరులో సంతసపు తెప్పల తేలగలరని మానమ్మకం.

శ్రీ కుందుర్తిగారు
ఫ్రీవర్స్ ఫ్రంట్

హైదరాబాదు
24-3-77

# శౌర్య ఖండము

1942 ప్రాంతం. భారత స్వాతంత్ర్యంకోసం తీవ్రంగా పోరాటాలు జరుగుతున్న రోజులు. పరమఛాందసు లని అనుకుంటున్న కొందరు సంప్రదాయకవులనూ, గుంటూరులోని యువకులనూ, బజారున వెళ్తుంటే ఎదురైన సమితివాడినీ పిలిచి అభ్యుదయ కవిత్వం గురించి నూరిపోయడం నాకూ, నా మిత్రులకూ దినచర్యగా ఉన్న రోజులు ఆ రోజుల్లోనే మా దగ్గరకు ఒక సంప్రదాయకవి మిత్రుడు వస్తుండేవాడు. మా గురువుగారు కీ శే. విశ్వనాథసత్యనారాయణగారు ఆయనను "మహాకవి" అన్నట్లు విన్నాము. "మహా కవివి లేవయ్యా నువ్వు!" అనే అర్థంలో అన్నారేమోలే అని మేము చమత్కారం చేస్తుండేవాళ్ళం. ఆ రోజుల్లో మా బుర్రల్లోకి ఆవగింజంతకూడా ఎక్కని "కామాక్షీపంచశతి" వంటి సంస్కృత అనువాదకవిత్వం రాస్తున్న ఆ "మహాకవి" యీ గ్రంథకర్త శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారు. సాహిత్యంలో ఎన్ని అభిప్రాయభేదాలున్నా మాది మూడు దశాబ్దాలకు పైగా తెగని స్నేహబంధం.

కవితలో కథా వస్తువులు మారాలని మేం బల్లగుద్ది చెప్తున్న ఆ రోజుల్లోనే వీరభద్రమూర్తిగారు టంగుటూరి ప్రకాశంపంతులుగారి ఆత్మకథను పద్యకావ్యంగా రాసి వినిపిస్తుండేవారు. ఆ తరువాత ప్రథమ "భారతస్వాతంత్ర్య సంగ్రామం" అనే కావ్యం ప్రకటించారు. ఇప్పుడీ "వందేమాతరం" మహాకావ్యం. పురాణకథావస్తువులు తీసుకుని మహాప్రతిభావంతంగా కవిత్వం రాసినవారు ఆధునిక కాలంలో కొందరు లేకపోలేదు. పూర్వమహాకవులను సైతం తలదన్నినారని పించుకున్నవారూ వున్నారు. కాని నాటినుండి నేటివరకు అభ్యుదయకోణంలోనే కవితావస్తువునూ, రీతినీ అర్థం చేసుకుని వ్యాఖ్యానిస్తున్న నాకు దానికంటే యిది నయంకదూ? వందరెట్లు నయం. ఎందుకంటే ఆధునిక కాలంలో ప్రతిభావంతులైన కవులందరూ పురాణకావ్యవస్తువులనే ఆదరించి వారిదారిన వారు వెళ్లిపోతే, ఆధునికకాలంలో జరిగిన మహత్తరసంఘటనలను కావ్యగతం చేసేది

ఎవరు? మన తరువాతతరంలో రాబోయేవారా? వారికిమాత్రం ఏం పట్టింది అని నేను నా ప్రసంగాలలో, రచనలలో తరచు వేసే ప్రశ్న. దీనికి జవాబు లేదు "-నాడు:రాము డెంతో అంతే మహాత్ము డన్నాను, ఆదర్శకావ్యవస్తు వన్నాను- అల్లూరి సీతారామరాజు" అని "అభియోగం" అనేనా గేయంలో (నగరంలో వాస) నావి రెండు పక్తు లున్నాయి. "అసహాయోద్యమం అంబుధిలా పొంగు లెత్తిన ఘట్టాలు విడిచి పాతచెరువులో ప్రేయసికోసం పద్మాలుకోయడం దేనికి? (దండియాత్ర). కావ్య వస్తువుకు సంబంధించినంతవరకు యిది నా దృక్పథం. వీరభద్రమూర్తిగారు తాను అభ్యుదయకవి నని చెప్పుకోడు. నా దృక్ప థానికి సంబంధించిన కొన్ని మౌలికాంశాలను అంగీకరించి ఆచరణలో పెట్టి చూపించాడు.

వచనకవితాఉద్యమశీలి నైన నన్ను కూడా యీ మహాపద్యకావ్యానికి పీఠికాకర్తలలో ఒకణ్ణిగా చేయడం నిజానికి వీరభద్రమూర్తిగారి ఔదార్య మేమీ కాదు. ఇది నాకు హక్కే. ఈనాటికి వచనకవిత్వంగురించో అభ్యుదయకవిత్వం గురించో నేను తనతో మాట్లాడుతున్నప్పుడు "నువ్వు చెప్తే హేతువాదయుక్తంగా వుండి ఆమోదయోగ్యంగా వుంటుంది. ఇంక దానికి తిరుగు లేదు" అంటాడు ఆయన. అంటే ఆయనలోని కవితాదృక్పథం అభ్యుదయభావోన్ముఖంగా ప్రయాణం చేస్తూ నైనా వుండాలి, లేదా నేను చెప్తున్న అభ్యుదయదృక్ప థంలో చిక్కదనం తగ్గి బాగా నీళ్లు కలిపిన పాలుగా ఆయనవంటి సంప్రదాయ వాదులు సైతం అంగీకరించదగినంత ప్రమాదరహితస్థితికి దిగజారి అయినా వుండాలి. వీటిలో మొదటిదే సరి యైన అవగాహన అనడానికి యిటీవల ఆయన కూడా అభ్యుదయకర మైన వచనకవితలు రాస్తూ, సమావేశాల్లో చదువుతూ ఉండడమే సాక్ష్యం. యిప్పు డాయనకు వచనకవిత గురించి గానీ, అభ్యుదయ దృక్పథంగురించి గానీ నా అంత అభిమానం లేకపోవచ్చు గాని, ద్వేషం మాత్రం లేదు. నిజానికి యీ కాలపు సంప్రదాయకవు లందరూ కూడా యిప్పుడు యిదేస్థితికి వచ్చారు. కాని యీయనలో వుండే నవకథాదృతి అనే లక్షణం వారిలో చాలామందిలో లేదు. వీరభద్రమూర్తిగారి పద్యకృతికి నాబోటి వచన కవుల యోగ్యతాపత్రం అవసరం లేకపోయినా, ఎందుకు యివ్వవలసి వచ్చిందో వివరంగా చెప్పడం అవసర మైంది.

ఈ కావ్యం ఆయన ఆరంభించి వ్రాస్తున్న రోజుల్లో దాదాపు ప్రతి పద్యం

జానిసలుగా వుంచిన రోజు లవి. ఈ విషయం చెప్పటానికి కవి యీ సర్గను కథాకల్పన చేశాడు. సందర్భోచితమైన వర్ణనలు యిందులో ఎన్నో వున్నాయి. ఆరంభంలోనే ఒక ఆటవెలదిపద్యంలో రసాలవృక్షాన్ని రణరంగంలో నిలిచి పోరాడుతున్న యోధునిగానూ, చెట్టునుండి వస్తున్న తుమ్మెదలను పిస్టలునుండి వచ్చే గుండ్లుగానూ చెప్పడం రమణీయంగా వుందో లేదో మీరే చెప్పండి. సంద్రయ్య కథ, సంతలో సరుకు అమ్ముతున్న స్త్రీని చూసి మోహించిన (చెరపదలచిన) సైనికు డొకడు "ఈ స్త్రీయే స్త్రీ యనగా ఇస్త్రీమడత వలె నున్నదె నలుగక" అంటాడు ఉపమానాలను ఏరుకోవడంలో కూడా యీ కవి నిత్యజీవితానికి దగ్గరలో నడుస్తూ పోవడం ఆధునికులకు కూడా యిష్టమయ్యే విషయం కోయ దొరలు ఎటువంటివా రంటే "చే ద్రై శరమ్ము, తీయ నై మనమ్ము" గలవా రని వర్ణన. ప[illegible]బులో రామసింహుని ప్రయత్నంచేత ఉద్యమము ఎలా అల్లుకున్నదో వివరించిన మంచి పద్యం వినండి. "మొలచి యెదిగి తీవియసాగి తలిరు తొడిగి యెల్ల పొంబాల మొక పొదరిల్లు గాగ నల్లుకొని పూచి క్రొత్తావిజల్లు కురిసె" పాడ్యేపు తెల్లవారుఝామున వచ్చిన కల సందర్భంగా "తన కెత యున్న సద్దాం నెవ్వడో నాటికొని వేసినది యంత కూడు గాగ" అని మొదలైన సీస పద్యం వంటి పద్యాలు నాకు యిష్టం. యిందులోనూ పాడ్యే తల్లినీ భార్య మాతనూ కవి మనకు చూపిస్తాడు.

ఇలా రాసుకుంటూ పోతే నిజంగా కవికి అన్యాయం చేసినట్లే పాఠకుడు చదువుకుంటే యివన్నీ సులభంగా అర్థం అవుతూనే వుంటాయి. నిజానికి యిటు వంటి కావ్యానికి ఉపోద్ఘాతాలూ, పీఠికలూ అనవసరం. ఈ మహాకావ్యాన్ని మన్నించమని నేనెక్కి చెప్పడానికి ప్రజలకు!

శ్రీ కె. శివారెడ్డిగారు, M A, హైదరాబాదు.
4_5_77

# రానడేఖండము

'The people which ceases to care for its literary inheritance becomes barbaric, the people which ceases to produce literature ceases to move in thought and sensibility. The poetry of a people takes its life from the peoples' speech and in turn gives life to it and it represents its highest point of consciousness, its greatest power and its most delicate sensibility" T. S. Eliot.

"అందుకోవచ్చు మహాకవి బిరుదమ్ము
నజ్ఞులో విజ్ఞులో యాదరింప" అని 'రానడేఖండం'

మొదట్లోనే సందర్భవశాత్తు అన్నారు శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి గారు. నాకీ మాటలు కేవలం కథాసందర్భానికే పరిమితమైనవిగా గోచరించవు. వీటి అర్థం (జలచక్రాల్లా) వ్యాపిస్తూ నేటి సాహిత్యలోకానికి వర్తిస్తాయి. ఈ మాటల్లోని వ్యంగ్యం ఎంత తీవ్రమో నే వేరుగా చెప్పనక్కరలేదు- అదే సీస పద్యగీతంలోని చరణాలు

సజ్జనుండను బిరుదమ్ము సంతరించు
కొనుట దుర్ఘటం, మిద్దాని కొలిచి యొనగు
విద్యలేదు క్రమశిక్షణ వృత్తి దక్క—

విజ్ఞులాదరిస్తేనే మహాకవి అయిన శ్రీ ముదిగొండ వారికి వ్యక్తిత్వం చాలా ముఖ్యమైనది. కవికి వ్యక్తిత్వం ఎంతో అవసరం అని నమ్మే కవి శ్రీ ముదిగొండ వారు. కవివ్యక్తిత్వం, అతని నమ్మకాలు అతని కవిత్వంలో కొట్టొచ్చినట్టు కన్పిస్తాయి కదా! తరాల అంతరాలు లేని కవి వీరభద్రమూర్తి. అందుకు కేవలం నేనే ఒక

ఉదాహరణ. నాచేత దీనికి నాలుగు మాటలు రాయించట మనేది ఆయన కవితా వ్యక్తిత్వానికి, కవిత్వ రసాస్వాదానికి సంబంధించిన విషయాలు.

శ్రీ వీరభద్రమూర్తిగారికి డెబ్భైయేళ్ళు. ఒక కవిజీవితంలో డెబ్భైయేళ్ళు సామాన్యాలు కాదు. సారవంతమైన మాగాణాలు. అది పద్యంగానీ-గద్యంగానీ వచన కవిత్వంగానీ మరేదైనా గానీ- ఆఖరికి మాట్లాడుకునేటప్పుడు కవిత్వ స్పర్శవున్న మాట దొర్లినా పులకరించి ఆనందించే రసహృదయం శ్రీ మూర్తి గారిది. ఇన్నేళ్ళ కవితాసేద్యం తర్వాత శ్రీ మూర్తిగారిని 'పద్యం గొప్పగా రాయగలరు, వారిలో ధార వున్నది, వారి శైలి గొప్పది-వారి కవనం మనోహరం పరమ రమణీయం' అని పొగడటం-గంగానదిని గంగానది అని పొగడటం కన్న వేరు కాదు.

నమ్మకాలతో సంబంధం లేకుండా కవిత్వాన్ని ఆనందించగల గొప్ప హృదయం ఆయనది. ఈ వయస్సులో కూడా ఆ శక్తీ, ఆ ఓపికా, ఆ కవితో పాసనా కుర్రకారుకు సంభ్రమాన్ని కల్పిస్తాయి. ఏడు గంటలంటే, ఆరుగంటల యాభై అయిదు నిముషాలకే ప్రత్యక్షమయ్యే ఆయన నియమబద్ధత, అనితర సాధ్యం. ఇరవై నాలుగ్గంటలూ మే మనుకునే కవితాస్పృహలో జీవిస్తా రాయన. ఆయన వృద్ధుడు కాదు. నిత్యయౌవనుడు. ఆయ నెక్కడుంటే అక్కడ వాతా వరణం పచ్చబారుతుంది- కవిత్వం గుబాళిస్తుంది, జీవితం మీద కొత్త ఆశలు పుట్టుకొస్తాయి. అన్ని కాలాల్లోనూ పచ్చగా వుండే చెట్టులాగా ఉంటా డాయన.

కొంత మందికి కాలంస్పృహ వుండదు. చరిత్ర తెలియదు. ఏ వుద్దే శ్యమూ లేకుండా కవిత్వం రాస్తారు. మూర్తిగారు అలా కాదు, చరిత్రను కవితా చక్షువుతో వీక్షించి సారాన్ని పిండుకుంటారు. ఎప్పుడో గత కాలంలో ఒక బిందువువద్ద స్పందించిన కొన్ని ఘటనల్ని మళ్ళా కవిత్వంతో బతికించటం-కవిత్వం ద్వారా కొత్తగా దర్శించటం సామాన్యమైన విషయం కాదు. సంప్రదాయ మనేది కేవలం వారసత్వంగా సంక్రమించే దనుకుంటారు కొందరు కాని అహర్ని శలు కష్టపడి ఆర్జించుకోవలసినది.

గతాన్ని సమీక్షించుకున్ననాడే వర్తమానాన్ని సారవంతం చేసుకోగలం-కవిత్వాన్ని ఆవాహన చేయగలం. శ్రీ మూర్తిగారు ఇందులో ఆ కృషి చేశారు.

3)

చరిత్రంతా మన కళ్ళ ముందు సాక్షాత్కరించి, స్పందింప చేసి కర్తవ్యోన్ముఖులుగా చేస్తుంది.

"పంథ మెదిగిన కొలది విజ్ఞాన మెదిగి
వ్యష్టిసుఖగౌరవముల సమష్టి లోనొ
నిలిపి నిర్జీవ పద్ధతుల్ గనికిరా వనినది"—

శ్రీ మూర్తిగారి పద్యాలు చదువుతుంటే భట్టుమూర్తి పద్యాల్లా సంగీతం చిప్పిలుతూ వుంటుంది. మూర్తిగారి పద్యాలు ఎండిపోయి బీటలువారి, శిలామయాల్లా వుండవు. సంగీతం, అర్థం విడదీయరాని వైపోతాయి- పదాలు ఎంతటాకీ ఒక కాలిసట్లు కదలక సామాన్యాలు ... తెప్పలు తేలే పద్యాని ఆకళ్లా వుంటాయి. శైలీయతి కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది ఒడుదుడుకులు లేకుండా సాగిపోయే మహాప్రవాహంలా కావ్యం కదలిపోతూ వుంటుంది. ఒక జాతి స్వప్రహారం తన ... జీవింపచేసుకొని ... కావ్య ... మూర్తిగారి యశస్సు అవ్యాహతంగా నిలుస్తుంది. ఆ ... సుదీర్ఘ సాహితీ వ్యవసాయ ఫలసాయమిది. ఇది శ్రీ వీరభద్ర మూర్తిగారి

**MAGNUM OPUS;**

"నగ్నముని"

# 'వందేమాతర భారతం'

## ఒక విహంగావలోకనం:

ముదిగొండ వీరభద్ర మూర్తిగారు వందేమాతర భారతంలోని కొన్ని పద్యాలు తమ కంచు కంఠంతో చదువగా విన్నాను. కొన్ని నేను లోలోపల చదువుకున్నాను. వీరభద్రమూర్తిగారి మూర్తి వైపు, వందేమాతరం రచన వైపూ, నేను వెంటనే ఆకర్షితుణ్ణయ్యాను. రచనలోని ప్రౌఢత్వానికి ముగ్ధుణ్ణయ్యాను. ఒక రకంగా నేను ఆకర్షింప బడడం ప్రథమ వీక్షణంలోని ప్రేమ వంటి దని అనుకున్నాను. కారణం కోసం నన్ను నేను ప్రశ్నించుకున్నాను. జవాబు రాబట్టుకున్నాను. నా కిలా అనిపించింది.

తెలుగు సాహిత్యం అనాథ బిడ్డలా అనువాద రచనతో ప్రారంభమయింది. ఆదికవి మంచి అనువాదకుడే. అతని అడుగు జాడల్లో చాలా మంది చాలా దూరం వెళ్ళారు. కాని, చేదునిజ మేమి టంటే– ఊరికంటే శ్మశానం పెరిగి పోయినట్లు అనువాద సాహిత్యమే జాతి జీవితాన్ని ఆక్రమించింది. అనువాదం ఎంత గొప్పగా చేసినా అనువాదమే. కాని, మన కవులు యీ అనువాద సాహిత్యానికే, సృజనాత్మక సాహిత్య మనుకునేటంతగా గౌరవ చేశారు, భ్రాంతి కలిగించారు. సిగ్గుపడ వలసింది పోయి పిలక లెగరేశారు. సింహాతలాటాలు ధరించారు; పల్లకి లెక్కి వూరేగారు. ఏనుగు లెక్కి, జనజీవితానికీ సాహిత్యానికీ సంబంధం లేకుండా చేశారు. రాసేదీ, మాట్లాడేదీ ఒక్కటి కాకుండా, కానివ్వకుండా చేశారు. పాదాలకు పసరు పూసుకుని గాలిలో ప్రయాణాలు చేశారు.

వీరభద్ర మూర్తి గారిది అనువాద రచన కాదు. అదీ నా సంతోషం. ఈన భారత ప్రజల స్వాతంత్ర్యోద్యమాన్ని పద్యాల్లో రికార్డు చేశారు. ఇది యీ వరసలో, నిస్సందేహంగా వుత్తమ తరహా రాజకీయ రచన. ఇంత ఎత్తుకు ఎదిగి యిటువంటి రచన చెయ్యడానికి మనవాళ్ళు సాహసించ లేదు. దీనికి పాండిత్యం మొక్కటే కాదు., చరిత్ర పరిజ్ఞానమే కాదు; గొప్ప సంయమనం కావాలి.

## ఇది Epic Poem !

సాధారణంగా, పద్యాల్లో రాసేవారికి, చాలా వరకు మనం చూసింది, వారే కాలం నాటి కథా వస్తువు తీసుకున్నారో అప్పటి వ్యవస్థ గురించి వారికి తెలీదు; అప్పటి ప్రజల జీవితం తెలీదు; వాళ్ళ కష్టసుఖాలు యీ కవులకు కావ్య వస్తువుగా కనబడలేదు. పాత పద్యాలు, వాటి వరస, సంస్కృత భూయిష్ఠమైన ప్రయోగాలు తెలిస్తే చాలు పుంఖానుపుంఖంగా కావ్యాలు రాసిపడేసేవారు. అవే రసాలు. అవే అలంకారాలు, అనేక కవిసమయాలు. అందుకే వాళ్ళంతా సంస్కృతంలో కూరుకుపోయిన వృద్ధ పక్షులుగా మిగిలి పోయారు. కానీ, 'వందేమాతరం' వంటి రచన చెయ్యడానికి ఆంధ్రాంగ్ల సంస్కృత భాషా పరిచయమే కాదు, ఆ వ్యవస్థల లోతుపాతులు, జనజీవనం సమగ్రంగా తెలిసి వుండాలి. వీరభద్ర మూర్తిగారికి యివన్నీ క్షుణ్ణంగా తెలుసు నని తెలుసుకోడానికి యిందులో ఏ ఒక్క పద్యం ముట్టుకున్నా చాలు.

'నీకు పేరుప్రఖ్యాతులు త్వరగా రావాలంటే రామాయణం రాసెయ్యి' అనేది తెలుగు సాహిత్యంలో దాదాపు నానుడి అయిపోయే పరిస్థితి దాపురించింది. రామాయణం, అది ఎన్నోసారయినాసరే, మళ్లా రాస్తేచాలు యిట్టే కవిసమ్రాట్లో, మరో "యిట్లో" అయిపోవ డానికి అవకాశము వుంది.

వీరభద్రమూర్తిగారు తమ శక్తిని మరో రామాయణం రాయడానికి వినియోగించనందుకు నే నెంతో సంతోషిస్తున్నాను.

మరుగుజ్జులదేశంలో, ఒకటిరెండు ఖండకావ్యాలు అచ్చేసి కవులుగా చలామణీ అవుతున్న వాళ్ల కండకావరాన్ని ప్రదర్శిస్తున్న సమయంలో వీరభద్రమూర్తి గారి రచనలో ఆయన వ్యక్తినీ, శక్తినీ గమనించడానికి దేశానికి కొంతకాలం పట్టవచ్చు.

సూర్యుడికీ, సుందిరచనకీ గ్రహణం తప్పదుగదా.

మరో మాటకూడా యీ సందర్భంలో చెప్పుకోవాలి. భారతస్వాతంత్ర్యోద్యమ చరిత్ర, అందులో పాల్గొన్న నాయకులు, వారు దేశాన్ని, వుద్యమాన్ని నడిపిన తీరు, అనుసరించిన మార్గాలూ, ఆచరించిన పద్ధతులూ వివాదాస్పదమైన చర్చనీయాంశాలు.

ఇంక, 'కవి'కి నిర్వచనం—'అతిశయోక్తుల అల్లికగాడు' అనిపిస్తుంది వీరభద్రమూర్తిగారు అతిశయోక్తుల కందకాల్లోకి దిగిపోకుండా చరిత్రను దక్కగా

రికార్డు చేశారు. రాబోయే యీ తరహా రచనల కిది ఒరవడి పెడుతుందని అను కుంటున్నాను.

వీరభద్రమూర్తిగారు ఒకచోట చెప్పినట్లు—

"ఈశభక్తికి మించిన దేశభక్తి
దేశభక్తికిఁ దగిన యాత్మీయశక్తి
యాత్మశక్తికిఁ దోడుగ నాధునికత
రక్తి, యవి యెప్పునాడె భారతము ముక్తి"

ఇదే వందేమాతర ఉద్యమం, యీ కావ్యం మనకిచ్చే సందేశం అని నే నను కుంటున్నాను.

ప్రజోద్యమాల నాయకులు, వాటిలో ఆసక్తిగలవారు దీని నర్థం చేసుకుంటే ఎంత బావుణ్ణు.

భారతస్వాతంత్ర్య సంగ్రామ చరిత్రకు అద్దంపడుతున్న యీ కావ్యానికి ఆధునిక సాహిత్య చరిత్రలో చిరస్మరణీయమైన స్థానం తప్పక లభిస్తుందని ఆశిస్తున్నాను.

డా॥ అరిపిరాల విశ్వంగారు
M.A. Phd; D.Litt. (Manila)
Head of the Department of Languages
New Science College
Hyderabad

# ఫాడ్కే-ఖండము

భారత స్వాతంత్ర్యసంగ్రామం ఎందరు త్యాగమూర్తుల బలిదానఫలమో! సాయుధవిప్లవాన్ని ప్రబోధించిన ప్రథమవిప్లవవీరుడు ఫాడ్కే. ఆయన విప్లవ యుగానికి పిత. మార్గదర్శి. మహర్షి. ఎందరెందరు ఆ మార్గంలో నడిచి భరత మాతపాదాల దగ్గర తమ ప్రాణజ్యోతుల్ని వెలిగించారో! నేటి మన స్వాతంత్ర్యపు చరిత్ర కేవలం అహింసతోనే ముడిపడింది అంటే నేను ఒప్పుకోలేను. హింసను హింసతోనే ఎదుర్కోవాలి అనేది గీతాసారాంశము. కాని హింసకు ప్రారంభం నీవు చేయకూడదు. "ఒక చెంపమీద కొడితే-రెండో చెంపపైన కూడా దెబ్బతిను" అనే సిద్ధాంతం వివేకానందకు సమ్మతం కాదు. మహాత్మునికి మాత్రమే అది సాధ్యం. ఇది చరిత్ర.

శ్రీ ముదిగొండవీరభద్రమూర్తిగారు కవితారంగంలో కాకలుతీరిన కదనపాండితి కల గొప్పకవి. ఈ ఇతిహాసాన్ని ముందుతరాలకోసం మహా కావ్యంగా వెలయించిన కవితాస్రష్ట. 'శివభారతం' తర్వాత సమగ్రమహాకావ్యం చరిత్రలో ఇదే అవుతుంది.

వెయ్యేండ్ల సంప్రదాయం కవిసంస్కారంలో పద్యరచనాశిల్పంలో రూపుకట్టుకున్నది. తెలుగుపద్యాన్ని కమనీయంగా కవితాత్మస్పందనతో రచించ గల కవులు యీనాడు బహు కొద్దిమంది.

వారిలో శ్రీ వీరభద్రమూర్తిగారు పరిణతప్రజ్ఞులు.

ఫాడ్కే నిర్మించిన సేన,స్వార్థచింత లేనిది. బాధ్యతారహిత మైన హింసకు పాల్పడదు. దొరికినదానితో తృప్తిపడి దేశసేవ చేయటం ఒక్కటే మార్గం. వక్రచేష్టలు చేయవద్దని ఆయనప్రబోధం.

''వక్రశాఖల తరు వింటి బరువు మోయఁ
బనికిరాకున్న వంటకుఁ బనికివచ్చు
వక్రచేష్టల మానవవర్తనమ్ము
పనికిరా దెట్టి యుపకారమునకు నేని"

అయితే ప్రభుత్వంపై మాత్రమే వారి పోరాటం. ''వజ్రం వజ్రేణ భిద్యతే" అన్న చాణక్యనీతి ఆయనది. ఫాడ్కే మహారాష్ట్రవీరుడు. ప్రజలకు ద్రోహము చేసినవారి ముక్కును కోయు జాతివాడు. తెల్లవారిపై ఆయన ప్రకటించిన యుద్ధంలోని సారాంశం యీ నీతిపైనే ఆధారపడింది.

అనాడు జాతి పరిపాలనలో 'తెగులు పడినపైరు వలె సగ మైనది.' ఈ కావ్యంలోని ప్రకృతివర్ణనలు ప్రకరణోచితాలు. తెలుగులోని జాతీయతను ప్రతిఫలింపజేస్తాయి. చేయితిరిగిన రచయిత సంప్రదాయాన్ని మథించటమే కాక దానికి ('తనముద్రత్వాన్ని')పొందిక చేస్తాడు. అలాంటి అనర్ఘరచన యీ కావ్యం పన్నుల భారాన్ని మోయలేక భరతజాతి దీనావస్థలో ఉంది.

"పన్ను లోకలె యయ్యెఁ బరప్రభుత్వముఁకన్న
పాము మేలు, చచ్చువాడు బ్రతుక
వచ్చు పామువిషమువలన, పరప్రభు
తన్ గతించు మనువతండు కూడ"

చారిత్రిక ఇతిహాసరచనలో విషయం కూడా ఆధికారికంగా ఉండాలి. ఈ కావ్యంలోని అంశా లన్నీ అలాంటి స్పష్టతని సంతరించుకొన్నాయి.

చరిత్రని సంతరించడమే కష్టం. చారిత్రక-కావ్యాన్ని రచించటం అసిధారావ్రతం. కేవలం ఋషికల్పు లైన కవికే అది సాధ్యం. శ్రీ వీరభద్ర మూర్తిగారు యీ మహాకావ్యంలో తెలుగుపద్యరచనాశిల్పం యింకా సజీవంగానే ఉన్న దని నిరూపించారు.

మహాయోధుడు ఫాడ్కే జీవితం అందరికీ ప్రాతఃస్మరణీయం.

"ఏ యమూరు విలసిల్లు మాయూరధింపమై
భువికి దత్తాత్రేయమూర్తి వెలసి"

గాణగాపూర్ దత్తాత్రేయక్షేత్రం. పాదుకా విహరించిన గ్రామాల్లో అదొకటి. పద్యపు ఎత్తుగడ, నడక, గంభీరసుందరం,

గ్రామగ్రామపురీపురీపథపథాఖండస్థలీఖండనో
ద్దామం బై ప్రజ మాయికొట్టి ప్రభుతన్ దాటించుచో నీ ధరా
సీమన్ శాంతి సజీవశాంతి యపుడే,సీ దమ్ము ధామమ్ములో
న్నీమైశాంతి శ్మశానశాంతియొకదే! యెన్నాళ్ళుజీవించినన్'

శ్లేష, సమాసఘటనం, వాక్చాతురి, గంగాఝరి వంటి ప్రవాహం, మధురిమ వెలార్చు సంగీతాత్మకత, రసబంధుర రచన యిది.

శ్రీ వీరభద్రమూర్తిగారి కవితాతపస్సు పండించిన మణిదీప మిది.

శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు

హైదరాబాద్
14-8-77

# హైదరాబాద్ ఖండము

1947 సంవత్సరములో భారతదేశము ఇంగ్లీషు పరిపాలన నుండి విముక్తియై స్వతంత్రము పొందినది. జాతిపిత గాంధీమహాత్ముని నాయకత్వములో భారత ప్రజలు సాగించిన అహింసాత్మక మైన పోరాటము ఫలితముగా మనకు స్వరాజ్యము వచ్చి యిప్పటికి సుమారు ముప్పది సంవత్సరాలు గడచిపోయినది. 1947 సంవత్సరానికి కొంచెము ముందుగాను, తరువాతను జన్మించిన మన యువతీయువకులకు భారతదేశ స్వాతంత్ర పోరాటమును గూర్చిన వివరాలు యెక్కువగా తెలియక పోవచ్చును- స్వరాజ్యానికొరకు సాగిన పోరాటములో పాల్గొనినవారు అనేకులు యీనాడు సజీవులై యుండుట అదృష్టకర మైన సంగతి.

సుప్రసిద్ధ కవులు, పండితులు శ్రీముదిగొండ వీరభద్ర మూర్తి గారు భారత స్వాతంత్ర్యోద్యమమును యీ కావ్యములో మనోహరముగా తెలియజేసి నారు. స్వరాజ్య సాధనకు జరిగిన ఉద్యమాలను అన్నింటిని స్వయంగా చూచి, ఆ ఉద్యమాల సాఫల్యమునకు సంతోషించి, ఉత్సాహముతో కలము పట్టిన కవీ శ్వరులు శ్రీవీరభద్ర మూర్తిగారు. ఈ కావ్యములో వారు ఆ ఉద్యమాలను కనులకు గట్టినట్లుగా చిత్రించినారు ఆనాటి ఉద్యమాలతో ప్రత్యక్షముగను, పరోక్షముగను కొంత సంబంధము ఉండిన నావంటి వారికే గాక యీనాటి యువ తీయువకులకు గూడ యీ కావ్యము అవశ్య పఠనీయము.

క్రీ. శ. 1800 ప్రాంతములో భారతదేశమున ఇంగ్లీషువారి ప్రభుత్వానికి గట్టి పునాదులు యేర్పడినవి. ఈ సంవత్సరమున అప్పటి ఇంగ్లీషు గవర్నర్ జనరల్‌తో స్వదేశ సంస్థానాధీశ్వరులు చేసికొనిన ఒడంబడిక ఫలితముగా నిజాం రాజు ఇంగ్లీషు ప్రభుత్వానికి సామంతు డైనాడు. ఈ విధముగా ఇంగ్లీషు ప్రభు త్వమును సంస్థానాధీశ్వరులు మొదలైన వారు శిరసావహించినప్పటికిని ప్రజలలో పరదేశ పరిపాలనపట్ల సానుభూతి లేకుండె నను సత్యమును నాటి చరిత్ర విరూ

పించు చున్నది. ఇంగ్లీషువారిని తొలగించుటకు భారతదేశములోని అన్ని ప్రాంతాలలోను విప్లవాలు చెలరేగినవి. ఈ విప్లవోద్యమాల చరిత్ర రక్తాంకిత మై మహోజ్జ్వలమై, దేశభక్తిపూరితమై, త్యాగశోభితమై, ఉదాత్తమై నిలసిల్లు చున్నది. ఈ కావ్యములో శ్రీముదిగొండ వీరభద్రమూర్తిగారు ఆ ఉద్యమాలను రసవంతముగా వివరించినారు.

1808 సంవత్సరమున ఇంగ్లీషు ప్రభుత్వానికి మహారాష్ట్రులకు యుద్ధము జరిగినది. కాని నిజాంరాజు ఇంగ్లీషువారికి విధేయుడై తన యేలుబడి క్రింద ఉండిన బీహారు ప్రాంత అధికారి "మహీపత్‌రాయ్"ని ఇంగ్లీషువారికి సైనిక సహాయము చేయవలె నని ఆదేశించగా ఆయన ధిక్కరించినాడు. తత్ఫలితముగా ఆయనను ఉద్యోగమునుండి తొలగించుట జరిగినది. తరువాత ఆయన నిజాంరాజు మీద తిరుగుబాటు చేసెను. 1808 సంవత్సరమున ఇంగ్లీషువారికి వ్యతిరేకముగా కొందరు జాగిర్దార్లు తిరుగుబాటు చేసిరి. ఇట్లు తిరుగుబాటు చేసి శిక్ష అనుభవించిన వారిలో 'రావురంభా నింబాల్కర్,' నూరుల్ ఉమ్రా'లు ముఖ్యులు. తరువాత రోహిలాలు కొందరు తిరుగుబాటు చేసినారు. ఈ రోహిలాలనాయకులు'సర్దార్‌ఖాన్' 'తుర్రెబాజ్‌ఖాన్' మొదలైనవారు. 1858 ఫిబ్రవరిలో గుల్బర్గాజిల్లాలోని షోరాపూర్ సంస్థానాధిపతియైన 'వెంకటప్పనాయక్' ఇంగ్లీషువారిమీద తిరుగుబాటు చేసెను. 1858 జూనులో రాయచూరులో 'భీమరావు దేశాయ్' తిరుగుబాటు చేసెను. అదిలాబాదు జిల్లాలో గోండులు 'రాంజీగోండు' నాయకత్వమున ఎదురు తిరిగినారు. మహబూబ్‌నగర్‌జిల్లాలో 'పండుగశాయన్న' అను యోధుడు తెల్లవారిని చంపాలె అను నినాదము లేవదీసి, ఎదురుతిరిగి మరణశిక్ష పొందినాడు. ఈ విధముగా హిందువులు, ముస్లింలు అను భేదము లేక భారతదేశములోని అన్ని ప్రాంతాలందు వలెనే హైదరాబాదు సంస్థానములో కూడ స్వాతంత్ర్య ఉద్యమాలు నిర్వహించినారు. నూర్లమంది హతులైనారు. వేలమంది నిర్బంధితులైనారు. డజన్లమంది అండమాన్‌ద్వీపాలకు పంపబడినారు. లక్షల రూపాయల ఆస్తి జప్తుచేయబడినది.

శ్రీముదిగొండ వీరభద్రమూర్తిగారు ఈ అధ్యాయములో హైదరాబాదు స్వాతంత్ర్యోద్యమానికి సంబంధించిన వీరగాథలను సాహసకృత్యాలను మిక్కిలి రసవంతముగా కావ్యరూపమున వ్యక్తీకరించినారు. ఇందుకు శ్రీవీరభద్రమూర్తి గారు అభినందనీయులు. ఈ కావ్యము ఆంధ్ర పాఠకలోకము ఆదరణ పొందవలె నని నా ఆకాంక్ష—

శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు B.A.LL,B, President Viswa-Sahithi, Executive Member, India International Centre.

శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి రచించిన హైద్రాబాదు ఖండము విపులంగా చదివాను. చక్కటి శైలి,చిక్కటి భాష, నవరసభూయిష్ఠ మైన ఇతివృత్తం యీ హైద్రబాదుఖండానికి, వన్నె తెచ్చాయి.

శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి రచనలో భాషా సంపదలోని సౌందర్యాలతోపాటు చమత్కృతి కూడా తొణికిసలాడుతుంది.సునిశిత హాస్యం,సుందర ఉపమానాలు ఆయన కవిత్వంలో అంతర్గతంగా పారే అందాల సెలయేరులు-ఈ హైద్రాబాదు ఖండంలో చలి గురించి వ్రాస్తూ రెండవ రాజధాని లక్షణాలు హైద్రాబాదులో చలి విషయంలో సరితూగగల వనీ, ఢిల్లీకి తీసిపోని చలి ఇందు గల దని ఆయన వర్ణించారు. మెహిందీ లోని సౌఖ్యనివ్యందిఏ కల రేయి గురించి ఆయన ప్రస్తావిస్తారు ఆధునికులకు ఆశ్చర్యం కలిగేలా. నిశి, చలి, చెలి, మధువు, కూడిన హైద్రాబాదు రాత్రి వర్ణన ఉత్తేజకరంగా వుంది.

వెన్నెలగురించి నెలరాజు తెలుసుకున్నట్లు శ్రీ ముదిగొండ రచించారు. 'మంచి ముత్యాల కుప్పలు' "ఇం తని రాని చక్కెర గుమ్మరింపు" మాలతిపూలు పట్టి బుట్ట''సహస్రధారల పాలు పిండిపోసిన రీతి'-ఇలా ఆయన వర్ణనలు హృద్యంగా వున్నాయి. "చినుకులు పడిన తామరా కెనయు కంట సెల వొసంగె నిజాము'' అన్న పోలిక కవి కల్పనాశక్తికి నిదర్శనము.

శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి సహజంగా స్వాతంత్ర్యపోరాటంలో బ్రతికిన వ్యక్తి కావడంవలన రచనల్లో ఆ స్వాతంత్ర్యవాయువుల సమ్మేళనం ఉత్తేజపరుస్తుంది. ఆయన రచనా రీతుల్లో పాత్రలు వీరత్వం పుంజుకొని పురోగమిస్తాయి. కదన రంగం, మదనరంగం కూడా ఒకే ప్రాసులో సరితూగే భాషాకల్పనాసంపదతో కవి రచించగల రనుట నిస్సందేహం. శ్రీ ముదిగొండ వారి కృషి ప్రశంసనీయం. వారికి నా హృదయపూర్వక శుభాకాంక్షలు-

డా॥ నాయని కృష్ణకుమారిగారు
Reader In Telugu, Osmania University
Hyderabad

దయానంద ఖండము

# ఆనందసౌందర్యం

పితృసఖులు శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారు సాహిత్యగాన లబ్ధప్రతిష్ఠులు ఆయన ఉండని కవిసమ్మేళనం శోభించదు ఆయన గొంతు ఖంగున మ్రోగి నాదాన్ని వలయాలుచుట్టి, ఆ శబ్దమయ వ్యూహం లోపలికి శ్రోతల మనస్సుల్ని ఒక్కపెట్టున ఆకర్షించుకుంటుంది. ఆయన జనంనాడిని గుర్తుపట్టగల ఉచితజ్ఞులు. ఒకే యితివృత్తాన్ని అటు గణచ్ఛందంలోనూ! ఇటు వచన పద్యంలోనూ మలిచి ఎదుటివాళ్ళమీద గుప్పించి ముగ్ధుల్ని చేయగలరు. అందుకే ఆయన కావ్యాల్ని చదువుతుంటే అందులో పద్యాలు కేవలం పద్యాలుగా మాత్రమే సాక్షాత్కారం కావు. అవి ఆరోహణావరోహణ క్రమాలతో, అవసరమైన విరుపులతో, ఆయనే మన యెదుట చదువుతున్నట్లుగా చెవుల్లో గింగుర్లెత్తుతాయి.

ఈ వందేమాతర కావ్యం మన జాతీయోద్యమ చరిత్ర. 1880 నుంచి 1908 వరకూ ఉన్న దేశ రాజకీయ చరిత్ర అంతా ఇందులో సమీకృతి పొందింది. 1905లో బంకించంద్రుని వందేమాతరగీతం పుట్టింది. అంతకుముందే అది మనకు నినాదమై శోభిల్లింది.

చరిత్రను కావ్యంగా మలచడం కష్టమైన పని. కేవలం సంఘటనలతో నిండి, అంకెల్నీ తేదీల్నీ కళ్ళముందు తిప్పే చరిత్ర రమణీయార్థప్రతిపాదకం కావడం కష్టం. అయినా మన భాషలో, చారిత్రకకావ్యాలు వ్రాసి మెప్పించిన వాళ్ళు ఉన్నారు. అందులో ఈనాడు శ్రీ ముదిగొండవారొకరు. పద్దెనిమిది ఖండాల బృహత్కావ్యంగా వారు దీన్ని తీర్చడం అభినందనీయమైన విషయం; అందునా, పద్యాన్ని చూచి అర్థం కాదు లెమ్మని జనం భయపడి దూరంగా ఉండే యీ కాలంలో!

ఇది "దయానందఖండం". ఏకకావ్యాంతర్గతంగా ఉన్న ప్రతిఖండానికీ వేరువేరుగా ఒక్కొక్క సమీక్ష వ్రాయించడం ఈ కవే తెలుగులో మొదలు పెడుతున్నా రనుకుంటాను. కావ్యాన్ని ఆసాంతం చూచి చేసే సమీక్ష వేరు. ఈ రక మైన ఖండగత సౌందర్య సమీక్ష వేరు. అయినా అన్న మంతా పట్టి చూడక్కరలే దన్న అతి సామాన్య జనోక్తి కిది చక్కని నిదర్శనం.

ఈ ఖండంలో దయానంద వృత్తాంతం క్లుప్తంగా ఉంది. స్వామీదయానంద సరస్వతి, భారతదేశాని కొక 'రూసో', ఒక 'లూథర్', మరొక 'బిస్మార్క్'. ఆయనలోని వ్యక్తిత్వం రెండురకాలుగా కనిపిస్తుంది— ఒకటి మాతృదేశ దాస్యశృంఖల విచ్ఛేదనోన్ముఖం. మరొక్కటి, ఆధ్యాత్మికౌన్నత్య ప్రచార ప్రవణం— ఈ రెండింటికీ వింతగా ఏకత్వం సాధించిన అద్భుత వ్యక్తి దయానందుడు. కవి ఈయన్ని గురించి మన సంతా కేంద్రీకరించి చెప్పినట్లు కనిపిస్తుంది. అతడు, "బొట్టుతేడాతోడ పుట్టె కల్లోలము లంచు చందనమునే అనుమతించిన" వాడు. "స్త్రీవిద్య మిగిలిన శ్రీవిద్యలేదని ఘోషించి ఘోషాను కొంచెపరచిన" వాడు. "సంక్షోభావమననె తక్క అస్వతంత్రత పోదని, జాతి సంతతి నొక "బంతిగా నిల్పి'న వాడు– "పెరుక్కొలిసంత బలవంతుడు" "ఎదురుము తల వంపింపుము చదుపుము దుర్మార్గు డగునా క్ష్మాపతినేన్" అని గర్జించిన వీరసింహము. అటువంటివాడు కొన్నివందల యేళ్ళకైనా ఒక్కడు ద్భవిస్తాడా! అని తిలక్ ప్రభృతులు ఆనాడు విచారించారు.

ఈ ఖండంలో చిత్రించిన మరో రెండు పాత్రలు చాలా బరువైనవి. మాతృదేశ స్వాతంత్ర్య సముపార్జనకోసం బ్రిటిష్‌వాళ్ళమీద కత్తికట్టిన 'వాసుదేవ బలవంతరావు ఫాడ్కే" బందిపోటునాయకుడు. తెల్లవాళ్ళతో యుద్ధం చెయ్యడానికి నైజాములోని రోహిలాలతో, సైన్యసహాయం కోరి పత్రాలు వ్రాయించుకున్నాడు. ఆదమరిచి నిద్రపోతున్న వాణ్ణి శత్రువులు బంధించ గలిగారు. జనాభిప్రాయాన్ని కలుషితం చేసే ఉద్దేశ్యంతో అతణ్ణి పెద్దబంది పోటుదొంగగా చిత్రించారు. కాని, కోర్టుమాత్రం, అతణ్ణి చివరకు ఆంగ్లరాజ్యాన్ని కూలద్రోయ ప్రయత్నం చేసినందుకు శిక్షించింది. అందుకే సంతోషించి ఫాడ్కే,

"దొంగతనము నిందను మోపి క్రుంగదీయ
ఆంగ్లరాజ్యము కూలఁద్రోయఁ గడగె నని
ఋతమున న్నన్ను శిక్షింప నెంచె మెచ్చి
కొందు కోర్టును కీడులో కొంత మేలు"

అని ఊరడిల్లగలిగాడు. నెత్తురును చలిమ్ముడ్డ చేసేంత త్యాగశీలి ఫాడ్కే. జైలులో అతడు మరణిస్తే, దేశం మొత్తంమీద జనం, తమ యిళ్లలో చావు వాటిల్లినట్లుగా సచేలస్నానము చేశారు. అతడిక తిరగలేడుగదా! అని తెల్లవాళ్ళ గుండె హాయిగా గురకపెట్టింది.

ఫాడ్కే రోహిలాలతో ఒప్పందం వ్రాసుకునే సందర్భంలో, కవి వెంకోపంతు అనే మరో పాత్రను ప్రవేశపెట్టారు. ఇతడు వ్రాయసకాడు. "చెదరిపోదు ఫలము నా వ్రాత పడిన యే స్థలమునా" అని స్వోత్కర్షను చూపించుకోగల శక్తిమంతుడు—ఇక్కడ కవికి, చారిత్రకసత్యాలనుండి దూరంగా, కాస్సేపు రమణీయమైన కల్పనను రూపొందిస్తూ ఆనందించే అవకాశం కలిగింది.—

వెంకోపంతు వ్రాతలో చతురత్వాన్ని తెలియజేస్తూ ఆయనకు బావమరుదైన ఈశ్వరభట్టు ఒక ఉదంతాన్ని ఉదాహరించాడు.

ఒక ప్రియుడు తాను ప్రేమించిన మగనాలికి తన హృదయం తెలియజేయా లనుకున్నాడు. తన గురువు వెంకోపంతు నాశ్రయించి అతనిచేత తన తరుపున ఒక లేఖ వ్రాయించుకున్నాడు, "నేను నీదు భర్త నీవు నాదు భార్య వేగ వలయు పండరితీర్థము నరసిరాగ"—అని. పండరితీర్థానికి లేచిరమ్మనీ, నీ నా సంబంధం భార్యాభర్తృ సంబంధమే కాగల దనీ అందులో సూచించాడు. ఆ పిల్ల కీవ్యవహారము నచ్చలేదు. కాగితం భర్త చేతులో పెట్టి ఊరుకుంది. అతగాడు మండిపడి, ఊరి పెద్దల్ని కూడేసి ఇతణ్ణి రచ్చబండదగ్గరకు రమ్మని సవాలు చేశాడు. ఇతగాడికి ఊరుఊరంతా వెన్నుమీద విరిగిపడ్డ ట్లైపోయింది. గురువుగారి కాళ్ళు పట్టుకున్నాడు. వెంకోపంతు శిష్యుని వెన్ను తట్టి, నేను వ్రాసిందే, కామాలు పెట్టి రచ్చదగ్గర చదవ మని తరిమాడు.

దాంతో ఆ వాక్యం కాస్తా.

నేను, నీదుభర్త, నీవు, నాదు భార్య, వేగ వలయు పండరితీర్థము నరసి రాగ—అని మొత్తం అర్థాన్నే మార్చుకుని అమాయకంగా అందరికీ కనిపించింది.

ఊరి పెద్ద లంతా, చనువుతో ఆవిడకు ఉత్తరం వ్రాశాడే గాని ఇందులో దురర్థ మేదీ లే దని ఆ కాగితాన్ని చించిపారేసి, కేసు మాఫీ చేసేశారు.—అటు వంటివాడు వెంకోప౦తు. వెంకోపంతుపరంగా,

"పోషణములు పతుద్వయ
భాషు లగు వకీళ్ళకున్, సభంగాభంగ
శ్లేషములు, 'రుకూన్' తెలివికి శాసను లీ వెంకు పంతుక ర్తృక
లేఖల్ -"

అన్న కవివాక్యం, ఆయన కవిత్వానికి వర్తిస్తుంది. ఈ కవి శ్లేష వాడ టంలో దిట్ట వ్యంగ్యాన్ని కూడా తన రచనలో ఎక్కువగా చిత్రిస్తాడు. ఈయన కలంపోటు తిని, కీచురాళ్ళు 'ఈ వేళ నీ రాజ్య మెవరిది గాదు మాది' అని సమకాలికస్థితిని వ్యంగ్యంగా సూచించగలవు. ఇక్కడే గురువువల్ల పైకి వచ్చి గురువును పడనెట్టే రాజకీయపు శిష్యరికాలు మెరుస్తాయి. మామిడిచెట్టు పండ్లను కాసినట్లే, మంచి మాస్టర్లు శిష్యులకోసం సద్గుణాలను కాస్తారు. అయితే ఈ మాస్టర్లలో కొన్ని తేడాలు కూడా ఉన్నాయి. అన్ని విషయాలూ బోధించే టీచర్లు వేరు, అనాడు ఆంగ్లం చెప్పే టీచర్లు వేరు.

"ఆత్తరు లేకయే వలచు నాంగ్లము చెప్పెడివాని దుస్తు లత్యుత్తమపంక్తివా డతడు, పూజ్యను నమస్కృతి చేయు తీరె వేరు"—

మామూలుపంతు ళ్ళంతా అవమానవిషపానంలో పరమ శివమూర్తులు!

ఈ కవి పలుకుబళ్ళు కొన్ని కొత్తవి. మనం చింతగింజ వేస్తే మునగని చిక్కని మజ్జిగ నెరుగుదుము. కాని ఈయన అటువంటి చిక్కని 'దాయి' నెరుగును. అంతే కాదు, "గమగమలాడు మేల్జరద తమ్మలమును", కూడా ఎరుగును.-భూమిలో ఖనిజం దాక్కున్నట్లుగా ఈయనదృష్టిలో దైవం కాలంకడుపులో దాక్కుంటాడు.

ఈ కవి రచనలో ఉర్దూపదాల వాడుక కొంత విరివిగానే కనిపిస్తుంది. ముసల్మాను చేత పద్యం చెప్పించాల్సి వస్తే దాన్ని మణిప్రవాళశైలిలో, ఉర్దూ లోనే నడపడం తమాషాగా ఉంది—

ఖాన్ అనే వాడు,

"జాతాహుా మై గుదూ్నార్
లాతాహుా పౌజు రోహిలా దక్కనియోం
కా తయ్యార్ రహానా" అని చేతిని కదిలించి"—

మరీ వివరించాడు. ఖడవాల్, బందాచేయు, జీబుగా, పట్టీలుకొట్టు, మతలబు. వకాలతు, ఫర్మాయించు, రుకూన్, వంటి మాటలు ఈయన పద్యాల్లో ఎబ్బెట్టు తనం లేకుండా అందంగా ఒదిగి పోయాయి. 'పనిపట్టు,' 'నిలువు నద్దమ్ము సంగుళ మ్మెదుగు' 'మూడు చెఱువుల నీళ్ళు త్రాగు',వంటి తెలుగు పలుకుబళ్ళు మధురంగా వినిపిస్తున్నాయి.

మరొకమాట! దృశ్యకావ్యాల్లో కన్పించే శిల్పం, ఈ కవి యిక్క డొక చోట చూపిస్తున్నారు. సాధారణంగా నాటకాల్లో పూర్వ ప్రసంగా న్ననుసరించి పాత్ర ప్రవేశిస్తుంది. అదే విధంగా ఇక్కడ ఒక సంఘటన ఉన్నది. దయానంద సరస్వతి మరణించిన తరువాత సంతాపసభ అధ్యక్షుడు ప్రసంగిస్తూ

"ధర నెడసె దయానందుడు
తిరుగుచు తిరుగుచునె యరువదియు నిండక, యి
త్తరి రాజకీయరంగము
నురడింపగ వచ్చునో తదుపముడు లెస్సల్."

అని వాకొన్నాడు. వెంటనే

"—అచ్చటకున్ వ
చ్చెను గంగాధర తిలకుని
తనయుడు బలవంతరావు"

అని కవి ఒక్క మాటన్నాడు. ఇదీ ఇక్కడి నాటకీయలక్షణం. చారిత్రికేతి వృత్తాన్ని స్వీకరించి సాధ్యమైనంత రామణీయకాన్ని సృష్టిస్తూ కావ్యాలుగా మలచే ఈ కవి స్థానం ఆంధ్రసాహిత్య చరిత్రలో గణనీయమైనది.

ఇదీ ఆనందసౌందర్యసమీక్ష.

*శ్రీ కొడాలి ఆంజనేయులుగారు*

# కాంగ్రెస్ ఖండము

శ్రీ ముదిగొండ వీరభద్ర మూర్తిగారు "వందేమాతరమ్" అను గ్రంథమును వ్రాయ మొదలుపెట్టారు. అది 18 అధ్యాయములు. ప్రతి అధ్యాయమునకు "ఖండము" అని పేరు పెట్టారు. అందులో కాంగ్రెసుఖండము కూడా ఒకటి అది 8వ అధ్యాయము. అది కాంగ్రెసుపుట్టుకను గూర్చిన కథ. తరువాత అధ్యాయములలో సైతము కాంగ్రెసు ప్రసక్తి వచ్చినప్పు డెల్ల ఆ కథకు సంబంధించినంత వరకు అప్పటి కాంగ్రెసు కార్యకలాపములను గూర్చి పేర్కొనడం జరిగింది.

ఇది చరిత్రకు సంబంధించిన విషయం. దీనిని వీరభద్రమూర్తిగారు పద్యాలలో వ్రాశారు. పద్యాలు వ్రాయడం తేలిక కావచ్చు. కాని కవిత్వం వ్రాయడం కష్టం కవి తనకు యిష్టంవచ్చిన కథను కల్పించుకొని గానీ, లేక ఆదివరకే ప్రచారంలో ఉన్న ఒక కథను తీసుకొని గానీ కవిత్వంలో మనోహరంగా వ్రాయవచ్చును కాని రాజకీయ సమావేశాలలో జరిగిన చర్చలను తీర్మానాలను పద్యాల్లో వ్రాసి అందులో కవితా సౌందర్యమును ప్రతిబింబింపచేయడం దుస్తరం. కాని శ్రీవీరభద్రమూర్తిగారు "వందేమాతరమ్" లోని "కాంగ్రెసు ఖండము" రచనలో అనేకచోట్ల వారి కవితావైభవమును ప్రదర్శించి కృతకృత్యు లయినా రని చెప్పవచ్చును.

ఒక చిన్న బడి ఫెర్గ్యూసన్‌కళాశాలగా రూపొందిన సంఘటనను తిలకగార్కరుచిప్లుంకరులు నెలకొలిపిన బడి– "ఒక మహాకళాశాల యయ్యె సహ్యనగజనిత మలతియూట గోదావరి యైన యట్లు" అని వర్ణించా రాయన. తిలకుమహాశయుని కాలమునాటి మహారాష్ట్ర ప్రతిభను గూర్చి "రెండుబాహువులును కేసరియు మరాటి పత్రికలు" "సార్వజనిక సభయును" "దక్కనెడ్యుకేషనలుసొసైటీ" ఈ త్రయము లనన్యదృఢమహారాష్ట్రచైతన్యమునకు" అన్నా రాయన. రనడే స్థాపించిన సార్వజనిక సభలో కేశవచంద్ర సేనుమరణమునుగూర్చి జోహారులర్పించేటందుకు అగార్కర్ మొదలగు మహామహులు పాల్గొన్నారు. ఆ తీర్మానమును గూర్చిన తాత్త్వికచర్చలను మనోహర మైన పద్యాలలో వివరించారు వీరభద్రమూర్తిగారు.

ఆ సభ ముగిసేసరికి ప్రొద్దు గ్రుంకింది. ఆ సభలో పాల్గొన్న వారంతా ప్రముఖ తత్వశాస్త్రవేత్తలు-ఆకాశాన చుక్కలు కనిపించినై. ఆప్పుడా దృశ్యాన్ని ఎంతో సముచితంగా యిలా వర్ణించారు కవి

"ఎన్ని కనులలో లోకాలేలు నీశ్వరునకు
ఎన్ని ఆనందలోకాలలో పుష్పములగనులవి,
ఎన్ని కోరికలో జనులకు—
అన్ని పొడిచె చుక్కలు, లబ్దముగానాటి పూలతోట."

హ్యూం కళాశాలా విద్యార్థుల నుద్దేశించి వ్రాసిన ఉత్తరం, సురేంద్రనాథ్ బెనర్జీ సార్వజనికసభకు పంపగా ఆ సభాకార్యదర్శి శ్రోతలకు చదివి వినిపించాడు. అందులోని సారాంశమే ఈ పద్యం.

"ఏ జాతికి తగు పాలన
మా జాతికి వచ్చి తీరును— ఆలస్యముతో
మీ జాతి ముడిచికొని మము
వాజిమలన్ చేసినారెవరో యనదగునే"

హ్యూమ్‌నుగూర్చి దాదాభాయి అన్న మాటలను కవిత్వంలో యిలా వ్రాశారు మన వీరభద్రమూర్తిగారు.

"కేకిసల మధ్య మరియున్ వాకొనె నౌరోజి, యెంతవాడో హ్యూం : తో డాకొనిన అత్మ భారత మై కళకులు చిమ్మ దేహమూర్గం బయ్యెన్"—

కాంగ్రెసు చరిత్రను గూర్చి మఱువరాని మాట మఱొకటి ఉంది గ్రంథంలో

"అతి మానవచర్యావిరహితమౌ రామాయణం బిదే, దాయాదుల్ దిటినొంద నిది మహాభారత మిదె-కాంగ్రెసుచరిత్ర"

మొదటి కాంగ్రెసులో జరిగిన తీర్మానములు ధారాళంగా పద్యాలలో వర్ణించబడటం గ్రంథకర్త అప్రతిమాన ప్రతిభావిశేషములకు సాదృశ్యం. ఉదాహరణకు :

"లండనులో నున్న ఇండియా కౌన్సిలు వైళమే రద్దు కావలయు ననుచు......-

తీర్మానముల్ వ్రాయబడియె"

దాదాభాయినౌరోజీఉపన్యాసాన్ని ఉల్లేఖిస్తూ "నవురోజి సభాత్మకు నిజ వచనఘనసార చందనచర్చ సలిపె" అనిముగించారు మూర్తిగారు. ఈ విధంగా ఈ కాంగ్రెసుఖండంలో కనబడుతూన్న కవిత్వపు తళుకులను ప్రత్యక్షం చేయడం ప్రారంభిస్తే గ్రంథంకంటె సమీక్ష పెఱిగిపోతుంది.

కనుక ఒక్కటే నా సలహా: గ్రంథం చదివి ఆనందించడంకంటె మార్గాంతరం లేదు.

చదివేటప్పుడు కూడా జాగ్రత్తగా ఓపికతో చదవాలి. తిక్కన భారతం లోని పద్యాలు వలెనే ఆపవలసిన చోట ఆపి చదవడం అలవాటు లేక పోతే అర్థం కావడం కష్టం.

ఈ గ్రంథమునకు సమీక్ష వ్రాసే నెపంతో ఈ గ్రంథాన్ని చదివే అవకాశం అయాచితంగా నాకు లభింపచేసిన ఈ గ్రంథకర్తకు నా కృతాజ్ఞతాభి నందనాలు.

Swami Ranganathananda
Rama Krishna Math

Secunderabad
Hyderabad-500003

# Combined 'Introduction' to the Chapters on Sri Rama Krishna and Swami Vivekananda.

In "Vandemataram" by Sri Mudigonda Veerabhadramurty- we have a modern Purana dealing with the story of India's strug, gle for freedom in a kavyam of eighteen chapters. Among the fighthrs for freedom are not only the great political and social leaders, but also the spiritual teachers like Swami Dayananda, Sri Ramakrishna, and Swami Vivekananda.

Sri Veerabhadramurty introduces Sri Ramakrishna as the one who, through his sadhanas and teachings, roused the kundalini sakti of the nation. He presents Sri Ramakrishna as the modern incarnation of Narayana and Swami Vivekananda as the modern incarnation of Nara.

The author presents the several facets of Swami Vivekananda's personality, stressing particularly his love for the common man, and his raising the concept of freedom, from the merely political to the level of the spiritual, to the heights of all-round freedom in atma-samrajya.

Several of the verses in the section on Swami Vivekananda have been broadcast by the Hyderabad station of the All-India Radio.

The author couches these ideas in mellifluous Telugu; they are meant not only to be recited, like the usual poetic compositions, but also sung; and I experienced the music of it when the author sang the poems on *Sri* Ramakrishna *at the* Ramakrishna Math, Secunderabad, Hyderabad, on 24 March 1977.

Sri Krishna, Sri Rama, and Bhagavan Buddha, in the past, inspired the creative minds of our country to bring out beautiful pieces of poetry, painting, sculpture, and dancing, apart from great books of philosophy and spirituality. The artists of modern India are slowly feeling the same fascination in Sri Ramakrishna, Sarada Devi The Holy Mother, and Swami Vivekananda. Even during the lifetime of Swami Vivekananda, one of the disciples of Sri Ramakrishna, namely, Babu Akshaya Kumar Sen, had given expression to this fascination in his book: **Sri Ramakrishna Punthi**,in easy flowing Bengali verse,to which Swami Vivekananda had given the following criticism and appreciation (**Letters of Swami Vivekananda** pp. 284 and 288-89, 1948 edition):

"The **Ramakrishna Punthi** that Akshay has sent is very good, but there is no glorification of the **sakti** at the opening, which is a great defect. Tell him to remedy it in the second edition. Always bear this in mind that we are now standing before the gaze of the world, and that people are watching every one of our actions and utterances. Remember this and work. ...

'Just now I read Akshay's book. Give him a hundred thousand embraces from me. Through his pen, Sri Ramakrishna is manifesting himself. Blessed is Akshay: Let him recite that **Punthi** before all. ...Well, I do not find a single irrelevant word in it. I cannot tell in words the joy I have experienced by reading his book. ... Well done Akshay! ... Go from village to village and proclaim to all Sri Ramaksishna's teachings; can there be a more blessed lot than this? ... Dear dear Akshay! I bless you with all my heart, my dear brother! May the Lord sit in your tongue! ... There is no need whatever of your becoming a **sannyasin**. ...

'Ask Akshay to write these few points in the third edition of his book: "**The Propagation of the faith**":

'1. Whatever the Vedas, the Vedanta, and all other incarnations have done in the past, Sri Ramakrishna lived to practise in the course of a single life.

'2. One cannot understand the Vedas, the incarnations, and

such like things without understanding his life, For he was the explanation.

'3. From the very date that he was born sprung the satya-yuga. Henceforth, there is an end to all sorts of distinctions, and everyone down to the candala will be sharers in the divine Love. The distinction between man and woman, be tween the rich and the poor, the literate and the illiterate, brahmins and candalas- he lived to root out all. And he was the harbinger of peace- the seperation between Hindus and Mohammedans, between Hindus and Christians, all are now things of the past. That fight about distinctions that there was belonged to another era. In this satya-yuga, the tidal waves of Sri Ramakrishna's love have unified all.

'Tell him to expand these ideas and write them in his own style.'

Here is a profound guidance and inspiration for all writers.

—:o:—

# అనువాదము

శ్రీముదిగొండ వీరభద్రమూర్తి రచించిన 'వందేమాతరం' కావ్యము భారతస్వాతంత్ర్య సమరమును వర్ణించు పదునెనిమిది ఖండముల ఆధునికపురాణము వలె నున్నది. స్వాతంత్ర్యయోధులలో గొప్ప రాజకీయసాంఘిక నాయకులే గాక దయానందస్వామి, శ్రీరామకృష్ణుడు, వివేకానందస్వామి మున్నగు ఆధ్యాత్మికప్రవక్తలు కూడ నున్నారు.

శ్రీవీరభద్రమూర్తి ఇందు శ్రీరామకృష్ణుని తన సాధనప్రబోధముతో జాతికుండలినీశక్తిని ఉత్థాపించిన మహనీయునిగా ప్రవేశపెట్టియున్నారు. ఆయన యందు శ్రీ వివేకానంద రామకృష్ణులను ఆధునిక నరనారాయణావతారముగా చిత్రించియున్నారు.

కవి స్వామివివేకానందుని వ్యక్తిత్వమునందలి వివిధ విన్యాసములను, సామాన్యమానవులయెడ నాయనకు గల ప్రేమను, స్వాతంత్ర్యభావమును, కేవల రాజకీయరూపమునుండి ఆధ్యాత్మికప్రమాణమునకు, అనగా సర్వతో ముఖమైన ఆత్మసామ్రాజ్యస్వాతంత్ర్యోన్నతికి ఉద్ధరించిన విధానమును చక్కగా వర్ణించియున్నారు.

స్వామివివేకానందఖండమునందలి పెక్కు పద్యములు హైదరాబాదు ఆకాశవాణినుండి ప్రసారము చేయబడినవి.

కవి ఈ భావములను మధురమంజులమైన తెలుగుభాషలో వ్యక్తముచేసియున్నారు. ఇది సామాన్యకావ్యముల వలె ఊరక పఠించుటకే గాక పాడుటకు కూడ నుద్దేశింపబడినది. కవి శ్రీరామకృష్ణుని గురించిన పద్యములను సికింద్రాబాదునందలి రామకృష్ణమఠములో 24-8-1977తేదీని గానముచేసినప్పుడు అందలి సంగీతమాధుర్యమును నేను చవిచూచియుంటిని.

పూర్వము శ్రీకృష్ణుడు, శ్రీరాముడు, బుద్ధభగవానుడు, వేదాంత ఆధ్యాత్మికగ్రంథములనే గాక సుందరకావ్యములను, శిల్పచిత్ర లేఖనములను, నాట్యభంగిమలను, వెల్వరించుటకు మన దేశమునందలి ప్రతిభావంతుల కావేశము కల్గించియున్నారు. ఆధునికభారతమునందలి కళాభిజ్ఞులు మెల్లగా శ్రీరామకృష్ణుడు, శారదామాత, వివేకానందస్వామి, మున్నగువారియెడ అట్టి ఆకర్షణమునే అనుభవించుచున్నారు. వివేకానందస్వామిజీవితకాలమునందే శ్రీరామకృష్ణుని శిష్యులలో నొకడైన 'బాబుఅక్షయకుమార్ సేన్' 'శ్రీరామకృష్ణపంథి' అను గ్రంథమున సులభములు ధారాశుద్ధిశోభితములు నైన బెంగాలీపద్యములలో ఇట్టి ఆకర్షణమును వ్యక్తీకరించియున్నాడు. దానికి వివేకానందస్వామి ఈ క్రింది ప్రశంసావిమర్శల నొసంగియున్నాడు. (వివేకానందస్వామిలేఖలు, పుటలు 284, 288, 289, 1948 ముద్రణము)

"అక్షయకుమారుడు పంపిన 'రామకృష్ణపంథి' చాలా బాగుగా నున్నది. కాని ఆరంభమున శక్తిప్రశంస లేదు. ఇది యొక పెద్దలోపము. రెండవముద్రణమున దీనిని సవరింపుమని అతనితో చెప్పుము. మన మిప్పుడు సర్వప్రపంచవాసుల దృక్పథమున నున్నామనియు, ప్రజలు మన ప్రతికర్మమును

ప్రతివాక్యమును, పరిశీలించుచున్నా రనియు సంతతము జ్ఞప్తియం దుంచుకొనుము. దీనిని స్మరించి పనిచేయుము:

"నే నిప్పుడే అక్షయకుమారుని గ్రంథము చదువుచున్నాను. అతనికి నా శతసహస్ర సమాశ్లేషముల నొసంగుము. శ్రీరామకృష్ణుడు అతని లేఖిని ద్వారా ప్రత్యక్ష మగుచున్నాడు. అక్షయుడు నిజముగా ధన్యుడు. ఆ పంక్తి నాతని నందరి యెదుట పఠింపు మనుము: ఇలేః అం దసుందర్య మైన పద మొక్కటియు కానరాలేదు. అతని గ్రంథమును చదువుటచే నే ననుభవించిన సంతోషమును మాటలతో చెప్పజాలను... అక్షయా! సెబాసు!... గ్రామమునుండి గ్రామమున కరిగి శ్రీరామకృష్ణుని యుపదేశములను ఘోషింపుము. ఇంతకన్న ధన్యతర మైన కార్య మింకేముండును?.... ప్రియాతి ప్రియుడ వైన అక్షయా! ప్రియసోదరా! నేను హృదయపూర్వకముగ నిన్నాశీర్వదించుచున్నాను. భగవానుడు నీ జిహ్వపై నిల్చుగాక! నీవు సన్యాసివి కావలసిన అక్కఱ యేమియు లేదు...."

'అక్షయుని సిద్ధాంతప్రచారము' (The Propagation of the Faith) అను అతని గ్రంథమునూడవముద్రణమున ఈ కొలది యంశములను కూడా వ్రాయు మనుము.

(1) వేదములును, వేదాంతమును, ఇతరావతారము లన్నియు, పూర్వకాలమున చేసిన దంతయు ఒక్క జీవితకాలమున ఆచరించుటకు శ్రీరామకృష్ణుడు జీవించెను.

(2) ఆయన జీవితము నర్థముచేసికొనకుండ నెవ్వరును వేదములను, వేదాంతమును, అవతారములను, అర్థముచేసికొనజాలరు: ఏల యన ఆయన వాని కన్నిటికిని వ్యాఖ్యానము

(3) ఆయన జన్మించిన ఆ దినమునుండియే సత్యయుగ మవతరించినది. ఇప్పటినుండి అన్నిరకము లైన భేదములును అంతరించినవి. అందఱును దివ్యప్రేమను పొగ్గొందురు. పురుషులకును స్త్రీలకును, పేదలకును ధనికులకును, అక్షరాస్యులకును, నిరక్షరాస్యులకును, బ్రాహ్మణులకును, చండాలురకును గల భేదమును రూపుమాపుటకే ఆయన జీవించి యుండెను. ఆయన శాంతిదూత. హిందూమహమ్మదీయులకును, హిందూక్రైస్తవులకును, నడుమ

గల పార్థక్యము భూతకాలమునకు సంబంధించినది మాత్రమే. భేదము లున్న వనెడి యా పోరాటము అన్యయుగమునకు చెందినది. ఈ సత్యయుగమున శ్రీ రామకృష్ణుని ప్రేమసముద్ర తరంగములు అందఱిని యేకీభవింపజేసినవి.'

'ఈ భావములను వివరించి తన శైలిలో వ్రాయు మని అతనితో చెప్పుము'

రచయిత లందఱికిని ఇం దొక మహత్తర మైన ఆవేశమును, నిర్దేశమును, కలవు.

"గోపాల చక్రవర్తి"

ఆధునిక భారతానికి ఆధ్యాత్మిక తేజస్సు ప్రసాదించిన తపోధనుడు, మహర్షి శ్రీ రామకృష్ణ పరమహంస. చిరయశస్వి శ్రీ రామకృష్ణ పరమహంస, ఆయన అంతేవాసి ఆధ్యాత్మిక వారసుడు శ్రీ వివేకానందుడు భారతజాతీయాభిమానాన్ని సహస్రరోచిస్సులతో భాసింపజేయడ లో మహత్తరపాత్రవహించిన మహనీయులు.'వందేమాతరం'కావ్యంలో పరమహంస ఖండము ప్రధానభాగం కావడం సహజము, సముచితము కూడా. మానవతావాదం, సకలమత సమానత్వం, విశ్వశ్రేయస్సు భారతజాతీయోద్యమ ఉదాత్త ఆశయాలలో ప్రధాన మైనవి. ఈ ఆశయాల రూపకల్పనలో శ్రీ రామకృష్ణుని ప్రబోధం తన ప్రభావాన్ని అపరిమితంగా ప్రసరింపజేసింది. ఇందుకు నిదర్శనంగా పరమహంస ఖండంలోని రామకృష్ణ మహర్షి బోధననే గమనించండి:-

"కాళికాదేవి యందఱి కన్నతల్లి
యా మెరూపమ్ములో మన మరయవలయు
క్రీస్తును మహమ్మదును సర్వవస్తువులను
అపుచంటిలో మున్నవి యన్ని రుచులు".
"మాధవుడు మానవులయందు మనును, దాన
మానవులకుఁ జేసిన సేవ మాధవుండు

తనకె చేసిన యట్లు తైకొనును, ప్రజకు
సేవ సేయుడు పేదలు చెంగలింప..."
"మతము జాతీయతా మూలమంత్ర మయ్యు
నన్యమతములవారితో నైకమత్య
మొప్పునప్పుడె యదాని గొప్పతనము
తత్వ మేకత్వ మిదియ భిన్నత్వమందు..."

భారతజాతీయోద్యమంలోని, స్వాతంత్ర్య సమరంలోని వివిధచరిత్రాత్మకసంఘటనలకు, మహానాయకుల, మహాపురుషుల చిరస్మరణీయపాత్రలకు ప్రతిబింబాల వంటి రమణీయ పద్యచిత్రాలు పరమహంసఖండంలో అనేకం :-

"ఫాలము చందన తిలక
శ్రీలము, మానసము సంకలిత హిందూవి
ద్యాలయము, మదన మోహన
మాలవ్యా, మాటకారిమానిక మనిరెన్..."

అని పండిత మదన మోహనమాలవ్యాను కవి పాఠకులకు పరిచయం చేస్తున్నారు.

పద్యాత్మకంగా, అందులోను రసవత్తరకావ్యంగా జాతీయోద్యమానికి అక్షరరూపం కలిగించడం సులభమైన విషయం కాదు. సంక్లిష్టమైన ఈ కార్యాన్ని శ్రీ వీరభద్రమూర్తిగారు స్తవనీయంగా నిర్వహించారు-

"మన చెల్లించెడి పన్నుతోఁ బ్రిభుతబర్మాన్ ముట్టి, రష్యాచమూ
జనితత్రాసము పెట్టె గాని మన యీ సైరింపరానట్టి లే
మిని పోగొట్టెనె? మిక్కిలించె, నిది యేమీ? పన్నులం తెంచు పా
లన మంచున్ మరికొంత వాకొనియె మాలవ్యాబిలవ్యాహృతిన్"

జాతీయోద్యమంలోని వివిధ రాజకీయసమస్యలను ప్రస్తావిస్తున్న సందర్భాలలో, ఆంగ్లేయ పాలకుల దుష్కృతులమీద భారతనాయకుల మాటలలో శ్రీవీరభద్రమూర్తిగారు కురిపించే సునిశిత విమర్శలను ప్రత్యేకంగా పేర్కొనాలి. శ్రీవీరభద్రమూర్తిగారి సున్నితమైన వ్యంగ్యానికి ఒక చిన్న ఉదాహరణ:-

"చేని యజమానునకు సాగుసేయువాడు
కట్టుబడి ధాన్యమును బోలె కార్యదర్శి
కాంగ్రెసున నైన నిర్ణయ సంగ్రహంబు
నేటనేట వైస్రాయి కందింపవలయు''...

అందమైన రేఖాచిత్రాలుగా పద్యచిత్రాలను రూపొందించడంలో వీరభద్రమూర్తిగారు ప్రదర్శించిన ప్రతిభకు మరొక నిదర్శనం-

''ఆయన లాలా లజపతి
రాయాఖ్యుడు, యువకుల మగరాయి, దయానం
దీయ మతము తీయన నం
దీయ రసాలంబు, భారతీయ బలంబున్''

ఇంగ్లీషు, తెలుగు సంస్కృతం ముప్పిరిగొన్న పద్యాలు గూడ వీరభద్రమూర్తిగారి లేఖినినుండి మధురంగానే వెలువడినవి. ఇందుకు ఒక మచ్చుతునక-

''ఢిఫరై పోవుచు సమితిన్
డఫరిన్ వైస్రాయి ద్రోహనద్ధం బనె, స
చ్ఛిఫ యుద్ది, ధన్యవాదము
లు ఫుల్లములు వాని కిడె, నెలుం గిటు లోదవెన్''

జాతీయోద్యమకాలంనాటి కాంగ్రెసుసభల ప్రాధాన్యాన్నిగురించి ప్రత్యేకంగా కవి వివరించారు. ఒక్కమాటలో, నాటి కాంగ్రెసుసభవిశిష్టతను వీరభద్రమూర్తిగారు ఈ క్రింది పద్యంలో వివరిస్తున్నారు ఎంతో ఉదాత్తంగా—

"జరుగు బొంబాయి నాగామిసభ యటంచుఁ
దెలుపబడె, నక్లై యిచ్చటఁద్రిదినయుతము
కాంగ్రెసలరె దశ్రాతేయకాంతి యనగఁ
బదియుతొమ్మిదినూర్ల శిష్యగణ మొప్ప"...

కారాగారాలలో బంధితు లయిన స్వాతంత్ర్యయోధుల సత్యశక్తికి నివాళి వంటిది, మణిపూసవంటిది ఈ క్రింది గీతం :

"వైలునాల్గుగోడలమధ్య సత్యశక్తి
విద్యుదుద్రేకసంపృక్తి వెలుగుచుండి
సకలభువనసంచాలనసంభ్రమముగ
నురవడించును వెలుపలి కురికినపుడు"...

పదచమత్కృతి తొణికిసలాడుతున్న గీతాలలోనుంచి స్థాలీపులాక న్యాయంగా పట్టి తీసిన ఈ క్రింది పద్యాన్ని చిత్తగించండి-

"ఒడ్డోలగమందుఁ బ్రజల
గొడ్డములను దెలిపి తిలకు గోఖ్లే నార్టన్
గడ్డుకొనిన మొయిఁ బలికిరి
గిడ్డంగులు రాజనీతికిన్ వారి నుడుల్"

జాతీయోద్యమంలోని ప్రజాశక్తి నిగురించి, నాయకుల సామర్థ్యాన్ని గురించి, శ్రీ వీరభద్రమూర్తిగారు అచంచలమైన ఆత్మవిశ్వాసంతో పలికిన పద్యాన్ని ప్రస్తావించకుండా ఈ స్థాలీసమీక్ష అసంపూర్ణమే

"పొక్కిలు బ్యాంకుచెక్కులుగ నప్పటికప్పుడు చేతి కందవో
యిక్కడి పాలనాసమితియింగ్లిషువారలు ధిక్కరించినన్
దక్కినవారు భారతజనాభ్యుదయంబు ప్రవతంబుగాఁ గ్రియన్
మిక్కిలునాడు, రచ్చఁబ్రజ నేతలు క్రిక్కిరియించునాడునున్..."

భారత జాతీయోద్యమమహత్తరచారిత్రకగాథలకు పద్యాకృతి వందేమాతరంకావ్యం అందులోనిది పరమహంస ఖండాన్ని గురించి విశేషించి చెప్పవలసిన మాట - ఇది రసవత్తరమైనది. ఉత్తేజకరమైనది. ఉత్కృష్టప్రయోజనాత్మకమైన ఈ కావ్యాన్ని కమనీయంగా సృష్టించిన శ్రీ వీరభద్రమూర్తి గారికి నా హృదయపూర్వక అభినందనలు. అభినుతులు.

డా॥ దివాకర్ల వేంకటావధానిగారు, M.A. (Hon's) Phd.
Formerly professer And Head Of The Department Of Telugu,
Osmania University

# లోకమాన్య ఖండము

మహాకవి శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారాధునికాంధ్ర కవిపుంగవులలో మూర్ధన్యులు. సాంప్రదాయికకవితాస్రవంతిని బహురసవత్కావ్యకుల్యల ద్వారా తెలుగు నేలల ప్రసరింపజేసియు, శివుని ఓంకారఘంటానినాదమును దలపించు మధురగంభీరకంఠముతోఁ బలుచోట్ల కావ్యపఠనమొనరించియు వారనవద్యమైన యశస్సు నార్జించినారు. కవిత్వముతో పాటు మితిమీఱిన దేశభక్తియు వారి కాజానజమై వారిచే పెక్కు మహాకావ్యములు వ్రాయించినది.

"జననియు జన్మభూమియును స్వర్గముకన్నను గొప్ప,
హైమమైనను పరభూమి తుచ్ఛ"

అను నది వారి హృదయములో చిరరూఢమైన భావము. అంతరమైన యీ దేశభక్తి జ్వాలయే ప్రాయముకై వ్రాలిన యీ ఉత్తర జీవితమున వారినోట వందేమాతర మను నష్టాదశఖండమండితమైన యీ మహాకావ్యతేజస్సును వెల్వరించినది. వందేమాతరమ్-ఎంత చక్కని పేరు! మంచువలె నివతాళించిన పి కిపందనెత్తురునైన నుడికెత్తించు నెంత మనోజ్ఞనామము! ఈ పేరే వారి కావ్యముఘనతను వేనోళ్ళ వక్కాణించుచున్నది.

'వందేమాతరమ్' కావ్యమునందలి ఖండములలో లోకమాన్యఖండము విశిష్టమైనది. తిలక మహాశయునకా బిరుద మత్యంత మన్వర్థమైనది. ఆయన భారతస్వరాజ్యసౌధమునకు మూలస్తంభము. ఎంత దేశభక్తుడో అంత దైవ భక్తుఁడు. ఎంత దైవభక్తుడో అంత మహాపండితుడు. ఆయనపలుకులు పరదేశీయుల హృదయములకు ములుకులు; దేశభక్తిపూరితులైన దేశీయుల హృదయమకురములకు రత్నపుతళుకులు. ఆయన నాటిన స్వపరిపాలనా

బీజమే మొక్కయై, మానై, మహావృక్షమై భారతీయులకు స్వరాజ్యస్వాదు ఫలము నందించినది

శివాజీ రాజకీయమహానాయకుడు. భారతజాతీయ వీరశేఖరుడు. ఆయన పేర నెన్ని ఉత్సవము లొనరించినను భారతీయులా మహామహుని ఋణము తీర్చుకొనజాలరు. గణపతి భారతీయుల కారాధ్యారాధ్యుడైన దేవతామూర్తి. ఆయన విఘ్నాంధకారమార్తాండుడు మతరాజకీయాలకు సంబంధించిన యీ యిరువురు మహనీయుల యుత్సవములు నీ ఖండమున వర్ణింపబడినవి. యుత్సవముల సందర్భమున తిలకు, పరంజపే, సావర్కారు, సురేంద్రనాథుడు, మున్నగు నాయకశిరోమణు లొసంగిన మహోపన్యాసములు వట్టి వాగ్విన్యాసములు కావు; భారతీయ హృదయారణి గణములందు మందములై అణిగియున్న స్వాతంత్ర్యాగ్నికణములను కెరలింపజేసిన పవిత్రాజ్యధారావిన్యాసములు; పారతంత్ర్యమహాంధకారమున కుద్వాసనములు. వీరభద్రమూర్తిగా రీ యుపన్యాసములలో వ్యక్తీకరించిన భావము లెంత శక్తిమంతములో అంత రక్తికాంతములు. వారిపద్యము లాయా సందర్భములందు స్వాతంత్ర్య దేవత నావాహించు స్వాహాంతనిగమమంత్రధ్వానముల కాలవాలము లై పఠితల హృదయముల నుప్పొంగజేయును.

గణపతి ఉత్సవముల సందర్భమున నొసంగబడిన తిలకునుపన్యాస మందలి.

"మూషికము బొజ్జవేల్పును మోయు శేమి!
యనుచు హేతులార! మీరు నన్నడుగవచ్చు
భరతఖండోద్ధరణ కార్య భరణమునకు
నలతియును బలవంతు డైనట్లె యిదియు."

నను పద్య మెంతగంభీరార్థభూయిష్ఠమో వేఱుగా జెప్పనక్కఱలేదు. ఖండలి యుపన్యాసములందలి పద్యము లన్నియు నిట్లె అంతరార్థధ్వని జాజ్వల్యమానము యింపు నింపుచున్నవి. ఇవి వీరభద్రకవివక్త్రాగతములు కావు. దుష్టదక్షాధ్వరధ్వంసకాలవిజృంభిత వీరభద్రదేవముఖాగతములు. వాని నన్నిటిని వివరించి వ్యాసమును దీర్ఘీకరింపను. సహృదయుల

కొక్క పద్యమును స్థాలీపులాకన్యాయముగా చూపితిని. అలతిఅగ్నికణ మవనీధరోన్నతమైన కార్పాసపుంజమును భస్మసాత్కరించుటకు చాలదా?

ఈ ఖండమున తిలకు, సావర్కారు, గోఖ్లే, దివోస్కరు, చాపేకరులు పట్వర్ధన్, బాపట్, పరంజపే, భండార్కర్, శంకరన్నాయర్,నాటూసోదరులు ఠాకూర్‌సాహెబ్, అగమ్యానందపరమహంస,, అరవిందఘోషసోదరులు, మహాత్మగాంధి, మున్నగు మహానాయకుల ప్రసక్తియున్నది. గాంధీజీ యప్పుడే దక్షిణాఫ్రికానుండి యరుదెంచెను అచ్చట భారతీయులు పశు పాట్ల నతడు వర్ణించిన తెఱంగు హృదయవిదారకముగా నుండును. ఆ మాటలు విని తిలక్ తత్త్రిత్యుల తప్పక యుద్ధరించెదనని వాగ్దాన మొనరించెను. చాపేకర్ సోదరులలో న్యగజుని జాడ తెలిపి యొక్కనీచు డిరువదివేల రూప్యముల గ్రహించెను తిలకా చాపేకరును కౌగలించుకొనగా నతడు

"స్వామీ! నాకు భగవ
ద్గీత చాలు కనులకద్దుకొందు
జన్మించి నినుఁ గనుగొందు"

నని పలికియుండెను. తిలకాతని శవమునకు దహనసంస్కారము జరిపించెను.

"వ్రేటుగొన్నట్టి గవరనమోముతల్లిపులి
గాండ్రించి కన్నీరు గ్రావుచు వినిచె వాసుదేవునకు
సుతమణీ! ఇర్వది న్వేల కెవ్వడు
పొల్పడెను వానిని వధింపరా!తక్షణ మనుచు"

పల్కెను. ఆ తిలకుపత్రికలో చాపేకరు లసమాన భారత భక్తు లని సన్నుతించెను. లజపతిరాయ్

"హత్యచాటునం దున్న
దనంత దేశభక్తి"

యనియు "నవయుగోదయమున కిది నాంది" యనియు ప్రస్తుతించెను. ఈ ఖండమునందలి ఘట్టము లన్నియు నొకదానిని మించి వే రొక్కటి వీర రసోద్దీపకములుగా నున్నవి. దివోస్కరు దాశేర్కథానామక గ్రంథమును రచించి అందు "స్వరాజ్య"పదమును వాడెను. అరవిందసోదరులు బ్రిటనులో

యుండి స్వాతంత్ర్యలాభమునకై కృషి చేసిరి. దాదాభాయీనవురోజీ లాహోర్ కాంగ్రెసు సమావేశమున కరుదెంచెను. ఈ విధముగా లోకమాన్యఖండము భారతస్వాతంత్ర్యనాటకమునకు నాంది యై విరాజిల్లు చున్నది.

కవి యిందు కథాకథనమునఁ జూపిన కౌశలము ప్రశంసనీయమై యున్నది. తిలకునకు సంబంధించిన కథాసన్నివేశముల నన్నింటిని వారు చక్కఁగా వివరించి యున్నారు. తిలకు కారాగారబద్ధుడై యున్నప్పుడు ఆతని స్మృతిపథమున గడచిన వృత్తాంతము లెన్నో త్వరితత్వరితముగా ప్రసరించి నవి. వాని నన్నిటిని వివరించుటలో కవి గతగాథాస్మారక మని చెప్పదగిన **"*Flash back*"** విధానము నవలంబించి కథాకథనమున కొక వైశిష్ట్యమును చేకూర్చియున్నారు

శ్రీ మూర్తిగారి జగద్విదిత మైన పద్యశిల్పమును గూర్చి నేను వేఱుగా చెప్పవలసినది లేదు. వారి పద్యములు ధారాశుద్ధి శోభితములై, విలక్షణప్రౌఢ తాపరిపూర్ణమైన కూర్పుతో గూడి మనోరంజకముగా నుండును. వారచ్చటచ్చట వాడు శబ్దార్థాలంకారాలు వారి కవిత కంతింతనరాని వన్నె చేకూర్చుచున్నవి.

> "రచిత శిల్పభూరి ప్రస్తరచితరుచిత
> రుచిత సింహాసనమున సౌరుచితముఁగ శి
> వాజి యుండె సభాజన బహుసభాజ
> నమ్ముతో"

అను పద్యము యమకాలంకారముతో గూడి యత్యంతమనోజ్ఞముగా మన్నది.

> "పక్షవాతము మానవవ్యాధి గాగ
> పక్షపాతము మానవత్వమున వ్యాధి"

అనుచో పక్షపాత పక్షవాతశబ్దముల ప్రయోగము రమణీయ మగుటయే కాక భావగంభీరముగా గూడ నున్నది.

> "ఆతని హృదయము జాతీయతాభ్యుదయము
> తత్ప్రమాఖ్యన శివాజీ, తదనఘు వాజి
> ధర్మసమితి దూకె, నెదిరిధైర్యము గుము
> వాస్రవంతీ ప్రవాహమునందు దూకె"

అను పద్యమునందలి శబ్దాలంకారముమాట యటుండ నర్థవైచిత్రి శివాజీపరాక్రమక్రమమునకు బంగారుపతాక వోలె నున్నది.

"తనువో ధనమో మనమో" 181. ప.

అను పద్యమున

"స్యందనచాలక మైన మోకు దానన కాదే"

యను నర్థాంతరన్యాసము మనోహరముగా నున్నది.

"పొట్టివేల్పు తలప పుట్టెడు బుద్ధులు"

"గంగాతటజనితర్షి త
రంగిత మాశీర్వచః పరంపర తోడై
పొంగులుగా కెట్లుండు"

మున్నగునవి శ్రీ మూర్తిగారి జాతీయపదప్రయోగమునకు తార్కాణములు. మాక్సుముల్లరు మొదటి శ్రుతిప్రతిని పంపగా నార్యులు వసించిన దుపోత్తరధ్రువమే యని విదితము చేయు గ్రంథమును తిలకు బంధనముననే రచించెను. దానిచే

"నెదలకు బలె దివాచీల కెన్నొ రంగులు వేసె తిలకు"

అనుట యెంతో భావగంభీరముగా నున్నది.

"నిన్ను భజించు చుంటిమి గణేశ్వర! ప్రాణసపుత్రపుష్పని
ష్పన్న సమర్చనన్, జివరి జన్మము చేయకు దీని మాకు క్రేన్
గన్నుల ప్రోత గర్జనముగా భరతోర్వి స్వతంత్రతాప్తి దా
కన్నవమేఘముల్ కురియుగాత! నిరమ్మదమన్మదంగముల్"

(258 ప.),

అను పద్యము వారి భావగాంభీర్యమునకును ధారాశుద్ధికిని పరమనిదర్శనముగా నున్నది.

"మా యిండ్లు సదా రైపుల్లంబు లగుత! శ్వతప్రాణవన్తై"

అను ప్రయోగమందలి ధ్వని యద్భుతముగా నున్నది. కవి యిందు మధ్యాక్కరలు, ద్విపదలు, స్రగ్ధర మున్నగు వృత్తములను గూడ వాడియున్నారు. 'వందేమాతరం' వారి కవితా ప్రతిభ పరాకాష్ఠనందిన మహాకావ్యము. అది దేశమున సముచితగౌరవము నంది వారి కపారయశస్సౌర్భారముల నొదవించుగాక! యని యాశించుచున్నాము.

'సభ ద్విధా, యొకవైపున పిల్లికూతలున్'
మరొక సందర్భాన
"భరత ధరణికి..."

"దాౖతవనంబువంటి యెంతో సీధు వంత దొరకు''
'దొరకు'- 'దొర'కు అని కూడ
''పసి లేనిది సేద్య మగునా: పసి లేనిది ఖాద్యమౌన"
''అౖబిటిషుపాలనంబు"

శ్రీ అరవిందులు విద్య జాతీయ విద్యగా ఉండా లని భావించారు.

"జాతి స్వతంౖతజీవనము సల్పుకొనన్ దగువిద్యమనకిప్పుడులేనిదివిద్య"

లజపతిరాయిని గురించి వ్రాస్తూ,

గీ॥ ''అతడు లజపతిరాయి దుర్మతిపరాయి"

అని భావస్ఫూర్తిని ౖపస్ఫుటం చేశారు రచయిత. స్వామి వివేకానందను గురించిన ప్రస్తావనలో:-

క॥ ''అటు వేదాంతము నిటు ని
ప్పటి భారత రాజకీయ బాధాంతము నొ
క్కటెసుడి స్వామి పలికె''

ముదిగొండవారి పాళికి శబ్ద మెన్ని విధాల ధ్వనిస్తుందో. గీతగీతాన వినవచ్చు. శ్రీ సురేంద్రనాథ బెనర్జీ

''పూర్వజన్మ తపస్వి యిప్పుడు వచస్వి"

మాటలు ముచ్చెమటలు పోయకుండా, వాటి కవి ఆయా స్థానాల్లో ముచ్చటగా చోటు చేసుకుంటై. ఇది రచయిత సహజరీతి.

'అమవసవాటి చీకటుల కందవు పున్నమినాటి వెన్నెలల్''
ఏ భాష అయినా తనదిగా చేసుకోవా లనుకొనే చంపకము.

''పాతలాంతర్లకు క్రొత్తలాంతర్లు శీర్షిక గాగ''

ముదిగొండవారి మధ్యాక్కర, మధ్యమధ్య అక్కుతే. ''Rogues of First waters'' అనేదానికి ముదిగొండవారి తెనిగింపు.

ఆ.వె॥ ఇటకు క్రిటను నుండి యేలవచ్చు జనంబు
మొదటినీట వచ్చు మొసలిమచ్చు''
కమ్మని తెనుగు తనానికి ఒక కందము.

క॥ ''నీ బలగమె వా బలగము
నీ బాసయె వాదు బాస నీ బాటకును
వ్వా బాట కలియు వరవిం
దా। బృంహితనుగుణబృంద! యని తిల కనియెన్.''

గీ॥ ''ఒక పనికి బుద్ధిదీపమె యొనరు గాని
యెన్ని బుద్ధిదీపము లైన నేమి ''గ్యాసు
లైటు'' కాదు, కాంగ్రెసు గ్యాసులైటు, దాని
వెలుగునందు స్వరాజ్యపు పెండ్లివిందు.''

స్వాతంత్ర్యసాధనలో స్వయంగా పాల్గొనటం వలన ముదిగొండవారిలో వీరభద్రమూర్తి కన్పిస్తారు. ఆ స్వానుభవం తోడయినందువల్లనే మా రచనలో శబ్ద, అర్థ, భావ అలంకారములతో పాటు, అక్షరరమ్యతతో పాటు రాజకీయ రమ్యత కూడా చదువరులను ఆకట్టుకుంటుంది. ఈనాటివారి కెక్కువగా తెలియని శ్రీ అరవిందుల దేశభక్తిని జ్ఞాపకం చేయగల దీపిక. శ్రీ అరవింద ఖండము.

తెనుగు, సంస్కృతం, ఆంగ్లభాషల తీపితెన్నులను, పాత క్రొత్త కవితా రీతులను మేళవించుకున్న మహాకవి ముదిగొండవారు.

విద్వాన్, శిరోమణి
*శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు*

# భవానీమందిరఖండము

"ఇచటి మట్టిఁ బుట్టి, యిచ్చటి గాలికి
వాన కెండ కెదుగువారు, తనను
మఱచిపోయి రనుచు మఱిమఱిఁ దడవె నా
యంబ భారతాంబ యా భవాని"

అని తన హృదయం చీల్చి బయటికి ప్రవహింపజేసిన, దేశమాతృశృంఖలావిమోచనోద్యమంకోసం ఉఱకలు పెట్టుతున్న కరుణరసం సర్వత్రవ్యాపించిన భవానీమందిర్ వ్యాసభావాలనూ, మహర్షి అరవిందఘోష్ ఆ వ్యాసంలో వ్యక్తపరచిన దేశహితైకబోధదీధితులనూ, స్వాతంత్ర్యరక్షాదీక్షాకంకణకింకిణీక్వణనములనూ మెఱుపులు తగ్గనీక, ధ్వనులు సన్నగిల్లనీక తెలుఁగుతోటలో ప్రసరించునట్లు చేసిన దీ భవానీమందిరఖండం. ఆనాడు అరవింద, బారీంద్ర సురేంద్రనాథబెనర్జీ, బిపినచంద్రపాల్, అశ్వినీకుమార్, మొదలయినవారు చూపిన మాతృదేశభక్తినీ, కర్జన్‌ప్రభువు చేసిన ద్రోహారంభమునూ కన్నుల యెదుట నిలుపుతున్న యీ కావ్యఖండరచయితకు అనువాదంలో, అనుభవంలో, అభిజ్ఞతలో, ఉపజ్ఞలో, ఉత్సాహంలో ఉన్న మెలకువలనూ, పలుకుల తియ్యదనాన్ని వేనోళ్ళ వెల్లడిస్తున్నది. చదివి ఆనందించండి!

*డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు M.A. Ph. D.,*

హైదరాబాదు

# ఇంగ్లాండ్ ఖండము

శ్రీవీరభద్రమూర్తిగారు నాకు చిరకాలమిత్రులు. ఆయన స్వతంత్రులు అందుచేత కవి. లేకపోతే కవికావడంచేత స్వతంత్రులు. ఈ కావ్యంలో ఈ ఇంగ్లాండు ఖండాన్ని నా కిచ్చి నీవు దీనికి పీఠిక వ్రాయాలి అన్నారు. సరే నన్నాను.

లోకంలో జరిగిన ఒక ఇతివృత్తాన్ని తీసికొని దాన్ని ఛందస్సులో పెడితే అది కావ్య మవుతుందా? అనేది పెద్దప్రశ్న. ఆ యా సంఘటనలను నేను యథాతథంగానే చిత్రించాను సుమా! అని కొంతమంది "ఫుట్‌నోట్సు" కూడా వ్రాస్తారు, మహాకవు లైపోతూర్చుంటారు వాళ్ళు. గతించిన కాలాల్లో జరిగిన చరిత్రలను స్వీకరించి కావ్యత్వ మాపాదింపగల వాళ్ళు వాల్మీకి, వ్యాసుడు ఇద్దరే ఇద్దరు. ఇప్పు డీ వీరభద్రమూర్తిగారు సాహసించి ఈ కాలంలో జరిగిన ఈ చరిత్రను వ్రాస్తున్నారు. దీనికి కావ్యత్వం సంఘటించిందా? లేదా? అనే ప్రశ్నను గురించి విచారించవలసినవారు తక్కిన ఘట్టాలకు పీఠిక వ్రాసేవారు. అదృష్టవశాత్తు ఆ బాధ్యత నాకు అసలే లే దనను గాని చాలా తక్కువ. అది కూడ నేను పక్కకు నెట్టి ఈ ఇంగ్లాండుఖండంలో నేను మెచ్చుకోగల్గిన అంశాన్ని వ్రాస్తున్నాను. ఎందుకయ్యా? అంటే ఇతరులెవరైనా దీని సొగసు తెలిసిన వా ళ్లుండే ఉండవచ్చు. కాని చాలా మందికి తెలియదు. అందుకని చెప్తున్నాను. కొంతమందికి కొన్ని కొన్ని "ప్రిజుడీసెస" ఉంటాయి. ఇందులో అన్నీ ఇంగ్లీషుమాటలే ఏం బావుంది అంటారు. మరి ఇది ఇంగ్లాండు ఖండ మాయె. ఇందులో ఇంగ్లీషు మాటలు లేకుండా వ్రాస్తే ఏం బావుంటుంది? శ్రీనాథుడులాంటివాడు గోదావరీఖండ మైన భీమఖండాన్ని సంస్కృత సమాసాలతో ముంచివేశాడు. శివకవుల తరువాత వచ్చిన ఈ శ్రీనాథుడు తన వరవడిలో తక్కిన కవులను నడిపించినవాడు మరి. వదిలేద్దాం.

ఈ ఇంగ్లాండు ఖండాన్ని మొదటినుంచి చివరిదాకా చూచాను. ఇందులో నున్న చమత్కార మేమి టంటే అసలు కథ అంగుళమంత. ఈతెలుగు దేశంలో గణానికి నలుగురు మహాకవు లున్నారు: వాళ్ళ పేర్లు తక్కినచోట్ల వినపడ్డా వినపడకపోయినా రేడియోమేళాల్లో తరుచుగా వినపడుతుంటాయా! వీరిలో ఎవరికైనా ఈ అంగుళం కథను వ్రాయటానికి ఒక్క గీతపద్యం సరి పోతుంది మహా అయితే. మఱి ఈయన ౨౮౩ పద్యములు వ్రాశాడు. ఈ పద్యా లన్నీ కూడా ఇంగ్లాండుదేశముసంచలి ప్రకృతి రామణీయకముయొక్క వర్ణనమే. ఈ వర్ణనము సొగసంతా అట్లా ఉంచి మొదటినుండి కొనవరకు కథాంశమైన "గోఖ్లే లఖపతిరాయిల" దౌత్యవైఫల్యాన్ని సర్వత్ర వ్యజ్య మానము చేస్తూ ఉంటవి. ఇంత వర్ణనములోను ఈ చిన్న కథాంశాన్ని దుసి కిలించుకొని పోకుండ, పోషించుకుంటూ వ్రాయడం కవియొక్క కావ్యనిర్మాణ మర్మజ్ఞతల నిదర్శన మని చెపుతున్నాను. మొదలు పెడుతూనే వా క్లెక్కిన ఓడ

"తరంగములఁ ద్రోసికొనుచు వేగన్
గమించుచుండె కడగండ్ల నీది ధీరుండు వోలె"

ఈ మాటల్లో వారి దౌత్యం ఎదురునడకలు నడుస్తున దని వ్యంగ్యం. ఇదే చివరి పద్యంలో ప్రతిపాదిత మయింది. ఆద్యంతాలు పొసగించుకొంటూ మధ్యమధ్య పైకి తేలుస్తూ, అంతరనుస్యూతితో వ్యంగ్యం చేస్తూ ఈ కథా భావన కొనసాగుతుంది పూలల్లో దారం లాగా. పూలు, పిట్టలు వాని రం గులు, కూతలు దారాన్ని గుచ్చిన పూలు. తరువాత సముద్రవర్ణనము. ఈ వర్ణన మంతా అందాల కుప్పే. ఈ అందా లన్ని ఎక్కడ విప్పిచెప్పను?

"భువన మను హండలో నీరు పోసి పైని
మంట పెట్టి కాచుచు నుండె కంటపడని
వేడొ, నరు డైనచో క్రిందఁ బెట్టు మంట
మంట దుర్యముణి, నీరంబుధి, పంట మొయిలు"

అసలు ఈ భావమేమిటి? ఈ రచన యేమిటి? ఈ భాష ఏమిటి? కాటూరి వెంకటేశ్వరరావుగారి భాషలో ఐతే "మూడూ పరాభత్తుగా ఉన్నాయి" అని చెప్పాలి. విశ్వనాథ సత్యనారాయణగారి భాషలో నయితే "సుంకుదేరి ఉన్నాయి" అని చెప్పాలి. మరి నీ భాషలో ఏమంటావయ్యా? అంటే, నన్నయ్య గారి పద్యం గుర్తుచేసికొని "మేలు" అంటాను. ఎంతమంది సముద్రాన్ని వర్ణించలేదూ? ఏ కవితీరు ఆ కవిదే అయినా ఈ పద్యం చదివినప్పుడు ఈ వీరభద్రమూర్తిగారు ఇంత కవా అనుకుంటాను.

"శ్వేతముఖుల లండనులక్ష్మి స్పృతబోధ
వీధికూటస్థ వెన్నెల విరివి త్రావి
విరుగబడినవ్వినది తమ్ము నరసి యనుచు
తలచె లజపతిరాయి సందరపు దరిని"

మరల నిచ్చట కథార్థమైన దౌత్యవైఫల్యం స్ఫురిస్తుంది. కాని ఈ వాచ్యార్థంమాటే చూద్దాం. ఇది ఎంత స్వభావ రమణీయముగా నున్నది! ఇంత దూరము ఇన్నిరోజులు సముద్రంమీద ప్రయాణము చేసియున్న వాళ్ళకి ఎంత దూరం చూచినా సముద్రమూ ఆకాశమూ చూచిచూచి అలసిపోయిన వాళ్ళకి ఒక్కమాటు ఒక మహాపట్టణముయొక్క మహోన్నత సౌధసముదాయశోభ కంటికి సాక్షాత్కారము చేయగా ఆ వెన్నెలలో వారి కట్లనిపించుట సహజమే. ఇది వట్టి అలంకార రచన కాదు. "వెన్నెలవిరివి త్రావి" అనుట కవితామయమైన రచన. ఇందు మైరేయము తప్పతాగి ఈ నల్లముఖములను చూచి విరగబడి నవ్వుతున్న ఆంగ్లయువతిమదవిలాసగర్వాతిరేకములు కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నవి.

మరి ఈ కవికి ఇంగ్లాండు దేశములో నున్న పూలతో, పిట్టలతో, చెఱువులతో, పొదరిండ్లతో, పచ్చికబయళ్ళతో తోటలతో, చెట్లతో, కాని సీదలతో, పొగమబ్బులతో, వసంతకాలపుయెండలతో, నదులతో, సెలయేళ్ళతో ఎంత హృదయతన్మయమైన పరిచయం ఉందో చదువుతూ ఉంటే ఆశ్చర్యం

వేస్తుంది. ఈయన చిన్నతనములో 17, 18 ఏళ్ళ వయస్సులో ఊరికే చూసి వద్దా మని ఇంగ్లాండు పోయాడట. అప్పటి అనుభవం ఇదంతా. ఈ 70 ఏళ్ళ వయస్సులో వ్రాశాడు. ఈ మధ్య యాభై ఏళ్ళ కష్టాలు సుఖాలు ఎన్ని వచ్చినా అతిలోకమైన ఆ చిన్ననాటి అనుభవాన్ని ఇంత ప్రత్యక్షంగా దాచు కుని దాచుకుని భావనతో పండించి ఈ ఖండంలో కొలబోశారు. కవిత్వపు మద మంతా వారబోసిన ట్లున్నది ఈ రచన. ఎప్పుడో చిన్నప్పుడు ఇంగ్లాండు వెడితేమాత్రం ఈ పూల పే ర్లెట్లా గుర్తున్నవి? వాటి రంగు లెట్లా గుర్తున్నవి? అరె! ఆ పిట్టలు, వాటి పేర్లు, వాటి కూతలు ఇవ్వన్ని ఎట్లా గుర్తున్నవి. నాకు ముప్పై ఏళ్ళ స్నేహం ఉంటే నాతో ఇంత చను వుంటే ఎప్పుడైనా చెప్పాడా? వీరభద్రమూర్తిగారు. పోనీ సత్యనారాయణగారికి చెప్పాడా? వేంకటేశ్వరరావు గారికి చెప్పాడా? మరి ఇప్పు డెట్లు వ్రాశాడూ అని. దీనికి ఒక్కటే జవాబు. వాడు అసలైన కవి అయితే, వాడికి నిసలైన కవితాహృదయం ఉంటే వాడి చిన్నతనపు అనుభవములలో ఏమిటి! జన్మాంతరపుటనుభవములలో కూడా మునిగిపోతాడు. "తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం భావస్థిరాణి జన నాంతరసౌహృదాని". వీరభద్రమూర్తి విషయంలో "బోధపూర్వం" అవటం విశేషం. అంత కవితా హృదయాన్ని లోపల పెట్టుకొని ఒక పక్కనుండి అందులో మునిగిపోతూ పైకి సామాన్యులతో స్నేహం చేస్తూ వాళ్ళకంటే తక్కువ వాడి నన్నట్లు ప్రవర్తిస్తాడు. ఇట్లా ఎంతసేపు వ్రాయను? ఐనా రెండు మూడు పద్యాలు ఉదహరించి చర్చించకపోతే తృప్తి లేక వ్రాస్తున్నాను.

"తల్లులు కన్న పిల్లలను దాదులు పెంచిన రీతి మాధవ
ప్రోల్లసితాహముల్ కనిన పూలను గ్రీష్మదినాలు పెంచు, సం
పుల్లవిచిత్రవర్ణసుమపూర్ణతటమ్ములు పెంచు ధేనువుకున్
మొల్లము, దాని గొల్లలకి పున్నమ సంజలు రెండు చేటికల్"

పై పద్యంలో మూడు చరణాలు సామాన్యప్రతిభావంతు డైన కవి వ్రాయవచ్చు. "సంపుల్ల... మొల్లము", ఇంతవరకు పద్యములో చెప్పదలచు కొన్న భావ మైపోయినది. పద్యము పూర్తి కాలేదు. ఏమిచేయాలి? ఇట్లాంటివి

ఈ కవే రెండుమూడుచోట్ల పడ్డట్లు కన్పడుతుంది. కొంత గడుసరిగానే దాటుకొని పోయినాడు. సమస్యలు పూరించట మనేది అష్టావధానాల్లో ఒక ప్రక్రియ. ఏదో కొంత కష్టపడి అర్థం లాగితే ఆ సమస్యలు పూరించవచ్చు. ఇక్కడ సమస్యతీరే వేరు. భావం అయిపోయింతరువాత పై పద్యరచనదర్జా చెడకుండ ఆ భావాన్నే తెగ సాగదీయకుండా పద్యాని కంతకీ తళుకు వచ్చేటట్లుగా ఆ భావం లోనే ఇమిడి పోయేటట్టుగా పూరించాలి.

"దాని గా స్తుతికి పూన్పును సంజలు రెండు చేటికల్" ఇక్కడ పై గుణా లన్నీ ఉండటమే కాదు. భావాన్ని సొగసుగా అలంకరించాడు కవి. ఈ మాట అంటే నా అభిప్రాయ మంతా చెప్పినట్లే కాని కొంతమందికోసం కొంత వివరి స్తాను. ఇది అచ్చమైన ఆంగ్లకవితాభావమును తెచ్చి దానికి తెనుగుతనాన్ని ఆపాదించటం. అంటే ఆ థేమ్సునది రెండు గట్లూ పూలతో నిండి ఉంటే, దాని నీళ్ళమీద, ఆ పూలమీద, ఎదమసాయంసంధ్యారాగకోభ పడుతూ ఉంటే, ఆ దృశ్యము ఆ నది పూలగౌను తొడుక్కున్నట్లుగా నున్నది. అది ఇంగ్లీషునది. కాబట్టి గౌను తొడుక్కోవటం. రెండు తటములు రెండు చేతులు. నీటి భాగము తక్కినగౌను దాని తళుకు సంజకాంతిలో ప్రకాశిస్తుంది కాబట్టి సంజలు చేటికలు. అదీ కల్పనలోని వైచిత్ర్యము.

"గొడుగున్ బట్టినయట్లెవృతము పొసంగున్ "మేరి సైంటుపైను", నా
అడుగుల్ వెండియు నేబదిన్ పొడుగు దీపారాధనాశాఖలన్
వెడగా స్తంభము బాదరించునది "నార్వేమ్సూప్రిను", నిల్వెల్లవూ
తొడుగే తెల్లని 'ఫీము', సృష్టి పరమాత్మున్ గొల్చు నెందేనియున్."

"సృష్టి పరమాత్మున్ గొల్చు నెందేనియున్" అనునది పిండితార్థము. తక్కిన పద్యమునందలి అలంకారరచన వచ్చి దీనిలోనికి గ్రుచ్చుకొంటున్నది. ఇది అలంకారంచేత అలంకారాన్ని అలంకరించుట. ఇది భావంలోని సొగసు. భావం వేరు భాసన వేరుగా చూచినగాని ఈ రచన సొగసు తెలియదు. మరి "మేరిసైంటుపైను" "నార్వేస్ప్రూసు" "ఫీము" ఈ వృక్షముల యొక్క సౌంద ర్యవైవిధ్యమును ఏకత్రావస్థానముగాచేసి భావచిత్రమును చేయటం ప్రతిభా లక్షణం.

"సాలము నుండి దూకి. .............

ఘృణు లుజ్జ్వలింపగా''

నీళ్ళల్లో పూల వాసన ఈతలు కొట్టుతున్నదట. అంటే ఆ వాగ్రచన దానిఅంతట అది చాలా అందంగా ఉందనుకోండి. చుట్టూరా చెట్లనిండా పూలు బాగా వికసించి ఉన్నాయి. ఆ పూలు రాలి ఆ సువాసనతో నీళ్ళు ఘుమఘుమలాడుతున్నాయి. ఆ అనుభవం ఆ భావానికి పునాది. దానిపైన వచ్చిన ఉత్ప్రేక్ష కవితా భావం. ఇన్ని కలిసున్నాయి దాంట్లో. ఇది ఆట్టిపెట్టి ''బజ్జెరిగా''రనేచిల్కా ఉందట. దాని అందం వర్ణిస్తాడు చూడండి. ఎందుకు? చివరి చరణమును వ్రాసి వెనుక చరణముల భావమును అలంకరించటానికి. ఇది సర్వాంధ్రమహాకవుల త్రోవ. అది సమాసములో చేయటం. ఆ సమాస మంత సుంకుతేరి ఉండటం. ఈ కవి తప్ప మరి యొక డెవడూ ఈ ఖండా న్నిట్లా వ్రాయలేదు. ఇట్లు ప్రతిపద్యాన్ని ఉదాహరించి చర్చించవచ్చు. ఈ ఖండం ఇంగ్లీషులో వ్రాస్తే దానికి మంచి ప్రశస్తి వస్తుంది. ఇంగ్లీషువాళ్ళే ఆశ్చర్యపోతారు అని నా నమ్మకం.

—:0:—

అముద్ర

శ్రీముదిగొండవీరభద్రమూర్తిగారు చాలా విలక్షణమైన కవి. నేనూ, ఆయనా చాలా కవిసమ్మేళనాలలో పాల్గొన్నాము. ఆయన పాటించిన ఛందస్సులో రాసినా, ఆధునికులను కూడా ఆకట్టుకోగలరు. ఆయన ఈ మధ్య వచన కవిత్వం కూడా వ్రాస్తున్నారు. ఈ గ్రంథాదిన ఉన్న హృదయంగమం చదివితే, అది ఎవరో పైలాపచ్చీసులో ఉన్న కవి వ్రాసినట్లు కనబడుతుంది, లేక వినబడుతుంది. శ్రీముదిగొండవీరభద్రమూర్తిగారు ఇంటిపేరులోనే ముదిమి ఉన్నవారుగాని, పద్యంలో పడుచుదనం ఉన్నవాడు. గాత్రం అన్నది శరీరానికి, కంఠానికి సమానంగానే వాడుతారు. వీరి ఒక గాత్రం అంతంత మాత్రం-రెండవది-అక్షరాలా క్షేత్రం. అందులో ఉన్న రాణనం వినవలసిందే-

ఇది వందేమాతరం అనే కావ్యం. ఇది నేను సంపూర్ణంగా చదవలేదు. ఇందులో ఇంగ్లండు ఖండం అనే భాగాన్ని మాత్రమే నాకు కవిగారు ఇచ్చారు. ఆయన ఉద్దేశంలో అన్నమంతా చూడాలా ఒక మెతుకు చూస్తే చాలదా అన్నట్లు నాకు ఇచ్చినట్లున్నారు. నేనుకూడా కడదాకా చూడాలా కొంత చూస్తే చాలదా అని చూశాను. చూసినంతదానిలో, వీరి వాడి కనబడుతూనే ఉంది.

సమగ్రాంధ్రసాహిత్యం రచించడానికి ఆంధ్రసాహిత్యలోకంలో దొరికి నన్ని గ్రంథాలు చదివినట్లు చదివిన నేను ఏ గ్రంథమైనా తననుతాను చదివింపు కోకపోయినా, ప్రతిపద్యం చక్షురక్షరసంయోగం చేసి మరీ చదివాను. ఏ పుట్టలో ఏ పాముందో అన్నట్లు ఏపద్యంలో ఏభావం ఉందో అని ప్రతిపద్యం చదివాను. కొన్ని ప్రబంధాలు చదివినప్పుడు నాకు కలిగిన బాధ ఈ కావ్యం చదివినప్పుడు నాకు కలగలేదని చెప్పడానికి సంతోషిస్తున్నాను. సంపూర్ణకావ్యం

చదవందే పరిపూర్ణ మైన అభిప్రాయం ప్రకటించటం నా అభిమతం కాదు. అయినా ఒకానొక పర్వం నా చేతి కిస్తూ శ్రీమూర్తిగారు చెప్పిన కొన్ని విషయాల వల్ల ఈ పర్వంలోని కృషి నా కర్థమైంది. ఆంధ్ర దేశపు అరుగులపై కూర్చుని, ఊహాగానంలో ఈయన ఇంగ్లాండును వర్ణించలేదు. కథాకాలం నాటి ఇంగ్లాండును కన్నులారా చూసి కథకు కావలసినంత కవిత్వాన్ని వాడుకొంటూ కథనం చేశా డీయన. ఇది ఆయన చిత్తశుద్ధికి తార్కాణం. నేను కాంగ్రెస్ కుటుంబంలో పుట్టి, ఖద్దరు పొత్తిళ్ళలో పెరిగినవాణ్ణి. దాస్యంలో పుట్టాను తిరుగుబాటులో పెరిగాను. స్వాతంత్ర్యంలో రొమ్ము విరిచాను.

ఈ కావ్యంలో కథ బహుశా నా కథే కావచ్చు.

కళాప్రపూర్ణ
డా॥ దాశరథిగారు, D.Litt.
(ఆంధ్ర ప్రదేశ్ ఆస్థానకవి)

## బెంగాల్ ఖండము

# మనీషిరసము

పూజ్యులు, మహాకవులు శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారి కవితాదీప్తి దశదిశల వ్యాపించినది. ఆంధ్రసాహితీ లోకంలో వారి కవితాస్వాదన చేయని వారు అరుదు.

ఈ ఆధునికయుగమున కథాకావ్యములు తక్కువగానే వస్తున్నవి. కథానికాప్రక్రియ విడివడిపోవడంవల్ల కవితలో కథ తగ్గిపోయింది.

అయినా తుమ్మలవారి మహాత్ముని ఆత్మకథ, గడియారంవారి 'శివభారతము,' మధునాపంతులవారి 'ఆంధ్రపురాణము' ఇంకా ఎన్నో వెలువడి సాహితీరంగంలో చక్కని స్థానం ఏర్పరచుకున్నవి.

అట్లే శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారి "వందేమాతరం" మహాకావ్యం కూడా అగ్రశ్రేణికి చెందిన కథాకావ్యం (*Narrative Poem*).

భారతస్వాతంత్ర్యసంగ్రామగాథ ఆధారంగా శ్రీ వీరభద్రమూర్తిగారు వందేమాతరకావ్యరచన చేశారు. ఇందులోని "బెంగాల్ ఖండము" ఈ కావ్యమునకు అయువుపట్టు.

బెంగాల్ అనేసరికే మన హృదయాలు జలదరిస్తాయి, తనువులు పులకరిస్తాయి. మన స్వాతంత్ర్యోద్యమంలో బెంగాల్‌కు ప్రముఖస్థానమున్నది. వంగీయులు త్యాగశీలురు. ఉద్రేకవంతులు, సమరమున దిట్టలు. ప్రపంచప్రఖ్యాతి నార్జించిన సుభాస్‌చంద్రబోసు వంటి మహావీరులు అక్కడ ఉద్భవించారు.

"వందల్ వేల్ ప్రకటనంబరంబులు రగుల్పన్ జ్వాలకజ్వాలతో
వందేమాతర మంచు భారతిని నివ్వాళించు మీ హారతిన్
సంధృష్యత్ప్రభుతంత్రయంత్రవప్రతిజ్ఞాయజ్ఞ పూర్ణాహుతిన్
వందిపన్దగు వర్ణమాల యిరవొందన్ లేదు వంగప్రజా!"

అని వంగప్రజను ప్రశంసించారు వీరభద్రమూర్తిగారు. అసలు వందేమాతరగీతమును మాకిచ్చిన మహనీయుడు వంగీయుడు; మేధావులు; శూరులు, కళాకారులు, కవిశేఖరులు, కవితా, కథా, నవలారచనాధురీణులెందరో అవతరించిన వంగభూమి భారతజాతికి గర్వకారణ మైన ప్రాంతము.

"సభలు మీవి వజ్రాయుధప్రభలు కల్క-
టా మొదల్ కడపల్లెకుటాల దాక
నాసురేంద్రవహీంద్రము దేశభాగ
ధేయరంగీయులార! వంగీయులార!"

వీరభద్రమూర్తిగారి పద్యాలు వజ్రాయుధప్రభల వలె నాకు కనిపిస్తాయి. వంగీయులన "వంగకులు" లొంగకులు అనడం ఎంతో సమంజసంగా, చమత్కార భాసురంగా వున్నది.

ఇంతకీ, పద్యరచనకు కాలదోషం పడుతున్న కాలంలో వీరభద్రమూర్తి గారు క్లిష్టసాధ్య మైన పద్యకావ్యరచనకు పూనుకోవడం ఎంతైనా మెచ్చుకో దగినది నేను పద్యపక్షపాతిని. అయితే కేవలం పద్యాన్ని పట్టుకొని వేలాడా లనే చాదస్తం నాకు లేదు. కాని వీరభద్రమూర్తి గారి పద్య రచనారీతికి మురిసి పోతాను. పద్యాలలో చెప్పరాని దంటూ వుంటుందా అనిపిస్తుంది వీరభద్రమూర్తి గారి "వందేమాతర" కావ్యం చదువుతుంటే.

"వంగం బొక్కటియౌనుగాక! భరతాంబాశృంఖలాల్ రెండుగా
కంగీభూతకఠార మైన దిటు మార్తాండుం డటుం బొడ్చువన్
భంగం బొందదె అస్మదుద్యమము, యంత్రాగార మాంగ్లావనిన్

భంగింపంబడు, నొయ్యనన్ ప్రభుతతంత్రాగార మాంగ్లావనిన్ ఇలాటి పద్యాలు కంఠగలవి, గుండెనుకదలించగలవి "బెంగాల్ ఖండము"లో ఎన్నో వున్నాయి.

వంగభూమి రెండుతునకలగుటను భరించలేని ప్రజలు కావించిన పోరాటమును కన్నులకు కట్టినట్లు వర్ణించారు వీరభద్రమూర్తిగారు ఈ 'ఖండం'లో.

వీరభద్రమూర్తిగారి ప్రౌఢరచనారీతికి ఈ ఖండములోని

(1)'ఉదయించెన్ దినరత్నబింబము'—

(2)'ఉదితుం డర్యము డయ్యె'...

అన్న పద్యాలు చాలు. శ్రీనాథాదులను జ్ఞప్తికితెచ్చు శైలి వానిలో కనిపిస్తుంది

తద్భిన్నమైన చల్లని శైలి మరొకచో కనిపిస్తుంది:-

"తోయజాప్తు బండి తూరుపువల్లమ్ము
నుండి మిట్టు లెక్కె నుద్ధతమున;
కూర్చొనిన నియంత కుంటివాడని మన
కెట్లు తెలియు? రథి వచించకున్న?"

రసజ్ఞులను పులకింపజేయు పద్య మిది.

రవీంద్రుని ఒక సుప్రసిద్ధకవితను ఈ ఖండములో వీరభద్రమూర్తిగారు గేయరూపమున అనువదించారు.

"మేలుకొలుపుము నా దేశమును,
మేలుకొలుపుము నా తండ్రీ!"...

"విశాలభావాచరణాభ్యుదయనవీనసుపథమున హృదయమున్ ఎవటనీవు నడపింతువో! అచటికి స్వామీ! అచటికి ఆ స్వేచ్ఛాస్వర్గమ్ములోనికి"

వీరభద్రమూర్తిగారు అన్యభాషాపదములయెడ మక్కువ చూపి చక్కగా ప్రయోగించిన ఘట్టము లున్నవి:-

"బల్బులు," "బిజిలీ" మున్నగు పదాలు వీరి పద్యములలో మనోహరముగా ఒదిగిపోయినవి.

వీరభద్రమూర్తిగారే ఒకచోట అన్నట్లు "కావ్యజీవమ్ము మషిరసమ్ము కాదు మనీషిరసమ్ముగాని"

"మనీషిరస" భరిత మైన బెంగాల్ ఖండము వందేమాతరమహాకావ్యమునకు ఆయువుపట్టనుట అతిశయోక్తికాదు.

*Sri Bijoy Kumar Sinha*

**Colleague of sardar Bhagat singh**

# ఉద్యమఖండము

# Udyama Khandam

All true historians of our country's freedom struggle do now recognise that there were to streams- one that originated earlier in 1857 as the Indian Revolutionary Movement and the second that was born in 1885 with the starting of Indian National Congress.

Recognising this approach the author of this volume of narrative in verses, has rightly composed poems under seperate headings related to different phases of the two movements.

The 'Khandam' that follows deals with the inspiring story of the phase of revolutionary movement that is popularly known as one of struggle against Bengal Partition. The unique character of its methods was the combination of the open and secret wings. Publicly defending the authorities, militant journals propagated the mission of liberation in terms of national values. An intensive campaign for use of swadeshi goods was organised from village to village. Aurobindo Ghosh, as pioneer, formulated a comprehensive programme, including education, physical and spiritual culture, and use of swadeshi goods. As Shri R. R. Diwarkar's biography of Aurobindoi shows, it was almost the programme put forward by Gandhij in 1921.

At the head of secret movement was Barindra Ghosh who declared in Alipore Bomb case, as the Chief accused, that they were not 'terrorists' believing that their goal of

Indian Independence could be achieved by only the killing of a few Europeans. The revolutionaries stood for organising a countrywide revolution for ending the alien British rule in India and establish a government of the common people.

There were echos of the movement in other regions in the country including in Andhra and in Hyderabad state of those days. The author has done well in referring to this fact.

It may be noted that these revolutionaries worked as political sannvasis and their battle-cry was Vandemataram. For them no sacrifice was too great for breaking the chains of their mother goddess - the enslaved vast dear land that had been once their own and free politically. During these days the martyrs mounted the gallows with smiles on their faces, uttering their last words- "Vandemataram".

# అనువాదము

మన దేశస్వాతంత్ర్యసమరంగూర్చి వ్రాసిన చరిత్రకారులలో యథార్థ వాదు లందరూ యీ సమరంలో రెండుశాఖ లున్నా యని గుర్తించారు. మొద టిది 1857లో భారత విప్లవ ఉద్యమంతోనూ, రెండవది 1885లో భారత జాతీయ కాంగ్రెసు స్థాపనతోనూ ఆరంభ మయ్యాయి.

ఈ విషయాన్ని యీ కవిగారు. కూడా గుర్తించారు అందుకే ఆయన యీ రెండు ఉద్యమాలకు సంబంధించిన సంఘటనలను రెండు వేర్వేరు కావ్యా లుగా రచించారు.

వందేమాతరం కాలంలో బెంగాలు విభజనకు వ్యతిరేకంగా సాగిన మహో ద్ధృత ఉద్యమం వర్ణించబడింది. ఈ ఉద్యమంయొక్క ప్రముఖలక్షణం బహిరంగ, రహస్య విభాగాలు రెండూ కలిసి పోరాటంలో పాల్గొనటం. అది

కారుల ఆంక్షలను లెక్కచేయకుండా ఆనాటి విప్లవపత్రికలు జాతీయ లక్ష్యాలకు అనుగుణంగా విముక్తి ఉద్యమాన్ని ప్రబోధించాయి. స్వదేశీ వస్తువ వాడకాన్ని ప్రోత్సహించే ఉద్యమం గ్రామగ్రామాన వ్యాప్తి పొందింది. ఈ ఉద్యమానికి మూలపురుషు డైన అరవిందఘోష్ ఒక సమగ్ర కార్యక్రమాన్ని రూపొందించినారు. దీనిలో విద్యావ్యాప్తికి, శారీరక, మానసిక, సాంస్కృతిక ప్రోత్సాహానికి, స్వదేశీఉద్యమానికి ప్రాధాన్యం యివ్వబడింది-శ్రీ ఆర్.ఆర్. దివాకర్. తాను వ్రాసిన అరవిందఘోష్ జీవితచరిత్రలో పేర్కొన్నట్టు, 1921లో. గాంధీజీ ప్రవేశ పెట్టిన కార్యక్రమానికీ, అరవిందఘోష్ సూచించిన కార్యక్రమానికీ ఎన్నో విధాలుగా పోలికలున్నాయి. అప్పటి రహస్య ఉద్యమానికి అధినేత బరీంద్రఘోష్. అలీపూరుబాంబుకేసులో ప్రధానునిందితు డైన బారీంద్ర కొద్దిమంది తెల్లవారిని చంపడంద్వారా భారతస్వాతంత్ర్యాన్ని సాధించగలుగుతా మని తమ విశ్వాసం గా దని ప్రకటించాడు. దేశమంతటికి వ్యాపించే విప్లవం ద్వారా విదేశపాలనను అంతం చేసి సామ్యవాద ప్రజాప్రభుత్వాన్ని స్థాపించటం ఆనాటి విప్లవవాదుల ధ్యేయం.

ఈ ఉద్యమం ప్రభావం ఆంధ్రదేశం, హైదరాబాదురాష్ట్రంతో సహా దేశంలోని యితర ప్రాంతాలమీద కూడా ప్రసరించింది. ఈ విషయాన్ని రచయిత చదువరుల దృష్టికి తేవటం హర్షించ తగినది.

ఈ విప్లవవాదులు 'వందేమాతరం' అనే నినాదంతో రాజకీయసన్యాసులుగా దీక్షతో పనిచేశారు. దాస్యబంధనాలలో వున్న తమ మాతృదేశాన్ని, ఒకప్పుడు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను అనుభవించిన మాతృభూమిని, తిరిగి బంధ విముక్తం చేసే మహాయజ్ఞంలో ఎంతటి త్యాగానికైనా వారు సిద్ధమైనారు. ఆ రోజులలో యీ దేశభక్తులు చిరునవ్వులతో, వందేమాతరం నినాదంతో ఉరికంబ మెక్కారు.

శ్రీరావూరు వేంకట సత్యనారాయణరావుగారు
(జర్నలిస్టు)

వార్తాపత్రికలు- పికెటింగులు:-

కలకతా కాంగ్రెసులో 'దాదాభాయి నౌరోజీ' స్వరాజ్యం అనే వాక్యాన్ని బయటకు తెచ్చారు అదే నినాద మైంది. ప్రబోధ మైంది. కాంగ్రెసు వారం దరికీ పాంచజన్య మైంది అప్పటినుండి జాతీయతకు ప్రాధాన్యం వచ్చింది, కాని ఎక్కడునుంది జాతీయత? సంపాదించాలి. జాతీయ సంస్థలు స్థాపించాలి. ఆ కార్యక్రమం ప్రారంభ మైంది. జాతీయవిద్యాశాలలు ఏర్పాటుచేశారు- వంగజాతీయవిద్యాపీఠం ఏర్పడింది. 1905 ఆగస్టు ఐదవ తేదీనాడు విదేశీవస్తుబహిష్కారణోద్యమం వెనువెంటనే ప్రారంభమైంది. దీని ననుసరించి స్వదేశీ వస్త్రాల ఉత్పత్తి కార్యక్రమం, విదేశీ వస్త్రాలను, వస్తువులను అమ్మే అంగళ్ళ పికెటింగులు ప్రారంభమైనాయి. అగస్టు 7వ తేదీ అప్పటి నుంచి గొప్ప పవిత్ర దినంగా పరిగణింపబడుతూ వచ్చింది.

అక్షర శక్తి- ఆయుధ శక్తి:

ఈ ఉద్యమ ప్రచారానికి పత్రికలు ఎన్నో సాహసించి బయలువెడలటం ప్రారంభించినాయి. 'బ్రహ్మబాంధవ్ ఉపాధ్యాయ' సంపాదకత్వాన "సంధ్య", "భూపేంద్రనాథ దత్త' సంపాదకత్వాన "యుగాంతర్", 'అరవిందు'ల నాయకత్వాన "వందేమాతరం" పత్రికలు చంద్రనిప్పులు చెరిగిపోసినాయి. కాని ప్రభుత్వం అతితీవ్రమైన చర్యలతో వాటిని అణిచివేసింది. అక్కడ అరవిందులను అరెస్టుచేసిన సమయంలోనే మహారాష్ట్రంలో 'బాలగంగాధర్ తిలక్' ను, ఆంధ్రదేశంలో 'గాడిచర్ల హరిసర్వోత్తమరావు' గారిని అరెస్టు చేశారు. అటు

తర్వాత అక్షర యుద్ధంలోనుంచి ఆయుధసమరం తలయెత్తింది. అక్కడ క్కడ తెల్లవారిని ప్రతవధ చేయడం జరిగింది. దీనికి గాను బాంబులు ప్రయోగించారు. ప్రాణాలకు ఆశ వదిలి భరతమాతవిముక్తికోసం విప్లవాగ్ని కాల్పులు ప్రజ్వలింపచేశారు.

"మురళీధరుడు కాదు- మురారి"

ఈ సందర్భంలో 'బిపిన్ చంద్రపాల్'దేశసేవను గమనించాలి. "న్యూ ఇండియా"పత్రికద్వారా ఆయన భారత జాతిని మేల్కొల్పారు. జాతీయుతా,జాతీయవిద్యావిధానం, జాతీయసంస్కృతి ఈ అంశాలపైన శ్రీపాల్ ఎన్నో రచనలు చేశారు. ఎన్నో గంభీరోపన్యాసా లిచ్చారు. ప్రఖ్యాత పత్రికాధిపతి శ్రీ 'ముట్నూరి కృష్ణారావుగారు' వంగభూమికి పరుగుతీసి, పాల్ గారితో కొంతకాలం సంచరించి వారిని వెంటబెట్టుకొని 1907లో ఆంధ్రదేశానికి తీసుకువచ్చారు. రాజమహేంద్రవరంలో పాల్‌గారిచ్చిన గభీరోపన్యాసం విని ఆ నగరవాసులు పులకితులై వెంటనే ఒక జాతీయ విద్యాసంస్థను నెలకొల్పారు. పాల్‌గారు తరువాత మచిలీపట్నం వచ్చారు. అక్కడ జాతీయ కళాశాల ఏర్పాటు చేయడానికి వారి రాక కారణం. అది ఈ భారతదేశమంతటా ప్రఖ్యాతి గడించింది. అటుతర్వాత కృష్ణా పత్రిక సంపాదకత్వం వహించి శిలాన్ని దూసిన కత్తిగా, బిటన్ వొత్తడానికి సిద్ధపరచిన పిస్తోలుగా తయారు చేశారు. కృష్ణారావుగారిలో తీవ్రత, ధైర్యం, దేశాభిమానం, విప్లవజ్వాలా మేల్కొల్పింది శ్రీ బిపిన్‌చంద్రపాల్‌గారే!

కృష్ణారావుగారు బిపిన్‌చంద్రునితో కలిసి సంచరిస్తున్నప్పుడు పాల్‌గారి భీకరం జాతి ఒకసారి ఎలా పలికిందో తెలియచేసే చిన్నసంఘటన ఇక్కడ పొందుపరుస్తాను. ఇరిద్దరు హూగ్లీనదిలో పడవలో ప్రయాణం చేస్తున్నారు. సంధ్యవేళ అయింది. పడమటి దిక్కు ఎర్రబడింది. మలయమారుతం వీస్తోంది. హూగ్లీనది అలలు సరిగమలు వినిపిస్తున్నాయి. ఆ సుందర ప్రకృతిని చూచి కృష్ణారావుగారు పరవశులై "అదుగో! మురళీధరుడు- సంధ్యవేళ మధురగానాలు వినిపిస్తున్నాడు. ప్రకృతి ఆ రాగాల తూగుటుయ్యాలలో వూగుతోంది" అన్నారట. పాల్‌గారు 'అవు' అని కేక పెట్టారు. కృష్ణారావుగారు పాల్‌గారి వంక చూసి ఎందువల్లో! అందామనుకొంటున్నారు. ఇంతలో పాల్‌గారు గంభీర

స్వరంతో "మనకు (దేశానికి) ఇప్పుడు కావలసింది మురళీధరుడు– మురారి! దానవసంహారి'' అని కేక పెట్టారట. కృష్ణారావుగారు అవునన్నట్లు తల పంకించారు. అదీ ఆనాటి పాల్‌గారి ఆవేశస్వరూపం. అది వారినుంచి కృష్ణారావుగారు అందుకున్న విప్లవ సందేశం.

''బందరునతెన్గు.... కల్కటాన్ వంగ భాష"

వంగభూమి నుంచి స్వదేశోద్యమం పలుతావుల్లోకి ప్రాకిపోయినా ముందుగా ఆంధ్రదేశంలోకి పరుగెత్తుకువచ్చింది. అందులో బందరులో స్థిరమైన నెలవు సంపాదించుకొంది. జాతీయకళాశాలకృష్ణాపత్రికలు రెండు స్వాతంత్ర్యజ్యోతులుగా వెలుగ నారంభించాయి. అందుకే వీరభద్రమూర్తి గారీ కాంతలో బందరులో చెలరేగిన ఉద్యమప్రభావాన్ని వర్ణిస్తూ

"బందరున తెల్గు
కల్కటాన్ వంగ భాష"

అన్నారు యెంతో పొందికగా. "వందేమాతరం"ఉద్యమం భారతావనిలో ప్రతిగళం నుంచీ వినిపించింది. కోటానకోట్ల కంఠాలు విప్లవశంఖాలై వినిపించాయి– దూరదూరాలకు తీరతీరాలకూ! బంకించంద్రుని వందేమాతరం వెలుగులోకి రాక ముందు చాలామంది దేశభక్తులు స్వాతంత్ర్య గీతాలు వ్రాశారు. 1858లో 'రంగలాల్ బంధోపాధ్యాయ' తన 'పద్మిని'ఉపాఖ్యాన్‌లో ఒక గేయం వ్రాశారు. "స్వాతంత్ర్యం లేని కారుచీకటిలో ఎవడు జీవించ కోరుతాడు! ఎవడు తన కంఠానికి దాస్యశృంఖలాలు చుట్టుకొని జీవించకోర్తాడు" అనే భావాలు ఈ గేయంలో గోచరిస్తాయి. 1872లో 'హేమచంద్రబంధోపాధ్యాయ' తన''భారత్ సంగీత్'లో ఒకజాతీయగీతం వ్రాశాడు గళమెత్తి పాడవోయి భారతీయుడా! ఈ పాట గగన మంటగ పాడవోయి. ప్రపంచమంతా స్వాతంత్ర్యవాయువులు పీలుస్తోంది. ఇంక నిద్రలోనే మునిగి వుంది భారతదేశం" అనే భావంతో వ్రాసిన ఈ పాటలో ఎంతో ఆవేశం గొప్ప సందేశం ఉన్నాయి. రవీంద్రుని పెద్ద అన్న సత్యేంద్రనాథ ఠాగూర్ ఒక గేయం వ్రాశాడు. ''భారత పుత్రులుగా అంతా ఏకం కండి! ముక్త కంఠంతో భారతమాతకీర్తిని ఉగ్గడించండి" అనేది ఈ గేయంలో పల్లవి. 1867 చైత్రమేలాలో ఈ గేయాన్ని

నవగోపాల్ మిత్రా పాడారు. తర్వాత అనేక మార్లు మేళాలో ఈ గేయం పాడి ప్రజల్ని ఉద్రేకపూరితుల్ని చేయడం జరిగింది. చాలా మంది ఈ గేయాన్నే ప్రథమ జాతీయగీతంగా వర్ణించారు. అన్నిటికంటె ఆశ్చర్యకరమైన విషయం 'బంకించంద్రిదే' దీన్ని జాతీయగీతంగా చేయాలని సిఫార్సు చేశారు.

తర్వాత బంకించంద్రుని 'వందేమాతరం' బయటకు వచ్చింది. 'ఆనంద్ మఠ్' రాయక ముందే ఈ గేయాన్ని బంకించంద్రుడు వ్రాశాడని చెప్తున్నారు. ఇది 1875లో జరిగివుంటుందని అంచనా. నిజానికి ఆనంద్‌మఠ్ నవలకు ఈ గేయానికి సంబంధం లేదు. వ్రాసివుంచిన గేయాన్ని బంకించంద్రుడు ఆనంద్ మఠ్‌లో 'సంతానుల' నోట పాడించాడు. ఈ గేయానికి ప్రసిద్ధసంగీత కారుడు 'జాదుభట్ట' చేత స్వర కల్పన చేయించాడు రచయిత. ఈ గేయంలో వంగ సంస్కృత పదాలు చక్కగా మలచడంవల్ల చక్కటి నడక వచ్చింది. సంగీతం ఒక క్షణం హృదయాలను కదిలిస్తుంది.- మరో క్షణంలో ఉద్రేక పరుస్తుంది.

మహాకవి నోట వందేమాతరం పాట:-

బంకించంద్రమహాశయుడు ఆనందమఠంలో ఉటంకించిన గేయం చాలా కాలానికి జాతీయగీతంగా మారింది. భవిష్యత్తులో ఈ గేయం చరితార్థ మవుతుందని ఆయన భావించే వుంటారు. ఆయన కలలు ముప్ఫైసంవత్సరాల తర్వాత పండినాయి. 1905లో బెంగాల్ విభజన సందర్భంగా ఈ గేయం ప్రచారంలోకి వచ్చింది. పన్నెండవ అఖిల భారత కాంగ్రెసు మహాసభ 1896లో కలకత్తాలో జరిగింది. ఆ సభలో రవీంద్రకవిచంద్రు లీ గేయాన్ని చదివి సభికుల్ని హర్ష పులకితుల్ని చేశారు. విభజనోద్యమం సందర్భంగా 1906లో కలకత్తాపుర మందిరంలో జరిగిన మహాసభలో వందేమాతరం గానం చేయబడింది. విభజనను ప్రతిఘటిస్తూ వంగ రాష్ట్రవాసులు ఒకరిచేతికి ఒకరు దీక్షాకంకణాలు కడుతూ "వందేమాతరం" అని నినాదాలు చేశారు. ప్రభుత్వం ఈ పాటను సభలలో, సమావేశాలలో పాడరాదని నిషేధించింది. ఆనందమఠం నవలలో ఒకపాత్ర మరణిస్తూ "వందేమాతరం" అని కేక పెట్టాడు. స్వాతంత్ర్యవిప్లవమహాసంగ్రామంలో ఎంతవుంది వీధులలో పోలీసుల లాఠీదెబ్బలకు గురి అవుతున్నప్పుడు "వందేమాతరం" కేకతో తమ త్యాగాన్ని ప్రదర్శించారు. ఎందరో ఈ నినాదంతో

మాతృమూర్తికి రక్తతర్పణం చేశారు.

దేశంలో వందేమాతరం వాలంటీరు దళాలు ఏర్పడ్డాయి. స్వదేశీఉద్యమానికి సంబంధించిన ఊరేగింపులలో వందేమాతరంగీతం మిన్నుముట్టుతూ వచ్చింది, పికెటింగ్‌లవద్ద సైతం ఈ పాటే వినిపించింది కోటి గొంతుకలతో. బిపిన్‌చంద్రపాల్ "వందేమాతరం" పత్రికను స్థాపించి మరింతగా ప్రజల్ని ఉద్రేకపరిచారు.- అనుపమానమైన త్యాగానికి ఉద్యుక్తుల్ని చేశారు. బిపిన్ చంద్రుడు అరవిందుడు వందేమాతరంగేయాన్ని ఒక మంత్రంగా పేర్కొన్నారు. ఇది కేవలం శబ్దాడంబరమే కాదు ఒక విచిత్రశక్తి అని ఉద్ఘాటించారు "వందేమాతరం ఒక అద్భుతమైన చిత్రణ మాత్రమే కాదు- పరమ పవిత్రమైన జాతీయ వాంఛ తిరిగి పూర్ణత్వాన్ని పొందద మనే సత్యానికి చక్కటి నిదర్శనం" అని పేర్కొన్నారు. స్వదేశీ ఉద్యమంలో హిందువులతో పాటు ముస్లిములు కూడా గొంతుకలిపి గేయాల్ని పాడటం ఒక అద్భుతపరిణామం. తర్వాత 1950లో కాంగ్రెసు స్టీరింగ్ కమిటి "జన గణ మన" గేయాన్ని జాతీయ గీతంగా అంగీకరిస్తూ "వందేమాతరం"లోని ముందుమూడుచరణాలతో కూడిన గేయాన్ని కూడా అదే స్థానంలో వుంచి గౌరవించా లన్నారు. రాజ్యాంగ నిర్మాణ మహాసభలో డా॥ రాజేంద్రప్రసాద్ రెండింటిని బలపరిచారు. ఈ ఉత్తమమైన గేయాలు రెండు వంగరాష్ట్రం నుంచి ఆవిర్భవించాయి.

**జాతీయ గీతంగా మారింది:**

"జనగణమన" జాతీయ గీతంగా ప్రసిద్ధి చెందింది. నేతాజీ ఆజాద్ హిందూ ఫౌజు తొలుతగా జనగణమనగేయాన్ని జాతీయగీతంగా స్వీకరించింది. కాని వందేమాతరం గేయం స్వదేశీ ఉద్యమంలో చొరబడి అతిగా ప్రచారంలోకి వచ్చి అనేకమంది వీరుల నోట వినబడి, ఉద్యమాన్ని వందేమాతరంఉద్యమం గానే మార్చి వేసింది.

మన మిప్పుడు శ్రీ చుదిగొండ వీరభద్రమూర్తిగారు రచించిన "వందేమాతరం" మహా కావ్యంలోని ఉద్యమ ఖండాన్ని పఠించబోతున్నాం. మూర్తిగారి ఆత్మలో భారతదర్శనం ప్రతిబింబించింది. ప్రతి ఘట్టాన్ని చక్కటి రంగులతో మెత్తటి కుంచెతో చిత్రించారు. వీరిలో కవిత్వపు రంగులతోపాటు దేశభక్తికి సంబంధించిన అద్భుత స్పందన గోచరిస్తుంది. వందేమాతరంవంటి కావ్యాన్ని

పద్దెనిమిది కాండల్లో చిత్రించడం అలతి కార్యం కాదు. పండి వారిగిన కవి హృదయాలకే సాధ్యం ఈ కావ్యం. మూర్తిగారి రచనలో రమ్యత గోచరించి ఇది చరిత్రాత్మక మైన రచన అనే సత్యాన్ని మాటుపరిచింది.

వందేమాతరోద్యమదృష్ట్యా వంగదేశానికి ఆంధ్ర రాష్ట్రానికి ఎంతో అవినాభావ సంబంధం ఉంది. దీన్ని వీరభద్రమూర్తిగారెంతో చక్కగా చిత్రించి ఆంధ్రుల కీర్తిపతాక నీలాకాశంలోకి ఎగుర వేశారు. బెంగాల్‌లో చెలరేగిన విప్లవ జ్వాలలను పత్రికలు ఎలా విసిరి పెద్దవి చేశాయో మధురంగా వర్ణించారీ కాండలో, తర్వాత పికెటింగ్ ఉద్యమాన్ని అతి చక్కటికవిత్వంలో పొందు పరిచారు.

"ప్రభుతం బొందిన రాజ్యమ్ము బడయవచ్చు"

"తెలివిపులి తలకాయల బేరంబు తేలగాందగు నేడు"

"ఊక దంచిన వచ్చునే నూకలేవి"

వంటి ఉద్రిక్త భావనలు చాలా కనిపిస్తున్నాయి ఈ పద్యాలలో. పికెటింగ్‌ను గురించి వ్రాసిన పద్యాలు ముఖ్యంగా వీరభద్రమూర్తిగారి కవితారీతికి చమత్కృతికి, భావపరిశీలనకు మచ్చుతునకలుగా నిలుస్తాయి.

"మీ చేతి గాజులు మిల మిలలాడుచున్నవి."

"ఎన్నాళ్ళాయెను మిమ్ము చూచి"

"బ్రిటను వలువలు కొనకుడి.."

"బట్టయును, సూదియు"

"నిరుపేద ముసలియు నెవడో గ్లాస్గోది కొంటిబుట్టము"

"చుట్ట లేనిది నాల్క చుట్టుచుట్టుకొనెనయా!"

"నాడు తెలవడ యే దుకాణమ్ము."

ఈ పద్యాలలో స్వదేశీ అభిమానం పికెటింగ్ స్వరూపం ఎంతో గొప్పగా చిత్రింపబడింది. వందేమాతరం ఉద్యమంలో బందరు సాధించిన విజయాన్ని ఎంతో ఉదాత్తంగా వర్ణించారీ కాండలో. బిపిన్ చంద్రపాలుగారి శిష్యులైన ఆ విప్లవ జ్యోతిని బందరుకు కొనితెచ్చి కృష్ణా పత్రిక ద్వారా జ్వాలలు వెదజల్లిన

కృష్ణారావుగారిని, వారి పత్రికను, వుటంకించడంలో ఎంతో సొగసు వచ్చింది. "కృష్ణా పత్రిక మున్నుగ" అనే పద్యంలో ఈ గాథ పొందు పరచబడింది. మూర్తిగారు ''వందేమాతరం'' గ్రంథాన్ని వ్రాసి మహాకవు లనిపించుకొన్నారు. మాతృదేశానికి మంగళహారతు లందించే కావ్య మెంతమంది వ్రాయగలరు? అలా వ్రాసిన కొద్దిమందిలో వీరభద్రమూర్తిగారు విశిష్ట స్థానం ఆక్రమించారు? కల కాలం నిలిచే కావ్యమిది. ఈ కాండను గురించి ముందుమాటలు వ్రాయడానికి పూనుకొన్నప్పుడు నాలో ప్రవహించిన ఉడుకురక్తం చల్లారకుండా దాచుకోవాలని వుంది. ఈ కాండలోని కవితావేశాన్ని, పాండితీగరిమను మరింత విపులంగా వివరించవలసింది. స్థలవిస్తరణభీతితో ఆ పనికి పూనుకొనలేదు. ప్రక్క పుటలో వున్న మణులను మరుక్షణంలోనే పాఠకులు ఏరుకోబోతున్నారు. ఎందుకు ఆలస్యం?

*

*Sree Nivarthi Venkata Subbayya garu*
**Chairman, Andhra pradesh Legislative Council** — **Hyderabad**

**"Here is a poem ever green
With richest cultural Vein
Past patriots living seen
in finest litarary scene"**

డా॥ కోవెలసుప్రసన్నాచార్యగారు
M. A. Ph. D., Reader in Telugu,
Kakatiya University, Warangal

స్వారాజ్య ఖండము

# దీపిక

ప్రపంచంలో మానవుడు స్వేచ్ఛకోసం స్వాత్మోన్నతికోసం జరిపిన పోరాటాలలో భారతస్వాతంత్ర్యసంగ్రామం ఉన్నతమైంది. ఈ ఉద్యమం భారతజాతిపునరుజ్జీవనోద్యమంతో పెనవేసుకొని ఉంది. వేయిసంవత్సరాల స్తబ్ధత తరువాత జాతి మేల్కొన్న మహోద్యమం ఇది. శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి గారు ఈ సమరచరిత్రకు అక్షరరూపం కల్పించి- తెలుగుసాహిత్యానికి ఒక అపూర్వమైన ప్రతిష్ఠను సంతరించిపెట్టారు.

ఇంత సన్నిహితము పరిచితము అయిన చరిత్రకు- అవిరోధంగా శుష్కములైన అంశాలకు కండ కల్పించి అరవయ్యేళ్ళ ఇతిహాసాన్ని ప్రాణోద్దీప్తం చేసి ఈ ఆధునికమహాకావ్యాన్ని సంతరించారు వీరభద్రమూర్తిగారు.

పద్దెనిమిదిఖండాలలో మూడువేల పద్యాలపైగా వ్యాపించిన ఈ మహాకృతి- ఇతివృత్తవైవిధ్యంతో, బంధురకథావిన్యాసంతో ఒక అందమైన ఇంద్రధనువులా గోచరిస్తున్నది. కవికి గల పద్యరచనాశక్తి అద్భుతమైంది. వర్ణనలు, అలంకారయోజనము, సమాసకల్పనము ఇత్యాదిగా ఏ అంశాన్ని గ్రహించినా ఆశ్చర్యకరమైన ప్రతిభాదీప్తి కావ్యంనిండా వ్యాపించి ఉంది.

ఈనాడు తెలుగుదేశంలో కవిత్వం ఎన్నోరూపాలలో అభివ్యక్తం అవుతున్నది. జాతీయసంప్రదాయం ప్రేరణగా సాగే కవిత్వమార్గానికి శ్రీవిశ్వనాథసత్యనారాయణ, అంతర్జాతీయసంస్కారము ప్రేరణగా వ్రాయబడే కవిత్వానికి శ్రీశ్రీ శిఖరాలుగా వెలుగొందుతున్నారు. ఇది స్థూలమైన విభాగమే తప్ప-రెండు

మార్గాలూ పరస్పరసంబంధాలే. ఈ కావ్యంలో ఈ రెండుమార్గాల సుసంగతి గోచరిస్తున్నది.

వీరభద్రమూర్తిగారి అధునికేతిహాసం 'వందేమాతరమ్' రచనలో సంప్ర దాయరూపమే కానవస్తున్నా- శబ్దజాలంలో వినూత్నత ఎంతో ఉన్నది. అర్థసం యోజనంతో ఆధునికలక్షణాన్ని పుణికిపుచ్చుకొని సంప్రదాయస్రోతోనుబంధం కలిగించారు.

'వందేమాతరం'- కవి ప్రధానంగా వీరరసప్రధానా లైన కావ్యాలు రచించినవారు. ఏతద్రసానుసంధానానికి అవసర మైన ప్రౌఢరచనాశిల్పంలో ఆయన అందెవేసినచేయి. శైలిలో, తెలుగుసంస్కృతాల కలయికలో, కొత్త వైల క్షణ్యం సాధించడమే కాక అన్యదేశ్యాలను విరివిగా వాడి భాషాభాండాగారాన్ని సుసంపన్నంచేశా రాయన.

ఎక్కడికక్కడే రచనలో ఇతరాంశాలు స్పందింపుతూ 'కథామర్మభేదకా' లైన శబ్దాలు, వాక్యాలు, పద్యాలు, కూర్చుతూపోతారు కవి. పాఠకుడు సహ ప్రోతలు లై కవివెంట పోవలసిఉంటుంది- ఎక్కడ ఏ రహస్యం నిక్షేపించాడోనని.

కావ్యాలను ఏకదేశంగా చదవడం, ఆనందించడం కావ్యపరమార్థాన్ని అవ గాహనచేసుకునే ప్రయత్నం కాదు, కావ్యం అంతా ఒక మహావాక్యంగా భావిం చితేనే కవి ఆ పరమార్థాన్ని ఎట్లా నిర్వహించాడో అవగతం అవుతుంది. దాని అంతస్సూత్రాన్ని పట్టుకోగలుగుతాము.

ఈ కావ్యంలో కావ్యపరమార్థం- స్వరాజ్యాన్ని సాధించే తుదిపోరాటానికి సిద్ధ మైన భారతీయచైతన్యం. దాన్ని ప్రస్ఫుటము చేయడమే కావ్యారంభంనుంచీ తుదిదాకా చేసిన ప్రయత్నం. కావ్యఆరంభోపసంహారాలు రెండూ కలకత్తాలో కాళీఘట్టంలో జరుగుతవి. కావ్యంలో చాలా సన్నివేశాలలో కాళికకు భారత మాతకు అభేదాన్ని ప్రతిపాదించారు. ఈ విధంగా ఈ కావ్యం ఒక ఆవర్తాన్ని పూర్తిచేసింది. ఝాన్సీరాణీనాయిక మైన ప్రథమావర్తం పూర్వం ఈ కవిచేత ఒక కావ్యాన్ని రాయించింది. ఈ రెండో ఆవర్తం వంగవిభజనప్రధానవస్తుక మైంది. మూడో ఆవర్తం ఇంకా కవి రాయవలసిన మరొక కావ్యాంశం గాంధీ నాయకము- స్వాతంత్ర్యోదయపులాంతము అయిన చివరి ఆవర్తము. ఈ మూడో ఆవర్తము పూర్తిచేసి కవి తెలుగుకవితాలోకంలో అసాధారణస్థానాన్ని సంపాదిం చవలె నని సహృదయుల ఆకాంక్ష.

ఈ కవిశిల్పసిద్ధి బహువిధ మైంది. సన్నివేశాన్నిబట్టి ప్రతిభాస్ఫూర్తిచేత యిది నిర్మితమౌతూ వున్నది. ఈ కావ్యంలో చివరిఖండం— స్వరాజ్యఖండం— దానిలో ఉన్న చమత్క్రియావిశేషాలను కొన్ని వివరించడమే ప్రస్తుతవిషయము.

స్వరాజ్యఖండం కాశీలో కాంగ్రెసుమహాసభల సన్నివేశంతో ప్రారంభ మైంది. స్వరాజ్యం- భౌతికంగా ఎంత ముఖ్యమో ఆధ్యాత్మికంగా కూడా అంతే. ఈ ఘట్టంలోని రచన అంతా ఈ రెండు భావాలు సమాంతరంగా సాగుతూ గోచరిస్తుంది. 'అగపడిన రూపు మితవాద మైన నేమి? అగపడని తత్త్వ మతి వాదము'- అన్నారు కవి. కాంగ్రెసులో మితవాద అతివాదపక్షాలలో అతివాదం ప్రాధాన్యం పొందే కాలం అది.

ఈ వాక్యంలో 'రూపు' "తత్త్వము" అనే మాటలు సగుణనిర్గుణపర బ్రహ్మమునుగూర్చి చెప్పుతూ ఉన్నవి. నిర్గుణతత్త్వము వాదములకు అతీతమై అతివాద మవుతూ వున్నది. విశ్వనాథుని గుడిని వినిపించు సన్నాయి. జీవునిలో "జీవునితన మరిగిపోయి బ్రహ్మగనమె నిలుచు ప్రాణిలో, ఆ నాదమునకు ఆకు లోని ముడుత పోవు.' ఇక్కడ రెండో భావం అసాధారణ మైంది. జీవుడే కాక చెట్టుచేమల్లోనూ చైతన్యస్పందం పరమేశ్వరాభిముఖ మని చెప్పబడింది. ఆకుముడుత పోవడం అంటే జీవుని సంసారాగ్రం స్వతంత్రస్థితిని పొందడం అని భావం.

వీరభద్రమూర్తి గారి రచన యీ విధంగా సునిశితంగా అర్థం చిరుగంట మ్రోగుతూ వున్నట్లు సాగుతుంది. కాశీలో జనం తిలక్‌ను సందేశ మిమ్మంటే- 'తిలకలోకారాధ్య దేము క్తికిన్ స్తవనీయం బరివర్గసాత్త్వికనిరోధంబే' అన్నాడు. ఇక్కడ లోకారాధ్యశబ్దం ఔచిత్యపూర్ణ మైంది. అతని సందేశం లౌకికపారలౌకికాలను యౌగపద్యంగా స్పృశిస్తున్నది.

కలకత్తాలో శివాజీసంస్మరణోత్సవానికి తిలక్ వచ్చాడు. అప్పుడు కవి తిలక్‌ను వర్ణిస్తూ- "దేవత్వమున కెక్కి దిగి మానవత్వాన ప్రజలతో కాలు వున్న పలుకువాడు- గత మయిన చరితకు గర్వ మయినవాడు ఆగామి కోర లైనవాడు"- అని వర్ణిస్తాడు. అటువంటి 'తనవంటివాడి' సంస్మరణోత్సవానికి వచ్చాడు. ఇక్కడ శివాజీవంటివాడు తిలక్ అనకుండా తిలక్‌వంటివాడు శివాజీ అని చెప్పడం వ్యక్తిత్వాన్ని రూపించడంలో అద్భుత మైన రీతి.

భావివస్తువిన్యాసంలో కవి కింకొక పద్ధతి ఉన్నది. కాంగ్రెసుసభాసందర్భంలో ఒకసారి అరవిందఘోషు నిసురుగా పోతూవుంటే ఆయనకాలును త్రొక్కి దొక సార్జెంటు. చిత్తరంజన్‌దాసట్లో కట్టుకట్టారు. నొప్పి తగ్గింది కొంతసేపు ఆగి వేగంగా వెళ్ళాడు. ఇదొక కల్పన. ప్రతీకాత్మక మైంది. అరవిందఘోష్‌ను బ్రిటిషువారు తరువాతి కాలంలో నిర్బంధించడం, ఆయనవైపున చిత్తరంజన్‌దాసు వాదించి ఆయనకు విముదల కల్గించడం, తరువాత ఆయన అంతర్ముఖుడై రాజకీయరంగాన్ని వదలి ఏకాంతవాసంలో తపస్వి కావడం– ఈ చరిత్ర నంతా ఈ కల్పన వ్యక్తం చేస్తుంది.

ఈ ఖండంలో మితవాద అతివాదపక్షాల మధ్య చర్చలు సంఘర్షణలు చమత్కారంగా చిత్రింపబడ్డవి. ఈ సందర్భాలలో కవి సాక్షిభూతుడుగా ఉంటాడు. గోఖలేను గూర్చి తిలక్ అంటాడు.

'అత డెప్పు తగ్గులు లేని అగ్నికిల, నుడి ఫిరోజిషాదే గాని

యెడద మాది'

అని. అట్లాగే గోఖలే తిలక్‌ను గూర్చి–

'నే నారంభమం దా మహోద్భటు నా కన్నులనిండ

కప్పుకొని యామై వాని భావోష్ణ ముత్కట మైతాళకదూర మైతి'–

'మేము వానియంతటి ఘోర మెవ్వరము గాము'

అంటాడు. ఈ మాటలలో అభిప్రాయభేదా లెన్ని ఉన్నా పరస్పరగౌరవము ఎట్లా ఉండేదో వ్యక్త మవుతుంది

గోఖలేను అగ్నికిలగా చెప్పుతూ తిలకును సూర్యునిగా వ్యంజిస్తూ కవి తాను చెప్పదలచుకొన్న పరమార్థాన్ని వ్యక్తంచేయడంలో ఔచిత్యాన్ని పాటించారు. ఇలా ఈ ఖండంలో ఎన్నైనా ఉదహరిస్తూ పోవచ్చు. ఖండాంతంలో చెంగరిను ఉద్యమంలోని సన్నివేశాలు చిత్రించాడు కవి. శ్రీవీరభద్రమూర్తిగారుమిగిలినఇతివృత్తాన్ని గ్రహించి త్వరలోనే ఈ కావ్యమును సమగ్రం చేయవలె నని భావుకులు కాంక్షిస్తున్నారు.

ఈ కావ్యంలో ఒక్కొక్కఖండంలో ఒక్కొక్క వైశిష్ట్యం స్ఫురించే విధంగా కవి తీర్చినట్లుగా కనిపిస్తుంది. అయినా అన్నింటికీ పేడని అనుస్యూతి ఉండటంవల్ల ఒక విచిత్రమైన శోభ ఈ కావ్యాన్ని అవహించింది.

ఈ ఆధునికమహాకావ్యం దేశంలో దేశభక్తినీ జాతీయచైతన్యాన్నీ పునఃజ్వలితం చేయవలె నని ఆశిస్తూ వున్నాము.

'కప్రంపున్‌వలపుల్ వెలార్చినవి ప్రాగ్భారముగ్గా దేశభ

క్తిప్రాసాదమునందు వెన్నుడులు 'వందేమాతర' మ్మంచు భా

వప్రౌఢిన్ ప్రకటింపఁజేసినవి—

# వందేమాతరం

(శ్రీ బంకించంద్ర చటర్జీ)



బంకించంద్ర చటర్జీ
1836-1894

సుజలాం, సుఫలాం, మలయజశీతలాం
సస్యశ్యామలాం, మాతరం ॥వందే మాతరం॥
శుభ్రజ్యోత్స్నా పులకితయామినీం
ఫుల్లకుసుమిత- ద్రుమదళ- శోభినీం,
సుహాసినీం సుమధురభాషిణీం
సుఖదాం వరదాం మాతరం. ॥వందే మాతరం॥
త్రింశత్కోటికంఠకలకలనినాదకరాళే
ద్విఃత్రింశత్కోటిభుజైర్ధృతఖరకరవాలే
కే బోలే మా తుమి అబలే
బాహుబలధారిణీం నమామి తారిణీం
రిపుదళవారిణీం మాతరం ॥వందే మాతరం॥
తుమి విద్యా తుమి ధర్మ
తుమి హృది, తుమి మర్మ, తుమి ప్రాణ శరీరే
బాహుతే తుమి మా శక్తి, హృదయే తుమి మా భక్తి
తుమారీ ప్రతిమా గఢి మందిరేమందిరే ॥వందే మాతరం॥
తుమి దుర్గా దశప్రహరణధారిణీ
కమలా కమలదళవిహారిణీ
వాణీ విద్యాదాయినీ, నమామి త్వాం
కమలాం అమలాం అతులాం మాతరం ॥వందే మాతరం॥
శ్యామలాం సరళాం సుస్మితాం
భూషితాం ధరణీం భరణీం మాతరం ॥వందే మాతరం॥



(1) Swami Dayananda Saraswati (2) Swami Vivekananda
(3) Dada Bhai Naoroji (4) Lokamanya Balagangadhara Tilak
(5) Vasudeva Balavanta Phadke (6) Gopalakrishna Gokhle
(7) P. Anandacharyulu (8) Aravinda Ghosh
(9) Lala Lajapath Rai

# వందేమాతరం

## ప్రథమఖండము

### అవతారిక

శా॥ శ్రీ గోత్రేలు భుజన్నరేంద్రతిలక శ్రేయప్రదా దానసం
వేగిన్ ద్రాతసురేంద్రు శైలజపతిన్ శ్రీశారవిందాతు ర
తోగర్వఘ్ను దయామయుం బరమహంసావ్యున్ మహాదేవు వెం
తో గొల్తున్ ధృతచంద్రుఁ బ్రోచి బలవంతున్ భారతున్ జేయగా.

గీ॥ ఖేద మెఱుగని మనసు నా కిమ్ము శివుడ!
నేను చూచుకొందును తక్కువాని నెల్ల
నీవు వింటివి మహతిపైని సరిగమలు
నీకు వినిపింతుఁదెనుగులోని మధురిమలు, 2

ఆ॥ వె॥ అన్ని రసములకును నాధారరూప య
య్యష్టమూర్తివధువు నభినుతింతు
కలశవార్థితనయ కళ్యాణమందిర
యిందిరను నుతింతుఁ గృతినిఁ బ్రోవ. 3

ఆ॥ వె॥ కౌస్తుభమ్ములోని కళుకును వనమాల
లోని సౌరభంబు మానవావ
తారకలితనవ్యత నొసంగి శ్రీనివా
సుండు కృతిని కరుణఁ జూచుగాత! 4

క॥ వినుతించి తన్ను కొద్దిగఁ
దన యర్ధాంగిని నుతింపఁ దద్దగ దాతల్
తనియుదు రల్లే పొగడెద
వనేజభవునిన్ సుగంధ వాగ్గ్రంథముకై. 5

గీ॥ మొరసి శబ్దము లర్థముల్ మెఱసి రసము
కురియునట్టి కావ్యమ్ములకుఁ గుదురయిన స
రస్వతిని భజింతును తదారాధనమ్ము
నందు మ్రోయు ఘంటకు నాల్క నాదు నాల్క. 6

మ॥ నిను పూజింపక యెట్లు నచ్చుఁ గవిత న్విస్తుల్యమౌ హెచ్చు, చం
దనమందారమరందబిందుల జందాలిచ్చు పంచాల క
చ్ఛపివీణాధ్వనులీను శబ్దచయముల్ తత్ సీమలన్ గ్రహిం
చిన నల్లికిక పట్టుచు కనందాక్షంధూ! సుందరా! 7

క॥ తెనుగున నేనే నా గురు
వును గీర్వాణమున గురువు పూజ్యజనశిరో
మణి మదభ్యాసగ్రగణి వా
నిని గొలిచెద వీరభద్రు నిగమసముద్రున్. 8

శా॥ కన్నాఁడొక్కఁడు నన్ను శాంభవము దక్షన్ గూర్చి యా అతురా
అన్నాఁ డొక్కఁడు నాదు కర్ణమున వంశైశ్యమ్ముననన్ గీర్తిసం
పన్నిర్వ్యస్ఫుటమల్లికార్జునత నామైకవ్యమ్ముననన్ దోల్చు ని
స్విన్నోద్దాంతవివాదపండితనతి స్వీకర్తలన్ గొల్చెదన్. 9

క॥ మా మతము శివాద్వైతము
సామాజికముగను, తా రసాద్వైతమునన్
సోమించె యపగానో
ద్ధామకృతులఁ బద్యకృతిని సంద్రిన్ దలతున్. 10

చ॥ ఒక నిముసమ్ము నన్ను గనకున్న యుగమ్ముగ నెంచుచుండు నే
నొకడనె సంతు కాగ విభవోద్ధతి నే నెటు లెన్ని వేలు రూ
పికలను వెచ్చపెట్టినను పిల్లడు నొచ్చు నటంచు పట్టు ప
ల్కకె నను దిద్దు నా జనని జ్ఞానధురీణయు ధైర్యరాశి యై. 11

క॥ సామాన్య మసామాన్య మ
సామాన్యము వారి చేత సామాన్యము, చి
త్రామృతము ఫలము, భారత
రామకథా కావ్యకర్తలను కీర్తింతున్. 11

మం॥ద్వి॥ వర్ణభేదము లేని స్వర్ణయుగాని
కారంభకులు శివకవుల వందింతు. 11b

గీ॥ కృష్ణశాస్త్రికి నాకు మహేష్టుడు స్మృతి
వచ్చె కాటూరి వేంకటేశ్వరుడు, వాని
గింజ లేని ఖర్జూరపు మంజుకవితఁ
గ్రొత్తదనమున నన్నయ మెత్తదనము. 12

ఉ॥ వేంకటశబ్దపూర్వపదవిశ్రుతు డాప్తుడు నాకు విశ్వనా
థాంకిత మాత్మయున్ సహజతన్మయతన్ గొను కొప్పరమ్ముగా
నింకని ప్రేమభావ మమరేశ్వరసంపద గాగ వానికై
సంకుచితత్వ మొందవు పసల్ శివరాఘవ సంభృతమ్ములై. 13

ఆ॥వె॥ నారసింహు డొకడు, నా యని చెప్పికోఁ
దగినవా డొకండు, తానె శ్రమ మె
సంగఁ దెచ్చి పోసె సంజీవి నభ్యుద
యమున కాంజనేయు డాత డొకడు. 14

గీ॥ శిష్టు డవధాని యొకడు నా సేమమందు
ననవరతము, నొకండు రామానుజుండు
రాము డొకడు విఘ్నఘ్నులు, రత్నసన్ని
ధాన మొకడు, మండలి యస్మదాప్తుల దిది. 15

క॥ ముప్పిరి సిరిఁ బెనిచి ప్రజల
త్రిప్పటలం బాపుచున్న తిరువేంగళు నట్లు-
అప్పా! రావూః యనగనె
చప్పున సాయమ్ము వచ్చు సజ్జను నెంతున్. 16

గీ॥ గోవుపాలు పేరుకొనిన తేవ నొప్పు
హృదయ మధురిమ మాతిథ్య మిడెడువారి
యెదుట నిలుపు బ్రహ్మానంద మిడిన పిలుపు
సజ్జనుల చెల్మి మిన్న శాస్త్రమ్ముకన్న. 17

ఉ॥ మాయది యింటిపేరు శ్రుతి మంజువుగా ముదిగొండవారు, వే
శాయలు చెట్టుపే ర్కొండివి గట్టిగ నమ్ముదు, వీరభద్రమూ

త్రీ! యన నో యటందు, నెవరేన్ గవులన్ గడవాడ వీవెకా
దా! యన నౌ నటందుఁబరిహాస మనన్ జెవిగోసికొందునున్.18

శా॥ భారద్వాజసగోత్రుడన్ యజుపు నాప స్తంబసూత్రంబు వ
ర్వారన్ ధన్యుడ, శాపసంతుఖితగంధర్వప్రజాదైన్యసం
భారోద్ధారణకారణోద్భటమహామాహేశ్వరా ద్యాన్వయ
క్షీరాబ్ధిప్రభవుండ, భారతకృతి శ్రీకోద్యమఖ్యాత్రుడన్. 18॥

చ॥ స్థిరముగ నోరుగంటివిభు దిగ్విజయం బను పేరునన్ మహా
మరకతమున్ రచించితిని, మత్కృతి యద్ది సువర్ణధార మ
ద్విరచిత మాంధ్రకేసరికృతిన్ దొలిభాగము, భట్టబాణ వా
క్పరిమిళితప్రథం బగు సుబంధుని కావ్యము తెన్గుచేసితిన్. 19

క॥ శ్రీమూకపంచశతినే
కామాక్షీ పంచశతిగ కలము నడపి నా
చే మును వ్రాయించెను దా 20
హైమవతి స్వతంత్ర మైన యను వాదముగా.

క॥ బాణుని చండీశతకము
స్థాణుని స్తవపంచకమును తనరించితి నాం
ధ్రానూదితముల దుర్గా
నోనుత శ్రీదేవి మహిమ సుకృతం బటులే. 21

క॥ మార్కండేయము పుణ్యో
దర్కము వ్రాసితిని, సంస్కృతము నాంధ్రము వాన్
శర్కర యిరు తెలుగులుగా
పేర్కొని శ్రీగిరిశునకు నివేదన మిడితిన్ 22

గీ॥ ప్రథమకృతి మల్లికార్జున పండితవిజ
యంబు, హరిని తలంతురా యనగ నొకరు
వేణుగోపాల శతకమ్ము విరచితమ్ము
ప్రస్తుతమ్ము వందేమాతరమ్ము కృతము. 23

గీ॥ ఉద్భటుని యుపనయనము నొగి జయంతి
లలితకావ్య కళాఖండములను ఝాన్సి

రాణి మున్నగువారి సంగ్రామ చరిత
కృతియు మద్రచితములు సంకీర్తితములు. 24

శా॥ శ్రీకారమ్మును చుట్టి చూతునుగదా! సిద్ధమ్ము లూహాల్ కృతి
ప్రాకారమ్మున కైన పండిటుకదోరల్, బాలగంగాధర
శ్లోకాతీతమహోద్యమాగ్నిపటలీశుద్ధమ్ము లై తూర్పుకే
జోకల్ తోడుగ, సాగెనభ్యుదయపున్ సోగల్ కథాశిల్పముల్. 25

—: o :—

# ప్రారంభము

ఉ॥ సంగము రెండు సంస్కృతుల జాళ్ళకు, సింగము వాడిక్రేళ్ళకున్
రంగము, ధైర్యగుప్తికి సొరంగము, సాహస భావదీప్త మౌ
వంగము, పైడి కంటివెత చాచి మహీసతిఁ బ్రోచి యాదిని
లాంగుడు కస్తురిన్ దదురమందు రచించిన పత్రభంగమో! 26

శా॥ ఆ రాష్ట్రమ్మున నీలివైరు భువి నాషాంధాంత మేఘచ్ఛవిన్
జాజాడించుచు చిట్లు చీకటుల నాపాదించి మాయాకిరా
తారూఢద్యుతి కొప్పినట్టి యుపమేయం బౌచు నేపొందె వ్యా
పారుల్ హూణవరుల్ కుబేరు లయి రా పంటన్ బ్రసాదించుటన్.

మ॥ మతిలోనం బయిరాగిజుట్లు మొలిపింపన్ జేయు శాల్యాగ్రసం
చిత మా పింగము కోశకన్న నిదియే నీ యంద మెచ్చించెఁ బ్రాం
చితనీలీవసనమ్ము మేల్ముసుగు దీనిం జాయకే యంచుఁ దా
సిత వక్త్రచ్ఛవికల్మి నవ్వె నదిరా శ్రీదేవి భూదేవిసిన్. 28

ఆ॥వె॥ ఊడెఁ బైడి వెండి యో, నా సవతి! నీవుఁ
గాగితముల తునుక లేగదే! గతి
యనుచు బదులు పలికె నపుడె భూదేవి శ్రీ
దేవితోడఁ జింత్యభావితోడ. 29

ఉ॥ విత్తు లొసంగి పెట్టుబడి పెట్టి లభింపగఁ జేసి పంట యా
మొత్తము పంటవీఁ కదమ ము న్నిడినట్టిది పోగ నున్న యా
విత్తము నాంగ్ల వర్తకులు పెద్దయుఁ గాల మొసంగుచుండి రీ
ఖత్తున నెత్తుకోదొడగెఁ గాపులలో సిరి పెక్కుమందటన్. 30

ఆ॥వె॥ కన్నుకుట్టెనేమొ! కక్కుర్తిగాం డ్రైరి
సేద్యగాండ్ర యెడల శ్వేతముఖులు
వ్రాసికొన్న ధరకుఁ గ్రయ మొల్లక తదర్ధ
మిత్తు మనిరి, జనము మొత్తుకొనిరి. 31

క॥ సామీ! యాసాముల నీ
మై మోసముసేత పెద్ద మనుసులు దొరలున్
ధీమంతులు పేర్మోగిన
శ్రీమంతుల రైన మీ కిసీ! తగ దయ్యా! 32

శా॥ మీ మాటన్ జవదాటి మే మెఱుగమే, మీ రన్న మా జేజెలన్
గా మన్నించెదమే, శుకమ్ము లటు లన్మన్నలై యన్నారమే
మా మందిం బోయిరాజనట్టి గణనామాత్రుల్ కలా రయ్యలా
రా! మా రూకల నిట్లు గుంజికొన తీరా! పత్రభిన్నమ్ముగా. 33

క॥ అన యజమానులు రాసై
ల్పని, రిపు డింతే యొసంగ నర్హ మనిరి, మా
కనుభూతము నష్టం బని
రనువుకొలది మీరు మసలరా హాతు లనిరిన్. 34

క॥ ఆ యనుట దెబ్బకొట్టిన
తోయం బై జనసమైక్యదుందుభి మొరసెన్
మాయంతట మే ముందుము
మీయంతట మీర లుండ మే లింతటితో. 35

ఉ॥ ఏగము నీలితోట్లవయిపే మికం బెంచము నీలిపైరు మీ
కై గమనించి మీరు సరిగాం గ్రయరూపిక లిచ్చుదాక, నే
దో గన మైన బాస బిరుదున్ దయసేసిరి మా కదేల మీ
రే గయికొండయా! తగుదు రెంతటికైనను దేనికైననున్. 36

ఉ॥ న్యాయముపైని కత్తి పడెనా! గత శారద నీలి మూల్యమున్
గోయగ హేతు వే దయిననున్ విన గోరముం, లేదు సుంతయున్
మాయెడ నైన నేరముం, క్రమాగత లాభమునుండి పుడ్చికొం
డీ యెదియేని నష్టము ఘటిల్లిన, నీయము నీలియమ్ముఁలన్. 37

ఉ॥ వ్రాతలుపూత లింక పనరాదుసుమీ! మన మధ్య నీలికై
లేతలు మాట లేల? క్రయలేఖ్యము లంపవుమంతె నౌట యే
లా? తమ రందుకొన్న ధన మంతయు మా శ్రమదత్తమే కదా!
మేతలచేతులన్ గలచు మీ దరి రా మని యాడి రెల్లరున్. 38

మ॥ అటులై యయ్యెరువాగువారలును తా మన్నల్లై వర్తింప నె
త్తుటిచా అంటని నీలిఖండపుటకాల్ దుష్ప్రాపవముల్, కోర్టుతీ
ర్పైటునేన్ దూకును గోడమీదిపిల్లి, యుల్లై సాగుచోఁ గీడు తా
నెటునేన్ దూకును వ్రాఫ్రి వంగవ్రజ లక్ష్మీభూతహూణాస్యమై.

గీ॥ అపుడె కృషికుల భాగ్యమ్ము నణచి కొట్టు
శాసనమ్ము చేసినది సింహాసనమ్ము
బంతి యెంత క్రిందకుఁ గొట్ట నంత పైకి
లేచు వడి నైకమత్యమ్ము మోచె జనము. 40

క॥ ఒక చేతయు నొక వ్రాతయు
నొక మ్రోతయు గాఁ గృషీవలౌఘం బెల్లన్
బ్రకటించె నాంగ్లుతోడి స
హాకారమును భరతభూమిహాకారముగా. 41

ఉ॥ ఈ వడి కట్టు కట్టి జనబృందము గెల్చెను ఫ్రెంచి విప్లవం
బే వెనుదీయనట్లు నడుపింపఁ,ఫలించెను కర్షకోద్యమం
బా విధి చాంపరాన్ కడ బిహారున గంగమతల్లి హోరువన్
బైఁబడనట్లు జాతికిఁ బ్రవాహము చెప్పు జగాబిదారునన్. 42

ఆ॥వె॥ ఇటుల జరిగి యెన్నొ యేండ్లు కాలేద, పీ
సాకు బిరడ యెట్లు సళ్ళువోయెఁ
గాలమాంత్రికుండు కానడ, వగ్రహా
గ్రహము బైటి కెగసి గగన మంటె. 43

సీ॥ కనుపడలేదు వేపను పూత వర్షాస
తీవై భవమున జ్యోతిషపు వ్రాత
మొలకెరలేదు చీమల కారు ప్రావృషా
ప్రభ్యాకి మూక సేవకుల తీరు
వినవడలేదు భేకనిచయ బెకబెక
జడిరాణి నుడి పలుకు జడితికమక
చనుదేరలేదు పింఛము విప్పికేకి వా
నలకారు జవరాలి నట్టువసతి

గీ॥ తొల్లిఁ బంచాంగము పురోహితుండు గద్గ
దస్వరమ్మున జదివిన తరుణమందె
తెలివి జాసి శూన్యమ్మున దృష్టి నిలిపి
నట్టి పోలికు లరకలు కట్టరైరి. 44

ఉ॥ మందలుమంద లావు, లొక మబ్బును గేదెయు కాద, యేవియేన్
బిందుపురాల్పవుం బయసు, బీడువడెన్ హృదయమ్ము భూమి యా
క్రందన మొక్కచే తటుగు కాపుకొలమ్మున నిప్పగజ్జెలన్
సందడి దండడించినది నల్లని యాకృతి నాట్యమాడగా. 45

క॥ తూనీగవానకోయిల
లే నేలకొ వలసపోయె, నే నాకువునం
దో నాకవిభు ధను వడగె
నే నేరెడు చూడ నాకు లే యగపడియెన్. 46

క॥ పానీయంబే మృగ్యము
స్నానీయజలమ్మమాట శంకరు డెఱుగున్
గానంబడియె శివాలయ
మై నభము విభూతిపండ్లు నై చిఱుమొగిళుల్. 47

క॥ పిలిచిననుం బయిఁ జూచుట
తలపింపద తప్పు గాగఁ దమకించి నభ
స్థలమున నల్లని రేకను
తిలకింపన్ గోరి ప్రజలు దృష్టి నిగుడ్చెన్. 48

గీ॥ ఎంత కఱవైన ధనికుడు కొంత కొంత
తట్టుకొనవచ్చు, దీనుని తరము కాద
ఆపగాప్రవాహముకోత కాగవచ్చు
గండశిల కొంత, తరువున కాగ వశమె! 49

గీ॥ అడవి గాసిన వెన్నెల యతని చదువు
పాసినన్నము వాని జీవనము, తింత్రి
ణీదళాధమములు వాని నేత్రపద్మ
ములు, మనిసి పేదవాడుగాఁ బుట్టరాదు. 50

గీ॥ మేడగలవాడు వానికి జేడయేలి
యప్పొసంగుటకై త్రిప్పి త్రిప్పి చంపు
చచ్చినను వానిదియు నొక చావు కాదు
బ్రతికినను వీద యది యొక బ్రతుకు కాదు. 51

ఉ॥ నాగులు పెచ్చులున్ గలసి నాల్గవ వంతును బెంప దాన్యమున్
ద్రోగులు పోసికొన్న, యొక రూక కడావడివడ్డితో ఋణం
బీగి గడించికొన్న దనికుం దను తామమునన్ వడంకె శీ
తాగమమందుకంటెను శతాధిక మన్నము నిద్ర యల్పమై. 52

ఆ॥వె॥ లేనివాడు పుడమి లేనివా డగుచుండె
నొక్కసారి యే, ధనోల్బణుసకు
జావు బ్రతుకు లెన్నిసారులో ! మరియు గ్రా
మమ్ములందు కలవుమమ్మరమన. 53

మ॥ ధనమున్ ధాన్యము నేలమాళిగలకున్ దాటించి తామే గృహ
మ్ములకున్ గన్నము రేయి ద్రవ్వుకొని బాబూ!చూడరేనిల్వదో
పున మా కొంప మునింగె,గట్టుకొనగాఁ బుట్టమ్ములను దక్కదం
చును వాపోయిరి కొందఱుమ్మిడికమ్మల్ కొంగుచాలై తగన్.54

ఆ॥వె॥ ఒక్క అలివైపు బక్కచుట్టములకా
పూటఁ బెట్టి యెటకొ ఒోవు మిషను
ధనికులు గృహములకుఁ దాళాలుఁ వేసిరి
పలువ రైన బంధువర్గ మరసి 55

క॥ మీ మేనమామ బావయు
మా మామయు వద్దకులును, మనలో మన కే
లా మర్యాద లటంచును
ధీమంతులు పెక్కు రాధ్యవేహాళి నుషితుల్. 56

గీ॥ పకయాన ప్రయాణము నేకనిమ్న
గావయఃపానమును లంకె గలిపి కొంద
ఱిరువురి పితామహులకు నేకైక మాత్మ
యనుచుఁ గొందఱు కలవారి కతిథులైరి. 57

క॥ కలవారిలోన బుద్ధిన్
గలవారలు కొంత యిడిరి కార్మికులకు,దద
త్కలితాపహరణమున బు
ద్ధిలేనివా రడలి రున్న దెల్లయు. పోవన్. 58

గీ॥ పల్లెటూరి నుండి పట్నవాసమునకు
బ్రదుకు తెలువుకొలకు బడుగు చేరె
వానికన్న మున్నె భాగ్యవంతుడు చేరె
నడిమిరకము రైతు నడువలేడు. 59

క॥ వీడు త్రిశంకు స్వర్గము
వాడు, మరెటఁ జావలేడు బ్రతుకగలేడున్
గూడెము లోనే పిల్లల
కోడి యయిన భార్యతోడ కుట్టుసురుపడెన్. 60

గీ॥ దేవమాతృక ఫలిత మందెనొకో దాని
మూల్యమందు సగము పన్ను, పొలము విడిచి
పెట్టె నొకొక్కచోట నంబేద లంక
మేత గోదావరీనది నీత గాగ. 61

ఉ॥ పన్నులు కట్టలే మని విపన్నులు మిక్కిలి వేడుకొన్న నే
మున్నది? గద్దయీకకలమున్ మసిబుడ్డిని ముంచిముంచి యా
యున్నచరాస్తిపైఁ గరణ ముద్ధతి వ్రాసిన జప్తుకాగితం
బున్నదిఁ,అలిపుస్తె యొక టున్నది వేలము కాని వానిలో. 62

క॥ రూపికకు మానికలుగాఁ
జేపడు ధాన్యమ్ము తవ్వచివరకు రాదై
రేపుల్ మాపులు వస్తులు
పాపలకుం బెట్టి చావవడుకల పేదల్. 63

క॥ అతివృష్టి యనావృష్టియు
నతిభుక్తి యభుక్తి వోలె వ్యాధుల పాదుల్
మతి చెడిన ప్రజకు దేహ
స్థితియున్ జెడె రాచవెజ్జు జిల్లా కొకడై. 64

క॥ అమ్మా ! యాకలి యనగాఁ
గొమ్మా యని నోట పైటకొం గిడియెను, దా
హా మ్మనఁ గన్నీరొ నొసగెను
సొమ్మసిలుచుఁ దల్లి సంతుచూపులు గాడన్. 65

క॥ ఎవ రెవరికి నక్కఱరా
రెవరికి వారె యను ప్రాతదే నుడి చేసెన్.
త్రివిధ మహోమయ రేఖల
యవగ్రహవ్యాఘ్రముపయి నారూఢం బై, 66

ఆ॥వె॥ అవసరానుసారి యా ప్రొద్దుతిరుగుడు
పువ్వు జీవితమ్ము, పుస్తకముల
లోని నీతి కెపుడు లోఁబడలేదు, నీ
తియె పొనర్చుచుండు దీని సేవ. 67

తే॥ కఱవునందు కదనమందు కామమందు
యుక్తమి దయుక్త మిది యను యోజనలకుఁ
దావు లేదు బ్రతుకున కొక దారి లేదు
కసవు మొదలుగఁ గుడుచుట పొసగుచుండు. 68

సీ॥ కసవు లేదయ్యెను పసరమ్ము లేద యొ
క్కొట యున్న నది నరకుటఁ గలదు
పత్రమ్ములును లేవు పతులు లేవు వృ
క్షములందు జగతియాకలికి రాలి
యింత చాలక ప్రజ యెంతకున్ దెగబడ
నవమతి లే దకృత్యమ్ము లేద
యంత సేసియుఁ దిండి యల్పకాలమె వచ్చి
యెంతో జనమ్ము కన్పింపదయ్యె

తే॥ కన్న భూమాతయే తన కడుపు నెత్తి
గొట్టి సృష్టిని లోగొన్న గుట్టు తెలిసె
పూర్వ భారత సంగ్రామ పర్వభుక్తి
త్రేన్చె నీ క్షామమున దురదృష్టభుక్తి. 69

సీ॥ అన్ని క్షేత్రములు మహాశ్మశానమ్ములు
విశ్వనాథుని గాంచ వెడల డెవడు
నేడుకొండలవాని చూడబోరు ప్రతిసో
పానమ్మునకు బిచ్చగాని శవము
పెద్ద బస్తీలలో వెనుత్రోవ కిరుప్రక్క
క్రెళ్ళిన దేహాల కుళ్ళు కంపు
పల్లెలలో నిండ్లు పాడువడ్డవి, పోయె
మట్టిపన్నువసూలుమణియకాడు

గీ॥ నిట్టి కఱవను విషముష్టి చెట్టునందు
నేడు నొకటి కొమ్మలు, దీని నీడ బ్రతుక
దెట్టి చెట్టును, దీని పండ్లే లభించు
పడెడువాడు పడును లేచువాడు లేచు. 70

క॥ తమ క్రౌర్యము ప్రోపుగ లో
కమహాక్షుద్వహ్నికి బలిగాక మిగిలిన
ట్టి మొకమ్ము లడవికార్చి
చ్చు మలసి నలుగడల నరుమ సురసురవోయెన్. 71

మ॥ ఓంకారధ్వని గుడ్లగూబలది కా, దోరంత ప్రొద్దున్ స్వకం
కాంకం బియ్యది, కర్పరమ్ములను కల్యమ్ముల్ కపాలమ్ములున్
గంకాళమ్ములు స్వీయవేషమున భొంకాయింపు, లా కాళికన్
జంకించెన్ మహిదేవి కాళికకె దృశ్యం బైన నృత్యమ్ముతో. 72

క॥ కలగుండువడె పదేడే
డు లొకటఁబో మరొకటన్ గడున్ దేశ మిటుల్
తొలి డొక్కల పుట్టైల కఱ
వులు నందన కఱవు దీనిఁ బోలవు హానిన్. 73

చ॥ ఎముకల గూండ్లు కట్టుకొని యూరువుముక్కలు తెచ్చి సంతత
ప్రమదము గూర్చు రాపులుగు బంతి యధిష్ఠిత మైన భూధరా
జము వొకడున్, జనమ్ము మృతిశయ్యలనుండ ధనమ్ము మోయుసం
ఘమును నొకండు,చిత్రములుగా ప్రకటించె నవాంగ్లపత్రికల్. 74

త్రుటిని పిల్చినవాని కుటిని నిర్ద్వంద్వత
సురభిళింపించు నా సుజను కాలు
లిప్త చూచిన వాని గుప్తదోషములను
భస్మీకరించు నా వంద్యు కన్ను

గీ॥ కాళిమాత కన్పడుదాక కంఠమందు
కత్తి దీయని గండరగండబత్తు
డాత్త తోతాపురిగురుండు నఖిలవేది
తత్త్వమసిగర్జి యాగదాధరచటర్జి. 80

సీ॥ లేవలేని కృశుల లేవనెత్తుచు నూఱ
డించుచు నారటయెలుగువారి
బట్ట గట్టుచు నోటఁ బెట్టి తినిపించుచుఁ
బన్నుండబెట్టుచు బడుగువారి
నేడ్చుచు నేడ్చెడి మృతబాంధవులతోడ
బుజ్జగించుచుఁ జిటిబొజ్జవారి
నుపచరించుచు మందు లొసగి రోగులకు, బో
ధించి పూంచుచు నాశ తెగినవారి

గీ॥ రామ ! కృష్ణా ! యనెడి శకరాజి కాత్మ
యగుచు కొలనికిఁ గొలనికి నెగురు పరమ
హంస వలె గ్రామచరు డయ్యె నా జగద్ధి
తార్థి భైరవిబ్రాహ్మణీ దత్తసిద్ధి. 81

గీ॥ మార్గమున కిరువైపును మడసి పడిన
యడవిజంతువులును నక్క లరదినిన క
ళేబరముల కతడు పాడిమైఁ బొనర్చె
దహనసంస్కారముల నశ్రుధార లొలుక. 82

క॥ యతిరూపి యగు గదాధరు
డతిశయ జాతీయభావహారిత శేత్రా
యితవేదాంతుడు, వెదకెను
మతిబల వాఙ్మహిత శిష్యమండనులకునై. 83

ఉ॥ కేశవచంద్రసేనుడు ప్రకీర్తితు డాంగ్లమునందు జ్ఞానసం
శై శ్రుతియంతముల్ చదివె, నందున బైబిలుతోడ, దీనర
క్షాశ్రము డయ్యె నాతడును, సంసదుదీరితవాఙ్ముఖార్జిత
శ్రీ శకలమ్మును న్నిలువసేయక ధామమధమ్ముకై యిడెన్. 84

క॥ తెల్లని పుట్టమె కట్టును
తెల్లదొరయుఁ దప్పుసేయఁ దిట్టు, నయిననున్
బుల్లసిలిన జాతీయత
నుల్లసిలన్ జేయ నాత డొందదు వేడిన్. 85

ఉ॥ మండలనాథు డై పదవి మాన్కొనినట్టిడు సంస్కృతమ్మునన్
బండితు, డయ్యెడన్ బ్రజకు శాసటయయ్యె రమేశచంద్రద
త్తుండు, తదితిబాధ కనుదోయిని ప్రేల్చి పఠించు నెట్టి రా
గుండెయుఁ నీరుగా రచన గూర్చె, వసించె బ్రిటన్‌మహాపురిన్. 86

క. భారతమును చదివించిరి
దూరానితోదకమున ధూర్జటి కవిషే
కారంభు లైరి, వర్ష
ప్రేరణకై యెన్నొ సేసిరి బుధుల్ క్రతువుల్. 87

క॥ వల్లడి వచ్చి యిటులఁ బ్రజ
తల్లడిలిన వేళ ఖర్చు శారల కంటన్
ఢిల్లీ దర్బారు ప్రవ
ర్తిల్లె మహారాజ్ఞి "కైజరేహింద్" అనుచున్. 88

గీ॥ రోము దగ్ధమౌచుండఁ నీరో,విభుండు
వాయులీనమ్ము వాయించు పగిది దేశ
మింత నెంజిలిపడుచుండ నిదియ యదనొ
దొరతనమునకుఁ బండుగ జరుపుకొనగ. 89

సీ॥ తమ దిగుచున్నమత్తకరీంద్రముల కొమ్ము
కళుకు నుద్దించు చెక్కిళుల తెలుపు
తమ యూపుచున్న మోదము తెల్పు తెళ్ళ యుం
గ్రపు తెంపుజిగివంటి కంటి యెఱుపు

తమ వంచుచున్న యౌదలల తురాయి ము
త్తెములయంతటివి బాష్పముల బొట్లు
తమచేయుచున్న వందనకర్మ మటు చేత
నొసటి వ్రాతను తెల్పి కుసులు తీరు

గీ॥ కలిగి కలగి నిట్టూర్చెదు కన్నతల్లి
భారతాంబ నోదార్చెడు ప్రాజ్ఞపుత్రు
డొక్కడును లేడు దర్బారు పిక్కటిలగ
వరుసపడ నున్న సంస్థానపతులయందు. 90

ఉ॥ చుక్కలు సూర్యచంద్రులు వసుంధర యుండినయన్ని నాళ్లు మా
మ్రొక్కులు గొంచు మాకుఁ బ్రజ మ్రొక్కగఁ జేయుచు రాణిస్వత్వ మా
చక్కని యీ ప్రభుత్వము భృశమ్మలగారుత మంచుఁ బల్కినా
రొక్కమొగిన్ సభాంచితలఘూన్నతభారతమండలేశ్వరుల్. 91

క॥ ఒకవైపు సితుల దర్బా
రొకవైపున మృతుల బారు నొకదేశమువా
రొకదేశప్రజ నేలిన
ప్రకార మిది యనుచుఁ దెల్లవాడె యొకఁ డనెన్. 92

గీ॥ ఈ పరిస్థితి గుర్తించి యింత ప్రాణ
గొడ్డ మగు నన్నకఱవునకు మొద లెంచి
యెంచి యిటనుండి లండను కేగు ధనము
వెచ్చరించె నౌరోజి పాలించువారి. 93

మాలిని॥ తరళతగళరత్నాదాయి బొంబాయి యూరై
వఱలు నతడు 'దాదాభాయినౌరోజి' పేరై
స్థిరపడియెను లండన్ జేరి వ్యాపారవృత్తిన్
పరువడికలవాడున్ భారతక్షోణిభక్తిన్. 94

గీ॥ అతని చేతికి నెముక లే దనగవచ్చు
బ్రిటను కేగుము న్నేబదివేల రూక

పినఁ దోడంగిరో మనకుఁ బాలనము నొసగు
దనుక విడ రిది నౌరోజి యనెడి మాట. 100

ఉ॥ క్రాగిన యిన్ము నీరమును కైవడి వైభవసార మానుచున్
మూగ వలె న్నటించెడు ప్రభుత్వముతో జలగా! మృతాంతమున్
ద్రాగుట లెగ్గు గాదు భరతప్రజరక్తము నన్నవాడు దా
దా గొ[illegible]షిన్ దలంచు సిను తత్ప్రజ చెప్పితి నన్నవాడునున్.101

ఆ॥వె॥ భరతఖండమందు బహునాయకులు కల
రంద[illegible]ంది నితడె యగ్రసరుడు
కలవు లన్నిటికిని కారకు లాంగ్లులే
యనుచు వారి సభనె యఱచినాడు. 102

సీ॥ అభరతఖండార్ధ మాడిన యుద్ధాల
రుం ద్రవ్యయ[illegible] కోట్ల రూపికలను
వైస్రాయి మొదలగు హా రెన్నొ వేల్ పౌండ్లు
చేకొను నెల.రిజీతములను
తగినన్ని జీవనదనదీప్రణాళికల్
సున్నయై వెచ్చ నూర్చు పొలములను
దైన్యభారము క్షేత్రాజీవివారమున్
గ్రుంగఁదీసెడి మహాకుకరములను

గీ॥ అడ్డు లేని వలదల వైద్యకృషిపాళు
పాల్యపల్లీపరిశ్రమప్రకృతి కురని
దుర్వ్యయమ్ముల దుర్భిక్షదోహదములఁ
దెలిపి నౌరోజి ప్రభుతను దులిపినాడు. 103

ఆ॥వె॥ ఎడమచేత విసరి కుడిచేత నీనుండి
లాగికొనును బ్రిటను లాఘవమున
నటులఁ జేయజాల దాంగ్ల ప్రభుత్వమా !
యిండియా, తదర్థ మీయఁగదవె ! 104

గీ॥ ఉప్పుతో తొమ్మిదింటిపై నప్పరము స్పృ
శించు కరము విధించుటచేత కఠిన

కఠిన శాసనములచేత కలవుచేత
ప్రజలు కదలిక గల యస్థిపంజరములు. 105

చ॥ ద్వ్యముఖము ధార వెల్వడలు తెల్లగఁ దోమిన చెంబులన్ గవా
టము కిటికీలు మూసినను డక్కొను వెల్తురుతో గృహాంబులున్
శ్రమయుతయోగసాధన వినా లఘుమాత్రకళేబరంబు లాం
గ్లమ హితపాలనాఫలములా! ప్రజ కద్దిర! భారతమ్మునన్. 106

ఉ॥ వీరి ధనమ్ముపైని చెయివేయరు, చాలును, వృద్ధి వీరు కో
ల్లైరొకొ డైన నీదు కడి యక్కఱలేదుసుమా! ప్రభుత్వమా!
వీరల భవ్యవీధికి దవిష్ఠము, నిష్ఠము ద్రవ్యవీధికిన్
భారతమందు నీ యునికి వాగున కొక్కెరయునికి యొక్కటే.

ఉ॥ బావిని పైస వేసి జలపానము సేసెడివారునున్ బ్రిటన్
లోవసియించువారును విలుప్తభిదల్, తదుదాత్తచిత్తమం
దావట మెప్పు స్వేచ్ఛకు ప్రియంపడు భావము న్యాయమున్ గుడిన్
జావడి గట్టుకొన్న వనిసట్టివి వట్టివి యయ్యెనే! నుడుల్. 108

క॥ చిత్రమ్ములలో నెల్ల వి
చిత్రము బ్రిటి షన్బ్రిటిషుగఁ జేత భరతరాట్
ధాత్రీపరిపాలనమును
క్షాత్ర మ్మిది బ్రిటనుకీర్తి సీమంతినికిన్. 109

ఆ॥ వె॥ చుట్టునున్నవారు శుద్ధసన్యాసులు
మధ్య మద్యపాత్ర మాయమయ్యె
కావలున్నవారు కటికి న్యాయస్థులు
కడలిదాటె భరతఖండధనము. 110

ఆ॥ వె॥ తల్లి రత్నగర్భ, తనయులు గర్భద
రిద్రులా! యయారె! సృష్టి కెదురు
ఎందొ? భరతఖండమందు, పాలించువా
రెవరొ? ధర్మపరులు బ్రిటిషువారు. 111

ఆ॥ వె॥ బ్రిటనునందు వోలె ఘటియింపు మిందియా
లోఁ బ్రభుత్వమా! కడున్ సుఖంబు
ప్రజకు, భయపడకుము రష్యా జయించు న
టంచు నీకు ప్రజలె యాయుధములు. 112

క॥ పాలించెడువారలు మొఱ
లాలించెడువారలుగఁ జెలంగరొ ప్రజక
ష్టాలన్ వాకొన వశమా!
యేలుబడికి మౌన మూనుటే భూషణమా! 113

చ॥ సురుచిరదృష్టి నో ప్రభుత! చూడఁగదే! బ్రిటనందు గోవు లె
వ్వరో భరతావనిం బులులు వా రగుచున్నది, దీన విప్లవ
స్ఫురణము వచ్చుచున్నది, యపోహము కా దిది, కాననమ్ము గా
దిరునెడలం బొలమ్మె యగు నెట్లటు లీవు ప్రవర్తిలన్ గదే. 114

మ॥ కురువృద్ధా నవరోజిపల్కు లివి ముల్కుల్ వేరికో? శాత్ర్యమున్
మఱువుంగా మది దాల్పనట్టిరకు, నీ మాత్రంబు నెవ్వారు ప
ల్కిరి? సంయుక్త విభాగ చెన్నపుర వంగేలా మహారాష్ట్ర ని
ర్ఝరిణీ పంచకరాష్ట్ర మధ్యతటరాష్ట్ర శ్యామరాష్ట్రమ్ములన్.

ఉ॥ శ్యామముఁ బాప విత్తము పొసంగును బందరువందు భాగమై
భూమికరాన సెస్సనగ, పూర్తిగ నయ్యది ఖర్చుకాక యే
క్షేమము మొల్పి జీవకళ చిన్నెలు పొల్చె ననేకవత్సరాల్
ప్రామిన వ్యాధియున్ బ్రకృతివైద్యము సేయ నడంగుకైవడిన్.

—:o:—

# హోళీఖండము

శా॥ శ్యామశ్వేతపలాశపీతముఖవర్ణాక్తాంగ మై, ఘీంకృతి
స్థేమస్నిగ్ధనినాదహూతిమిథ మై, ధింధిన్నదన్మర్దలం
బై మంజుస్వనగీతనాట్యకలితం బై హాస్యవేషోజ్జ్వలం
బై మోదించె జనంబు హోళితటి ఘోరావగ్రహాంతమ్మునన్. 1

శా॥ భంగున్ ద్రావి హొరంగుడోలు మజరా వాయించి పన్నీటితో
రంగుల్ కేసరయుక్తిఁ జల్లుకొని హోరాహోరిగాఁ గ్రోవులన్
సంగీతాల్ విని నాటకాల్ గని ప్రజాసందోహముల్ చిత్తమున్
సింగారించిరి హోళిపండుగకు మున్నెన్నాళ్లుగేన్నాళులున్. 2

క॥ కోపింప రసభ్యతకున్
శాపింపరు సరిగపట్టుసాలువపై నా
టోపించి రంగు చల్లిన
నా పండుగలిపి యింత యం తన వశమే ! 3

చ॥ ఋణ మిడి హెచ్చువడ్డి నెదిగించి ఋణస్థుల యాస్తి దాని తీ
ర్పునఁ దమ దోచు కట్టుకొని పొంగియు యెచ్చెడి నింటిమీదికిన్
జన మని తల్పు వేసికొను సాహు లటుల్ గని రంగఁ జల్లువా
రిని గడియన్ బిగించికొని రెండబో యుండ్లనుదూఱి చుట్టెడన్.

ఉ॥ పండుగనాడు నాకడకు వత్తురె! మద్యములమ్ముచోటనే
యుండెద రెందఱే ననియె నొక్కఁడు, నీయది నల్లమందు, నీ
యుండల సార మెంతయనె నొక్కఁడు, భూమికరమ్మువెన్క ను
ద్దండము పన్ను దీనిదెకదా? యనభిజ్ఞుడ వంచు వాఁ డనెన్. 5

శా॥ సారా ద్రావుచు నొక్కఁ డేల్పడికి లచ్చల్లచ్చ లాదాయ మీ
సారద్రవ్యము కాదె తెచ్చునది నాన్ సారించి కే లొక్కఁ డే
డీ రాజ్యమ్మున దింపెనో తెలివి బుడ్డిం బోసి సీల్ చేసి ప్రై
స్కిరం క్రాంది యవన్ ద్రిరూపమున జేజేబాబు వాడే యనెన్. 6

ఆ॥వె॥ వారె భూమిసురులు ఫాదిరీతనమున
వారె క్షత్రియులును పాలనమున
వారె వైశ్యులైరి వాణిజ్యమున మన
మందఱమును శేష మనె మఱొకడు. 7

చ॥ తగితగకున్న నెల్లపుడు త్వజ్జనమే నటియింప నౌనె?, పం
డుగరెఱు నాటకమ్మున ననుంగొని వేస మొసంగు డంచు వే
డగ నొక డా నటాధిపతి లండనుభారతకార్యదర్శినిన్
దెగడుము! కొల్వునందు స్వజనేతరుఁ జేర్చుకొనం డనెన్ వడిన్. 8

ఉ॥ ఒక్కని నొప్పికొందు రేటులో యెవరేనియు నేన్ ఫిరోజిషా
కిక్కడి పాలకీయసభ నిచ్చిరిగా మొనమొన్న సభ్యతన్
జక్కగ నాడువేసము రస మ్మొలుక న్నటియించు నీత డ
మ్మక్కర యనన్ జనమ్మనె నొకాయన, యాతడు చేర్చుకో బడెన్

గీ॥ నిఖిల పశుపక్షిమృగముల నిస్వనములు
చేసి కామదాహార్థము మోసినారు
మొద్దులను కొంద, ఱొక తెగ మొనసి రాజ్య
విదులు పగటివేసమ్ముల వేసినారు. 10

చ॥ విదథుడు ఫాదరీకిఁ దగు వేషము దాల్చి యొకానొకండు తె
ల్లదొరతనమ్మె సత్యమిది బ్రహ్మము సుందరమున్ శివమ్మనై
తదితర మెల్ల మాయ, యిది తత్త్వము, మాయమతమ్మునుండి ప్రో
వఁదలచి మిమ్ము దేవు డిటఁ బంపెను మమ్ము నటంచు వాకొనెన్.

గీ॥ మమ్ము నమ్మిన వారికి మంచి జీత
ముల నొసంగెద, మన్ని వ్యాధులను రద్దు
సేసెదము, ఫీజు పైసాయుఁ దీసికొనము
ఫాదరులము బాధితజాతి సోదరులము. 12

క॥ స్త్రీవిద్యకు మూలము మే
మే, వెలయించితిమి చదువుమేడల నిం దె
న్నో వసతుల బాలికలకు
దీవింతుము రాజభక్తిదిగ్ధులుగ మిమున్. 13

గీ॥ శరదశరద లతల సౌమ్ము వలదద మాకు
బ్రిటిషువనుండి, మీ యాత్మోద్ధరణముకొఱకు
వెన్ని నిజువుల యొత్తైన నేమి ధనము
దంధనము గడ్డివామి బోధమ్మమందు. 14

గీ॥ పూర్వము వరాహరూపి యై భూమిని హరి
యెత్తినాడు పై కను మాట యుత్తదిసుమి!
మేము మీ మహాత్మ నెత్తుచున్నాము స్వర్గ
మందు పిత కందు నెత్తున కనియె మఱియు. 15

క॥ అనె నొకడు నేను వైద్రా
యని, నా సభలోని సభ్యు లీ రార్యులు నా
మన మలర మెలగువారల్
జన మెఱగ నిపుడయిన మెలంగుడ టంచున్. 16

చ॥ అపుడు ముఖా నిజమ్ముగనె యెంతటివాడవు నీవు, వాని వే
సపువస యంట్టిపడ్డటుల సల్పెద మే మని మేనం బన్నెగం
గు పులిమి వ్యోటు సూ టొనర గూరిచి యింక నుపన్యసింపరా!
ప్రపనిత శేముషీబలభరా! యనం దత్ర్పముఖుండు వాకొనెన్. 17

క॥ తెలియుడు 'లిట్టనుగా' నను
'నెలిజన్' 'లారెన్సు' నేగి, రెవడో 'మేయోన్'
బొలియించెను పగతో, నా
వల వచ్చెను 'నార్తుబ్రూ', కవల నే నైతిన్. 18

ఉ॥ రా యనరాదు పిల్వుడు దొరా! యని, నైకవిధాస్మదర్థహ
ర్తా! యనరాదు పిల్వు డతిరంజకభారతభాగ్యధర్మక
ర్తా! యని నన్ను ముగ్ధజనులార! వరాయిని గాదు మీకు వై
స్రాయిని, నాదు శబ్దము తురాయి భవన్మహి రాజరాజికిన్. 19

గీ॥ ఎండకాలమున నుదకమండలమున
మంచుకొండదండల నిక మసలం దలప
మాంగ్లవిభుతకు లోగింతు నదరి చంద్ర
మండలమును మత్కృస్మృతిమండనముగ. 20

చ॥ అన నొక కాని తక్కువకు నమ్మదు నే సరుకేని యేనిక
న్నను, నను నా దుకాణమును నందు దొరా! కొనిపోగదే! పురా
తనమధువుల్ గులాబివిరితావుల మేల్సిగరెట్లు దెత్తు నం
చనె నొక జేరి, యెల్ల రహాహా! యని, రంతట వేషి యిట్లనెన్ . 21

చ॥ ఎది యపకార కారి యనిపించుచునే యుపకార కారియో
యది యొకచో యొకండు భరతావనిపై బ్రిటనాధిపత్య, మ
య్యది యఘటింపకున్న మతమందును మండలమందు దక్క-ప్రే
మ దనరనట్టి మీకు నభిమానము దేశముపైని గల్గునే?. 22

గీ॥ కోత కోయు డాక్ట రొకండు, వాత వేయు
వైద్యుడు నొకండు, రోగి క ప్పట్టున నది
బాధ వెట్టు, స్థిరారోగ్యపదవిపట్టు
రెండు సేయు మా ప్రభుత యార్తి యది యెంత. 23

ఉ॥ దేవుడు మమ్ములం భరతదేశము నోమెడు శాంతిదూతలఁ
గా వెలయించుపూర్వము సుఖమ్మును మీ కిటఁ బంచిపెట్టినా
డే? వెదవెట్టి యుద్ధముల నేము ధనమ్మును సర్వసీమలన్
గావలి గాచి మీకొఱకుగాదొకొ! శాంతి ఫలింపఁజేయుటల్. 24

శా॥ మాదే మాయది, మాదె మీయదియు, మీమాభేదముల్లేవు వి
త్తాధికత్వమ్ము, దాని ఖర్చిడుటలో దైవారెడున్ దెల్పి, త
న్నైమ్రదుర్యమ్మును మీకు నేర్పెదము మే మై చేసి చూపించుచున్
వాదం బాడక నేర్చుకొం డొక శతాబ్దం, బౌదు రస్మాద్వృశుల్.

గీ॥ విశ్వవిద్యాలయములు స్థాపించితిమి త్వ
దీయభారతమాతకుఁ బ్రదినయనములు
దేశ మొక్క ఛత్రమ్ము క్రిందికి నయించి
కలిపినాము జాతీయతాపరమవిద్య. 26

శా॥ మాచే భారత మాదుకోబడనిచో "మైగాడ్!", పురారీతి వ
న్యాచైతన్యము తాండవింపదొకో! పిండారీల గుంపుల్ మిమున్
దోచన్ రారొకో! మీవి కుత్తుకలు కత్తుల్ వారి వౌచున్ "సపోజ్"
మా చిద్విద్యను ముక్క నేర్ప, మపు డే మౌ? నిందు సద్విద్యతో.

గీ॥ వద్దువద్దు నేర్పెకయుండవద్దు దొరలు!
పొడుచునెడనుండి క్రుంకెడునెడకుఁ ద్రోవ
ప్రొద్దునకుఁ జూపు దొరలు! మా పెద్దతల్లి
చిన్నవోవు ననన్ వారు, చెప్పె నతడు. 28

ఉ॥ అంటిమి గాని మే మెడతుమా! యొకపట్టున, గూర్ఖ డాదటన్
గంటిని జెప్ప వోలె మిసిగా వగ పూయజూకాల్వసాతిగా
గంటకు వేలమందిబలగమ్ము ననుదింతును సీమనుండి, మా
వంటకుఁ దింట కైన గృహాభాగమ్ము లిప్పుడు రెండు దేశముల్.

అనుష్టుప్॥ చెలంగు బురుజుల్ నాల్గు
బెలూచిస్థాన్ సింగపూ
ర్సిలోన్ బర్మాలు, తన్మధ్య
స్థము పూ కోట యుండియా. 30

క॥ షణ్ముఖ చంద్రన్ మీరు హి
రణ్మయగర్భభువనపిపాలనమునఁ దగ మా
రాణ్మకుటము కదే! శాచె కి
రణ్మంగళ మగుచు విఘ్నరహితముగ మిమున్. 31

క॥ మోటారుకార్లు రబ్బరు
తోట లమరెఁ గాగితమ్ము తోల్సరు కుక్కా
స్నో మైన బట్ట నునున్నగ
మేటిగ నీనాటి కొదవె మీకున్ మాచే. 32

క॥ నలుసంతకాలమున వా
ర్తలు సేతువునుండి శీతధరమును చేరన్
వలగొన నాగరకత తీ
గలు వాటించితిమి భరతఖండధరిత్రిన్. 33

క॥ మిల్లులు పోస్టాఫీసులు
మొల్లము తో పార్కు లొప్పెఁ బురములలో మా
వల్ల నిట, మింటి విద్యు
ద్వల్లిన్ దింపెదము దేశవైభవమునకై. 34

క॥ బొంబాయిలోన పార్సీ
లం బయికొనినట్టి మొటకు లావురనిరి, ఖ
స్మంబయిరి మున్ను థగ్గుల్
పంబబలికె నొడలు మాపలాలకు మాచే. 35

శా॥ భీమాకంపెని స్వప్నమందయిన మీ పెద్దల్ కననోచ, ర
ల్లై మీకై నెలకొల్పినాము, ప్రజలారా! వృత్తిపైఁ బన్ను మీ
కే మే లౌ, లయిసెన్సు నల్లై, సయిలెన్సే మీకు సంశోభ, కా
ఫీ ముప్ప్రొద్దుకు నాలు ప్రొద్దులను సేవింపుండు టీ మా కృపన్

శా॥ టీకాఫీ మొదలైన తోటలను పోటీ చేసి పెంపంగ మీ
లోకుల్ ముందుకు రార యెవ్వరు న దేలో! దాన మావారికిన్
వీకన్వచ్చినవారి కిచ్చితిమయా! "ఫీసింపిలెస్టేట్లు"గా
చేకోండా! యని వేలవేల యెకరాల్, చింతింపకుం డో॥ ప్రజల్!

గీ॥ చిన్న రహదార్లు పెద్దవి చేసినాము
కోట్లు పౌండ్లు ఖర్చగు నను కొంకు లేక
యిం దయోమయమ్ములు నున్న. విటులె యుడ్డ
ప్రోళ్ళలోఁ బెంచినాము రేవులను మేము. 38

గీ॥ అనుచు, మీ పెంచినవి మీకె యవగతమ్మ
లుడ్డుగుడిపెను మమ్మ మీ దొడ్డఖర్చు
బ్రిటను పొలిమేర నడుగు దుర్భిక్ష మిడద
యంత ప్రీతి దానికి నిండియాను విడద. 39

క॥ ఆమని పాడును పాటల
నేమని? యేటేట ప్రజ'మనీ' ప్రభుత'హానీ'
యీమహిఁ బ్రజకు హానీ? యది
యే మరి ప్రారబ్ధ మని, కథించెద మికనున్. 40

గీ॥ భారతమ్ము నష్టాదశావగ్రహముగఁ
జేసినారు సృష్టికిఁ బ్రతిసృష్టి చేసి
గద్దె యెక్కించి దిగు మని కాళ్ళప్రేళ్ళఁ
బడిన దిగు నేడు? దుర్భిక్షభావ మంతె. 41

ఉ॥ సంచితజీవమౌనెడఁ బ్రజాసముదాయము మీరు బిట్టు ఘో
షించిన మేళ్ళు పొందవలె, జీవము పోవుచున్న మేను మీ
నించిన వీనికై జలము నిచ్చుకొనన్ వలె కండ్ల నంచు వా
చించెడివారితోఁ బలికె శ్వేతముఖప్రతికర్ముఁ డిట్లుగా. 42

చ॥ అనవసరవ్యయ మ్మతిశయ మ్మగుతిండి యనేకరోగ కా
రణములు గాగ మీ పరిసరమ్ము లశుభ్రత నుంట మందతా
గుణమును వర్షహైన్యమును గూడి మహాపద వచ్చె. మీరు పి
ల్వ సరుగుదెంచు నా కలపు పాయునె యెంతగ మేము పోరినన్.

గీ॥ మాకు కనుబొమముడి దెచ్చు మాటలాడ
రా దెవరును, మద్రాస్ గవర్నరొకతఁడు
వన్నె మిన్నంటి దేశ మాపన్నమైన
దన్న మాత్రమ్మునఁ బదవి కస్లఁ డయ్యె. 44

క॥ ఇల్లిల్లు తిరిగి వ్యాధిన్
మల్లడిగొను ప్రజకు సూదిమం దిడి వెస్సున్
వల్లడికి 'నొయాసిస్సున్'
జల్లగ నెలకొల్పి మేము శ్రమపడలేదో ? 45

ఉ॥ మాది విశిష్టజాతి. దం[illegible]లినవారము కాము, కాలశీ
లాదృతకార్యనిర్వహణమందునఁ బెట్టిరి పేరు వారు మం
డీ! దొరయింతు మెల్లెడల సెల్పడి యామని గాగ, నెవ్వడే
నీ దమి నన్న జంకము, సహింతుము హేతునిబద్ధవాదమున్ 46

శా॥ చూడన్ లేదొకో! మీరు వేల్స్ యువరాజున్ ముగ్ధమందస్మిత
శ్రీడిండీరదయాపయోనిధి, రాశీభూతసౌజన్యమున్
మూ డేండ్లాయెనొ వచ్చి యిచ్చటికి మిమ్ము 'న్నిగ్గరుల్'గా నెవం
డాడన్ రా దని మందలించె మము శాహోటమ్ముగాఁ గొల్వవన్.

సీ॥ మా కట్టు మా జుట్టు మీ కట్టు జుట్టునై
కట్టుతోఁ గొల్చు సంస్కృతిని బట్టి
మా భాస మీ భాసగాఁ బొల్చు గద్దెపై
వమరభాషను మృత మనుచు వెట్టి

మా గ్రంథసారంబు మీ గంధసార మై
తొడరుఁ బ్రావలపును తుడిచిపెట్టి
మావల్ల నిశ్ఛంద మై విజృంభించి మీ
వ్రాత కోరాడుఁ బ్రాకైత దొట్టి
గీ॥ యింత యేల, యాబోతున కెట్టి దిందు
వైతురో ముద్ర యట్టిదె వైచినాము
మీ పయిని లోన, నిక్షేప మై వరగు ని
ది తరతరములు, మా మేల్ నుతింప వశమె! 48

చ॥ ఒక 'జకరయ్య' వాని విని యుల్లము కళ్ళము సేయు మోముపై
నికరము పంట చిర్నగవు నిండగ వేషిని లిట్ట నంచు నెం
చి కెరలి పల్కె నో ప్రభువ! చెప్పుము త్వత్కృతశాసనాదిరం
జకవిషయమః స్థలన్ జనమనస్థ మహోహము ద్రోహ మన్నటుల్,

చ॥ ఒకటి స్వతంత్రపాలన, మ ఔక్కటి హూణుల పాలనమ్ము, కో
రుకొనుము రెంటిలో నెదియొ రూఢముగా నని దేవు డాడుచోఁ
బ్రకట మొనర్తు రెండవదె వాంఛిత మై తగ నంచుఁ బల్కె న
మ్మిక మహనీయు డాతని నమింతుఁ 'బ్రసన్నకుమారఠాకురున్'.

ఉ॥ కాపలె నాంగ్లు లేలుటె జగమ్మున నంచు 'హూసేనుసాహె'బ
న్నా! వచియింపవేమె! యని స్వాప్తుని బక్రయ చూడ నాత డ
చ్చా! వివరింతు మా గురుపుసంతతివారిని సంప్రతించి నా
భావము నాంగ్లు లేలుటయొ భారతమున్ మరి యెవ్వ రేలుటో.

క॥ నా విని గలగల నవ్విరి
యా వీథీవీథిజనము లచ్చటఁ బ్రోగై
వావా దొనరించె నిటుల్
వావిరి నా హూణవేషవైభవయుతుడున్, 52

గీ॥ నిన్న నున్న చట్టము లెన్నొ నేడు మాఱె
చిన్నచిన్న చట్టమ్ములఁ జెప్పనేల
కొన్ని మీ శ్రేయమున్ గూర్చి మొన్న మొన్నఁ
జేయబడిన, వింకెన్నియో చేయబడును. 53

ఉ॥ ఎక్కడనుండి వచ్చుఁ బ్రజ కెల్లఁ దుపాకులు కత్తు ? లైన నిం
దొక్కటి చూచినా, నెవరికో ధనవంతుల కవ్వి యాజ్ఞమైఁ
జిక్కిన నేమగున్, గలహశీలబలిష్ఠదరిద్రకోటికిన్
జిక్కిన శాంతి భంగ మగుఁ, జేసితి నాయుధికమ్ము చట్టమున్. 54

మ॥ ఒక యాంగ్లేయపటవ్యూహము మ్రవ స్వదేశ్యుల్ నల్వురుం బుష్టు తా
టకు వీ లున్నది. కాని బెట్టిద . గాథ బొప్పు సహ్యాగ్నిశ
స్త్రకళాకోవిదు లెందఱేని మన దేశఖ్యాతికై కావలెన్
ద్వికపం బెంచితి విపణమ్ము రణమున్ లే న్న మా సైన్యమున్.

క॥ టర్కీని గెలిచె రష్యా
మార్కొ దము బ్రహ్మ ననెడి మాట చెవిఁ బడన్
తఱ్కించి పత్రికాముఖ
కరవశవాక్ స్వచ్ఛమైని కత్తి పదిమితిన్. 56

క॥ ఇది విని యెంతో గొనగ
పదిమితి రనె ఖక్రీయ నియుదహాముదు' మా నే
త దినము వహో వా! యని మె
చ్చి దమరి గొలియాడు నని హాలసేర్సాహె బనెన్. 57.

మం॥ద్వి॥ అంత వైస్రాయివేషాంచితమూర్తి
మఱి యిట్లు వాచించె మంత్రిని గాంచి. 58

ఉ॥ రాబడిపన్నుతో కఱవు రాల్పఁ దలంచితి, మీకు కాపాలా
కై బహుళమ్ము రక్షకభటావళి నుంచితి. బిట్లు బంధనా
కోటల మెక్కుడించితి, నెకాయకిఁ జెంచితి వైద్యశాల లె
న్నోబడు లెన్నొ! మీ కలిమిఁబెుత్తు బృహత్తుగదే!మదిజ్యతన్. 59

గీ॥ పిచ్చలించె రిజిస్ట్రాఫీసుల గుమి
ముద్రణాలయములను చెర్వులను కాలు
వలను త్రవ్వింప శాఖ యేర్పడియె, మేని
కెన్ని కీళ్ళో ప్రభుత చేసె నన్ని మేళ్ళు 60

ఉ॥ స్థానికపాలనాసమితిసభ్యులఁ గొందఱ నిందువారినిన్
దానె వరించి చేరుచుకొనంగ గవర్నరు కాజ్ఞ యిచ్చి యం
దైన ధనవ్యయార్జనములం దటనే తుదినిర్ణయమ్ము గై
కో ననువుం బొనర్చితిమి కోరుట తీరుట లొక్కచోటఁగా 61

ఉ॥ మాండలికాధిపత్య ముపమాండలిక మ్మధికార మీయతే
'దిండియ'నైనవానికి గ్రహించునొః లంచము లంచు, నై.సి.యస్
ఖాండముతేనె నాఱవది భాగము నంజలిఁ బోయవచ్చు మా
లండనువారు మీకు జనరత్నములార! విడుండు నెంజిలిన్. 62

గీ॥ అమెరికాకు స్వాతంత్ర్య మెట్లమరె? నిండి
యా కఠినివేశతయును ద వ్వైన దెట్ల?
ననుచు 'హారిఘోషు' డడుగఁ జెప్పె నత డమెరి
కాయు బ్రిట నేకవృత్తశాఖలె కదోయి! 63

ఉ॥ నా సభలోని సభ్యులకు నచ్చని కార్యము నేని చేసెదన్
జేసితి మొన్న, నెవ్వరును చేయని యంతటి నట్లు, ఆమని
ర్వాసనకాంతి నై నవకరమ్ము సృజించితి, పైని ఇండియా
కౌన్సిల సత్తదంతఁ గర మంచును దీనిని ద్రోయకుండుతన్. 64

క॥ పదునల గారు సలహాదా
ర్లఁ దగు నదీయసభ యొప్పు లండనులో, నా
సదసునను గల రిరువురు
త్వదీయజను, లందు కార్యదర్శిదె వీటో. 65

క॥ ఏ మగునో చూడగవలె
నా మనవి స్వకీయపాలనాకలితం బౌ
మీమనవి నాకు నతనికిఁ
బై మను సభ పార్లమెంటు పరికింపవలెన్. 66

ఉ॥ రాణియొ రాజొ పేరునకు రాజిలినన్ బ్రజ యెన్నుకొన్న స
మ్మానితు లొక్కచోఁ గలసి మానుగ స్వావని నేలుకొంట కా
స్థానము పార్లమెంటు తొలిసారిగఁ జుక్కలత్రోవ క్రింద విం
దైనది కంటి కొక్క బ్రిటనందె సుడీ! జగదేకదీప మై 76

ఆ॥ వె॥ అట్టి పార్లమెంటునందె మీ ప్రతిపత్తి
తేలవలయు రాణివ్రాలు వలయు
నిద్ది నియమబద్ధ, మిది గాని సరణిమై
నడచువారు ముండ్ల నడచువారు. 68

క॥ నలువురు నలువురు సభ్యులు
తులకించెడు సభల నధిపతులు బొంబాయీ
కలకత్తా మదరాసులఁ
గలరు గవర్నర్లు మామకప్రతినిధులై. 69

మ॥ పగటింపించెను తక్కు భారతధరాభాగేంద్రులన్ లెఫ్టినెం
టుగవర్నర్లు కమీషన ర్లని బ్రిటన్ కూటమ్ము, వారి న్ననన్
దగ నేమించెను పార్లమెంటె, యయినన్ వారల్ మదాజ్ఞానుసా
రగతుల్, తత్కరణీయకార్యములఁ బ్రారంభింపుడా! తీర్చెదన్.

గీ॥ ఏకమత్యస్వపాలనాఖ్యములు రెండు
భారతులు రుచిచూడని పండ్లు గలవు
రెండవది యిందు దొరకుట బ్రిటనునుండి
కావలయు, నోడకున్ మంచి గాలి వలయు. 71

అనుష్టుప్॥ రామఖాను రహీం క్రౌతి
నామదారణ మొప్పుచో
మీ మందికి స్వాతంత్ర్య
మా మర్నాడే లభింపదే! 72

క॥ కలకంఠకంఠి కన్నీ
రొలికెను, సిరి తొలగె, నెవరి కోయీ? మీకే
కలకంఠి మాది కన్నీ
రొలికెడు పని లేదు, సిరియు నరియదు శాస్త్రీ! 73

చ॥ ఎవ రెటులైన నేమి మన కేల య టన్నది భారతీయునం
దు విడిది గొన్న భావ, మది దూరమె, మేమును దూర మౌదు, మి
ట్టివి కల వెన్నియో, ప్రతిఘటింపుఁ డెఱింగి సమాజదౌష్ట్యసం
భవనిచయమ్ము, నయ్యెడ స్వపాలన మిమ్ము వరించు నర్థిలన్. 74

ఆ॥వె॥ ఏమి తెలియు మీకు నెన్నెన్ని వంకరల్
పోవునో కవిత్వమును ప్రభుత్వ
మున్న దున్నయటులు కొన్నింట ననరాద
యనిన శిఖర మందుకొనవ యవ్వి, 75

ఉ॥ చెప్పన చెప్పనా యనుచు చెప్పెద శాస్త్రి సువర్ణ గోప్యమున్
జెప్పకు డేరి కే నిటులు చెప్పితి నంచు భవజ్జనమ్ములోఁ
జెప్పులు కుట్టువాని మడిచేతల మంత్రముఁ జెప్ప వాడు తా
నెప్పుడు కౌగిలించి మధురించునొ మే మపు డుండ మీయెడన్.

క॥ అని నొడువుచు నా వేస
మ్మును చాలించె, నత డందు మూగిన జనముల్
మనకు నవవేష మీ సా
లునసే ప్రారంభ మని యెలుంగిడి రెలమిన్. 77

గీ॥ అందు ముఖ్యు డొకం డనె నాంగ్లసముముఁ
జేయలేము పాలన క్రమశిక్షణమునఁ
గాని పెరవార లెంత విన్నాణు లైనఁ
దనుపలేరయా! మనలను మనము వోలె. 78

క॥ తన పెత్తనమునఁ దా న
ష్టినిఁ బొందిన నేమి నరుడు చింతింపడ, య
న్యుని పెత్తనమున శంకిత
మనస్కు డై యెరియు లబ్ధి మందర మైనన్. 79

క॥ అన సత్యము సత్యం బని
యనుచున్ బెంగాలె చూప నగు నధ్వం బీ
యనువున దీపధ్వజ మై
యనుచున్ సాయాహ్న మగుచు నరిగిరి లోకుల్. 80

సీ॥ పరిణతమానవత్వబ్రహ్మవాహన
ప్రథమంబు తత్పురపరమహంస
భారతప్రథమాంగ్ల పట్టభద్రుండు త
ద్విశ్వవిద్యాలయావిష్కృతుండు

బ్రిటనుసత్కృతనుత ప్రీతసర్వ ప్రాచ్య
బుధజనప్రథము డా ప్రోలి వెలుగు
జాతీయసమితిసంస్థాపనప్రథమవా
గ్ధారాసముల్లాసి తన్నివాసి

గీ॥ యటఁ బులుంగుల కిచకిచ బ్రిటనుభాస
యచటివారికి అండ నుద్యానవనము
కాని ...డి పల్లె బుడుత చుక్కాని చూచు
దాని చిత్తరువు కలకత్తా యటంచు. 81

ద్వి॥ ఆ పురి మరొకచో నలరె లాస్యమ్ము
సోపాన మయ్యె ది సుఖసౌధమునకు. 82

శా॥ ఆ లాస్య మ్మయిపోవ నం దిరువు రెందైనన్ గవిత్వమ్మొ తే
దా లాలిత్యము ధారయున్ దగు నుపన్యాసమ్మొ సంగీతమో
యాలింపన్ మతి నెంచి యొక్కొకరప్రశ్నాలో కినిఁ గాంచి యం
దా లేఖ్యమ్ము గదర్థ మంచ కుగ మస్తమ్మెత్తకే వాడనెన్.

క॥ మాటాడు బెనర్జీ యీ
పూట సనుచు, నే బెనర్జి పూజ్యుడ ! యన ను
ద్ఘాటితమన్న డెగాదిగ
ఘాటుగ వారిఁ గని తమరి గ్రామ మెట ననెన్. 84

క॥ ఒక డనె పీలైడా యని
యొకడు నవద్వీప మనె తదుక్తు డనె నొకం
డెకద విదితుడు బెనర్జీ
సకలభువి సురేంద్రనాథసంజ్ఞాధరుడై. 85

సీ. జాతీయ గోష్ఠివల్లీతల్లజమును శా
శీమట్టసీమ మొల్పించినాడు
ప్రభుత ప్రతుంపని యట్లు స్వజనవర్తనము ను
కంచెగా చుట్టు కల్పించినాడు
అమృత ధారగ నుపన్యాససారము వోసి
చెచ్చెరఁ బెరుగఁ బోషించినాడు

ఎల్ల రాష్ట్రముల భావోల్లాసమును బంధి
లిగ జేసి దాని నల్లించినాడు

గీ॥ భరతమహిమాజిసీమూర్తి పట్టణీక
శాలయాంగ్లభాషాబోధనార్తకీర్తి
నామము సురేంద్రనాథ బెనర్జి. ప్రజల
యధికృతిని సామమున గోరు వతని యర్జి. 86

క॥ 'ఇండియనెసోసియేషు' న
ఖండము తత్సమితి దేశగౌరవసరణి
న్నిండించు వెలుగు చుట్టున్
మెండుకొనిన రాష్ట్రములకు మిసిమిబలువునన్. 87

క॥ ఢిల్లికి దర్బారునకై
వెళ్ళి సురేంద్రుండు వచ్చి వెలయించె నయా!
ప్రోల్లసితజనాకాంక్షా
వల్లికి వృక్షముగ నీ సొబగుదర్బారున్. 88

గీ॥ అం దొకడు వే ఱొక బెనర్జియాహ్వయమ్ము
వింటి, నో టాడుచున్నది వినుతువా యన
నెవ్వరా! యని వక్త యోజించి తెలిపె
నా ఘను 'డుమేశచంద్రబోనర్జి' బాబు 89

క॥ ఆ బాబు లండనీయులు
నేబా సన బి ట్టుపన్యసించెను పలుకుల్
జాబిలి కళుకులుగాఁ 'గెన
డా' బలె భారతము కొంత దక్కొనుటకునై. 90

చ॥ అన విని వారు పల్కిరి మహాశయ సాప్తపదీన మైన మై
త్రిని మము నింత దగ్గఱకుఁ దీసికొనన్ దగె నీకె, తత్సురేం
ద్రుని సభ కేమి పచ్చెదము తోడ్కొనిపోగదె! యింతకున్ ద్వదా
ఖ్య నెసగు శోభనాతురము లయ్యె! అవృత్తము లుక్తిసందడిన్.

గీ॥ అన నతడు 'సాతీమిత్రా' మదాఖ్య, నన్ను
వక్త యంద్రు 'సందేశ' సంభోక్త యంద్రు
నెక్కసక్కెముగా దాని కేమి మత్ప
రిచిత మీ పురి నా బాలవృద్ధజనము. ౯౨

క॥ అని యేమొ చెప్పలో వా
నిని మృదువుగఁ బెనగువాని నికటమధురభా
ష్యనిలయమునకున్ వారలు
గొనిచని వెచ్చించి రిరునొకొండును రూకల్. ౯౩

ఉ॥ మూవురు తమ్ములమ్ము గొని మూ డడుగుల్ చని రేమొ, తామరల్
సీవిరి వేయు కన్నుగవచెన్నులు తూరుపువేగు వెల్గుని
ద్దావిడిసన్న రేకలకుఁ దా మభయ మ్మిడు రీతి నొప్ప వీ
జావిభవప్రసాదము నొసంగెను బాలకు డొక్క- డేగుచున్. ౯౪

గీ॥ ఆ పదా రేండ్ల మాణవు వరసి యిరువు
రరసినంత మయిల పోవ నంతరాత్మ
జన్మసాఫల్యసరసిలో జలకమాడె
నెవరో యీ బొట్టె యన సాతీ యిట్లు పలికె. ౯౫

క॥ ఇత డొక దైవకటాక్షో
ద్యతు, డాఖ్య నరేంద్రనాథదత్తు, మనసు సం
తత మెద్దానినొ వెదకెడు
గతిఁ దోపించియును నగ్రగణ్యుడు విద్యన్, ౯౬

శా॥ విద్యాసాగరు పాఠశాల జిగి యీ పిన్నండు వేయున్ గదా!
ఖద్యోతీకృతనైకభేదమత విజ్ఞప్రజ్ఞముల్ ప్రశ్నముల్
ఖాద్యంబౌనొ నరేంద్రుబొండులివు భృంగాల్ తేనియన్ మ్రింగునే
అద్యం బీతని పాట ప్రార్థనముఖం బై నేటి యీ గోష్ఠిలో. ౯౭

గీ॥ అనెడు వక్తకు వినుకలి యశ్వశకట
గామి కొకనికి కనుకలి కానుక లిడి
మ్రొక్కి- సమ్మృదుహాసము మాఱుమ్రొక్కు- శకట
ఖాసినుండి పీఠై డానివాసి పొంచె. ౯౮

మ॥ ఎవ రాపెద్ద ? ద్యురాడ్జయంత కళలిందే రూపుగొన్నట్లుగా
నెవ రా కుఱ్ఱడు ? కుఱ్ఱవాని ముఖకాంతిన్ లోకబాంధవ్యముల్
చెవిఁ బన్నిరునఁ గల్పి తచ్చరితమున్ జింటింపవో ! యన్న రెం
డవవాసిం బ్రథముండు వించె నిటులన్ దద్వ్యానయాయిప్రథన్. 99

గీ॥ తండ్రికొడుకులు మా జమీందార్లు వారు
పేర దేవేంద్రనాథఠాకూరు తండ్రి
కొడుకుపేరు రవీంద్రనాథుడు, మహాకు
టుంబము తదీయ, మీ నగరంబు వసతి. 100

క॥ మతమును మతియే తెలుపును
శ్రుతమును దృష్ట మనుభవము జోడించుచు, నే
విత మైన పుస్తపఠియును
విత యని దేవేంద్రబాబు వినుచును మాకున్. 101

సీ॥ ఇత డెఱుంగని మత మీ జగమ్మున లేదు
స్వీకారమునకు నచ్చినది లేదు
ఇతడు పఠింపని దే పురాణము లేదు
మురిసి యొప్పిన దొక్క ముక్క లేదు
ఇతడు మెట్టని క్షేత్ర మిండియాలో లేదు
ఎఱిగిన విగ్రహా మ్మెటను లేదు
ఇతడు చూడని యోగి యే గుహాలో లేదు
కొలిచినవాడు నొక్కడును లేదు

గీ॥ మ్రొక్కు నీశ్వరునకు రామమోహానునకు
బెట్టు గలడు ప్రాక్రొత్తల పట్టు గలడు
బిరుదున మహర్షి యీతఁ డెవ్వరి కథర్షి
మాధురీదృష్టి దేవేంద్రనాథకృష్టి. 102

గీ॥ చూచు నీతడు రయితుల సుతుల నొక్క
కంటఁ, దనకు రాఁదగిన లతయును మఱచుఁ
గాని తా సీయఁదగినది గవ్వయేని
మఱువ, డొకమాట పడ డొకమాట యనడు. 103

క॥ వాడినపువ్వులు నిగనిగ
లాడును వేని హాసనమ్ము లాలనసేయన్
వాడె రవీంద్రు డితని సుతు
డీడున పిన్న మది పెద్ద యెన్నిటిలోనో. 104

ఉ॥ ఆ పొడ వైన నాసిక, విదాయతిపంటపొలమ్ము ఫాల, మా
శ్యామపణనీలరత్నయుగ మైన కనుల్, కలభప్రకాండకుం
డాపరిమాణబాహులు, వెడందయెడందయు నున్కి తండ్రి కె
త్తై పొలుచున్ గుమారునకు నట్లె రవీంద్రున కార్షచిహ్నముల్.

చ॥ ఎఱుగుదు మీ రవీంద్రుని పదెన్మిది యేడుల వాడు నేడు, మా
హిరణుని కాళిదాసుపయి నీతని కెంతయొ ప్రేమ, హూణభా
షరుచి కడింది, బొమ్మ లనుసంపదలో యన గీయు, నెప్పు డే
దొ రచన సేయు నీతడు, మృదుధ్వనిఁ బాడును రమ్యగేయముల్

ఉ॥ కోయిలకూత కూసి మధుకుంజవిహారములందు, వార్షుక
శ్రీయుదయమ్మునందు శిఖినృత్యము సేసి, శరత్ప్రసన్నతన్
బాయలుపాయలుంబఱపి పండిన గుమ్మడిపండ్లు పంచు ని
ద్దాయెడదల్ గలార లరు దై కల, రందు రవీంద్రు డొక్కడున్.

క॥ మా చేలును మా చెట్లును
పూచెడు పూలున్ రసించు పులుగుల్ చెలువుల్
మా చేతలు మా వ్రాతలు
నీ చిరుతకుఁ దెలిసినట్టు లెవనికిఁ దెలియున్. 108

ఉ॥ వ్రాయు నితండు పద్యములు పాటలు వెన్నెలతేటలో యనం
గా, యువవృద్ధ లీ పురమునన్ గత హైందవమేలలోన నా
రా ! యనినారలంటగదః రమ్యరవీంద్రకవిత్వముగ్ధు లై
తీయని గొంతు నైతయు గదే ! మనుజత్వములోని సారముల్.

॥ సాతీ పలికె నౌ నని మీరు చదువలేదు
దేశమున నైదునూర్ల పత్రికలు మోసి
నవి రవీంద్రుడు చదివిన కవిత కెల్ల
ఢిల్లిదర్బారు మార్మ్రోగి వల్లె యనుట. 110

ఉ॥ తిన్నగ వెంటవేసికొని త్రిప్పె రవీంద్రుని శీతపర్వతా
ఖ్యున్నతభూమిఁ దండ్రి తప మూనుచు, నయ్యెడ తల్లి లేని యీ
పిన్నని తల్లి యై ప్రకృతి పెంచె విహంగకలస్వనమ్ముతోఁ
గ్రొన్నన నవ్వుతో వివిధ రుచ్య ఫలమ్ములతో ఝురమ్ముతో. 111

ఉ॥ ఈ మృదులాత్ము డబ్ధిఁ బయనించి యటఁ జదివించు నంచు వి
న్నాము, స్వదేశభక్తి లవణం బగునా? యని యిప్పుడున్న యిం
డౌ మతసక్తి రుద్ధ మగునా యని సందియ మందినాము ము
న్నీ మహినుండి యందుఁ జనిరెందఱో పీడెను శంక వారిచే. 112

గీ॥ అటులనా యను వారితో నటులె యనుచు
సాతి విన్నారొ కేశవచంద్రసేన
నామమును నా నవద్వీపధాము డనియె
వినుటె కాదు వానిని చూచి తనిసినాము. 113

మ॥ మతవాదమ్మున వాడు వేయు నరరే! మా యూరిలో ఫాదిరి
మతిగర్వుం డొకరుండు పాదములకుం బంధ, మ్మదెట్లో విడన్
కుతుకన్ వేయు, నిదే యిదే వరుస యై గోడాడినారల్ బుధుల్
శ్రుతిశ్రుత్యంతకణాదవాదముఖశాస్త్రోదంతపాథోనిధుల్. 114

గీ॥ ఎందులకొ వచ్చి నేను డీ చంద మరసి
యేదిరా! భాయి! చూపు నీ వాదబలము
నంచుఁ బదినిముసాలె వాదించి వాని
పిల్లిమొగ్గ వేయించెను పెక్కుసార్లు. 115

గీ॥ అనుడు సాతి దేవేంద్రనాథు నుడి యిద్ది
యాత్మగత ముక్తముగ నుక్త మంతయును కృ
తమ్ముగాఁ గృతమ్మును కారితముగఁ జేయ
శక్తు డొక్కడె కేశవచంద్రు డనుచు. 116

ఉ॥ లండను పోయి క్రైస్తవము బ్రాహ్మము నేకము చేసి చెప్పి త
త్పండిత రాజమంత్రిజనవర్గకృతానుపమాన మానితా
ఖండలు డయ్యె దస్కతును గైకొని రాణి భజింప నేను బ్రా
ఖ్యండ మెఱుంగ దంతటి యఖండము వైభవముం బ్రతీచిలో. 117

గీ॥ అట్టి కేశవచంద్రసే నడుగుపెట్టి
తిరిగి కల్కటా పురమునఁ, దెలిసియొ తెలి
యకొ పరమహంసమై ముట్టె, నంతె, చేవ
యయ్యె నొక మతసరసిలో నతని మనసు. 118

క॥ ఏ మత మది ? కాళీ ! కా
ళీ ! ముక్తి నిడు మను మతము, లేళ్ళును పులులున్
మైమై నొరసికొనెడి మత
మే మతమున కేని త్రోవ యిచ్చెడి మతమున్. 119

ఆ॥ వె॥ ఏల మీర లడుగ రెవ రా పరమహంస ?
యనుచుఁ బలుక సాక్షి హాస మొలుక
వారు నొడివినారు పరమహంసనుగ గు
ర్తించె జగము రామకృష్ణు ననుచు. 120

గీ॥ ఇటుల మాటాడికొనుచు వా రేగుసరికి
నిసుక వేసిన రాల కున్న సభ చిన్న
సూది పడినను చప్పు డౌచు ఘన వాఙ్మ
ఖమ్ము వినుచుండెఁ జివరి ఘట్టమ్మునందు. 121

ఉ॥ అచ్చపు దిండ్లతోఁ జదర మైన వితర్దియు నద్దె లేక యే
వచ్చిన యెట్టి బుట్టలు తుపాకుల వీపులు పొట్టికత్తులే
లచ్చిన కావలాయుఁ దగు నా సభలోఁ బలుకాడుచుండె గాం
గోచ్చతరంగఘూర్ణనవదుక్తి సురేంద్రుడు దేశభక్తిమై. 122

చ॥ వినబడుచుండె నిక్కరణి వేదికనుండి సురేంద్రనాథు డా
డిన యభిభాషణమ్ము వినుడీ! జనముల్! మహాజర్లు పెట్టి యె
న్ని నెరసు లున్న వన్నియును నేలకుగోలకుఁ దెచ్చి చాటి చూ
పనియెడ నీ ప్రభుత్వము సవర్చునె! శాసనదోషజాలమున్. 123

గీ॥ పత్రికలకు సిరా రాజభక్తి కలదు
పాలన మ్మేమొ బాధ్యతాహీలనమ్ము
పలుబడిబాటలోఁ గొన్ని మైలురాళ్ళు
చేళ్ళములు కానియెడ న్యాయతృప్తిలేదు. 124

ఆ॥ వె॥ వచనరచనలందు స్వాతంత్ర్య మడుగంగె
నోరు కేలు సాగ నోటువడియె
నన్ని పదవులందు నాంగ్లుల ప్రాధాన్య
మతిశయించె, దేశమతి కృశించె. 125

చ॥ ఇరువదియొక్కయేడులను నిర్వది కొక్కటి తక్కు గాగ మా
ర్చి రిపుడు మండలేశ్వరపరీక్షకుఁ గూర్చొనువారికై వయః
పరిమితి నేలువార, లిది పగ్గమువేత పురోభివృద్ధి, కి
ట్టి రకపు చేత లొప్పమని! డిండిమమై ప్రజ మ్రోయకుండునే.

క॥ అచ్చటికి నేల పోవలె?
నిచ్చట నా ఐ. సి. యస్. పరీక్ష కుదురదొ!
వచ్చిరిపో! యుద్యోగులు
మచ్చున కొక డుండునటవె! మనవా డందున్. 127

ఆ॥ వె॥ రేపు చర్చ ఇండియాపాలనము గూర్చి
యనుచుఁ బార్లమెంటునందు వినెనొ
సభకు రాడు నాడు సభ్యుడు, 'ఫాకెట్టు'
'ఫౌలరును' శ్రమించి బాధపడిరి. 128

గీ॥ ఇండియా సమస్య నెత్తెను 'గ్లాడ్స్టను'
పార్లమెంటునందు పరిహృతంబు
ప్రాతపత్రిక వలె, నీ తీరు దౌర్భాగ్య
మిక సహింపజాల రిచటి ప్రజలు, 129

క॥ హిందూ దేశమ్మును స్వ
చ్ఛందము సేయఁ దగు ననుచు సలహో యొసగెన్
స్పందితహృది హెర్బర్టను
నందలి యొక, డతనివైపు నరయడ యొకడున్. 130

ఉ॥ రాణి వెలార్చి పత్రము శరద్దశకద్వయ మిండియా బ్రిట
న్లొ నుదరమ్ము వెన్నును మదార్జవశోభితరాజ్యలక్ష్మికిన్
మానితులార! యంచు, నయనాశ్రువులన్ మన కొత్తు చేరుమా
లౌనటె! రాజ్యలక్ష్మి కది,న్యాయము గాయము నొందె నీ క్రియన్.

క॥ గుడి గంట గొట్టి దేవుని
గడెగడెకున్ గోర్కు లడుగు కై వడిఁ బ్రజ యే
ల్పడి వెంబడిఁ బడి యా ము
న్నుడి జ్ఞప్తికిఁ దెచ్చి గెలువ నూలోక్కనవలయున్. 182

ఆ॥వె॥ అమెరికాకు వర్తకమునందు నమరిక
ఫ్రాన్సుధరణి కళకుఁ బ్రాంశుభరణి
ఇండియా మతాల మండియ, బ్రిట నిడు
తీయ మందు రాజకీయమందు. 183

గీ॥ రాజకీయ మ్మొకవిచిత్రరసము పదునొ
కండవది, శాంతమున కిది నిండువైరి
యంగి యిడు దానధర్మవీరాంగ మగుచు
బ్రిటను చరితమ్ము నిటఁ జదివించు టెపుడొ. 184

ఉ॥ హూణుల యాత్మ దొడ్డది, హితోక్తుల దానిని మందలించి లో
తొ నొక నూతినుండి మధురాంబువునుం బలె ధ్యేయ మందుకో
వౌను, మతాదిభేదముల నన్నిటి నొక్కట మెల్పఁ బెద్దతా
డొ నది, తెల్విబొక్కనకు నయ్యది బద్ధము దప్పి తీఱెడిన్. 185

గీ॥ ప్రజలు తా మెన్నుకొన్నట్టి ప్రతినిధుల స
భాద్వయమ్మున బ్రిటనులోపగిది నిందు
పాలనమ్ము కావలె భాగ్యమూలనమ్ము
మున్నె కావలె మన ఖిదోన్మూలనమ్ము. 186

సీ॥ ఆంగ్లచిత్తాయసాయస్కాంతవాక్యవి
త్త'రమేశచంద్రదత్త'బుధుచేత
ముకుళితభారతాంభోజాతనవసవి
త మెహతాఖ్యసుదూరదర్శిచేత
బ్రిటిషుసభామహోపన్యాసకానంద
మోహనబోసు సత్పురుషుచేత
యుగపత్ బ్రిటన్భారతోర్వీచరత్తమా
హ్వదయుండు 'దాదభాయి' ఋషిచేత

గీ॥ వివిధసంఘసభ్యులచేత విదులచేత
నస్మదాదులచేత వ్యాఖ్యాత మైన
యిట్టి పథకంబు మన భవిష్యేతిహాస
లాసకథకంబు, విద్యావిలాసులార! 137

మ॥ అని తద్వాణి శ్రుతమ్ముగాగ మలిప లక్కధ్యతు డై 'లాలుమో
హానఘో'' షాడెను దప్పికై నపుడు నీ రై యాకలై నప్డు భో
జన మై యొప్పు సురేంద్రు వాఙ్మఖము భశ్యత్రాణ మా భారత
మ్మున కీనాడు, ప్రభావితుండ నయితిం బుష్పించి జాతీయతల్.

క॥ ఇక్కొలువువారు పనిచిన
రెక్కలు కట్టుకొని వ్రాలి రేయి పవలుగా
నైక్కార్య మైన సేసెద
నిక్కడ జేరిన జనమ్ము నిల్లే తలతుణ. 139

క॥ అని యనగ కంచుతాళము
లను బోలి కరాలు మొరసె, నా సభతీర్పుల్
గొని 'లండను' చనుటకుఁ దో
డనె నియమితు డౌచు ఘోషు డాకా ల్చాపెన్. 140

చ॥ ఎనసి నరేంద్రు పాటయు సురేంద్రుని మాటయు దేశభక్తి కెం
తను వగు టెక్కె మెత్తిన! వహో!యనుకొంచు గృహోన్ముఖమ్ముగాఁ
జనియె సభాజనమ్ము, కడుసందడిలో నెటు వోయినారలో
కనుపడ రై రొకళ్ళకు నొకళ్ళు తదాగతు లైన మూవురున్.

# కుమారసంభవ ఖండము

శా॥ హోళీపండుగఁ జేసె కొండొక ప్రజావ్యూహంబు ఫాలాక్షదృ
క్కీలన్ బోలిన మంట స్వీయమతికిఁ గ్రీడాసఖం బైనటుల్
ప్రేలెన్ దజ్జ్వలదింధనాల్ ఫెఠఫెఠాభీలధ్వనిన్, మింటిపై
వ్రేలెన్ దెల్ల మొగిళ్లు నల్లవడి తద్విస్తారధూమావృతిన్.

క॥ ఆ రాజధానిఁ దనరెడి
సారము సంస్థల నొకండు 'సంజీవని' త
త్ప్రేరణమున హిందూమే
లారమణీయోత్సవము చెలగు నేఁటేటన్. 2

గీ॥ తాతియాతోపెర్ఝాన్సిలక్ష్మితనూచి
తాభసితము కతిపయసదస్యదేవ
తార్చనాపీఠదంతపేటాంతరస్థ
మొందఁజో మహారాష్ట్రుల యిండ్ల నటులు. 3

మ॥ క్రమశిక్షుఖ్యులు సఖ్యు లందు భరతక్ష్మాదుర్విధిక్షాళనా
ర్థము చేర్వాల్ తమ నెత్తుటన్ సలుపు గంద్రల్, భిన్నభిన్నప్రజా
గ్రిమసంసేవ్యసమత్వచత్వరితసంఘీభావసౌధోదయా
ర్థము తీంద్రల్ శ్రమముల్ తదీయములహో! అహ్వానికరించున్నిశన్.

సీ॥ అందఱిలో చిన్న అన్నలతోఁ గూడి
యందు 'రవీంద్రు' డానందసాంద్రు
డందఱఁ బెద్ద ధైర్యముముద్ద 'రాజనా
రాయణబోసు' ధర్మమ్ము త్రాసు
భారతిగారాబు బంకిముచంద్రబా
బు సమితియలుత కెంపుజిగిబిబు
త్యాగంబు హోమాగ్ని తా నాట్యపాత్ర కు
క్రమము చరిత్ర 'నవగోపాల మిత్ర'

గీ॥ ప్రాణ ముఖికి పొంగులువాఱు ప్రాతకల ద
ధీశు డమృతబజారుపత్రికకు, పేరు
దనరు శిశిరకుమారఘోషనగ, నతడు
నందఱ నొకండు, మృతము సేయడు సెకండు. 5

గీ॥ ప్రభుత ‘మలవారరావుగైక్వాడు’ విసము
పెట్టె ‘రెసిడెంటు’ కని తెల్పఁబెట్టె నేమి
యొకని, కొకజాతినే నపుంసకము సేయు
పాటి దోసమా ! యది యని చాటె ఘోషు. 6

ఉ॥ విద్యకు సాగరం బతడు విశ్రుతు ‘డీశ్వరచంద్రు’ డంగనల్
విద్య పునర్వివాహమును స్వేచ్ఛయు గల్గి మనన్ బ్రచారభూ
మోద్యమనేత యై స్వతనయున్ విధవాపరిణేతఁ జేసె, దా
నాద్యుడు సంఘసంస్కరణమం దని కీర్తి మోసె నల్గడన్. 7

ఆ॥వె॥ ఆత డొకడు నీ సభాభిమానులయందుఁ
దనను దానె యేలుకొనును దేశ
మనుచుఁ దనదు పత్రికను వ్రాసి ప్రకటించె
క్రిష్టదాసుపాల్ విశిష్టు డొకడు. 8

క॥ ప్రభుశక్తి నెదిరియాడెడి
సభికుల్ స్వాతంత్ర్యరమణిసైగల యభికుల్
రభసులు కల రిం దెందఱొ
సభ జరిపించిరి యుగాది సమయము మున్నన్. 9

క॥ జంటను గని తొలగి తొలగి
యొంటరిఁ గని మీదిమీది కుఱికెడు చలికిన్
గుంటితనము వచ్చె, ప్రకృతి
కంటన్ రేమంచుమసక క్రమముగఁ బోయెన్. 10

క॥ పలితము గా దొడగెను చలి
బలితము గాదొడగె నాతపము వాడిమిమై
యెలుఁగింపఁ దొడగె కోయిల
కలరుతపులకితదిగంతకమనీయముగా. 11

క॥ రక్తాంబరధారిణి యై
వ్యక్తం బొనరించె సంధ్య యరుణకుసుమగు
చ్ఛాభక్తాంజలితో చాంద్రీ
సక్తి తమోముక్తి యాత్మశక్తికృతముగా. 12

చ॥ సభ మొదలయ్యె నయ్యెడ, విశాలము వేదిక, శిల్పకల్పనా
విభవరహస్యబోధిక, నివిష్టసభాపతి పీఠి షాజహాన్
విభు మహాసనపీఠ మెగవేసిన కప్పము లాగెఁ, దారకల్
నభమున మల్లికల్ పొదరునం బలెఁ జూచె దిదృక్షుచిత్తముల్ 13

ఉ॥ పెద్దది యైన యా సభకు విచ్చె సభాపతి మాన్యులార! నే
డెద్దడి వచ్చెఁ గాని పదునెన్మిది ద్వీపములందు యూరప మ
స్మద్దమునస్సమానప్రభమండిత తేజము పాతె, నెప్పుడుం
బద్దెముఁ గాదు చిహ్నము, లపాంపతి ఘోషిలు భారతప్రథన్. 14

గీ॥ శాసనములు నాణెములు సింహాసనములు
విగ్రహములు చిత్రములు కోవెలలు నెన్నొ
కథలు చెప్పు ఖండాంతరతమ నెసంగి
తజ్ఞులకు విశ్వమతము హైందవముగూర్చి. 15

ఉ॥ జ్యోతిషమందు వ్యాకరణమందును నాట్యమునందు గ్రంథ మిం
దే తొలుతన్ జనించె, నటులే తొలివేదము నాదికావ్య మీ
భూతలమందు సంస్కృతము పుట్టగ నాగరకాద్యరూప మై.
యీ తెలి గొచు హైందవమతేంద్రము మానవధర్మకేంద్రమున్.

చ॥ తొనలను పోలె సౌఖ్యకృతిదోహలకర్మములన్ ధరించి యే
వనమునఁ బుట్టెనో! పనసపండుమతం బిది యద్విదూషణం
బను వగ రొంద దెన్నడును, నన్నిటికన్నను నేనె తీయ నై
తనరితి రమ్మటంచు విమతస్థుని నొత్తిడిసేయ దింతయున్. 17

ఉ॥ ప్రాయము చెప్పజాల, మిది ప్రాచినుకల్ నలుకాళు లైన మా
హోయి, పయఃప్రపూరముగ నిచ్చును శాంతిరసంబు, నేడు జా
బూ! యిది కొమ్ముల్లొడ్డి తన యూపిరికై నిగళమ్ము వేయు నే
దో యుగళమ్ములబారి బడకుండగ తప్పుకొనంగఁ జూచెడిన్. 18

ఆ॥ వె॥ ప్రథమపంక్తిలోన 'పైథాగర' సొకండు
మధ్యపంక్తి నిపుడు 'మాక్సుముల్లె'
రెన్నిపంక్తులందు నెందలో యుందు రీ
యాఫుపాలు ద్రాగినట్టి ఘనులు. 19

ఆ॥ వె॥ మతముపేర నైకమత్యసాధన సేత
యపుడు నిపుడు నెపుడు నాదృతంబె
యన్యమతముగూర్చి యనరాద యేమియు
పరమహిళయు తల్లివంటిదె కద ! 20

క॥ జనియించె విగ్రహారా
ధన కళకొలకు, దాని తగులము లే కీ
శుని ధ్యానించుట ధర్మం
బనుటయుఁ గల, దెట్టులైన నంతయు నొకటే. 21

క॥ మానిసి దేవునిలోనన్
గానంబడి విగ్రహార్చనము తద్గృహాని
ర్మాణముఁ బొసగెను, దేవుని
మానిసిలోఁ జూచుటయు సమంజసమె కదా ! 22

గీ॥ రామకృష్ణ దయానందు లామనినెల
లీ సమాజనికుంజవికాసమునకు
నిందు వారి వాదమ్మె రెండేండ్లనాడు
వింటి నిరువురునన్ మెచ్చుకొంటి నేను. 23

ఉ॥ వింతగ నిర్వరన్ బొగడ పీ లగు నెట్లన నాకు వద్దు వే
దాంతము, జాతి కెల్ల నొక ద్రాటిపయి న్నడ గూర్చు నాదు సి
ద్ధాంతము, వారు పద్ధతుల నైక్యము తక్కువ కల్గ నేమి భా
సింతురు మత్పథమ్మున విశిష్టరుచుల్ దుగవైపు దీపెలై. 24

క॥ ద్వైతాద్వైత విశిష్టా
ద్వైతాఖ్య ముపాసనమ్ము తగ ముయ్యేరో !
మాతృత వహించినయది ఖి
దాతతికిన్ హైందవము మతము పూజ్యంబై. 25

క॥ తన ధ్యానము సేయుటయే
జనకృత్యము గాన నెట్టి సవు రొందిన నా
పని దేవుడు కా దనునో!
యనునో సర్వసము డెట్టు లగు నా తండున్. 26

ఆ॥ వె॥ యజ్ఞభాగలు_త్త మగు పూర్వమీమాంస
జైనబౌద్ధములకు జన్మభూమి
మాత యైన వేదమతమున కెదురాడి
పోరువెట్టు కవలబొట్టె లివ్వి. 27

ఉ॥ వేదమతమ్ము లేక ప్రభవించెను బౌద్ధము జైన మన్నదిన్
వాదము కద్దు, ప్రాకృతము భాషయు ప్రాకృతమే యనంబడున్
లేదు సదుత్తరం బభిధ లీ మతకర్తల కెట్లు సంస్కృతా
పాదితముల్ పొసంగె నన, సంస్కృతి భిన్న మటన్నఁ జాలునే?

క॥ ప్రతిమత మొక ముఖ్యగుణ
ప్రతీక మని తెలిసి యనువు భారతజాతీ
యత మన భూమాత కట
న్న తెలివితో దేనినిన్ జనంబు జయించున్. 28

క॥ భారత జాతీయతకై
యేరిన్ దెగనాడనట్టి హితసమరసవా
క్పారీణత్వము హైందవ
సారము, దీనిన్ గ్రహించి జనము మెలగుతన్! 30

ఆ॥ వె॥ నీర మధిక మున్న నీరము లేకున్న
వాడువాఱు మొక్క వలె నరుండు
నధిక మైన భూ వ్య మైన నావేశము
తనకు నితరులకును పనికిరాడు. 31

క॥ గతకులభేదమ్మనుగా
మతము నెఱిగి యైకమత్యమాహాత్మ్యము గ
ల్గి తమ పురతఉన్నతి పూ
ర్వతమోన్నతి నిల్పుకొనుడు ప్రజలార! వడిన్. 32

క॥ ఈ కామదహనపర్వము
చేకొనఁజేయుత! ప్రతిన నశేషప్రజచేఁ
జేకొన మెందు విదేశ్యపు
పోకడలను దేశకాలనోహాల మనుచున్. 33

ఉ॥ భారతజాతి శౌర్య మనివారణ మౌచు విశృంఖలాద్యది
గ్వారణతుల్య మౌచు హిమవచ్ఛిఖరమ్మునకన్న నిల్వెడున్
గౌరవ మౌచు దౌష్ట్యమథనంబున భాసిలుగాత! మిత్రు డీ
సూరి యుపన్యసించు నరిసూదనమోదన మౌ చరిత్రమున్. 34

ద్వి॥ అని పల్క రాజనారాయణబోసు
వినిచె మిత్రా హోళివిలసితకథను. 35

ఆ॥వె॥ మడియగ పులియసుర మరియొక డేతెంచి
వాని మంచివానిగా నొనర్చె
వాడు రాజ్యమేల వీడు నుండెను కాని
పొంచి బలముకై తపించుచుండె. 36

క॥ తారకుఁడు వీని పేరు, సు
తారముగా నుత్తరించెఁ దళతళమెఱుపుల్
సారించు నిజాసురభా
షారిష్టిం బఱపి పూర్వసంస్కృతి నిచటన్. 37

చ॥ భరతునినాటి గుప్పిలికి వచ్చును వీని బలంగ మైననున్
గరకరలాడు నొక్కమతికచ్చిన నొక్కమతమ్ము గల్గిన
ట్టిరుకుల మట్లు భాష యొకటే, కొలువుల్ బలె శస్త్రముల్ ధరిం
తురు, జగపోటరుల్ గనుక దోచిరిపో! జగమెల్ల జేత లై. 38

చ॥ వరమునుబొందుదాకనె తపమ్మును బ్రహ్మయు,మీద బ్రహ్మ యె
వ్వరొ, తప మిచ్చు భాగ్యమునఁ బ్రాజ్ఞులు గాన మఱేరికిన్ దదా
చరణము సాగనీయరు, వశంవదు లై హిమకభోగభుక్తి, కం
బరమునఁ జుక్క లన్నియును మా పొడిపించిన వందు రక్కసుల్.

గీ॥ ఇట్టి వీరు లోకమున జయింపనట్టి
దేశ మున్నదో యట సూర్యదీప్తి పడదు
పంచభూతమ్ములును వీరి బానిసలు, స
ముద్ర మేతన్మహాపోతముద్రితమ్ము. 40

ఉ॥ మిన్నులు దన్ను పన్నులను మేవడిమై విధియించి పిప్పసే
సె న్నరు నెత్రు పీల్చి దనుజేంద్రుడు వీరల హేతు తారకా
ఖ్య న్నివటిల్లునాతఁ, డిత డన్న నిషుంగును కెవ్వ మంచు నా
ర్చు, న్నివృతార్చి యౌను సవసుందర మై వెలుగొందు నగ్నియున్

క॥ దనుజుడు మనుజుని దిను టా
తని సర్వస్వమ్ము దినుట, దానవె మనుజా
శను డనబడె, నీనాడును
మనమధ్యన్ దాదృశుండు మసలుట గనమే! 42

మ॥ అనుచున్ దా నలవాటుచొప్పున నెటో హస్తమ్ము సారించు వా
గ్మిని రక్షాధికృతుండు తత్రగతు డాంగ్లేయుండు కండ్లుర్మి న
న్గని నా వైపుగఁ గేలు సూపితివి వక్తా! వంగభాషానభి
జ్ఞునిగా నెంచితి వీవు నన్ను, 'సెడిషన్ సూ నీ వచస్సం చనెన్. 43

క॥ కలకలము పెరిగె నంతటఁ
బలువురు ముఖ్యులును వక్త వాచించి రయా!
కలగకుడు తమరు పొరపడి
పలికితిమా? యాంగ్లు లంచుఁ బ్రభుత యటంచున్. 44

ఆ॥వె॥ కేలు సాగు దిక్కు సాలమంది గలరు
నటులె యిందు మనుజులందు దనుజు
లేనె లక్ష్య మన్న మీ నుడి సరి కాదు
కూరుచుండి వినుడు కొమరు కతను. 45

గీ॥ రామకృష్ణు మతమ్మును గ్రమవిరుద్ధ
మైనదిగఁ గొన్నినా ళ్లెంచినట్టి తమరు
మా సమితి నెంచవచ్చును మానవచ్చు
ననుచు శాంతించె నెట్లో యయ్యాంగ్లవరుడు. 46

మ॥ నవగోపాలుడు చెప్పెనైన కథ విన్నారేకదా! వీరిచే
భువి నిర్ధాన్యము నిర్ధనం బయి నభంబున్ దోడుగాఁ దెల్లనై
కవిసెన్ క్షామము భీమ మార్తియుతరోగాక్రాంతసంభ్రాంతమా
నవమద్గ్రామము చచ్చి స్వర్గమున నుండన్ మే లనన్ బండితుల్.

గీ॥ అగ్నికిని భారతీయున కవధి లేని
బంధ మున్నది, యద్ది నిబంధితమ్ము
వంటవఱకె రాక్షసరాజపాలనమున
ననుచు నెల్ల రౌ నౌ నన నతడు చెప్పె. 48

సీ॥ చచ్చెడి వేళయు సంధ్యవార్చెడి వేళ
యొక్కటై సురలకు ట్రొక్కు లేదు
అసుర యారయు వేళ నగ్ని యాఱెడి వేళ
యొక్కటై యజ్ఞమ్ము చక్కబడదు
అగ్ని మండని వేళ యాత్మ మండిన వేళ
యొక్కటై స్వర్గమ్ము స్రుక్కు విడదు
ఆఱు నుపాయమువేళ నిజ మపాయమువేళ
యొక్కటయ్యు మదను డుదిలపడడు

గీ॥ హిమగిరితపస్వినైయైన మహేశుకడనె
హైమవతి యున్న, దవ్వారి కైక్య మొదవఁ
జేయ సంభూతు డౌ నొక శిశువు చంపుఁ
దారకాసురు ననుచు విన్నారు సురలు 49

క॥ ఎవ్వడు వాడు? హరుని మది
జవ్వనిపై మరులుగొలుపు సామర్థ్యముతో
నివ్వటిలెడి వాడు, శిలన్
పువ్వులతో గొట్టి రెండు పొనరుచువాడున్. 50

గీ॥ మహిషవాహను నెఱుగుదుమ, వరుణు మతి
పెనుతుపాలో బడెను, కుబేరుని ఋణి
పట్టి కాస్థులు తండులధ్వంసు, అగ్ని
కేమి తెలియు! బూడిద, యింద్రు డెఱిగి పలికె. 51

గీ॥ ఇంద్రు డపుడు రప్పించి తా నెదురు పోయి
తోడితెచ్చి సమాసనస్థు నొనరించి
మరుని మిత్రమ! నీ రాక నరసి మెఱసె
నోయి! యీ విచ్చినవి కనుల్ వేయి యనియె. 52

క॥ నా వనికి నందనాఖ్యము
నా విడిదికి వైజయంతనామము తగునే
నీ విచ్చేయక మదనా!
కావొ యిక సవైభవములు గాజుల మ్రోతల్. 53

గీ॥ అనగనె ఘలంఘలత్కార మప్సరోని
కరము మెడ హారిచందనసరము లునుప
నిగురువిలుకాడు నొడివె పల్కు గురు! పల్కు
యెవరు వారు న న్నెఱుగని! వొవరువారు. 54

ఉ॥ ఓహరిసాహరిన్ బెనగి యోఃహరి!వా డెవడైన యోగి దా
సోహమనున్ శివోహ మమనా!యమృతం బిడి చూడు త్రావునా!
దాహము దాహ మంచు వనితాధరశీధువు త్రావుగాని,మ
ద్బాహువు వేనిఁ ద్రోయవలెఁ బల్కుము నాల్గిటినుండి మూటికిన్.

చ॥ మగువయ నైన నింక మరి మంచిది, నాకును నంత పాపభీ
తి గలుగదోయి! యామెకుఁ బతివ్రతధర్మము నట్లె యుంచి నిన్
మగనిగఁ జేసి తత్ప్రథమనాథున కొక్క యనాథ నప్పుడే
తగిలిచి పూర్వవృత్తవిగతస్మృతులన్ బొనరింతు నెచ్చెలీ! 56

గీ॥ ఇక్షుకోదండధరుడ నౌ నేను జంట
సేయ దండధరుడు విడదీయుచుండు
చనము, సంకల్పమాత్రాన చాల జరుగు
స్వయము నేఁ జనవలసిన పని య దేదొ. 57

గీ॥ అనగ వృద్ధశ్రవుడు స్వకీయపరకీయ
రాజకీయరంగమ్ముల రంగు వేసి
కొన్న తల యూపి పొగడుచు మిన్ను చూపి
హిమధరాధరాగ్రము చూపి యిటులు వేడె. 58

ఆ॥ వె॥ జటి యొకానొక డట సలుపుచున్నాడు త
పస్య, దాని కంతువంతు లేదు
వింటికేలున నొకయింటివానిగ వానిఁ
జేసి మాకు సౌఖ్యరాశి నిడవె ! 59

క॥ వాని సిగ సాంబరం బన
గా నొక డొక డనును మెయి దిగంబర మనుచున్
వాని గనినవా డెవ్వడు ?
కాని తదీయతపఉష్ణకపితులము సఖా॥ 60

క॥ నీ రాచరికము కా దని
యీ రేడుజగాలఁ బ్రతుకు నెవడు? సుమశిలీ !
పౌరుష మర్ధం బై జడ
దారి యతడు నీవు లాగు దారికి రాడో! 61

చ॥ ఎదురుగ నిన్ను పెట్టుకొని యే గుహలోని యణుస్వరూపికో
యదరెద నయ్యొ ! నా తెలివి, యబ్జశిఖీ! రతిదేవి సేమమే
కద!మధువుం భవత్సఖుని కన్గొనియుం బహుకాల మాయె, న
మ్ముదువొకొ!నమ్మవో! యసువు పోవుచు పో నని నీవు కన్పడన్.

విమా॥ అనన్ స్ఫురద్ధన్వి బాణ
మ్మె నంటి మారుండు బాసా
డె నిట్లు సర్వంబు జ్ఞాతం
బు నీవు చింతింపకోయీ॥ 63

క॥ రాత్రిందివమ్ము లుద్ధర
ణత్రాణోద్యోగి యైననాడే వానిన్
మిత్రు డనన్‌వలె కాదో॥
వృత్రు డనఁజావలెను తన్ను వేపకయున్నన్. 64

ఉ॥ ఆ జడదారికెంజడలయందున మబ్బులు గూండ్లు కట్టుకో
నీ జము డేనిఁ వానిఁ గని నిక్కినరోమము నిల్వ్రుగుడ్లు నై
వాజమ గాని తజ్జటిని పట్టి తపం బుడిపింతు వజ్రపా
ణీ! జవరాలి మోవి గొన కే విసమానునొచూత మా పయిన్.

క॥ రెండే శాఖలు శాము ప
రుండిన మంచమున కందురో! మొండిఘటాల్
రెండే శా దున్నవి నా
ల్గండీ! యనిపించి వదలు నరవింద మిదే, 66

క॥ కులజాతిమతవిభేద
మ్ములు ద్రోహకరమ్ము లనుచుఁ బోరాడి జనుల్
గెలుచుట స్వర్గాధిపతీ!
కులికి యశోకాఖ్య మిది యమోఘం బగుటన్. 67

మ॥ ఇదిగో! చూతము ప్రేమపతులుగఁ గూయించున్ రసక్లిన్నవా
క్మదమాధుర్యముతో వ్రతస్థజనమున్, మల్లీశరం బియ్యగే
యదుకున్ దీని సుగంధముల్ దవిలి యింద్రాఃయే పెడన్బోవు రెం
డెదలున్, నల్లని కల్వ పట్టవగ లందించు న్నిశాధర్మమున్. 68

గీ॥ ఇంద్రపదవిని నిల్పికో నే మఖంబు
లేని శతమఖునకు మరు వాణి యటులు
మఖము సృష్టించి పచరించి మఖఫలంబు
ధారవోయ ముడుతలు లేక తనరె ముఖము. 69

ద్వి॥ స్మేరముల్ మోసాల శ్రీపారిజాత
తోరణల్ గట్ట నింద్రుం డనె నపుడు. 69a

ఉ॥ నీ యలుగుల్ పొదల్ పొదలు నిర్మితిచేసెను రతు,వీనిలో
మా యెలుగుల్ సదా శకునమంజులరావము లై జగత్త్రియ
శ్రీ యులికించుచున్నవి రుచివ్యమహోశివ మన్వయమ్ముగా
నీ యసమాన మౌ విభవహేతువు నీవ కదోయి మన్మథా! 70

క॥ కంతూ! ద్రుహిణసఖకు న
త్యంతత్వర నేగవలనె నని హా_ప్తసప్ర
ర్యాంతముగ వీడుకొని మఘ
వంతుడు లేచి చనె, సురలు వచ్చిరి చూడన్. 71

ఆ॥వె॥ తాను లేవ నెంచి తడసెను వలరాజు
తక్కు దిక్పతులు సుధాంధసులును
చాలకాల మయ్యెఁ బూలచాకుల దొర
మనలఁ దొంగిచూచి యనుచు దరియ. 72

సీ॥ మనము రాజులము, ధర్మముఁ బట్టి శిక్షింతు
మతడు దేవుడు కాని యనియె యముడు
కైలాసమున నైన గలదొకో! యంకిలి
మనకు మీనధ్వజా! యనియె గాలి
నీ పూలబాణాల నే దాగియుంటి లే
దడ్డము మన కని యనియె వహ్ని
దర్పమందున నీవు ధనమందు నేను మో
మోట మన మెలుగము ధనదు డనె

గీ॥ నింతమందిని కొట్టితి వేది! నన్ను
కొట్టు మపుడు మెచ్చెద నీదు దిట్టతనము
హరుని రెండవ మూర్తి నే ననియె వరుణు
డాదటన్ మీరు వల్కితి రనియె మరుడు. 73

క॥ రాక్షసు డనియెను నిను ప్ర
త్యక్షము కానీను మన్మథా! రుద్రున కేన్
శిక్షించునపుడు మోయుచు
నక్షయమాయ యిది వత్తునా! తో డనుచున్. 74

గీ॥ నిగమముఖుని సాహిత్యసంగీతయుగళ
లాలసునిఁ జేసినది నీ బలంబు, దాన
మిగులు నీ యశ మమృతాంశుమిత్రమా!య
టంచు పలుకాడె నీశాను డలరువిల్తు. 75

శా॥ ఈశానోక్తికి నొచ్చియున్ మరుడు మీ కెల్లన్ సుఖాల్ జల్లులే
గా! శత్రుంజయులార! నాన్ బొగల మొగ్గంబారు నగ్గిన్ జల
త్పాశిన్ జూపుచుఁ బ్రేతరాజు దనుజావష్టంభమున్ గాంచి ప్రా
ణాశన్ స్వర్గముగోడబల్లులము నే దైనా మనెన్ మెల్లగా. 76

శా॥ ఆ రక్షఃపతిపేరు తారకుడు, కొండం తా బలం బున్న యే
నీరేజాస్యకొ యెంత శీమునకొ జన్మింపన్ గుమారుండు వా
డే రాపాడగలండు రక్కసుని, నాడే సర్వసంక్షేమముల్
వీరాగ్రేసర! యంచు యక్షపతి చెప్పెన్ గండభృత్పాణి యై.

చ॥ విని మదనుండు నాకుఁ బ్రతివీరుని వాసవవాచకన్న మీ
వినుతి యెఱుంగ జేసెఁ గడు, విశ్వజనోపకృతిన్ బొనర్చుచుం
టి ననెడి గర్వరేఖ నను నెట్టెను కృత్యమునన్, సుఖంపు డీ
రని యరుదెంచి యామని హిమాద్రికిఁ బంచి వచించె జాయతో.

ఉ॥ వచ్చుచునుండె నీదుపనిపట్టగ మారుడు స్వామి! యోగమున్
జెచ్చెర బాయువే! యనుచుఁ జెప్పగ వచ్చిన దూతయో! హిమ
ప్రోచ్చయశైలమందు హరు ముందు గుడారము వేసి కోకిలన్
గిచ్చి దిశావిశాల మెలుగింపగఁ జేసె వసంతు డమ్మెయిన్. 79

ఉ॥ వాసన పూల కొప్పుల దువాళముగా మలయానిలాన నె
ల్లాసలునున్ దెరల్ సడలి యందము దోచుకొనుం డటంచు హే
లాసహితమ్ము లై పిలిచె, రాత్రి కవోష్ణము నయ్యెఁ, బెంటి తా
నై సనుదెంచి పోతునకు నందె, వసంతమహోదయమ్మునన్. 80

గీ॥ రాలునాకు రాలుచునుండ సాలమందు
వేయుచిగురు వేయుచునుండు వింత కాదు
అపుడు కట్టిన తెలిచీర నపుడె విడచి
పాటలము చీర ధరియించు ప్రకృతి వింత. 81

చ॥ ఇది సహింపడేమొ! పరమేశుడు తాండవ మాడె మాధవుం
డు, దెసలు మాఱు మ్రోగిన యటుల్ రొదపెట్టిన వీల లెట్టు లీ
యదనున నిట్టి లీల లవురా? యని యుగ్రుడు నంది గన్గొనన్
గదలిచెఁ గన్గొనన్, మధుని గజ్జెయు మ్రోగద యెంత యాడినన్

గీ॥ ఏ ఋతువుతోడ నెవరితో నేమి కలదు
సర్వమంగళ కీశ్వరు సన్నిధి కల
దాత దెపుడేని త న్నోము నాస కలదు
స్వాన్వయసమానసుస్వచ్ఛభక్తి కలదు. 83

చ॥ క్రమమును వీడకున్న దవురా! పటుశిక్షయొకో ! నిగూఢశు
ష్మముకడఁబొంచియున్న దొక శస్త్రియొకో !జితి కానువచ్చు ధై
ర్యము నెడబాయకున్నది, హిమాచలవర్ధని యుగ్రసన్నివే
శమునను సన్నికృష్టమున జాలికయున్న దహార్నిశమ్ములున్ 84

క॥ ఆ పార్వతివర్ణన విని
దీపితమతులై ప్రజల్ నుతించిరి, హలాణుం
డీ పలుకున ధారతమే
యై పొలిచె హిమాద్రివర్ధనాఖ్యం బనియెన్. 85

ద్వి॥ అగు, కాదు, కథ కది యన్వయం బనుచు
నగుచు గోపాలుండు నిగదించె మరియు. 86

క॥ సంగతి విని రతి స్వామీ !
భంగింతువు హరుని గాని పాయకుమీ య
ర్ధాంగిని న న్ననియెన్, జని
యెన్ గనియెన్ దద్యుగమ్ము హిమవన్నగమున్. 87

చ॥ గణుపులపై జయాంకములు కాంతిలు కార్ముక మూని, స్పర్శమో
హనశరముల్ పొదిన్ గొని,నిజాంగనచేయి చెయిం బెనంచి యె
క్కెను మకరధ్వజుం డడు గొకింత యిడంగ నరాలు లాగు జీ
వ్వన నెది యట్టి శీతధరమున్ ద్విపఘాతిమహోశ్మపాతమున్.

క॥ అమరించిఘనవనస్థితి
యమరిన్పృతి, శకునరుతియు, నట శ్రుతి భుజ్య
త్సుమరీణమధుభ్రమర
భ్రమరీఝుంకృతి దృశీశ్రవంబు నలర్పన్. 89

చ॥ తిరుగుచు జాహ్నవీతటిని దివ్యులు మెచ్చుగఁ దొల్లి తాపసుల్
జరిపిన యధ్వరస్థలముచాయల బూడిదకుప్ప నానుకొ
న్న రుచిరసాంద్రపల్లవితనైకవిభేదలతాలతాంతసం
దరతరుషండకాననమునన్ మరు డుండె మహేశ్వరార్థి యై. 90

గీ॥ రతిదృగంచలములతోడ రాచిరాచి
వాడిపోనట్లు మంచునఁ బదునువెట్టి
యలుగు గొని యల్లె దడవి ఝుమ్మన దిదేలొ!
యిచట ననుచు నలుగడఁ దిలకించె మరుడు 91

శా॥ ఆకార మ్మెదొ లీలగా నదిగొ! కాంతాః చూడు మోసీ! శర
ద్రాకాశాశము వంటి యొంటిపయియర్ధంబున్, ముఖం బయ్యదే
యా కందోయికి నాసికాగ్రము వినా యన్యమ్ము కాన్పించన
ట్లే కన్పించెడి నంచు నున్మథుడు వాచించెన్ రతీదేవితో. 92

చ॥ కనుగవ రాలి పుష్పొడులు క్రమ్మగ రెప్పల నప్పళించుకొం
చు నతమహీజశాఖికల నూతనపల్లవగుచ్ఛముల్ వాలుతా
శను బిగిగుప్పిలిన్ దెలుపు సాత్త్వ్యము లడ్డుకొనంగఁ ద్రోసికొం
చును వారునార సెన్ మరుడు, చూడురతీ!యనె, చూచె నామెయున్

గీ॥ యోగముద్రాంకితస్థాణు నోరగంటఁ
గనుచు నక్రాంత సేవలో ననుచు హైమ
వతిని చూచి యెట్లో రతి పతిని చూచె
నాడుగుండియ యిడు కూయి యాడు దెలుగు. 94

చ॥ పులయమునుండి వచ్చిరి, హిమాచలమెక్కి రయారె! గాలిపి
ల్లలు, శివమూర్తి వారలకుఁ బ్రాణము, వారలు ప్రాణముల్ జగ
మ్ములకు, గణమ్ము లాపి శివు మ్రోలకు సాగగనీయ రైరి వా
రల,నిది దోస మంచు వికిరమ్ములు ముక్కులు చాపె మూగ లై.

ఆ॥వె॥ తనువుతనువు నొరసికొనుచు ఱెక్కలు విప్పి
స్వరము భావమునకుఁ జాలదేమొ
కన్నులెత్తి జేసె గండుకోయిలరెండ్లు
వారు నెదిరి రసాలతరువుపైని. 96

చ॥ కలగియుఁజేయజాలక మృగాల యుగాల్ కనుచుండెఁ గన్నులిం
తలుగ నొనర్చికొంచు,జ్వలితం బగుచుండెఁ బ్రవాళరోచి కొ
మ్మలు గల సృష్టి నెల్లెడ హిమాద్రిసుతాకలితాభిమానముల్
మలసి, యెదిర్చెఁ బూలకొరడా గొని కాలము కాలకాలునిన్. 97

క॥ పంచముఖు నొసటి దెస యిది
కొంచెము ప్రక్కకను సామి ! కుంచితపదమున్
ఇంచుక జరుగవె, యది; యది!
యంచు రతి వచింప మదను డాపెను కసరెన్. 98

క॥ పంచముఖు డతడు కానీ !
పంచశిలీముఖుడ నేను భయపడ కోసీ !
వంచెద నాతని ప్రథమ
ప్రాంచితమామకమహాస్త్ర మరివోసి యనెన్. 99

సీ॥ మూడుగుణమ్ముల ముగ్ధరూపము త్రిశూ
లము పాతబడియె నల్లంత యెడగ
ముల్లోకముల శుభంబును మేలుకొల్పు నా
డమరువు మ్రోయక డాగియుండె
రత్నదీపితభోగరాజ్యముల్ నాగరా
జములు మై నున్నవి చచ్చినట్లు
వృషభదేవుడు అంకెవేయడు సరికదా !
యాకులన్ మర్మర మాడనీడు

గీ॥ తాండవము లేదు, జగతికి తనివి లేదు
నింత వైరాగ్యమున నుండి యెవ్వరి నల
రించు నీ స్థాణువు, సిగురు లిపుడ నింతు
ననుచు ధను వెత్తె శ్రీదేవియనుగుకొడుకు. 100

ద్వి॥ హను వెత్తె ననుగుల యమరుల తొడుకు
కను విచ్చి ప్రకృతిభోగాపేత శివుడు. 101

ఆ॥వె॥ హరుడు యోగియైన యన్నాళ్ళు దేశాన
పరుడు భోగి యగును. పలుకనోడి
చావలేక బ్రతుకఁ జాలక యుండు జ
నంబుఁ, వారిఁ బ్రోతు ననియె మరుడు. 102

ద్వి॥ ఎదుట నున్న జనమ్ము నే బ్రోతు ననియె
మది ననుకొనకయె మృదువుగా హరుడు. 103

ఆ॥వె॥ శంబరారి నారి సారించె, సారించె
భవ్యుపైఁ బురారి నవ్యదృష్టి
యాయమయును సృష్టి కందని యందాల
బరువు మోయు చూపు బదులు చూచె. 104

గీ॥ మనసిజుడు తుంటవిలు వంచె, మతి చలించి
శంకరుని యోగ మపు డష్టవంకర అయి
నది, తదీయగళమ్మున నిదురవోవు
ఫణియు లేచి డాదెస సాగి పడగ యార్చె. 105

ఉ॥ లేజిగురాకుజొంపము బలెన్ జడచొల్లెము, మంచు వోలె మై
రాజిల నొక్క పెద్దరుదురాక వొదన్ సురపొన్నయొద్ద నం
దా జడసృష్టికిన్ దనకు నంతర మేర్పడనట్టు లున్న పెన్
జేజెకు నూటి కొలగురిసేతకు దర్పకు డొందెఁ గష్టమున్. 106

క॥ కుసుమాంజలి యిడె బాహా
బిసములఁ జాపి గిరితనయ విషమాక్షునకున్
ముసిముసినగవులు సిగ్గులు
కొసరిన కనుకళుకుతోడ గుసగుస లాడఁగ. 107

శా॥ ఆ యోంకారమువంపుఁ జూపి జటిలం బౌ నొదలన్ జూపి కా
త్యాయన్యంగుళి యేదొ సైగ యిడి నట్లై యేయెనేయేసె శా
ర్ఙీయాకమ్ము హరాక్షి సుంత విరబాఱెన్ మాయనేమానె క
న్మాయన్ విప్పగ నైన యంత వ్యవధిన్ బూవిల్తు డస్త్రార్హుడై

గీ॥ రామబాణము గురితప్పనేమొ కాని
కామబాణము గురితప్పనా,మహేశు
హృదయమున నాటి రగిలించె మధురబాధ
నది, యదిర! చంపి చచ్చిన ట్లయ్యె మరుడు. 109

క॥ శివు డందటిలోఁ జొరబడ
శివునందునఁ జొరబడెన్ విచిత్రముగ నొకం
డు విరాగి యెటులనో బూ
ది వొనర్చెన్ వాని మరు డదృశ్యశరాగ్నిన్. 110

క॥ ఆ రోజిది, తారకదు
శ్చారకు మడియింప హరదృశాగ్ని భసిత మై
మారుడు తా నాత్మార్పణ
దారిన్ దేశమ్ముగొలుచుదనులకుఁ జూపెన్. 111

ఉ॥ ఆ భసితమ్ము పుప్పొడిగ నై నది గేదగిలోన, చంద్రబిం
బాభకు వన్నె తెచ్చినది, భర్గుని మేని విభూతిపూతగా
శోభిలుచున్న, దున్నది యశోవిభవమ్ముగఁ ద్యాగమూర్తులం
దై, భరతాంబదువ్వలువయందలి వెండిజరీనిగార మై. 112

ఉ॥ పోవక నిల్చునా! యసువు పుణ్యునకేనియుఁ బాపికేని దే
శావనదీక్షఁ బోవుటది యందఱకున్ లభియించునా! యశో
జీవుడు త్యాగి సాహసికశేఖరు డీ యవకాశ మబ్బ నే
ప్రావ నటంచు చూచి యది రాగనె పోవును సూర్యభేది యై. 113

క॥ కాముఁడు జగతికిఁ బోకిరి
గామాత్రమె పరిచితుండు, కామకరాద్యో
ద్దామానుషపరిపాలన
నీ మాదిరివారు గూర్తు, రెల్లరు ప్రజలే. 114

క॥ అని వాఙ్ముఖకారి సభకు
క్షణమౌనము గూర్చి కంతుసంతాపార్థ
మ్మును పైకథ పైకథ యని
నినదింపగ సదము ప్రక్క నిరువుర నరసెన్. 115

మ॥ తన కాలమ్మును కోలుపోతి నను చింతన్ జూసిన ట్లానన
మ్మునఁ దోపించిన శిష్టవక్తృయుగళమ్మున్ మెచ్చి గోపాలు డో!
జనమాణిక్యములార! ముక్తసరిగా సందర్భమున్ జెప్పువా
డ, నిదే వర్ణన పెంచి వాకొనిన గంటల్ మ్రోగకున్నే! యనెన్.

క॥ ఆ సభ నెల్లరు నంబిక
చేసిన తపసు నిడివిగ వచింపుము, చేతః
కాసారమ్ముల నింపుము
పోసనము ననంగఁ జెప్ప మొనసె నత డిటుల్. 117

చ॥ ఇక నట నుండఁ గూడ దని యెత్తుచు శేవిణి వెండికొండకున్
సకలవిభుండు కావలి పసందుగఁ గాచితి వన్న నందియున్
బ్రకృతిని దాగె నెట్లొదొర! మారు శరీరమునున్ శరాలు కం
టికిఁ గనుపింప వెంతకు నవెన్, విని భృంగియనెన్ 'గతంగతం'. 118

గీ॥ అంశ మైన జీవాత్మ తదంశితోడఁ
గలుపుటకు మండి కామమ్ము కాలిపోయె
మధురభక్తిరహస్య మియ్యా దనె చండి
యారః నీ తెల్వి మండిన దనె శివుండు. 119

ఆ॥వె॥ మరుని హరునిపైకిఁ బురిగొల్ప సుర లెల్ల
రింద్రు లైరి, యొక్క యింద్రు డేని
మొగము చూప డయ్యె, మగడుపోయిన రతీ
దేవి కూరడింపు దేవు డెఱుగు. 120

గీ॥ ఆ ప్రయత్నమ్మునకు ఫల మట్టి దగుట
మున్నె తెలిసిన రతి యెరి నెన్న లేద
భర్తృతనుభస్మ మంజలిఁ బట్టి బాష్ప
మునఁ దడిపె, మొక్క మొలువదో! పుణ్యరాశి, 121

సీ॥ గ్రహణము పట్టెనో కమలా_ప్తబింబాన
నిండుగా నండజనికర మార్చె
పులులు మున్నగు మెకమ్ములు నకనకలాడు
పొట్టలతో నెర ముట్టకుండె
నల్లిక విడి తీవియలు నేలఁ బొరలాడ
నగముల గలగల లతిశయించె
గిరిజనాశ్రుల ధార సరియ, గండశిలల
గుండెలు జలధార గ్రుమ్మరించె

గీ॥ నో! పతీ! నిన్ను వీడి నే నొక్క త్రుటియు
బ్రతుకజాల బ్రతుకజాల బ్రతుకజాల
ననుచు నేడ్చుచు రతిదేవి వణకుచుండ
మరియుఁ గ్రుంగె భూదేవి యా గరితతోడ. 122

సీ॥ మాధవు కన్నీరు పూదేనె, యదియును
వట్టిపోయిన దొక బొట్టు రాదు
ప్రభుత వ్యత్యస్తము రసరాజ్యమున, సృష్టి
యనగ నెట్టిదొ యయ్యె నడిగె బ్రహ్మ
యొండొరున్ గనుగొనుచుండిరి స్త్రీపూరు
షులు శిలావిగ్రహమ్ములను వోలె
కేరింత లటు లుంచి కేవుకే వను నొక
స్వరమె విన్పడద యే సదనమునను
గీ॥ గాయకునకు జావళి వచ్చు గళము రాదు
కవిత దొర్లిన నొట్టు శృంగారమందు
కవికి విప్రలంభమునఁ దక్క, నుసి యగుచు
పంచశరుడు తత్ప్రతిని దుఃఖించుచుండ. 123

ఆ॥వె॥ అమృతపూర్వ మయ్యె నంటద గరళాగ్ని
యిక్షుధన్విదహన మెడద నంటె
నోసి! సర్వమంగళా! సుతుఁ జూపవే
యనుచు వాణి యొద్దఁ బనవె లక్ష్మి. 124

చ॥ పువులు లభింప వయ్యె శివపూజకు, భక్తులు గోలపెట్టి, రం
గవలయితాహినిశ్వసనకల్పితతిగ్మముఁ జూపుకొగ వా
యువు మలయాగత మ్మెచట నున్నదొ, మెత్తని పల్లులన్ వినం
గవలయు,నెందు దాగెనొ శుకంబు పికంబు,హరుండు చింతిలెన్.

ఆ॥వె॥ శివుడు దొరుకలేదు చెఱకుముక్కయు మన
విఘ్నపతికి తండు!విఁటివొ యన
వింటిఁ, జిక్కవచ్చు, పంట లే దనియె న
తండు, మరియుఁ బలికెఁ జండి యొప్ప. 126

శా॥ స్వామీ! మొన్ననె చుట్టివచ్చితినయాః సర్వమ్ము నీ భూమి, నే
గ్రామమ్ముం బురమున్ గనుంగొన ప్రజాక్రాంతంబు జీవచ్ఛవం
బై మొత్తమ్ము వనాళి శుష్క మయి ప్రత్యతుమ్ము లుగ్రాః హిమ
శ్రీ మద్వన్యనుఁ జాసి వచ్చితిరి మీ రేనాడొ నా డాదిగా. 127

క॥ నీ వన్యపదము కన్యగ
నై వినబడె నంచు గొణగు నభవునితో లో
కావనః వాణీసహితుం
డై విధి వచ్చె నని నంది యానందిగ నై. 128

క॥ గాంగోపనదిగఁ గన్ని
రంగన పాటింప రతి సరస్వతి వినిచెన్
బెంగ విడుఁ శివుని పెండ్లి కి
టన్ గాంతువు కాంతుఁ జేరటాలా! యనుచున్. 129

గీ॥ నన్ను నవ్వించుఁ, గవ్వించు, నన్నుఁ జాడు
నన్ను ముద్దాడు బ్రతిమాలి నా మనోహ
రుండు నా మన్మథుం డని నిండుమనము
నంది రతి యెట్లు వచ్చెనో యట్లె మగిడె. 130

ఆ॥వె॥ తనువు జాతికోటికు ధారవోసిన త్యాగి
బ్రతికి తోచు కీర్తివపువుతోడ
నట్టి వపువు త్రిభువనాత్మతోఁ గ్రీడించు
నింతవటకు నిట గ్రహింపఁదగును. 131

గీ॥ మళ్ళనే మళ్ళద తపస్విమనసు, మళ్ళి
నపుడు శృంగారరసవార్ధి నట్టడుగును
తట్టి గాని నిదురింపద, యట్టు లుండె
శివు మనసు, కాని శివఁ బరీక్షింపవలయు. 132

క॥ నా ముఖము నటులు చూచియు
సోమధరుడు కుసుమశరునిఁ జూడునె! నిందల్
నామీద వచ్చె, నెల్లర
నోమెద శివునిఁ గొని యనుచు నుమ యిలుసేరెన్. 133

వితాన॥ నికామ్యమున్ జేరెన్ భూమీ
ధ్రకన్య, చింతించెన్, గామా
రికిన్ దపస్యన్ దా నర్ధాం
గి కాఁదలంచెన్ భీష్మించెన్. 134

తోటకము॥ ఒకటిన్నర కన్ను గలట్టి మొగం
బొక కంటికిఁ గన్పడ రెంటికి నె
న్ని కనుల్ గల మోము గనంబడునే !
సకియా! యని యందురు సఖ్యలుమన్. 135

క॥ సఖ్యలలోన జయావిజ
యాఖ్యలు సామర్థ్యమందు వద్రితనూజా
ప్రఖ్య లగుటచే నామెకు
ముఖ్యలు, పరిహాస మాడ మొనయర యెపుడున్. 136

ఉ॥ చేయుము పూజ సౌధమున శ్రీగళమూర్తి ప్రసన్నుఁడౌను నీ
ధ్యేయుడు, కానలోనఁ దపియింపకు నీ వెత చూడజాల మ
మ్మా!యని బాష్పబిందు వొలయన్ హిమవంతుడు చెప్పిచూచెఁ గా
త్యాయనికిన్ జనిత్రి కెదురాడిన పుత్రికి దీప్తనేత్రికిన్. 137

ఉ॥ బిడ్డ వచించెఁ దండ్రి! వినవే! వని మానసపూజ సేయఁ జే
వ డ్డటు చేపడండు పురవైరి గృహమ్మున విగ్రహార్చనన్
దొడ్డ ఋషీంద్రసాధ్య మిట ధూర్జటి చూడగఁ గోల్వకుంటినే!
యడ్డకు న న్నతండు స్వపరోక్షమునందుఁ బరీక్ష సేయుతన్॥ 138

క॥ పెంచిరి నన్ను. చదువు చె
ప్పించిరి, మీ ధర్మ మంతె, యెవరిని గోరో
నెంచితినో యెంచితిని, త
పించెద వానికయి యనుపరే ! దీవనలన్. 139

చ॥ అని కృతకృత్య పార్వతి జయావిజయాన్విత దీక్ష దక్షతన్
గొని వ్రజయందు శక్తి వలెఁ గోనను జొచ్చి యమర్చుకొన్న ప
ర్ణనిలయమందు వల్కలకనద్వపు వై నివసించి దర్భశ
య్యనె పవళించి యీశ్వరునియం దెద యుంచి వ్రతమ్ము
మైకొనెన్. 140

గీ॥ పెద్దకాలము దినముఁ బంపించె నన్న
మామె వృషభవాహనునకు హవ్యవాహ
నున కిడి యిడునపుడు పల్కును శ్రుతి యలర
శివు డనిన దేమొ తనతోడఁ జెప్పు మనియె. 141

ఉ॥ ఈత డోసంగు, నాతడు గ్రహించును హవ్యము సుష్ఠు, హోసకా
న్వితుడు, పైకి నే మనడ బెల్లముకొట్టినరాయి, నంది స్వా
మీ ? తుహినావనీధరసమిద్ధతపోవనభూమి గాంచి యెం
తే తడ వయ్యె బోద మనె, నిప్పుడు వద్దనె భృంగి తోడుతోన్

గీ॥ ఓంకృతియ తక్క వినపడ దొండు గౌరి
శది నిజాంగదేవాలయఘంటమ్రోత
జోతు లన్నింటి వెలిగించు జోతి తక్క
కనబడద కంటి కన్య, మా కన్ను మనసు. 143

క॥ శివయోగిని యైన యప
ర్ణ వీడద సమాధి, తినద, త్రాగద, భూమ
ధ్యవిదితభాసం బేదో
సవరించు నదే స్వకీయజనపోషణమున్. 144

మ॥ స్ఫుటచంద్రోదయపాటలమ్మగు జటాజూటమ్ముతో యోగసం
ఘటనన్ దత్రగనేత్రసూచినిటలోగ్రత్వమ్ముతో, భూతిమ
త్పటు వాదగ్నను సంత కైన మెయితో భర్గుని సాధించుచు
న్నటు, నీవా మరి నేన? యిర్వురము నన్న ట్లామె సంభాసిలెన్.

శా॥ ఎండన్ వాన హిమమ్మునన్ బయలునంటె వస్త్రహైన్యమ్ముతో
నుండు న్నిష్ఠ దరిద్ర మోచు జన మీ యర్థిన్ దపోనిష్ఠ ను
ద్దండం బోచును, రాక యొండు ధనవత్ప్రాసాదరై లేశమున్
మంద్రాడున్, భగవత్ప్రసాద మభయం బై యన్య మాపోయెడిన్.

క॥ బాలతపోవ్రత తీవ్రత
మై లావా యయ్యె హిమము, మంటలు మండున్
జ్వాలలు కనపడవు, దనుజు
లీలుగరె! తదీయ విఘ్నకృతిం బ్రేషితులై. 147

ఉ॥ భారతమాత వేలు గిరివల్లభజాతయు వేలు కాద, త
త్పారతపమ్ము శక్తియ ప్రజాశిసమైక్యసమృద్ధచిత్తవి
స్ఫారితశక్తి, య య్యదియ పౌరుషరూపము కన్న తల్లి, రా
వేర! యటంచు దైవమును పిల్చుకవచ్చు గృహీతపాణి యై. 148

ఆ॥వె॥ ఇంద్రియార్థములకు నందని జపముతో
పరుని పట్టుకొనెడి పనియ తపము
బంధముక్తికొఱకు ప్రజ సేయవలె నట్టి
తపము నైకమత్యదార్ఢ్యనికము. 149

చ॥ అనగనె కొల్వు కొల్వు ఖళిరాః యని కేకిసలాడెఁ బ్రాభవం
బును తెగనాడెనో యనుచు ముందటి య య్యధికారి పార్శ్వవ
ర్తి సడిగి పట్టుకొం డన నదే పనిగా బ్రతిమాలు డంచు బిం
ధన మన జన్మ మంచుఁ బరతత్వ మగుఙ బరు డం చెఱుంగుచున్.

ఆ॥వె॥ పరుడు రాజ్య మేల పరిపంథి యైయె యానాః
బంధముక్తివేళ బంధువుగను
భేషః యుష్మదీయ భాష యంచు మొగమ్ము
మాడ్చుకొనియె, వక్త మరియు ననియె. 151

గీ॥ భర్త తన సహాయుని గాల్చె భార్య తన్ను
కాల్చెనన్ దిక్కు లే దని కానబడడు
గౌరి తపమునఁ దింఢ్రించు కడ వసంతు
డొక్క యేడు గాకున్నను నొక్క యేడు. 152

మ॥ కదలెన్ తేళ్ళు నెమళ్ళు దూరవనికిన్ గన్నిళ్ళ పర్యంత మై
వదలన్‌రానివి పర్వతోద్వహాకు, వ్యాపన్నాలో! కిరాల్ పికాల్
హృదయైశ్వర్యము లైన గీతములు విన్పించున్ గదా! కిన్నరీ
మృదు కంఠమ్ములు, నేడు గద్గదము, లవ్వే నెచ్చటన్ దాగెనో!

చ॥ వగరిచె వెట్ట, ఘోరుమనె వార్షికవైభవ, మార్తిఁ బాలిపో
యెఁగడు శరత్తు,కంపిలె సుహృత్తు హిమర్తువు,దైన్య మెంతయో
యగపడె మోడు గాగ శిశిరర్తువు, సర్వధరేంద్రు కన్నుపం
డగ యగు బిడ్డ యా తపము నూల్కొని దారము గాగఁ
జూచుచున్. 154

శా॥ నే నీశాంశము, సర్వ మీశ్వరుఁడు, తన్నిష్ఠన్ బ్రవర్తించుటే
యీ నా ధర్మ మటంచు నాత్మ శివునందే నిల్పి గ్రీష్మమ్మునం
దేనే కాదు పదేను నగ్నులను చుట్టింపించుకో గౌరి కే
మౌ,నేమౌను మునింగి నీట హిమమం దై గొంతులో తున్ననున్.

సీ॥ తపనైక దృష్టి మధ్యాహ్నమం దుమ, తప
మ్మునఁ దెక తెకలాడెఁ ద్రిణయనుండు
వానకారున కుంభవర్షస్తిమిత యుమ
గడగడలాడె గంగాధరుండు
ఊపిరి బిగబట్టె నుమ కుంభకమ్మున
గిలగిలలాడె మృత్యు డులిచినత
డుమ వేసె శీర్షాసనము, తల్లి క్రిందులై
వదియొః కైలాసము మదనపరుడు

గీ॥ దిగుచు దిగదిగఁ దనదిగా దిగ శరీర
మనుచుఁ గటికితపసుపట్టినామెకడకు
వచ్చె నొక బ్రహ్మచారి యై పచ్చితోలు
కావిపొడివలువగ గూడకట్టు గట్టి. 156

చ॥ వనిమొగ నాపి యాగతుని వచ్చి చెలుల్ తెలుపన్ గిరీంద్రవ
ర్ధని తుణ మాగి తోడ్కొనుచురం డని తత్తుణపూర్వముం దె యో
గనిరతి సల్పినందులకు కారణ మేమొకో! యంచు, బ్రహ్మకై
నను నిట రా నశక్య మగు నాగతు డెవ్వడొ యంచు నన్గొనెన్.

వ॥తి॥ ఈ నా వనప్రకృతి యెట్లుగ మాతె లిప్తన్
ఘ్రాణమ్ము కర్ణములు కన్నులు ధన్యముల్గా
నేనాడొ పాసినవి యిప్పుడు చేరెడి న్న
న్నెణమ్ము తౌరః యెవ డీ పురుషుండు వచ్చెన్ః 158

క॥ ఎవ డీ యేతెంచు నన
న్యవిభుడు పీనియెడ లే వనన్ లేనివి యు
న్నవి యన నున్నవి భళి! యవ
యవములు దృగలభ్యతేజఅచ్ఛాదితముల్. 159

క॥ స్వాతంత్ర్యము రాగా నే
జాతిన్ బరతంత్రగృహము భాసించునో యు
క్తై తనరె నీ వనం, బీ
యేతెంచెడివాని యంఘ్రి నేదో మెఱయున్. 160

క॥ అని యనుకొనుచునె యుమ వ
చ్చినవానికి స్వాగతము వచించి బ్రుషి యిడెన్
దన సఖులచేతఁ దెప్పిం
చిన ఫలము లొసంగి విందు నిర్వర్తించెన్. 161

గీ॥ ఉభయకులములోపరి యుమ! నీ యుగ్రతపము
ధర్మనిష్ఠయు పౌరచాంద్రమసబింబ
భాసపోషకములు సుమ! నీ శుభేచ్ఛ
పూర్తికై నా యొడల్ ధారపోయ నుంటి. 162

చ॥ తెలుపు మ దేదొ నీ హృదయదీధితిగా నను నమ్మి యో! మహో
జ్జ్వలవరవర్ణినీ! యనెను వర్ణి, యొకింత సనంగ నామెనె
చ్చెలి కథియించె స్వామి! విను శీతమయూఖశిఖావతంసు మా
మెలత వరించె, నిష్ఠ విరమింపదు కోర్కి ఫలించునంతకున్. 163

క॥ అన విని గౌరి నడిగి యా
పె నిక్క మన నపుడు వడుగు వినిచెన్ బాలా!
జనియించె నెటులు భూతప
తిని పతిగాఁ జేసికొను మతిభ్రమ నీకున్. 164

క॥ మినుసిగదయ్యము నేనే
యనుకొని పెంచికొనినాడ ననుకో జడలన్
వనితా! కానేపటి కే
ను నౌదు శశిధరుడ, నెవడునున్ గాలేడో! 165

క॥ పొట్టకు లేదా! పాముల
బట్టుక యాడింపవచ్చు, వానిని దాపన్
బుట్టయు లేదా! మొలకున్
బట్టయునున్ లేద! యెట్టి వాడు దొరకెనే! 166

క॥ కొండపిటిజంగమ్ముపై ద క్కొరుడు వలదొ
పార్వతీ! నీకు నొంటెద్దుబండియ గతి
వీనిఁ దక్క నే వేలుపు నేని పెండ్లి
యాడితివొ భద్రగజము వాహనము నీకు. 167

క॥ తలయేఁటువా డిత డుమా!
తలఁకునె? మందాకిని భవదాగమనమునన్
కలియక మనలేవు గదా!
కలిసియు మనలేవు, రొదల కాపుర మెపుడున్. 168

క॥ భీముడు రుద్రుడు నుగ్రుడు
కాముదహనకీల నొసటికన్నుఁ గల, డీ
సామిని కట్టుకొనిన నీ
సేమము నే మందు, వీని జేరకు మందున్. 169

క॥ ఇంద్రునినో చంద్రునినో యు
పేంద్రునినో శ్వాదృశల్ వరింతురు కానీ
సంద్రపుగలిపచ్చివిన
మ్మఁ ద్రావిన శూలి నెవరు మోహింతు రుమా! 170

ఉ॥ త్రావినఁ ద్రావుగాక యెది త్రావిన నెవ్వని కేమి గాని గౌ
రీ! వచియింతు ముందు గమనింపుము, చిందులు ద్రొక్కు వీడు సం
ధ్యావధియందు, నిత్యము సుమా! యని యింకనుఁ జెప్పబోవు మా
యావటు నాపి గౌరి శివుఁడౌ నితఁడే పెఱ యౌనొకో! యనెన్.

చ॥ గళమున జుట్టుకొన్న కఱకండువ కొంత సడల్చికొంచుఁ గ
న్గొలకులనుండి లేనగవు కొంచెముకొంచెము జార్చుచున్న య
చ్ఛలవటువున్ జపారుణలసన్నయనేతలఁ బట్టి కట్టి మై
నలదిన బూది దుల్పినటు లాడెను చండి సఖిద్వయమ్ముతో. 172

శా॥ కేలన్ శంభువు గౌరికే ల్గొనియెఁ, జొక్కెన్ గౌరియున్ గగ్గురై
పాల న్నుర్వులు వోలెఁ జిన్నగవు లై పై మీగడల్ సిగ్గు లై
లీలన్ వాల్చిన మోము గెల్చిన కను ల్లోలేగులాబీజిగిన్
తేలే! యన్న మెఱుంగుబుగ్గలు శివశ్రీఖండభాగమ్ము లై. 173

గీ॥ హరుడు చక్కనిచక్కయెదురుగ మొగము
పెట్టి తపసు మొదలుపెట్టె నెట్టు లౌనొ!
యనుకొనిరి కొంద, అది యిట్టు లయ్యె ననుచు
శివుడు శివఁ గౌగిలింప బాహువులు సాచె. 174

క॥ స్వామిని చూచిన యపుడే
నా మది గ్రహియించి పలుకునన్ ధ్రువపరచె
న్నా మాటయు సూచించెను
నా మనుగడ ధన్య మయ్యె నని శివ యనియెన్, 175

క॥ అని నవగోపాలు డనన్
గనె బంకించంద్రు డగ్రకణ్యాస్థుడు పొం
గిన మే నై లేచి కనుల్
దనుకగ నానందబాష్పతారళ్యముతో. 176

క॥ విలసితశుభ్రజ్యోత్స్నా ౨
పులకితయామినియెు? మాత పుల్లకుసుమితో
జ్జ్వలద్రుమదళశోభినియెు! వ
నలక్ష్మి యన నపుడు తోచెనా 'వందే' నాన్. 177

క॥ ఆ తారస్థాయీమధు
రాతుల్యధ్వనికి ముగ్ధు లై ప్రజ "వందే
మాతర" మని యార్చిరి తొలి
శ్వేతాస్యాధికృతు గుండెవేగము మిగులన్. 178

మ॥వి॥ మరియుఁ బలికె వ
క్త రుచిరనుతిజా
లరసితకరతా
శరభసము సభన్. 179

ఆ॥వె॥ మూర్తి లేని మనము మూర్తుల మై లోక
సంగ్రహమ్ము కళను సాకవలయు
తండ్రి నడిగి నన్ను తగువారి యెదుటఁ బెం
డ్లాడు స్వామి! యనుచు నగజ పలికె. 180

గీ॥ ఇంత సర్వాధికుండైన కాంతు డొదవె
నెంత తపము చేసినదొ! యీ కాంత యనెడి
భారతోక్తి పార్వతితోడ వచ్చెను, శివ
పూజతోడ దళము వేసి పుట్టె ననుట. 181

గీ॥ అనుచుఁ జేతి గడియారము నరయు వాఁ డ
కున క దెపుడొ యాగిన దాఁగకుండు మీరు
సర్కసున్ జూచువారమున్ సర్దుకొంటి
మనిరి పరిషదంతరజనుల్, వినిచె నతడు. 182

గీ॥ ఈశు ననుమతి వచ్చి ఋషీంద్రు లార్వు
రొక్కరు నరుంధతియుఁ గోరి రుచితరీతి
శివున కమ్మణ్ణి నిం డని శ్రీహిమాచ
లేశ్వరుని మేనకను గూర్చి యెంతొ పొగడి. 183

క॥ మీరు సుగుణపాథోధులు
మీ రాకన్ రంగు లమరి మిలమిల మెఱుగుల్
పాఱాడె నా కొలమ్మున
నేరన యెదురాడ ననుచు నెలతన్ గనుచున్. 184

మ॥ తల యూఁచెన్ గిరి నిల్వనన్, దనది కా దా జోలి నాన్ మేన మి
క్కిలి మర్యాదలు చేసె పార్వతి, యిటుల్ క్రేకన్నులెత్తి వాశిష్ఠవా
కుక్కలు, బంగారపుకొండ చేఁగలదు పెక్కుల్ దాన రత్నాల రా
శులు, నిల్లా! పరె! వెండికొండ, విహితుల్ సూ! శ్రీపతి శ్రీదులున్

గీ॥ పంచుకొనువారు లేరు, మా స్వామి యొక్క-
డే యొకం డని, మేనక యాతఁ డటుపెఁ
ఐతిముఖమువైపు, హిమగిరి పలికె హితులు
ధనికు లైన మా యల్లుడు ఋణియ యగును. 186

ఉ॥ వెండికి లేదు నేడు ధర పెద్దగఁ జెప్పికొనంగ నేమి, యే
కొండయొ యున్నదంటి రటఁ గొంత లభింపగవచ్చు పైడి, వి
లుండినఁ ద్రవ్వి రత్నముల నుజ్జ్వలముల్ వచరించి యమ్ముటల్
మెండుకొనంగవచ్చు, "నిద మిత్త"మటంచు వచింతు ప్రొద్దుటన్.

గీ॥ అంతిపురమున మేనక కెంతొ బోధ
చేసి సుఖనిద్రనుండి లేచిన యరుంధ
తికి శబలవర్ణ కౌశేయ వికసితాంబు
జాతి. ప్రాగ్దిశ శోభకాయమిక యయ్యె. 188

ఉ॥ మంగళతూర్యముల్ వినిచె మంజులకుంతకలస్వనమ్ములో
నింగియ యేని కైన నగునే చిరుచీకటినూనె రాచి దు
వ్వం గమనీయ మౌ చికురపాశము, దిక్కులు కానిదెట్లు పు
ణ్యాంగన, లూచి చల్లినవి యక్షతలున్ దిగజారు తారకల్. 189

సీ॥ అపుడు కొట్టిన పస పలది పారాణి పె
ట్టిన పెండ్లికూతు రై తనికె నొకటి
పంచవన్నెలతోడ పసగొల్పు పట్టుకు
చ్చుల పల్లకీ యాచు వెలసె నొకటి
జిలుగుచెంగావిపావడపైని యూదాజ
రీపూల యోణీ ధరించె నొకటి
మూడు రంగులు చూపి మొదలు క్రమమ్ముగా
స్ఫటికైకభాస మై పరగె నొకటి

గీ॥ వంపువంపున నొక్కొక్క సొంపు వచ్చి
యేమి సొగసులుపోయినవో! మొగిళ్ళు
తూర్పు పెద్ద పందిరి వేసి తోరణాలు
గట్టె, హిమశైల శిఖరాన గానవచ్చు. 190

గీ॥ లగ్ననిశ్చయ మయ్యెఁ, గైలాస మందు
కొనిరి ఋషులు, నిసర్గశోభ నెసగు శివ
సభ యజుస్సామములను కంఠభరమహిత
నాద మొలయ గానము సేసినారు ఋషులు. 191

ఉ॥ స్వామిః యి దేమి కట్టుకొను చర్మము కండువ యయ్యె నేడు, ము
న్నిమెయి దాల్చినారో యెపుడే వనె నంది, గ్రహించి వెంటనే
స్వామి సవర్చికొంచు బొరపాటును మెత్తనిక్రొత్తనవ్వుతో
మోము నలంకరించికొనె ముద్దు తలంపున కైన బింబమున్. 192

క॥ ఆ యభవుని తాండవ మొక
సాయంకాలమ్మునందె, సతతం బాడెన్
దీయని భావము తాండవ
మాయనలో. నింత రసికుడాః యనిపించెన్. 193

క॥ పరిణయ మైనది, గిరిజా
పరమేశుల కద్రిరాజు పట్టించెను కి
న్నరసిద్ధసతులచే వి
స్ఫురమణినీరాజనములు పౌనుపశ్యములన్. 194

ఆ॥వె॥ హిమధరుండు చామరములు కస్తూరియు
సేవుపండ్లు పునుగు దేవదారు
చెక్కపెట్టెలందుఁ జక్కగా నింపి పం
పించె బిడ్డతోడ వెండిమలకు. 195

క॥ రతి మున్నె వచ్చి తనపతి
చితి వెతకుచు వెనుకనుండి చేతు లెవో క
న్గత మూయఁ బ్రియతమా! ధ
న్యతమ న్నే నైతి నేటి కని యెలుగించెన్. 196

చ॥ తరుసరసీవిహంగసముదాయమిథఃకలనాకలార్భటీ
నిరవధికంబు నౌ నడవి నిస్తులకేళివనంబుగాఁ, గిసా
లరుచిరసూనశయ్యలు నలంగగ స్వర్గము లెన్నొ యన్ని యే
లిరి రతిమన్మథుల్, ప్రజకు వృద్ధియు నెప్పటియట్ల చేకురెఁ. 197

శా॥ ఆ కైలాసమునందు మన్మథకుజం బానొక్కన్న శ్రీగంధపున్
బ్రాకున్ మెచ్చు నపర్ణతోడ నగుచున్ దచ్ఛాయ రత్నాసన
శ్రీకుం డౌచు శివుండు తా మదనపుష్పేచ్ఛుండ నన్నాడు గౌ
రీకల్యాణముఁ జూడ దైవతపురంధ్రీపాళి వైభోగమున్. 198

ఉ॥ ఆ జగదేకదీపయుగళైక్యజ మోజము నగ్ని మోసి గం
గాజలమందు డింప నది గర్భముఁ జొచ్చెను కృత్తికాళి కం
దే జలకమ్ము లాడునెడ, నిల్చిరి వారలు దాని తెల్లులో
నా జగతేజు షడ్వదన మై విలసిల్లె విశిష్టజాతిగా. 199

ఉ॥ సత్య ముపాయమున్ జదువు శౌర్యము వక్త్యుదయంబు ధైర్యమున్
స్తుత్య ముఖమ్ము లైన యవి జోదులమేటి ప్రముఖాభివృద్ధి నా
దిత్యబలాధినాథు డయి తేజరిలెన్, బెలచేత నుండునే!
నాత్యను బోలు శక్తి, యిటువంటి యపుత్రుని చేత నుండెడిన్.

క॥ మలినాంబర మ త్తరువుం
బలె తారకనామ మూను పాలకదైత్యున్
వెలుతును మూలకు, కోరెనొ
కలినే జము మోలకు నని కందుడు పలికెన్. 201

చి॥ప॥ వాచకు డా పలుకాడన్
లోచనముల్ సభలోనన్
జూచెను నైరృతి మూలన్
లేచె నొకండు బిరానన్. 202

క॥ తల పంకించుచుఁ జనె నా
తెలిదొర సభమూలనుండి తెలిసె న టంచున్
నిలువుడి కావచ్చిన దన
కల దెంతో కావలసిన కథ ముం దనుచున్. 203

సిం॥రే॥ పెంచలేదు గాథ యంత్య
ప్రాంచితమ్ము ఘట్ట మై వా
చించె వక్త యెల్లవా రా
లించి సారముఁ గ్రహింపన్. 204

సీ॥ అరిధైర్యమును క్రౌంచగిరిని భేదించె నొ
కశ్రమ్ముతో నా నిఖిలాస్త్రవేది
కదనమ్ము తప్ప దయ్యె, దనుజు లనుజు లై
రాదిత్యులకు స్వర్గ మంది యపుడు
కత్తుల గొండ్లిలో కరిహయరథసంఖ్య
విస్తరాకుల సంఖ్య పెండ్లి నొకటె
తారకమ్మన్య నాతారకమ్ముగఁ గాల
కీర్తిశేషునొనర్చెఁ గార్తికుండు
గీ॥ పూడ్చిపెట్టి పరశతఘ్నిభూరిబలము
రాక్షసప్రభుత్వము నోట రాయిగొట్టి
ధృతభవార్ధతనూభారతీయ మైన
ప్రజ యపు డమేయధాటి వట్లు జనులార! 205

గీ॥ పలికెఁ గథ నిటులు నవగోపాలమిత్ర
త్రవ్వుకొనెఁ దన పూర్వదర్పమ్మును ప్రజ
మరియు నిరువురు కొలదిగ మాటలాడి
రొరిమెగూర్చి వేదమతంపు పెరిమగూర్చి. 206

క॥ కొన కనియె రాజనారా
యణు డధ్యతుండు మాటలాడిన వారిన్.
వినుతించి, మెచ్చి మరు తెం
పున, జాతి షడాననముగఁ బొనరుత! మనుచున్. 207

క॥ విరమింపబడె సభయుఁ, బె
క్కురు సర్కసు కేగి రదియ కొసరిన యా సై
యరిగెను సర్కసు! పూనా
పురమునకున్ మరుదినమ్ము, బొంబయి కెపుడో ! 208

# శౌర్యఖండము

గీ॥ తనదు జాతీయధోరణి తనదె కాని
కోకిలము మన స్వరమునఁ గ్రోల్చ దయ్యె
ననుచుఁ గాకులు వాగికొన్నవి తదీయ
కాలచిహ్నచిహ్నితవిశ్వవీలిఁ జూచి, 1

క॥ మల్లియలు గులాబులు కో
కొల్లలుగాఁ బూచె సంపగులు మున్నగు పూ
లుల్లములు వివిధలలితము
లెల్ల నిటులుఁ దనరు నని ప్రకృతి ప్రకటింపన్. 2

ఉ॥ మోజుపడంగ నేమగును పుట్టద యెట్టని జాతి యాత్మ నౌ
రోజుగఁ జేయు మల్లియలలోన, గులాబులలోన స్వచ్ఛమున్
రాజిలె, లోకమాన్య మిది, ఘ్రాణము నన్నియు నేకరీతి స
న్మానము చేసినన్ మతులు నైకవిధమ్ములు మ్రొగ్గుకొన్నిటన్. 3

ఉ॥ వీక నుపన్యసించు నొక విజ్ఞవరేణ్యుని వైభవమ్ము పుం
స్కోకిలకూజితాన్వితము చూఱగొనెన్ సహాకారవృతః మా
వాకున కుల్లసిల్లిన విభాతిఁ దనర్చెను పూల తోటలో
మోకలు తీవెలున్ మహీజముల్ మలయానిలచాలితమ్ములై. 4

ఆ॥ వె॥ రెమ్మనుండి వెడలుఁ దుమ్మెదపిండు పి
ట్టలున వెడలు గుండ్లు బలె నెసంగ
నిలచి పోరు యోధునిన్ దలపించె ర
సాలతరువు నాటి సమయమందు. 5

క॥ పూనాస్థానీయం బది
పానీయం బచటి ప్రజకు భారతిచనుబా
లేనాడును, సాహసమున
నా నాడే ఘనము, సాంఘికాభ్యుదయమునన్. 6

గీ॥ ప్రజలు వివిధోత్సవమ్ములఁ బరగి రపుడు
వానిలో సర్కసొక్కటి, వ్యాఘ్రసింహ
ములవయిని స్వారిసేయు క్రోతులును నందు
వింతవేస మాపదమస్తదంతురముగ. 7

క॥ ఇరువురు ప్రేక్షకు లందొక
మఱువునఁ గూర్చుండి, రొకడు మాటాడె నిటుల్
నరు లీ మృగములకన్నన్
మెఱుగా! మన యస్వతంత్రమేదినిపై నిన్. 8

గీ॥ కొరడ ఝుళిపించు నధికారిఁ గొఱవిచూపు
చూచి గుఱుకొట్టియును బోను చొరక తప్ప
దయ్యెఁ బంచాస్యమున, కెవ్వ రైనఁ జెఱకుఁ
దార్పబడిరో ఫడకే! విడుదలయ లేదు. 9

క॥ అన్న తన హితునితో నిటు
లన్నాఁడా యద్వితీయుఁ డైన ద్వితీయుం
డన్నా! పొరపడితివి విన
కున్నావో శివాజిఁ బగరగుఁడెన రాజిన్. 10

క॥ ఆయన పరిపంధి కటక
టా! యనఁ దన బందెకటకటాల్ విడి రాఁడే!
ఓయి! సఖః పులికి నఖమే
యాయుధము, మనిసికి బుద్ధి యెంతకు ఘనమున్. 11

క॥ అని మరల వెడదకన్నులు
ఘననాసము పెన్నురమ్ము గల ఫాడ్కే యి
ట్లనియె మెలమెల్ల మిత్రమః
మన జంటయె చాలు భరతమాతను దేర్పన్. 12

శా॥ అంతన్ సర్కసునేత యాంగ్లుఁ డొక డాయా జంతుశిక్షాస్మృతుల్
సాంతాభ్యస్తము లైన దిట్ట యిరుచాయన్ జోడుపిస్తోళ్ళ నా
క్రాంతమ్ముల్ దుగజేబు లూని ప్రజ నాజ్ఞాపించి యత్ప్రౌఢిగా
నంతస్సారనిదర్శనావయవవిన్యాసమ్ములతో నిట్లనెన్. 13

సీ॥ ఇది యాఫ్రికాఖండనదితీరమున మాకు
మచ్చిక చింపాంజిమర్కటంబు
ఇది సింగపూరరణ్యదవానలమునుండి
రక్షింపబడిన తరక్షుకంబు
ఇది సింహళద్వీపహృదయఘోరారణ్య
పరిలబ్ధవిస్రబ్ధభల్లుకంబు
ఇది బ్రహ్మదేశసంపద యింక బొత్తిగా
మాకు లోగని గజమండనంబు
గీ॥ ఇదియ కెనడామృగాధిప మొంత యగ్ని
మండినన్ వలయమ్మునినుండి యెపుడొ
మెఱపు మెఱసిన చందాన నురవడించి
యవతలకు దాటె, జనులార! యరయుడోయి! 14
గీ॥ అవిగొ లంఘించె భరతఖండాంతరాత్త
వంగదేశ మహారాష్ట్ర వైభవములు
తక్కువులు లోక్క యెత్తు నీ ద్వయ మొకెత్తు
నెపుడు క్రొత్తయ వీని కే మిడెడి శిక్ష. 15
గీ॥ ఇటులు జనమున కెఱిగించి హే య్యటంచు
రెండు చేతుల మ్రోగించె రెండు కళలు
వానిపై బడె నిరుపులుల్, వాడు లేడు
కలదు క్రేవుల ప్రోవు రక్తమ్ముమడువు. 16
శా॥ హాహాకారనినాదమేదురముగా నా సర్కస శ్శాల జన
వ్యూహమ్ముల్ గృహ మేగుచున్నయపు డం దున్నార లే
కొందఱో
ఓహాహో! యనినట్టివారలును, సైన్యోద్యోగి 'ఫాడ్కె' దళ
న్నిహారాంశుమరీచిలోన నిదురించెన్ యోజనామగ్నుడై. 17
క॥ అది తెల్లవారుజామునఁ
గదిసిన కల, కంట నీరు గ్రక్కుచుఁ జూచెన్
దుదిచూపు తనకొఱకు రుజ
మ దిరిన జనయిత్రి మేని ముడుతలు వ్రేలన్. 18

సీ॥ తన కెంత యున్న న ద్దాని నెవ్వడో నాచి
కొని వేసినది యింత కూడు గాఁగఁ
దన కాలికిన్ జేతికిని సంకెలలు వైచి
చెఱబట్టి నట్టి దుస్థితియు గాఁగఁ
దన గొంతు నెవ్వడో తనయా! యనుచుఁ బిల్వఁ
గేరిన యపుడు నొక్కినది గాఁగఁ
దన సహాయుని చంపి తన మేన తద్రక్త
మును పూసి యెవడో నవ్వినది గాఁగ

గీ॥ గింజుకొనుచుండె మాత, యూహించినాడు
నఱచినాడు నమ్మా! యని, యేొడుగఱచి
వాడు, లేచి ఫాడ్కే నిజనయనములను
తుడుచుకొన్నాడు నీరము తొనకుచుండ. 19

మ॥ కనులన్ గట్టినయట్టులైన జననీకష్టాతికష్టస్థితిన్
గనుపింపన్ దొలిసంధ్యవేళ మలిసంధ్యావేళగా, గొందు తె
ల్లనొకే గంతున దాటి చేరె నత డాంగ్లావాస ముద్యానఖే
లనరంగస్థలచిత్రశాద్వలసుశాలావీథివిన్యాసమున్. 20

క॥ చేరి యొక భవనరాజ
ద్వారముకడ వేచె ఫాడ్కె, పంజరమున మై
నా "రూడ్ రూడ్ గెలెవే" యన
భైరవముగ జాగిలమ్ము 'భౌ భౌ' మనగా. 21

చ॥ వెలి కరుదెంచి సభ్రుకుటివీక్షణుడై యధికారి నన్ను మే
ల్కొలుపగ నే పిశాచి యిటకున్ గొని తెచ్చెను నిన్ను నే డనన్
దెలిపి స్వకీయదుస్థితిని నే జనుదెంతును వేగ రెండురో
జులు సెలవిందు చాలు ననుచున్ ఫడకే వచియించె వానితో. 22

క॥ అతడు వచియించె నిదే
నా! తెచ్చితి వేదొ వేగు నని తలచితి, సం
స్ఫీతంబు కార్యభారం
బీ తఱి సెల విడగ జాల నెవ్వరికేనిన్, 23

మ॥ విని ఫాడ్కే బిగలాగి వాగె సహసా ప్రేంఖత్తురంగమ్ము నా
గిన భంగిన్ మది నిగ్రహించి, కను లగ్నిన్ రాల్పఁబోఁ బట్టి యా
పిన రెప్పల్ తగ. ముష్టినుండి బలిమిన్ విప్పొందు ద్రే ళ్ళాని యా
తనికిం బత్రము వ్రాసి యిచ్చెఁ గొలువున్ దా ద్రెంచికొన్నట్లుగా.

గీ॥ నీరు త్రాగక యెవ్వడేని యలిగిననుఁ
బారుచునెయుండు నది యని పలికి యధిపు
డాగిపోవును నది, బ్రద్దలగును కొండ
ప్రజ తలంపగ నని మాఱుపలుకు వినియె. 25

గీ॥ సందు గల వ్రేళ్ళ చేయూగు వందనమ్ము
వాని మీసపు మెలివేత పరిగణింపఁ
దగిన, వతడు హుటాహుటిఁ దరలినాడు
మాతృ సేవాపరాయణమానసుండు. 26

శా॥ పూనాలో నత డింట మాతృచరణమ్ముల్ ద్రొక్క శైత్యానుసం
ధానాచంచలతత్కళేబర మొకింతన్ వేడిమిం బొందెఁ గ
న్గోనన్ జూచి జనిత్రి పుత్రకుని మేనున్ దువ్వి నా తండ్రి! ఫా
డ్కే! నన్ మించిన భారతాంబ కల దోయీ! నీ కనెన్ మెల్లగా,

గీ॥ పరశురామజ్వలితవహ్ని భవము నాన్న!
వంశముల మిన్న యీ "చితాపావనంబు"
పుట్టి రిందుఁ బీష్వాలు, నీవు నుదితుడవు
కొడుకుబుజము దడవి తుది నొడివె నామె. 28

సీ॥ సరితూగ గలనొ జిజాబాయితో నంచు
నెవ్వరు నను హెచ్చరించువారు
గుఱి తప్పరాదు వాక్కును తప్పరా దంచు
నెవ్వరు నన్ను శిక్షించువారు
తెలిగుట్టు తెలియ సై కొలువు సేత య టంచు
నెవ్వరు నను మందలించువారు
క్షాత్రమ్ము బ్రాహ్మ్యమ్ము సంస్కృతికను లంచు
నెవ్వరు నాకు బోధించువారు

ఆ॥వె॥ అమ్మ! నీవు వేలు నంద అమ్మలు వేలు
మాతృబలమె బలము మానవునకు
పూజ్యభావములకుఁ బుడుదు వోసిన నీవు
లేని నాకు జగము లేని దయ్యె. 29

క॥ తల్లీ! తల్లీ! యని దుర
పిల్లగ విబుధు డు సుతుడు పిల్లడు వోలెన్
దల్లలనాజనలోకమ
తల్లికి మూయబడెఁ గన్నుదమ్ములు విధిచే. 30

క॥ పదియును రెండు సహస్రుల
సదపడి సర్దాంగి పలికె షాడ్కేతో స్వా
మి! దినముదిన మాయువుపాల్
కొదువబడెడిఁ జిల్లికుండలోఁ బోసిన సై. 31

ఉ॥ ఆయువులో భవాదృశుల కర్దనిమేషము వ్యర్థ మేనా యాం
గ్లేయులు కోటిరూకల గణింతురు వెచ్చగ, నంత జా గగున్
ధ్యేయముసిద్ధి యీ భరతదేశజనమ్మున, కాయుధమ్ము లం
దీయగ నాజ్ఞ యిమ్ము భవదీయభుజాభరణమ్ములం బ్రభూ॥ 32

గీ॥ అంధతమసమ్ముఁ బాప సహస్రకరుండు
చాలు నొకడె. శ్రేయస్కరుల్ చాలమంది
త్వాదృశులు కావలయు నేడు భారతమున
సతము బహుళపథం బైన బ్రతుకుఁ బ్రోవ. 33

సీ॥ బోధించి ప్రజకు సంశోధించి యోధుల
సమకూర్చుకొని బారుసాగు నదను
ప్రాణాలపైఁ బడి బాణాల వలెఁ దుపా
కుల లాగికొని పంచుకొనెడి యదను
రైఫిలుగుండ్ల విరాజి పట్టీ నాగ
యజ్ఞోపవీత మై యడరు నదను
పాణిమ్ము తెంపుమాగాణమ్ము పెద్దగా
విసరి మార్తురఁ బడవేయు నదను

గీ॥ మాతతుదిపల్కునకు వ్యాఖ్యవ్రాతయదను
భరతమాతముసిముసినవ్వు మెఱయు నదను
కంకణమ్ము మీ కయి కేను కట్టు నదను
స్వామి! వచ్చి వేచినది ప్రాగ్ద్వారమందు. ౩౫

క॥ పెనవేసికొనినవి ప్రియా!
మన యిరువురి జీవభావమతధర్మము లీ
తనువు లిరు క్రొవ్వువత్తులు
జనతాకల్యాణమార్గసందీప్యమ్ముల్. ౩౬

క॥ నా విని పతి సత్యము భా
మా, వచియించితివి! దేశమందలి నరకం
బావిరి కాదే! యీదృశ
భావావేశమునం దొడరం ద్వాదృశ లనియెన్. ౩౭

గీ॥ 'శాంతిమాతోపె' తరువాత శారసిల త్వ
దన్యుడైన ధన్యుడు లేడ యనిన సతికి
మరియు ననెం బతి యట్టి రెవ్వరము కాము
నొక్క డున్నాడు సుమి! తెన్గుమొక్కలీడు. ౩౮

గీ॥ అతడు ద్వారబంధాలవంశాబ్ధి గన్న
చంద్రయాఖ్యుడు, సర్కారుసైనికులు వ
చింప వింటి నాతని పేరు చెప్పగం బర
ధైర్యగృహామున ద్వారబంధమ్ము ప్రీలు. ౩౯

సీ॥ పుడమికి హృదయమ్ము పొంగు పచ్చికబీడు
తొనకుచున్నది ప్రాణఘనము తళుకు
ఇరు తటమ్ముల నేచి తఱచైన తరువాటి
కురియుచున్నది ఫుల్లకుసుమవృష్టి
కలకల స్వానమ్ము నెలుగెత్తి ద్విజకోటి
పలుకుచున్నది శ్రుతిప్రమదభరము
ఒక కట్టుగాం జేయుచున్న నాట్యమ్మున
దుముకుచున్నది తరంగముల పంక్తి

గీ॥ భూరికోలాహలము జరుపుకొనుచున్న
దో! తరుణి! వీరవర్ధంతి గౌతమీప్ర
వంతి, యున్నది తన్నదీపారవన్య
సీమలో చంద్రయ నివసించెడి బవంతి. 40

సీ॥ పులులు వంతుల మార్పు నలవర్చికొని కాప
లాగాయుఁ దేజీల లాయమునకు
జాంబవంతుని కోవ జామున కొకమారు
ప్రహరిసాగును గృహప్రాంతమునకుఁ
క్రొత్తక్రొత్తవి చేరి కోడెత్రాచులు రక్ష
గావించు నాయుధాగారమునకుఁ
బవలు డేగలును గూబలు రేయి న్యాయని
ర్వహణదక్షములు చారత్వమునకు

గీ॥ ననుచరు ల టన్న వారు, చేదై శరమ్ము
తీయనై మనమ్ము గొంటులు కోయదొరలు
గడ్డబానిసమునుఁ బాప గౌతమీయ
మైన మన్నియమునకు చంద్రయ్య ప్రభువు. 41

ఆ॥వె॥ కోయవా రమాయికు లనాగరకులు వ
స్త్రములు నిండు దాల్పు శ్రద్ధ సేయ
రైన నేమి వార లధమస్థులా? కారు
నీతియందు జాతినియమమందు. 42

ఆ॥వె॥ ఐన నేమి గొప్ప యధికారి, శ్రీమంతు
డైన నేమి, చదువ రైన నేమి
మానవత్వమునకుఁ బ్రాణమ్ము నీతి, య
దొంటని యత డొగుడువంటివాడు. 43

ఆ॥వె॥ సద్గుణమ్ము లేక చలువదుస్తుల మోత
నాగరకత కాగ నడచు నెవడు
రేవునుండి నగరి రేవేలువానింటి
కరుగు ప్రాణి కాత డగ్రభవుడు. 44

చ॥ కల దొక పెద్ద యూ రచటఁ గాననసీమసమీపమందు, సం
కులముగ సంత సాగు నట, కోయలు పూరుషు లంగనల్ సము
జ్జ్వలగతి వచ్చి యచ్చటకు వారమువారము దర్పణాదిక
మ్ములకొఱ కమ్ముచుంద్రు వనభూమి లభించిన వస్తుసంపదన్. 45

సీ॥ పెట్టు పొగాకు నివ్వి వెదుళ్ళ ముత్యాలు
రాః కొల్చుకో కూనలమ్మతోడు
కొనర మామా! మంచి గొంగడి యిచ్చి యీ
చిల్లి లేనిది పెద్దపిల్లితోలు
ఒసగి సెనగపప్పును సరికిసరి చార
పప్పు నెట్టుకొనరా! కుప్పకుప్ప
ఇది జుంటితేనె మొన్న దులిపితిమి దొరా!
దీనిని గొని మంచినూనె యిడుర!

గీ॥ యనుచు కొనుగోలుదారుల నామతించి
యాటవిక సంపదను కోయ లమ్ముచుంద్రు
వర్తకులు తదుపాంతప్రవర్తకులు ని
రంతరహైరణ్యరంగనర్తకులు కాగ. 46

ఆ॥వె॥ అందు వచ్చె సైనికాధికారి యొకండు
భటులు చిత్రవర్ణపటులు కొలువ
వెదకివెదకి చూపు వేనినో విసుగొంది
యతడు ముఖ్యుతో రహస్య మాడె. 47

క॥ చని యిటునటు నా ముఖ్యుడు
వన వస్తువు లెన్నొ చాపపైఁ బఱచి నితం
బిని యొకత కూరుచొని య
మ్మునెడన్ నిల్వబడె మనసు పులిసినయటులై. 48

క॥ ఈ స్త్రీయే 'స్త్రీ' యనగా
నిస్త్రీమడత వలె నున్నదే! నలుగక మై
యస్త్రం బిదె యైదవది సు
మాస్త్రున కని వాడు యువతి నభివర్ణించెన్. 49

క॥ ఓ నా లవలీ లౌలీ!
యీ నీ చావపయి నున్న వివి యేమి? యనెన్
వానిన్ జూఱచుఱకనుకలి
మై నారసి కోయజాతిమణి యోయి! దొరా! 50

మ॥ దొర!ముప్పన్నె మెకాల రొమ్ములకు కత్తుల్ గ్రుచ్చి మావారు చీ
లురు, దానన్ వెలువడ్డ యెమ్ము లివి మేలున్ గూర్చునాన్
భాగ్యపున్
దొరువున్ మా కవి కావు నే డివి య టంచున్ దద్వధూటీకుచో
పరి లాకీకొన మోపి వాడు పొడిచెన్ వ్యాళీఫణంబున్ బలెన్. 51

క॥ కన్నుల దప్పిక! దీర్చిన
యన్నులలో మిన్న మదపుటాకలిదీర్చన్
గ్రన్నన లేవే! పున్నెము
కన్నము త్రవ్వినది భాగ్యఖని కనియు ననెన్. 52

చ॥ అనుడు తదీయనైనికదురాత్ముని బాహు వలాబు పట్టు త్రుం
పిన మగవాని పేరు వినుపింపు మటం చడుంగంగ భార్య కి
ట్లనె బలవంతు డమ్మి! మదహస్తిని హస్తము చాచి కొట్టు న
య్యనువునఁ గొట్టె న వ్వనచరాంగన గల్లము వాయ వానినిన్.

చ॥ ఎవ రెటు లైన నేమి మన కేలఁ యటంచును ధర్మరక్షణ
వ్యవహృతిశక్తు డీశ్వరుడె యంచును మత్కులజాత కాద యీ
యువిద యటంచు నీ ప్రభుత యుండుటచే మనుచున్నవార మో
ట వలదు రాజవిద్వర మటంచు నుపేక్ష వహించి రందఱున్. 54

గీ॥ ఎవని మగవా డటంచు నేడు వచియింతు
నున్నచో వాడు స్వర్గమం దుండు, లేక
యిందుఁ జెఱ నుండు, కాననమందు నుండు
పీడు వాని జాడకొఱకు వెదకుచుండు. 55

క॥ పురిజనుల కంటె శ్రేష్ఠులు
గిరిజనులే, వారు కూడి కేక లిడుచు నో!
మురికిమనసుమానిసి! నిను
నఱకెద మని వెంటనంటినా రా భటునిన్, 56

క॥ తనవద్ద శస్త్రములు కల
వను స్పృహాయే లేక భటుడు పరుగిడె గాలిన్
దృణ మటుల బలియు డయ్యు. న
వినీతిచే నెంతటి గురువేనియు లఘు వౌ. 57

ఉ॥ కోఱలు గోళ్లుగా నడరు కోయతచేతుల ధాటి గాయమున్
తోరము గాగ నీ భటుడు దూకి నిజాధిపు మ్రోల చెప్పె, వా
డో! రయ మొప్పఁ గ్రోవులఁ గడున్ రగిలింపగఁ జేసె సేనచేఁ
గ్రూరత కోర్వజాలక పరుంగిడి రా వనచారిబృందముల్. 58

చ॥ పరుగిడి వారు చంద్రయకుఁ జాటును జెప్ప నతండు యోజనా
పరుడు గ్రహించెఁ దన్ను జెఱబట్టగ వచ్చి ప్రభుత్వనేతయే
జరిపెను గ్రంథ మింత తన చక్కియు నుక్కు నెఱుంగ నంచు,మం
థరహాసదాననమ్మున వనస్థుల సిద్ధము సేసెఁ బోరికై. 59

చ॥ దురముల నందునందుఁ దన తోడుగఁ బోరినవారి శస్త్రమం
దిరమున కాత దేగి యరుదెం డనఁ గత్తులు గండ్రగొడ్డళుల్
గరళవిదిగ్ధకాండములు కార్ముకముల్ గొని కోయవారు ని
ల్చిరి పగవారిఁ గోయక స్పృశింపదు కే ల్కడి నన్న వారలై. 60

మ॥ నడినెత్తిన్ ముడిగొన్న జుంజురుకురుల్ నానాలతాబంధముల్
కడెముల్ తాయెతు లొప్ప నేత్రములు గ్రక్కన్ జంద్రనిప్పుల్
వడి
న్నడచెన్ వన్యజనంబు చంద్రయబడిన్ "జై కొండలమ్మా" ధ్వనం
బెడమున్ గొల్పని ముండ్లచెట్ల కొమ లెంతే జీరినన్ గానరై. 61

ఉ॥ తెల్లని పాగతోడ మెలిదిరినమీసముసోగతోడ! నా
బల్లిదుడుఁ సుదీర్ఘసమభక్తశరీరుడు ధీరుడున్ మహా
మల్లుడు సాగెఁ జంద్రయసమాఖ్యుడు భారతకేతనమ్ము ప్రా
ణోల్లసితమ్ముగా నడచుచున్నదొ ! జోదుల కగ్రగామి యై.

క. అని తన్ను చూచి తళతళ
గనులన్ మెఱయించుచున్న కాంతకు "ఫాడ్కే"
వినిచె నిటు మరియు నటు నా పరి
కనుపించెను దవ్వునుండి కన నొక్కఁడుగా. 63

చ॥ పగర గుడారముల్ దరిసి బంట్లను చంద్రయ నాల్గు వైపులం
దుఁ గదియ దీర్చి వా లయిన తోరపు మిట్టను నిల్చి యగ్నిబా
ణగణముతో నశేషదహనం బొనరించెను కాన రైన బొ
గ్గగు నొక కొంత బూ దిది నిరర్థకమంచుఁ దలంప కోయతల్. 64

ఉ॥ పడ్డ తుపాకిగుం డ్లనుము పైబడిన ట్లయి కొంత నొచ్చియున్
గొడ్డము లేని కోయపరి కో! యని తో డెనయంగఁ గోసినా
డడ్డమునిల్వకోత నహితౌఘముఁ జంద్రయ ఖడ్గపాణి యై
దొడ్డ తదీయ యుద్ధమునఁ దొట్టెను గౌతమి రక్తవేణి యై. 65

క॥ తరవళిబరిచితుపాకి
గరిడీపై చేయి! గోపికాబాయీ! గ
గ్గురుపరచు నాంధ్రపౌరుష
చరిత్రఘట్ట మిది వినుము సాకల్యముగా. 66

క॥ ఇఱుకునఁ బడి భారతరా
ష్ట్రరమాజీవనము వోలె సాగు నొకట నం
దిరు గిరుల నడుమ గోదా
వరి, చంద్రయ యుండెఁ గొండపై నవలిదరిన్. 67

ఉ॥ వానిని పట్టుకోఁ బ్రతినఁ బట్టి యటన్ జనుదెంచి యాంగ్లసే
నాని మరొక్కఁ డిద్దరి వనమ్మున బెబ్బులివేటపొంచె ను
న్నానని పొంచిపొంచియు రణత్వరమాణచమూసమేతు డై
యా నది దాటి కొండపయి కద్దరిఁ బ్రాకఁ దొడంగె వేగుతో. 68

ఉ॥ ఈ నడిమింటికాన దహియింపుడు, మం దిడి ప్రేల్చి యా శిలల్
సేనతలల్ బగుల్ప దొరలింపుడు గుబ్బలిగుబ్బనుండి తో
డ్తో నని శత్రుయాత్ర కనుడో యని చంద్రయ కోయరాదనా
కానతి పెట్టెనో ఫెళఫెళార్భటి పర్వులుపెట్టె మింటిపై. 69

ఉ॥ భారతభూమిలోఁ బసిడిపాతరలన్ దెగద్రవ్వి యెత్తి నా
భారతమమ్మగా నెవరు వార్నిధిపైఁ గొనిపోవుచుందు ర
వ్వారలు కూర్కవచ్చు నిక జ్వాలల వెచ్చని కొండ స్వాగతా
చారము తీర్చె నంచు నొక శబ్దము వించె నవాబ్దనాద మై. 70

ఉ॥ కత్తిని బట్టి గెల్చితి మఖండము భారత మండలమ్ము ను
వ్వెత్తుగ, దానిపై నదిమి పెట్టితి మిప్పుడు కత్తి నంచు వా
క్రుత్తురు వేరు వారి చెయి కొంకర తీఱ నిదే శరాగ్రజా
గ్రత్తరళాగ్నిరతు యని కంఠము వించె దిశావకుంఠ మై. 71

గీ॥ భారతమ్మ రోజాపూల పాన్పు టంచు
నెంచినా మగ్నిపర్వత మంచు నెంచ
మైతిమే! యనుకొని రభియాతిగణము
ప్రకృతికడుపున మంటలు బగ్గు మనగ. 72

ఉ॥ గంధకవాసనాకలితగాఢవిసారితభీమధూమభా
రాంధులు కాననాశ్రమణు లంత్యము చూపున వొండొకళ్ళ ని
ర్గంధముగా గనుంగొనుటకై సలిపెన్ సహాకారమున్ మరు
ద్బంధువు వారి చుట్టు తరువాటము గాటముగా దహించుచున్.

గీ॥ ఆ వనచరాళి రామచంద్రయ్యయండ
చూచుకొని ద్విగుణీకృతస్యూతశక్తి
గండపాషాణముల మార్తు దండుపైని
విడిచె మెద డూడి తల పిప్పిపిప్పి గాగ. 74

గీ॥ కాంత ; యిది నిన్నమొన్నసంగతియ సుమ్మి !
యతనికిని నాకు దూర మత్యంత మగుటఁ
గలసికొన మైతి మెందేని కలయగలము
ప్రక్కలో బల్లె మత డాంగ్ల ప్రభుత కిపుడు. 75

శా॥ స్వాతంత్ర్యం బను కోట గట్టుకొను చెల్వా! భారతం బెన్నడే
నీ, తన్నిర్మితిలో శిలాప్రకర మెన్నే నౌను ప్రాణమ్ము, ల
ట్లై తా జ్ఞాతుడు కాడ యెందఱకో బాలశ్రేష్ఠు డొక్కండు గో
పీః తాదృష్టునదేశభక్తు డెవ డోసీ! నేటి యీ పెద్దలన్. 76

క॥ పంజాబున శిక్కులు ము
న్నంజలి ఘటియించుటన్గదా! యెన్నండో
భంజింపబడదగిన పెర
జంజాటముయతుపతిత స్వారి యొనర్చెన్. 77

గీ॥ అది యెఱింగిన రామసిం గను మనీషి
పరకృతము లైన యొత్తిళ్ళ పట్టలేక
కొఱతపడ దుర్గముఖ్యమ్ము లరయలేక
గళము కాహళముగఁ బ్రజ కలక. దీర్చె. 78

గీ॥ ప్రాణవాయువుకన్నను పౌరుషంబు
ముఖ్య, మన్నముకన్నను ముఖ్య మాత్మ
గౌరవము, వలువకన్న ముఖ్యంబ యైక
మత్య మని తలంపనివాడు మనిసి కాడు. 79

చ॥ మృగములునున్ ఖగమ్ములు వచింపగ నేరిచియున్న వాని బా
స గుఱుతు వట్టు శక్తి మనజాతికె యున్నను నైకమత్య మిం
తగఁ జెడిపోదు, రొక్కమును తాకని వెగ్గులులేని వవ్వి నే
ర్పగద! మనుష్యతన్ మనకు, ద్రోహము చేసెను దైవ మీయెడన్.

గీ॥ ధర్మరహాణము వోలె నధర్మసహాన
మును కడున్ దూష్య, మిట్లు వాకొనుచు గురుడు
ముక్తకంఠాన శిక్కుల మొక్కలమ్ము
పెనిచె గోవిందసింహాకోవిదుడు తొల్లి. 80

క॥ గోవిందసింహు తదుపరి
జీవించె నటులనె రామసింహుండు స్వాతం
త్ర్యావేశము రూపుగొనిన
శేవన్, వాని విని పికిలి డేగన్ దరిమెన్. 81

మ॥ గురుగోవిందుని రామసింహు డెదలోఁగూర్చున్న యశ్లించుచున్
శిరముల్ వాల్పక వాని యుద్యమము సజ్జీభూతమున్ జేయుటల్
నరమర్యాదను నిల్పి నాయుధముతోడన్ మైత్రి గావించుటల్
శరణీయమ్ములుగా కథించె మెయి పెంచన్ సర్వపాంచాలమున్.

మ॥ ధనధాన్యమ్ములు బీఱువోనటులఁ దత్తత్ప్రాంతసంక్షేమస
ద్వినియోగమ్మున కొటకై, మతముఁబొందిన్నిల్వన్నద్దమ్ము కో
త నివారించుటకై స్వదేశ్యఘనతాధానమ్ముకై, యన్యదే
శ్యనియంతృత్వ మదృశ్య మౌటయె యవశ్యంభావి తద్భావలన్.

క॥ ధర్మార్థ కామ మోక్షము
లర్మంబడక విలసిల్లు నక్కఅక్కొఅకై
నిర్మించికొనవలయు మన
నిర్మద మగు ప్రభుత మనము నే డత డనియెన్. 84

గీ॥ మొలచి యెదిగి తీవియసాగి తలిరుతొడిగి
యెల్ల పాంచాల మొక పొదరిల్లు గాగ
నల్లుకొని పూచి క్రొత్తావిజల్లు గురిసె
రామసింహు జతన ప్రజాశ్రమము కతన. 85

సీ॥ గ్రామీణభూమీకరం బుపమండల
కార్యాలయమునకుఁ గదల కుండె
బల్లెలఁ గతులు పరిసిపో నభియోగ
ములును న్యాయస్థానముఖము గనవు
పాశ్చాత్యవేషమ్ము భాష బహిష్కృత
మ్ములు, కొలువుల నేత మూలబడియె
భారతమతనిరాసారంభివాఙ్ముఖ
స్థలి నిర్వు రుండిరి తద్వ్రతముగ

గీ॥ రామసింహామహాభాగరచిత మైన
స్వీయపరిపాలనమ్ము నిస్సీమనీతి
పంచనదరత్నగర్భపైఁ బాదుకొనగ
పరవిభుతలక్ష్మి గుండెలు బాదుకొనగ. 86

ఉ॥ పట్టణపట్టణమ్మునను బల్లియబల్లియఁ దెల్లపౌజు రా
కొట్టుచుఁ దిట్టుచున్ బ్రజను గొట్టుచు నెవ్వఁడు రామసింగు? వా
డెట్టుల నుండుః నెందు గలః డింత వచింపుడు చాలు నం చొకే
పట్టును పట్టియున్ విసిగి వ్యర్థకృతశ్రమ మయ్యె నంతటన్. 87

శా॥ నేనేరా! యల రామసింహుడను నేనే నేనె యీ దేహ మె
ట్లైనం బోవును, శత్రుభీరువును గా నంచున్ జనం బెల్ల ఘం
టానాదోపమకంఠనాదమున నొడ్డారింప ఝుంఝూనిలాం
భోనిధ్యాస్థను గుర్తు తెచ్చినది తద్భూర్యుద్యమం బయ్యెడన్. 88

చ॥ విఱుగని యెమ్మె లేదు తన వెన్నున, బందిగముల్ దురంతదు
ర్భరతరఘోరముల్ తన నివాసము సేతకుఁ జాలలేదు, నే
త్రరుచిరకాంతి సుంతయుఁ దొఱంగదు, తజ్జనతాస్వతంత్రతా
స్ఫురదసమానమానధనశోభకు మిర్మిటు లెత్తె నేల్బడిన్. 89

ఉ॥ ఎత్తిన కత్తికిం బదుగురేనియు కృత్తులు గా కొకండునున్
రిత్తబుజమ్ము దింపడు, శరీరులు మిత్తులు రామసింహు రా
హుత్తులు కాల్బలమ్ములు నహా! తొలిపోరి కుమారసింహు ను
న్మత్తరణోద్ధతుల్ స్థలము మార్చినవో! యనిపించె వారిచే. 90

చ॥ వరబల మెక్కుడౌ నసురవర్గముతో సురలుం బలెం బ్రజల్
భరితమహాగ్నిశస్త్రి లగు పాలకవర్గము నడ్డి పోరి యెం
దఱో యురిత్రాటి కందిరి, శతఘ్నుల నోటికి మే నొసంగి రీ
తరమున వారికిన్ దెగువదారితనమ్మునఁ ద్రోవ జూపుచున్. 91

క॥ కల డట్టివారిలో నొక
కలకలలాడు వదనమ్ము కల బాలుడు, హూ
ణుల దణి యే మతి నుండెనో
మెలగెద రాడ్భక్తి నను క్షమించెదర యనెన్. 92

ఉ॥ బాలుడు పల్కె ని ట్లపుడు ప్రాతరభీద్యులఁ గాల్చినట్టి నీ
కే లది ప్రీలదేమి? యొక కేవల మల్పుని సంహరింపగా
మాలుగు చేమిః నన్ను మని మంగళగీతిక పాడ మందువో
లాలనఁజేసి మమ్ముల గులాగములుగాఁ బనిగొన్న జాతికిన్. 93

చ॥ చదురులలోన మీ రెటుల శాసనకర్తలొ మాకు వింటి, మి
మ్మెదిరి స్వతంత్రతం బడయ నేర్తెఱ చాలనినాడు చచ్చు టొ
ప్పిద మనుకొంటి, మాది తగవేకదరా! పరపాలనాటవీ
చ్ఛిదురము నౌ తలంపు,మిముఁ జేరిన మా తలవంపు దీఱునేః 94

క॥ నరజాతి పరాధీన
త్వరహితవృత్తిఁ మెలంగఁ దగు నని లండన్
పురపాఠశాలబాలుర
కెఱిగింతురు మీరు నరుల మేమును గామో! 95

శా॥ మిమ్మున్ రోమను లేలినప్పుడు మమున్ మీరెట్లో వారల్లె ఖూ
లమ్ముల్ మీ మెయిఁ గ్రుమ్మి ధారలుగఁ గీలాలమ్ము పాఱింపరే!
సమ్మానించిరె? మీరు వారలను, స్వేచ్ఛాయత్నముల్ మానిరే ?
మమ్మున్ మీ రలనాటి మిమ్ములనుగా మన్నింపరేలో? జడుల్ !96

ఉ॥ ఏలఁ నెపోలియన్ మిము జయింపగ వచ్చిన నాడు లోఁగి త
త్పాలన మొప్పి? కీ రతని వంచుటకై జగ మెల్ల నేలకున్
గోలకుఁ దెచ్చినారుః మిము నూల్కొన కేమునుఁ బోటుబంట్ల మై
యా లలిఁ జాఱద్రోలి వెలయన్ వచియింపుర! దోస మెట్టిదో! 97

ఆ॥వె॥ మన్ను దిన్న పాము మాడ్కి మిన్నక యుంటి
వేర? యర్భకునిగ నెంచి నన్ను
ఖడ్గ మిమ్ము ద్వంద్వకదనమ్మున నెత్రు
చిమ్మి చావనిమ్ము, చివరి మాట. 98

క॥ అను వాని కోర్కి నొప్పక
వినతి వినా విడ మొనయక విభుత ఫిరంగీ
కనరునకు జాలు గుఱిజే
సెను సుతిమెత్త నగు నొడలు చిద్రుపలు కాగన్. 99

ఆ॥ వె॥ ఎవ్వరో యదృశ్య యింతి యొకత వ్రాలి
వాని నెల్ల నదికి ప్రాణిఁ జేసి
బంతి వంటి యొకటి వింతవస్తువును పి
స్తోలు నిచ్చినట్లు శ్రుతము నాకు. 100

చ॥ అనుటయుఁ గన్ను లొత్తుకొని యా సతి స్వామి!స్వదేశభక్తి యా
యనువున నొప్పునే!శిశువులందున విజ్ఞత యింత యొప్పునే!
యనితరలభ్యశౌర్యసముదంచితతాదృశపుత్రరత్నముఁ
గనుటకు నోచు నో మెదియొ నాథ!వచింపువె నేను నోచెదన్.101

క॥ నా వాసుదేవు డిట్లనె
నీ వొక తెవు నోచ నొక్కడే పుట్టును, భూ
దేవి యిది నోచగావలెఁ
గావలె నట్టి ప్రజ వేలుగా సంభూతుల్. 102

ఉ॥ ఆయుధశిక్షనమ్మ్రకొఱ కంతయు సిద్ధము సేసినాను రే
పే యుదయమ్మునుండి మొద లెందఱొ వత్తురు కండకండ దే
శాయపుటండ సేయు తరుణాగ్రసరుల్ జనజాగ్రియార్థిపుం
సీ!యసమానబోధముఁబ్రుసీ!హాయచారణచారువై దుమీ! 103

ఆ॥ వె॥ చెప్పిచెప్పి యిట్లు చెక్కిలి ముద్దాడె
వాసుదేవు డతివ వరుసకలిపె
నొకరివలన నొకరము కృతార్థుల మటంచు
తనువు లేకమగుచుఁ దనిసె జంట. 104

---

# రానడే ఖండము

ఆ॥ వె॥ జరుగుచుండె సాము, చనుదెంచె దౌలత
రావునాము డంతరంగు డొకడు
అన్న!వింటి నిన్న నద్భుతోపన్యాస
మేమిచెప్ప!ననుచు నిట్లు చెప్పె. 1

చ॥ అవిరళపూర్ణసార్వజనికాఖ్యసభాభవనాంతరమ్మునన్
జెవియొ శరీర మౌ ప్రజకుఁ జెప్పె నిటుల్ మహితుండు'రానడే'
వివిధము లైన లోపము ల వెప్పుడు తప్పవు నెట్టి యేల్బడిన్
సవు రగు పద్ధతిన్ దెలిపి సర్దఁగఁ జేయవలెన్ మహాజనుల్! 2

ఉ॥ చక్కని సాంఘికస్థితికి సాయము సేయును రాజకీయపున్
హక్కులు, వీని వాడుకొను నర్హత కల్గదు హేతుబద్ధ మై
చక్కటిమై ప్రసంగకయ, సంఘవికాసము దీని పాదు, స
మ్యక్కృతబుద్ధి యీ కలిమికై ప్రజ కావలె సజ్జనుల్ సుమా!3

సీ॥ పూనంగవచ్చు మహానేతృబిరుదమ్ము
కొందఱో యందఱో కొలిచి నడువ
పడయవచ్చును మహోపాధ్యాయబిరుదమ్ము
శకలమో సకలమో చదువు చదువ
బెరయవచ్చును మహావేదాంతిబిరుద మ
ద్వైతమో ద్వైతమో బహు కథింప
నందుకోవచ్చు మహాకవిబిరుదమ్ము
నజ్ఞులో విజ్ఞులో యాదరింప

గీ॥ సజ్జనుం డను బిరుదమ్ము సంతరించు
కొనుట దుర్ఘట, మిద్దాని కొలిచి యొసగు
విద్య లేదు క్రమశిక్షణవృత్తి దక్క
చంద్రబింబ మీ బిరుదమ్ము శాంతి రేయి. 4

ఆ॥ వె॥ సవతితల్లి నెనరు చాటుచున్నది మన
పైఁ బ్రభుత్వ మంచుఁ బలుకు వారు
తోడివారి నంట నోడి పంచము లంచు
పలుకు తమరి నెనరు తెలుపవలయు. 5

గీ॥ కూటికిం బేద యయినను కులమునకును
బేద యౌనే? మతమ్మున భేద మైన
మానవత్వమ్మునం భేద మౌనె? నరుడు
గుర్తెఱిగి సర్వసమబుద్ధి వర్తిలవలె. 6

గీ॥ సార్వజనికసమాజపక్షమున మూడు
నెలల కొకసారి పత్రిక వెలువడుఁ, బ్రజ
లార! పంపుడు వ్యాసములను ప్రభుత్వ
శాసనగ్రస్తదోషనిరాసములను. 7

గీ॥ పన్ను చెల్లించు నెవ డైదుపదులు రూక
లట్టి వాడు శాసనసభాభ్యర్థి నెన్ను
కొనగ నర్హుం, డీ రీతి వాకొంటి నేను
దొరతనమునిర్ణయ మ్మెమొ యరయవలయు. 8

చ॥ చదువు కుటీపరిశ్రమము జానపదాళికి నేర్పితత్ ఋణ
ప్రదధనశాలల న్నిలిపి పన్నులు తక్కువ సేసి భూమిపై
బదవి యొలర్ప మండలసభాపురసంఘములం స్వపాలనా
స్పదములుగాఁ బ్రజన్ దెలిపి సౌఖ్యమిడం బ్రభుతన్ గథించితిన్. 9

క॥ 'లండను'లో 'లిబరులు'ప
ఖాండజరాజ మ్మొకండు కల, దయ్యదె రా
ల్రెండునకు నెపుడొ భారత
ఖండమునకు నపుడె పెట్టు గనకపు గ్రుడ్లం. 10

చ॥ అమరుచుకొన్నవీలుబడిఁ బ్రాప్తికొలంది సగస్వతీకటా
క్షమునకుఁ బాత్ర మై సకలసంతతి ధైర్యగుణమ్ము చత్ర మై
శమితపురోభివృద్ధి యగు శాసనమున్ సవరింప జేసికొం
చు మనుతః రాణిపెత్తనమునొంపున వాక్కులుపొందుపెంపునన్. 11

ఉ॥ ఈ యధికార మందుటకు నెవ్వరు నై రొకో తెల్లవారికిన్
సాయము? రాజకీయమతసాంఘికపద్ధతు లెన్నొ యెన్నొ జా
తీయసమైక్యభూషణమతిన్ గని మార్చుకొనన్ దమంతతా
మే యయి రింతవార, లెవరే నటు లౌదురు సంఘసంస్కృతిన్. 12

ఉ॥ భౌతిక మెల్ల కల్ల కలవంటి ద టంచు వచించువారలన్
ఖాతరు సేయ కన్నిటను గండరగండడు హూణు డయ్యె, మా
యాతిమిరమ్ము క్రమ్మి మన యతులు రెండు కబోదిపతు లై
చేతులు వ్రేలవేసితి మిసీ! ఘనసంపద యెంత యున్ననున్. 13

గీ॥ గుబురుమీసము గాంభీర్యగుణమువనులు
కనులు శాంతిమాననవదాననము తనర
క్రౌర్య మెఱుగని పులి యనఁ గానుపించు
"రానడే" పల్కె చప్పట్లలోన నిట్లు. 14

ఆ॥వె॥ విద్య రాజకీయవిజ్ఞానదాయి కా
వలయు మతముచేతఁ బట్టువడక
యెల్ల పల్లెటూళ్ల నింటింట నిట్టిది
మలయపవనరీతి మలయువలయు. 15

మ॥ మతసంఛన్నము పాలన మ్మగుచున యా మర్నాడెపో! దుర్దిన
స్థితి వర్ధిల్లిన, దంతె కాని రవిరశ్మివ్రాత మంభోదమూ
ర్ఛితమైనప్పటినుండి కాదు, ప్రజలం బ్రేరేచుటల్ కాదు నీ
గతి భావించి నిరీశ్వరత్వమున, సంఘజ్యోత్స్న కాయించుటల్. 16

చ॥ మత మని రాజకీయ మని మానిసిమేలున కైన విద్య రెం
డు తగులరాదు తద్దినమునున్ శుభకార్య మటుల్ పరస్పర
మ్ము, తనువు పోగ జీవునకుఁ బుణ్యముగూర్చున దొండు, స్వేచ్ఛమై
బ్రతుకగఁ జేయు నొండు నిరపాయము మానవధర్మదాయి యై.

ఉ॥ దేవుడు పల్కినట్టిది యిదే మత, మింకొక పెద్ది యేని ని
ర్జీవ మ టంచు భేదములు చెప్పెడి వానిని రెండు జానుగుల్
పీవన ల ట్టు లూపి వెలివేయుడి, యంటగరానివా డొకం
డీ వసుధన్ గలం డనిన నెవ్వనినేని వెలివేయుడీ ప్రజల్! 18

గీ॥ రెండువేలయిర్వది యేండ్లు క్రీస్తుమతము
పుట్టి పదునాల్గునూఱులు పోవ నిరువ
దేండ్లె యిస్లాము, హైందవ మిలయు నొక్క
వయసు వని రొమ్ము విఱుచుకొంట యలుచపని. 19

క॥ మతజాతివర్ణభేద
త్రితయంబె పురత్రయంబు, దీని దహింపం
బ్రతిబోధించెను దేవుం
డు త్రిపురహరుఁ డౌచుఁ దా జనుల్ తెలిసికొనఁగా. 20

గే॥ మతము మదీయము మహమ్మదీయము
స్తవము మదీయము క్రైస్తవము
ఐందవకాంతుల హైందవమును మా
మత మని నొడువర మనుజవరా! 21

పుష్పి॥ సకలమతసముద్రగర్భరత్న
ప్రకటితహారము దాల్చి విశ్వపీఠిన్
వికసిలి మనుజత్వవీణ వాయిం
చు కలికి బ్రాహ్మి సరస్వతీసమాఖ్యన్. 22

ఉ॥ ఈశ్వరభక్తిబోధనసమీహితు లొజ్జలు శాంతిసెజ్జలై
విశ్వమతోక్తసూక్తికృతవీతిక గీతిక మ్రోయు గొంతుగా
శాశ్వతధర్మమున్ జగతి సాకు సమానత కంగు దిద్దు భూ
యశ్శ్వేతదర్పణమ్ముగఁ బ్రజాత్మ నొనర్తురుగాత! మెల్లడన్. 23

గీ॥ వ్రాసి వల్లెవేసితివి సేబాస టంచుఁ
బలుకబడి వెండి యత డనెఁ శాత్రికేయు
డనుగదా! యాంబికేయున కనియె నిట్లు
విదురు డన్నట్లు నీకు నే వినుచుచుంటి. 24

గీ॥ శ్రీమహాదేవగోవిందరేనడే క
థించిన విశేషముల నెల్ల దెలుపువాడ
నతడు గర్జించె పశ్యులారా! వినుండు
మతము రణభేరి జాతికి మరణభేరి. 25

క॥ ఇరుతెగలు గల్గుటను వి
స్మరించి భారతమువెలుగు స్మరియించినచోఁ
బఱతెంచును విధిగా న
గ్వరుకాల మశోకు డేలు కాలము సుజనుల్! 26

క॥ నరుని సహోదరునిగ నీ
శ్వరునిన్ దండ్రిగఁ దలంచు భావము తక్క
న్నరగౌరవహారవర్ణాం
తరవృత్తము వేదమునఁ గనంబడ దెందున్. 27

గీ॥ జరుగరాదు వర్ణాంతరపరిణయ మ్మ
టంచుఁ జెప్పలే దసలు వేద
మన్న మాక్సుముల్లరను జర్మను బుధేశు
వ్యాసమును గంటి నరలోకభాసకమును. 28

గీ॥ ఇండియాశరీరమునకు లండనుతల
వలయుఁ, బాశ్చాత్యఖండదర్పణముఁ జూచి
తూర్పు దిద్దుకొనవలయు తీర్పు లెల్ల
సార్థకము గాదు భారతం బంతదనుక. 29

గీ॥ మన భగవదవతారము మానవత్వ
మంతు ముట్టిన యొక సృష్టి యాంగ్లదృష్టి
నస్మదీయవేదాంతము నవనిని సుఖ
పెట్టు నొక దర్శనముగ భావింత్రు వారు. 30

చ॥ అడిగెను శాస్త్రిగారి నొక యాంగ్లుడు సత్కృతి నైన నేను వ
చ్చెడి జని నేమి యౌదు? నని, చెప్పె జనింతువు నీవు సార్వభౌ
ముడవుగ నంచు శాస్త్రి,కడుపుణ్యము నప్పుడు సేయఁబైన టం
చడుగగ బ్రాహ్మణుం డగుదు వం చనె,నెంతలో వర్ణ
మౌఢ్యముల్! 31

ఉ॥ విద్యల నున్నతమ్ము చదివింపవలెన్ విధవాపునర్వివా
హోద్యమకర్తలై పురుషు లుద్ధతి మాని సతీతతిన్ స్వతు
ల్యద్యుతి కుద్ధరింపవలె, వామనిశోభ లతావితానసం
వేద్యము, సంఘశోభ వినివేద్యము స్త్రీజనశాకశాద్వలిన్. 32

క॥ స్త్రీవిద్యాభ్యుదయప్రద
భావావేశమున దాదభాయ్‌నౌరోజీ
కావించిన సేవాధ్వము
వావిరిగా మెలగ నెల్లవారలకుఁ దగున్. 33

గీ॥ సంఘ మెదిగిన కొలది విజ్ఞాన మెదిగి
వ్యష్టిసుఖగౌరవముల సమష్టి లోగొ
నినది, నిర్జీవపద్ధతుల్ పనికిరా వ
నినది, యవి జీర్ణవస్త్రమ్ము లని యనినది. 34

ఉ॥ పోయినవాడు కన్పడడ పూర్వపుటాకృతితో, సమాజముల్
ధ్యేయము మాఱిపోయి యగుపింపద క్రొత్త తరాన పూర్వధ
ర్మాయతితో, నఖండమనుజాభ్యుదయైకచరిత్రలోని య
ధ్యాయములందు నీ సహజతత్త్వముఁ దెల్పును వత్రపత్రముల్. 35

గీ॥ ఈశభక్తికి మించిన దేశభక్తి
దేశభక్తికిఁ దగిన యాత్మీయశక్తి
యాత్మశక్తికిఁ దోడుగ నాధునికత
రక్తి, యవి యొప్పునాడె భారతముముక్తి. 36

క॥ ఇతిహాసపురాణములన్
గతవైభవ మెఱుగవచ్చుఁ గాని తదీయ
స్థితి నెమరువేసికొని మది
చతికిలపడరాదు మింట సాగఁగరాదున్. 37

సీ॥ కలము బ్రహ్మాస్త్రాదిగణనీయశస్త్రముల్
సృష్టికిఁ బ్రతిసృష్టి చేసినాము
అఖిలభౌతికరసాయనికశాస్త్రరహస్య
నిష్యంది మాచతుర్నిగమవిద్య
యీ జనాభా యెల్ల యెక్కి హాయిగఁ బ్రయా
ణము సేయఁ దగు విమానమ్ము మాది
యేకత్ర నిలచి యనేకత్ర యేకకా
లమునఁ గన్పడు యోగులమును మేము

ఆ॥వె॥ అన్యదేశజనము వన్యజీవన మైన
నాడె సికత మాకు నాగరకత
యనుచు గతము నెంచికొనుచు కర్తవ్యము
మఱచువాడు ప్రగతిఁ జెఱచువాఁడు. 38

ఉ॥ గ్రామకుటీపరిశ్రమను కై నగరీబహుయంత్రకర్మకై
సోమరి గాక సిద్ధపడి జబ్బనజూఱ ధనార్జనమ్మునన్
లేమిని భూమినుండి తరలింపవలెన్ భరతాంబసంతతి
స్తోమము సీమనుండి యది దోచిన పైడి మరల్చు నేర్పునన్. 39

క॥ శవములపై నీజప్తు మ
న వలపెములఁ గప్పుచుండె నాలుగువేలేం
డ్లవెనుకనుండియె యిపు డ
ట్టివి బ్రిటనుప్రేషితములవే!యీ మనకున్. 40

గీ॥ ప్రత్తి మననుండి యెగుమతి, వలువ పరుల
నుండి దిగుమతి, పన్ను లేకుండె దిగుమ
తి, నిటు ముడిసర కమ్మి తత్త్రిగుణమూల్య
బ్రిటనువస్తుక్రయిక జాతి పేదవడియె. 41

గీ॥ చిన్నపు డదేమొ యూహ వచ్చినది మొదలు
తాకలే దన్యదేశాగతమ్ము దినుసు
దీక్షతోడ "గోపాలరావ్ దేశముఖుడు"
సరి యతడు లోకహితవాదిబిరుదమునకు. 42

ఉ॥ తా నెటు లట్లు సేయ జనతన్ బురికొల్పిన యాత డన్యమున్
మేన ధరించెనే!వడికినేసినబట్టను దక్క, నేను నా
మానితరీతికిన్ వశుడ,మంజులభాషి "గణేశజోషియున్"
హూణపురాగతాంశుకము నొప్పడు మోసము నట్లుకాంచుచున్.

క॥ ఈ సంయమిసమజోషి
నేసినదుస్తులనె తాల్చి నిరధికవిభవో
ల్లాసం బగు దర్బారున
నాసీనుం డయ్యె లిట్ట నరయగ ఢిల్లీన్. 44

ఉ॥ మూడవరావుసాహెబును బొంబయిరాజ్యసభాంతరమ్మునర్ఘ
పీడక దేశవస్త్రములనే ధరియింప దిగంగనాకచా
పీడసమాఖ్య "మాండలి"కభిఖ్య నెఱుంగుదు రీరు తద్విధిఁ
గూడు ధనమ్ములిందు,నొవగూడు శుభమ్ములు,మూడునొల్లకున్.45

ఆ॥వె॥ వస్తులుండవలసెఁ బరదేశవస్త్రముల్
మనము కొనగ నేతపనులవారు
భారతమున,లాంకుషైరుగ్లాస్గోపటాల్
ముట్టుకొనమె తిండిపెట్టగలము, 46

గీ॥ మనదె దూది,మనదె నూలు, మనదె మిల్లు
మనదె వస్త్రము దుర్గతిహననశస్త్ర
ము,మనదె కదురు, మనదె యేకు, మనదె నిన
దించురాట, మారాటము దించుకొఱకు. 47

వియో॥ ఎటు చూచిన నెన్నొవేల మైళ్లై
ఘటితోద్దండమణీఖనీధనం బై
యిటు నిష్ఫల మౌనె!భారత మ్మ
క్కట!స్థాపింపు డసంఖ్యయంత్రశాలల్. 48

ఇం॥వ॥ రష్యా వినా యూరపుఖండ మంతై
చోద్యమ్ము దక్కేమియు లేనిదా! శ్రీ
శిష్యజ్జపాన్ జర్మనుఫ్రాంసుగా నా
ముష్యాయణుల్ సల్పరె! భారతమ్మున్. 49

క॥ భారత మున్న తసత్వో
దారమనఃకృతుల జనిక, తావిని పూవుల్
తీరున తద్గౌరవముఁ
బారంపర్యముగ నిలుపవలెఁ బ్రజ లెల్లన్. 50

ఉ॥ చల్లనివేళ నా మనసుచాయల మల్లెలు రాల్చె ఝష్మిరా
గిల్లిన "రామమోహనుడు" కేవలభారతసంఘసంస్కృతి
ప్రోల్లసనమ్మెకా దొదిగిపోయిన జాతికి గౌరవమ్ము శో
భిల్లు నుపాయమున్ దనదె భితము పోరులులేనితీరులన్. 51

గీ॥ ఐకమత్యము జాతికిఁ బ్రాణ, మయ్యె
దెట్లు పోయె ? మనము జుట్లుజుట్లు పట్టు
కొనగఁ బోయె, నవనాగరధనము విద్య
లేకపోయె, నీ చెడుగు దూలించె నతడు. 52

గీ॥ వేదము 'భుజయు' ముఖ్య భూమీధవుల స
ముద్రయాత్ర దెల్ప మనకు నిద్రవచ్చె
'రామమోహానరాయలు' ప్రథము డాధు
నికసముద్రయాత్రికనికరమందు. 53

ఉ॥ ఆతడు లండ నేగగఁ బ్రయాణము కట్టెనుఫ్రాంసుమీదుగా
నాతని గుండె దూకినపు డాతడు దూకె సమానతాస్వతం
త్రాతిశయత్వసోదరత లందిన చిహ్నము ఫ్రెంచిజావుటాన్
జోతల సన్నుతించుటకు, నొవ్వడ కాలికి దెబ్బ తాకినన్. 54

మ॥ తి॥ ఆ రామమోహానమహాశయు డట్టి ధర్మ
శ్రీరాజ్యముం భరతసీమ సవర్చుకోగా
దారిన్ గనంబఱుపఁ దద్దయు వేడె లండన్
లో రాజ్యకూటమును, నొచ్చెను దాని చేష్టన్. 55

క॥ ఆ మానవసింహాము తన
కామితఫలదానమునకుఁ గడగని ప్రభుతా
సీమకు వెలిగ నమెరికా
లో మనుటకు నిశ్చయించి లోతులు వెదకెన్. 56

క॥ జతనమ్ము విడక బ్రిటనున
కుతుకమ్మును కుతిలపాటు గొనుచుండి యతం
డు తరలె స్వర్గమునకు భా
రతులను 'బ్రైస్టన్'సమాధి ప్రతిబోధింపన్. 57

క॥ ఆయన చూపిన తమ జా
తీయత యుపనిషదుపాస తీడిన విద్యా
వ్యాయామమ్ము సమాజ
శ్రేయఃకృతి మనకు నిరతసేవ్యములుసుమా ! 58

ఆ॥ వె॥ ఇంత రానడే వచింప చప్పట నిన
దింప విన్న యువకతిలకు డొకడు
పట్టభద్రు డా యుపన్యాససారమ్ము
నెంచి పెదవివిఱిచె నేమిటికినొ ? 59

వియో॥ అని దౌలతరావు మిన్నకుం
డెను, దృష్టిన్ వినువాని మోముసం
దున నిల్పెను, విన్నవాడు చె
ప్పినవానిన్ దనియింప నూల్కొనెన్. 60

ఉ॥ ఏమిటికా ! యటంచు నిగదించె నిటుల్ నిఖిలప్రవేది ఫా
ఢ్కే మథియించి హూణుల కడిందియెడంద సుధావృథాకృతి
న్లేమ ప్రజాప్రభుత్వమును చేకొనఁ జేసెడి మందరోపమం
బౌ మహనీయశక్తి నుడులందున లేమిటి కో ! సుహృన్మణీ! 61

గీ॥ ఏ తెలుంగుదు తిలకులయింటి చిన్న
వాని నొక్కని, వాడు సంపంగిమొగ్గ
వజ్జిరపుతునక, సింహాశాబకము, మాట
లాడితిని వానితో, నీత డతడె యౌనొ ! 62

ఉ॥ ఏకమతిన్ రహించి మన మెల్లర మేకగతిన్ గమించుటల్
ప్రాకటనీతి కా దనము, బండలునే నరుగుం బిపీలికల్
ప్రాకిన నంచుఁ జీమల పరంపరగాఁ దను నెంచికొంచుఁ బ్రా
ణాకరజాతి వింతసమానమ్మున పుక్కిలిగింత లౌనకే ! 63

మాలిని॥ చదువుకొనుచు విద్యాశాల వ్యాసాలపోటిన్
మొదలు కలములాఠీ పూని కొట్టెన్ మరాఠీ
యది తగిలి ప్రభుత్వం మర్ధదానమ్ము నాపెన్
బ్రిదిలె నతడు దానన్, రానడే యంద్రు వానిన్. 64

గీ॥ కలదు విద్యాధికంబు సంఘాల్పకంబు
పెద్ద శ్రీరానడే యందు, హద్దున కది
కడుదిగువ విన్పించు నేల్పడిగుటిచి వి
మర్శనమును పాటను మంద్రమందు నటుల. 65

గీ॥ రావుసాహేబురణడకు భావమందు
జమ్మిలో బలెఁ గల దగ్ని, జంకినాడు
తనదు న్యాయాధికారిత్వమును దలంచి
తన సహాయమన స్తత్వమును దలంచి. 66

చ॥ ఇటు లయి సంఘసంస్కరణమే శరణ మ్మనుచుండు రానడే
నిటలముగుండ్రబొట్టు గమనింతము కన్నుగ, నిద్ది శైవసం
ఘటితము జాతి కెల్ల, నిది గల్గి శివత్వము నందవచ్చునా?
బ్రిటనును భారతం బనుకరించిన వారల స్వేచ్ఛవచ్చునా! 67

మ॥ హిమమున్ రానడెచిత్తమున్ గలవు రెండేరెండు మా కిందు మి
త్రమ ! లోవేడివి పైకిఁ జల్లనివి, యేతచ్చిత్తమం దున్న ల
క్ష్యముచేనైనది సౌఖ్యమొక్కటె, తదాఖ్యన్ సంఘసంస్కారమం
దుము, దీనం జనపారతంత్ర్యమున కౌనో! యగ్నిసంస్కారముల్.

చ॥ పౌరుషులు లేక యెల్ల రొక పోకడ బో దగు నేడు సంఘసం
స్కరణము లెట్టివేనియుఁ బొసంగవు, నందును రాజకీయసం
గరసముదాత్తసంగతుల కందువ వేదికపైని బొత్తుగా
చొరనిడరాదు వాని, నవి చుట్టుకొనన్ మతసంస్థ కావలెన్. 69

ఉ॥ కా దన రామమోహనుని గాని తదీయమతప్రచార మే
లో? దనియింప దందఱను లోగొనెఁ గొందఱ మాత్ర మాంగ్లవి
ద్యాధికు లైన రానడెముఖావళి నీయెడ, గాళిఘట్టమే,
ప్రోది నొసంగె దాని, కట ముఖ్యులు ఠాకురు చంద్రసేనుడున్.

గీ॥ 'ద్వారకానాథఠాకూరు' తండ్రి, కొడుకు
పేరు దేవేంద్రనాథఠాకూరు, తండ్రి
రామమోహను హితుడు, తద్బ్రాహ్మమతము
గొనియె, లండనులో బోయె, కొడుకు గలడు. 71

చ॥ కొడుకును చూడలేద యనుకో వినుచుంటిమి, బ్రాహ్మడయ్యు నా
తడు మన యార్షమార్గమును తప్పడ, కేశవచంద్రసేను డన్
బిడుగు కలం డొకం, డతడు వే అయి క్రైస్తవమార్గగామిగా
నడచెను తన్మతమ్ము, నది నన్నునె! హైందవజాతి కాప్తుడా! 72

ఉ॥ వేదములోని మంత్రములు విచ్చిన పూలుగఁ బంచిపెట్టెడివ్
సాదు సదస్సులం దొకడు సర్వులు నొక్కటె యంచు, స్పర్శకున్
గాదిలి గాని మానవు డొకండును లే డనుచున్, సమానధ
ర్మాదృతి పల్కు నం బలెఁ బ్రియన్ దనరణవలె నంచుఁ దెల్పుచున్.

గీ॥ అతని పేరు దయానందు, డతని మతము
వైదికమ్ము, జాతీయతపాదు, కులవి
భేదకళ్మల దూరము, పోదుచెరిగి
యెందువలన ? నింగ్లీషు లేనందువలన. 74

మ॥ ఒకడే యీశ్వరు డోంసమాఖ్యు, డవతారోపేతు డే నాడు కా
డు, కువాడమ్ము పురాణ, మింద్రుడు యముండున్ మున్నుగాఁ బేర్లు వా
నికె నెల్లున్, తమ కర్మబట్టి జని యున్మీలించుబోః మర్త్యకో
టికి, వర్ణమ్ములు నాల్గు వృత్తులు సుమండీ! యంచుఁ దదోధ్బ
ధములోల్. 75

ఉ॥ హిందుమతమ్ము సంఘమున కిం పగు సంస్కరణమ్ము లేనిచోఁ
జిందరవంద రౌ నని విశిష్టము వేదికపైని శ్రీదయా
నందసరస్వతిప్రథితనామయతీంద్రు డతండు వేదవా
క్కున్ దగ మూదలించుచు నకుంఠితరీతి నుపన్యసించెడిన్. 76

చ॥ మత మెడ మైన వారి నొక మంత్రముచే నతికించి, యంటరా
నితన మచేతనం బనుచు నిర్ణయముం బ్రకటించి, సర్వసం
తతి ద్విజులం బొనర్చి, మృతనాథకు మళ్ళియుఁ బెండ్లి గూర్చి,య
య్యతిమణి కూర్చె సంఘమున, కార్యసమాజము పేర్చె వానిదై.

గీ॥ తదభిమానులు రాజపుత్రస్థలమునఁ
బంచనదమున బొంబాయివరగణా న
సంఖ్యు లున్నారు స్వాతంత్ర్యసాంఖ్యబోధ
మందుచున్నా రయా! స్వధర్మాంతరితము. 78

క॥ వ్రాత్యస్తోమ మధర్వ
శ్రుత్యుక్తమురీతి జరపి శుద్ధులఁ జేసెన్
స్తుత్యుం డత డెందఱనో
ముత్యములై వెలుగ స్వమతమునఁ బూర్వ మటుల్. 79

శా॥ అధ్యక్షించెను రానడే సభ, నుపన్యాసమ్ము గావించెఁ బూ
నాధ్యాత్మాధిక మోహనమ్ముగ దయానందుండు మూడేండ్లనా
డధ్యాత్మమ్ముగ ద్వైత, మభ్యుదయభావారూఢి నద్వైతమా
ర్యధ్యేయమ్ము స్వధర్మపాలన సశక్త్యద్వైతమున్ దెల్పుచున్. 80

గీ॥ వినికి గల దొక పరమహంసను గురించి
యతని యునికి కల్కత్తా య టంచు నతడు
కాళికామాతృభక్తితోఁ గలిపి భరత
మాతృభక్తి బోధించెడి మహితు డనుచు. 81

క॥ పెక్కురు శిష్యులు కలరట
యక్కాళీభక్తుడైన యద్వైతికి, నం
దొక్కఁడు గాకున్న నొకం
డుక్కును సంకువునఁ బోసి యూదడో! ప్రజకై. 82

గీ॥ వారు చెప్పినట్లు వర్తించు వారికిన్
మంచివారు కాని మనుజు లుంద్రు
నట్టి మనుజు లంచు ననిపించుకొనమియే
మంచితనము గాగ నెంచవలెనొ! 83

ఉ॥ ఇంటికి నిప్పువెట్టి, యిట నే నభయమ్మిడి మిమ్ముఁ బ్రోవగా
నుంటి న టంచుఁ బల్కి, యొహొహో! యిటనే యిత
డుండకున్నచో
మంటకు లోని యందఱును మ్రగ్గరొకో! యనిపించి, కీర్తిగై
కొంటయె మంచి హైన హితకోవిద! చెట్టయటంచు నుందునే! 84

శా॥ నౌరోజీరణడే బెనర్జిమెహతానామముల్ ప్రజానాయకుల్
వీరల్ యోగ్యులు శాంతికాముకులు నీ వీ రెవ్వరిన్ వేడుచు
న్నారో యా దొరగుంపుమంచితనమే నా వర్ణితం బైన, దీ
మారామున్ ప్రభుత్వమున్ సయితు రే! మాదృగ్భవాదృగ్జనుల్.

క॥ నౌరోజియడుగుజాడల
మీఱక చరియించువారు 'మెర్వాన్ మెహతా'
శ్రీ రానడేలు, నతనికి
వారే చేతులును చెవులు భారతభూమిన్. 86

క॥ నా యీాడే పార్సీపా
షా, యత డాఖ్యన్ ఫిరోజిషామెహాతా, దే
శీయభటసంఖ్య నెక్కువ
సేయన్వలె సేన నని వచించెఁ బ్రభుతతో. 87

ఉ॥ తద్విధి సైనికవ్యయము తక్కువ కావలె, నట్లె సర్వశా
ఖాద్వ్యయసమ్ము తగ్గవలె ఖర్చులు, సుంకము వార్థినీత మే
తద్వసుధాగతమ్ము నగు ద్రవ్యముపై నధికమ్ము, పౌండ్లగ
ణ్య ద్వివిధప్రకారధనపట్టిక రూప్యగతమ్ము కావలెన్. 88

క॥ అని యితడు తక్క నేతలు
నినదించిన తీరు బధిరనికశేశంఖ
ధ్వని, దర్జీ కోలతలఁ జిం
పిన పీలికతుక్కముక్క పీరల యర్జీ. 89

గీ॥ గాంధ్రుగాం ధ్రని సంఘసంస్కరణకోలకు
మ్యావుమ్యా వని పారతంత్ర్యహాతికోలకు
వ్యవహరించుచుందురు వీరు, వారు, వీరు
కాని వా రెందు దాగిరో కానవలయు. 90

ఆ॥వె॥ పార్లమెంటులోన భారతస్వపరిపా
లనసమస్య నెగడు పొనుగుపడదు
మండదు, చలిగాచుకొండ్రు పెక్కండ్రందు
నొక్క డెవడొ బలిమి నూదినపుడు. 91

సీ॥ మా పల్కులకును వార్తాపత్రికలకు స్వే
చ్ఛను ప్రసాదింపుడీ! చాలుచాలు
మా జనమ్ములతోడ రాజధానీరాష్ట్ర
విభుసభల్ పెంపుడీ! వేడుకోలు
మా వారి మీ వారి మాడ్కి సర్వోద్యోగ
ముల నిల్పుడీ! మాకుఁ దలను పాలు
మా పన్ను తగ్గించి మాకు నీటి వసర్లు
హెచ్చింపుడీ! యదియె పదివేలు

గీ॥ ననుచు విన్నవించిరి వీర లాంగ్లపీఠ
మునకు, వైస్రాయి యన నొక దినుసు రాయి
పార్లమెంటు సిమెంటుకంబమ్ము, వినతి
పత్రములు మిత్రములు సాశ్రునేత్రములకు. 92

మ॥ తనరు న్నేతలలోన పెద్దతల దాదాభాయి నౌరోజి,ప
లుకన నెంతో యెద నంత తీయదన మొల్కున్, మెత్తగాఁ గోయుఁ గా
లనసంస్థన్ హృది యున్నచోట, నదియే లక్ష్యమ్ము కానప్పు డా
యన నేమందకు చేత లేఖినిని ద క్కన్యమ్మునున్ దాల్పడై. 93

గీ॥ పలుకులను ముళ్ళు,కనుకొలకులను సుళ్ళు
క్రియల నీళ్ళు, కాన్పించియు హృదయమందు
హేతువాదభేద్యమ్ము చో చొసగి ప్రభుత
యొప్పు ననుచుండు నౌరోజి, తప్పుతలపు. 94

క॥ ఈస్టిండియా సొసైటీన్
సృష్టించె నతండు లండనిద్దాంగ్లులతో
స్పష్టముగ భారతీయో
ద్దిష్టము తన్నాగరకత తెలిపెడు పూన్కిన్. 95

మ॥ పడుకన్ హాళిగఁ బైకి జాపిన పదద్వంద్వమ్ముతో మంటిపై
బడన ట్లాపితి నేను మింటి నని వాక్ప్రాగల్భ్యమున్ జూపు నె
వ్వడు తత్పద్ధతి కోసివేసికొనె నవ్వా డా సభాద్వారమం
దడుగుం బెట్టుచు, తీసివేసికొనె వేషాద్యావాసితో భేదమున్ 96

సీ॥ అతని యీ సమితికి నఖిలభారతమున
శాఖ లున్నవి కాంతిరేఖ లగుచు
నతని యాశయము భారతజనతాక్రమ
ప్రాప్యస్వపరిపాలనాతిశయము
నతనికిఁ గొంత మహారాజవిత్తము
దత్తము, దేశాభ్యుదయము వ్యయము
నతని యుపన్యాస మాతని ధనకోశ
మేర్పడినది విద్య నేర్పు కోప

సీ॥ మతని పితమనన్యగ, మతడు రాజ
కీయయజ్ఞమ్మునందు సాగ్నిధ్రుఁ, డతడు
పెండ్లి యైన భీష్ముడు శస్త్రవిరహితుండు
వనితగుణరాజి దాదభాయినవురోజి. 97

క॥ ప్రభుత యిడె నినుపదారుల
యభివృద్ధికిఁ బదియు కోట్లు నౌ రూప్యములన్
క్షుభితార్థి కవిద్వాంసుల
రభసన్ మన్నింప, కతని వ్రాత నిచటికై. 98

శా॥ స్వాతంత్ర్య ప్రతిపన్నసర్వజనతాజాతీయభావమ్ము నా
సేతుప్రాంతహిమాచలాంతధరణీ శ్రీతారహారమ్ముగా
నే తాతయ్య వచించె? నెవ్వి చదువుల్ నేర్పించె? నాంగ్లేయుడున్
శ్వేతాస్యోపనిషత్తు వాని చదువున్ జేకోకనేయున్నచో. 99

మ॥ అని వాచింతురు కొందఱందు నొకరుం డా పారసీపెద్ద, వా
ని నిదానమ్మె ప్రధాన మై మనెదఁ రెండేఁ బారసీ లందఱున్
మనతో నేల్బడిఁ గత్తిగట్టి యెదురింపన్ రార, రాకున్న నే
వన రా క్రోవనౌ చేయుచుంద్రు జతనన్ స్వాతంత్ర్య
పర్యంతమున్. 100

ఆ॥వె॥ సిక్కులను గుఱించి చెప్ప నక్కఱ లేద
యెప్పుడెప్పు డనుచు నెదురు చూచె
దరు సునిశితఖడ్గధారాప్రసారణఁ
దెలుపుమీద నెఱుపు నిలుపుకొఱకు. 101

సీ॥ హూణభారతసంతాన మైన వారు
నస్మదనయానఁ గ్రైస్తవు లైనవారు
కలసిరా రయ్యా! మన కార్యఖడ్గములకు
జనచతుర్థాంశ మిందు నిస్తామువారు. 102

క॥ అహమదుషా' 'బహదుర్షా'
మహితులు స్వాతంత్ర్యసమితి మడియగనే! స
న్నిహితులు వీ రై రాంగ్లుల
కి హి హీ! యనుచుంద్రు! ప్రభుతనెదిరినవారిన్. 103

మా॥ తొలి వినిచితి వస్మదూఖ్యస్వతంత్రతత్వమం దొ
కలహాకథ, మరేదో గాథ వాచింతు నంచుం
బలికియుఁ జనినా వా నా డనన్ మిత్రు,డోహో!
తెలిసితి నని ఫాడ్కే తెల్పె నీరీతి దానిన్. 104

శా॥తత్సంగ్రామమహాతావశేషులు ప్రభుత్వప్రోక్తవాగ్దాసులై
యుత్సృష్టం బొనరించినారు మనతో యోజించుటఁ,స్వీయసం
యత్నన్నాహము వేఱ చేసికొనినా ర య్యాజికిఁముస్నెసం
విత్సా రాకృతులైన వారిగురువుల్ ప్రేరేపగా ముస్లిముల్.

గీ॥ పేరు సయ్యదహమ్మదు,బెల్వి యా నొ
కండు కలడు,స్వీయులకు నాతండు చెప్పె
భారతమ్మున మన పరిపాలనమ్ము
నేను సాగింతు నెల్లరు నిలబడు డని. 106

మ॥ పనిచెఁ వానికి వాని సంఘ మది తా బస్తాలుబస్తాలుగాఁ
గనకంపుఁమొహిరీలు సొమ్ము లిటుకల్ కస్తిఁ జిగు ళ్లంటికు
ట్టిన కుట్టొప్పగ,వాని యాజ్ఞ యవలోడించెఁ మదిఁ గూరుచుం
డిన నిల్చుండిన గూర్కచుండినను, తో దేతెంచెబో!నీడ యై.

మ॥ రణజిత్సింహునిపైని దాడి యది,యిర్వంకన్ సమానంబె యాం
గ్లుని క్రేగంటి ప్రసార, మైనను మొదల్ కోయఁవలెఁ సిక్కపె
త్తనముఁ సయ్యదుగొయ్యి త్రవ్వవలె నా తర్వాత, ని ట్లై శత
ఘ్నివిశాయమ్మును బ్రెల్వి కాంగ్లతతి యందించె న్నిశీథమ్మునన్.

ఉ॥ సిక్కులఁ దొల్త గెల్చి క్రమసిద్ధి నవేందుపతాక మంతటఁ
రెక్కొన జేయు తెల్విగల బ్రెల్వి పడెఁ రణజిన్మహేంద్రుపై
నుక్కను కొక్కరించు వపు వూగు పదాతులు,రౌతు లేనుగుల్
మిక్కిలిసంఖ్యఁ దోడెనయ మృత్యుకరాంగుళితుల్యశస్త్రులై.

సీ॥ గుఱ్ఱమెక్కినవాడు సఱ్ఱున దిగజాఱె
నేనుగెక్కినవాడు పీను గయ్యె
బీర మాడిన నోటఁ బెన్నెత్రువ ట్రోడ
కత్తి నెత్తినచేతి కండలూడె

ముందుసాగినవాని మోకాలు విఱిగెను
వెన్కకేగెడువాని వీపు ప్రీలె
క్రోవికాల్చినవాని గుండె రెం డయ్యెఁ, బి
రంగిప్రేల్చినవాని రంగు మాఱె

గీ॥ సయ్యదహమదుబ్రెల్వివిశాలసైన్య
దైన్యమును బల్క వాగ్దరిద్రంబు నాల్క
యేబదేడులనాటి దీ వృత్తము, పదు
నాలుగేండ్లు నీ యుద్యమ మణగిపోయి. 110

క॥ అహమదనంతరమును ని
స్పృహ నొందక యుద్ధ మాడె బ్రిటిషుబలముపై
నహమహమికతోఁ గూడిన
'వహాబి' నామకతదీయభటవర్గంబుల్. 111

ఉ॥ వార మహమ్మదీయపరిపాలన మొల్లక యట్లు సేయుచున్
భారతకోణభూమి నొక భాగమున న్నివసించి యచ్చటన్
జేరి వసింప రం డనుచుఁ జీరి రయా! తమవారి నెల్లరన్
బోరి రయా! 'జిహాదు'నకుఁ బూనని ప్రాంతపఠానుజాతితో 112

మ॥ రణజిత్సింహుడు పోవ రాజ్యమునకున్ రాజైన హూణుండు పీ
రిని రేకట్టగనీక యెన్నొతడవల్ ప్రేంఖన్మహోబాహువా
హినిమొత్తమ్ములఁ బంచిపంచి తుదిగా నెన్నాళ్ళకో శీర్ష మె
త్తనిరీతిం బడగొట్టి కొందఱను బంచాల్ జేసె నాజన్మమున్.

గీ॥ ఈ మహమ్మదీయులు మన నెపుడు మెచ్చి
బుజము లొరయుచు దొరతనమ్ము నెదిరింత్రొ
కూయకుండునె! గుండెలో గ్రుడ్లగూబ
దాని కానాడు నిటనుండి తరలునాడు. 114

క॥ ఇయ్యెడ వీరలు పెక్కురు
తయ్యపు బోకడల మఱచి కైకొందురు సర్
సయ్యదహమ్మదుబహదూర్
తియ్యనిసలహాను బ్రతుకు తీగలు సాగన్. 115

చ॥ మతమును గూర్చి యీ మనిసిమాటలు మాటిచి కట్టు కోటలై
యతివల సొంపు లర్యమని యంశువుచేఁ జెరిగించు చేట లై
ప్రతిమతి నాంగ్లనాగరకవై భవమందున ముంచు నూట లై
కొతికిరి, వెక్కసంపడిరి, కోపముఁ జూపిరి ప్రాతముస్లిముల్.116

క॥ మేరియో యను చక్కటి వై
ప్రాయిన్ మాయించె నేలరా! "షేరాలీ"
డాయదొ స్వర్గము తా నై
యీ'యహమదు' నేయ ననిరి యీాడ్యులు"మక్కా"న్.117

ఉ॥ వారల మాట కేమి గుణవంతు డహమ్మదుఖాను, హిందువుల్
తారును బాయిభాయిగ మెలంగుట కొప్పినవాడు, హూణభా
షారమణీయపాఠము వసంతముగా మొగలాయి ప్రోడు నూ
త్నారుణపల్లవస్థగిత మౌటకు నువ్విళులూరువాడునున్. 118

గీ॥ సయ్యదహమదు కేశవచంద్ర సేను
లును దయానందుడును ఢిల్లిలోనఁ గలసి
రేగుదెంచి దర్బారున, కెంత చర్చ
ముదుర నేమి ! భావైక్యము కుదురలేదు. 119

చ॥ కలిగెను హూణసంస్కృతి కగర్భజపుత్రుడు దైవదత్తు డై
సలలితబుద్ధి సయ్య దని చయ్యనఁ ద న్నెగనెత్తు నేల్బడిన్
గొలిచి,ఖుదా సదా మన కగోచరు డయ్యు ముదావహుండుగా
మెలగెడి నాంగ్లపాలనము మేకొని యం చు కథించెనాతడున్ 120

గీ॥ దాన మెచ్చి ప్రభుత్వము దాన మిచ్చె
హాసదుబిరుదు "స్టారాఫిండియా"! యటంచు
సయ్యదహమదునకు, వాని సంతతి కిడె
నద్రిశిఖరకల్పంబుల నధికృతులను. 121

గీ॥ "అలిఘడున" నెలకొల్పె విద్యాలయమ్ము
నహమ దాంగ్లమహమ్మదీయాఖ్య మొకటి
అన్నమిడు హూణులకు వీరు సున్న మిడి ర
టంచు నతడు వహాబీల నాడిపోసె. 122

సీ॥ సమర మాడి వహాబీలు స్వర్గ మేగ
గేటు మూసె రజుకు, డిటు లేటి కనగ
మీగు నచ్చు టాంగ్లులతోడఁ బోరికాదె!
యనియెనట, బొచ్చుకుక్కయు నఱచెనంట. 123

క॥ అని స్వర్గమ్మునగద! యీ
పని జరుగుట భూమి కెట్లు వచ్చినదో! వే
గను దౌలతుఁకు ఫాడ్కె
వినిచె నహమ్మదునె పోయి పృచ్ఛింపవలెన్. 124

శా॥ ఈ చారిత్రపుటాంత్యఘట్ట మిది మిత్రేశాన! "అబూహానీ
ఫా"చే నిర్మిత మౌ నిబంధనము తప్పన్ జూచు నా భ్రష్టునిన్
రాచున్ గాత! మరేబియాబ్దిసికతా పాజ్యమ్ము లౌ నష్టికా
ణాచున్ తిట్లు ప్రవక్తతిట్టినవి యన్నారా! వహాబీలునున్. 125

క॥ ఆ సయ్యదహమ్మదు మన
బాసల్ వినఁ బట్టియిచ్చుఁ బగఱకు మనలన్
బాసటగా డయ్యా! మన
మే సొరిదిన్ వేడ నొక్క మియ్యాయేనిన్. 126

చ॥ అది గనిపెట్టి రెండుహృదయమ్ముల నొక్కటె మోతయుంచు,వా
రిఁదనరఁ జేయుచుం బోరిబోరిం బిశునమ్ముల నూఱిపోయుచున్
హాదను లభించినంతనె మతాంబుధిపోటున రెచ్చగొట్టుచున్
గదుముచునున్న దేల్బడి సఖా! మనపైకి మహమ్మదీయులన్. 127

శా॥ ఐనన్ గొందఱు రోహిలాలు కల రయ్యా! మేటి యుద్ధమ్మునన్
నానాసాహెబుసఖ్య ఘోరపురభూనాథుం బెడన్ బాయ రై
యీనాడున్ భృతిమై సహాయకులుగా నేశెంత్రు మూసీనదీ
స్థానీయుల్ ఝుషసంచరన్మకరదంతచ్ఛేదవాచుంచువుల్. 128

ఉ॥ అన్నిటిలోనఁ బెద్దయు ధనాఢ్యము హైదరబాద, స్వల్పసం
పన్నముగాఁ దగున్ కథియవా, రివి చిన్నవి పెద్ద వైదునూ
ఱన్నర రాజ్యముల్ భరతరాష్ట్రిపు మూడవవంతు నేల వి
ష్పన్నము,లిందు రాజులును బానిస లాంగ్లున కల్పులున్ ఘనుల్.

సీ॥ నర్మదా ప్రాంతమ్ము శర్మద మెల్లౌను?
సడి లేదు వింజ మాకిడిన కరణి
లా వేరికిన్ లేదు కావేరితీరాన
టిప్పుసుల్తానుతోఁ జప్పబడియె
తృష్ణ లే దనిపించెఁ గృష్ణ, యాంధ్రమున బొ
బ్బిలి నుండి బెబ్బులి వెడలిపోయె
ఆవరించినది గోదావరితటమహా
రాష్ట్రిన దారి దూర మగు నడవి
గీ॥ బ్రహ్మపుత్రఘనరసంబు స్వార్థ మయ్యె
పంచబంగాళ మైనదోః పంచనదము
గంగ యొకటే శరణ్యము క్రాంతికి, సహి
యింపలేదు త్వాదృశశూరు డిట్టి సడిని. 130

ఉ॥ ఏది యిరమ్మదమ్మును సృజించినదో పిడుగుల్ పడంగ న
య్యాదిమశక్తికిన్ దనయు డైన యొకం డిపు డిందుఁగావలెన్.
సోదె యెఱుంగుబో! జయము,సుప్తజనమ్ముల మేలుకొల్పి యు
న్మాదుడుగా మొగ న్నిలచి తాకవలెన్ బెఱవారిమూకలన్.131

క॥ కృత నిశ్చయుడ నయా! దా
ంతరాయా! తత్కృతికి వెలలవోః నాతో
జతగా ననె ఫాడ్కే, యన
నతడున్ దాల్చెను రివాల్వ రసి గుండ్ల గుదిన్. 132

# ఫాడ్కే ఖండము

ఉ॥ ఏ వడిఁ గత్తిఁబట్టి ఝుళిపించి పరాసిని డాసి నొక్క యా
పోవడి నడ్డి పోటునకుఁ బో చెదురొడ్డి ఝురిలునట్లు మెడన్
వైవగ నౌనొ, వైరినయనమ్ములు దిగ్భ్రమ మొందఁ ద్రిప్పనౌ
నో వివరించి నేరిపె నహో!ఫడకే తన భృత్యపంక్తికిన్. 1

క॥ కదలని కదలిన లక్ష్యము
చిద్రుపలు కొట్టించె నతడు శిష్యవితతిచే
తఁ దుపాకిన్ శిక్షణమి
చ్చి,దౌలతాదికులు నందుఁ జేయొడుపుమగల్. 2

క॥ కులకాంతనెమ్మొగమ్మున
తిలకము దీప మయి యారతి నొసంగగఁ ద
ద్వలయితభుజబంధము నె
ట్టులో సడలించికొని యాతడు ప్రయాణించెన్. 3

గీ॥ తోడువచ్చెద నని యెంత వేడుకొనిన
బవర మిది కాదు నీ బాహుపటిమఁ జూప
దుర్గమారణ్యవాసమ్ము దొంగపోరు
సతులకు నిషిద్ధ మని తన జాయ నాపె. 4

శా॥ రామోసీల్ మరికొందఱున్ దన బడిన్ రా శస్త్రపాణుల్ తమ
స్తోమంబుల్ విరబోసికొన్న నడురేచుట్టాలు స్వాతంత్ర్యదీ
క్షాముగ్ధాత్ముడుధైర్యమున్ గవచమున్గా దాల్చుకొన్నాడు ఫా
డ్కే మిట్టాడెను దవ్వుపల్లియల కెగే త్రోవ ఖర్వమ్ముగా. 5

సీ॥ రాత్రినిం బవలుగా రచియించు పూనాపు
రీరాజవీథి దూరీకరించి
యందందు నెవరేని యడిగినఁ బ్రభుతసై
న్యము కొంత పోవుచున్న దని చెప్పి

నగరికావలివాండ్రు మొగిసి ప్రశ్నింప లం
కపోగాకుచుట్టల కట్ట లిచ్చి
యటనటఁ జెలరేగి యఱచు శ్వానములకు
పొట్లముల్ విప్పి బిస్కట్లు వేసి

గీ॥ మేడలను బెంకుటిండ్లను మిద్దియలను
గుడిసెలను దాటి పొలిమేర గడచి దారి
దీయు నా వాసుదేవుతోఁ బోయిపోయి
బలగ మొకచోట రేకలువాఱఁ జేరె. 6

క॥ పలికి రనుచరులు నేతను
బలవన్మహానీయ! యెటులు స్వాతంత్ర్యరణ
మ్ములు సాగు ధనము లేకయ
జ్వలనము లే కెటులు నన్నఖాండము లుడుకున్. 7

క॥ మా కిడు జీతమ్ములకై
రూకలు నీవద్ద లేవు, రోజును వేలన్
జేకొందము ధనిగృహములఁ
బైకొని దోచుకొని యిచటి పల్లెలయందున్. 8

ఉ॥ వల్లె! య టంచు బల్కు మని, పల్కె నిటుల్ ఫడకేబుధుండు శౌ
ర్యోల్లసితాత్ములార! జనతోద్ధరణమ్మున వచ్చి దోచుకోఁ
జెల్లునె! నేను వాఙ్ముఖము చెప్పి ప్రజన్ వినుపించి రొక్కమున్
మెల్లగఁ దెత్తు, మిమ్ము మిసిమింతులఁ జేయనయా! క్షుధార్తిమై. 9

చ॥ జ్వలనము లేక యన్నము పొసంగదు కాని తదర్థ మంబర
మ్ముల దహియింతుమా! మనుజపుంగవులార! మహోద్యమమ్మునన్
జిలిపితనమ్ము మాధ్వికకలశిం బడు నీటి లవమ్ము, స్వార్థచిం
తల దిగనాడి లక్ష్య మమృతమ్ముగఁ దిందము దేశసేవలో. 10

ఉ॥ కత్తిని బట్టినాము పరకాండముఁ జెండుటకా? ప్రజాతతిన్
గుత్తుక గోసి దోచుకొను కూళతనమ్మునకా? యిటుల్ ధనం
బెత్తుక పోవ వచ్చితిమె! యెల్లర నొక్కటి నేసి దేశసం
పత్తిని నిల్వ సేయుటకు వచ్చితి మన్నది సంస్మరింపుడీ. 11

గీ॥ వక్రశాఖల తరు వింటి బరువు మోయఁ
బనికిరాకున్న వంటకుఁ బనికివచ్చు
వక్రచేష్టల మానవవర్తనమ్ము
పనికిరా దెట్టి యుపకారమునకు నేని. 12

ఆ॥వె॥ ప్రభుతకోశమందిరమ్ముల రక్షక
శాఖవారి కార్యసదనములను
ధూమశకట మాగు ధామమ్ములను కొల్ల
గొట్టి ధనము కూర్చుకొంద మోయి ! 13

చ॥ అన విని దౌలతుండు భళిరా! యన తజ్జన మూపినట్లె యూ
పెను తల గొణ్గికొంచుఁ, జెరివెక్క గబరిన్ దొలియూస దాసనాల్
జనము వినాగ నభ్యుదయశక్తు లొకొక్కొరొకో? యటంచు నే
సను ముహురుక్తసూత్రము పసన్ దగె 'కొక్కొరొకో'నినాదముల్.

కం॥ పులుగుల కలగానంబును
పొలములఁ దున్నఁ జను వృషభముల గళభూషా
వలయితకింకిణికారవ
ము లయాన్వితముం బొనర్ప మొనయుట వింతల్. 15

ఉ॥ ప్రాచిని తెల్లమేఘముల భారమునన్ విడిజగ్గునిగ్గు చె
ల్లాచెద రయ్యె బింబముగ డంబుగొనెన్ పఱువాత, ముందుముం
దీ చెలు వేమి యౌను ? గుఱుతింపగరానటు లుండి వేళమైఁ
బూచిన కింశుకచ్ఛవికి పొంతన మౌను ప్రతీచి నర్మ్మచున్. 16

సీ॥ పాలు నెత్తురునుండి వచ్చిన పని నిరూ
పించి, దోవతి కషాయితము సలిపి
ముగ్గు ముంగిటఁ బెట్టు ముసలమ్మగోళ్ళకు
రవరవ మెఱయంగ రంగువేసి
కిస రెఱుంగని కంట కెంపులు పోసి, జ
క్కవపిట్టను జెముడుకాకిఁ జేసి
దిరిసెనయరవిరిదరిసించు పాంథు మ
దికి ప్రియపెదవి యందించి మరియు

గీ॥ కన్నగాని సాధుల కన్నగాగఁ బగటి
కులటచే నర్దణాయంత కుంకుమంపు
బొట్టు పెట్టించి చిత్రముల్ వ్రాయె లేత
యెండ క్రొత్తకోడండ్రు శపించుచుండ. 17

చ॥ శ్రమ మఱఁ గొంత నిద్రిలిన రాణువ లేచి సమీపవర్తిగ్రా
మమునకుఁ జేరెఁ,బలుక్కబడి మన్నన యొప్పిన యూరి పెద్దకున్
గ్రమముగ నంతయున్ దెలుపఁ గై కొని యెన్ బలవంతు సూతి నా
సుమతి, యెఱుంగఁ జేసెఁ దన చుట్టునుప్రక్కల యూళ్ళవారికిన్

క॥ వడిసెలతో రాయి విసర
పడవేయన్వలె తుపాకి భటతతి లేదా
మడమన్ ద్రిప్పవలె, నిటులు
నడరెడువారు రయితుల్ మహారాష్ట్రమునన్. 19

సీ॥ అధరమ్ము నవ్వుచు హృదయమ్ము రాళ్ళు రు
వ్వుచు మెలంగుటను దవ్వుంచువారు
మాటలు కోటలు దాటుచు చేతలు
కితలై నపు డేవగించువారు
అదితిసంతతియు కా యతిథిసంతతి యని
యిన్నాళ్ళనక సత్కరించువారు
తా మొ నటన్నఁ గాదని రాజ్య మననీ తృ
ణీకరించి జయింప నెంచువారు

గీ॥ ప్రజకు ద్రోహము చేసెడి వాని త్రెముకు క్క
కోయువారు, మంచికి మంచి సేయువారు.
జొన్నరొట్టె లేదొ భుజింప మన్నవారు.
పెక్కుమంది మహారాష్ట్రపృథివియందు. 20

క॥ అంతయు గ్రామాదాయము
కొంత తమ పొలమ్ముపంట కోవెలలు కళల్
కాంతిల దేశ క్షేమము
సంతతముగ నచటి కృషికజనము వ్యయించున్. 21

కం॥ ఇంటికి నొకరై పెండిలి
వంటన్ బలె నైన తిండి ఫాడ్కే-యులు మూ
డింటన్ బూటలఁ దిని, రె
ల్లింట సభ యటంచుఁ దెలిసె లోకుల కచటన్. 22

మ॥ నిడుమీసమ్ములు బొందెముళ్ళ తెలియంగీ లొంటిచేవెండిపెం
గడెముల్ పట్టెడునెత్తుటంచువలువల్ గాఢోన్నతోష్ణీషముల్
విడెపుఁజాదిత్తులు నొప్ప వచ్చి పెద 'కుస్బి' యింటిలో రెడ్డిగ
మ్మిడి'రాలే సగళే' యటంచుఁ గృషికుల్ వ్యాప్యన్మిథో భాషకుల్

కం॥ నట్టిల్లది పది మిద్దెలు
కట్టఁ దగిన వెడలుపునఁ జొకాటము,బెరసెన్
జుట్టాళ్ళ ముఖ్యజన మ
ప్పట్టునఁ,బెదకా పనెన్ సభానాథుం డై. 24

కం॥ తెగులు పడిన పైరు వలెన్
సగ మయితిమి నలగి కఱవుఁజాలున,మూలం
బగు నింతకుఁ బరిపాలన
ము,గెల్వవలె దాని బ్రజలము సమైక్యమునన్. 25

గీ॥ గొడ్డలియె సృష్టము తరువుఁ గొట్టుకొఱకు
సృష్ట మీ మహారాష్ట్రము స్వేచ్ఛకొఱకు
తొలి శివాజీపీష్వాలు,నావలను ఝాన్సి
రాణితాంత్యాలు, ఫాడ్కే-బుధాను డిపుడు. 26

ఆ॥ ఇంగలమ్ము కుంపటి నాఱనీయముకద!
యెప్పుడెప్పు డెవడొ యొకడు నిప్పుకొఱకు
వచ్చు,నలవాటె మనకు నందిచ్చుచుంట
యట్లె త్యాగగుణము వస్మదాత్మయందు. 27

తే॥ వాసుదేవబల్వంతఫాడ్కే-సమాహ్వ
యుం డితండు భారతదాస్యఖండనైషి
యరుగుదెంచె సైన్యముతోడ, నస్మదీయ
వివిధసాహాయ్యమును గోరి వినుచు నిపుడు. 28

కం॥ అడ్డ మెఱుంగక భరతుని
గడ్డన్ స్వాతంత్ర్యరథము కదలెడివఱకున్
గడ్డము తురిక నెఱుంగడు
గుడ్డను తల యెఱుగ డితని గురుతరదీక్షన్. 29

చ॥ కరణము మున్సబున్ వెలితిగా గల యా సభ పెద్దకాపు త
త్సరణి వచించి కూర్చొన భృశం బలరెఙ, నిలువెత్తు కింతయున్
దఱుగనివాడు, నన్న అయి తమ్ములఁ బ్రోచెడి కన్నుదోయివా
డురసిలవాసుదేవుడు మహోన్నతబుద్ధి వచించె నీ వడిన్. 30

ఆ॥వె॥ అంగుళీయకమును బ్రమింగిన దొక చేప
యంగుళీయక మ్మనర్ఘ్యము, తద
వాప్తి కేమి చేయవలెనొ వాకొనుడు స
దస్యులార! దౌష్ట్యదస్యులార! 31

కం॥ అన నెల్లరు నొకటిగ వా
కొని రా మత్స్యమ్ముపొట్ట కోయవలె నటం
చును, ఫాడ్కే సరిగా నదె
మన ధనమున్ బరవిభుత్వమత్స్యము బ్రమింగెన్. 32

సీ॥ లండనుభారతరాజ్యాంగసంస్థ ఖ
ర్చు ద్విలక్షలు మరి నలుబదివేలు
సైనికాసైనికజనభృతి కాంగ్ల దే
శము పోవు నొడమి లక్షల శతమ్ము
తజ్జనబృందసంతాన విద్యావృద్ధి
కదనము ధనము పద్దైదు లక్ష
లిందుఁ గ్రైస్తవము బోధింప వచ్చిన ఫాది
రీలకై వ్యయము పంద్రెండు లక్ష

గీ॥ లేమి టివి?పొన్లు, పా నన నెంత? రూక
లు పది, యిపుడు లెక్కింపు డయ్య! ప్రజలార!
యొనరుపడి సాలుసా లెంత మన ధనమ్ము
దోచుకొనుచున్నదో పెఱదొరతనమ్ము. 33

సీ॥ ఎక్కడున్నది 'యేడె'? నెక్కడ నిండియా?
దాని పాలనఖర్చు దీని కలిమి
రాజకీయాల తంత్రపుశాల పెరిషియా
మనిచియు దాని ఖర్చు నిట నెట్టి
జాంజిబార్తంత్రీకసమితికి లక్షద్వ
యము పౌన్లు ఖర్చు దీని మెడఁ గట్టి
బర్మాను పాలించు పనికి నై తగిలిన
కోట్ల రూకల ఖర్చు కొసరి లాగి

గీ॥ మనము దీనాతిదీనుల మైన నేమి
చర్మదఘ్నమ్ము దయలేక సంచరించు
నీ పరాయిరాచరికమ్ము నిక నుపేక్ష
చేసినామొ తీఅని తప్పుచేసినాము. 84

గీ॥ కలదు వర్తకసర్వాధికారరక్ష
ణమ్ము బ్రిటనుకు చైనా స్థలమ్మునందు
పౌను లిరువదివేల్ ప్రతివత్సరమ్ము
నిండియానుండి దీని కర్పించుచేలొ? 85

క॥ కెనడా యెదుఃరించినపుడ
యిన ఖర్చున్ దానికడ గ్రహింపర, ధరణా
వని యెదురింపగ ఖర్చును
గొని రాంగ్లులు దీనికడ బిగువులేనికడన్. 86

గీ॥ మనకు నిష్ఫల మౌ వ్యయమ్మునఁ బ్రభుత్వ
మెన్ని కోటులో పౌనులు ఋణము చేసి
యెన్ని లక్షలొ చెల్లించు నేటనేట
వడ్డి, మన తల కెత్తె నీ బండబరువు. 87

గీ॥ ఇచట నిర్మింపఁ జేసిన నెంత చౌక
గా లభించును పొగయోడ! లేల సేయు
నట్లు పెరరాచరిక మది యాత్మజనము
బాగుపడ బ్రిటనునఁ జేసెఁ వాని సేత. 88

గీ॥ కలద యైర్లాండుపుష్టి యింగ్లాండునష్టి
కనెడు సామెత యింగ్లీషునందు, నట్లె
ఇండియాలోని క్షామ మింగ్లాండులోని
క్షేమ, మిది శిలాశాసనసిద్ధఋతము. 39

గీ॥ ఉప్పు బెంగాలులోఁ జేయు టొప్పుకొనక
బ్రిటను నుండి యిచ్చటకుఁ దెప్పించె, నింత
కన్న నష్టదాయకకృత్య మున్నె? యిక న
దెట్లు ప్రభుత? దాని ప్రజల మెట్లు మనము? 40

ఆ॥వె॥ పొలము నాక్రమింపఁ బోరాడి గట్టుపై
నడుగు బెట్టనీయ మాక్రమకుని
పొలము గాదొ! దేశము సమష్టిగ మనకు
తలలు కూడ కెంత తలరవలసె! 41

సీ॥ జరిగిన భారతస్వాతంత్ర్యరణము పొ
న్నడఁజేయ నలుకోట్ల పౌన్ల ఖర్చు
కంపెనీ వదలింపుకై మూడుకోట్ల డె
బ్బది రెండు లక్షల పౌన్ల ఖర్చు
తరలి 'పెరాకు'పై దండయాత్రకు నలు
బది యొక పదినూర్ల పౌన్ల ఖర్చు
వ్యర్థము మొన్నటి యాఫ్ఘను యుద్ధము
పదునేడు మిలియన్ల పౌన్ల ఖర్చు

గీ॥ నట్లె యబిసీనియాపోర నాఖులక్ష
లక్రమమ్ముగ, నింతయు నాంగ్లవిభుత
మనలనుండియె రాబట్టుకొనియెనండి!
ధనము కాపాడుకొండి! యద్దానిఁ జెండి. 42

మ॥ భరతక్ష్మాతలమందునుండి యెవడేఁ వస్త్రమ్ముఁ దెప్పించినో
జరిమానా యిరునూర్ల పౌన్లని బ్రిటన్ శాసించె ము, న్నిప్పు డీ
ధర నస్మత్పరిపాలనమ్మె యొసగన్ దత్తుల్య మౌ చట్ట మే
ర్పరుపన్ జాలమె! వారి వైనవి కటా! వాహమ్ముమై దానమున్

మ॥ ఇక జీతమ్ముల హెచ్చరింపఁ దరమా! యింగ్లాండులో 'నై సియస్'
లకు నే వేతనమో యదే యిచట సంలభ్యమ్ము పోలీసుశా
ఖకు సార్జెం టగు వాని కాంగ్లు డగుచో, కట్టా! గవర్నర్లమా
సిక మేతద్భృతి నేమి చెప్ప! నొక యూ ర్జీవించు మృష్టాన్న మై.

చ॥ ఒక డివిజనాకమీషనరు కున్నది జీతము మూడువేల రూ
పిక లిట, సీమ నింతగ లభించుట శాశ్వత కార్యదర్శి క
య్యొకనికె,యెంతస్వార్థమున కొల్పిడి!దొంగలుదొంగ లూళ్ళువం
చకొనినజాడ నేల్పడి గనుంగొన మీయెడ దక్క నేయెడన్. 45

గీ॥ బ్రిటనునుండి పటాల మిచ్చటికి బయలు
దేరుమున్నె యార్నెలలకుఁ దేరజీత
మిచ్చు వలకేలు జాడించి యేలుబడి, య
దె ట్లనగ నది కాదుకాదె!తమ ధనము. 46

ఉ॥ చేతిని గోసివేసినటు చేసిరి భారతజాతికిన్ జమూ
వ్రాతమునందు హూణులు ఫిరంగిని ముట్టగనీక,యుద్ధ సాం
కేతికనై పుణమ్ముఁ బరికింపగనీయక, యిట్టి పతుపా
తాతతబుద్ధిఁజెక్క లిక దక్కవు లెక్కడవచ్చుఁ బతుముల్. 47

ఉ॥ హెచ్చెను పన్ను లెన్నిటికొ యేబదిశాతము నేడు,రేబవల్
హెచ్చిన ధారగా జెమట మృత్తిక నార్ద్రము సేసి పంటలం
దిచ్చెడి రైతులార!దురదృష్టవశమ్మున నిట్టి పాలనఁ
జెచ్చరిలంగ మేపి లేదొ మేపి లెఱుంగక, గ్రొచ్చు డింతటన్. 48

ఉ॥ పండిన పంట పన్ను తిన పండిన పంట ఋణప్రసాద మై
యెండిన గుండెతోడఁ బెరయేల్పడివారికి బానిసీడుగా
నుండగ నేల? హాలికమహోదయ! యో బలరామమూర్తి! దో
ర్దండమునందు ముల్లుగలు దాల్పక బల్లెము దాల్పరాఁ వెసన్, 49

ఆ॥వె॥ పన్ను లోకశె యయ్యుఁ బరప్రభుత్వముకన్నఁ
జాము మేలు, చచ్చువాడు బ్రతుక
వచ్చు పాము విసమువలన, పరప్రభు
తన్ గతించు మనుసతండుకూడ. 50

ఆ॥వె॥ చదువు లేని మీకు స్వపరిపాలన మేల?
యనెను ప్రభుత, చదువుకొనని వాని
కన్న మేల? యన్న య ట్లున్న దీ మాట
చదువుకన్న మొదలు చదురు వలయు. 51

ఆ॥వె॥ అగ్ర రెంత చదివె! హాయిగా పాలించె
నాఘ్నులకు విద్య యలతియ కద!
వారి కన్న వీర లేరీతి సబబుగ
లారు వంకమాట లాడువారు. 52

గీ॥ భవ్యులార! ఆస్వస్థతావస్థ భేద
మస్వతంత్రత యనునది, యాంగ్లులు తమ
దేశమున రూపుమాపి యీ దేశమందు
సాగుచేసిరి దీని గంజాయి నటుల 53

క॥ అట్టోమన్ సామ్రాజ్యము
నట్టిట్టనగలినేమి? య్యైరోపా, యీ
ముట్టడివేయుట యిందే
చిట్టెలుకలు సిరులు మనవి చీలి య దయ్యెన్. 54

మ॥ తమలోఁ దాము గతైకమత్య మగు నాత్మన్ గాటులాడుఁగా, విధే
యము లై స్వామిని గొల్చుఁజంతువు లెవో యవ్వానికిన్ జోడుగా
గమనించున్ దొర యస్వతంత్రజనమున్, గావింతు తోడేళ్లసం
ఘముగా దీని సదైకమత్యగతమున్‌గా నిల్వుడీ!నా నుడిన్. 55

గీ॥ తిన్న దఱుగని జబ్బు జాతికి నసైక
మత్య మన్నది, జ్వరము సంప్రాప్తమయ్యె
దాన నస్వతంత్రతపేరఁ, దాదనంతఁ
బోవు నిదియు తొల్లిటి జబ్బు పోయినపుడు, 56

గీ॥ అనుచు ఫాడ్కే ప్రసంగము నాపె, జనము
లెక్కగాడు మొనగా డని మిక్కిలి గొని
యాడి పెదకాపుతోడ మాటాడి కొంత
ధనము నంపె స్వాతంత్ర్యయత్నమ్ముకొఱకు. 57

క॥ బాబా ! బాబా ! యని గా
రాబముతోఁ దన్ను పిలువ ప్రజ యా నాటన్
బాబాలను గొని దొడ్డమె
రాబాలో దౌడు నేర్పె రాణువ కతడున్. 58

మ॥ తరుగుల్మమ్ముల దట్టమైన యొక కాంతారమ్ములోఁ గోనలో
పరివారమ్మును తాను నుండి తురగప్రాంచత్తదగ్రీయుడై
పరితఃప్రాంతము దూసె కోశధనముం బ్రతం బటుల్ ఫాడ్కె జా
గరితోగ్రప్రభుతాసశస్త్రభటరక్షాక్రాంతి నిద్రింపగా. 59

శా॥ పోలీస్ష్టేషను లెన్నొ ఖడ్గములు క్రోవుల్ దుస్తులున్ జాజుటో
పీలుం బోవగఁ దేజుఁబాసినవి, రైల్వేష్టేషనుల్ రైళ్లు మొ
త్తాలన్ విత్తముఁ గోలుపోయినవి, వార్తావాహతంత్రీతతుల్
నూలుంబోగులు నైన వౌర! ఫడకేసత్యర్థ్య శౌర్యమ్మునన్. 60

ఉ॥ గుండియ చేతఁ బట్టుకొని కూర్కిరి రక్షకయోధు లొక్కచో
నుండియునుండి, కూరికిరివో ! పలవించిరి ఫాడ్కె !ఫాడ్కె ! యం
చున్, డగరమ్మునఁ దేర్చి దొర నూతను డీరలుపల్కునాత డె
వ్వండుర! వా డనెన్, వెనుకవాలున నొక్కడు నేనె రా! యనెన్.

శా॥ వార్తాపత్రికలందుఁ బత్రభర మై, బహ్వాంగ్లయోధానుయో
ధార్తిశ్యామితచిత్తపాత్రభర మై, యారాష్ట్రధీరప్రజా
కర్తవ్యక్రమపుల్లనేత్రభర మై, క్రాలొక్కన్న ఫాడ్కేబల
స్ఫూర్తిం దోచె స్వతంత్రతాదినరమాశుక్రోదయద్యోతముల్. 62

క॥ ఎక్కడఁ జూచిన ఫాడ్కే
మొక్కలమే కానబడగ మొగ మరుణంబై
దిక్కులునవ్విన తెలిజన
మక్కసుతీర్చుకొనునొడుపు నరయక విసివెన్, 63

సీ॥ ఒకడు చూపింతు రండో!యనె,ము న్నెగ
వెన్క గార్యగృహమ్ము వీటిబోయె
నిటు పోయె ననె నొక్క, డటు పోవబోఁ బాడు
వడిన పెన్బొందలో విడిచె దారి

యటు పోయె ననె నొక్క, డటు పోవ రేవేలు
దొరల శంఖాననతురగకములు
ముక్కుకు సూటి యీ మూలఁ బొం డనె నొక్క
రుడు,పోవ నున్నది రుద్రభూమి

గీ॥ యంగలంగలు వైచి నే లంత కొలిచి
యెంత తిరిగిన నెటను రవంతయేని
తెలియ దయ్యె ఫాడ్కెజాడ తెల్లవారి
దండునకుఁ బ్రజోపరిదృప్తదండమునకు. 64

క॥ ఇది యే మన్యాయము మీ
యెదిరినిఁ బట్టుకొనలేక యీ గతి మమ్మున్
బదరుచు బాధించెద రని
పదిమంది యనంగఁ బ్రభుత ప్రక్కకుఁ జూచెన్. 65

గీ॥ ఆ మహారాష్ట్రగేహగేహమ్ము వేగు
నడపె ఫాడ్కెకు, దొరతన మ్మిడిన యిడుమఁ
దట్టుకొనె గాని యాతని గుట్టు బైట
బెట్టలేదు విసుపునఁ దిట్టు తిట్టలేదు. 66

గీ॥ వాని తాకిడిఁ గలగుండువడిన ప్రభుత
యమృతనిధి వాసుకి విసమ్మునట్లు వెలిచె
వాసుదేవఫాడ్కెన్ వేడు వట్టియిచ్చు
నతని కులువ ముప్వేల్ రొక్క మనెడి వార్త. 67

ఉ॥ ఫా ట్టని వృక్షముల్ పగులఁ బైకొనినట్టి దవానలమ్మునం
బుట్టిన ధూమ మై ప్రభుతనుండి ప్రసారిత మయ్యె వార్త యే
దిట్టడు ఫాడ్కె పట్టువడఁ దెల్పునొ రూప్యము లబ్బు వాని క
ప్పట్టున మూఁడు వేలుగ నుపాయన మంచు మరాటియూళులన్.

గీ॥ అట్టి ప్రకటనఁ జూచిన నాలకించి
నను జనమ్మున నెవడు నా పనికిఁ జొరడు
వాసుదేవునితో నేకభావ మొప్ప
దొంగ లై యనుయాయులు తొలగినారు. 69

ఉ॥ దౌలతరావు పోయెనొక దాడిని పాఱెఁ గలంగలేద, యా
వాలము విత్తలాలసకుఁ బార్శ్వచరావళి, కొన్ని యూళ్ల ధ
న్యాలయముల్ తదీయచర కగ్గము లౌటఁ గలంగె మిక్కిలిన్
శీలము వేఁగి కేల యని చెప్పిరి వార లనుద్యమాత్ములై. 70

చ॥ బలమును వృద్ధి సేసికొని పట్టుదలన్ దుదముట్ట జేసికోఁ
వలసిన ద్రవ్యముం దమకుఁ బంచగ నొత్తిడి సేసినార లా
యులువులు, మోసపోతి నని యూర్చుచుఁ దప్పక పంచిపెట్టె న
య్యలఘుడు, తాము వచ్చిన పనైచని రందఱు రావులుంగులై.

క॥ ఇరువాళ్ళ నిరుతుపాకులు
చిరుమొత్తము డబ్బు హాయము చివరకు మిగిలెన్
స్ఫురియించెను సన్యాసము
స్ఫురియించెను సతి యదేల పోరు డటంచున్. 72

ఉ॥ దౌలతరావునాకృతి కదల్చి యెదన్ సొరకోత గోసి యా
చీలిక లన్నిటిన్ గలిపి చెప్పెను నన్ బలి యిచ్చి నీవు సౌ
ఖ్యాలసబుద్ధి వౌట తగవా! వెడుకాడుము సభ్యులౌ తర
శ్శ్యాలురు లభ్యులౌదురు వెసన్, బొలిపోయెనె! భారతప్రథల్. 73

క॥ మరణము తప్పదు, పెక్కురు
మరణింతురు పురుగు లట్లు స్మరణవిధురులై
మరణించియు మరణించెడి
నరుడే కృతకృత్యుడున్ సనాస్తుత్యుండున్. 74

శా॥ సన్యాస మ్మధిరోహణీభుజగమిశ్రం బాటవై కుంభపా
శీ న్యాయ్యమ్మన బాదరించు, బోర గగ్లెన్ జన్మ బాటంది తా
వన్యన్ దాపసి కావలెన్ మరల, నీ పాళ్లెల? దేశమ్ముకై
జన్యన్యస్తశరీరుడౌ నరుడు మోక్షం బప్పుడే యొందెడిన్. 75

క॥ ఇట్లొందవె మోక్షము, ని
క్కట్లవి టిక్కట్లు ప్రగతిగమ్యాశకటమం
దట్లాసులోని యెట్టని
గీట్లన్ దుడిపింపవే! భగీరథు పుడమిన్. 76

క॥ అని చెప్పినట్లు నయి మన
మున "గాండ్గాపూరు" హితుడు ము న్నొడ గూ
ర్తును రోహిలాల నన్న ను
డి నెంచి యా వాసుదేవు డేగఁ దలచెఁ. 77

గీ॥ ప్రకృతి పువ్వులు రాల్చె నా బంటుపైని
సమయము విదుర్చె నంధకారమును,మబ్బు
పట్టి నక్షత్రములు మింట బయలుపడవు
మెఱసె నొండొ రెండో మినుకుమినుకుమనుచు. 78

సీ॥ ధ్వనిబట్టి తప్పు నెవ్వరినేని గుఱుతింప
పీ ల్లేదు,శ్రోవకు వెరవు లేదు
కయ్యి లున్నవియొ,లేక చదరమో కోణ
మో పురవసుమతిముద్ర లేదు
స్పర్శం బొకటి తక్క చతురింద్రియశక్తి
చింతాకువడి పనిసేయలేదు
నన్ని రంగులను లోగొన్నది నలు పొక్క
శే యను మాటకు నెదురు లేదు

గీ॥ కన్ను లున్న లేకున్న నేకంబె నాకు
జనత పండితాపండితసమము ఘనత
యనినయటులనె కవిసె నజాండమునఁ ద
మస్సు,వేచియున్నది దూర మై యుషస్సు. 79

ఆ॥వె॥ ఆయుధాళివలన నాయోధనము వోలె
ధనమువలన నా ప్త జనము వోలె
నంధకారముననె యభివృద్ధి చెందును
పురుషకార మనుట పొసగుమాట. 80

క॥ ఒక కొండగుర్తుతోడ ఫ
డకే తనపథమ్ముపోకడఁ దెలిసి యర
ణ్యకమున్ దాటినతోడనె
ప్రకటింపించె వడిపొంగు స్వతురంగముచే. 81

వం॥చా॥ నిరోధివాయుఘట్టనానిపీతఘర్మభార మై
వరుంగువాఱె వాహ మావగాని దూకుదౌడుతో
తురంగమో!కురంగమో!ధునీమణీతరంగమో!
పురస్థమైన విశ్వమన్ ప్లుతమ్మలోనె దాటునో! 82

సీ॥ ఏ యూరు విలసిల్లు మాయూరపించమై
ఘువికి దత్తాత్రేయమూర్తి వెలసి
యే యూరు శ్రీయూరువై యైకమత్యాఖ్య
సంతతిన్ లాలించు చారుపీఠిఁ
గేయూరమై యొప్పు నే యూరి కమృతవ
న్యామల్లి భీమానదీమతల్లి
మాయురే!యనిపించు నేయూరి బ్రాహ్మణ్య
మగ్నికిలనుఁ బోలు నౌజసికత

గీ॥ నది తనర్చు "గాండ్గాపూరు" నది యమరజ
భీమతో నైన సంగమ్ము సీమఁ గలిగి
కన్నడమరాటిబాసలు గజ్జెలుగ మొ
రయు నిజాంరాజ్యరమణీయందియ యనంగ. 83

గీ॥ చేరి యచోటికి ఫాడ్కే వసించె రంగ
నాథఈశ్వరభట్టను నాప్తునింట
గోష్ఠి జరిపించె నిష్ఠులన్ గూర్చి భట్టు
మరుదినమ్మున నిజగృహామధ్యమందు. 84

సీ॥ "చౌరనీరాజా"కు సఖుడు భాగ్యపురి నీ
మా కులవృద్ధు పినాకపాణి
రఘునాథమోరేశ్వరాహ్వయుం డితడు సా
వాసమ్మునకు మేను కోసి యిచ్చు
మాట కఱకు గాని మనసు చెఱకు రామ
చంద్రవిశ్వామిత్రసంజ్ఞు డితడు
యీ "రంగపంతుమోరేశ్వరు" మంత్రమ్ము
శిమ్మి బ్రహ్మని బ్రహ్మఁ దిమ్మఁ జేయు

గీ॥ నాయకులు వీరు రణజయదాయకు, లిత
డే నుతాజి "యిస్మాయిలుఖానురోహి
లా" యనుచు భట్టు పరిచితులం బొనర్చె
నందు బాబాఖ్యషౌడ్కేకు నాగతులను. 85

క॥ 'పీనేకాపానీసాబ్
పానం మాకి' య టంచు 'బట్టూజీ నో
లానా దో' స్తంచున్నద
ఖ్తా ననె బాబాఖ్యుతో వికాసితముఖు డై. 86

క॥ భారతభూస్వాతంత్ర్యము
కై రణ మొనరించు మామక ప్రియసఖు డీ
శూరుడు బాబానాముడు
కోరుచు మన తోడు సేనకొలు కిట వచ్చెన్. 87

గీ॥ అనుచుఁ దన్ను సంస్తుతుఁ జేసి యందఱకును
భట్టు మిన్నక యుండ బాబా వచించె
నయ్యలార! వాడిమినేర్పుఁజియ్యలార!
తమరి కెఱుక భారతదేశదైన్యగాథ. 88

సీ॥ బ్రిటిషుదీవులకన్న పెద్ద యీ ధర యాఱు
రెట్లు, కట్టున నెన్నొ రెట్లు చిన్న
ఆఱువేల మయిళ్లు నీరధితీరమ్ము
కులమతశాఖ లిం కొక్క వేయి
యెన్ని రాష్ట్రమ్ములో యన్ని నాల్గులు బాస
లెన్ని బాసలో మతా లన్ని పదులు
నఖిలజగచ్చతుర్థాంశ మీ దేశ, మ
న్యోన్యవిద్వేషమందుఁ బరిపూర్ణ

ఆ॥వె॥ మిట్టి కతలకతననే తలవంచిన
దొరలు దొరలు గాగ భరతధాత్రి
కారు వారి ప్రజలు భారతుల్, తత్ప్రజ
బ్రిటనునందు, నేగి పేర్చె విందు. 89

గీ॥ జనహృదయదుర్భరమ్ముౘ లౌ సంఘటనలు
రంగమునఁ జూపక తెర మఱుంగు సేయు
నాటకము వోలె సాగుచున్నది ప్రభుత్వ
మిచటి ధనము బ్రిటనుకుపు, యేమి చెప్ప. 90

గీ॥ ఆడువారికిఁ బతిభక్తి తోడుగ మగ
వారికిన్ దేశభక్తిని నూఱిపోయ
రైరి భారతమేథావు, లట్లు గాగ
దేశవిద్రోహిసంఖ్య విస్తీర్ణమయ్యె. 91

క॥ చితి నెక్కించిరి సతులన్
మతిహీనులు తొల్లి, వారిమాఱుగ నీ ద్రో
హితతిన్ గాల్చిన నెపుడో
స్వతంత్రత లభింపకున్నె! ప్రజ కీ మహిపై. 92

గీ॥ మరియు భేష్ భే ష టంచుఁ బొంపిరి ధ్వనించు
వారితో నిట్లు పలికె బాబా పరాయి
యేలుబడిక్రింద నుండుట యెపుడు నగ్ని
పర్వతముమీద నుండుటవంటి కీడు. 93

గీ॥ ఇట్టి కీడు స్వతంత్రత యెనయఁ బోలియు
నెండచే వాన పడి పంట పండు, పంట
వలనఁ బ్రజ, ప్రజ నేకభావము రచింప
దాన శక్తి,శక్తిన్ స్వతంత్రత జనించు. 94

గీ॥ రాజకీయదాస్యమ్మున క్రుమ్గినంత
కాలమును శక్తిసామర్థ్యఘనత లేదు.
జలధరచ్ఛన్నమధ్యాహ్నసమయమున స
హస్రకిరణతేజము హ్రస్వ మైన యట్లు. 95

క॥ అనుపగని భరతఖండా
వనిగర్భమునందు కలదు, ప్రజరొ మ్మిపు డా
గని యగుచు ఖంగుఖంగున
నినదింపవలెన్ రణాన నిహితతతులన్. 96

శా॥ గ్రామగ్రామపురీపురీపథపథాఖండస్థలీఖండనో
ద్దామం బై ప్రజ మాఱు కొట్టి ప్రభుతన్ దాటించుచో నీ ధరా
సీమన్ శాంతి సజీవశాంతి యపుడే, సీ ద్రమ్ము ధామమ్ములో
నీపై శాంతి స్మశానశాంతియొకదే! యెన్నాళ్ళు జీవించినన్. 97

ఉ॥ ఐదవవంతునన్ జగతి నైన జనమ్ము త్రయోదశాంశ మా
మేదిని నుండు వారలకు మేకొని సేవలు సేతకన్న నిం
కేది! తృతీయపుం బ్రకృతికిన్ దగు మూఁదల, నేటికేని యే
కాదృతబుద్ధి నిల్పుద మయా! ప్రజపాలన మీరు మేమునున్. 98

క॥ పులి పోవ తోఁక మిగులని
లలి నాంగ్లుడు పోవ నిచట రా జెవ్వ డయా!
విలసిలును ప్రజారాజ్యము
నెలకొందము మంత్రిపదవి నిక్షేపముగా. 99

మ॥ తొలుతన్ గ్రీకులు మత్తరోమనులు తద్దోస్సారముల్ డొంక నాం
గ్లు, లమూదృక్పరపాలకావళికి మ్రొక్కుల్ మ్రొక్కి తచ్ఛాసన
చ్ఛలపల్యంకిక మోయుటల్ తగునె? యార్యశ్రీలకున్, లెండు సూ
రులు! పాతాళమునందు ద్రోయుదము సర్వోగ్రమ్ము నీ యేల్లడిన్.

శా॥ నే నింద్రుండను, మీరు దేవతలు, లెండీ త్రుంపగా నన్య మా
ఘూనాథత్వము పేరి వృత్రతనువుం, బోరన్ జయం బందనో
నేనే నాటి దధీచి, నా యొడలి వెన్నెమ్మున్ శతారమ్ముగాఁ
బూనఁగావచ్చు జయింపవచ్చును చమూముఖ్యం డెవండేనియున్.

క॥ ఈ యావేళ మనన్య
స్వాయ మనుచు, బ్రతుకదు పరపాలన మెన్నా
శ్శ్వా యనుచు, నలతిచప్పట
మాయురే! యను వారికిఁ గడమాటగ బాబా. 102

ఆ॥వె॥ ఎంత! ప్రగతి నొందె నింత లేదు జపాను
పరకబంధపాణిఁ బట్టువడక
భారతమ్ము నటులె పఱిగింత మీరెల్ల
తోడుపడుడు భటులతోడ నాకు. 103

క॥ అన సరియ ధనము కావలె
నని చెప్పిరి రోహిలాయు నాయకు, లెపుడు
న్నినుఁ బ్రోతుము బాబా! ఖో
జన మిడి మా యింద్ల ననిరి సంగము విప్రుల్. 104

# హైదరాబాద్ ఖండము

క॥ మూసినకిటికీసందుల
దూసికొనుచు వచ్చె గాలి, దొడ్డది యది, తా
నోసరిలినఁ దక్క దివియ
భాసించునె యెంత చమురు ప్రమిద నెసగినన్. 1

ఆ॥వె॥ వంటయింటిమంట కంటించి పుడుక ము
ట్టించె గదిని దీప మింటితల్లి
వెడలి రంద, అపుడు నుడివెను బాబాకు
నాయనా! యనుచుఁ బినాకపాణి. 2

గీ॥ హైదరాబాదరాజ్య మియ్యదియ, భాగ్య
పట్టనము! యన హైదరబాద పలుకు
పలుక దిది నీవు పిలిచినన్, బిలువదగద
యటులు నీవును, తగినవా డాంగ్లు డోకడె. 3

గీ॥ అతని సామ్రాజ్యమందు రాజ్య మిది యగుట
నీవు మఱచిపోగూడదు, నేడు దీని
బ్రతుకు తత్పంజరపుఁజిలుక, తొలి నిట్లు
కాదు వాని బుట్టన్ భుజగమ్ము కాని. 4

క॥ భారతమునఁ దొట్టతొలుత
నీ రాజోద్యానమున జనించె లత, యదే
పేరన్ స్వతంత్రత, విరుల
యీరమ్మగువేళ దాని నేనుగు ద్రెంచెన్. 5

గీ॥ మామకీన 'షిర్డాన్' గ్రామమందు వేయి
నెలలు బ్రతికి యొక ఫకీరు తెలుప నలకీ
వింటి, వివరమ్ముగాఁ దెల్పవే! యటంచు
వేడు బాబా కతం దనె వెండి యిటులు. 6

సీ॥ రాజమిత్రతిలకరాజి కొందలకు హాూ
ణనిటాలము చవుతినాటి చందు
హూణపాలన మెంచి యుల్లము రా జౌ ని
జాముస కష్టమీశర్వరియును
మంత్రిమణికి పూర్ణిమారాత్రి, రాట్సుతు
నకు రోహిలాలకు నమవసనిసి
బహుళచతుర్దశీప్రాభాతశశిరేఖ
ప్రజలకు హూణాస్థ పట్టణమున

గీ॥ నిట్టి హైదరాబాదున పృతనతోడ
మెదలు హూణుడు వైస్రాయిముదల నొకడు
పదవి రెసిడెంటు, తా నడుగఁ దగుమెయి జ
వాబున నవాబు చిత్తము బాబనంగ. 7

ఆ॥వె॥ రోజు చూచుకొనుచు రాజకీయమునాడి
తనదు విలువ కొలుచు కొనుచు ఱేని
కద్దెదండు నంటగట్టిన వైస్రాయి
కాత డిచటి వార్త లంపుచుండు. 8

క॥ గుండెలుతీసినబంటుగ
నుండును రెసిడెంటు చారయుతి నడిప్రోలన్
ఖండిత మగుచున్ శ్మశ్రువు
కొండొక గురువో! నిజామకున్ దా ననగా. 9

గీ॥ పాలనానాటకమున జవనికవెనుక
నుండి శబ్దము నందిచ్చు చుండు నతడు
దాని నంది పలుకడో పాత్రధారి మరల
కనబడదు భాగ్యనగర రంగమ్మునందు. 10

మ॥ మతిమంతుండు మనస్వి మానధనుడున్ మాన్యుండు రాజామహీ
పతిరాయాఖ్యుడు ప్రెంచిసఖ్యుడునిజాంభాయీ॥యనన్ దన్మనం
దె తనర్చున్ గుజరాతివా డొక డరాతిశ్రేణిదుస్స్వప్న మై
నతతాంగ్లప్రభుతాంత్యకాలగణనశ్రామ్యత్ప్రధీపోష్ఠ రైయె. 11

మ॥ మను జేంద్రా! తొలిఁ బెల్కి 'మాన్షియరు రేమాం'డగ్రధీరుండు వ
మ్మినను మ్ వేఁగిని నంత సేగి యనుకోమే యాంగ్లునీదక్క యం
చని,యి ట్లాడిన రాయుతో నృపుడు కో ట్లర్పించినఁ వి త్త మిం
కను తేతే! యను, నక్షరాల నిజమే కాదా! త్వదు క్తం బనెన్.12

క॥ ఎన్నో హేమంతనిశల్
విన్నవి రాయుడు నిజాము వివిధాంశములన్
సన్నగఁ జర్చించుట, నిటు
లన్నా డొకనాడు రాయ డా జనపతితో. 13

క॥ సేనాపతి "సలబత్ ఖాన్"
హానిని నెదుర ననియె నో! ప్రభూ! హారములన్
గానుకలం బంపితి నె
న్నో నిన్ననె 'సింధియాకు' 'హోల్కారున'కున్. 14

క॥ ఏ మందువో! యన నతని కి
కే మందునో! తినెద నందు నే మందునో పో
రాములు పైకొన ననియె ని
జాము, మహీపతి వచించె ఛన్నశ్రుతి యై. 15

క॥ నా మూలముగాఁ దినకుము
'నీ 'మీరాలం' ప్రధాని నీడ యగుచు ని
న్నో మున్ గాత! సికంద
ర్జా! మన్నివసనము మార్పుమా యెట కేనిన్. 16

క॥ పురమును విడువఁదలంచితి
తరలింపుము న న్న టంచుఁ, దత్ప్రభు వనె నా
క అవలు లైనది హృది, నిను
దరి నిల్పు కొనంగలేని దౌర్భాగ్యనిధిన్. 17

మ॥ ప్రభురూపమ్మున నున్న ఖానిసనయా రాజా! పరంగ్గిలకున్
శుభితాత్ముండ నెదుర్చి లోగితిని రాజ్యోద్దీర్ణ కాంతున్, రెయిం
బ్రభవింతున్ దినమందు చచ్చి, యొక చిత్రప్రాణి నై త్వద్వియు
క్తి భృతప్రాణుడఁగాక యుందునె! యాగ్రు ధన్యమౌగుం డెతో

క॥ కొడుకును పట్టిమ్మని న
న్నడిగెనొ రెసిడెంటు కాదననయా! యీ క్రొ
క్కడి వాడౌదాకౌటకై యే
చెడుగు నెవరికేని చేయ సిద్ధము సుమతీ! 19

గీ॥ చెవులు లేని గోడలమధ్య చెలగె నిటులు
నా మహీపతిరాయనిజాములకొగి
భాషణము, మహీపతి తరువాత బయలు
దేరె బీరారునకు సుబేదారు డగుచు. 20

గీ॥ చినుకులు పడిన తామరా కెన యు కంట
నెల వొసంగె నిజాము,సచివమణి యట
నిచటికన్న సుఖం బొప్పు నేల వత్తు
విచటి కని వీడుకొల్పె, గమించె నతడు. 21

క॥ వచ్చె మహారాష్ట్రులతోఁ
గచ్చెన్ హలాణు లొనరించు కదనము, వైస్రా
యిచ్చె నిజామున కాజ్ఞన్
బుచ్చుము సేన నని, యతడు పుచ్చెను దానిన్. 22

మ॥ శతముల్ తొమ్మిది గుఱ్ఱపుందడము పట్సాహస్రపాదాత మొ
క్కట తరిన్ దర్లెను,రోహిలా లరబు లగ్రశ్రేణి యోధుల్, మహీ
పతిరాయుండు వరూథినీపతి, రణం బైపోయి వైస్రాయి మ
త్పృతనన్ లూటి యొనర్చె నీ బల మిదేమీ! ఓ! నిజామూ!
యనెన్. 23

క॥ అయయో! అయ్యయ్యో! అ
య్యొ! యయొ! యనె నిజా,మయో!గియో!కాదు మహా
రయము మహీపతి బర్తర
ఫయినటు వినుపింపు మనుచు వైస్రాయి చనెన్. 24

చ॥ సరెయనెఁ గాని యానతిని సల్పడ యా విధి నెన్నినాళ్ళకు
న్నరపతి, విన్నవించుటకునై చని యేదియొ వించుఁ బెద్దమం
తిరి వినిగెన్, బొమల్ ముడిచి తెచ్చెఁ బరిన్ రెసిడెంటు,వంకర
క్కరముల కప్పడిన్ దెలుపు కాగిత మొగెను వాడు రాయికై. 25

శా॥ రూపించెన్ మము కంటగించుటలు ధారూర్దౌలతాబాదు బా
ద్నాపూర్ కోటలు చేరనీయక, దురాత్మవ్రాతముల్ నీ పురిన్
మా ఫౌజున్ మమునుండివాపుటకు 'నింబాల్కర్' ముఖుల్ పూనినా
రాపన్ జాలవొ! నీవ టంచు రెసిడెంటాడెన్ ధరానాథుతో. 26

క॥ మానితు రాజారావ్ రం
ఖానింబాల్కరును 'శహారుబద' లనియె నిజా
మానా డే నూరుల్లు
మ్రానరశింగ్రావ్దికంబరాఖ్యుల క ల్లై. 27

గీ॥ శ్రీమహీపతిరాయడు సేసినట్టి
దొడ్డపని చెప్పవే! యని యడ్డుపడిన
వాసుదేవబల్వంతబాబాకుఁ జెప్పె
నీ కరణి యోగ్యవాణి పినాకపాణి. 28

క॥ 'గులుబర్గా' జిల్లాలో
గల దొక కిల్లా య దేదొ, కదలె నటకు రా
బలిమి మహీపతిరాయడు
తొలిరాణువ తన్ను విడక తోడుగ నడువన్. 29

శా॥ కిల్లాకావలిమై మహీపతి నిటుల్ క్రేణించె కాల మ్మహో!
కిల్లాకున్ సచివేంద్రు డంపఁ గొని బేగీరావు లేతెంచి, రం
దుల్లేఖ మ్మిది వైరి యర్థి సిరి రుద్రుం భద్రు నున్నిద్రుగాఁ
జె ల్లగ్గించు పతీ! ధనవ్యయమునం బీరారుతె క్కింపుమా. 30

ఆ॥వె॥ తాను తీసికొనిన ధనమున కెవుడు వై
ప్రాయి యొప్పజెప్పు జమయు ఖర్చు
నేను నపుడ యని లిఖించి మహీపతి
మాలుజాబు నంపె వారి కొసగి. 31

శా॥ "మీరాలం" వినుపింప నా లిపి నిజా మేమీ! యనం డయ్యె, వీ
వారన్ 'సైదనుహోము' వించు రెసిడెం టంపింతు హుజూణాధికం
బౌ రాబందుల వంటి వౌ, జతని నేయ న్నాలుకల్ గ్రోయు నా
ధార మ్మున్నది కుట్రకే సనియె, సిద్ధం బయ్యె దండెత్తుటల్. 32

గీ॥ అట మహీపతిరాయని భటసమూహ
మునకు నాయకు డౌచు నొప్పు నొక స్పెయిను
జోదు, పేరు క్లెమెంటీ, విరోధి కుంటి
ఫ్రెంచిఖత్తు తీర్చిన వాని పృతన వంటి. 33

గీ॥ అతడు తల, తక్కుచుఱుకరు లవయవములు
సేన యేకతనూవర్తి సింహమూర్తి
యతని యసమానరణకుశలతకు రాయు
డే గురువు, రాయుడే ప్రాణ మిందఱకును. 34

మ॥ మృతి పంపించు జ్వరమ్ము సాటి యిదిగో! మీరాల మంపించెఁ జీ
టి, తమాయించితి చించివేయక క్లెమెంటీ యం చనన్ దన్మహీ
పతితో నాతడు నల్పుదెల్పు నిది యై స్వాతంత్ర్యసూర్యోదయ
స్థితికిన్ బూర్వభవంబు కల్యమును సూచించెంబ్రభూ! యంచనెన్.

మ॥ మన ప్రత్యుత్తరముం బఠించుచునె యామంత్రిప్రధానుండు సే
నను బుత్తెంచియయుండు సాంగ్లముగ, సన్నద్ధుండవై యొక్కగొం
టునుఁ బోనీకువె వాని యింటికిఁ గ్లెమెంటూః మేటి బంటూ! యనెన్
ఘను డా రాయడు, తోపులెత్తి మొన నుగ్రంపకళ్యమున్
జేయుచున్. 36

గీ॥ వచ్చిపడియెను రెసిడెంటుబలము చలము
పట్టి నైకవిధాయుధోజ్జ్వలము, కలము
పట్టి యెవ్వడు వ్రాసినఁ వర్ణనమ్ము
చిట్టి దగునట్టు లతిశయించెన్ రణమ్ము. 37

గీ॥. "బర్గు" బూర్గయ్యె, "పాల్మరు" పల్మ రెడనె
"బెల్లియరు"కుఁ దళ్ళియ లేదు పృథివి, నెత్తు
పూలు పూచె "గార్డెన్", బ్రిటిష్‌పాళియందు
రాయడు క్లమెంటి యతిలోకరణ మొనర్ప. 38

క॥ పదమూడుశతమ్ములకున్
సదనము చేరినది మూడు శతములె యాంగ్లే
యదళమునందున బాబా!
కదనము నీవు నిటు సేయ గల వనుకొందున్. 39

క॥ ఔరా! యెంత పరాక్రమ
పారీణులు రాయ డతని వాహినిపతియున్
మూరెను నా కండలు త
త్సారము వినినంత, యెట్టి! చరితము వింటిన్. 40

గీ॥ అనిన బాబాకు మరియు ని ట్లనెఁ బినాక
పాణి,యా మహీపతియొద్ద సేనసంఖ్య
కొలది కదవె! మర్హా ఠరిబలము వచ్చె
నా ప్రదేశమ్ము పట్టని యంత యగుచు. 41

మ॥ అటులన్ హైదరబాదదండు పది రెట్లై వచ్చి పై దూక నిం
కట నుండన్ దమ పాటు తప్పదని రాయండున్ దణాయండు పోఁ
జటులానీకము చెట్టు కొక్కడుగఁ గానన్ బోయిఁ, ర ట్లయ్యె న
ప్పటి ఘట్ట, మ్మిది యయ్యె డెబ్బదికిఁ బై బైఁ గొన్ని
యేం డ్లయ్యెడిన్. 42

చ॥ అపరిమితైకమత్య మనఘా, తొలినుండియు రోహిలాల! కొ
క్క పెదవిఁ జిందు పోసములుగా నిట వారు రహింత్రు, వారికి
న్నప్పుడు మ రెండు యుద్ధమున నింగ్లిషు వారికిఁ దోడుగా మరా
టి పవుజుపైని పోరగ నిడెన్ ముదలఁ మది లాగుచున్ననున్. 43

శా॥ ఆటోపించిన యెల్గుతో నిటులు వ్యాఖ్యానించె సర్దారుఖాన్
ఖోశేజాయిసమాఖ్యుఁ డా తెగకు ముఖ్యుం డో! యురస్వంతులా
రా! టాటోకుపరంగికిన్ వరవు డై య య్యాసపో తాడు మ
న్నాటాడున్ తన రాజ్య మూడు నని యీ నైజాంవిభున్ వింటిరే!

క॥ దేశీయుండు స్వదేశ్యుని
నాశము గోరుకొను టది యనార్యము ధర్మ
భ్రేషము, దానవెకద! యీ
దేశప్రజ బందెఁబడె విదేశీయునిచే. 45

ఉ॥ అన్నము పెట్టు దాత కిపు డాపద లేదు పెనంగి తీర్పగా
నున్నది లేదు రాజ్య మది యోడెద మన్న భయమ్ము లేదు, ఊ
డన్న స్వరక్తభుక్తి కలనైన నెఱుంగడు రోహిలా, మరా
టి న్నలుకాడఁ బోవడు, సడింపడు వాయ పరాయితిండికై. 46

క॥ ఏ మందము బవరమునకు
భూమీశునితోడ, కొలువు పోయిన దనెనా
నోమింతము "బాజీపి
ష్వా" మొగలో మగతనమ్ము బలిగుడు గూయన్. 47

ఉ॥ వల్లె యటంచు ఖానుకు నవాబున కొల్ల మటంచు రోహిలా
ఖెల్లరు కొల్వునుండి వెడలించు జవాబును వించు దానికిన్
వల్లె యటంచు భాగ్యపురిఁ బాసి మరాటిదునీని డాసి యా
బల్లిదు డుల్లసిల్లఁ బగవైఁ బడి రక్తము జల్లులాడుచున్. 48

శా॥ నానాసాహెబుశాంతియాలు సితసేనన్ గొట్టు ఘోరాజిఁ దో
డై నాసీరమునందుఁ బోరిన మహావీరు లీ రోహిలా
ఖే, నా డాదిగ నందునందు వసులం దిం దుందు, రశ్వాధి రో
హానీకమ్మును వీరిలోఁ గలదు వీ రాపుత్రుల్ జమీందార్లకున్. 49

శా॥ మేరన్ మీఱెద ముప్పదుండియు నిజాం విశ్వప్రయత్నుండు కా
సీ! రాజ్యం బిది తెల్లవాని గరువ మ్మేపారునన్నాళ్ళునున్
జూజూతంబడు నానసాహెబుదణాన్ సుశ్రేష్ఠులై సట్టి మా
చే రూఢం బని రోహిలాళి ప్రకటించెన్ గుద్యపత్రమ్ములన్. 50

శా॥ దానన్ వీరల యాస్తి, వీరలకుఁ ద్రాతల్ గాఁ బ్రభుత్వాజ్ఞలన్
గ్రేణింపన్ సమకట్టు నిందు గల జాగీర్దార్ల యాస్తి న్నిజా
ధీనమ్ముల్ పొనరించుకోఁ బగతెఁ బ్రోద్దీప్తాంగ్లశిష్టి న్నిజాం
గానన్ బెట్టినదే ప్రసాదముగ నిన్ గైకొందు రీ రోహిలాల్. 51

క॥ ఈ రోహిలాలు తొల్లిటి
తీరున దోపిడులు సేయ తెగబడలేరి
కారణమున, లేమి న్ని
ట్టూరుచుచున్నారు కొలువ నొడయడు లేమిన్. 52

క॥ అని "ఖోలే" యుక్తులు క్రమ
మనుదానిమవండువిత్తు లౌరా! యని మె
చ్చిన బాబాకున్ జెప్పెఁ ద
దనంతరవిశేషముల కథాకథకు డిటుల్. 53

సీ॥ మడ్డి వోయిన నేమి మబ్బులోఁ దూఱుచుఁ
దికమక వెట్టెఁ జంద్రకళ, సుంత
బల మింక నున్నది చిలికించెఁ జినుకు తె
ల్లగనల్లగా నున్న మొగిలు ముదుక
గడపదనుక వచ్చి యడుగు లోనికిఁ బెట్టఁ
దడబడుచుండె శీతము, దివియల
పండుగ దవ్వున నుండినను టపాకు
లను ప్రేల్చఁదొడగెఁ బాలకజనమ్ము

గీ॥ తెల్లవాని నెదురగ నాళ తెగియుఁ బోదు
ముడివడదు, మదిమది లేదు పుడమి ఱేడు
నవనవోల్లాసరాత్రముల్ దినములు సర
దాలఁ బండింప శరదాలవాలమందు. 54

శా॥ పంటల్ పండును, పండ వొక్కపుడు, తత్ప్రస్తావనన్ జిత్తముల్
కుంటుం బొందవ యంతగాఁ బురములన్, గోర్గొన్న టుల్ పండె న
న్నింటం బల్లెలఁ, నొక్క పంట యది పండీపండ దాచు న్నవా
బింటన్ జర్చలు సాగె, లోని గదిలో నెంతెంతలో గుబ్బనల్. 55

క॥ ఆ నైజాం ప్రభు రెండవ
సూనుం డాఖ్యన్ 'ముబారిజుద్దౌలా' యె
ద్దానన్ జయములు దౌలా ?
వాని నెదుర్చి మన నెంచువాడే "యాలా". 56

మ॥ గుటి కన్మోసుక యేయు శిక్షితుడు 'మీర్గోహరలీఖాను' నా
నురు నాతండె, పులిం బరిన్ విడచి కేలుపొంగి చాచున్, ధృత
జ్వరమో! మెల్లని గుట్టుతో వెనకకున్ జార్గొంచుఁ బై రాద, యె
వ్వరికేం ప్రాణము చేదటే'యది యటే! పంజా యుడుం బేలయై.

మ॥ ఇత డెవ్వండు? వరుండు, భాగ్యపురిరా జేనాడు బాకిబడెన్
శతమున్లక్షలు రూక లీతనికి? నే సందర్భమునో జెప్పి భా
రతవిశ్వంభరయందు కల్యమున పాత్రం బట్లు! వీ డుండు? నీ
శత తేల్చున్ దెలివాని వెల్తు నను నా కాండీకు డాప్తాళితో. 58

క॥ నల్లి నెఱుంగని మన కి
వల్లడి యె ట్లౌదవె ! పరునివల్ల ననుచు తా
ర్యోల్లసితసఖ్యులన్ గని
సల్లాపించు నత డరుణచతురుచి యై. 59

క॥ దిగిపోయెను చార్మినా
రగపడియెను నభమునంటినటు రెసిడెన్సీ
భగభగమనియెను హృదయ మ
రుగడ యతడు తొలిఁ బలెఁ బితరులఁ జూచుటకై . 60

మ॥ రెసిడెన్సీగా గని బంట్లతోడఁ గొనితేరే రెండు ఘూకమ్ము లిం
దెసగన్ బెంతము వాని సంతు నని భాషించున్, నిజాంసేనప్రా
గ్రసరున్ లేఖని పత్ర మిచ్చి ధనసంఖ్యన్ వేసికోవే ! యనున్
వసతిన్ జేరును రేయి ఖాను డెపుడో ప్రస్విన్నకంఠాణు డై . 61

గీ॥ వెల్లకిలఁ బడి పైదన్ని కాళ్ళు పొర్ల
జాల దయి మూల్గు సింహమ్ము చార్మినారు
నస్వతంత్రభాగ్యనగర మడవి, గోలు
కొండకిల్లా గుహ, దదుక్తిగుంఫనమున. 62

గీ॥ రాడ్ఛవన మిదశే ! దీని రంగులోని
రవ్వవిలువసేయ నొక పరంగివిడిది
కనికరింప నిల్చుటయును కాదయేని
కూలుటయునకె ! యెంతటి గోడు వచ్చె ! 63

ఆ॥ వె॥ ఈ రమణ మొరసి ముబారిజుద్దౌలా ని
జానుగులకుఁ జెప్పె సాయుధముగ
నింగిలీషువాని నెదురించు షేర్వాణి
మొదలు నేడె, యిదియ మొదల యనుచు. 64

మ॥ ఒక దర్జీ రెసిడెన్సి ముందునత డేదో మాటపట్టింపుమైఁ
బెకలింతున్ భవదంత్రజాలమును పాపీ! యంచు నా ఖానుసే
వకుఁ దర్జించెను, వచ్చి చెప్పికొనియెన్ వా, డప్పుడే దర్జి వా
నికి బేడీల్ వడి కోటఁ జేర్పబడె, రానేవచ్చె హూణేంద్రుడున్. 65

క॥ మొనగొని వచ్చెన్ వెయిమం
దిని, కోటను చుట్టుముట్టెఁ, దెలిపెఁ బ్రభున కా
తనికొడుకుదుండగమ్మును
కనుకన రెసిడెంటు, మొనను గలవు ఫిరంగుల్, 66

క॥ ఒక బాణము రివ్వున వ
చ్చి కనిమసంగె నపు డాంగ్లసేనాధ్యక్షుల్
సకవచు డొక్కఁడె యొక డా
ఫ్రికాభటుడు పేర్చి మడమఁద్రిప్పించె మొనల్. 67

క॥ ఎటులో తండ్రి కొడుకు న
ప్పటికి చెఱల్ గొనియెఁ జెమ్మవాటినకనులువ్
దటుకున దూలెడి యొడలుల్
ఘటితగతన్మృతుల కయ్యెఁ గదలని మన సై. 68

శా॥పాలింపల్ దొడగె న్నిజా మగుచు శోభల్ దౌలగా "నాసిరు
ద్దౌలా" రాజ్యము నన్న, తమ్ముని యెడందల్ భారతప్రాజ్యమున్
బాలింపన్ దొడగెన్ బ్రభావరవితత్వం బౌ స్వతంత్రత్వ, మే
లీలన్ దాను కృతార్థు డౌటొ వల నల్లెన్ వాడు జై ల్వీడుచున్.

గీ॥ అన్నకు స్వతంత్రతా బుద్ధి సున్న, తావె
యున్నచో పీఠమున నదిరన్న! యనుచు
మీరుగోహరలీఖాను చేరదీసి
కొంద ఱాప్తుల నరబులన్ గ్రందుఁ జేసె, 70

గీ॥ గోలుకొండన్ స్వతంత్రతాబాల పుట్టి
యాడుకొనుచు చార్మినారునందుఁ జిక్కె
నాంగ్లునకు, మున్నవా రసమర్థు లగుట
నవతరించితి విడుపింప నను నతండు. 71

క॥ ప్రకటించిన జగడమ్మున
వికటించిన ఫలితమునకు వెలవక యాతం
డొక యేటి విడిభయిదు గో
లుకొండకిల్లా నెయిది వెలుపలికి దూకెన్. 72

ద్వి॥ రెసిడెంటు గూఢచారిని నియమించెఁ
బసిగట్టగ నవాబుపరిచేత లపుడు. 73

మ॥ కలమున్ వాడిసిరాను ముంచి యదిరా! కర్నూలు చాందానవా
బులకు న్నెయ్యమునీటిగాబులకు నా భోపాలు నాష్టుక నవా
బులకున్ మాసపుహాన్నరాబులకు వేఁ బుత్తెంచె లేఖల్ స్వచా
రులతో హూణులపాలనమ్ము నలుచూర్లం బట్టి ముట్టింపగా. 74

మా॥ ఇతడతడననేలా యొందఱున్నా రమీర్లున్
గృతమతులు వజీర్లున్ హిందుదేశమ్మునం దా
వితతివితతి కెల్లన్ వేగుఁ బంపించె నా యు
ద్యతుడు బల మిరాజారష్యాలునున్ బంప నొప్పన్. 75

చ॥ సరె యని మాటయిచ్చెను నిజాముపటాలము, హూణు డెవ్వడేన్
బిరుసునఁ దిట్టినం బడుడు, బీరము చూపకు, డందునందు రే
యరుగకు,డంచు ఖా నొసగె నాజ్ఞను,వానికి కంటినిండ ని
ద్దురయును వట్టెఁ,దిన్నదియుఁ దోడనె యొంటికిఁబట్టె నయ్యోడన్.

గీ॥ దాడి కిక రెండురోజులే తడవు కలదు
చారు లిరువురుమూవురు రార యికను
శీత మా యేటఁ గడు విపరీత మై శ
రీరములఁ గోసె రాంకవఖారములను. 77

గీ॥ హైదరాబాదనగరమ్ము కాదొ? యచిర
కాలమందు ఢిల్లీపురిగా నటంచు
నమకొనెడి వారికొక కొంత యాశపెట్టె
శీత మిరుచోట్ల నేకతాన్స్ఫీత మగుచు. 78

కం॥ ఎల్లెడ చంద్రిక విరివిన్
దెల్లని మొకమలుతివాచివిం బఱచినన్
బల్లిదుడుం గా లిడగా
నొల్లడ చలి కాటువేయు నుగ్రం బనుచున్. 79

ఉ॥ తెల్లనివానిలోపల గుదిఁగొను నల్లని బుద్ధు తొంచు ఆం
పిల్లెను చెట్ల నీడలు, రహించెను నల్లనివాని యాత్మలోఁ
దెల్లని భావ మౌచు హిమదీధితిబింబము, వీటఁ గాట నే
కొల్లసితంబు వెన్నెల యహో! విధి నవ్విన వెట్టినవ్వుగా. 80

గీ॥ ఘనభోంతరాళం బిది పొలము,పంట
పేరు కౌముది,యయ్యది విఱుగఁ బండి
నది,మనిసి ఘృణిసస్యమంజరికి మొనసి
సరుదుకొన్నాడు కాపలాచలి పులి యయి. 81

సీ॥ అది రాల్చె మంచిముత్యాలు కుప్పలుకుప్ప
లెత్తుకో నొక దోసిలియును రాద
యది క్రుమ్మరించె నిం తనరాని చక్కెర
సేకరింప నొక సంచియును రాద
అది వెదజల్లె చక్కదనాల మాలతి
పూలు పట్టుట కొక బుట్ట రాద
అది పిండిపోసె సహస్రధారల పాలు
నింపికో నొక్క గిన్నెయును రాద

గీ॥ అదియ వెన్నెల వెన్నెల యనగఁ,బ్రజల
కందియందనియటు చేసె నా యపూర్వ
చిద్విలాసవై భవమును శీతరాత్రి
దీని తలపండు సూర్యోదయానఁ బగుల! 82

క॥ ఉల్లమ్మున సహజవికృతి
కల్లోలము రేగ సైనికావాసమునం
దల్లా!యల్లా!యని యపు
డల్లాడని విధురు డెవడు? హైదరబాదన్. 83

క॥ అమ్ములు ము న్నున్న వమర
కుమ్మొత్తను శరముఁ జేసి క్రొత్తగ విసరెన్
గమ్మత్తుగ మదనుండు మ
రమ్మత్తును గోరె విరహిప్రజహృదయంబుల్. 84

పర॥ అట్టి విరహి యొక్కం
డిట్టుల విలపించెన్
గట్టడికి వశుం డై
పట్టణ మగమం బై. 85

చ॥ చలి యిది గాలి దూరుటకు సం దిడ కేకతనూస్వరూప మై
బలసినజంటపెన్నెడదపట్టున నెట్టుల దూటి చచ్చెనో
తెలియదు, తెల్లవారి గడె తీసినవేళకు బొట్లుబొట్లుగా
జలజల రాలు, నన్నిపుడు చంపెను చంపె మెహాందిదూరగున్. 86

గీ॥ ఓ! చెలీ! నన్ను నినుచేరకున్న బ్రతుక
నిచ్చునట్లు లే దీ చలి, యెట్లు వత్తు!
నేను, సౌఖ్యనిష్యందిని నీ మెహాంది
నెట్లు గాంతు, నీ రేయి నా కెట్లు గడచు. 87

క॥ ఉసిమియుసిమి పసిమిమిసిమి
కొసరు మరొక స్వర్గ మందుకొనెడి యదృష్టం
బు సురిగినది యోసీ! యీ
నిసి న్నిశా తెచ్చు సొగసునెఱవుల రాశీ! 87అ

ఆ॥వె॥ చర్మమునకె తగును చర్మమ్ము నోదార్చ
యిగముతీపి ననుభవింపఁజేత
చెలువ మేది! యున్నివలువలో నొగి గ్రుచ్చు
కొనుట తక్క, మధువు కొంత మేలు. 88

మ॥ అని బెగ్గిల్లి నిజామునై నికు డతం డా రేయి మూల్యమ్ము పో
చ్చిన విస్కీ నొకచిన్నెదాని గొన వచ్చెఁ గొట్టు, కార్మ్రియుతో
డను పానావధి వార లాడుకొను మాటల్ పహాణచారుండు త
త్రనియుక్తుండు వినెఁ, బడిన్ జనె, నిజాధ్యక్షున్ గనెన్, వాకొనెన్.

క॥ అత డాష్టనుభటవేష
స్థితు డాంగ్లుడు చారు డభ్యసించె నురుదు, వా
డు తమ జనంబే యనుకొని
కొతుకర వీ రిరువు, రిటులు కోల్పడు జతనల్. 90

క॥ అరుగనటు లెటకు నిలు విడి
సొరిది నిరు దినాల్ ముబారిజుద్దౌలాచే
వరి యాదిష్టము నిన్నను
దొర!యిటులు న టంచు వేగు తోడ్తోఁ దెలుపన్. 91

క॥ బ్రతికించి తీవు మన సం
తతి,నధికోద్యోగవిభవతరళము నీ జీ
వితమిక హిత! యని మరి యే
మొ తగన్ రెసిడెంటు పలికి పుచ్చెను వానిన్. 92

శా॥ కారన్ ఖానుడు గ్రుమ్మగునాళ్లు సితపక్షం,బీవల న్నిల్చెనా
యా రే లన్నియుఁ గృష్ణపక్షములు,నే డాతం డకారాస్థు డై
మేరన్ మీఱక గాలివానమొద లున్మీలించు సృష్టిస్థితిం
బాఱాడించిన హేతువున్ దెలిపె నాంగ్లత్రాత ముఖ్యాళికిన్. 93

ఆ॥వె॥ చలువచేసిన తెలివలువ గట్టుకొని పూ
ల్లవము మెఱయు నీలిరవికె దాల్చి
తనను తాను చూచుకొనుటతో సరిపోవ
ప్రకృతికాంత కెఱ్ఱవడియె కన్ను. 94

ఉ॥ పల్లజడల్ వహించు యతివత్కృతవేషజనద్వయమ్ముతో
తెల్లదణాయ దూడిపడి తీసెను వారలనుండి లేఖలన్
డిల్లము నొంది తేటి రెసిడెంటు నిజాంకడ కేగుదెంచి యా
యుల్లిఖితమ్ముఁ జూపె నట నుండిన పెద్దలు దద్దరిల్లగా. 95

క॥ ఓ!రాజా!చందూలాల్!
నేరవా?నీ వేమి దీని,నేముందువు?నా
నేరను నీ ఖానినను హు
జూరూ!యని ముఖ్యమంత్రి చుమ్మలుచుట్టెఁ. 96

క॥ ఆమరణమ్మును ఖైదీ
గా మనె డకోల్కలుకొలఱకు గడగి గోహారా
లీ,మృధమున కర్నూల్పతి
ఖాముులఁ బడె నని పినాకపాణి వచించెఁ. 97

క॥ ఎంత పని జరిగినదయా!
యెంతటి పౌరుషము గలది!యీ హైదరబా
దంతయు వినిచిన నీకు న
మింతును,జాగరిత నైతి నే ననె బాబా. 98

క॥ అంతయు వినిచితివా! నీ
కింతకు రెట్టింపు కలద, యిక వినుమ యెఱిం
గింతును హైదరబాదా
క్రాంతికళాఖండ మనుచు కథకు డిటు లనెన్, 99

క॥ అది వే, ఇదివే, ఇది ప్రజఁ
గదలించెను గొంత, పేరు గన్నది గోల్కొం
డధర మగరతనముల కని
విదిత మ్మీ యుద్యమమ్ము వెలయుటకతనన్. 100

ఉ॥ సూదులుగా మొదల్ మొలిచి, సుత్తున గ్రుచ్చియుగ్రుచ్చి చాకులై
నైదునునాలురోజు లయినంతనె బాకులునై క్రమమ్ముమై
ప్రోదిగొనెన్ గుతారములు గ్రోవులు నౌచు,శతఘ్ను లౌచునున్
జాదుకొనెన్ సహస్రకరచండలసత్కిరణప్రకాండముల్, 101

సీ॥ ఖరకరకరములు గడ్డపాఱలు,ధర
ణిన్ వాని ఘాతాన నెఱెలు పడియె
యొకచోటఁ బడిన యగ్నికణము గాలి రా
జుకొని వాడనువాడఁ జుట్టుముట్టె
కాము లేని గొడుగు కరణి గుడిసెకప్పు
సుడిగాలి కల్లై మి న్నొడిసి తిరిగె
మ్రాని కొమ్మల గుబుర్లన్ దాగికొన్నడే
గలును వేడిమికి వగర్చి రాలె

గీ॥ కుండలో బోసి తడివల్వ నిండు చుట్టి
వను జలము చల్లబడకయుండె నొకపాటి
కంబువుల గడియగడియ కాని వడకుఁ
దట్టుకొనె నెట్లొ జనము తత్కాలమందు. 102

ఉ॥ ఎండ వినా పగ ళ్లగుచు నెంతయు వీచియు వీచి వీవనల్
తుండెము లైననుం బయర తోడెము సాగగ నీక బట్ట పై
నుండగ నీక చైళ్ళ వలె నుండె సెగల్ పొగ లీను రేలు, రే
యెండయు వచ్చినప్పు డొక యించుక నీరము చల్లె నిప్పపై.

క॥ గ్రుక్కెడు నీటి నొసంగద
యొక్క తటాకమును గుంటయుఁ బందిగమం
దుక్కిరిబిక్కి రగు జనుల
కక్కడి యధికారి బలె నన్నార్ద్రహృదయ మై. 104

ఉ॥ మల్లెలఁ గ్రమ్మఁ మ్రోలించి తలిమమ్ముల పైఁ బొరలాడువారు, మై
నెల్లెడ సింహశైలహరి కె ట్లటు చందనచర్చ యొప్పవా
రల్లడతల్లడై రనగ నప్పటి తీండ్ర వచింప నచ్చులున్
హాల్లులు గావొ పొల్లులు, నఖఃప్రజ లందఱు తత్పరీతతుల్. 105

ఆ॥ తోర మొచు దప్పిక నీరు దూగ మొచు
దానిఁ జేరుకొఁజాలక దారినడుమ
పథికు లొక కొంద ఱురిదీయబడిన యట్లు
పడిరి తత్సమయాతపప్రళయవేళ. 106

చ॥ ప్రళయము వచ్చినన్ సొబగు వారణసిం బొలివోవ కల్లె యుం
టలు వినుపం బురాణములు నమ్మరు పెక్కురు కర్ణసాత్వ్య మై
కులమత భేదవాదములఁ గ్రుంగక హైదరబాదవీడునన్
మలయు జనైకమత్యమును నమ్ముదు రెల్లరు నేత్ర సాత మై.

సీ॥ జరిపించును నిజాము జపహోమతర్పణా
ధ్వరముల శివకేశవార్చనముల
నయ్యా లెందలొ యద్ది ముద్దమ్ము పీర్లకు
మొనసి చెల్లింతురు మ్రొక్కుబడుల
మియ్యా రెందలొ దాన మిత్తురు ద్విజులకు
బ్రాహ్మలగ్న మహూర్తవాస్తుమతులు
ఉభయోత్సవములందు సుఖయులు మెరవణి
నురవణించిన వేడ్క బెరసి యుంద్రు

సీ॥ నొండొరుల పండుగలయందు నురము నురము
నొరసికొనుచు, లేనవ్వుల దొరసికొనుచు
నరసికొనుచు బాగోగుల, వెరసిజనము
పొలప మొందు హైదరబాదపురమునందు. 108

క॥ భాయీ!యని పిలుచు, హామా
రా యని పేరు గొని పదుగురకుఁ జెలిఁ జేయున్
సాయబు రావును, గలవు త
దీయగృహము లొక్కపేటఁ దిలతండులతన్. 109

చ॥ ఒక తళియన్ మిఠాయి నిడి యొక్కరి కొక్కరు ముక్క నందజే
సికొనుచు, నంతకున్ ఘనము చిప్పిలు మాధురిమై ఛలోక్తు లా
డికొనుచు, నంతకన్నఁ గడు దీయము సాయ మొనర్చుకొంచు, బీ
ర్లకుఁ బలుఁబొమ్మతీర్లకు సలాముల మ్రొక్కులఁగూర్తు రందఱున్.

ఆ॥వె॥ ఒకరి మంత్ర మొక్కరికి చెప్పుకొనుచుండ్రు
యంత్రతంత్రవినిమయమ్ముతోడ
దొడ్డనిష్ఠ నెసగి దుర్గను దర్గాను
కొలుచువారు దగరడులుచువారు. 111

ఆ॥వె॥ ఒక్కచెట్టుపువ్వులో యన వికసించి
యలరు భాగ్యపురజనాళి కెంత
యుమ్మ యేని దుర్భర మ్మనిపింపద
యేకమతులతోడ మృతియుఁ బెండ్లి. 112

శా॥ లీలన్ దెల్పుచు గొట్లు వైదికులు మౌల్వీల్ బాహువుల్ వీవగా
జాలుల్ రెండును నొక్క శైలి యొసగు చంచద్వీచికాచారిమం
బాలోకించెను భాగ్యపట్టజన, మాస్వాదించెఁ బ్రాలేయకు
ల్ఫీలాయాతశుభాంబుపూరమునుగాగీతాఖోరాన్సారమున్. 113

మ॥ అలరుఁదండల నైకమత్యలిఖితం బౌ చీటితోఁ గ్రుచ్చి వ
త్తలకున్ వైచిరి రచ్చలందు, గళముల్ తద్వాసితంబుల్ సరే
గళనాదంబు పరీమళించె, నొడువంగారాద జర్దా న చౌ
టు,లదే చెప్పెద, గుండె లత్తరుల గుండాల్ గోలుకొండప్రజన్.

క॥ పండితులను ప్రకచ్ఛందన
మండితులనుఁ జేసి కొంతమంది యమీరు
ద్దండులును 'మిలాదున్నబి'
పండుగ జరపుకొనినారు భాగ్యపురమునన్. 115

గీ॥ తేనెబుడ్లు మామిడిపండ్లు, తిరుగనీక
మెడ నలము మల్లెదండలు వెడదగంప
లందుఁ దెచ్చి సన్మానితు లైరి ఖాన్లు
శంకరజయంతినా డొక శాస్త్రియింట. 116

క॥ ఖానులలో 'తుర్రేబాజ్'
ఖానున్, మౌల్వీలలో నొకండఁ డల్లావు
ద్దీనున్ భాగ్యనగరరా
జ్యాన ప్రజాశౌర్యగాథ నాదిమగేయుల్. 117

క॥ ఆ సమయము స్వాతంత్ర్యమ
హాసంయచ్ఛంద్రహాసహాసమయము, 'నా
నాసాహెబుబహదూర్షా'
లా సమరము నందుకొఁ బిలచి రిచటి ప్రజన్. 118

శా॥ ఢిల్లీనుండి నవాబు కందినవి నాడే నాల్జతల్ గాజు, లీ
యల్లా మెచ్చిన యుద్ధరంగమున నోరబ్బీ! యరబ్బీల్ దుముల్
చల్లం బోరి ఫరంగి నేయుము, కలేజా లేదొ కాన్కన్ గరాం
చల్లీలమ్మగఁ దాల్పు మంచు బహదూర్షాపంచినాజాబుతో. 119

ఉ॥ గోడలపైని లిక్కు లివిగో! యన నొప్పిన వక్కరమ్ము లె
గ్గాడుచుఁ భారతంత్ర్యమున, కాంగ్లుల నొల్లమి నొల్లకుండు వా
డేడో తదన్వయమ్మున ని చేడు నచేడు తరాలు నారకుల్
వా డిరుకాళ్ళగొడ్డు విబుధాగ్రణి యైన న టంచు ఘోషిలెఁ.

గీ॥ హూణులను పంపివేయుట కొప్పడో! ని
జాము. వాని యధికృతి కొక జాము గడువు
మరియొకండు తల్పితిపై మనుచునుండు
గండు డని వ్రాత పాదుషాజ్ఞ ప్రకటించె. 120

గీ॥ కదలబాఱె మౌల్వికి నా ఖానునకును
మనసు, వలచేతి గిఱక కి ట్టనుచు మ్రోయ
వీథివీథి మేల్కొల్పిరి వేకువన్ ఫ
కీర్లు దేశభక్తుల గేయకీర్తనమున. 121

క॥ కాకా, కా కా! యనుచున్
లోకుల బ్రతిమాలె కాకులున్ గానేరైరై
రాకృతిగొన్న స్వతంత్రతా
కాంతు లనంగఁ గొంద రాహవబుద్ధుల్. 122

గీ॥ కనులు విచ్చి ఖాన్ మౌల్వీలు కలయఁజూచి
రొకడు వచ్చి తాంత్యాలిఖితోత్తరమునఁ
దిరుగబడెడి సైనికులకు నురి దగిల్చె
వాంగ్లపతి వికారాబాద నని వచించె. 123

ఉ॥ చించెను ఖాను ఖడ్గమునఁ జేరువ వ్రేలు పటమ్ము నొందు,గ
ర్జించె నిజాము కా దతని సేనయు కాదు కదా సమస్తకా
ష్ఠాంచలవల్గదాంగ్లబల మడ్డినను ఁబవలింట నేడు కా
వించెద మర్విమట్టముగ నీ రెసిడెన్సిని పౌరు లౌ ననన్. 124

క॥ ఏ మన్నాః నాస మౌల్వి
యే మన్నావో యనినావు, హితులం భటులన్
నోమింపింపుము శస్త్ర
స్తోమముతోఁ గవచ మూని తో డైతి ననెన్. 125

గీ॥ పట్టుదల గండుచీమల పగిది గలరు
రోహిలా లైదువందలు రోహితాతు
లరుగుదెంచి రప్పటికవు డాయుధికులు
కాకిచే కబు రంపెనో ఖాను లేదొ! 126

గీ॥ తనరు మౌల్విహాయము చిఱుతపులివన్నె
ఖానుతేజి వాపవనీలకళ విరాజి
అచ్ఛములు మిశ్రములు రంగు లన్ని కలవు
తకుక్కవారి హాయములు లయతాండవములు. 127

మ॥ ధృతశీర్షణ్యాతనుత్ర మై కటితటీదివ్యద్ద్వినిస్త్రింశ మై
జతగుం ఢ్లేయు తుపాకు లొప్ప బరితో జన్ దెంచె నా విక్రమి
ద్వితయం బతుల జోతు లారతులుగా వేలాది నారీనరుల్
నుతియింపన్, రెసిడెన్సి ఢాంకృతుల నాందోళింపఁ గుల్బాగునన్.

సీ॥ చదర మయ్యోను కొంత శాల, మా ఊసియు
రెసిడెన్సిఁ జెక్కురు ప్రీలి పడిరి
మా సేన నిపుడు నమ్మఁ జనదు, పిల్పించు
కొనుము నీ వారి నం చనె నిజాము
గుండియ లలుచేతఁ బిండికొనుచు రెసి
డెంటు దాగికొనె లోయింటి మూల
నింటి కప్పులపయి కెక్కి జేకొట్టిరి
నేల చాలక ప్రజల్ వేలమంది
గీ॥ హారనిటాల మనఁ బటాలఁ మైదువేల
మంది 'బోలారము'ననుండి మట్టువెట్ట
బడనియటు ఖానునుండి తద్భవనమును ద
దధిపతిని గాచుకో నప్పు డవతరించె. 129

గీ॥ కదలె సైన్యము రుస్తుముఃఖానుకొడుకు
బారినుండి స్వజనముఁ గాపాడుకొనగఁ
బచ్చినల్ల ద్రావునది బొంబాయినుండి
యచ్చు డీల గుం పది సహస్రోచ్చసంఖ్య. 130

గీ॥ ఒక్క దేశీయభటునేని యొప్పికొనక
యందఱను నిజదేశ్యుల నట్టిపెట్టి
కొనుచుఁ దన చుట్టు వాకిలికోపురునుండి
యరుణకిరణమ్ము నపుడు చూచె రెసిడెంటు. 131

ఉ॥ పట్టణ మెల్ల దూకి మనపై బడునో! జటప్రోలురోహిలాల్
ముట్టడివేయ వత్తురో! సమూర్తులు ఝుంఝులు, తుత్తైబాజూఖాజా
గిట్టుట యెట్లటంచు వడకెన్ రెసిడెంటు స్వకీయ సేనలో
నట్టనడిన్ వసించియు, దణాయడు మౌల్విని పట్టె నెట్టులో. 132

ఆ॥వె॥ చిచిచిచిక్కినాడో! శిశిశిష మౌల్వీక
టం చను రెసిడెంటు కా దణి యనె
పంతు మండమాను, కంతటన్ ఖానును
వెదకఁ బంపినాము సదనుగులను. 133

గీ॥ మరియు ననె వాడు ప్రకటితసరణి రూక
లిచ్చినాము నర్వేలు మౌల్వినిపట్టి
యిచ్చినతని, కా ఖానుఁ బట్టిచ్చునతని
కీయవలె నల్లె, యదియును డాయు ననుచు. 134

శా॥ ఐదార్వందల తద్భలమ్మొ సరిపో నై యుండె, గానీ బహిః
ప్రాదేశాగత మయ్యె సైన్యము ద్విషత్ప్రతమ్మునన్, షట్సహ
స్రోదీర్ణమ్ముగ దండు కావలయు,చారున్ బంచి యా ఖాన్ మడీ
నాదారిణ గనులుంచి వేచె నొక వన్యన్ జైత్రజన్యమ్మునై .135

సీ॥ పిలిచికొను నెట్టనేల పడిన నీటి
నటుకాలి కంతగా బురద కాదు
నొక్కొక వృత్త మొక్కొక కుటీరంబు, త
చ్ఛాయ నిల్చినఁ బైని జల్లు పడదు
మందలింపులు లేవు, మందడివని లేదు
కొల్ల పచ్చికసవు గుత్తములకు
జానలు కలివెలు జంబూఫలంబులు
వెలగ లింతింతలు కలవు మెండు

ఆ॥వె॥ మొగిలిగిద్దయడవి మొగలాయియొడయని
నగరి కెంతొ దవ్వనందు లేదు
పిండివియ్యములును వెలినుండి వచ్చె న
య్యడవి దాగికొనిన యందఱకును. 136

ఆ॥వె॥ మొగిలిగిద్దయడవి మొనసి గ్రద్ధయు దూఱ
రాని యడవి, యందు ఖాను కల డ
టంచుఁ దెలిసి రాదడమ్ము గుబురుగుబురు
పొదయుఁబొద గదల్చి వెదుకఁ దొడగె. 137

చ॥ కనపడె నొక్క గుట్ట, మటుగాఁ జనఁ ద్రోవను గుట్టుగుట్టు మం
చనె నొక కుంజ, మౌర! పులిరా! యని వెన్కఁ బోయె సైన్య, మం
తన యదె తోఁచె గుట్ట మిరుదండల కత్తులు గుండ్లగుత్తులున్
బెనసి, తుపాకితో పులినిమించినవా డగుపించె దానిపై. 138

ఆ॥ వె॥ వాలకమ్ము చూచి వాని ముఖము చూచి
తుర్రెబాజుఖాను దొరికె ననుచు
బారుచేసి క్రోవి పగపౌజు తలపడె
వచ్చినదియు ఖానుబలగ మపుడు. 139

మ॥ ఇరువేనా లరుదెంచె నచ్చటికి, నందేనేగురున్ జోదు లుం
డిరి, తద్వావాకులుం బదార్వురు బలుల్, డీకోలుమై రాచపో
టరులన్ గాల్చిరి ఖాను సాయముగ తూటాల్ వట్టిపోయెన్ గటా!
యరి సైన్యార్ధము గోలుపోయి పురిపద్యన్ రోయుచున్నంతలో.

ఆ॥ వె॥ ఇక తుపాకి ప్రేల, దిది కనుగొని వారు
వీరి నేయ వీరు విరిసి పాఱ
నొక్క ఖాను క్రోవినొడుచునె ? చంద్రహా
సమున నెంత కలను సలుపనేమి. 141

గీ॥ పడిన ఖానుని గొని రాగ భాగ్యపురము
తల్లడిల్లిన దానాడు, స్త్రైణజనము
శుక్రవారముగడప నక్రువునఁ గడిగె
బొప్పసి క్తము బురఖాను పతుల కిచ్చె. 142

మ॥ మఱువగలేము ఖాను నొకమారు పరాకున జూచినన్ మహా
ద్వర! నిను నేడు చూడగనె వాడు స్ఫురించెను, డాకమంబొమన్
దరవళికోతగుర్తు గల దాతనికిన్, మరి మోము పోలికన్
దిరుగుడు కద్దు, కాని యొుకటి రగు తేజులు నీది వానిదిన్. 143

గీ॥ చెమ్మగిల్లిన కనులతోఁ జీది యెంత
యెంతవారు పోయిరి దేశ మేమి యగునొ !
తెలియకున్నది స్వామీ ! కథింపు మనుచుఁ
బలుకు బాబా.కనెఁ బినాకపాణి మరియు. 144

సీ॥ ఉన్న దంతయు నిటనుండి యున్నది హైద
రాబాదశూరుల యమరగాథ
పట్నమందున గాక ప్రాంతమంతయు విర
బూచినట్టి కడిమి పూల గాథ
యితరస్థలమ్ముల నెసగిన దెల్ల నొ
కెత్తు ని దొక యెత్తు హీరగాథ
ఘనము లై జనములు గర్జించినట్టి గా
థ, యిల దిగిన యింద్రధనువుగాథ

గీ॥ మింట మెఱుపులు మార్తుర యొంట నెఱుపు
లింట నింట నేతల జయ మెంచి యఱపు
లొంటరమున నిర్దెగకత్తు లొత్తి యొఱపు
లొడలు గరుపొడిపించిన గడుసుగాథ 145

క॥ దీనిని చక్కగఁ జెప్పం
బూనుట యొక దొడ్డకావ్యమును వ్రాయుటయే
యౌను, కథించెద టూకీ
గా నా నేర్చినకొలఁది కతిపయచరితల్. 146

శా॥ సాలార్జంగు ప్రధానమంత్రియును, రాజ్యంబేలువా డష్టులు
ద్దాలాయున్, బ్రిటనీయపాలనరథత్రాణంబు తత్ప్రాణముల్
కీలిన్ గాంచిరొ యీ రథమ్ము దెసగా, కిలించిరో వానసర్
దోలుంసిద్దెల నీరు నింపుకొని సిద్ధుల్ వీరు చల్లార్పగా. 147

క॥ అకులములు వాహినులు ని
వాకాగ్రామామకరనికరావృతి నిం
దేకాదశకేంద్రములు న
నేకసహస్రాంగ్లవాహినీసంకులముల్. 148

క॥ షోరాపురిపతి పరహ్మా
న్నారాచము 'వేంకటప్పనాయకు' డొకడే
పోరాడె స్వతంత్రతకై
సారబలము తోడ ప్రజల సాయముతోడన్. 149

చ॥ అది పురి కేంద్ర మై తనర నందు విరాజిలు నైదువేల తె
ల్లదళము, పంచవింశతిశరత్తుల నాయకు డందుఁ గొందఱిన్
జదిపియు మించి రాగ విధి సాలరుజంగుకు భాగ్యవర్తనీ
పదవమునందుఁ జిక్కి యనుశాసితు డయ్యెను బందెకానకున్. 150

గీ॥ వినుచు శితును దన్ను దా బ్రేల్చుకొనియె
నాయకుండు రైఫిలున నంతట నట నఱ
వఱ లయి పఱచె రోహిలా లరబు లాఫ్ఘ
నులు కొలకొలమనెడి వాని బలగ మెల్ల. 151

చ॥ త్వరపడినాడు నాయకుడు, తా ఖయిదీ యయి వేచియున్నచో
తఱిమెయి రాదొ మేలు, శరదన్ గృశ మయ్యెను వార్ధకస్థితిన్
కరము విశంకటం బగును గాదె ఝురం బనినట్టి శ్రోతతో
నెఱుగవొకో! మనోబలవిహీనుల దేహబలాఢ్యులందునున్. 152

గీ॥ అనుచు వెండియు నిటులు వాకొనియె వక్త
ఘోరపూర్ణ డిమింట నుంచుకొని కన్న
డు లటునుండి మరాటివార లిటునుండి
చెలగి యెదిరి నొత్తెడి పూన్కి కలసిరాద. 153

గీ॥ కలసిరార యెల్ల రొకటఁ గలహమునకు
నావురావు రన్వించియు నరిచయమ్ము
నొక్కడే దుర్గమును బట్టి యుక్కడంగె
భీమరావుదేశాయి యన్ బిరుదుజెట్టి. 154

ఉ॥ ఏకమతిత్వమున్ గలుగ నేమి జనమ్ము! ఫలప్రదాన సు
శ్రీకము గాగ వాడుకొను చేతలు లేనపు డయ్య దుండియున్
లేకునికే గదోయి! కవిలెన్ గల వెన్నియొ వేలు చూచుకోన్
రూక వసూలుకా దవసరోన్ముఖ మై, యివి రెండు నొక్కటే.

సీ॥ చెలువుత్రవ్వక మని చెప్పి "నర్గుండి" జే
డు నితండు కూర్చిన జనము కలదు
తత్పుష్టికై ప్రభుత్వపుగోశముల నూళ్ళఁ
బడి దోచుకొనిన పెన్గొడమి కలదు

నూర్ల మందిగ జమీందార్లు జాగీర్దార్లు
కలసి పోరుద మన్న కట్టు గలదు
చిటికెలోపలఁ గ్రోసు చెంగలించు హుమాయి
గుంపు నాయుధముల సొంపు కలదు

గీ॥ నిట్టి వెల్ల నేమయ్యెనో! యితడును మరొ
కొండు నిట్టిడు "కొప్పలు' కోటపట్టి
కొనియు నందె మ్రగ్గి రకట! ఘోరమార
ణాస్త్ర మయి చుట్టుకొన నసంఖ్యాంగ్ల సేన. 156

క॥ ఆ నిర్గుండపురపతియుఁ
దా నెత్తురు ప్రొద్దువఱ కుదయము మొద లవ
ర్ణ్యానీకమ్మున నొక్కం
డే నిలచి పెనంగె నయ్యో! యేమయ్యెనొకో ! 157

గీ॥ ఇనుకబస్తాలు రెసిడెంటు నింటిగోడ
కాన్చినవి యాన్చినట్లె భాగ్యపురి నుండె
నే ఫిరంగి యే నిముసాన నెడరు తెచ్చు
నో యటంచు వాకిలి దాని కొకటె కలదు. 158

ఉ॥ ఒక్కటి కాదు వాకిళు లొకొక్కని కొక్కటిగా బడాళ్ళ నల్
దిక్కులనుండి లోని కరుదెంచి మహాసభ సేయఁ గావలెన్
బెక్కులు, దేశభక్తులకు మిక్కిలి ముఖ్యము బోధ మిట్టి స
మ్యక్కలితమ్ము పట్టణముమధ్య న టంచు నొకండు వాకొనెఁ.

గీ॥ ఏడు రెసిడెన్సినిన్ గొట్టలేడొ వాడు
నన్ను కొట్టజాలక యోడినట్లె నాకు
దూఱవలయు నా కాలిక్రిందుగ నతం డ
టంచు నొకడు సంభాషించు నచ్చటచట. 160

క॥ "సోనాజీ"పండితు డత
డే, నడచెన్ భాగ్యనగర మెడసి నిజాం ఫ
ర్మానాన్ దనజాగీరున
కైన నతని మతిక లత్య మా రెసిడెన్సీ. 161

క॥ ఎందఱికో నేతల కెద
విందుగ "పంతుప్రధానపిష్వాబహాదూర్
ధోండోబాజీరా" విట
కందించెను లేకలన్ సహాయుల ద్వారా. 162

క॥ ఆ నానాసాహేబ బన
ప్రాణమ్ము 'గులాముఖాన్ ''సఫదరుద్దౌలా'
సోనాజీరావ్‌రంభా
ద్యానేకుల, కతని మాట అమృతమువాటా. 163

శా॥ నీరుంగూడును విస్మరించు కులకర్ణిస్వామి యున్నా డొకం
"డారే! భారతకేలియే" యనగ, "ఆయా భాయి! దేనే తయా
ర్మేరా ప్రా"ణనువాడు రాలు పిడుగుం బిట్టం బలెన్ బట్టు పుం
స్కారం బొప్పినవా, డకోపనుడు రంగారావుపాగే యనన్. 164

మేదిని॥ ఒక కులకర్ణి ఖ్యాతి కలడోయి! పట్టునకా వా
ని కుడుము పోటివచ్చియును నెగ్గ, దూపిరిన్ గొం
కక భరతోర్వికై ముడుపుగట్టె నాత, డా ధై
ర్యకవచధారి నామమున రంగారావుపాగే. 165

గీ॥ ఎంతకైన నధికారిని నే నటంచుఁ
దెలుపు గాని భావమును బందెనిడలేదు
వాని వదనము, తెల్లని పన్ని పాలు
నల్లనివి నీళు లనుకొను నతని మనము. 166

చ॥ మనసున దాగి వెల్వడని మానవదానవతత్వ మొండు త
క్క నిఖిలసృష్టిలోని యుపకారవిభాగము చేయనట్లెచే
సిన యవమానమున్ దెలియుఁ, జిత్తవికారమునిల్వయుండ దా
తనికిఁ, దపస్థితిన్ విరియుఁ దన్మతి మల్లియ వోలె మిత్రమా! 167

మ॥ బ్రతుకన్ జాలడ హాస్యదైన్యమున, నెవ్వ న్నవ్వుతో మోయు, సం
తతమున్ మన్నన నెక్కి సాగు నది మేనా గాగ, దేశస్వతం
త్రతకై రూక శతమ్ముగాఁ గయికొనున్, బట్టింపు వచ్చెన్ శత
క్రతువున్ బట్టుక తిట్టు, నా కరణ మగ్రశ్రేణి కాత్మీయుడున్.

క॥ సోనాతీయు త్తరమును
నానాటి కందఁజేయ నడచెను పాగే
కాననమున ద్విగుణ శ్రీ
కాననమునఁ దనదు పొలమునం దెటు లటులే. 169

క॥ తిన్నాడో తినలేదో
యెన్నో రేలుం బవళ్లు నెవ్వరితోడన్
దన్నున్ జెప్పికొనక నడ
చెన్నడచె నతం డరణ్యసీమాధ్వములన్. 170

సీ॥ ఏ మెఱుంగని యల్లె యెసగి గోతులుదీయు
మనసుల నరి యూబులను త్యజించి
పొడిచిపొడిచి చూచు బుద్ధుల కాకృతి
దిదు ముండ్లపొదల వాద్దుఁ దెలిసి
దరిజేరువారి నంతముసేయు గండశి
లల వంటి కొండచిల్వలకుఁ దొలగి
తన లోహితోష్ణిషమును మాంస మని యెంచి
తలదన్నవచ్చు గ్రద్దల నదల్చి

గీ॥ మెలుచుకొని చంపు పొర్లుకాడులకుఁ దలగి
తనదు నుద్యమవాసన తగిలెనేమొ!
కదియక సరించు వన్యమృగాల మెచ్చి
యావగల దాటి యతడు గమ్యమ్ము చేరె. 171

గీ॥ చేరి చేరెడుకనులకెంగీలవాని
సారవాణి వ్యూహమ్ముల సర్వసైన్య
నాథుతోడఁ జర్చించెడు నానసాహె
బును నమించి యా పాగె లేఖ నిడి వేచె. 172

శా॥ యావద్భారతనేత్రపర్వముగ మంచారూఢి స్వాతంత్ర్య మౌ
నా!పీడే తగు నిచ్చె నై యనుచు నానాసాహెబున్ జేతి ని
ద్దావా లద్దముగా నొసంట తిలకాధానమ్ము సేయంగఁ బా
గే వీక్షించుచు విస్మరించె గమనాకీర్ణామితాయాసముల్. 173

ఉ॥ కూరిమి నానసాహెబు సఖుల్ సుఖులే!యని తచ్ఛృఖల్జ్ఞి దై
భారతమాతృశృంఖలలపైఁ బడు వ్రేటులఁ జెప్పి మాటలన్
బేరనుబేర నెందఱినో పేర్కొని లేఖలు వ్రాయఁజేసి ద
స్తూరికిఁ గ్రింద దస్కతును తోపుసిరా నొనరించి యందిడెన్. 174

శా॥ హే!పాగేకులకర్ణపూర!కులకర్ణీ!రంగరాయాగ్రణీ!
నీ ప్రాంతమ్మున దండు గూర్చుకొని దండింపన్ గదే!మార్తు, నీ
నా పేర్కొన్న మదాప్తరాజికిని సోనాజీకినిన్ జెప్పుమి
ట్లే పోగా నని పీనిచే నతడు కీలింపించెఁ గెందామరన్. 175

గీ॥ అ మ్మహాపురుషుండు త న్నాదరించి
నొడివినతడవు పుట్టుకతోడవు గాఁగ
సెలవుగొని వాని యిడిన జాబులను దాచు
కొని వెడలెను పాగే తన జనముఁ జేర. 176

గీ॥ పెద్ద విసరి క్రోతులను కవ్వించి తద్ర
దప్రదర్శనమున జోడు తాను నగుచు
నిరువదేడులవా డయ్యె నిల్లుచేరు
నపుడు నలువదియేండ్లప్రాయంపువాడు. 177

గీ॥ ముప్పదిసెకండ్లె యయ్యె నిముసమునకు,స
గమునకుసగమ్ము తగ్గె మార్గమ్ముపొడుగు
ప్రకృతిపచ్చదనమ్ముఁ గాపాడు మొవ్వ
నవ్వతోడ వా కులకర్ణి నడచునపుడు. 178

ఆ॥వె॥ వచ్చి యుత్తరమ్ము నిచ్చి సోనాజీ క
తండు తక్కువానిఁ దక్కిన చుఱు
కరుల కందఁజేయఁ గానలోఁ బడిపోయె
భాగ్యనగరమేగు పథముఁ దప్పి. 179

చ॥ చినిగిన దయ్యు పాగ విలసింప జగాసరిగంచుతో బిగిం
చి నెగడు తీయ నా తలపుచేఁ బలదంగుళి యాచు నేగు పా
గెను పయిదూకి దోచుకొనెఁ గిలితఖడ్గమలిమ్లుచాళి, పో
రెను తలసొరు,జోడునకు నీ డగు పైయుడు పూడె,సంచియున్.

ఆ॥వె॥ కోటుతోడఁ బోయె తూటాలు పిస్తోలు
కాసెతోడ చిన్నకత్తి బోయె
పొదలచాటునుండి పదిమంది పైబడ
తగిన శాస్తి చేసె తన పరాకు. 181

ఉ॥ పూనడు చింత యిన్నియును బోయిననున్ దులజాపురంపుశ
ర్వాణికి మ్రొక్కుదీరిచినపట్టునఁ బూనిచెఁ దల్లితండ్రి షే
ర్వాణిని,తండ్రితండ్రి యిడె పాగను తా కరణమ్ము కాగనే
కానుక పేరు నిల్పు మని,గాసిలె నాతడు వీనికై మదిన్. 182

ఆ॥వె॥ ఉత్తరములు బోయెనో నానసాహెబు
నింక నొక్కమారు నేగి మ్రొక్క
వచ్చు నవ్వి,యివ్వి వచ్చునా! యందునుం
బాగ చుట్టుకొనియెఁ బ్రాణమునకు. 183

మ॥ అది పోవన్ దల యుండి యూడినటులే యై యద్విధావీర మే
ని దినన్ మాన్కొనె నాటి పూట,ధన మున్డెన్ గోచిలో దాచుకొ
న్నదిగా నైదువరాలమూట,భళి!రంగారావుచాతుర్య ము
న్మదచోరాతుల మిర్య మంచు నగికొన్నా డాత డా మూటతో.

క॥ భారతమును పరవిభుతా
దూరతమము సేయ పోరఁ దొడరఁ దనను ము
మ్మారు పిలిచి చెప్పెను నా
నా,రాణువకై యతండు నలుదెస రోసెన్. 185

శా॥ వ్రాసెం బత్రము కాశిరాము డను నెవ్వాడో నిబద్ధింపఁ బా
గే సైన్య మ్మిరువేలు వాడు తనకున్ గీల్కొల్పఁ దాఁ బ్రోచున
ట్లా సందర్భమునం దొసంగెను ధనం బయ్యేన్వరాలున్ బయా
నా,నెల్లించె నతండు వ్రాయి, యిత డన్నా! క్రుమ్మరెన్ రోయికై.

ఉ॥ ముందు నరే యటన్న జనమున్ గ్రియపట్టున గుండె జారి యీ
యన్ దొరకోర యెంతయొయొకంతయు నాలుకమార్కుదేశభ
క్తిన్ దగువారు,పాగె తిరిగెన్ దరిగెఁ దన కాళు తీచబో
వందురి డస్సి చేడువడి వాడి కృశించెను,నించె నశ్రువుల్. 187

ఉ॥ సంచులు క్రుమ్మరించి ప్రతిశాఖని శాలను గుర్తెఱుంగు వా
గంచితపక్షులం బెనిచి రా రెసిడెంటు నిజాము,వార్త నం
దించిన వవ్వి,పైబడగ నెంచిన వేగులు రంగరావుకై
పొంచని తావు లేదు బలభూ!నరవాసన వచ్చు మేరకున్. 188

ఆ॥వె॥ ఎవరు తమరు స్వామి?యిందు నిమంత్రణం
బనగ నొకడు తనదు ప్రవర నొడివి
రంగరావు చెవులు గింగురుమన నీల
బద్దు డయ్యె నొకడు పదుగు రగుచు. 189

క॥ యావజ్జీవము బందా
గైయె విడిచెను పుడమి మూడు నబ్దమ్ములలో
నా విమలుడు, పెక్కురు కా
రావాసులు వానివంటి రవరవవారల్. 190

క॥ ఏ మనక మరియు నన బా
బా మరియును విను మ టంచు పాణి పలికె సం
గ్రామము చేసెను గోండుల
లో మొనగా డాంగ్లయోధు లుస్సురు మనగా. 191

గీ॥ "రామజీగోం" డతండు పరాక్రమనిధి
చిక్కి యురిదీయబడె నొకచెట్టుకొమకు
నతని పేరిట నా వృక్ష మనవరతము
పిలువబడుచుండు 'నిర్మల'స్థలమునందు. 192

గీ॥ పెద్ద జగడమ్ము సేసె'గోవిందరావు
దేశపాండే' బ్రిటిషువారి ధిక్కరించి
భిల్లు లెలుకలపైఁ గండుబిల్లు లనగ
దూకిరి రణాన వానికిఁ దోడు మొనసి. 193

క॥ ద్విసహస్రసంఖ్యాభిల్లుల
మసరునకున్ మగిడి నిగిడి మగుడ నటుల నై
కొన కరిబలమె గెలిచె,నే
దెస,పాండే భోయె తెలియ దీనాటికినిన్. 194

క॥ "ఔలా" జాగీర్దారుడు
నౌలాలనుఁ జేసె యుద్ధమం దరులను,ధీ
శాలి యతడు పీర్జాదా
ఖ్యాలసితుడు,రోహిలాల నాతడు నడపెన్. 195

శా॥ పైచే యయ్యెను రోహిలాలదియ యఖ్యామర్దమం దెంతసే
పో! చెండాడిరి దొడ్డమొత్తముతలల్ పూర్వాహ్ణమధ్యాహ్నస
ధ్రీచీనమ్ము జయమ్ము సాయమున మాఱెన్, విజ్ఞవి జ్జైరి పీ,
రా చైతన్యము జీలు తే దిపుడు పీర్జాదా చనెఁ ఖైదియై.196

క॥ హైదరబాదున నొకచో
మీద నొకడు కత్తి విసర మిడిగాయం బై
చే దెగె సేనాపతి, కా
మాదిరిదే సంఘటిల్లె మరియొక్కండుఁ. 197

క॥ కాలిచెను 'జహాంగిరుఖాఁ'
సాలార్జంగు రెసిడెంట్లు సౌధము విడి రాన్,
దూలె గుటీ, యనుకొనినవా
డాలాగే మిగిలె గ్రోవి కందక సుఖయై. 198

గీ॥ ఇట్టి సంఘటనల 'మౌల్వి ఇబ్రహీము'
'బాజుఖాను' 'నజమతుజంగు' పాలుగొనిరి
మరియొకండు 'మిర్ధాచందు' తెరలవెనుక
పురికి వెలి యైరి రెసిడెంటు పూనుకొనగ. 199

చ॥ పదపడి నొక్క చిత్రకథ ప్రాపిలె, వహాణులతోడిపోరునం
బ్రిదిలిన 'రావుసాహెబు' చరించెను భాగ్యపురిఁ స్వతంత్రతా
కదనమునందు రెండవది ఘట్టము నిచ్చటివారి పొందునం
బొదలఁగఁ జేయఁ ద న్నెవరు పోలికపట్టని వేస మూనుచున్.200

క॥ 'నిర్మల' జాగీర్దారు స్వ
ధర్మము నుడుపు బలె దాల్చు ధన్యుడు సేవన్
కూర్మి సలుప నతనింటన్
వర్మమ్మునఁ దనువు వోలె వర్తిలె నితడున్. 201

క్రౌ॥వృ॥ అటనుండి రావుసాహేబు హైదరాబాద చేరెన్
అటనుండి రావుసాహే బహార్నిశల్ బోధచేసెన్
ఘటితమ్ముగా స్వరాజ్యమ్ము కల్గు మే లెంతయో సం
ఘటితమ్ముగాఁ బ్రజాశక్తి కల్గు సౌఖ్య మ్మదెంతో. 202

గీ॥ రావుసాహేబు దుర్గ కర్చన మొనర్చి
చెప్పె నవరాత్రకథ, యేమి చెప్ప నీకు!
చెప్పఁదఱియుఁ జాలదు, వించుఁ జెవులు ముత్య
ములను దాల్చెనో! కనులు కెంపులను రాల్చె. 203

క॥ "ఖాసోంది ఫేణీ హ
ల్వా సోనాపట్టి బూంది లడ్డూ కోవా"
ఆశించినంత,జిడ్డుల్
పోసరిలె న్నేయి పేరి భోజనశాలః. 204

గీ॥ త్రెంచికొని మొలత్రాడు భుజించి నిదుర
గూరి లేచి కట్టుకొనినవారు కలరు
రొండికడ నిల్వుకొన నది రెండు నయ్యె
చింతపుల్ల భోజన మయినంత సఖుడ! 204a

ఆ॥ అటుల నన్నదాన మమరెను భాగ్యపు
రమ్మునందు నాడు ప్రతిదినమ్ము
రావుసాహేబున్న తావున,వాని సం
భావనయును సఖుడ ! మఱపురాదు. 205

క॥ వరహా శెవరీ మొహారి
తరహాతరహాగ వటువుఁ దత్పిత పొందన్
కరచాలనమున శ్రుతి శా
స్త్రరుచిన్ దనియించె, కవిత తాపిత లూన్చెన్. 206

పృథ్వీ॥ అనేకులు ధనైకు లిం దతని కిచ్చిరెంతో ధనం
బనేకులు బలైకు లిం దతని కిచ్చి రాత్మన్,ప్రచా
రనిష్ఠతతి కంతకున్ ప్రతిభుజంబు హస్తంబు శా
ల్వ నేబదియు రూకలన్ వఱలె వాని దానోన్నతిన్. 207

శా॥ శాలారా వను రావుసాహెబున కెవ్వం డౌనౌ తో డండమా
నే లోకమ్మున వాని కండ యనుచున్ వేరూకలం బొందు దు
శ్శీలున్ రావును బట్టుకొన్నతడు నాచే నంచు నైజాంప్రభుం
డాలింపన్ జదువఁగా వెలార్చెప్రజకై యాజ్ఞన్ స్మితాంగ్లేయముల్,

సీ॥ కుచ్చు లేని టోపీల్ నల్లకుచ్చుగలవి
యెఱ్ఱటోపీల్ వలుదపాగ లెల్లయెడల
గుంపులేగుంపు లాలయకుడ్యపత్ర
చిత్రితేతదుదంతానుశీలనమున. 209

ఉ॥ ప్రోగినయట్లె యున్నయది ప్రోగిన తప్పెట వాడవాడ, బై
రాగులు బిచ్చగాండ్రునుఁ బరాయిగఁ బట్నము వచ్చువారు కా
రాగమనమ్ము లేక చనఁరైరి, మఱాటియు రావుపేరువా
డో!గడె కొక్క రక్షకభటుం డరుదెంచును వాని జాడకై. 210

ఆ॥వె॥ ఇంతవఱకు నీకు నేఁ జెప్పినది యెల్ల
వద్దమందు ముఖము నట్లు నేను
కాంచినదియ, రావుఁ గాంచి మాటాడితి
చౌరనీదునీని సౌధమందు. 211

కం॥ చాలాచాలా చెప్పెను
సాలువ యిది నాకు రావు సాహె బిడినదే
యాలోకించితి రేఖా
జాలముఁ దత్కరతలమున సద్దుమణిగితిన్. 212

ఆ॥వె॥ పదుగురు చెడ కొకడు భాగ్యవంతుడు కాడు
మేము చెడక రాడు మేటి విజయ
మందువా డటంచు ననె రావుసాహెబు
మరియు ననియె నిట్లు మాటవరుస. 213

ఆ॥వె॥ రాదు రాదు, నెత్రు మాదృశులది కొంత
పాటకే స్వరాజ్యపాలనమ్ము
వచ్చినపుడు దీని వ్యతిరేక మనుకొంట
క్రమమయునున్ గృతఘ్నభావనూచి. 214

చ॥ అదియును గాక దానమిడిన ట్లిడిరే యనుకొమ్ము హైబాణు లిం
దధికృతి, దాని విల్వ తెలియన్‌గల రెట్లు జనమ్ము రోమనుల్
మొదలగు శూరజాతిజనముల్ బలెఁ, బైతృక మాస్తి పాడుసే
యుఁ దనయు, డొళ్ల వంచి చెమటోడ్చి గడించిన నట్లు సేయునే

క॥ భారత రామాయణసమ
గౌరవము స్వతంత్రతావికాసచరిత ము
న్నూఱేండ్ల కేని పొందునొ
కో! రంగయ త్రోవఁ గొడుకు కొంగయ నడువన్. 216

ఆ॥వె॥ ప్రజల పాటవమ్ము పరిపూర్ణముగ మాకు
సాయ మగుట లేదు సకలదిశల
దానివలన నంచు మౌనమ్ముతోడ గం
భీరదృష్టిఁ జూచె విన్ను నతడు. 217

శా॥ రాజిల్లు న్నయిజాముదండు త్రిసహస్రం బౌచు మా చౌరసీ
రాజాక్రింద, రహస్య మాడును స్వతంత్రత్వమ్ము తద్బుద్ధితోఁ
బూజించెన్ దన యింట నుంచుకొని రావున్, వేగు దెప్పించెఁ ద
ద్రాఘిష్ణుండు,తదీయసైనికు లహో!'రాఠోడులుం 'బూర్భియాల్'

శా॥ స్వర్గారోహణపర్వపాత్రములుగా సత్కీర్తి నార్జించుచే
మార్గం బై, మరియొండు లేక యెటులున్ మా రాజునుం బూర్భియాల్
దుర్గస్థుం బలె రావు నోమి, రదియే తోరంబు, "బేగంబజా"
ర్వర్గంబుల్ ధనికంబు లాతనికిఁ దోడ్పాటిగి మెచ్చన్‌దగున్.219

శా॥ మోహన్‌లా లను కుఱ్ఱవాడు పదియున్ మూడేండ్లవా డయ్యుకున్
బాహాటింపక యప్పు తెచ్చి యిడె రూప్యమ్ముల్ సహస్రమ్ము రావ్
సాహేబ్ చేతికి, డెబ్బదైదుగ సహస్రమ్ముల్ గొనెన్ దత్కృతిన్
దోసం బంచు నిజాము వాని పితచే దుశ్శితుకున్ మాఱుగా. 220

ఆ॥వె॥ వేయి యెల్ల నైదువే లయ్యె రావుసా
హెబును పట్టుకొన లభించు నులువ
యనుచుఁ బెక్కు రేగి యతనికి భృత్యులై
రదె ముఖప్రభావ మంద్రు బుధులు. 221

క॥ "సూగుర్లు" కావు "కలదా
ర్లే" కైకొను డైదు వేలివే యని రూకల్
ప్రోగించి కట్టి సంచిన్
జేగొని యెదు రరసెఁ బ్రభుత, చేర డెవండున్. 222

పుష్పి॥ ఎవరెవ రట రావుపట్టువారో
తవిలెను వారికి దండనల్ తరస్వి!
వివశమ్ము తదుద్యమమ్ము పీటన్
నవనవలాడదు నాటినుండి య ట్లై. 223

క॥ విరమింతు నింక నొక్కని
గుఱిచి తెలిపి, తొల్లి గుంజుకొనిరి "సతారా"
ధరణిన్ "గుంఫినివా", రా
ధరాధిపతిభగినికొడుకు తగిలెన్ వారిన్. 224

గీ॥ వాని పేరు రామారావు, వాని యసలు
పేరు మాధవరావు, తద్బిరుద మొప్ప
'జంగు బహదూరు', శ్రీమంతు సాహు ఛత్ర
పతి య టన్న మాతులముద్ర వాని కొదవె. 225

గీ॥ వల్లమాలిన ధన మిచ్చి వాని నంపెఁ
దాంతియాతోపె దండయాత్రలకు, వాడు
చిక్కి చెఱసాల నుండియు మొక్కలించి
తప్పికొని వచ్చి దండుతో దండడించె 226

క॥ "బీదరు"జిల్లాలో "వ
ష్టి" దుర్గము నతడు మున్నడిన్ గొని ఖండా
వాదరసరివరితోఁ ద
త్రాప్త దేశమునందు నిలిపె భగవాజెండా. 227

సీ॥ జన మేరు వా రందఱును? జంగుబహదూర్ధి
దృతు వేచు పటువారిల్ పజేండ్లు
తళతళ లవి యద్విధములు? సతారేంద్ర
సేన కత్తికవాతు సేయుచుండె

నే మది యా దుమ్ముః రామరాయని తురి
కీలు కచ్చీల్ హారబ్బీలు వెడలె
వేమి టా చిఱుమ్రోత యెప్పుడుః శ్రీమంతు
సాహుఛత్రపతికోశమ్ములెక్క

గీ॥ యడుగ వనఖిజ్జుల కఖిజ్జు లాడి రిటుల
నష్టిదుర్గోపకంఠమ్మునం దొకపుడు
అటుల వెల్గెఁ దత్ప్రభ వెల్గినన్నినాళ్లు
వాని పలునుళ్ళు రఘురాము పావుకోళ్ళు. 228

క॥ నీయీాడువాడె యాతం
డా యెడ మరికొన్ని కోట లఱుముకొనగఁ బైఁ
బోయి పగర పాళెము మెం
డై యేగెను కొంతమంది యనుగులతోడన్. 229

క॥ పురగిరికాననజనపద
చరు డా బహువేషధరుడు సమయము ఖర మై
యురులన్ బన్నుచు దవులు ప
గర కొక కోవెలఁ బరుండి కడకున్ జిక్కెన్. 230

క॥ యావజ్జీవమ్మును కా
రావాసమునందు నిలుపు ప్రాపిలె రామా
రావునకున్ మున్వరుఖా
న్నా వెలసిన రోహిలాదణాయనికి సఖా! 231

గీ॥ పారతంత్ర్యాపగమకృతాభ్యాగమంబు
వారితోఁ బోయెను, మఱచినారు ప్రజలు
నీవు మఱల జ్ఞప్తికిఁ దెచ్చినావు బాబ!
కాళరాత్రి యయ్యె నటంచు కథకు డరిగె. 232

# దయానంద ఖండము

ఆ॥వె॥ మొదలు కొక్కెమంత పదపడి సంకెల
యంత యగుచుఁ గారయంత యెదిగి
మబ్బు గ్రమ్మె భరతమహీ నభోంతమ్మునకిన్
జలము వచ్చె కంటికొలకులందు. 1

సీ॥ ఎంత రాజేసిన నించుకంతయు మండి
పోయినిప్పు చల్లారిపోవుచుండె
మీగడవలె నుండి రేగడి మోకాలి
లోతున నిడినకాలు దిగుచుండె
నీ వేళ నీ రాజ్య మెవరిది కాదు మా
దన్నట్లు కీచురా ళ్ళరచుచుండె
నెటు పోద మన్నను నేఱు లడ్డమువచ్చి
జనుల ప్రయాణమ్ము సాగకుండె

గీ॥ పండు వగుచుండెఁ గొక్కెరతండమునకు
చినుకు లయి తుంపర లయి చిమ్మనపుగ్రోవి
చిమ్మిన ట్లయి మోటతొండమ్ము ధార
క్రుమ్మరించిన వడి జడి ముమ్మరింప. 2

క॥ అట్టి జడిఁ బొట్టుకు పెట్టిన
మట్టింటన్ గూరుచుండి మలగెడు దివియన్
మిట్టించి పత్ర మైదుగు
రెట్టులో వ్రాసి ముగియింప నెంచిరి కడకన్. 3

గీ॥ కలము తెచ్చె నిస్మాయిలుఖాను, కాగి
తమ్ము తెచ్చె నీశ్వరభట్టు, తకుకువయ్యె
బుడ్డిలోన మషీరసంబు, కొనివచ్చె
రవ్వయంత 'వెంకోపంతు' వ్రాతకాడు. 4

ఉ॥ అద్దముదువ్వెనల్ కలవు నౌదల దువ్వుకొనంగ నూనెకే
యెద్దడి వచ్చె నన్నటులు నింధనరాశియుఁ బాత్రరాశియున్
గద్దు గృహాన బియ్యము వినా యనినట్టులు నున్న దండి! యీ
ప్రొద్దు, ముగింతుఁ బత్రమును ముక్కలు మూడుగ నంచు పంతనెన్

క॥ రూకలు నెలకు పది తలకు
నాకలి దీర్చి యిడునట్లు నా బాబా ఖాన్
చేకురుచునట్లు సాయము
లేకరి పత్రములు రెండు లిఖయించి యిడెన్. 6

గీ॥ సాతు లీశ్వరభట్టును "జానుమియ్య"
యంతయు నిది యల్లాదయ యనియె ఖాను
సుదిన మనియె బాబా,పంతు చెదరిపోదు
ఫలము నా వ్రాత పడిన యే స్థలమున ననె. 7

ఆ॥వె॥ బావవరుసఁ జేసి పలికె నీశ్వరభట్టు
పంతుగూర్చి వాని మంతుగూర్చి
వెంకొపంతువ్రాత వేనికిన్ దొరుక, దు
దాహరింతు వినుడు స్నేహితులార! 8

ఆ॥వె॥ మధువు లోలికెడి యొకవధువుసొగసుపైని
కన్ను వేసె నొకడు,గడపదాట
దామె,గడియ దాట దతనికిఁ, గిల్లాకు
వ్రాసి పడతి కంపవలసి వచ్చె. 9

క॥ మతి పట్టిల్ కొట్టిననున్
మతల బతని కందదయ్యె,మా వెంకోపం
తతని గురువు,తద్దేహం
బతుకుకొనుచు వదల దితని యంఘ్రిద్వయమున్. 10

ఆ॥వె॥ పైకి వచ్చి గురునిఁ బడనెట్టు రాజకీ
యంపు శిష్యరికము నత డెఱుగడు
నందిగా నెసంగు ననవరతము లింగ
మూర్తి యైన గురుని మోము గనుచు. 10a

ఆ॥వె॥ ఎటులో వదులు గాఁగ నితడు వ్రాయించెను
నేను నీదు భర్త నీవు నాదు
భార్య వేగవలయుఁ బండరితీర్థము
నరసిరాఁగ నంచు, నరిగె జాబు. 11

క॥ ఆ ముగ్ధ మానభరమున
మోమున్ జిట్లించి చూడు మో! మగడా!నా
నా మగడు రచ్చలోఁ ద
ద్గ్రామమునుం బ్రోగుసేసి కాగిత ముంచెన్. 12

గీ॥ హే!గురూ!యంటుకొన్నది యిపుడు జిగురు
విఱిగిపడినది యూరు నా వెన్నుపై న
టన్న శిష్యున కీత డా వెన్ను చఱచి
ఛాత్రవృషభ!కామాల్ నాల్గు చదువు మనియె. 13

ఆ॥వె॥ అటుల చేసి చదివె నాత డా వ్రాతను
నేను,నీదు భర్త,నీవు,నాదు
భార్య,వేగ వలయుఁ బండరితీర్థము
నరసి రాఁగ ననుచు,మెఱసిపోయె. 14

చ॥ అని వివరించి భట్టు ముగు రందఱివారు నెఱా సనంగ వా
కొనె నపు డేగి శిష్యు డటు కూటముచేఁ జదివించె వాక్యమున్
జన మిది కల్పుగోత్తనముఁ జాలెడిఁ గాని దురర్థ మేది లే
దని యలదాని పెన్మిటిని యాడిరి లేఖను చించివేయుచున్. 15

క॥ పోషకములు పతుద్వయ
భాషు అగు వకీళ్లకుఁ,సభంగాభంగ
శ్లేషములు,'రుకూన్'దెలివికిఁ
గాషము,శ్రీ వెంకోపంతుకర్తృకలేఖల్. 16

చ॥ అన నికఁ జాలు నూరుకొను మంచు నలంతి హసించెఁ బంతు,చ
క్కని కథ వించినావయ!వకాలతు సేయడ వెంకోపంతు, శ్రీ
యన యటు సేయుచున్న యెడ నారటముల్ మన కుండునే!ధన
ఘ్నుమన కిపు డంచు మౌనమును బొంది కడంగిరి చర్చ కందఱున్.

గీ॥ చింతగింజ వేసినఁ దేలు చిక్కనైన
చాయు, గమగమలాడు మేల్ జరదతోడి
తమ్ములమును సేవించి కర్తవ్యనిర్ణ
యమ్ము సేసి రాలోచించి యంద అపుడు. 18

క॥ 'జాతాహూ మై గుడ్నూర్
లాతాహూ ఫౌజు రోహిలా డక్కనియోం
కా, తయ్యార్ రహోనా' యని
చేతిన్ గదలించి ఖాన్ వచించెను బాబాన్, 19

గీ॥ నేను పూనాకుఁ బోవుచున్నా, నమాస
నాడు సూర్యాస్తమయవేళ కందుకొందు
నిచటి కని ఖానుతోడ కథించి భట్టు
ను గని బాబా చెయిన్ జేబునుండి తీసి. 20

శా॥ ఈ బంగారపు హార ముంచుకొనవే! యీ రవ్వలుంగ్రాలునుం
బాబూ! ఈశ్వరభట్టు! వచ్చుదనుకన్ మా మధ్యవర్తీ! యవెన్
బాబా! నీకయి ఖానుకై వెదకుచున్నా రిందుఁ బోలీసుసా
హేబుల్ జాగ్రత యెట్లువచ్చెదవో సుమ్మీ!యంచు భట్టూరిచెఁ

శా॥ వెంకోపం తనెఁ గాల్బలమ్ము రవుతుల్ వేసాముసంకెన్ ధను
ష్టంకారమ్ముకు బోలు వాడి గల రై శస్త్రమ్ములన్ మోసి యీ
వంకన్ వత్తురు నిన్ను గొల్చుటకు బాబా! రెండుమూణ్ణాళ్ళలో
టంకమ్ముల్ బలె దారువున్ బగతు నుడ్డాడింతు రీ వున్నచో.

చ॥ ఖనిజము భూమియందు బలెఁ గాలమునందున దాగి దైవ మే
యొనరున నున్నదో తెలియకున్నది, కర్జము నీవు పోక తీ
రని యటు లుండె గాని బవర మ్మిపు డున్నది,మూడుమూడు నా
అనినటు గెల్పు నున్నది సుమా! మన పట్టు తరఃఫలద్రుమా

ద్వి॥ అన విని నిట్టూర్చి మునుపటి కొన్ని
మనసున ఘటనలు మల్లాడుచుండ 23

మ॥ ఇటు మాటాడెను ఫాడ్కె కోరితిని ము"న్నిందూరుహోల్కారు"ను
ద్భటసైన్య మ్మిడి నన్ను బంపగదవే! పాలార్తు నాంగ్లేయలం
పటుతన్ భారతభూమినుండి యని, యొప్పన్ లేదుపో ద్రవ్యమున్
ఘటియింపండ యతండు తాదృశుడు నన్గైకొ న్నని ట్లుందునే!

ఆ॥ వె॥ యాచకుండ నైతి నానాటిసుత, బిజా
పూరు నాదు మామగారి యూరు
చిక్కవచ్చు నందు శ్రీ భారతజ్యోతి
తైల మిష్టకోటిశిలనమున. 25

క॥ నావుడు భట్టు పలికె నీ
తో వత్తురు బ్రాహ్మణులు పదుగు రని, బాబా
నా వెంట నున్న నే మో
నో! వారికి ననియు తోడు నొందియ వెడలెన్. 26

క॥ బాబా! బాబా! బాబా!
బాబా! యని యొక్కమారు ధ్వనియించెను ఫా
డ్కే బయలువెడల సంగము
లో బాడబగృహము లెల్ల లుత్తళము లై. 27

తే॥ అంధకారమయమ్ము పూర్వార్ధ మగుచు
నుత్తరార్ధ ముజ్జ్వల మౌచు నొప్పు రాత్రి
భారతచరిత్రమును కంటివద్ద పెట్టెఁ
బయన మై పోవుచున్న బాబాకు నాడు. 28

శా॥ తంతిం బొంబయిరాజ్యపాలకుడు హైద్రాబాద నాంగ్లేయరా
ట్తంత్రమ్ము న్నడుపించు పెద్ద కనిపెన్ ఫాడ్కేను బంధింప, పెన్
మంతున్ వించె నతండు, మంతిరియు ఘర్మాయించె దద్బంధనో
దంతంబున్ వివరించి రక్షకభటాధ్యక్షున్ దరక్షూపమున్. 29

క॥ ప్రకటించిన బహుమతిలో
నొక వేయిన్ మున్నె పంపె హూణుడు తద్ర
క్షకశాఖాపతికి స్వర
క్షకశాఖజ ఘనపదవి నెసగు 'డేన్యలు'తో. 30

క॥ తలి గొని చీమలు కొలుచున్
వితముగ భాగ్యపురమునకు వేగులు వారల్
వెతకివెతకి కొని తెచ్చిరి
ప్రతినంవసధమున కొకడు పరికల్పితు డై. 81

గీ॥ ఆ ఘటాధ్యతు "డబ్బులుహాక్కు" పంచ
శతభటులతోడ డేనియల్ సహితు డగుచుఁ
గోరమీసము మెల్చి గుడ్నూరు బోయి
ఖానునున్ మరికొందఱ ఖై దు సేసె. 82

మ॥ కడిమిన్ సంగములోనఁ గొందఱను గాండ్గాపూరులోఁ గొందఱన్
ఖడవాల్ మీ రని తిట్టి భట్టుముఖవిప్రశ్రేణి బేడిలతో
మిడుకన్ జేయుచు 'హాక్కు' బోరన చనెన్ బీజాపురీదృష్టి యై
నడుమన్ "గన్నూరి"లోని బ్రాహ్మణులకున్ గారాగృహప్రాప్తిగా.

క॥ దేవనగిరిలో ఫాడ్కే
దేవాలయసీమ చంద్రదీధితిలో ని
ద్రావశు డై యుండెను భూ
దేవదళక మల్లె యుండె దీర్ఘశ్రమ మై. 84

గీ॥ గుండెపై బర్వు వ డ్డటు లుండి నిదుర
కనుల ఫాడ్కే 'యెహో' యని గట్టిగ నొక
విసరు విసరి చూచె నుస్సురుసు రటంచు
నంత దూరావఁ బడిన డేన్యు లను వాని. 85

క॥ పండా! నిద్దురలో నను
బంధా సేయుటలు నీచు పని, రండిర మీ
రందఱు నా కై దువు నా
కున్ దక్క న టంను ఫాడ్కె గోంద్రించె వడిన్. 86

గీ॥ అట్టి ఫాడ్కే నిరాయుధు డైన నతని
దరియఁ జాలద డేన్యులుపరిజనమ్ము
తనకుఁ దాఁ దట్వశుం డయ్యెఁ దప్పు కునికి
నతడు 'గుల్బర్గ' జైలులో నదుమబడియె. 87

ఉ॥ ఆ పదిమంది బ్రాహ్మణులు నంతకు మున్నుగఁ బట్టుబడ్డ యా
బాపలఁ గొంతమందియును ఫాడ్కెయు ఖానును ఖాను నాయకుం
డౌ పరి కొంత కూరుకొని రందఱు పెన్జడి నానిగాని యీ
ఱ్మాపయిఁ గూలెనో! నరకఖండ మనన్ దగినట్టి జైలునన్. 38

ఆ॥వె॥ తీసినట్లె వెలికిఁ దీసి మరల నందె
వేసెఁ బోగ నున్న శేషజనము
నేడునేండ్లు ఖాను నితరులఁ దగ్గించి
యబ్దయుగము గడవ నచటి కోర్టు. 39

క॥ పూనానగరన్యాయ
స్థానమునకు హూణరాజ్యసంహారకవా
ర్తానిచితపత్రములతో
నానీతుం డయ్యె ఫాడ్కె యభియోగమునన్. 40

ఉ॥ దేశముకోసమై మన నెదిర్చెను ఫాడ్కెయటంచు వాని గా
రాశయవాసుఁ జేయగ మహాశయులార! జనమ్ము లెచ్చిపో
దో! శతసంఖ్యసిద్ధపడదో! యత డట్లిపు, డెట్లు సేత? ధీ
కౌశల మొప్పఁ జెప్పు డనగా హితు లాడిరి రాష్ట్రపాలుతో. 41

గీ॥ బందిపోటుదొంగనుగ ఫాడ్కెన్ దెలియబ
అచెద మన నొక డురిదీయరాద యండ
మానునిండఁ దొత్తటి! పోరి మగలు గలరు
దాన వాని నేడేనుకుఁ బంత మనెఁ నొకడు. 42

చ॥ ఒకడనె నింతయున్ సరియ,యొప్ప డెవండును బందిపోటుదొం
గకుఁ గల లక్షణమ్ములను కల్పన చేసిన నేమి! వానిపై
నిక మన మిట్టివాడుగ మ రెవ్వడు కానటు చూచుకోవలెన్
సకులుగఁ జేసికొంచు జననాయకులన్ దగు సంస్థ కాదియై. 43

గీ॥ చిటికె వైచి భళీ! యని యిట్టుల నుండ
వలయుఁ దెలి వన, చెయి గుండెపైని వైచి
కొని మనము నిదురింపవచ్చు నిట నిటులు
చేసి యని తక్కువారు ఘూపించి రతని. 44

చ॥ దొనిగొని యా త్రిటిష్వరచతుష్టయ ముబ్బున నీ మరాటిబా
పనిఁ జెలఁ దూర్చి, భారతసభన్ జనముఖ్యులతోడ దేశపా
ర్వణ మని కూర్చి, సంస్కరణవాంఛముఁ జేయ నహింస జీబుగా
నెనసిన దాని నీడ మన యేల్పడి క్రీడ గదా! సదా యనెన్. 45

క॥ మెజస్ట్రేట్ కోర్టునఁ దొలి
గా జరిగి నెషన్సు నొందగా ఫాడ్కేకే
పా జడ్జి బాపురే !యను
కో జన మది ముగియునంతకున్ జనుదెంచెన్. 46

గీ॥ అచట "జోషీని" నియమించినట్టి రాన
డేమహాశయు డిందు ఫాడ్కేసమర్థ
నమునకై "మహాదేవచిమ్నాజీఆప్టె"
ను నియమించెను న్యాయవాదినిగ నాడు. 47

చ॥ ఇసువురు వచ్చి,రం దొకరు డిప్పుడు రేనడె పైని కన్నవే
సిరి పరిపాలబృంద మని చెప్ప ద్వితీయు డి దిప్ప డేమి వ
త్సర ప్రథమమ్మునుండి,తన దౌ కొలు వార్చు రికార్డు పోవ నై
మరొకడు రానడే ప్రభుతమందిరగాల్చిననాటినుండియుఁ. 48

చ॥ శ్రుత మిది నీకు,నేడు పొగచూరిన యిర్వదియేండ్ల భారత
స్థితి కొక వెల్ల వేసి మతిచే వెతికించెను శాంతియాను స్వ
ర్గతు నిత,డిట్టి ఫాడ్కె కవకాశభరమ్ము సహాయు డౌటచేఁ
బ్రతిరసనాలసద్యశముపాడుగ తా నయినాడు రానడే. 49

గీ॥ చదువుకొన్న పత్తనవాసిజనము తక్క
జానపదజన మెఱుగదు రానడేను.
నే డెఱింగె ననన్ జతగా డయిన "క
పర్ది" బాలగంగాధరా! వల్లె! యనిరె. 50

గీ॥ ప్రేక్షకస్థానమునఁ దొలిబెంచిమీదఁ
గూరుచున్నవారలలోన వీరు నుండి
రదియ కేసువిచారణ నంత్యదినము
సాక్ష్యము వకీళ్ళవాదమ్ము జరిగె ఘనము. 51

మం॥ద్వి ఎంత లోతుగఁ బరికించిన నేమి!
ఖానుబాబాల యా కం(ట్రాక్టునందు
జడ్జికి దొరకద నందు శిక్షింప
నంతంతమాత్రము లన్ని సాక్ష్యములు
నిజము చెప్పఁ దలచి నిలువు నడ్డమ్ము
నంగుళ మ్మెదిగిన యా వాసుదేవ
బలవంత ఫాడ్కె యిటులు కోర్టు పైబెటి
గుంపులు నలరి యాలింప భాషించె. 52

మ। ఘనరాజ్యచ్ఛలబంధనాలయచలత్కంఠీరవీభూతమ
జ్జనులారా! భరతోర్వరాధనమునన్ సాబాలు కాజేసి యిం
దు నుసింగొల్పెను జాగిలాల మనపై దుర్భిక్షరూపమ్ములన్
మనసుంబట్టగలేక యిట్టి ప్రభుతన్ ప్రమందింప నుంకించితిన్. 53

ఉ॥ తిండి సయింపకుండె, నరుదేరద నిద్దుర, నాకు నేత్రముల్
రెండును జోతు లయ్యె,నిదురించినయట్లె జనమ్ము తోచెబో!
యెండను, దాని మేలొకలిపి యేత్తెర భారతమాతృశృంఖలా
ఖండనసేతకై నడుముగట్టితి, కట్టితి తోర మియ్యదే! 54

ఆ॥ వె॥ఆదిబలము స్వార్థమై పోవ నదనునఁ
గ్రొత్తబలము ధనము కొదువ గాగఁ
జిక్కి దేశమునకుఁ జీడ బాపగ లేని
యితని నందఱున్ క్షమింత్రుగాత!

శా॥ ఈ నా ముప్పదినాలుగేండ్ల కథ వ్రాయింబాయ, కో భ్రాతలా
రా! నిర్జించిన భారతప్రజ "స్వయం రాజా స్వయ మ్మంత్రి" యై
యే నాడెమ్మనఁదానె యేలుకొని తన్నింపొందుటల్ లగ్గొయ
ద్దానిన్ పీడక వ్రాసినాడ నదిగో తద్గ్రంథమున్ జూడుడీ! 56

చ! ఎవరికివార మిందఱము నీ పరతంత్రత తిత్తిదీయ శ
క్తి పొసగ దంచు నూరుకొనఁగ్రేళ్లుబుకుం బ్రళయమ్ముదాక ని
ద్ది,వివిధరూపధారిణిగదే! ప్రజశక్తి,యెదుర్చి చచ్చి క్రై
స్తవులు గడించినారలు స్వతంత్రత,నయ్యది శక్తి కాదొకో! 57

గీ॥ దొంగతనమునిందను మోపి క్రుంగదీయ
కాంగ్లరాజ్యముఁ గూలద్రోయ గడగె నని
ఋతమున న్నన్ను శిక్షింప నెంచె, మెచ్చి
కొందు కోర్టును, కీడులో కొంత మేలు. 59

గీ॥ ఏలుబడిని యథాశక్తి నిందలు మొక
టగుచు గాని, యొక్కొక్కర మగుచు గాని
యెదిరి వెనుదీక పోరి వ్రాలుద, మొకండు
విత్తనము చాలు స్వాతంత్ర్యవృక్షమునకు. 60

క॥ ఎంతో చింతిల్లితి నా
కంతటి భాగ్యంబు పట్టనందుల, కాంగ్లుం
డింత సురియ నా కిడి న
న్నంతం బొందింప ననుతు ననియెన్ ఫాడ్కే. 61

శా॥ చాలున్ జా లిక కట్టిపెట్టు మనుచున్ జడ్జి సనా ఖండేఖా
నాలో మ్రగ్గగ దండనంబిడి చనెన్, జైకొట్టె ఫాడ్కేమ పూ
నా, లూనప్రసవమ్ము తీగవలెఁ దన్నాథాంఘ్రులన్ జుట్టుకో
గా లేమన్ గని విచ్చుకత్తులు ముడుంగంబాఱె క్లిన్నమ్ము లై.

చ॥ వల దనినావు నన్నుఁ, నినుఁ బాయక నేనె సరించియున్నచోఁ
దులువ యెవండు స్వామి! నిను దొట్టి జయింపగలాడు, వాని కం
డలు తెగవ్రేయ కుందునొ! కుఠారమున, న్నెదురింప నీవు రై
ఫిలు గొని మేలుకోనా! విధి యేఁచె న టంచుఁ మెలంతి బెగ్గిలెన్.

చ॥ కన్నుల నశ్రుధార లొలుకన్, గడచూపులు కౌగిలింప నా
యన్నులమిన్న భర్తృగళమందు గులాబిసరమ్ము వైచి కా
ర న్నివసింతు స్వర్గమున బ్రాతిగ నాకును తావు సేయవే
నిన్ను భజింతు నాథ! యిట నే మనజాల న టంచుఁ గూయిడెన్.

గీ॥ చెలియ! భౌతిక కాయముల్ తలపఁదగునె!
యస్మదాత్మలు ధన్యము లంచు నతడు
వెనుదిరిగి చూచుచుం బోయె, వెలది యట్లె
నిలచె మ్రాన్పడి చూపులకొలదిఁ గనుచు. 65

శా॥ 'తానా'జైలున వాసుదేవబలవత్ఫాడ్కే వసింపంగ రా
వాణసై9ణము బంతిగా నిలచి సాహో! శూరచూడామణీ!
మా నేత్రున్ జలిముద్ద సేసెడి యసామాన్యమ్ము త్యాగమ్ము నీ
దౌ నర్థం బని పుష్పగుచ్ఛదము కొండాడెన్ మనస్ఫూర్తిగా.

ఉ॥ ఏడెనుజైలునందు నివసించుచు ఫాడ్కె పరారి యయ్యునన్
దోడనె బద్ధుడై జ్వరముతో దివి కేగెను మూడు నేండ్లలో
చేడియ తన్ని కేతమునఁ జేడ్వడి పిచ్చిది వోలె నయ్యెఁనీ
రాడిరి సోదరుండు చనిన ట్లుయి పెక్కురు వాని పంచతన్. 67

గీ॥ ఐదువందలు పత్రిక లట్టివార్త
వగచె సర్వాగ్రముగ నాద్యపత్రమందు
ఫాడ్కె యింకఁ దప్పించుక వచ్చి యెటులు
దిరుగగల డని తెలిగుండె గుఱికవెట్టె. 68

క॥ అపుడె దయానందుండున్
వ్యపగతతను వయ్యె, నట్టి వార్త విని జనం
బు పొగిలి శ్రద్ధాంజలి త
ద్విపశ్చిదగ్రణి కొసంగె వీటనువీటన్. 69

సీ॥ బాల్యవివాహమ్ము బలహీని యని చాటి
బ్రహ్మచర్యమునకుఁ బదును పెట్టి
స్త్రీవిద్య మిగిలిన శ్రీవిద్య లే దని
ఘోషించి ఘోషాను కొంచపఱచి
సర్వభౌతికరహస్యములు ముక్తియు వేద
మూలమ్ము లని ఢక్క మొరయ వేసి
దివి భానుమండలమ్ము వలె భారతమండ
లము భువి నొప్ప నల్గడ భ్రమించి

గీ॥ పొదుపొదు సంఘీభావమునవె తక్క
నస్వతంత్రత యని జాతి నంతటి నొక
బంతిగా నిల్ప జీవితపణ మొసంగి
కన్నుమూసె దయానందఘనతపస్వి. 70

గీ॥ సంఘసంస్కరణాసనస్థముగ మతము
రాజిలఁ రామమోహన రాయి సేయ
సంఘసంస్కరణము మతపదములాస
నస్థముగఁ జేసె శ్రీదయానందసూరి. 71

గీ॥ మానవత్వమ్ము మతము సమానగౌర
వములుగాఁ బెంచినాడు శ్రీస్వామి, వర్ణ
భేదములు కల్పితము లంచుఁ బెద్ద యెవరొ
చిన్న యెవరొ తత్ప్రకృతియ చెప్ప ననుచు. 72

శా॥ న్యాయంబే యత డైన యీశ్వరుడు జన్మం బిచ్చె శిక్షాకృతిన్
ప్రాయశ్చిత్తము లేదు దుష్కృతికి దత్పాపమ్ము బోగొట్టుకో
నై యంచుం బరముం గృతజ్ఞతలఁ దన్వఁ హోమసంధ్యాదులన్
జేయంగావలె నంచు బోధనము సేసెన్ స్వామి గంగార్భటిన్. 73

క॥ "బ్లావట్‌స్కీ" "యాల్కాటు"ల
రావించెను స్వామి యిటకు, రంజిల్లెను త
ద్భావితదివ్యజ్ఞానము
చే వారల యా మతమ్ము చేరువ కాగన్. 74

గీ॥ పుటుకతో నరు లంద ఱొక్కటె యటంటు
గొంద ఱపర 'రూసో' యనఁ గొంద ఱనిరి
'లూథ'రని, వాని హింస విలుప్తమైన
యొక రకపు 'బిస్మా' ర్కనిరి కతిపయులు. 75

సీ॥ సాయణాదులను పాశ్చాత్యులన్ ఖండించి
విలిఖించె భాష్యమ్ము వేదపరిధి
బొట్టుతేడాతోడఁ బుట్టెఁ గల్లోలమ్ము
లంచుఁ జందనమునే యామతించె
బొంబాయిపత్తనమ్మున నిల్పె నార్యస
మాజమ్ము పేర నాత్మమతసంస్థ
ఉత్తరదేశము మొత్తము చరియించె
శతసహస్రమ్ముగా ఛాత్రసంఖ్య

గీ॥ కాశిలో మూడునూర్లు దిగ్గంతిసమము
నీషు లెదురాడఁ జాలని నేటు గొని యు
పన్యసించె యవ్వనమున సన్యసించెఁ
జిరయశుడు విరజానందశిష్యు డతడు. 76

చ॥ మనవనిపట్టనై మతముమాటున నీతడు ప్రోగుసేసెడిన్
జనము న టంచు నేలుబడి సంశయ మందిననేమి, హైకమ
త్యనవనవ ప్రభాసమిశితమ్ము స్వధర్మము బోధసేసె న
య్యనఘుడు సర్వతఃకృతమహాసభలందు ఘనాఘనధ్వనిన్. 77

ఆ॥వె॥ శీలితనిగమమతి శ్రీదయానందస
రస్వతి సభలందు అంకె వేసె
జబ్బు చెఱచి యార్షసమ్మతమతమందుఁ
బొరలు చూపు వారు తెరలు డంచు. 78

క॥ వేదము లపౌరుషేయము
లై దనరున్, ద్వేష మెఱుగనట్టివి శుభసం
పాదకములు మానవతా
సాధకము ల టంచు స్వామిశంఖము మ్రోసెన్. 79

క॥ గుణవంత మౌ ప్రతిక్రియ
గణనీయము తాల్మికన్న, కాదగినది యా
ననుకొనుటకన్న జతన క
రణీయ మగు రెట్లు, నిట్లు ప్రబలె తదుక్తుల్. 80

గీ॥ ఆదిశంకరు తరువాత నంతవాడు
"పౌర్కుల్యలసుఁ" బోలు బలవంతు, డెడమచేతఁ
బరుగిడెడి గుఱ్ఱముల బండిఁ బట్టి యాపి
నాడు, పరఖడ్గము విఱచి నాడు స్వామి. 81

క॥ స్వామిది ద్వైతము, శంకర
సామిది యద్వైత మయ్యు జనుల సమైక్య
శ్రీమంతులఁ జేయుటలో
నీ మహాతులు నిద్ద ఱొక్కటే యనవచ్చున్. 82

క॥ అవమతి యలవు నపాయము
తవిలినను౯ దవులనట్లు తరళించు కృతి
ప్రవణు డత డొకడు తనపై
ని విసరిన మహోహి నొడిసి నేలకుఁ గొట్టెన్. 83

క॥ ఎదురుము తలవంపింపుము
చదుపుము దుర్మార్గు డగునో క్ష్మాపతినే, ని
య్యాది సామవేది ఘూర్జరు
డు దయానందు డనినది నుడుగుతొడుగునుమీ! 84

క॥ ధర నెడనె దయానందుడు
తిరుగుచుఁదిరుగుచునె యఱువదియు నిండక,యి
త్తటి రాజకీయరంగము
నురడింపగ వచ్చునో! తదుపముడు లెస్సల్. 85

క॥ అని యధ్యక్షుడు తుదినుడిఁ
బునహాసభలో నొడివినపు డచటకున్ వ
చ్చెను "గంగాధరతిలకుని"
తనయుడు "బలవంతరావు", తత్సభ ముఁగిసెన్. 86

చ॥ వినిచి తిలక్ సదస్యులకుఁ బ్లడరుతోఁ "గొలహాపురంపు" కే
సునఁ దగ సంప్రతించుటనెసూ!తడ వయ్యె నటంచు నింటికిన్
జని మఱునాడు వచ్చిన స్వసఖ్యునితోడ నగార్కరాఖ్యుతో
డ నిటులు పల్కె వాని కిరుగ్లాసుల చిక్కని టీ యొసంగుచున్.

శా॥ భాయీ! భారతదేశ మెంతటి క్రియాభాండారము న్నేడు కో
ల్పోయెఁ వందలయేండ్ల కొక్కడుదయంబొందున్ దయానందవ
ద్ధీయుక్తుండు షడంగపూర్ణనిగమాధీవాసచిత్తుండు చెం
దై యాసాకదుల పాళిలో చిరయశుం డై దేశసేవ్యాళిలో. 88

క॥ ప్రేమింతు దయానందు మ
హామేధావీంద్రు త్రయికి నప్రతిహత మౌ
ప్రామాణ్యము సర్వత్ర స
భామండనముగను నేడు వఱలించుటచే. 89

గీ॥ సర్వసమ్మత మైనదా శంకరుని మ
తమ్ము? కాకున్న సతని నందఱును మెత్తు
రేల? శాంతిసంస్థాపనశాలి గనుక
నీ దయానందు జాతీయవాది గనుక. 90

క॥ అని తిలకు!శంకరు మత
మునకున్ స్వామిమతమునకుఁ బోలిక కలదా?
యను "నాగార్కరు"తో నత
డనియె మరియుఁ గలదు విగ్రహార్చనలేమిన్. 91

గీ॥ సన్న్యసించినగాని మోక్షమ్ము లేద
యందుఁ, బ్రజ లెల్ల సన్న్యాసు లౌదు రెట్లు?
కలసి రెండఱో షణ్మతస్థు లోక టగుచు
నైనఁ దమ పూర్వవాసన లణతు రెట్లు? 92

శా॥ దానన్ విగ్రహపూజ తన్మతమునన్ దైవారెఁ దర్వాత ని
ర్యాణంబున్ దరియంగఁ జేయుట,కిటన్ వర్ణిత్వగార్హస్త్యముల్
వానప్రస్థము నడ్డురావ యమృతప్రాప్తిన్, బ్రతీకార్చనా
ధ్యానప్రగ్రహ మేల యుండవలె,నట్లై మ్రొగ్గినారల్ ప్రజల్. 93

ఆ॥ వె॥ వేదముల్ ఖగోళవిజ్ఞాన మటుల పీ
ఠార్చనమ్ము విగ్రహార్చనమ్ము
కలసిమెలసి భరతకాశ్యపీసంతాన
హృదయమందు నురక లెత్తుచుండు. 94

చ॥ అటు లయి స్వామి యన్నొకనినయంతగ వానిమతమ్ము సర్వులన్
దటుకున వచ్చి లోగొనద, తన్మతమే యన నేల?యే మతం
బిట నిది యెల్లవారి దని పేర్కొన నైనది? కాని దేశశం
పటుమత మా మహర్షి దియ వైదికమున్ హతవర్ణభేద మై. 95

గీ॥ నిగమమంత్రమ్ములను ప్రమాణీకరించి
బోధ మొనరించి పబుదార్లఁ బోవు వివిధ
బుద్ధు లగు ప్రజ నొక త్రోవఁ బోవఁజేసి
నవి దయానందు మతము శంకరుని మతము. 96

ఉ॥ స్వామి యెయింక నొక్క పది వత్సరముల్ మనియున్న చోఁ బ్రజా
స్వామిక రాజవాదనవిశారదులన్ దుమికింపకున్నె! నా
గ్రామము వీడి యీ పురిని కాలిడినట్టి పదేడునేండ్లలో
నే మొనమొన్న వింటి నొకనిన్ యతిశిష్యుమహోద్యమైష్యునిన్.

గీ॥ తన సమస్తము దేశాభ్యుదయముకొఅకు
ధారవోసె సర్దారు లాహోరునన్ "ద
యాళుసింగు", తద్బాంధవు డలరి చెప్పె
స్వామికృతములు వ్యాయామశాల లెన్నొ. 98

ఉ॥ శాలకుశాలకున్ ద్రవిణశాలురు పెక్కురు, తొంటి చివ్వ వాం
గ్లాశికి గెల్పు గూర్చిన స్వకర్మకు లజ్జితు లౌచు వారు పాం
చాలము భారతాగ్రబలచాలక మౌటకు నిర్ణయించి వ్యా
సాలు రచించి పంపిరి వెసన్ మన పత్రిక వెల్వరింప నై. 99

ఉ॥ కానిన కాదు ధర్మకృతిపట్టున భారత మంచు స్వామి యె
న్నేనియు సంఘసంస్కరణ లే మన కొప్పుచు వేదచోదితం
బై నలువేల యేండ్ల మొద లాస్థ నెసంగిన వర్తనమ్మునే
పూనవలెన్ జనం బనెను, బొత్తుగ నొప్పడ దీని మాఱుపున్. 100

ఉ॥ దీనికి మెచ్చితిన్ బ్రజకుఁ దెల్పెద మిప్పటికన్న సూటిగా
దాని గతాధికారమును తత్కలనాకరణీయకార్యమున్
హానిగవిభుత్వమున్ దెగినయొప్పునఁగోయమొకో! స్వైయిటకృపా
ణీనిశితోక్తి పత్రికల నిండగఁ జేత నెసంగు రెండిటన్ 101

ఉ॥ వంకర లేని జీవితమువాడు, నిబంధనమాల జాతికిన్
సంకెల లూడగొట్టు నొక సమ్మెటగాఁ గల 'విష్ణుకృష్ణచి
ప్లుంకరు' పోవుచున్ మనకు వ్రాసెను ముద్రణశాల పత్రికా
సంకలితమ్ముగాఁ బ్రజల సఖ్యత కంకితు లన్న నమ్మికన్. 102

శా॥ ఆగార్కర్ వచియించె నో! జనగణాధ్యక్షా! శివాజీసదృ
క్షా! గంధర్వులు కాడు 'చిత్పవన' వంశఖ్యాతి గాపాడు నీ
ప్రాగల్భ్యమ్మున పరంగి యేల్బడివడిన్ రాపాడదో! మంత్రులున్
గాఁ "గేల్కారుకపర్దిజోషియుగళీకారండికర్" ల్లుండగా. 103

మ॥ అదిమెన్ జీకటికొట్టులో నిపుడు కొల్హాపూరురాజున్ తివా
ను దివానా యని తెల్లవాని సలహాసుం బొంది,యవ్వారి బె
ట్టిద మౌ నైచ్యము 'కేసరి'న్ బగటి మడ్డిన్ బాలనాపాత్ర ని
ట్టిదిగా లోకముముందుఁ బెట్టుదము స్పష్టీకృద్వచోధాటిమై.104

మ॥ అని నీ వన్నవు డేను వ్రాసితిని కాదా!బాలగంగాధరా!
యనుమానింపక నీ "మరాటి"లిఖనం బల్లే,తదాలోకు లీ
'పునహా'పీటను నాటనాట మనలం భూషింప,రాజాధికా
రిని మన్నింపగ వేడు పత్రికలవారిన్ గేరి దూషింపగా. 105

గీ॥ ఆ దివాను న్యాయస్థానమందున మన
పైనిఁ బెట్టిన కేసులో ఫలిత మెట్టి
దేనిఁ వల్లెవాటుగఁ దాల్తు నీవు వోలె
కలరు మనకు "మెహతాతిలాంగులు" వకీళ్ళు. 106

గీ॥ అనఁ దిలకు పల్కె,వాదింతురకొ! "ఫిరోజి
షాతిలాంగులు" మనవైపు, చక్కని విధి
శిక్షపడినను మేలె,ప్రత్యక్ష మైతి
మిపుడు పత్రికాముఖమున నిండియాకు. 107

మ॥ విషువద్బ్రధ్నగతిన్ వసంతబుతు వావేశించుటల్ రేబవల్
విషమత్వం బిటుటల్ తగన్ మృగశిరాఖ్యమ్ము వ్యాసమ్ము,జ్యో
తిషసిద్ధాంతము ఫ్రాంసు కంపి వినుతిన్ దీవ్రమ్ము లోకైకపా
రిషదిన్ గైకొని యుబ్బునంతకుఁ బదిన్ రెట్లుబ్బితిన్ దీనిచే.108

ఉ॥ ఎంతటివాడు కాని ప్రజ లెల్ల రెఱుంగక వారికోస మై
వంతలపాలు గా నతడు వాడిపడున్ విరి వోలెఁ, జుక్కప
డ్డంతటిచెప్పికోలు గనునా!ఘనశక్తియు దొడ్డకీర్తి జ
న్మాంతరపుణ్యలభ్యములె యైనను రెంటికి రెండు పుణ్యముల్.

ఉ॥ ఉద్యమ మేది యేని ప్రజ యొప్పిన కల్పకవల్లి,కానిచో
వైద్యుతవల్లి, యిందు పరపాలన దుల్పగ నాగరమ్ము లే
విద్యలు లేవు,వాయి చెయి వీలున వాలున వెల్ల రార్చ నౌ
విద్యయె తక్క, నాయకత వేచియ యున్నది యేమ నందువో!

ఆ॥ వె॥ ఎన్ని కోట లైన నిట్టె కట్టగవచ్చు.
నాయుధముల యుద్ధ మాడవచ్చు
జనులు మెచ్చ మెలగు టనునది కష్టత
మంబు నాయకత్వమాతృభూమి. 111

క॥ నారోజీకృతసంస్థన్
జేరి పని యొనర్చుటయును, శ్రీరానడెతో
గూరిన విద్యాబంధము
పోరాములు కావు విడువ బుద్ధి పొడమెడున్. 112

మ॥ దినమున్ శ్లోకశతమ్ము వల్లె కిడి మోదించెన్ మహాశాస్త్రి నా
జనకుం డాయన యిచ్చిపోయినది యీ సాహిత్యపద్దర్శనీ
పనితగ్రంథకదంబ మంతయుఁ, బునఃపాఠమ్ముకై యిం దొకం
టిని విప్పంగనె రాజకీయములు కంటిన్ గొట్టిమూయించెడిన్. 113

ఉ॥ అంబుదగర్జనంబు తొలి నై మలిఁ బంటలు పండు, శాంతి యు
ద్ధంబున వచ్చి యొచ్చిరిలు, దంటల జంట పరస్పరంబు కా
ర్యంబు నెఱింగి చేసినదె యాదల వంచు ప్రసక్తి లేని స్నే
హంబు,స్వరాజ్య మందుకొన నైనది యీ తెఱ గంచు నెంచెదన్.

చ॥ మన గతి యిట్లు పట్టినది మత్సఖుడా ! మన పెద్ద లెన్న డే
ననుకొని యుందురో!యడిద మందక యూపిరితిత్తితోడి నా
ల్కను కదలించి జాతి యభిభూతి నెదుర్చ నటంచు, గెల్చు నం
చును నెది త్రోవ త్రొక్కవలెనో! ద్వివిధంబొ! స్వరాజ్యసిద్ధికై.

ఆ॥వె॥ మాఱె కేశవాఖ్య మక్కమ బలవంత
రా వటంచు, శాస్త్రభావకతయు
మాఱె రాజకీయ మై, మరుత్సఖసంజ్ఞ
సార్థకముగ నిండియాను మార్తు, 116

శా॥ నానాసాహెబు ఝాన్సిరాణియనుతాంత్యాతోపె ఖడ్గమ్ము లాం
గ్లానీకాతులు మిర్మిటుల్ గొనగ ము న్నాడించినారల్, జనం
బీ నా డతిశిఁ దోపనట్లు ప్రభుతాహ్వాన్మథ్యముం ద్రెల్చు వి
న్నాణంబుఁగా గుఱుతించుగాత! మదుపన్యాసప్రభూతధ్వనిన్. 117

క॥ పాపము! ఘాడ్కే! పోయె, ప్ర
జాపాలన మెట్లొ సేత శ్రమపడి వ్రాసెఁ
రూపించె నుద్యమ మెటులు
ప్రాపించునొ విరతి తోడుపాటుగనమిచే. 118

శా॥ స్వాతంత్ర్యప్రథితాహవమ్ము తొలి దౌ పాఠమ్ము, ఘాడ్కేసమా
నీతం బయ్యె ద్వితీయపాఠము సఖా! నీచేత చెప్పంబడున్
శాతం బైన తృతీయపాఠ మిపు డే ఛాయం బ్రవర్తింప మే
లో,తీంద్రమ్ములు నాటినాటి కఖిలాంగ్లోచ్ఛాటనల్ నా మదిన్.

క॥ నా నాగార్కరు పలికెను
నేనా! చెప్పఁదగువాఁడ, నీకున్ జెప్పన్
రానడె మతముల యొరిమ, ద
యానందుడు చెప్పె కులసమైక్యముగరిమన్. 120

క॥ గతభారతమహిమస్రుతి
శ్రుతికి మలిపి రాజకీయభూరతకై ప్ర
స్తుతదుర్గతి దెలిపి ప్రజన్
గతభేదముగఁ గలిపి యడుగఁగదె జయశ్రీఁ. 121

క॥ మన మందలమును సందర
మున మును మందరము నటులు మొరయింతుమటే!
జనమును,సందిగ్ధములటె:
జనిసాఫల్యస్వరాజ్యసౌధీజగ్గుల్. 122

క॥ ఈతన్ జేపకు, దూకున్
గ్రోతికినిన్ జిత్తు నక్కకున్ జెప్పెదనా!
యీ తెల్లదొరతనము నీ
చేతన్ ద్రావదొకో! మూడుచెరువుల నీళ్ళన్. 123

క॥ నీ పరిచితిము నొందిన
దా! ఘానా యిన్ని యిన్ని తాలింఖానాల్
చూపలు వెలిగొనఁ గాలే
జీవయినుండి దుమికి హాతిఁ జెందని జాణా! 124

గీ॥ ఆంగ్లు వ్యాఖ్య హిందూలాకు నవతనీయ
మనుచుఁ జదువక నెగ్గిన న్యాయశాస్త్ర
పట్టభద్ర! కేంబ్రిడ్జిలోఁదిట్ట లెన్ను
గణితశాస్త్రనిర్నిద్ర! ని న్నెనయు నెవడు? 125

ఆ॥వె॥ ఇకను పలికె నాత డీక్విటీ నీవు లా
క్లాసునందుఁ జదువు కాలమందు
వి.. ..నడేకు వీనులలోఁ దేనె
తెట్టె పెట్టె ననుచుఁ, దిలకు పలికె 126

శా॥ నీకున్ దెల్పినె పెట్టె దేవు, డెదియు న్నే దెల్పలేనంచు నేం
తే క్లప్తమ్ముగ నంతగాను న్ దెలిపినావే! మెచ్చినానోయి! తే
లే! కాల మ్మిది పాఠశాల కరుగన్, లేశమ్ము జా గౌనొ చీ
కాకై 'యాప్టె'నిఘంటు వ్రాయదువయస్యానాడుమర్నాడునున్.

క॥ అని తిలకు తిలకమును పా
గను కండువ దాల్చి చనె నగార్కరుతోఁ, స
ద్గుణ మిడఁ బంతుళ్ళ సృజిం
చెను విధి, మధురఫలగణము నిడ మామిళ్ళన్. 128

మ॥ భృతికిన్ జాలినయంత వేతనముతో విద్యాప్రదానమ్ము భా
రతజాతీయపురోభివృద్ధిసరణిన్ రాణింపగాఁ జేయ దీ
క్షితు లై నట్టిరలోన వారు ప్రథమశ్రేణీగణేయుల్, దరి
ద్రత యాడంబరమందు, ధన్యత స్వధర్మంబందు నవ్వారికిన్. 129

సీ॥ తనచుట్టు పిల్లలందఱఁ జేర్చుకొని వారి
పరిహాసముల మెచ్చు పరమహంస
పూయించి సద్వృత్తమును జగమ్మున తావి
సడలనీని సదావసంతమూర్తి
చెప్పిచెప్పి విసుగుఁ జెందని మహనీయు
డవమానవిషపానమందు శివుడు
పేదఱికమ్ముతోఁ బెనగి క్రిందఁబడియు
మాటజాఱని మహామానధనుడు

గీ॥ అతడె ఖడిపంతు లన నుపాధ్యాయు డనగ
నలరు, సన్యాసమును గృహస్థాశ్రమంబు
మౌనమునను సంతానసమ్మర్దమునను
చాటుచుండు, హృదయవీణ మీటుచుండు. 180

ఉ॥ అత్తరు లేకయే వలచు నాంగ్లముచెప్పెడివాని దుస్తు, ల
త్యుత్తమపంక్తివా డతడు, పూ్యను నమస్కృతి సేయు తీరె వే
ఱ త్తురగస్థతుల్యునకు, నైనను సర్వసమానభావసం
పత్తి యగార్కరుం దిలకు పంతుళు లై తగు పాఠశాలలో. 181

గీ॥ సామయికతపాలనమున సారబోధ
నమున విద్యార్థిక్రమశిక్షణమున నట్టి
విద్యఖని "న భూతో న భవిష్యతి" యని
పేరు మ్రోగె. బాలుర సంఖ్య పెరుగసాగె. 182

ఉ॥ లెక్కల పాఠము న్నొడివి లేచి యగార్కరుతోc దిలగ్బుధుం
డెక్కడ వ్రటిలున్ దమపయిన్ దదహమ్మున వ్యాజ్యమా జనుల్
క్రిక్కిరియంగ బొంబయిపురిన్ దగు కోర్టుకు వచ్చి వాదనన్
గ్రుక్కయుc ద్రిప్పికోని తమ గొప్పవకీళ్ళను మెచ్చి భాసిలెన్. 

క॥ చాకలి మొదలగువారల్
గాక ప్రజాసేవకులును గలరే యనుచున్
వాకొనె మూణ్ణెలలుగ శి
ఱాకాలము జడ్జి తిలకగార్కరులకునున్. 184

శా॥ కొల్హాపూరుదివాను గెల్చియు కళన్ గోల్పోయెc బౌరుల్ దళ
త్కల్హారస్రజముల్ దనర్పc దిలకాగార్కర్లకంతాన ఘూ
రు ల్హ్వారా లని నేత్రుతార్థు లని, కారోత్క్రాంతమాసత్రయుల్
బల్హాళిన్ బ్రజ గోర మేలువణి సంభాసిల్లి రా యిర్వురున్. 185

ఆ॥వె॥ 'వర్డ్సువర్తు' ప్రిన్సిపాలును "రావుసా
హేబుమాండలికుడు" నేర్పరచిన
మేలువడి యది, తొంటి మేనా గుదుర్చె పూ
నా స్వరాజ్యనవజనయశమునకు. 186

గీ॥ డెవిలు వనుచు "కెనిలువర్తు"నవలలోని
"బ్లంటు" వనుచు పోలిక లేని బంటు వనుచు
కొసరి పొగడె నీ యేల్బడిగొంటు వనుచు
బాలగంగాధరుని సహపాఠిగణము. 187

# కాంగ్రెస్ ఖండము

మ॥ కాలెన్ దొల్లిటి పాఠశాల యది "ఫెర్గూసన్" కళాశాలగా
వెలెన్ బోధకపాళి తొంటియదె, గోపాలాఖ్యుడున్ గృష్ణన
ద్వరసూనుండును గోఖలేకులసరస్వచ్చంద్రు డొక్కం డటన్
చరితంబుల్ గణితంబునున్ గలవు నాంగ్లం బర్థశాస్త్రంబునున్. 1

సీ॥ ఏ దరిద్రతనేన్ భరింతును దేశసే
వాదరిద్రత భరింప నను వాడు
నెంత వాదమ్మైనం దేనియు నైదు రూ
ప్యమ్ములే పణ మిదు పందెగాడు
నెట్టి క్లిష్టత నెదిరించినన్ గటుశబ్ద
మెయిదని వడి మందలించువాడు
నెంతసే పయినఁ గానీ వ్యాసరచన నాం
గ్లమున నిరుపమించు కలమువాడు

గీ॥ తప్పుతప్పన కొక యణా చొప్పున నిడ
నొప్పుకొని పతితము నొప్పఁజెప్పుచుఁ గొని
గంట లెదిరికాలమ్మును గడన కెడము
సేయువాడు నేతండు? "గోఖ్లే" యతండు. 2

గీ॥ ముడివడదు కన్నుబొమ, మీసము మెలివడదు
ప్రభుత నతివాదమున నెదుర నొడఁబడదు
నెడద, మృదువుగ దానిని హెచ్చరింపఁ
దడబడదు మాట, గోఖలే గడుసువాడు. 3

గీ॥ బాలగంగాధరుని ప్రోల చాలసేపు
మసలజాల డాగార్కరు మందటఁ బలె
గోఖలే, వార లిద్దఱు కూడి నెడల
మళ్లి కలిసికొంద మనెడి మాట తలఁచు. 4

గీ॥ తిలకు సూర్యుని వరమునఁ గలిగినట్లు
వాని తల్లి చెప్పఁగ విన్నవారు కలరు
గోఖలేగూర్చి తల్లి వాకొనద, యితడు
చంద్రు వరమునఁ బుట్టిన జాడ కలదు. 5

క॥ భారతదేశచరిత్రము
సారము ప్రజపాలన మ్మొసంగమి ననుచున్
యూరోపుచరిత గోఖ్లే
సూరి కళాశాలలోన సొంపుగఁ జెప్పున్. 6

క॥ దక్కను విద్యాసంస్థకు
ని కాలేజీయు బడులు నెన్నో కలవు, కా
దెక్కువ తక్కువ గొనముల
దక్కఁగ జనముల నటంచుఁ దద్ఘోషణముల్. 7

గీ॥ తిలకగార్కరుచిప్లుంకరులు నెలకొలి
పిన బడి గవర్నరుధనమున నటు లోకమ
హాకళాశాల యయ్యె సహ్యనగజనిత
మలతి యూట గోదావరి యైన యట్లు. 8

సీ॥ నా తల్లిభాసకన్నను తీయనైన దే
భాస లే దని మదిఁ బోసరించి
'జననీ చ జన్మభూ స్స్వర్గాదపి గరీయ
సీ' యను భావమ్ము చెంగలించి
మనియెద నున్నతమస్తాన నే గుమా
స్తాను కా నను బుద్ధి దందడించి
నా పూర్వులె యపూర్వనయధైర్యధూర్వహు
లన్న నమ్మక మాత్మ కందగించి

గీ॥ తరుణవితతి జాతీయతాతరళితమతి
యగుట కా. కళాశాల చాలఁ గృతశీల
"ఆపటే"వంశ్యుఁడు శివరామాత్మజుండు
"వామన"బుధేంద్రు డాచార్యవర్యుఁ డందు· 9

గీ॥ రెండు బాహువులును కేసరియు మరాటి
పత్రికలు, "సార్వజనికసభయును" దక్క-
నెడ్యుకేషనలు సొసైటి" యీతణము ల
నన్యదృఢమహారాష్ట్రచైతన్యమునకు. 10

గీ॥ బాలగంగాధరాదిసభ్యాళి దగు స
భాయుగిన్ రానడేపల్కు-బడియె ఘనము
ఘనతరము సార్వజనికాఖ్యఁ దనరు సమితి
నాంధ్రమందు వేమన్నపద్యంబు వోలె, 11

గీ॥ ప్రార్థనాసమాజమ్మును పాదుకొలిపె
రానడే, యందు నాగార్క-రాదిసభ్య
లెందఱో జోహారు లర్పించి రిలఁ దొలంగి
నట్టి కేశవచంద్రసేనమహితునకు. 12

గీ॥ దేవు డున్నాడు లే డను తీర్పునందుఁ
దక్క- క్రైస్తవబౌద్ధభేదమ్ము లేదు
దీని గమనించిన యతండు లేనె లే డె
వండు ననియెఁ గేశవచంద్రపండితుండు. 13

చ॥ బ్రతుకులు కావు మిథ్యలు, ప్రపంచము మాయయుఁ గాదు, నీశ్వర
స్థితి ప్రకటించు నియ్యదియె, చెప్పను లేదు జగత్తు మిథ్యగా
శతగణనీయ మౌ నుపనిషత్తతి, మానవసేవ దైవసే
వ తగిన జీవితార్థములు, పల్కులు సేనుడు పల్కె నిట్లుగా. 14

సీ॥ క్రైస్తవ మేషియాఖండలబ్ధ మని అం
డనున డిండిమఘోషణంబు సలిపె
దాని ప్రాణ మహింస, తత్‌జ్ఞులు గారు త
దజ్ఞులే అప్రాచ్యు లనుచు దులిపె

నందలి దశనిర్ణయములు దశేంద్రియ
వ్యాపారనియమము లనుచుఁ దెలిపె
తత్ప్రతిబింబ మై తనరారునట్లు హైం
దవమును నూత్నవర్తనికి మలిపె

గీ॥ విగ్రహార్చన దోస గని యాగ్రహించి
మూర్తిరహితార్చనన్ జనమ్ముఁ బురిగొలిపె
రామమోహననిర్మితబ్రాహ్మమతము
చికిలి చేసి కేశవచంద్రసేనసూరి. 15

క॥ ప్రేమైకరాజ్యమునుగా
భూమిఁ జేయుటకు క్రైస్తు పొడమగ, యుద్ధ
స్థేమైకభోజ్యమునుగా
నా మతమునవారు సేత యాశ్చర్య మగున్. 16

గీ॥ కర్మ లేదు ప్రజాసేవకన్నను, మరి
జన్మ లే దని బోధించెఁ జంద్రసేను
డత్తమిలుగాత! మాతని యాత్మ శాంతి
ననుచు మౌనము పాటించి రచటివారు. 17

గీ॥ అత్తమిలుత! శాంతిని మృతు నాత్మ యనుట
హైందవేతర మని యొక డాడ మరొక
డతడు బ్రాహ్మసామాజికు డగుటఁ గ్రైస్త
వాభిమానియు నగుట నట్లందు రనియె. 18

గీ॥ బాష్పయుతుడు రామకృష్ణపరమహంస
నిముర కాళి! కాళీ! యని యమృత మొంది
నాడు కేశవచంద్రసేనార్యు డంచుఁ
బత్రికలఁ దాఁ జదివినట్లు పలికె నొకడు. 19

గీ॥ కాళియనిన "గాడ్ గ్రేస్" కేశకూళి యనిన
నఖిల "మల్లామియా" కేళి యనిన నొకచె
మోదమున పుష్టి, వాదము మూట నష్టి
యంచు శ్రీరానడే నిర్వచించి లేచె. 20

గీ॥ ఎన్ని కనులో లోకా లేలు నీశ్వరునకు
నెన్ని యానందలోకాలో పున్నెముల గ
నులకు నెన్ని కోరికలో జనులకు నన్ని
పొడిచెఁ జుక్క. లబ్దముఖాట పూలతోట. 21

క॥ జిలుగులు జాబిలివెలుగులు
మెలిగొనె ద్యుశ్యామనగవుమిలమిల లై ది
క్కులతో, సార్వజనికసభ
గలిబిలిగా మెచ్చుకోలు కంఠము విప్పన్. 22

గీ॥ వచ్చె నిడు జా బొకండు సార్వజనికసభ
కది "సురేంద్రనాథుడు" పంపినది, కొలువునఁ
గార్యదర్శి పఠించె నా కమ్మ నిటులు
సభ్యజనశుభాకాంక్షలు జడిగొనంగ. 23

గీ॥ పరెలె నాక్టేవియస్ హ్యూము" భరతఖండ
కార్యదర్శిపదవినుండి గళితు డగుచు
మనకు హితు డౌట వ్రాసెను మత్పురస్థ
విశ్వవిద్యాలయచ్ఛాత్రవితతి కిట్లు. 24

ఉ॥ అందఱకన్న గొప్ప యెవ డాతడు కావలె సేవకుండుగా
నందఱకున్, స్వభోగవిముఖాత్ములు కావలె భారతీయు లా
నందఱు, దేశ మభ్యుదయ మందుట దబ్బర యిటు కానిచోఁ
జిందఱవందఱల్ హృదయశేఖరసర్వవినూత్నభావముల్. 25

ఉ॥ ఇంతకుఁ గాంతిమంత మగు నేల్బడి నొంద నవర్హు లౌట య
ట్లుంతము, దానిఁ గోరదగు నొప్పునకున్ వెలియౌదు రీరు ధీ
మంతులు నాయకుల్ దిటవుమై ప్రజహక్కులకై పెనంగ కే
క్రంతనొ దాగికొన్న యెడఁ, గ్రచ్ఛలఁ జాటుడు
మత్ప్రబోధముల్. 26

క॥ ఏ జాతికిఁ దగు పాలన
మా జాతికి వచ్చితీరు, నలసత్వముతో
మీ జాతి ముడిచికొని మము
వాజమలన్ జేసినా రెవరో యనఁ దగునే! 27

శా॥ ఓ విద్యార్థులు! భారతాధికులు విద్యోద్దండులే లేరు కా
దా! విశ్వమ్మున, నట్టి మీర లహొ ! స్వార్థస్వాంతు, లి ట్లొచు స్వే
చ్ఛాభ_త్త్వమ్మును పక్షపాతరహితస్వాదుప్రభుత్వమ్ము నే
లేవన్ గోరుదు ? రెట్లు తోడ్పడుదురండీ! మీకు నస్మాదృశుల్ ?

ఉ॥ మీ వ్యవహారనిర్వహణమేదురభాగసమార్జనప్రయ
త్నవ్యవధానహేత్వలసతన్ బరికింపఁ బ్రభుత్వవర్గమే
సవ్యముగాఁ బ్రవర్తిలిన జాడలు తోచెను, మీకు సాయమై
రో వ్యధితాత్ము లౌదు రెవరు, న్నిజ మట్టివి మీవి పోకడల్. 29

క॥ విఫలము లైనవి నేటికి
"డఫరిన్" వైస్రాయి గను కడానికలలు మీ
శఫరీత్వమును తిమిత్వము
గ ఫిరాయింపఁ దగు కోర్కెగముల గలగలల్. 30

మ॥ ఇది యిట్లే కొనసాగుచున్నెడ భవద్వృత్తమ్ము యుష్మత్కృశో
దరకన్ హాణుల రక్షకస్థితిని మీరల్ చక్కగా చాటి చె
ప్పెద, రుద్యోగము లున్నతమ్ము లెపుడున్ శ్వేతాస్యలభ్యమ్ములే
యిది యొప్పా? యనరాదు మీరు, వివరా దీ మాటలౌ మేమునున్

గీ॥ పురుషులైనవారికి వారి పోకడలు తె
లియును, తమ సౌఖ్యములఁ బ్రజకయి తొలంగు
దేశగౌరవజీవులు తెల్లవారె
తగుదు, రన్యులు తగరు పెద్దకొలువులకు. 32

శిఖ॥ పరశ్రేయఃకాంక్షాపరిమళితనిస్స్వార్థవిమలాం
తరంగమ్ముల్ స్వాతంత్ర్యజలధితరంగమ్ములనుగా
నెఱుంగన్ జ్ఞాన మ్మిం దెసగువల కాంగ్లేయులెనుమా॰
దొరల్ హిందూదేశస్థులకు, మెలగుండీ! మెలకువన్. 33

క॥ ఇది తల్లేఖాసారం
బిది యొక మేల్కొలుపుపాట యెల్లరకును, హ్యా
మ్మదికిఁ ఋణపడితిమి, సం
పద తా నై వచ్చె భద్రపఱచుకొనవలెన్. 34

కం॥ భాసిలు భరతధర కొకటి
యై సంస్థ శరీరమునకు నొదల వలె నై
యా సదసి రాజకీయము
వాసిలు జాతీయభావవై దుష్యముతో. 35

కం॥ మోజుపడెను వైస్రాయి, మ
హాజనసభ చెన్నసగరి "నామ" యనియె, ద
ద్రాభ్యజనమునకున్ గలక
ర్తాజనబొంబాయిజనులు 'తయ్యా' రనిరిన్. 36

కం॥ మీ కిదివఱకే జ్ఞాతము
మా కందెను రానడేసుమహితాశీస్సుల్
వాకొనుడు సభాస్థలము న
హా! కలితగుణపునహామహాజనులారా! 37

చ॥ చదివెను కార్యదర్శి యిటు, చతులు చంద్రికకుతు లౌ సభా
సదులను చూచె, గోఖలెవచస్సు ప్రజాహృది నూచె డోల యె
య్యది? పునహాపురంబు మినహా భరతేందిర శాదినుండి యం
చుఁ, దొడరె మర్దలధ్వనికి చుట్టము లౌ కరతాళరావముల్. 38

కం॥ అదివఱకే క్రమశిశుణ
సదనమ్ముగఁ జూచి సంతసంపడె నొకమా
రిది గని రానడె గోఖ్లేన్
బదిఁబదిగఁ గలియుచుండుమా! వత్స! యనెన్. 39

మ॥ కలకత్తా చని ప్రాతినిధ్యమున నొక్కం డామతించెన్ బెన
ర్జి లసింపం బునహాపురమ్మునసె కాంగ్రెస్సంస్థకున్ మీ దయన్
దొలి సారస్వతపూజ సేసెదము రండో! విందు లీ రంచు తత్
స్థల, నీడల్ పడె పూర్వశోభలకు పిష్వోద్యానమం దంతటన్. 40

ఆ॥ వె॥ అంతలో విషూచి యలము సూచనలఁ బూ
నాకు వశము గాద పూనుకొనగ
కాంగ్రెసాఖ్యశిశువుఁ గౌగిలించెఁ దొలుత
బొంబయాందిర భరతాంబ యుడగ. 41

గీ॥ తేజరిల్లె "గోకులదాసుతేజపాలు"
సమరవాణీకళాశాల యత్యలంకృ
తంబు గీతిన్ సభ దనరు వేళ
తరణి సెగ తగ్గి నడిమింట మెఱయు వేళ. 42

ఆ॥ వె॥ హ్యూమును చెప్పి సమితియునికి నొప్పించె నొ
ప్పింప దనుచు ముం న్నె బ్రిటనుచేత
రచ్చ యేండ్లు జరుగ రచన వోలె గడుసు
వారు ననుచుం దాను వచ్చి మెచ్చె. 43

ఉ॥ ఇందఱు వీరు వీ రని వచింప నశక్యము దేవతాత్వముం
బొందినవారు, పొందఁదగు పూజ్యులు మౌనులు మౌనితుల్యులున్
గ్రందుకొనున్ శుభం బనుచుం గాంగ్రెసు నాశిషముల్ పఠించి దా
నిన్ దొరయంగ నే చరిత నేటికి లే దని సన్నుతించిరిన్. 44

క॥ అతిమానవచర్యావిర
హిత మౌ రామాయణం బిదే, దాయాదుల్
దితి నొందనిది మహాభా
రత మిదే, కాంగ్రెస్ చరిత్ర రవణము భువికిన్. 45

గీ॥ జయము రెండు నేండ్లకె వచ్చు సమర మాడ
నిండుగా నది యఱువదిరెండు నేండ్ల
కేని వచ్చిననున్ మేలె కాని యుద్య
మమునకున్ సమరస్పర్శ మసదు లగ్గు. (45-a)

ఉ॥ దివ్యబలంబు బిట్టు కలఁ దిట్టలె కా యవతారపూరుషుల్
శ్రావ్యచరిత్రు, లీదృశులు జన్మము నొందిరి నేటికే, యికన్
భావ్యజనుల్ రహింత్రు నరనారులు పోలిక లేని నేతృతన్
భవ్యతపఃప్రభావజనభాసితచర్చల భాషితం బిటుల్. ४८

మ॥ అభిజిల్లగ్నము జన్మ మౌట జయమం దావంతయున్ శంక లే
దు, భయం బుండద యాటుపోటులకుఁ బాథోరాశితీరంబునం
దు భవం బౌటను, కాంగ్రెసొందక మరే దొందున్ మహా
భాగ్యముల్
సుఖితశ్రీభరతాంబికాతనుభరక్రోడీకృతారోగ్యముల్. 47

మ॥ తొలి విన్పంబడె నాంగ్ల లేఖలు శుభద్యుమ్నమ్ము లం దుండె "స
ర్విలియం వెడ్డరుబర్న్" ధీరవర "హెన్రీ కాటను" ప్రేషిత
మ్ములు, దాదాయి బెనర్జియున్ మెహతయున్ బోనర్జి నధ్యక్షుగా
గల తద్గోష్ఠి నుపన్యసించిరి. "తెలాంగాకారా్కరాష్ట్రేలు"నున్. 48

క॥ "చందావర్కరు" "వాఛా"
నందాచార్యముఖవాచనాంచితసభలో
నన్ దొలి తీర్మానమ్మును
హిందూపత్రికవిభుండు హితవరి చదివెన్. 49

క॥ ఆ సుబ్రహ్మణ్యయ్యరు
వ్రాసెను తీర్మాన మాంగ్లపాలనమున నే
దోసము లున్నవొ తెలియఁ గ
మీషను నియమింపఁ గోరి, మే లనె సభయున్. 50

సీ॥ లండనులోనున్న ఇండియా కౌన్సిలు
వైశమే రద్దు కావలయు ననుచుఁ
బంజాబున నయోధ్యఁ బశ్చిమోత్తర రాష్ట్ర
ముల శాసనసభలు వలయు ననుచు

నిచ్చటి వృతసంఖ్య హెచ్చించి యఖిలశా
సనసదస్సులనుఁ బెంచవలె ననుచుఁ
దత్సదస్సులు ప్రభుత్వపుఁ జర్యలను గూర్చి
ప్రశ్నించు నధికృతి వలయు ననుచు

గీ॥ నధికసంఖ్యాకు లగువారి యననుకూల
భావములును "కామన్సు" సభానివేది
తవ్యములుగా విచారణార్థ ముపసభయు
వలయు ననుచుఁ దీర్మానముల్ వ్రాయబడియె. 51

గీ॥ ఐ.సి.యస్.పరీక్షలు బ్రిటనందు నిందు
నొక్కతటి జరిపించుటయుఁ దదుచితము
వయసుపరిమితి పెంపును పరిథవిల్లె
తిమ్మ నొ నొక తీరుమానమ్మునందు. 52

ఆ॥వె॥ నేటి భూమిపన్ను నేటి పరిస్థితుల్
దుర్భరములు గాన దొరతనమ్ము
సైనికవ్యయమ్ము సమధిక మొనరింప
వలనుపడదు తాను వలచినట్లు. 53

చ॥ దిగుమతిపన్ను పెంచియు విధించియు రాబడిపన్ను దానికిఁ
దగ రనుకొన్న కొల్వును పొనర్చు పొనర్పని కొంతమంది, తె
చ్చుగఁ బరిభర్చు తప్ప దగుచో నపుడే సలుపఁగావలెఁ, ఋణ
మ్ముగుతిచి "గ్రేట్ బ్రిటన్" ప్రభుత పూచిపడఁగావలె భారతస్థితిన్.

శా॥ బర్మాకా భారతభూమిలో గలుపు టస్రాశ స్త్య మౌ, తప్పదో
కర్మం బియ్యది సింహాళం బటుల నౌగాతన్ ! దదాయోజనా
ధర్మం, బందలి పెద్ద వేఱు నని తత్సంస్థానమధ్యమ్మునన్
దీర్మానమ్ము లిటుల్ కృతమ్ము, లిక నుండెన్ రెండు
మామూలుగా. 55

ఆ॥వె॥ సర్వముం బ్రదేశసభలకుఁ దెలుపగ
వలయునన్నదియును వచ్చునేట
కాంగ్రెసు జరుగు కలకత్తానగరి నన్న
దియును; రెండు నివియె తీర్పు లవ్వి. 56

మ॥ తడవెన్ జెన్నపురీమహాజనసభాధ్యక్షుండు రంగయ్యనా
యుడు పాలింపునవంపులఁ, సతులకెంతో విద్య నేర్పించి మా
ర్పిడి సంఘమ్మునఁ దేగఁ బల్కె "మలబారీ", హ్వానసంఘాధినా
థుడు వందించె ఫిరోజిషా యతిథిసందోహమ్ము నాంగ్లాప్తతన్.

క॥ న్యాయపతిసుబ్బారావు మ
హాప్రజ్ఞుఁడు వీరరాఘవాచార్యుడు పి
ళ్ళైపెద్ద కేశవాఖ్యుడు'
బాపురె! యనిపించినా రుపన్యాసములన్. 58

గీ॥ సార్థకాఖ్యుడు "గంగాప్రసాదవర్మ''
యైకమత్యమ్ముపై నుపన్యాస మిచ్చె
నపుడు మాటాడెను 'బెనర్జి' యయ్యలార !
నేటి తీర్మానములు బ్రిటన్ విన్నయవియ. 59

సీ॥ క్రొత్తపన్నులు వేయకుడు దొరల్! క్రుంగి నా
మిప్పటికే, ఱాము మేర్చు మరల
పన్నులు వేయుచోఁ బాటింపుడీ కృషి
కోక్తి జమీందార్ల నుజ్జగించి
ఉప్పుపన్ను పెరిగె నొగి నలుబదిశాత
మింక లై సెన్సు ప న్నేలనండి!
మూగవారినిగ మమ్మున్ జేసి బరు వె_త్త
పరు వళే! మీకు, మాసారము వినుచు

గీ॥ ప్రాతినిధ్యమ్ము కలుగ నాష్టనురణవ్య
యమ్ము తప్పించుకొనియుండమా! తమ గరు
వంబు నిలబెట్టుకోఁ జేయు వ్యయము నెల్ల
తమరె భరియింపవలెఁ, బాడి దప్పవలదు. 60

ఆ॥వె॥ మీరు చేయుచున్న మే లేమొ కాని, పె
నమ్మునుండి నిప్పునందుఁ బడిన
యట్లె యైనదండి! యస్మదీయస్థితి
శానురాను కంచె చేను మేసె. 61

గీ॥ అనుచు "లాలుమోహనఘోషు" వినిచె "నిండి
యన్ సొసైటి" తరపున లండ నరిగి, వినియు
చెవిటి కని గ్రుడ్డి యన్నట్లు చెలఁగెఁ బ్రభుత
యింత మొర పరిహాసకోదంత మయ్యె. 62

క॥ చెవి నిలుకట్టుకొని పో
రవలదె! మన హక్కు లొంద, వాగ్దక్ష్యముతో
రవళించును కాంగ్రెసిక ప్ర
తివత్సరము ప్రాతినిధ్యదీధితికొఱకై. 63

ఆ॥వె॥ భరతధరణి భాగ్యభరితము తమచే న
ని ప్రతిబ్రిటనుజనుడు నిడు వచించు
సొంపు లింపు లొలుకఁ జోద్యమ్ముగాఁ జెప్పు
చూచిన తనికన్న చూడనతడు. 64

మా॥ అని మరియు బెనర్జీ యన్న తర్వాత దాదా
వినిచె నిటులు "రిప్పన్" పెద్ద వైస్రాయి పంక్తిన్
గుణమున, నని నా వాక్కున్ విమర్శింపనేలా?
పొనరుపఁ గని కృత్యంబున్ విమర్శింపు డంచున్. 65

సీ॥ దేశభాషాముద్రణాశాసనమ్మును
తుడిచెను 'గ్లాడ్స్టను' తోడు గాగ
సింహాసనాసీనుఁ జేసె "మైసూ"రధి
పతిని, ముగించె నాఫ్ఘనురణమ్ము
జనసంఖ్యగణితమ్ము సలిపించె, "నిల్బర్టు
బిల్లు" నె శ్లైనను వెల్లడించె
చినపెద్దబడుల హెచ్చింపఁ జేసె, రూల్సుతోఁ
గరగించె నుప్పుపై కరము కొంత

గీ॥ మండలలోపమండలగోష్ఠిమండితముగ
దేశమున్ జేసి యెన్నికల్ తెలిపి ప్రజకు
స్వపరిపాలనమున నొక సరణిఁ జూపె
నలరు తెప్ప రిప్పను భారతాత్మసరసి. 66

సీ॥ కార్మికులకు కర్మాగారకార్యకరణ
కాలఘంటలు తగ్గించి స్త్రీలు బాలు
రును తెలివి నొందఁ జేసె, నుర్ములును మెఱుపు
లెఱుగని ఘనమ్ము కురిసిన శ్లైలె నతడు. 67

ద్వి॥ అట్టి రిప్పనుడు న న్నాలకించియును
కట్టడ యిట జనగణతంత్రసౌధి. 68

గీ॥ 'వాయిసాఫిండియా" యను పత్రిక నిట
వెలువరించితిఁ, దెల్లవారలు వహించు
నన్ని యధికారముల నొంద నగును నల్ల
వారలకు నని మిక్కిలి పగటినాను. 69

గీ॥ చేసితిఁ బ్రచారమును, సభల్ చేసితి నిట
నటులె బ్రిటనుపురమ్ములయందు "జాను
బ్రైటు" నధ్యక్షునిగఁ జేసి, ప్రతిసమస్య
గొప్పగొప్పయాంగ్లుల నుతి కొప్పరించె. 70

ఆ॥వె॥ అందు నేస్తి నాకు "హిందుమాను" కథించె
బ్రిటనునందు నొక్క విప్లవమ్ము
భారతీయకష్టవార్ధిప్లవమ్ము లే
నంతవఱకు మీకు నింతె యనుచు. 71

చ॥ నెవడును మేలుపై మ రొక నిద్దము మే లను మాట నేడు ని
క్కువ మయి వచ్చె నిందు మనకున్ "డఫరిన్"దొర వచ్చి రిప్పను
ప్రవరగుణస్థలమ్మునఁ,గృపారపకుండము వీని గుండెయున్
వెదుకగ నేల?యెట్టెదుటనే సభ యుండ మరొండు సాక్ష్యమున్.

చ॥ ఎవరును బాగుచేయగలరే! దురదృష్టభరప్రజన్, బొసం
గు వచన మిట్లు, నభ్యుదయకోవిదులార! తదుక్తి కగ్గమై
న వడువు దోపరాదు మన నాయకు లిందఱు నుండ భారతీ
యవితతికార్యసాధనరహస్యముదీముగ హ్యూము నుండగా. 73

క॥ కేకిసల మధ్య మరియున్
వాఁగొనె నౌరోజి యెంతవాఁడో! హ్యూం, లో
దాఁగొనిన యాత్మ భారత
మై కళుకులు చిమ్మ దేహ మాంగ్లం బగుచున్. 74

క॥ నా కథితపూర్వసర్వమ
హాకార్యములందు రిప్పనాచరణము జ్యో
త్స్నాకలిత మౌనె? హ్యూంకృషి
రాకానిశ కాక యున్నె ప్రాంజలులారా! 75

చ॥ త్రాగుడు మాన్పు శాసనము తత్క్షణకార్యము,కంపుగొట్టునో
పీ! గపురంపు నీ యశ ముపేక్ష వహించినచో న టంచు నెం
తో! గదిమెన్ ప్రభుత్వమును హ్యూం, బరనాలయరీతి బాలశి
క్షాగణనీయమౌచుఁ జెఱసాల పొసంగుట వీని యొత్తిడిన్. 76

క॥ పెంచుచుఁ బశులపై హ్యూం
నించు దయ య దెంతొ యెఱుగ నేరద ప్రజ, త
త్రాపించ త్పదర్శనవసతి
కెంచిన దానమ్మె నెఱుగు నిఱువదివేల్ గా. 77

గీ॥ తగెదు లెఫ్టినెంటుగవర్నరుగను సెక్ర
టరిపదవి పోయె నంచు లిట్టను వచింపఁ
దృణము విసరివైచిన మానధనుడు హ్యూము
చేవ నోకుమానే ప్రజాసేవ నితడు. 78

క॥ ఈ దివ్యజ్ఞాని యిచటఁ
బాదుకొనంబోవు విప్లవము పసికట్టెన్
సాధించె న్యాయమార్గము
నా దారియె నేడు కాంగ్రెసాఖ్యన్ దనరున్. 79

ఉ॥ రెండు ప్రతీచి ప్రాచియు సరిన్ దగు సంధ్యలయందు, నిప్లె రైె
ర్లాండును నిండియా,యిపుడు గ్లాడ్స్టను దాని స్వరాజ్యపాలనా
మండితముం బొనర్పఁగ సమర్థతఁ జూపియు దైవ మేలొ ద
వ్వుండగఁ దానునుం బదవి నుండడ తీరుపు వీగిపోవుటన్. 80

గీ॥ మనలఁ బ్రేమించు మిగుల గ్లాడ్‌స్టను ప్రధాని
యదను దొరికిన విడువక మొదటినుండి
పార్లమెంటున! జాన్ బ్రైటు పండితుండు
వాదు సలిపె భారతవైభవమ్ముఁ బెంప. 81

చ॥ అయిదిట మూడుపాళ్లు భరతావని పైఁ బడకుండ సంగర
వ్యయ మబిసీనియార్థకృత మాపెను, రాచరికంపువిందులం
దయిన కడిందిఖర్చు మన మచ్చుకొనం బని లేనటుల్ బ్రిటన్
పయినిడె మోపె, జాన్ బ్రయిటు, ఫాసెటుచేసెను కొంతసాయమున్.

క॥ వెడ్డరుబర్నన్ కాటను
విడ్డూరముగా వచింత్రు బ్రిటనేల్బడి యీ
గడ్డను పాల్గొనసీయమి
నడ్డముదిరుగు కథ యనియె నాప్తుడు 'బ్రాడ్లా' 83

గీ॥ ఇట్టి వీరును మరికొంద ఱీదృశాంగ్ల
వర్యు, లిందుః నీ డి''.యసు.వైటు' వంటి
మన బలంగ మాంగ్లోయిండియనులు తుఱక
లండ గాగఁ దీరని కోర్కు లుండునటవె! 84

గీ॥ పొట్టివా రైన మాబొంట్లఁ బొడుగువాఱఁ
జేయు నీ కాంగ్రెసు "మొగల్‌సరాయిజంత"
నంత యగుచు, డెబ్బదియుద్ద రైన ప్రతిని
ధు లొకరికి నూర్వు రగుచు ఱంపిలునుగాత ! 85

గీ॥ "ఆ రదరు వైజు" వనెడి క్లా జంతరిప
ముల జడధి వోలె వ్యాయమున్ ముంచెఁ, గొన్ని
చట్టము లకారణమ్ముగ నెట్టివారి
నేని చెఱబట్టునవి సవరింపబడుత! 86

ద్వి॥ అని నవురోజీ సభాత్మకు నిజవ
చనఘనసారచందనచర్చ సలిపె. 87

శా॥ ఆద్యోక్తి ప్రభుశక్తి యంత్యమున మాటాడెన్ సభేశుండు,సం
సద్యాదోనిధిలో భళీనుడి తెరల్ చాశ్రైఫ్య, ప్రభుత్వం బిడెన్
విద్యావైద్యవిశాలశాలలును రైల్వేలున్ దపాలాలు కొ
న్నుద్యోగాల్ మనకు,న్నిదానముగఁ జేయున్ సర్వదానమ్ములన్.

గీ॥ విద్య వికసించినకొలది, వివిధభౌతి
కములు సుకములు విస్తరించి మనుకొలది
రాజకీయపురోగమనౌజసికము
గజగజమ్మ్రగ వేయు నంగ మన జనము. 89

శా॥ ఐరోపాపరిపాలనావిధి స్వకీయం బౌట కాశింతు రె
వ్వారున్, వీరల వేరుతీరుగఁ దలంపన్ రాద యాంగ్లేయులున్
శారస్ఫారవిభావభావభరరాజ్యశ్రీమహోదృశ్యకా
వ్యారంభమ్మునఁ జాత్రధారణము తప్పా?భారతశ్రేణికిన్. 90

క॥ జనులారా! యిప్పటి కివి
మన కాంగ్రెస్ స్థాపనమున మహితాశయముల్
కొనకొని నెలలం బండ్రెం
ట నఖిలసంక్షేమముల బడాయించుటలున్. 91

మ॥ పలువోకల్ విడి దేశభాగ్యకృతిభావశ్రీకులై లోకు లే
కలసత్ప్రగ్రహులై పరస్పరము శంకల్ దక్కి యత్యాప్తులై
కులమున్ జాతి ప్రదేశమున్ మతము విజ్ఞుండజ్ఞుడన్ దృష్టియున్
కలతల్ దేనటు లొక్కతల్లికొడుకుల్ గా భ్రాజిలన్ జేయుటల్

చ॥ చదువరులైన దేశజనసంహతి సంఘసమస్యలన్నిటన్
బదునుగఁ జర్చ చేసి వినుపన్ విని సాధికృతిప్రచారసం
పదల సమాజ మభ్యుదయవంతము సేతలు విశ్వభారతీ
హృదయమహోత్సవమ్మునకు నింగ్రెసుకాంగ్రెసులైనధర్మముల్

క॥ కలకత్తాలో మరలన్
కలసికొనుద మనుచుఁ బలికి కదలెను బోన
ర్జి, లపనలక్ష్మిసంధృత
నళినన్నయనంబుగా జనంబున్ గదలెన్. 94

# పరమహంస ఖండము

క॥ కలకత్తాలో నది యొక
యల లేని తటాక మెసయు నాశ్రమ, మచటన్
గల పరమహంసనినదము
పులకితులన్ జేయు శ్రవణపుణ్యము జనమున్. 1

ఆ॥వె॥ చేత నంటు టది యచేతనచేతనా
ధానమే, ప్రబోధమే నిజోక్తి
కుండలినిగ నగు నఖండభారతశక్తి
కతడు రామకృష్ణప్రతివరుండు. 2

క॥ ఏ జన్మస్మృతికే గా
కీ జన్మ తరించు గతికి నీశ్వరవిజ్ఞా
భ్రాజిష్ణుమనస్స్థితికిన్
భాజనము నరుండు తద్ఘృణాపాత్రుం డై. 3

గీ॥ ధైర్యదానక్షమాదయాద్యఖిలగుణస
మన్వితం బైన సత్యము మూర్తి నలరు
శిష్యయుతు డష్టమమహర్షి చిరయశస్వి
రామకృష్ణపరమహంస యా మఠమున. 4

క॥ ఎందఱో దర్శనకాంక్షులు
నందఱును నరేంద్రముఖ్యు లంతేవాసుల్
డెందము వీనులు నొకటై
విందునఁ జాలుగొన మెల్ల వినిచె నత డిటుల్ 5

గీ॥ తానె బ్రహ్మం బనుచు నాత్మ పూనుకొను స్వ
తంత్రవేళఁ దోపవు స్వల్పతరళరుచులు
తమమునం దన్నియును నవ్వె తారకలు, క
నంబడునె యవ్వి తపనోదయంబు గాఁగ. 6

గీ॥ అట్టి యీ తత్వవిభవంబు నాశ్రయింప
నెన్ని మార్గంబులో! తుద కన్ని యొకటె
నీరె పానీయ మన్నఁ "ఛానీ" య టన్న
ద్రవ్య మొక్కటె, యన్న యిద్దఱును నొకటె. 7

ఆ॥ వె॥ గడ్డగట్టి నీరు ఖరకరాంశువుకల్మి
జాలువాఱినట్లు సత్వహీన
మౌచు మొద్దువాఱినట్టి మోహముకాంత
కట్ట దాటి పొరలు జ్ఞానకలన. 8

గీ॥ అస్వతంత్రభావమ్మున నటమటించు
జీవుడా! మాయ ఛేదించి నీవు నిన్ను
తెలిసికో! బ్రహ్మ మీవు, పొల్చునది యొకటె
యంటె, ప్రక్కనున్నల కిడు నదియ విలువ. 9

మ॥ ఒక యాకారము లేద యగ్ని,కది యెన్నో రంగులన్ దోచుఁ గాం
తి కరాళం బగు వేళ,నట్లె యిదియే తీ రంచు వాక్రువ్వ నే
రికి శక్యం బగు బ్రహ్మమున్ గుఱిచి, తీంద్రించున్ యథాభావనా
త్మకరూపంబున రూపులేనిదియు, నాత్మశ్రీలు కండో! ప్రజల్!

ఆ॥వె॥ ఉన్న యునికి తెలియు టన్నదె జ్ఞానము
తెలిసి మనలఁ గన్న దివ్యమాత
కాళి యనుచు నామెకై దీక్ష నెలయుటే
భక్తి కర్మయు విధిపాలనంబు. 11

ఉ॥ జ్ఞానము భక్తి కర్మయుతి సాగవలెన్సుమి! ఐకమత్యతో
భానిరవద్య మీ త్రికము,భారతి లక్ష్మియు నాదిశక్తియున్
దా నగు కాళికాంబను సదా భజియించుటలో నిబద్ధ మై
బోనము వోలె సిద్ధ మగు మోక్షము జాతికి, వేడి రెంటికిన్. 12

గీ॥ భక్తికిని జ్ఞానమున కెంతపాటి దవ్వొ
యత్నమునకు విజయంబున కంతె దవ్వు
బంధమునకు ముక్తికి మన భావ మొకటె
కారణము, భగద్గీత శరణ మండి! 13

క॥ తెరచాప విప్పి వేగన్
దరణి నడపి పార మొందు తరుణం బయ్యెన్
భరతావనిజనులారా!
మెఱయుడు! మాతాదయాసమీరము వీచెన్. 14

మ॥ అనుచుండన్ విని యాంగ్లమానససుతుం డందొక్కరుం డన్వహం
బును తద్గోష్ఠికి వచ్చి శాస్త్రవచనంబున్ గాదటం చాడువా
డనఘా! నమ్మితి నేను గీత ననగా నా స్వామి బాలుండు వో
తె నెఱా నవ్వుచుఁ బూలవాన నుడి వర్షించె న్నరేంద్రేశుడై. 15

గీ॥ ఎంత విద్యాధికుం డైన నేమి నేడు
భారతునకు స్వతంత్రభావంబు లేదు
చాకలింటి బట్టలమూట చాయ వీని
యాత్మ నున్న దప్రాచ్యభావాతిశయము. 16

మ॥ భగవద్గీతను మెచ్చె హూణబుధు డెవ్వండో, యదేపల్కె నొ
ప్పుగఁ జెప్పెన్ మన కీత, డంతె, యువకప్రచ్ఛన్నవాచస్పతీ!
పొగడ న్నేరడ స్వీయదేశ్యగరిమంబుం భారతీయుండు తా
నుగఁ, దాఁ జిల్కగదోయి!పంజరమునందున్ స్వామియన్నట్లనున్.

ఆ॥వె॥ అనుచు నగవు నాపె, నపరదిశను చూపె
నంత సభకుఁ బల్కె నతడు మతము
లేక మైన నేమి! యెవరి మతమ్మైన
వారు మనుజ జాతివైభవంబు. 18

గీ॥ కాళికాదేవి యందఱి కన్నతల్లి
యామెరూపమ్ములో మన మరయవలయు
క్రీస్తును మహమ్మదును సర్వవస్తువులను
ఆవుచంటిలో నున్నవి యన్ని రుచులు. 19

గీ॥ మాధవుడు మానవులయందు మనును, దాన
మానవులకుఁ జేసిన సేవ మాధవుండు
తనకె చేసిన యట్లు కైకొనును, ప్రజకు
సేవ సేయుడు పేదలు చెంగలింప. 20

గీ॥ భరతఖండ మనెడి యింటఁ బరగు వార
మందఱము నన్నదమ్ముల మాధ్యులార!
లేదు భేదమ్మునకు రూపు, బీదతనము
లేని యటు లెల్లరకు నెల్లరమును కాపు. 21

క॥ విన్న నరేంద్రుడు కొంతగ
విన్నదనముఁ బాసి నిండు విద్యను నేర్వ
న్వన్నెగొనెడు విద్యార్థి వ
లె న్నివటిల రామకృష్ణు డిట్లనె మరియున్. 22

గీ॥ జగముగా నీశ్వరుండు దర్శన మొసంగ
నాకు నీశ్వరుఁ జూపు మన్నా డొకండు
అద్యతన మీ నరేంద్రు గల్లారుణంబు
నురముపైఁగల డరయు నీశ్వరుని లోన. 23

క॥ ద్వైతము నద్వైతంబును
ద్వైతాద్వైతంబు నై మతంబు త్రివిధముల్
ద్వైతంబు భక్తి, యదె య
ద్వైతం బాత్మానుభూతితాత్పర్యమునన్. 24

గీ॥ మతము జాతీయతామూలమంత్ర మయ్యు
నన్యమతముల వారితో నైకమత్య
మొప్పు నప్పుడె యద్దాని గొప్పతనము
తత్వ మేకత్వ మిదియ భిన్నత్వ మందు. 25

చ॥ పురువుల మేమ టంచుఁ దలపోయగఁ బుర్వులె యౌను జాతి,కే
సరులము మేమ టంచుఁ బెలుచన్ దల యెత్తగ జాతి కేసరి
స్ఫురితమె యౌను, మానసమె పో!యెటు చేసిన మిత్రులార!యం
దఱకు నిరుత్సుకత్వమె ప్రధానము శత్రువు,దాని గెల్వుడీ! 26

ఉ॥ పోరున నీ నివాసమును ముట్టడివేసెను కీడు,ప్రశ్రయా
ఖ్యారథ మెక్కి భక్తి యను కార్ముక మెక్కిడి కాళికాంబికా
స్ఫారతరాభిధానశితబాణపరంపర నేసి ముక్తిఁ గై
కోర! యసిన్ దళింప నని కొప్పును జ్ఞానమహాయుధోజ్జ్వలా! 27

ఆ॥వె॥ అని యుపన్యసించి యలసెఁ బరమహంస
యెల్ల శిష్యు లుపచరించుచుండి
ర స్తమించు కాల మైనది హేళికి
లోకనాటకమునఁ జీకటితెర. 28

ఆ॥వె॥ గగన మాక్రమించి గర్జించె మేఘము
దుర్భరంబు నేస్గుతొండమంత
ధార గురియ మొనసె సారించి మేఘము
చేరె హంస లపుడె శ్వేతగిరికి. 29

సీ॥ తొంగిచూడగ వచ్చి నింగిఁ జుక్కలు కొన్ని
మబ్బు లడ్డుకొనంగ మాయమయ్యె
కాటుకకన్నీరుఁ గార్చె గగనలక్ష్మి
నిసి యది వాసరగ్రసన మేమొ
ఝుంఝూనిలమ్మునఁ జకిత యై గగ్గోలు
పడెఁ జేయునది లేక ప్రకృతిమాత
తరువులు పులుగులు తమతమ యులివుతో
నొండొంటి నూఱడించుకొనుచుండె

గీ॥ నాశ్రమస్థనాగమహోకయాదిశిష్య
గణముముఖమున నెత్తురు కణము లేదు
నెంత యెగసనద్రోసిన నేమి వత్తి
దీపమునకు మూడవజాము తేజ మిడద. 30

గీ॥ ఒకరి కొక రభిముఖముగా నుండి పరమ
హంసయు నరేంద్రుడును ధ్యానమందు మునిగి
కనులు తెఱచిరి, గురువు శిష్యు నొడ లంటి
ధనముగోల్పోయినతని చందమ్ము తెలిపె. 31

శా॥ విద్యుత్తాండవకేళికానిలయ మై విచ్ఛిన్నభేదంబు పం
విద్యోగమ్మున మాయ ముక్క లయిపో విద్యోతనబ్రహ్మ మై
విద్యాలోకరహస్యబోధనకళావిస్తారభాండార మై
సద్యోజాతమొకో! నరేంద్రుమయి యాచార్యాంగుళీస్పృష్టిమై-

మ॥ గణనాతీతసువర్ణసూనసురభిక్రామ్యన్నవోద్యానవీ
థిని శోధించెను పన్నుగట్టు మని, సాధించెన్ బృహద్భానురా
ధను బోధార్థకవిశ్వజిత్సవనకుండంబందు శ్రీమన్నరేం
ద్రనితాంతోజ్జ్వలమానసంబు గురుసమ్రాట్శక్తిపాతమ్మునన్. 33

మ॥ సకలం బై మతశాస్త్ర విద్య మతికాసారాబ్జపత్రంపు డో
లిక యౌ నాలిక నాదరించిన దహో! లీలాప్రవాహంబు పో
లిక లే దెందును పల్కుచాలికకు, లేలే! తంద్రి! యుష్ణూతలే
యిక లోకమ్మున కంచు వాని ననినల్లే కాళికాపాంగముల్. 34

గీ॥ వైరు పెంచి పండించెడి బలము నించి
వానకారు వెన్నెలకారువలనఁ బొందు
వీడుకోలు తన్మతమునఁ జూడనయ్యె
పరమహంసనరేంద్రసంభాషణమున. 35

గీ॥ అనె నరేంద్రుడు పులకితు డపఘన మిది
యమృతభాగ్య మయ్యెను నీ దయన్ మహాత్మ!
యెన్నొ యానందగోళము లితనిలోఁ, ద్రి
విక్రముడు మానవుం డౌట విదిత మయ్యె. 36

గీ॥ ఇంత శక్తి నీలో నుండ నెట్లు నీవు
తట్టుకొని యేమి లేని యతండు వోలె
నిన్నినా ళ్లుంటివి వశిష్ఠవన్నిరూఢః
యితరుడో బోరుకొలుపడే యెల్లజగము. 37

క॥ నీవు సముద్రంబవయా!
నే వాగును పొర్లిపోవు నీ శక్తి యిటన్
నా వినిచె గురుం డటులే
కావలె నని, వటుకులప్రకాండుడు పలికెన్. 38

గీ॥ విశ్వరూపంబు దర్శించె వేడ్క తీర
దాని పొంది బీభత్సుడే మౌనొ కాని
రామకృష్ణః యోః సార్థకనామః నీదు
దివ్యబలమును నిమ్ము పొందించికొనవె! 39

చ॥ అన విని మందహాసమున నచ్చగులాబులు కుప్పవోసి యో
యి! నరుడ నీ కొసంగినది నేను పునర్గ్రహణమ్ము సేతకా!
మును తన యొద్ద నర్జునుడు పొల్పడ తాఁ జనువేళ, నిప్పుడో
తన కడ నుండె, నాతనికిఁ దా నయి కృష్ణు డొసంగె సర్వమున్.

క॥ నిను వెదకి పట్టుకొంటిని
నిను వెళ్ళనవానిఁ గాళినే తె మ్మంటిన్
నిను గాయనగంధర్వుని
వినుచు మధురభక్త్యములను వృథ యివి యంటిన్. 41

క॥ నీ దేవదత్తరవమున
నా దో నీ పాంచజన్యనాదము నిండెఁ
మోదింపదో యీ భారత
మీదృక్శంఖరవబుద్ధ మిద్ధజయం బై. 42

గీ॥ నిర్వికల్పసమాధిని నీవు పొంద
రాదు, పొందిన నీదు స్వార్థంబె పండు
ప్రజల శ్రేయము లెండు, నీ వనెడి మట్టి
చెట్టునీడ న్నరేంద్రః కాంక్షించె జనము. 43

క॥ ఈ నా ఛాత్రుల పోషణ
నీనుండియ జరుగుగాక! నిర్విఘ్నముగా
నో! నా తనయాయితులా
రా! నేడాదిగ నరేంద్రు డన్నియు మీకుఁ. 44

గీ॥ అని నరేంద్రుదు ఛాత్రులఁ దెల్పి చనవెచనియె
బ్రహ్మరంధ్రమార్గమ్మునఁ బరమహంస
యచటివార లశ్రువులకు హాదు వెట్టి
గురుని గుణసంకీర్తన జరిపినారు. 45

శా॥ ! నారాయణరూప ! ఓయి! జగదేకోద్ధారకా ! రామకృ
ష్ణా ! నీ లేనిది యాశ్రమాన దినమం దా నంధకారమ్మునన్
మా నేత్రమ్ములు గ్రుడ్డి వైన వని దైన్యక్షీణ రావమ్ముతో
దూనల్ నాడు నరేంద్రముఖ్యులు, పురిన్ దూలించె సంతాపముల్.

ఆ॥వె॥ పూచిపూచి కాచికాచి రసాలంబు
పిడుగుపాటువలన నుడిగినటుల
నిలను వీడె రామకృష్ణపరమహంస
యని బెనర్జిముఖ్యజనము పొగిలె. 47

మ॥ పురి సంతాపసభాంతమందున జనంబుల్ రామకృష్ణప్రసం
గరతుల్ వెళ్ళెడి వేళ నీయెడఁ బ్రశాంతం బైన చోటన్ డిసెం
బరులోఁ గాంగ్రెసు మూడునాళ్ళు జరుగున్, భావ్యంబు మీరాక నాన్
సరె యన్నాడు బెనర్జితో హితులు ప్రోత్సాహింపదేవేంద్రుడున్. 48

ఉ॥ భారతమందు నెల్లెడలఁ బంపిన సంఘము లెన్నికొన్న యే
నూరు సదస్యులన్ గలిగి నూతనరేఖల కంకురార్పణం
బై రమణీయవాక్యరచితాంగ్లము కాంగ్రెసు పొల్చె హంసనం
ఘోగురవంబు పూలు చలికోతయు నొప్పు సరోవరం బనన్. 49

శా॥ విద్యుక్తంబున నస్మదీయ విపదబ్ధిన్ సేతు వౌ పాలనం
బధ్యాహారము నౌనొకో! గుఱుతు మృగ్యంబంచు నాహ్వానసం
ఘాధ్యక్షుండు శ్రవఃప్రియంబు వినిచెన్ 'రాజేంద్రలాల్ మైత్ర'యీ
మధ్యన్ గొందఱు రాష్ట్రపాలురు ప్రజామంతవ్యులై రంచునున్.

శా॥ ధాటిన్ జెప్పెను తత్సభాధిపతి దాదాభాయినౌరోజి యే
మాటల్ కూడవు సంఘసంస్కరణ సంబంధమ్ములీ కొల్వునన్
మాటాడన్ దగు రాజ్యపాలనమునన్ మార్పుల్, ప్రజాబాధ లు
ద్ఘాటింపన్ దగు నంచు గోష్ఠికి శిరఃకపంబు శోభింపగా. 51

ఉ॥ పెత్తన మీరు పిల్లలకుఁ బెద్దలు బాల్యమునందుఁ, బెద్దలై
యెత్తఱిఁ బిల్ల లిమ్మనిన నేచక వారల కింటిపెత్తనం
బెత్తుట పాడి, భారతులు పెద్దలు నేడు, తదీయ రాజ్యపుం
బెత్తన మెల్లవారి కిడుడీ! దొర! లంచు బెనర్జి యొల్గిడెన్. 52

క॥ ఫాలము చందనతిలక
శ్రీలము, మానసము సంకలితహిందూవి
ద్యాలయము, 'మదనమోహన
మాలవ్యా' మాటకారిమానిక మనియెన్ 53

గీ॥ వినక యెవనికినిం బన్ను వేయరాదు
యిదియ మొదటి నిబంధనం బింగిలీషు
వారి ఘనరాజకీయపు బైబులందు
భారతీయులయెడ నిది పనికిరాదొ! 55

ఉ॥ మూకులు కారు భారతులు పూర్వమురీతి, స్వకష్టనిష్ఠుర
ప్రాకటభాషణాభిరతు, లల్లయు తగ్గరు తెల్లవారికిన్
మోకరిలంగ నెట్టబడు ముప్పున కోర్వక నేడు కాంగ్రెసున్
జేకొని చాటుచుండి, రికఁ జేకురు వారల హక్కు వారికిన్. 56

క॥ అని మాలవ్యా పలుకన్
జనమున కిడ శస్త్రశిక్షణము రాజ్యము రా
జు నిదే కాచుకొనుట విం
చెను రాజారామపాలసింహాఖ్యుండున్. 57

సీ॥ ఏబదియేండ్ల రాష్ట్రక్రమపాలనం
బును హెచ్చుగా మెచ్చుకొనుచు నొకటి
యొకపూటఁ దిను దైన్య మొదవెఁ బెక్కుర కంచు
దారిద్ర్యఖండనార్థంబు నొకటి
జను లెన్నుకొనువారి శాసనసభలఁ జొ
ప్పింపగాఁ బ్రభుతను వేడు టొకటి
బ్రిటనులో నిటను నొక్కటె తటిఁ బెద్దప
రీక్షలు జరుప నర్జియు నొకటి

గీ॥ భారతీయుల స్వచ్ఛందభటులఁ జేసి
ప్రభుత వారి తోడ్పా టొందె వలయు టొకటి
వచ్చు పేరోలగము చెన్నపట్టణమున
నన్న దొకటి తీర్మానములందుఁ గలవు. 58

ఉ॥ చెన్నులు రాశిపోసినది చెన్నపురీసభవేది, యాఱునూ
ర్లున్నర ప్రాతినిధ్యమునఁ బ్రోది సదస్యుల సంఖ్య శోభిలెన్
నిన్నటి ప్రాతలే యుఃతికి నేడు ధృతమ్ములు వోలెఁ దీర్పులున్
మున్నిటి వ్రాతలే పఠితముల్ పునరాలిఖితమ్ము లయ్యెడన్. 59

గీ॥ హిందువులు ముస్లిములును యూరోపియనులు
ప్రతినిధులు గాఁగఁ జార్జిలు ప్రబలగోష్ఠి
హల్ప్లుతహ్రస్వదీర్ఘాల వ్యాకరణము
హౌసు పగలె, బాసల కేమి! యర్థ మొకటె. 60

చ॥ ఒక చతురంతయానమున నొద్దిక యిట్లయి వచ్చి గోష్ఠివే
దిక పయి కెక్కెనేమొ! భరతేందిర, పారసమూహపాణివా
టికలితశబ్ద మబ్దసరణిన్ గొన, హర్షము వర్ష మౌచు వా
యకజనబాహుళప్రవచనౌఘము దృశ్యము తామ్రపర్ణియై. 61

క॥ "బదరుద్దీనుతయాబ్జీ"
సదస్పతి వచించె రాణి చాటినటులు పెన్
బదవులు భారతజనములకు
ను దొరుకవలె సైన్యమందునున్ ద్వర ననుచున్. 62

చ॥ మన చెల్లించెడి పన్నుతోఁ బ్రభుత బర్మాన్ ముట్టె,రష్యాచమూ
జనితత్రాసము నెట్టెఁ, గాని, మన యీ సైరింపరానట్టి లే
మిని పోగొట్టెనె? మిక్కిలించె, నిది యేమీ! పన్నులం బెంచు పా
లన మంచున్,మరికొంత వాకొనియె మాలవ్యా బలవ్యాహృతిన్

శా॥ ఆ కాలమ్మున వైరులే, యిపుడు రష్యా ఆయుధా లిచ్చె ట
ర్కీకిన్ స్వాశ్రయ మౌచుఁ గోరుటకు,శస్త్రిన్ జేయు మీ దేశము
న్నీ కాఁ దోడు ప్రభుత్వమా!యని వచించెన్‘శంకరన్నాయ’,రా
శేకన్ వేరుఁ బ్రజాత్మ డాయరు,యశశ్రీ వెన్నెలల్ కాయరున్.

ఉ॥ అందఱిలోన వార నను నాతడు నేర్పరి, న్యాయవాది, ప్ర
స్యందితకీర్తి, భారతజనాదృతపద్ధతివర్తి, యాంగ్లు, డ
శ్లొందడు తన్ను బైటఁబడ నొల్లని ద్రోహినిగా స్వజాతి య
న్నన్, దనువంతయున్ జెవిగ నై విను జడి తదీయవాదమున్.

సీ॥ యద్దేశ మేలినన్ దద్దేశపౌరుల
కెచ్చు భాగస్వామ్య మిచ్చుకొఱకు
దోసమ్ములను వ్రేళ్లతో లెక్కపెట్టి ది
ద్దించ నిగ్గరగ వాదించుకొఱకు
నొక జాతి మరొక జాతికి దాస్య మిడి దాని
నడుముట తగ దని గడుముకొఱకు
శిశువేసెడి మొదల్ కథని విననిచో
ముదురుమాటలతోడ నెదురుకొఱకు

గీ॥ మనిసి కున్న హక్కుల గూర్చి వినుచుకొఱకుఁ
బ్రజకు భీతి నపాకరింతు, జితిరీతి
వ్యాకరింతు, బిరుదమ్ముగ స్వీకరింతు
ద్రోహి యను శబ్దమును తెల్లదొరలనుండి. 66

క॥ అని "ఎర్డ్లేనార్టను"
వినిచిన ధ్వనితమున నాఱువే లఱచేతుల్
నినదించు నైదు నిముసము
లును దద్దరిలెన్ సదస్సులోగిలి యెల్లన్. 67

గీ॥ భారతావనిలో నాంగ్లపాలనమ్ము
సాగుటో సాగకుండుటో చర్చ చేసి
తేల్చవలసినవార లా దేశజనమె
యనెడు గ్లాడ్‌స్టన్ ప్రకటనంబు వినఁబడియె. 68

గీ॥ పలుకుటీరపరిశ్రమల్ బలియుకొఱకు
నేఁతో సాంకేతికజ్ఞాన మెచ్చుకొఱకు
సైనికవ్యాప్తికొఱకుఁ దీర్మానము వినఁ
బడియె విద్యాలయములు కావలె న టంచు. 69

గీ॥ వత్సరము లయ్యె నేబది వత్సరములు
రాణి యేల నాయమకుఁ జిరాయు వగుత!
వచ్చు సభ యలహాబాదవర్తి యగుత!
యని పఠించె సభాంతమందు నొక నేత. 70

గీ॥ చేని యజమానునకు సాగుసేయువాడు
కట్టుబడిధాన్యమునుఁ బోలె కార్యదర్శి
కాంగ్రెసున నైన నిర్ణయసంగ్రహంబు
నేటనేట వైస్రాయి కందింపవలయు. 71

క॥ భారతజాతీయసభను
కోరిన వైస్రాయి యేల కోరితి ననుకొన్
జేరెను చెన్నపురిసభ
పారము నాలుగవ సభకు శతవిఘ్నములున్. 72

మ॥ చెఱువుల్ బాగొనరించుటో బడుల హెచ్చింపించుటో వైద్యమె
చ్చిల నదించుటో రోడ్లు పెంచుటో బెనర్జీలున్ బిటర్జీలు నా
యరులున్ లాయరు లట్టి కోరికలు లే కస్త్రాలు దస్త్రా లొసం
గరె మా కందు, రిదేమి! కాంగ్రె సనియెన్ వైస్రాయి హ్యూం
మూరితో. 73

క॥ అనుకొన్న దొకటి, నేటికి
మునుకొన్నది తద్విరుద్ధముగ మ రొకటి, చం
దన మనుచు చెట్టు పెంచగఁ
గనుపట్టెను సర్పములకుఁ గందువ యగుచున్. 74

గీ॥ ఏమొ యనుకొంటి, గనుగొంటి నిపుడు నీ ప్ర
వర్తనముగూడ, కాంగ్రెసు పరశువుగ స
మర్థ మగుచున్న దయ్యో! నీ యంటుకలిమి
నటవి యౌనేమొ! యిచ్చటి బ్రిటిషుప్రభుత. 75

క॥ హ్యూమూ! దూరాలోచన
మేమొ దురాలోచనముగ నెదిరెన్, శేవల్
పోషించుము నపె కాంగ్రెసుఁ
బ్రాపించు నటంచు నతడు పలికెన్ మరియున్: 76

గీ॥ హ్యూ మపుడు మీ రనియంత యేమి లేదు
కాంగ్రెసున రాజభక్తికి కఱవు రాదు
నెవ్వరే నొక రెప్పుడే నింతొయంతొ
బెట్టు పల్కిన నదియు నెబ్బెట్టు కాదు. 77

గీ॥ ఓయి! డఫరిన్ మహాశయా! యుజ్జ్వలతర
భావమాధ్వీకుశేశయా! భారతీయ
సఖులు గ్లాడ్‌స్టన్ ముఖులయా! యుదగ్రజాతి
యిండియా, చెవకకుమయా! యిట్లు చెప్పె. 78

గీ॥ తావు మనసున సమరసభావమునకు
దొరికినటు "అలహాబాద"పురమునందు
దొరికె నెట్టొ కాంగ్రెసునకు, దుష్ప్రచార
మతిగమించి ప్రేక్షకుల సంఖ్య దుగుణించి. 79

మ॥ సభ కేతెంచెడి తత్సహాయకులచే జామీ నొసంగంబడెన్
బ్రభుతోద్యోగుల,కట్లు నై ప్రతినిధుల్ పంద్రెండునూర్గురి, వీ
తభయుం డుక్తిఝురీరయుండు బహువిద్యాధిక్యతామూర్తి యు
ద్ధభటస్ఫూర్తి యొకండు వేదికకు సంధానించె నూత్నత్వమున్.

క॥ ఆయన లాలాలజపతి
రాయాఖ్యుడు, యువకుల మగరాయి, దయానం
దీయమతముతీయన నం
దీయఁ రసాలంబు భారతీయబలంబున్, 81

గీ॥ దేశభక్తియు మతభక్తి తేజులుగఁ ద
దాత్మశకట మభ్యుదయపథాభిముఖము
ప్రజకు శాసనసభలోనఁ బ్రాతినిధ్య
ముండితీరవలె నని తదుక్తివిధము. 82

గీ॥ విద్యను పరిశ్రమముఁ గూర్చి గద్యము లొక
పూట యెల్ల నుపన్యాసములు ప్రదర్శ
నములు నలె జరుగన్‌వలె ననె లజపతి
రాయి, నాడాది జరిగె నట్ల ప్రతిసభను. 83

మ॥ అనువాదమ్మున కాశ్రయం బిడ కుపన్యాసమ్ము లాంగ్లమ్ములో
వనె యా నందజీవిం బ్రభుత్వమునకై, నట్లొందు దానన్ జనం
బున జ్ఞానం బెది లేక యుద్యమ జయం బుల్లేవొ యంచున్ వచిం
చును తా వాచన ముర్దులో లజపతీంద్రుం డి ద్దెగల్ మెచ్చగా. 84

గీ॥ "జార్జియూ" లనెం బ్రసిడె టు పమానుసమను
పన్నుగా శతకోటిరూప్యము ల మన మొ
సంగు చున్నను శే దయె సంస్థలందుఁ
బ్రాతినిధ్యము మనకుఁ జిత్రం బ టంచు. 85

ఉ॥ ఇందుననుండి లండనున కేగెడి ఛాత్రులు ప్రాతినిధ్యపున్
సందడి బిట్టు సేయవలె నందు, నిటన్ లవ మేని మాటలా
డన్ దగ దండ్రు, వారలె యటన్ దమపై నివిమర్శనంబు మెం
డున్దొని విండ్రు, చీకటివెలుంగుల మొత్తము లాంగ్లచిత్తముల్.

గీ॥ పడుపువృత్తిని త్రాగుడున్ గెడపవలయు
ప్రభుత యనియు, ముసల్మాన్లు ప్రతిఘటించు
తీరుమానమ్మునకు సంస్థ దూర మనియు
నిర్ణయము లివి కల్యాణధూర్ణయములు. 87

క॥ డిఫరై పోవుచు సమితిన్
డఫరిన్వై స్రాయి ద్రోహానద్దం బనె,న
చ్ఛిఫ యిద్ది, ధన్యవాదము
లు ఫుల్లములు వాని కిడె, నెలుం గిటు లొదవెన్. 88

గీ॥ జరుగు బొంబాయి వాగామిసభ య టంచుఁ
దెలుపఁబడె నల్లె యచ్చొటఁ ద్రిదినయుతము
కాంగ్రెసలరె దత్తాత్రేయకాంతి యనగఁ
బదియుఁదొమ్మిదినూర్ల శిష్యగణ మొప్ప. 89

ఆ॥వె॥ తోడుచున్నకొలది తోయ మూరెడి భంగిఁ
గోర్కె తీర్ప మరియుఁ గోర్కె పుట్టు
వీనిఁ దీర్ప నేల విను గేల యని దూర
ముంచె నాయకునకు నోడి ప్రభుత. 9

సీ॥ కోలాహలమ్మును కోరు నొకడు, దాని
హాలాహలమ్ముగా నరయు నొకడు
ఒకడు బాధకుడు పాలకవర్గమునకు, బో
ధకుడు తన్మతి మార్పఁ దలచి యొకడు
క్రాంతిక_ర్త యొక, డొకడు సంఘసంస్క_ర్త
త్యాగి యొకడు, ప్రేమభాగి యొకడు
ప్రజలో నొకడు పల్కుబడి మిన్న తనభాషఁ
బ్రభుతలో నటులె తద్భాష నొకడు

గీ॥ నొకడు బాలగంగాధరుం డొనరుఁ దిలక
వంశ్యుడు, మరొక్కరుండు గోపాలకృష్ణు
డలరు గోఖలేవంశ్యుడు, లలితసుతులు
భరతజననికి భృతమహాపురుషజనికి. 91

గీ॥ వారు వచ్చిరి, నార్టను వచ్చె సభకు
బ్రిటనురాజ్యసమజ్యావరిష్ఠసభ్యు
డైన "చార్లెసుబ్రాడ్లా"యు నరుగుదెంచె
నేగుదెంచి రెందఱో నాయకేంద్రు లందు. 92

క॥ ఆ సభకు వచ్చె లాలా
జీ సంవృతబహుసహోరుచిప్రతినిధి, బ్రా
డ్లాసంభాషణమునఁ గడు
భాసిలె, నంతకునుఁ దిలకు పరిచితు డగుటన్. 93

గీ॥ తిలకునాత్మ నాత్మీయత దృశ్య మగుచు
నిద్ద మగు నద్దమున రూపు దిద్దుకొన్న
తీరు గాగ లజపతిరాయి తృప్తిపడియెఁ
బరగు నిటుల నాదర్శభావం బనంగ. 94

క॥ లజపతి తలచెను గోఖ్లే
రజనీపతి రాజకీయరాత్రి న టంచున్
బుజములు కలిసియుఁగలియక
గుజుమామిడిపండుచెలిమి గొలిపె నిరువురన్. 95

చ॥ ప్రజల హృదంతరన్ జిగి చొర న్నెటి సర్విలియం వెడర్బరన్
సుజనుడు తత్సభావిభుడు, నూటికి నెక్కురు దొడ్డవార లాం
గ్లజనపదంబునన్ భరతఖండహితుల్ గల, రట్టి రేల్పడిన్
ఋజుగతిమేవడిన్ సలుప నెంతు రనెన్, మరి యెంతొ వాకొనెన్.

గీ॥ తెచ్చినాడు సందేశము, మెచ్చినాడు
ద్వాదశసహస్రకరతాళవాదములకు
ఘనుడు చార్లెసుబ్రాడ్లా తనను పతి సభ
కుచ్చపదములఁ దెలుప వాక్రుచ్చినాడు. 97

మధ్యా॥ రాజ్యాంగసంస్కరణములు రణములు కాని రణములు
రజ్యద్గళరణ మనిశకరణముగ సాగినన్ దక్క
పూజ్యులార! సమకూరవు, ప్రపూర్వభారతరణమందు
సజ్య మిష్వాస మపుడు, ప్రసజ్య ముపన్యాస మిపుడు. 98

వసం॥ ఈ రీతి వాచకము లెవ్వరిచేతఁ దొల్తన్
ప్రారంభముల్ బిరుదు వారికి ద్రోహి యంచున్
గారన్ ప్రవాసమునఁ గాంతురు గాక నిద్రన్
వారల్ ప్రభుత్వహృది వారక జాగరూకుల్. 99

క॥ అని బ్రాడ్లా యన్నాడో
రణించెఁ గేకిసలు తిలకప్రారబ్ధము లై
జనమున, ఫిరోజిషా రణ
వనిరోధిగ హూణాతిసంఘనాయకు డాడెన్. 100

క॥ ప్రథమగురు 'వనిబిసెంటు'కుఁ
ప్రథితుడు బ్రాడ్లామనస్వి భారతవాంఛా
పృథుసౌగంధ్యము లండన్
పృథివిఁ గురియునతడు వినిచె నిటులన్ మరియున్. 101

ఆ॥వె॥ వారి భాష, వారి భావ మాచంద్రతా
రకము నాకుపచ్చరంగు గలవి
కైల దెంతసేవ సత్యనిరోధన
మర్థము? గడె, గంట, యర్ధదినము. 102

గీ॥ తైలువాల్గుగోడల మధ్య సత్యశక్తి
విద్యుదుద్రేకసంపృక్తి వెలుగుచుండి
సకలభువనసంచాలనసంభ్రమముగ
నురవడించును వెలుపలి కురికినపుడు. 103

గీ॥ ప్రజలలోన జన్మించితిఁ, బ్రజలు నన్ను
నమ్మిరి, ప్రజలకొఱకె ప్రాణమ్ము లిడెద
నిమ్మదాశయానర్ఘ్యరత్నమ్ము పుట్టె
దేల! భారతనాయకహృదయఖనిని. 104

మధ్యా॥అనుచు బ్రాడా పల్కు మంద మైన నేమి హాసితంబు దెస
లను తాకివచ్చెను, వినుతిరసితంబు కడు పమందంబు
తనయది మలివంతుగా మొదలుపెట్టె లజపతి దీని
తనువు ముదంబునకుఁ గల దనిపించె నాటి యాస్థాని. 105

గీ॥ కృష్ణుడును క్రీస్తు కల్పితులే య టన్న
నాస్తికాగ్రణి, యోటమిన్ గస్తిఁ గొనక
యెన్నికల కెన్నిసార్లో జయించుదాక
నిలచినట్టి బ్రాడ్లా వెండి పలికినాడు. 106

గీ॥ సభ్యసంఖ్య ప్రజాసంఖ్యసన్నిహితము
వయసు నిండ నిరువదియొక్క వత్సరములు
పురుషు లెన్నుకోవలయు సభ్యులను శాస
నసభ, కిది మాట, యదియ బాట శుభ మగును. 107

గీ॥ తమ నియోజకవర్గాల తరపున నెవ
రెన్నుకొనబడుదురొ వారె యెన్నికొంద్రు
కేంద్రసభ్యుల నిది రాజకీయభావి
భారతముబండి వోట్లసిబ్బంది నిండి. 108

ఆ॥వె॥ బిల్లు నే ప్రవేశపెట్టెదఁ బోగనే
పార్లమెంటునందు భ్రాతలార!,
దీనిగురిచి, యెందు నేనియు విజయంబు
హేతువాదమున లభించు ననియె. 109

సీ॥ జనులచే నెన్నుకొనబడు సగముసంఖ్య
సభ్యులందు శాసనసభన్ జనమె కాక
ప్రభుతయును ధనదుర్వ్యయత్వమ్ముఁ బాసి
బాగుపడు నని నార్టను పలికినాడు. 110

ఆ॥ ఒడ్డోలగమందుఁ బ్రజల
గొడ్డములన్ దెలిపి తిలకు గోఖ్లే నార్టన్
గడ్డుకొనినమెయిఁ బలికిరి
గిడ్డంగులు రాజనీతికిఁజ వారి నుడుల్. 111

మ॥ మరియున్ వాకొనె గోఖలే ప్రభుత సంభావించి యీ భారతో
ర్వర రాజ్ఞీకృతశాసనం బములునల్పన్ దాన నౌ లాభముల్
సరిపోవున్ గద! యట్లు సల్పమిని విశ్వాసంబు నిశ్వాసమున్
బఱపెన్, బాలనపక్షపాతములు పాపాలంచు ఖండించుచున్.

మ॥ అసహాయోద్యమశూరు డౌ నెవనికే నాధారభూతుండుగా
నెసగన్ వచ్చును గోఖలే, తెలియ నౌనే! భావ్యముల్, వానిలో
పస శంకింపగ రాదు వాదము మితం బైనన్, వసంతంబు కా
దో! సదాగ్రీష్మముకారణం బదియుఁ గాదో! వార్షుక శ్రీలకున్. 113

ఉ॥ శాసనగోష్ఠి కెన్నుకొను సభ్యులలో సమసంఖ్య మీరు మే
మై సను టొప్పు నంచుఁ దుఱకయ్యె యొకం డన దీనిలో మత
న్యాసము లేల నందఱము నందఱ మేలున కౌదు మోయి! భా
యీ! సుఖదాయి! యంచు నయిదేఱులనేలదునీడు వాకొనెన్. 114

గీ॥ దేని నార్టను బ్రాడ్లా కథించి రద్ది
నిండుతీర్మాన మయ్యె, దానిఁ గొని సీమ
కేగి తన్మహాసభలోన వాదింపఁజేసి
నెగ్గుటకుఁ గొంద ఱెగుట నిర్ణయంబు. 115

ఆ॥వె॥ కాంగ్రెసునకు వలయుఁ గార్యాలయము, దీని
కృతులు పోషణాదు లేవు మీర
ధనము వలయు, నివి తదాస్థాననిర్ణీత
ములు యథాతథంబు పూర్వభణితి. 116

గీ॥ నవ్వి ఖే షని చప్పట్లు సవ్వడింపఁ
జేసి సభ యుపన్యాసను(శ్రీ)నిగూర్చి
తెరలుతెరలుగ స్వముదంబు తేటపఱచె
నని ఫిరోజిషామెర్వాన్ మెహాత వచించె. 117

గీ॥ అతని యధ్యక్షతనె కాంగ్రెసు త్రిదినంబు
మఱుసటేడాదిఁ గల్కటాపురిఁ దనర్చె
నగమునఁజ మూడు పూలు నే, డాఱు కాయ
లెన్నడో! చిల్కలుగఁ సభ్య లెదురుచూడ. 118

గీ॥ దొరతనము వేల్పురతన, మాచరితశుభము
స్వల్ప, మాచరణీయ మనల్ప మనుచు
నిడుగో! ఆహ్వానసంఘాధిపుడును భణద
భీషువున్ "మనోమోహానఘోషు" నిలచె. 119

క॥ అడుగో! "లాల్ మోహానఘో
షుడు", బోనర్జీ బెనర్జి సుస్థులు, గోఖ్లే
విడిసెను, వాఛా తృప్తిన్
దడిసెను, బహునాయకులు ముదాదాయకులున్. 120

క॥ ఒకరిద్ద రెవరో అంతియ
మొకమున్ జూపర ప్రజామూహామునకు నా
యకులు ప్రజలు శాసనసమి
తికి నభ్యర్థులను పంచు తెఱగులు దవ్వై. 121

మధ్యా॥ తనదు టోపి కిరీటముగఁ దనరు బొంబాయిరా జనగ
మననీయజీవితభోగమహాత ఫిరోజిషామెహాత
ఘనతమన్యాయవాదుల నొకడు, ఘనకీర్తులం దొకడు
జన మూర్వి నేలినన్ దాని ఛత్రము బ్రిటిషను వతడు. 122

చ॥ ధృతియుతు డగ్రవక్త యత డెందఱో తెల్లదుసీలు విద్యతో
కృతక్రమశిక్షణం బెపుడొ యేల్పడి నప్పుడు ప్రాతినిధ్యసం
భృత మగు భారతప్రజ హితేంద్ర! యనన్ విని పార్లమెంటు మీ
స్థితి కిపుడే ననర్హముగదే! బ్రిటనం దటులైనచో ననెన్. 123

క॥ బోంబాయీపురపాలకసం
ఘంబున కౌ భవనప్రాంగణంబందు నిషి
ద్ధం బెవని విగ్రహంబేన్
శంబసమాజ్ఞుడు ఫిరోజిషా శాసించెన్. 124

ఉ॥ ఆయుధశాసనమ్మునకు నడ్డుగ నిల్చి ఫిరోజిషా బ్రిటన్
శ్రీయుతపాలనమ్మునకు శీర్షము వంతుము, తద్విసీతి వి
ద్యాయతి నామతింతుము సదా, యిట నట్లని యాంగ్లు హక్కు తె
న్నో యవి భారతీయములునున్ దగ పోరక యుండ మే మనెన్.

శా॥ ఎంతేఁ జక్కగ నేలినఁ దొసగు సుంతే నుండదో! చెండదో!
వంతం బూనిన భారతం బడిదముం బట్టించుచుచోఁ దన్ను, క
న్నంతం బయ్యేడి కాటు కే లని భళీ! ఆంగ్లప్రభుత్వంబు మేల్
చింతన్ జేసెను శస్త్రశాసనము, వాచించెన్ 'దిల' గ్గోష్ఠిలో. 126

గీ॥ ఒక్కపుడు వీర లొకపంక్తి నున్ననేమి
యిరువురి తలంపు లెప్పుడు నెదురునెదురు
పలికెను ఫిరోజిషా రాజభక్తి దేశ
భక్తి యిరు పార్శ్వములుగ నో భద్రులారా! 127

చ॥ ప్రజలది యైన యీ సభసభాము కఠోరమొ యింతః యన్నవా
రుఁ జలువ లింత క్రమ్మి యిది ద్రోహమనో దేశము నన్నవారు బల్
గజిబిజివారు, ద్రోహము దలంపక హాస్యము లెక్కసేయ కొ
క్కజిగిఁదన ర్చెనొక్కబిగిఁగాంగ్రెసురాజప్రజల్ ప్రసేవ్యులై. 128

చ॥ అనియెఁ బ్రధాని భారతమునందుఁ బ్రజాపరిపాలనమ్ము లే
దని, కల దద్ది గ్రామవిషయం బొకనా డని మూదలించెఁ ద
జ్జనమణియొక్క డాతనికిఁ, జాలదొ, యెన్నటి కేని రాక త
క్కునో! యిది యెల్లెడన్ మనకుఁ, గొంచియుఁ నేల్బడికిక తప్పునే

గీ॥ క్రీస్తు సౌజన్యపోషణార్థి శ్రమపడియె
నెంతొ, నేడు బ్రాడ్లా శ్రమ మంత పడియె
నస్మదుద్ధరణమునకై, యందఱము కృ
తజ్ఞులము వానికి, ఫలంబు దైవికంబు. 130

గీ॥ ఏకవిధకష్టసుఖభుక్తి, యేకదేశ
పంచభూతానుభూతి, జీవించఁజాల
మొకరి ముఖము నొకరు చూడక, కఱవందు
కాలమందు నొక్కటె తుఱకలును మనము. 181

వసంత॥ రాకుండుతఁజ! ఖిదపకాల, మదెట్టిదేని
యేకత్వ మెత్తి "యెవరెస్టు"కు భారతీయ
శ్లోకమ్ము మెత్తి దెసగోడల కన్నిహాకుఁగల్
చేకొంద్రుగాత! వడి వేదఘోరానధీతుల్. 182

మధ్యా॥ అంద ఆంగ్లోయిండియనుల నజ్ఞాను లనుకొనరాదు
కొందఱకేనియున్ దెలియకుండునే! వా రుండవలసి
నందాల నేల భారత మ టంచును, చేతులు కలుపు
చుంద్రుగాత! యిక పార్శ్వమున నుండి వారలు మనతోడ. 183

మం॥ద్వి॥ బాగు బా గని తన్ను బలముగా నెన్ను
జనుల కా కృతనీతి యనియె నీ రీతి. 184

మ॥ మన మాసించిన యెన్నికల్ శిఖరసంభావ్యవమ్ములా! కావు, లో
నమమానం బుదయింపఁ జేసినది లండన్గోష్ఠికి తీరు రే
వు నిదానంబు స్వరాజ్యపృచ్ఛ కని, యీ బుద్ధిన్ గదే! యద్ది కా
దనుచుండెన్ సలహా ప్రభుత్వమున కీయన్ జాలు నీ మాత్రమున్.

మధ్యా॥ మనను గుఱిచి పాలకులకు మనకన్న బాగుగఁ జెప్పె
మును 'మెకాలే' ప్రజ కోరి మొనసిరో వారిఁ గృతార్థు
లనుఁ బాలనమునందుఁ జేత లగ్గె కాదు మనజాతి కది
వినుతి కౌ ఖ్యాతియే కాదు, విశ్వపతికిఁ బ్రీతియు నని. 186

గీ॥ ఆ మహాపండితుని వాక్య మది ప్రభాత
కిరణ మైనది, వెల్గుగా కురక యున్నె?
యద్యతనభారతమునాటకాద్యరంగ
మునఁ దెర యెగయుచున్నది కనుగొనుండు. 187

పుష్పి॥ అని మరియు ఫిరోజిషా వచించెన్
మన మలర న్నవరత్నమాలికం బై
జనమునఁ, బదునాల్గువేల చేతుల్
ధ్వనితము లయ్యెను తాళవాదర క్తిన్ 138

ఆ॥వె॥ భరతభూమి నేడు బహుకాననము, తుపా
కులు వలయును పెద్దపులులఁ గొట్ట
నాయుధముల చట్ట మడ్డురాకూడ ద
టంచుఁ దిలకు పలికె నౌ ననంగ. 139

సీ॥ వంగదేశమునందు వలె నెల్లెడల భూమి
పన్ను మాఱక యుండవలె న టంచు.
ననుబంధముగ లండనందుఁ గాంగ్రెసు ప్రతి
నిధిశతంబు జరుగు నిక న టంచు
నౌరోజిమున్నగువారు భారతవాంఛ
పార్లమెంటుకుఁ దెల్పవలె న టంచు
తనదు నుద్యోగులఁ చనరాదు కాంగ్రెసు
కనుట యేల్పడి నసభ్యత య టంచు

గీ॥ నాంగ్లదేశ్యబ్రాడ్లాదిసహాయకులకు
నెన్నియొ కృతజ్ఞత ల టంచు నెల్ల నేత
లొప్పినవి తీరుమానమ్ము లోలగమున
పూర్వనిర్ణయపాఠంబు పూర్తి గాగ. 140

శా॥ గంధానేకపఘీంకృతిన్ మకుపమన్ గాంగ్రె 'స్వనప్పాకమా
నందాచార్యుని' యాధిపత్యమున, నాంధ్రజ్యోతి బంగారుసె
మ్మెన్ దీపించిన నేఁడు సత్యమునఁ, బమ్మె న్నాగపూరందు బ్రా
డ్లాన్ దైవం బిలఁబాపినాడని మొదల్ స్తంభించి చింతించియున్.

మధ్యా॥ మితవాద మతివాద మొకట మేకొని రాజీపడినవి
కృతరూపము తదీయమే రసించు నాచార్యు వాచనము
మతివిహంగమరోచనము మందస్వభావమోచనము
సతతజాతీయభాషనలసన్మానసాభిషేచనము. 142

చ॥ సరె యని యంటిఁ దప్పు దయి, చాలని। వాడను గద్దె నుంటి, నే
జరిపెడి దేమి కద్దు? తొలిసంగతి మద్యను లుండి రిందుఁ ద
త్సరణి మనీషిఁ గాను, మలిసంగతియో! ప్రజలార! మిత్రులా
ర! రహితకర్ణ మేల్బడి పరంపరగా మన మెన్ని చెప్పినన్. 143

గీ॥ తెల్లవాడు కలెక్టరో నల్లవాడు
నగును బిల్లుకలెక్టరు, తగడొ! యిటు లి
తండు స్వచ్ఛందసైనికత్వమున కేని
యతడు సైనికత్వమునకు నర్హుఁ డగుచు. 144

గీ॥ ఆత్మ వేఱు నంగము వేఱు, నల్లె పాల
నంబు వేఱు పాలకుల వర్గంబు వేఱు
నిట్టి వర్గము మార్చిన నెదురు చూచెఁ
బ్రజ వసంతమ్మునకు శిశిరస్థు లటులు. 145

క॥ ఆనందాచార్యుఁడు సము
దైనా డానందవర్ధనాచార్యునితో
తా నన్వర్థాఖ్యుఁడు ప్రజ
లోనన్ ధ్వనిఁ గొలిపి, మరియు లోతుగఁ బలికెన్. 146

మధ్యా॥ ఈ ప్రతీతస్వార్థబోధు లీ బ్రిటన్న్యాయసిద్ధాంత
సుప్రసిద్ధవిరోధు లెల్ల శూరశిఖామణు లగుచు
దీప్రచరిత్ర మౌ భరతదేశమ్ము రక్షించువార
లా! త్రవ్వు విడదెరు పైడి లాగి, యవమతియు నేగి. 147

గీ॥ తేనెలో నూనె కలిసిన తీరు గాదె
పాలనమ్మున భేదభావమ్ము కలిమి
తర్కమును మించు ద్వైవపిద్ధాంతమునకు
నిది విరుద్ధము, హృదయమే యిందు సాక్షి. 148

క॥ ఏ.వో. హ్యూం భారతమును
సేవించినయంత యెవరు సేవింపర, త
ద్భావశిశువు కాంగ్రెసు, నే
డి విదురుని విని దొరల్ సుఖంతురుగా తన్ ; 149

ఉ॥ ఈ యది రాజశబ్దసమమే తుదినిన్ గురు వై ప్రజాఖ్య మా
ప్యాయము శబ్ద, మంతరము లన్నిటినిన్ సెలయేళ్ళ నేఱుతీ
రై యిమిడించికొన్నదిసుమా! యిదె జాతి యనంగ నొప్పు, జా
తీయము దీని యాత్మరుచి! తెన్గున జా స్తిగ తీయ మీయదే. 150

క॥ జాతి యన నెటులు ప్రజయో
జాతీయత యనగఁ గాంగ్రె సటు లై భరత
త్మా తుఱగలిగొను వను తె
న్నో తెఱగుల చేయు నొక్క టొక్కటిగ నొగిన్. 151

మ॥ ఇపుడు కాంగ్రెసున కే డేండ్లు, నెన్నొ చిన్నవి హక్కు లొందె
ను ప్రభుత్వదృష్టిలోఁబడెను, నూఱ రొకరి పైని నొకరు
నెపుడొ బలె నిరుపెందెగలు నేడు కారాల్ మిరియాలు
విపరీతములు లే కిది ఫలవిస్తృతి గను పరీతముగ. 152

ఉ॥ హక్కులు ట్యాంకుచెక్కులుగ నప్పటికప్పుడు చేతికందవో
యిక్కడి పాలనాసమితియింగ్లిషువారలు ధిక్కరించినన్
దక్కినవారు భారతజనాభ్యుదయంబు వ్రతంబుగాఁ గ్రియన్
మిక్కిలునాడు, రచ్చఁ బ్రజ నేతలు క్రిక్కిఱియించునాడునున్.

ఉ॥ ఆఱునుమూర్లయేబదిగు రందఱు సభ్యులు పార్లమెంటులో
భారతరక్షకై దివికిఁ బంపిరి భారతలేఖ దేవుడే
తీరువ రంచుఁ దా మరయు తీరిక లేదని, సాతిజార్జియూ
తీరిత మిద్ది, జేతలకు నెన్నొ వథా, లివి చేత లాగునే! 154

ఆ॥వె॥ చేతబట్టి బ్రిటిషు జెండాను భారత
నేత లెల్ల లండనీయరాజ్య
సమితిభవనమెదుట జరిగింపవలయుఁ గాం
గ్రెసు ననిరి మన యచటి సహృదయులు. 155

ఉ॥ లండనుపోక య ట్లునిచి లగ్గు మరింత వచింతు, నేరికై
మండిత మీ సమజ్య? ప్రజమండలికై కద! రాజకీయ ము
ద్దండము తెల్పుచున్ జనపదమ్ములఁ బోదము, వారలిట్లు సే
యుం డన నట్లె సేయుద, మి దొక్కటె మార్గము లత్యసిద్ధికై.

ఉ॥ అన్నిటికన్న మిన్న వినుడా తనుచిత్తధనత్రిదార న
స్మన్నవగంగ పొంగగఁ బ్రజార్థము భారతముం బొసర్చి వి
శ్వోన్నతసత్ఫలమ్మును యశోవిభవమ్మున నాశశీనసం
పన్నుల మౌద, మీ స్థితికిఁ బాత్రులు నేతలు భావిపాలకుల్. 157

క॥ వినిచె నిటులు తెలుగువడాల్
ననిచి జన మయోమయాసనం బగు కాంగ్రెస్
తనరె సువర్ణాసనముగ
ఘను డగు వీని నధిపతిగఁ గలుగుట ననియెన్ 158

క॥ నిను విని మఱచితి నౌరో
జి ననెన్ లజపతిబుధుండు, చెనసెద నిక నీ
పనుపున నాచార్యా! నే
మునుపటి తిలకుండఁ గానుఁ బో, తిల కనియెన్. 159

అలా॥ సైనికుల కళాశాలలను నెలకొల్పి
వీనిలోఁ దరిఫీ తిడి యుచటివారిఁ
బ్రాణితులఁ జేయవలెఁ బ్రభుత్వం బుద్యోగ
దానమున నని తరకటించెను తిలకు. 160

ఉ॥ వచ్చిననేతలందఱివి వాచనముల్ తొలినుండి యేటనున్
వచ్చుచునున్నయంశములపై నివె, శాసనగోష్ఠియెన్నికల్
క్రచ్చుకొనంగ సైరిషుసభాన్వితసర్వబ్రిటన్‌హితుల్ మదిన్
విచ్చి శ్రమింపరే! యనుచు నిర్ణయ మొక్కటి నవ్య మన్నిటన్.

క॥ బోనర్జీ యధ్యక్షత
నైనది తరువాతి కాంగ్రెసలహాబాదణ
మానితుల జారి యూన్‌ము
ఖ్యానేకుల మృతులఁ బొగడి యధిపతి నొడివెన్. 162

మం॥ద్వి॥ ఇతరులు కారు మేమే బాధితులము
రవ్వంత మము వినరాదో య టన్న
వినము మీ మాటలు విసుగు పుట్టించు
నను రాచరికము నే మనవలెనండి

యూరోపియనులు తోడో అసమ్మతులు
వారు పొం దని, తోడు వారు రానపుడు
మీ రెవ్వరో ప్రజవేఁలు మాయంత
నేర రని ప్రభుత నేతల నణచు
శాసనసభల విస్తరణముఁగూర్చి
యాశించినటు చట్ట మైనది కాని
దాని సంబంధము లో నిబంధనము
లౌ నెట్లో వై ప్రాయి కవగత మగుత!
హాక్కు లాంగ్లుల కెన్నొ యన్ని యీ ప్రజకు
దక్కెడుదాక యత్నము సాగున నేడు
మన నవరోజి లండను పార్లమెంటు
నను సభ్యు డగుట విఘ్నము కొంత తెగుట. 163

గీ॥ ప్రాథమిక విద్యలకె మేము వ్యయ మొనర్తు
మున్నతము విద్య కేల? య టన్న ప్రభుత
పిన్నబిడ్డను ప్రేమింతుఁ బెద్దదాని
వైపు చూడ నసెడి తల్లిభాతిఁ గాదె! 164

శా॥ కాలేజీ నెలకొల్పు ఖర్చు ప్రజదే కావచ్చు మాదాక రా
నేలా? యన్నది నేడు రాచరిక, మిట్లే రే పనఁన్ మీ విలే
జీలో విద్యకు ఖర్చు మీదె యని, సాచెన్ జేయి, గద్దించి ప
న్నో లాగెన్,ముడిచెన్ జెయిన్,శుభములెన్నోవీగె సంభావ్యముల్

గీ॥ సంఘసంస్కరణమ్మును సాకువెట్టి
ప్రభుత మలపింపఁ జూచును రాజకీయ
సంస్కరణమును, బలమున సర్వరోగ
ములు హరించుట తెలియని ములుచ యెవడు. 166

ఆ॥వె॥ కలదొ దేశభక్తి క్రమశిక్షణంబును
జాతి యందరాని ఖ్యాతి లేదు
పట్టుదల యనియెడి పాదులోన జతన
మల్లె పూచు సమయ మావహిల్లె 167

క॥ ఆర్జితకరతాళము లో
నర్జియుపన్యాస మిట్టులు, నవరులు తిలకా
ద్యూర్జితభాషలు గొక్లై
సర్జితనుతివచనముల్, విషయము లనవముల్. 168

గీ॥ ఎలయుఁ బంజాబునందు ముంగలి సభ యని
ప్రకటితము గాగ వంగాదిరాష్ట్రజనము
మగిడి నిజశరణోన్ముఖ మయ్యె, శీత
మెక్కు వయ్యె, నగ్నియు నెండ మక్కు వయ్యె. 169

గీ॥ శీతమునన్ సీతు నొక యింటి బిడ్డ లేమొ
వణకుచున్నవి తనువులు వానివలన
కాయములకు సదారోగ్యకారణములు
తగ్గుచున్నవి సుప్రభాతచరణములు. 170

క॥ అను వత్సరము డిసెంబరు
న నిట్టుల నగు నా సదంబునన్ బాల్గొనుచుం
డ్రి నరతిలకులును కేసరి
కెన యగు వారలును దూరదృష్టులు శిష్టుల్. 171

# వివేకానంద ఖండము

గీ॥ జానుగునకె కాక మదికి జాను వైన
మదికె కాక హృదికిఁ ద్రావ మధుర మైన
కవన మెందు? సరస్వతీభవనమందు
ననగ కలకత్తాపట్టణమ్మునందు. 1

క॥ దవనమ్ముకన్న గొప్పది
కవన మ్మది వాడువాఱక పరిమళించున్
సవనమ్ముకన్న గొప్పది
కవన మ్మిందుఁ గల జ్వాల కగ్గద యెపుడున్. 2

మత్తా॥ ఇన్ని సొగసులు దీని వని యెవ్వడు నిర్ణయించినను
కొన్నిగా వానినిఁ జేయు గుణముగలది కవిత్వంబు
అన్నిటన్ బ్రకృతికిఁ బ్రతిగ నదొక మహాశిల్పసృష్టి
కన్నులులేనివానికినిఁ గనుపింపఁజేయు విశ్వంబు.

మత్తా॥ కథ చెప్ప, వర్ణన చెప్ప కడకు వార్తాపత్రిక వలె
పదుగురకును సందేశంబు పరమవాచ్యమ్ముగాఁ జెప్ప
మెదలు కవిత్వంబు మెఱుగు మేఘమునందు వలె, మెఱు
గుదివె యదే మర్మ మెఱిగి కూర్చువాని రచనయందు. 4

క॥ గిలిగింతపెట్టు నొకపుడు
చిలిపితనము చూపి హృదయచిక్కణరుచి యై
యొడ లేలు కవిత యొకపుడు
పలుకులె గాని పసలేనివానిన్ విడచున్. 5

ఆ॥వె॥ సైగచేసి తలపుసరిపల్కుబడి వెత్తి
నిడని గడుసుదనము తొడరఁ బల్కు
తొడవు లొసగి మేలునడతకై సందేశ
మిడగ కవిత విడదు పడతి వోలె. 6

మ॥ కావచ్చు కాకపోవచ్చు కవి ఋషిగా, మహాకవిగ
కావచ్చునా మహాభణితి కవిత చెప్పినయంత? మఱియుఁ
గావలెను మహాగుణాల కాణాచి, చేత మహాత్వ
శేవధి కాక వావాదుచేత మహానేత యగునో? 7

ద్వి॥ కలడు మహాకవి కల్కటాపురము
న లలితుడు "రవీంద్రనాథఠాగోరు".

క॥ ద్వివిధంబు రవము మధురము
కవితామయ గానమయము కలవారలలో
నెవడు నెవడు రారాజుగ?
రవీంద్రనాథుండు చిత్రరచనాచణుడున్. 9

గీ॥ ఆ రవీంద్రుని పద్యగేయమయ కవిత
మానవత్వనిరూపణామ్నాయకలిత
అల శివాజ్యాదివర్ణనావళితదేశ
భక్తిమహిమ పిల్లలదాక పరువులెత్తె. 10

క॥ చవులిచ్చెను పండితులకుఁ
జెవులిచ్చెను దేసల కెల్ల జేతాకం బై
నవజీవన మిడె జాతికి
రవీంద్రు కవనంబు సుప్తులన్ మేల్కొలిపెన్. 11

ఆ॥వె॥ నవ్యకవిరవీంద్రనాథఠాకూరు క
ర్తవ్యబోధివివిధరచనకలన
నూదెఁ గ్రొత్తగాలి యూపిరితిత్తిలో
మానవునకు జేయదానవునకు. 12

గీ॥ ఆత్మ శాంతినికేతన, మవసరమునఁ
బలుకు క్రాంతికిఁ జేతన, మలరుచుండ
శాద్భుశకవీంద్రునకు వైచెఁ దనది వెలిచి
సాంద్రసభలోన "బంకిముచంద్ర"బాబు. 13

క॥ కవన మనఁ బద్యమే కా
దు వచనము నగున్ రసమ్ము దొరల, రస మనన్
వివశుగఁ బఠితనో శ్రోతనో
సవరుచు వాఙ్నిబిడభావసంగతియ సుమీ॥ 14

చ॥ ప్రతి రచనమ్ములో ధ్వనితభావము భారతభక్తియున్ స్వతం
త్రతకొఱకైన శక్తియుఁ దదార్జనసాధనయుక్తి యైకమ
త్యతరళజాతిశక్తి హృదయార్జవ మౌ కవితాకళాచమ
త్కృతి కలదై చటర్జికుల హీరము బంకిముచంద్రు డొప్పెడిన్.

క॥ సన్యాసు లతని పాత్రలు
ధన్యాసులు భారతస్వతంత్రతకొఱకై
ఆ న్యాయవాదిరచనా
విన్యాసమె వేఱు, వేరు విధిశిక్షణకున్. 16

గీ॥ అధునికులైన జోగు లేడాది కొక్క
సారి మూడుదివసమ్ములు స్థలము మార్చి
కూడి యాంగ్లుల భైక్ష్యము వేడుచుందు
రదిగో! యని కాంగ్రెసున్ జూపె నత డొకనికి. 16a

క॥ "వందే మాతర" మను నొక
సందేశధ్వననగీతి చాలును బంకిం
చంద్రుని యమరత్వమునకు
కేంద్రీకృతదేశశౌర్యగీత మదొకచే. 17

శా॥ తా నెం దయ్యెనో పట్టభద్రుడు కృతార్థం బా కళాశాల, త
ద్వ్యాఖ్యానోద్ధర్షములో "నెపోలియను"పై ఖాషించి బంకింసురేం
ద్రానీతస్తుతిమాలికాభరణు డైనా డే నరేంద్రుండు గై
ర్వాణీభాషఁ గవిత్వ మల్లె నత డౌరా! మల్లెపూదండగా. 18

చ॥ తను గృహమేధిఁ గమ్మను హితావళితో గృహి నౌట భారతో
ర్వి నలమటించు బానిసల లెక్కను పెంచుట కేకదా! యనెన్
బనితు డహో! నరేంద్రుడు నృపావళితో నగు దేశదాస్యమో
చనమున మంతనంబు విరసం బయి "ఖేత్రి"ధరేంద్రు నారసెన్. 19

మ॥ అత డే నొక్కడ నేమి సేసెద మహాత్మా! శక్తిమై నర్థసం
యుతునిన్ జేసెద నిన్ను శిష్యుడను, నా దొక్కండు విజ్ఞప్తి. నీ
వతిలోకప్రతిభాన్వితుండవు 'వివేకానంద' నామమ్ముతోఁ
జతురత్వమ్మున మేలుకొల్పవె ప్రజన్ జాతీయతాబోద్ధవై. 20

గీ॥ ఎల్ల సంస్థానపతులు కుందేళ్ళు నేడు
కోట్ల ప్రజలందు వీరునున్ గూనొకరు
పిఱికిమందును విఱిచి యంబేదపజను
మెఱిక సేయ స్వచ్ఛందత మెఱయు ననియె. 21

క॥ మెచ్చె వివేకానందుడు
విచ్చెనుమప్రకృతి, పృథివి విశదాశ వికీ
ర్ణోచ్చసుగంధము. పతులు
హెచ్చించెను కోకిలాదు లింపితము ధ్వనిన్. 22

గీ॥ మధురబా బను నిష్టుని మనవి ననుస
రించిన "గదాధరుడు" రామకృష్ణు డయ్యె
నేను నట్లె తచ్ఛిష్యుడ నీవు గోరఁ
బేరుమార్పన, దాననౌ సార మెంత 23

క॥ ఓయీ! నరేంద్రా! యటులే
సేయుచునుంటి ననె స్వామి, చిలికించెను వా
హ్వా! యని ఊే డెలనవ్వును
పోయెను ఢిల్లీకి స్వామి పూజితపదు డై. 24

క॥ వాని యుపన్యాసధ్వని
కూణితఘనగర్జనము పఘూర్జరరాజ
స్థానముగ ఘూర్ణిలెన్ ఢి
ల్లీ, నగరము లుక్తిసరసి లిల్లీ లయ్యెన్. 25

ఆ॥వె॥ "మిసిసిపీ"కి లేదు, మిన్ను వాగునను లే
దది "నయాగరా"కు నసలె లేదు
ప్రచురగురుకృపాసరద్వివేకానంద
వందనీయవాక్ప్రవాహరయము. 26

మ॥ గురుగోవిందునిఁ గూర్చి పల్కినపు డతుల్ ధన్యతానీడఖా
సురపతున్ సభవారి వా యతిని గాంచుఁ బ్రాప్త మోక్షస్థితిన్
స్ఫురితప్రాక్తనసన్ని వేశమననాభోగాత్మభాసాంచితున్
పరితః ప్రాంతవిధూనయన్నయనశోభాజ్వాలికామాలికున్. 27

క॥ జాతీయత యను తీయని
నేతిమిఠాయి తొలి వండి నిఖలప్రజకున్
శీతాచల మాదిగ నా
సేతువు తత్పరమహంసశిష్యుడు పెట్టెన్. 28

గీ॥ హైందవమహమ్మదీయసమైకమత్య
కలన కేవలోపన్యాసకథుడె కాక
తురకలింటి యతిథిగ స్వామి తురకగలించి
యొక "మహమ్మదానందు" శిష్యుగ వరించె. 29

గీ॥ ఏ తమోరి పాకీవాని చేతినుండి
కోరి పూని హుక్కా పీల్చె, నారగించె
నంటరానివా డసబడు నతని యింట
నా వివేకమూర్తి జనుల కనియె నిటులు. 30

సీ॥ ఎవరి దుస్థితికి వారే బాధ్యు, లింగ్లీషు
వారు కా రింక నెవ్వారు కారు
మన ప్రజాసామాన్యమును కూడగట్టుకోఁ
జాలని మనకు నైచ్యమ్ము వచ్చె
మనవారినే మన మరయ నీచులనుగాఁ
బరులును మన నట్లె యరయుచుంద్రు
లేడు మ్లేచ్ఛుండును లేడు నస్పృశ్యుడు
నరజాతి యైన యెల్లరము నొకటె

ఆ॥వె॥ పలువిధములు దేశభాగ్యయత్నమ్ములు
సలుపునపుడు ఫలము తెలియబడదు
అక లైన వేళ నన్నమురుచి దప్పి
చెలగ జలమురుచియుఁ దెలియనట్లు. 31

ఉ॥ పేదలు నిమ్నజాతులు నవిద్యులు చెప్పులుకుట్టువారు మీ
వీదుల నూడ్చువారు ప్రభవించిరి వారును మీరు నెల్ల సో
దరు లొక్క గడ్డపయి నొక్కటె మాంసము నొక్క రక్తమై
మోదిలు డో! ప్రజల్! సమముజ్జ్వలభావముతో శుభం బగున్. 32

క॥ నా దేశప్రజసుఖమే
నాదు సుఖము, స్వర్గమునకు నాదేశమురా!
నా దేశము, భరతావని
గాదిలికొడుకు నని పురుషఘన! గర్జిలరా! 33

గీ॥ ప్రతిమనుజునందు నున్నాడు, ప్రతిమయందు
లేడు శివుడు, దీని నెఱింగి ప్రోడలార!
మనుజుడే మనుజుని శివు డని భజించి
యిందు నందు మహోదయం బందుకొనుడు. 34

క॥ జాతిశుభోదయ మాత్మ
స్వాతంత్ర్యము రెండు నివ్వి, య య్యుగళముకై
మీ తనువు ధారపోసి ధ
రాతలనక్షత్రములుగ రాణింపు డయా! 35

ఆ॥వె॥ దేశభక్తి యనగ దీనుల కైశ్వర్య
ధాను లర్థరాశి దాన మొసగి
పుష్టిమంతులనుగఁ బొనరించి వారితో
చేయికలిపి గమ్యసిద్ధిఁ గనుట. 36

క॥ కాబోకుడయ్య! ప్రజలా
రా! జానిన లీరు దుర్బలతకుఁ బ్రకృతికిన్
కాబోకు డనాశ్రితులుగ
మీ బలగంబునకు లేమి మిడుకు జనులకున్. 37

ఆ॥వె॥ భరతమాత కలల బంగారుగనులలోఁ
బనులు సేయువారు బడుగువారు
తప్పలమ్ముకొలుకు ధనము వర్షింపరా
భారతీయః త్యాగభారధుర్య! 38

మ॥ అసమానత్వము సృష్టినైన దొక దేహంబందె, తక్కెల్ల మా
నిసిచే మానిసి కైనదే, మొదటి దై నిప్పచ్చర మ్మిట్లు తెగన్
గ్రసియించెన్ భరతావనిఁ, బ్రజలుః త్యాగశ్రేష్ఠు లై మాఱుసృ
ష్టి సృజింపన్ గల మీరు దైన్యమును ఖండింపన్ మగల్ కండయా!

చ॥ అతడు మహాత్ము డన్న హృదయమ్ము యదీయము వెన్న కష్టు లా
నతగులఁ జూచి, పుస్తకము లగ్నిని వేయుడి! విద్య యుండియుఁ
బతితులు వారు దీనులకు బాసటకా రటు లుండ దీనళో
ణితభృతు లైనవారు జననీవ్యథయత్కృతుల్ పృథగ్జనుల్.40

క॥ తినఁ దిండి కట్ట బట్టయు
జనుల కొసగలేని జాతి జాతియె! గొప్పం
దన మతిశయోక్తి కాదోః
మన తాతల పైడియావి మణుగుల్ మణుగుల్. 41

ఉ॥ తీగఁసాగె నెల్లెడలఁ దెక్కలి మాంద్యము భీతి, నాయకుల్
సాగిరి రెండు హస్తములు సాచి భుజించుట దేన నన్న చ
ర్చాగరిమమ్ముతో, కనెడి సజ్జను కన్నుల నీరు కాక కా
ఫీ గళితంబొ, రాయి పడి వేయగఁ దాకెడి దవ్వొ ముక్తికిన్. 42

శా॥ అమ్మా! భారతి! నీ కుమారకులు శాస్త్రాధిఖండపాండిత్యభాం
డమ్ముల్,వీరికి స్పృశమున్ పశువులున్ పాషాణముల్,మర్త్యునిం
బో మ్మంతంతట నందు, రన్యమతమొందున్ గద్దె నుండుంగదాః
య మ్మర్త్యుం డపు డౌను స్పృశ్యు, డెటు లి ట్లైనీకు మోక్షం
బగున్? 43

ఆ॥వె॥ ఓః యథోజగత్సహోదరులార! ఓ
పతితులారః రండిః భ్రష్టులార!
యనుచుఁ బిలిచి పరమహంసశిష్టన్ వారిఁ
గౌగిలింతు మనసు గంతు లిడగ. 44

చ॥ తనువును దేశ మొక్కటియె, తాడితమో యొకయంగకంబు త
క్కునవియు తెప్ప యున్న నొవగూడద యే పరికేని చక్కగాఁ
దనువు, సమంబు గాక యొకదా॥ రుధిరప్రసరంబు, దేశమున్
మొనయద యట్లె యే తెగకు నొప్పి ఘటిల్లిన గమ్యసిద్ధికై. 45

ఉ॥ నెత్తురు పొంగులెత్తి గణనీయమౌ జీవిత మూహసేయు ధీ
రో త్తములార! కన్గొను డహో! యువపాళను విశ్వరూపమున్
గ్రొత్తగ నెట్లు జాతులు పురోగమనమ్మునఁ బైకొనెన్, తదం
చత్తడిదుద్ధరప్రగతిజన్మము సర్వసమత్వమే సుడీ! 46

ఆ॥వె॥ వెనుకచూపు వద్దు, వెనుక కడుగువేయు
వద్దు ప్రియతమాప్తవాణులయ్యు
ముందుచూపుతోడ ముందుకు ముందుకు
నదర ధర క్రమింపు డన్నలార॥ 47

ఆ॥వె॥ సాంఘికముగఁ బ్రజకుఁ జైతన్య మొదవ ను
పన్యసించుచు నిటుఁ బలు నగరుల
నా బుధానచందు డా "వివేకానందు"
డరయ నెంచెను పునహాపురమును. 48

మం॥ద్వి॥ ఘననేత బాలగంగాధరతిలకు
పలికెఁ బూనాపురీపరిసరసమితి, 49

క॥ మితవాదుల మతి కీ తుణ
మతుకుంబడకున్న నేమి! యట్టిరు బాబేల్
గతి మెదలిన నేమీ! మీ
తతిలో నే నొకడ జయమవదజ్జనులారా! 50

చ॥ విడుతునొ కార్యదర్శిపదవిన్ మితవాదుల తృప్తి కంతె, నే
విడువను కాంగ్రెసున్‌ఁ, బ్రజలు వేలకువేలుగఁ జేరు డందు మా
యెడదలతోడ మీ యెడద లేకముసేసి, స్వరాజ్యభుక్తి కా
జెడ గగు సంస్థయే పసిడిచిస్తరి భారతమాతృదేవికిన్. 51

గీ॥ నే నుపాధ్యాయవృత్తిని మాని పత్రి
కనె నడపుటయునున్ లోహకాచకర్మ
నిలయముఖ్యపరిశ్రమనిరతి నొందు
టయును మీ సేవకే గుణాఢ్యజనులార! 52

ద్వి హాల్యాండొర ప్రకటించె నొక కరపత్ర
మెందలో కంటి రీ, రిటు లుండె నందు. 53

ఆ॥వె॥ కలవు భూమివన్ను కడు కృంగదీసిన
హాృతహాృషీకులార! కృషికులార!
తిరుగుబాటు సేసి తీర్చిదిద్దుకొనుండు
మెలుగుబాట ప్రభుత మెడలు వంచి. 54

గీ॥ భారతీయకార్షకవిప్లవమ్ము నణప
పుడమి నున్న యె ద్దానికిన్ గడిమి లేదు
మాకు నాయకు లెవ? రని మీకుఁ జింత
వలదు, సమయమె కొనివచ్చి నిలుపగలదు. 55

గీ॥ ఎదురు తిరిగి వేల్ పోయిన నేమి! బ్రతుకు
దురు జనంబు లతులు లతులు, రవళింప
కూరకుండి మహావిపత్క్రూరమునకు
నెల్లరును బలియగుకంటె నిదియె లెస్స. 56

క॥ చంద్రిక చీకటి నెలుగదొ
హాల్యాండొర మది నెనయు, వాని యుక్తి యిది ప్రజా
స్పందనశక్తి, యతని దీ
నన్ ద్రుంప నొకండు లండనాస్థన్ గోరెన్. 57

గీ॥ విత్తు లేదు గేహముల విపత్తు దక్క
పన్ను గొనుట తగ దీ యేట నన్న వినదు
ప్రభుత, భూకంపమందుఁ దరంగిణీప్ర
వృత్తి వలె నన్యపథము కాదేమొ! జనత. 58

మధ్యా॥ మితవాదులం దతివాది, మించెను నన్ను స్వరాజ్య
కృతలక్షణవ్యాసరచన నే పాత్రికేయు డాగార్క-
రతడు నా వడి హెచ్చ్యామునుడి సమర్థించె సంఘసంస్కార
మతి నన్ను విడెఁగాక!, నేడు మన కున్న దట్టిర తోడు. 59

మ॥ తనరె న్నేటికిఁ బ్రాతినిధ్యమున దాదాభాయినౌరోజి లం
డనురాజ్యాంగసదస్సునందు, మన వాంఛల్ తీర యత్నించు నా
యన, వేడెన్ జయసింహు డీ గతినె ము 'న్నౌరంగజేబున్' 'శివా
జి" నిమిత్తంబుగ,బీటువాటె, నదియే సిద్ధమ్మొ! యీనాడునున్.

మ॥ అయినన్ యూధపశక్తికన్నఁ గడు సాహస్రమ్మొ లా రెట్లు శ
క్తియ యూధస్థ మహో! నరప్రకర ముద్రేకింప నద్రీంద్రమున్
దయనీయం బయితీరు, భారతపుగీతన్ వ్రాత యీ తీరు, మీ
రయిబాహుళ్యము, వాయి యేకవచనం బై యో! ప్రజా!
లెం డికన్. 61

మధ్యా॥ బంగారుముల్లె నడుముకు బంధించికొని గ్రుడ్డివాడు
పొంగుచు రామేశ్వరమ్మ పోవును కాశినుండి, యిది
యంగీకృతక్షేమవార్త యాంగ్లపాలనమున, కాని
బంగారు లండనుఁ జేరె బంధించికొన నిట లేదు. 62

క॥ మన పన్నుకట్టు ధన మది
మనదే, దాని వినియోగమా। మనకొలకే
కనుకట్టుచదువుతో దొర
తన మేతత్కృతివిరుద్ధతత్పర మయ్యెన్. 63

చ॥ ధనమిది సద్వియోగము కదా!యెటు సద్వినియోగ మౌను?శా
సన పరిషత్తునందు మన సంఖ్య యనల్పమొ కొంత యౌను, నిం
డు నగును నిండుగాఁ గొలువునున్ గలమో, పడుకొన్నవారు లే
చి నిలబడ న్నిషణ్ణు లగు చేతలు నేటి సమజ్య సంస్కృతుల్.64

శా॥ అర్జీల్ వ్రాసియు దస్కతుల్ సలిపియున్ వ్యర్థమ్ములే, సోదరుల్!
పర్ణన్యావళి యాచుఁ గ్రమ్ముకొని పెళ్ళల్ రాల దిగ్భిత్తులన్
గర్జల్ సేయుద మోయి! దుర్విధియు నీ గర్జల్ సమాప్తాంతముల్
ఖర్జూరోపమబాలపాలనకసంస్కారమ్ము లంతస్థితుల్. 65

క॥ చీమ చిటుకు మన నీయక
మో మటునిటుఁ ద్రిప్ప కొక్కమొగి పత జన ము
ద్దామము కార్ష కకార్మిక
మామోదింపఁ దిల కాదె నా వాచనముల్. 66

గీ॥ బాలగంగాధరుడు వచ్చె ప్వాలయమున
కు, జరిగిన పరిషత్పరిఘుణితముదము
గూర్చి హితులఁ బలుకుచుఁ బ్రజఁ గూర్చుకొను వి
వేక మానందమును మన విందు లనిరొ. 67

మ॥ అని గుమ్మమ్మునఁ గన్గొనెన్ దిలకు రుంద్రాతిస్ఫురత్కాంతిరే
ఖు నితాంతోర్జితమూర్తి నిశ్చితవిశాఖున్ ధత్తకాషాయవే
షుని సోష్ణీషుని వొక్కనిన్ గథితశస్తున్ యౌవనస్థు,న్నమిం
చెను వానిన్,మరి కౌగిలించికొనె వానిన్ గల్కటా యంచనన్. 

క॥ ఊరుం జెప్పితి విక నీ
పేరున్ జెప్పెద నయాః వివేకానందా!
నీ రాక న్నా గృహమే
నాః రాజిలె సార్థకము మహారాష్ట్రింబున్. 69

గీ॥ వంగదేశయువకుల యస్థిపంజరముల
నుండి వజ్రాయుధంబులు గండరించి
భరతమాతృశృంఖలలను తఱగు వన్న
యుష్మదీయవాక్యము వింటి నొకరు చెప్ప. 70

మ॥ అది విన్నప్పుడు నా శరీరమును నేనా!కాదు, బ్రహ్మాంబునై
తిఁ, దగఁగ ధైర్యము బొంబయీనగరసందీప్తత్వదీయోక్తి నా
యెద కంటించితిఁబ్రతికఁగ వెలిచిస్వామీః ముందుకుఁ ముందుకుఁ
గదలింతున్ బ్రజ నీ ధరిత్రి యదరన్గా, వెన్క చూపుండునేః 71

మ॥ అనినన్ స్వామి వచించె నోయి! మనువంశాకల్ప! యోగీనాయకా
గ్రణి! నీ నైతికవిధానవిభూతిఫలితజ్ఞానప్రకాశం బోకం
డె నిదానంబు స్మృతిన్ బ్రజాప్రగతికై, నీ కాంగ్రెసే కాక, రెం
డును లేకున్నను నొక్క కన్నయిన మేలున్ గాదే యనన్ గావలెన్.

క॥ పిట్టలు కిచకిచ లాడన్
బట్టిన పెద్దపులి విడుచునా! మీ బోటుల్
దిట్టరు లెందఱో తలపడి
కొట్టినయట్లేని యటువకున్న మనీషీ! 73

క॥ కేవల నిర్ణయములతోఁ
గావు పనులు, కార్యమునకుఁ గడిదేరవలెన్.
కావలెను పారతంత్ర్య
గ్రావ మగల మందు గూర్చు కార్మణసింహుల్, 74

ఉ॥ ఆకలిబాధకున్ దొలగి యందఱు నేకముగాక, పాఠకుల్
లేకరు లై స్వభాష సభ లేచి నిలంబడి మాటకారులున్
గాక ప్రజల్, తదాయతికిఁ గాంగ్రెసు హేతువు గాక, కొందఱున్
తో కలిగింప కే గతి లభించు స్వరాజ్యము హూణదత్త మై? 75

చ॥ అన దిల కాడె దత్త మన నౌనె, స్వరాజ్యము జన్మహక్కుగా
మన కిది హూణముక్త మను మాట సమంజసమౌను, ముక్తికై
యనితరలభ్యసంఘబల మైనది కాంగ్రెసు తక్క వేఱు లే
దు, నివురు పోవదో! రగులదో! యిక నిప్పు తృణంబు దాస్య మై.

గీ॥ కాంగ్రెసునఁ బిట్ట లున్నను గరుడబలము
మిన్న యాటకు యత్నించుచున్న మేము
కామొకో! కృతార్థులము స్వల్పకాలముననె
యుదితములు తీంద్రములు కావో! ద్యుమణిరుచులు. 77

గీ॥ పోషితంబు రసాలంబు భోజ్యఫలము
బహువిధాచేతనీకృతప్రజ స్వరాజ్య
ఫలము, భవదభిభాషితంబు అపితంబు
యోగరత్నమ! త్వద్యత్నభాగి నైతి. 78

క॥ మస్కరివర! యుద్యమతే
జస్కృతికై వంగవేషసంధృక్శ్యు సుతే
జస్కు బుధు నునిచినాము ది
వోస్కరునాము కథక ప్రభున్ కలకత్తాన్. 79

ఆ॥వె॥ సుఖులె? భారతీయమునిశితసంప త్తు
ధీరు "డశ్వినీకుమారదత్తు"
సతత మమత్రృపుంబజారు 'మోతీలాలు
ఘోషు,' వీరు నాకుఁ గూర్తురు కడు. 80

క॥ విని సుఖు లని యత డాతి
థ్యనిరవధికతృప్తు డుక్తవాచను డట నీ
దు నిలయమున నే నుండుదె
యనఘా! యిది యనుచుఁ దిలకు ప్రార్థించుటచే 81

ఆ॥వె॥ తిలకు విడువలేక విడువలేక విడిచె
స్వామి నతఁడియుగము తేమ బొంద
మనసు లాగ వెన్కకును రైలు ముందుకు
సాగఁ గన్నడమున కేగె స్వామి. 82

క॥ ఈ మహితుని శ్రీనామము
వేమారు వినంబడెన్ వివేకానంద
స్వామి యని మనకుఁ బత్రిక
నీ మహి ధన్యాత్మ నేటి కీతనిఁ గనుటన్. 83

ఆ॥వె॥ కాళిఘట్టపురవిభాలవాలము రామ
కృష్ణపరమహంస కితడు ఛాత్ర
రత్న మై ప్రజోద్ధరణమున బద్ధక
టిత్రు డయ్యె, సర్వమిత్రు డయ్యె. 84

గీ॥ అలు సమలు పరమహంస సారనీతి
నాటితేరి భారతమాత యాదిజనని
యని జననిఁ నెడసి జనసేవ నొనరింప
దీక్షఁ బూనిన యోగివర్యు డితడు. 85

శా॥ లేమిన్ దొల్లి నెవండు పాచికొనఁ గాళీమాతృపాదాశ్రయుం
డై ముమ్మారులుకూడ నాయమను సన్యాసమ్మె యర్థించె దే
వీమాహాత్మ్యమొ! యిన్నికోట్ల ప్రజ నావేశించు సౌభాగ్యమో
యా మర్త్యాయితదివ్యమూర్తిని వివేకానందు నాలింపుడీ !

మ॥ తన నీమ్మైఁ దెలుపన్ బురాకలితవార్తాపత్రికాసంస్తవ
మ్మున నద్భుతులు సభ్యకోటికి యశఃపూర్ణుల్ బుధుల్, స్వామి వా
చనరత్నమ్ములు పంచిపెట్టె సభలన్ సంస్తూయమానాంగ్లభా
ష నహో! కన్నడద్రావిడాంధ్ర జనతాస్వాంతోజ్జ్వలాకల్పముల్.

క॥ వినిచె వివేకానందుడు
ఘనధ్వనద్భాషఁ బ్రజకుఁ గరతాళరవ
ప్రణీతము శ్రుతిచక్రంబుల
మనోరథము మోదవీథి మలుపులుతిరుగన్. 88

మ॥ ప్రజలారా! వినుడోయి! దీక్షఁగొని లేవండోయి! దూరంబె యై
న జితప్రజ్ఞులు గాక గమ్యగము లౌ నందాక యెం దాగ కొ
క్క జవం బై గమియింపుడోయి; జయభోగార్హుల్ స్థితప్రజ్ఞులో
యి!జయస్థానము సత్యమోయి!చెడునోయీ!యీ యసత్యస్థితుల్.

ఉ॥ ఈశ్వరునుండి మానవుని నెయిన తేజమె యాత్మశక్తి ది
వ్యాశ్వసహస్రధాటి, తల వంచక తప్పదు దీని ముందు నీ
విశ్వమునందు మేటియనిపించిన దేనికినేని భ్రాతలా
రా! శ్వియదేతదాప్తిని జయంబు గొనుండు ప్రయత్నశూరులై.

ఉ॥ అన్నిటికన్న ముఖ్యము యువాళిబలంబు, నివాళియిచ్చి దీ
ని న్నుతియింతు, నే మతము నేనియు దీనికి వెన్క, గీత శా
ర్యోన్నతివాని కర్థ మగు నొప్పుగ, నీ మెయి పొంగి నిల్చు న
భ్యున్నతమూర్తి యే శ్రుతిశిఖౌఘమువందుకొనున్, వృథాపెఅల్.

క॥ మతి యాత్మ శరీరంబును
స్వతంత్రములు గాగ వివిధ సౌభాగ్యము సం
తత, ముపనిషదుక్తులు నీ
మతలబునే చెప్పె మంత్రమధురము లగుచున్. 92

గీ॥ మేలుకొని లేచి పౌరుషశీలి యయ్యె
భారతీయు డనుచు దలపవలె నెవుడు?
ఆత్మజాతీయసిద్ధాంతయజ్ఞమునకు
నఖిలలోకభావము ఘృత మైన యపుడు. 93

గీ॥ ఆత్మ విశ్వాసమునఁ బుట్టు నాత్మగౌర
వంబు వర్ణమాలన్ విద్య వలె, నది కలి
వౌనొ నెత్తురు చచ్చును వణకు పుట్టు
ప్రాణజాతి జాతి యనంగ, నభృతభీతి. 94

గీ॥ తమమునుండి మేల్కొనిరొ సంతసమె కాని
శుద్ధసత్వగుణంబు విరుద్ధ మిపుడు
కావలయును రజశ్శక్తి కావ్యమునకు
కార్యమునకుఁ గడగుడు విజ్ఞవర్యులారః 95

ఆ వె॥ నష్టి యన్న వ్యష్టి, పుష్టి యన్న సమష్టి
మనది యాత్మరాజ్య మగుట వ్యాప్తి
యందుఁ బ్రభు వసృష్టి, "యాత్మవత్సర్వభూ
తాని", ప్రజ ప్రభువు, ముదంబు ప్రభుత. 96

గీ॥ అనుడు నుత్సేకభవరోమహర్షణమున
బ్రమోగినవి హస్తతాళమ్ము, లూగినవి క
శేబరములు, మజారె! భళి! హసాద
టంచుఁ జెలరేగినవి నుతు లాస్థలందు. 97

క॥ వలువుర ముఖనేత్ర ద్యుతిఁ
దెలుపగఁ బనలేవు నుడుల ద్రిశతి, మరియు నీ
లలిప్రవహించెను తశ్శ్వా
మిలలితసరస్వతి రయంబు మిత మై హిత మై. 98

శా॥ ఈ వేదాంతపవిత్రయుద్ధమున గెల్పెవ్వారిదో? యాత్మదే
జీవం బుండియు లేనిదే ప్రకృతి, యుజ్జీవింప జేయన్ వలెన్
నావారల్ మెయి నాత్మమూలము నసృగ్నాళమ్ములన్ వై ద్యుత
(శ్రీ) వెల్లుల్లోన గెల్పు గోరి, యిది నా సిద్ధాంతమండీ! ప్రజల్!

శా॥ ఈ యాత్మప్రకృతిద్ధ యుద్ధమున శైలేంద్రోపమస్థైర్యముల్
మోయంగావలె మీరు, పెద్దపనులందున్ విఘ్నముల్ పెద్ద వౌ
నో యందా విజయంబు పెద్దదియుఁ గాదో! మానవుల్ గొప్పవా
రోయీ! ఖేచరపాళికన్న, తణికా లోయీః యుసు ర్లో! ప్రజల్ః

చ॥ అలసతనో యశక్తతనో యన్నటినిన్ క్షమియించుకంటె య
గ్గలముగఁ బోరుచే నయము కార్యముపట్టున సోదరా! యచం
చలముగ దివ్యశక్తి కలనాడె క్షమించితి మన్న దానికిన్
విలువగదోయి! యాత్మరుచి పేదయెదల్ గలవారి కందునే!

క॥ జీవన్మరణము నుండీ!
కేవల సౌజన్య, మెంతకేనియుఁ దెగుచున్
కావలె ధీరుడు భారతు
డా వేళన్ భాగ్యరేఖ యారంభించున్. 02

గీ॥ తత్వసందర్శనము చేయు తఱియు నెంతొ
దూరమున లేదు, సంయత్నదూరులకు మ
నమె సుమీ!, వృథ కారాదు నిముసమేని
దుర్జనుడుకూడ సార్థముత్రోవ విడుచు. 103

క॥ శివశివ! పరమేశ్వరుచే
నవనంబుల్ పురుషకారవాసునకు వాళ
క్కి, విగతకలిపయసుగుణుం
డు విధృతబలుడున్ సయత్నుడో! వినుతింతున్. 104

గీ॥ పరమును జయింప యత్నించి భ్రష్టుడైన
నతనిఁ బ్రేమింతు దీవింతు, నతడు సఖుడు
నైహికము నెదురింపలేనలసు డెట్లు
పరమహారాజ్య పదవికిఁ బనికివచ్చు? 105

గీ॥ హృదయమందు జాతీయత, మెదడునందు
తెలివి, నరములఁ బౌరుషం, బలత లేక
యురకలెత్తిన వేళ నిర్జరుడు నరుడు
హరహరా! వ్యోమ! వ్యోమ! తన్నరసఖుండ. 106

క॥ ఏలా? పర సాహాయ్యము
నాలస్యముగా స్వయంసహాయక సూత్రం
బాలంబమ్మగ గెలిచెద
మాలమ్మున వోలె నెదిరి యదిమి చెడుగులన్. 107

క॥ శిర మెత్తుము, కర మెత్తుము
స్వరమెత్తుము సింహము బలె, భారతసేవా
నిరతియె భగవత్సేవా
నిరతి యటంచు మొనగాడ! నీతికిఁ బ్రోడా! 108

ఆ॥వె॥ ఆంగ్లవాణి కత్తి యమరవాణియె డాలు
కార్యరంగమందుఁ గలదు జయము
దుష్టశక్తి నెదిరి దోరింప లేవరా!
భారతీయ! ధైర్యభాగధేయ! 109

సీ॥ క్రొత్తది యిండియా యిపుడు, క్రొత్తది యిప్పుడు దీనివేదమున్
బొత్తుగఁ గ్రొత్తవాఁ డిచటఁ బొల్చిన దేవుడుకూడ నేడు, నీ
వెత్తిన పద్ధతిం బఠణమింత, మహా! పయనింత, మబ్బ మౌ
హృత్తుం జెకమై పరమశాంతము, చేయుప యోగసు గమ్యముల్.

ఆ॥వె॥ ప్రాతదనము దేశభక్తి లేకుండుట
క్రొత్తదనము దానిఁ గూర్చుకొనుట
దేశభక్తిపేరఁ దెగ వెట్టి కేకలన్
బాగుపడము కార్యభరము లేక. 111

సీ॥ భూషణమే కదా! నియమపూర్ణత, కొద్దికదా! పరస్పర
ద్వేషము, నీర్ష్య యల్లెఁ, జగదేక ఘనంబుగ నాంగ్లజాతి కా
దో! శమితంబు శక్తి మన, కొండ్లను చూచియు నైన నేర్చుకో
రోషణి వోలె నయ్యది పరుంగున వచ్చును, ముంచు హైన్యముల్

క॥ పిడుగై లోని పదార్థము
నొడల నినుపకండరాలు నుక్కునరాలై
వడి నాత్మరాజ్యలక్ష్మిన్
బడయర! సోదరుడ! ప్రకృతిమాధంకరుడా! 113

ఆ॥వె॥ పిఱికివాడు చచ్చి పురు గయి పుట్టు, వా
డెంత చదువుకొన్న నంత వృథయ
బంధము క్తి లేదు బ్రతికినన్నాళ్లు తా
తపసు పట్టెనేమిః తాదృశుండు. 114

గీ॥ త్రుప్పుపట్టుటకంటె మే నెప్పుడేని
యరిగిపోవుట మేలు, నే నరిగిపోవ
నాదు శల్యమ్ము లిందు నొనర్చుగాత!
యనుకొనని దివ్యడివ్యనవ్యాకరణములు, 115

ఉ॥ మాయవు గాయముల్ భరతమాతకు గుండియలో దరిద్ర నా
రాయణబాధ లెందనుక నాఅవో యందనుకన్, గృతార్థులున్
ధీయుతు లైన సంతు కలదేనియు లేనిదె యయ్యో మాత, యి
క్లై యఖిలప్రజా! త్వరగ నాదుకొనన్‌గదవేః దరిద్రులన్. 116

గీ॥ అటులు ప్రజకు ఘోషించి కన్యాకుమారి
యగ్రమున వివేకానందు డబ్ధిఁ గొంత
యీది యొక గండశిలపైఁ దపింపఁదొడగె
నన్నినాళ్ళను తా నిరాహారు డగుచు. 117

చ॥ తన గురుసూచనంబు మదిఁ దార్కొన నెవ్వరో వెన్నుతట్టి లె
మ్మనినటు లేచి యా మహితు డబ్ధిని జూచి జలేశ!నీవె సా
క్షి, నిరుపమానహైందవవిశిష్టత చాటి ప్రతీచిఖండపున్
ధన మిటు వేదలన్ మనుప నై కొని తెచ్చెదఁ లేనొ చచ్చెదన్.

క॥ తమ యూరేగింపే త
క్క మ రేది యెటుగని ప్రతీచిఖండంబులచే
సుమహితభారతవిద్యా
గ్రిమమున కో! జలధిః పల్లకి పట్టింతున్. 119

చ॥ అని శపథమ్ముతోఁ బరమహంసను కాళిక నాత్మఁ గొల్చి చె
న్ననగరి కేగె, నాప్తతమ మయ్యది,యచ్చోటునుండి స్వామి భా
గ్యనగరి వచ్చి ముస్లిములు నర్మిలి సేయ నవాబుస్వాలకుం
డినుమడివేడ్క మై సదసి నీయ గ్రహించె సహస్రరూప్యముల్.120

గీ॥ అంత స్వామి ఖేత్రి కరిగి తన్నుపసత్కృ
తుండు బొంబయిపురి నుండి యమెరి
కాకు బయలుదేరెఁ గంధిపై నౌకన్ జ
పానుమీదుగాఁ బ్రయాణ మొనర. 121

గీ॥ అమెరికాఖండపుటభేదనముల నొకటి
యగు "చికాగో"కు విచ్చేసె నయ్యతిపతి
యట ప్రపంచమతమహాసభాంతరమునఁ
బాలుగొన సభ్యహృదయముల్ పాలు గొనగ. 122

గీ॥ కాంగ్రెసన నేమి భారతఖండమం ద
టంచు లండనులో నొక డడుగ మరొక
డ దొక జిల్లాకుఁ బే రని యనియెనట, య
దే విధము హైందవము నాడు తెల్లతెగకు. 123

ఉ॥ దర్శనమాత్ర పాకలిని దప్పినిఁ బాపెడి మేని చంద, మా
దర్శము మర్త్యపంక్తికి, ధృతం బిది వస్త్రవిధంబు కంటక
స్పర్శము మానసంబునకు సాధువె యెవ్వడొ? యీత డంచు వై
మర్శికబుద్ధి వేషమతిమంతులు స్వామిని గాంచి రయ్యెడన్. 124

ఉ॥ చీకటి దీని బిడ్డ, యది చిన్నది, చంద్రునిఁ జూచె నేనియున్
దాకొను, వెల్గు రాఁ జను, నిదా! యిది సూర్యుని గాదు తప్పితన్
లోకువఁ జేయుచున్ బ్రకృతిలో నెపుడున్ విహరించు, దీని పే
రూ కొనినాను, విస్మృత, మహో! స్మృతి కందెను పక్షపాతమే.

ఆ॥వె॥ దీని భరతవాట్యదేదీప్యమానకా
కలము సర్వసభల సంస్ఫురితము
కలదు దీని కివి కార్యాలయమ్ము ల
న్నింటఁ, బక్షపాతనిలయము భువి. 126

క॥ చీకటియందును గుణమున
నాకర్షితు డౌను మనిసి, యది మృగ్యమగున్
బ్రాకంగఁ బక్షపాతము
వ్యాకీర్ణం బదియుఁ బశ్చిమావనిలోనన్. 127

ఆ॥ వె॥ అంత కాదు కాన నా స్వామి కవకాళ
మొదవె నెట్లొ యెట్లొ యొకరి వలన
నా మహాస్థ వక్త యగుటకు, సంకల్ప
బలము లందుకొని ఫలము లెవ్వి॥ 128

అను॥ మహాశిల్ప కళాకాలా
స్పృహాణీయాంతరస్థలిన్
రహించె గోష్ఠి భూలోక
బహుళోద్దండ కృష్టి యై. 129

ఆ॥ వె॥ కలదు గోష్ఠిమధ్యఁ "గార్డినల్ గిబ్బన్సు"
"కేథలికు"ల గురుడు కీర్తిభరుడు
నాతని కటువైపు స్వామి, మౌల్వి యిటు
వైపు, నితరమతవిపశ్చితులును. 130

ఆ॥ వె॥ కావిదుస్తు లళిదికళుకుపాగా దాల్చి
నిల్చియుండిన తన నేకదృష్టిఁ
జూచు పార్షదుల సోదరీ సోదరు
లార! యనుచుఁ బిలిచె సూరివరుడు. 131

ఆ॥ వె॥ అమెరికాకు నూత్న మౌ నేమొ యా పిల్పు
సభ్యసంఘము కేకిసల ధ్వనించి
మెండుకొనిరెయి రెండు నిండు నిముసములు
స్వామివాక్య మిటుల సంశ్రుతంబు. 132

శా॥ భూకంపమ్ముల నీరు గుంజుకొనియున్ బొంగెత్తి వేఁ బుంజుకో
నౌ కంథిన్ బురుడించు హైందవమతం బాయా మతా లడ్డి యా
యా కాలమ్ముల సుంత వెన్జరిగెనే నంతన్ విజృంభించెనం
డీ! కంఠీరవ ముక్త మయ్యోడి, వినుండీ దాని సిద్ధాంతమున్, 133

క॥ అని మొదలు పెట్టి వాచన
మును స్వామి, వినంగ కొంత మునుకొని కదలా
డిన సభకు నిటులు బొడుగిం
చెను రెండున్ గ్రమవికాససీమఁ బెనగొనన్. 134

గీ॥ అన్ని మతసిద్ధాంతాల కంత మేదొ
యదియ హైందవమతమున కాది, ద్వైత
శిఖరస్రుత మద్వైత విశేషగంగ
యుందె కలియంగ మతధార లెన్నొ యెన్నొ. 135

క॥ గగనచరదుపనిషత్తులు
నగాధమున నున్న విగ్రహారాధనముల్
తగిన పురాణకథలు, న
న్ని గలవు నిర్వైరములుగ నీ మతమందున్. 136

గీ॥ వేద మాద్యంతరహిత మై వెలయు జ్ఞాన
రాశి యీశ్వరవాణి యై గ్రంథ మనుచుఁ
బలుకదగనిది, విజ్ఞానభరితులార!
పారమార్థికలోకధర్మార్ణవంబు. 137

ఆ॥వె॥ ఐతిమో గురుత్వాకర్షణాది విదుల
మెట్లు భౌతికముగ బుధు లట్లె యైరి
వివిధవేళలఁ బరమార్థవిదులు, వేద
మటులు పరమార్థసూత్రాల కుటజ మయ్యె. 138

ఆ॥వె॥ అది కలదు ప్రకృతి కన్న నాదికిముందు ?
దేవునందుఁ, గూర్కె, దేవు డపుడు
కూర్కె ననగవలయుఁ, గుదుర దియ్యది కాన
ప్రకృతియగు ననాది ప్రస్ఫుటంబు. 139

చ॥ ఒకడుకురూపి దుర్బలుడు, నొక్కడుసుందరుడుంబలాఢ్యు, డిం
కొక డకలంకవర్తనుడు, క్రూరు డొకం డిటు లౌట లానువం
శికము ల టంచుఁ జెప్పుటను నిండుగ సత్యము లేదు, పూర్వజ
న్మకృతిఫలమ్ములే యని యనన్వలె జీవుడు నిత్యు డౌటచే. 140

చ॥ అనమొకో పక్షపాతిగ దురాత్ముగ సృష్టి నిటుల్ పొనర్చు వా
ని ననవలెన్, బ్రభుం బలుక నీకొన మ ట్లని మీరె చెప్పుటన్
ఘనమతులార! పూర్వజని కాదనరానిది, పుట్టినట్టిదె
ల్ల నడగుఁ బుట్టలే దయి యడంగడు జీవుడు మేనుమార్పుతో.

క॥ అనమొకొ సద్దంపతులకు
జనితుడు దుష్టుండు, దుష్టజంపతులకు స
జ్జనుడున్ జనితుడు, కావున
ననవలె జని నిజ మని గతము నాగామికమున్. 142

ఉ॥ ప్రస్తుతజన్మకర్మము లవస్థకు లోబడి కొన్ని విస్మృతి
గ్రస్తము లయ్యె, నెట్లు స్మృతిగమ్యములో గతజన్మకర్మ? లి
ట్లస్తమితేవహ లౌట తగదయ్య! మహర్షులు భారతుల్ మహా
విస్తరయోగమార్గ మగుపింపగఁ జేసిరి యిందుఁ బ్రాపుగా. 143

ఆ॥వె॥ కత్తి తోలుతిత్తి, గాలి యొక సృగాలి
నిప్పు జీడిపప్పు, నీరు నీజె
యాత్మ నెదురజాల, వట్టి యాత్మయె ప్రతి
భారతీయు డిపుడు ధీరులార! 144

క॥ కరతాళరవము స్తోత్రా
కరకోలాహలము పసరు గైకొన్న సభన్
మరియును వాకొనె నా యతి
పరిచితసౌగంధికోక్తిబంధాయతిమై. 145

గీ॥ మూర్తిపూజకులందు సద్వర్తనము మ
హామహిమ కలవారు నాకపరిచితులు
కారు మూర్తి దేవుడు కాదు వారు నం(ద్రు
మూర్తిలో దేవు డను జ్ఞానమూర్తు లగుచు. 146

గీ॥ హైందవుని పురోగతి యసమగ్రసత్య
మందునుండి సమగ్రసత్యంబునకు, న
సత్యమందునుండియుఁగాదు సత్యమునకు
ప్రకృతి మనసు పరస్పరాశ్రయము లిందు, 147

శా॥ నానాత్వమ్మున నేకతన్ దెలిసికొన్నాఁ డెప్పుడో హైందవుం
డో! నా స్నేహితులార! వాని మతవస్తోద్దారశాలోజ్జ్వలా
తౌ నంగీల్ వివిధప్రమాణులకు ధార్యంబుల్, ప్రదాతవ్యముల్
గా నివ్వే కల వింక లే వన డతం డానాడు నీనాడునున్. 148

ఉ॥ అన్ని మతమ్ములున్ సమములై తగు నీశ్వరగమ్యతన్, సరే,
యిన్నిగ నుండనేల? యొకటే సరిపోదొకో!, పోదు నైజముల్
భిన్నము లౌటచే, రుచుల భేదము లుండుటచేఁ బరిస్థితుల్
మున్నుగ నెన్నొ మాఱి తలపోఁత పరస్పర మందకుంటచే. 149

ఆ॥వె॥ భౌతికముగఁ దోడుపడుచు నధ్యాత్మవి
కాస మంగవింపఁ జేసి తుదకు
మానవత్వమునకు మహనీయముగ దివ్య
శక్తికూర్పు మతము సలుపు తీర్పు 150

ఆ॥వె॥ ఏ మతమ్మునందు నితరమతస్థులు
నందగలరు మోక్ష మనుచుఁ గలదొ
యన్యమతము నింద కర్మము కాదొ, యా
మతము నాది, ప్రేమయుతి పునాది. 151

మ॥ పరిపూర్ణం బగు నాత్మ యేదొ విధిమై బందీగ నై తాఁ గళే
బరమే యంచును పాపి నంచు నెవడో వచ్చున్ దనున్ బ్రోవ నం
చు రుదత్కంఠము గాఁగ దాని మనుచున్ శ్రుత్యంత మంతస్సు నీ
శ్వరుఁడై హస్తము లౌకికమ్ముపయి నుంపన్ అగ్గు బోధించుచున్.

ఉ॥ నిద్దపుటద్దమున్ దొరయు నెమ్మన మొప్పిన మర్త్యు డప్పుడే
యొద్దనె గాంచు నీశ్వరుఁ జిమజ్జ్వలు, నీశ్వరవాణి శ్రావ మౌ
నిద్దర మొక్కటే యనుచు, నీ వడి జీవుడు దేవు డయ్యె, నే
పెద్దయు లేదు భారతభువిన్ విగతేశ్వరదర్శనుండుగా. 153

గీ॥ ఇందె సశరీరుడై ముక్తి నందుకొను న
లౌకికానందమున నీశ్వరైకదృష్టి
యల్లె ముక్తుండు విశరీరు డగుచు జీవు
డు, మరల శరీరమే రాని ప్రమదరాశి. 154

గీ॥ ఎవడు నిష్కామముగఁ జేయు నీశ్వరార్చ
యెవడు నిష్కామముగ నొనరించు పనులు
ఫల మనుభవింపఁ జేసెడి పనియె లేక
దాన నౌ పుట్టుకయె లేని ధన్యు డతడు. 155

క॥ వ్య_క్తీకరణముగా నిపు
డు_క్తము శాస్త్రజ్ఞు చే నహో! సృష్టి, యిదే
ప్రో_క్తము మును భారతుచే
ము_క్తగళమ్ము, రహియింపమో॥ మీ ప్రజ్ఞన్. 156

క॥ ఏ పేరు పెట్టినను రో
జాపూవునకుఁ బరిమళము సడలదు కదవే!
యీ పోలిక యీశ్వరత
త్వాపాదిత మన్ని శిలల నయ్యది కలదున్. 157

ఉ॥ విగ్రహపూజ లేనియెడఁ బెద్దయుఁ గా కది యున్నఁ జిన్న గా
కుగ్రుడు శక్తి విష్ణువు యెహోవ ఖోదాయును గాడ్ సమాఖ్య లై
వాగ్రమణీయభేదముల వర్తిలు నొక్కఁడె, యస్మదాత్మసా
మగ్రియె ముఖ్య మాయన,కమర్ష ము రా ,దెటుగొల్వ హార్ష మే.

ఉ॥ కొట్టెద నీదు దేవు నిదిగో! యని హూణుడు పూన బూతులన్
దిట్టెద నీదు దేవు నని దేశ్యుడు, శిక్ష విధించు నీకు నీ
గిట్టినపై నతం డనియె, గిట్టగనే నరకానఁ ద్రోయు ని
న్బట్టుక వాదు దేవు డని పల్కె నితండును, వింటి మూర్ఖులన్.

క॥ పగలబడి నవ్వ నా సభ
తగఁ దాను న్నగుచు మరియుఁ దడవు నుపన్యా
సగురుర్ఘురికి సభయెద నర
సు గాగ స్వామి తుది నిటులు సొంపులు రాల్చెన్ 160

చ॥ పొడిచెనుతూర్పుదిక్కునవెపూర్వముచుక్కయొకండు, మందమొ
క్కెడ మహితప్రకాశము దృగింద్రియపర్వము నొచు నొక్కెడన్.
బడమరగా గమించి యది పంటవలంతిఁ బ్రదక్షిణించి యి
ప్పుడు తొలి నే దెసం బొడిచెఁ బొంపిరి నా దెసనే వెలింగెడిన్.

క॥ ముగిసినది యుపన్యాసము
సొగసిన సభ యెంతొ తెలిసి శోభాస్థాయిన్
బొగడెన్ స్తుతించెఁ గొండా
డెఁ గనద్ధైర్యమతిధుర్యు డిత డని స్వామిన్. 162

ఉ॥ హైందవ మింత మాన్య మని యన్నొనకుంటిమి సూరి!యింతకున్
ముందు,మతమ్ములందుఁ గడుపూజ్య మి దంచు నెఱింగినాము నే
డిందు, ద్విఖండసఖ్య మతికింపగ నీ భవదాగమంబు మేల్
గొందు, వచించె స్వామి కిటుగోష్ఠియుగోష్ఠి ప్రసూనవృష్టితో.

చ॥ నుతగుణ కాంత 'మార్గరెటు నోబులు'లండనునుండి వచ్చి యా
ప్రతతవచస్వితాజలమువామిని స్వామిని మెచ్చి భోగముల్
వితథము లంచు మానసనివేదిత యై సభ గాగ శిష్యతా
స్థితి మనె, హృష్ట యై యనిబిసెం టను నామె నుతించె నాతనిఁ.

ఆ॥వె॥ నిన్ను వింటి బాబు! నీ దేశముననె వ
సించి ప్రజకు సేవ సేయ నుంటి
దివ్య మైన జ్ఞానదీప్తి, నే "నైరిషు"
వ్యక్తి నని "బిసెంటు" పడతి నొడివె. 165

మ॥ గణనీయమ్ముగ మ్రోనె నెల్లెడ వివేకానందవిద్వాంసు మిం
చు నుపన్యాసకు డెందును న్నహి యటంచున్,దాదృశేజ్యాల్ జనిం
చిన జాతిన్ మతభూతి సేయగఁ బ్రతీచీ దేశముల్ క్రైస్తవ
స్థ నికన్ బుచ్చుట బుద్ధి పుచ్చునె యటంచుఁ దద్దరాపత్రికల్.

చ॥ అమరిక యయ్యె నా డమెరికావని వాని వచస్సుధాప్రపా
నమున, సదస్సమూహమున నయ్యెడ స్వామి యుపన్యసించె నా
క్రమమునఁ గొంతకాల మట రాణ వసించి, స్వవాచనాత్తవి
త్తముదితచిత్తు డై చని యథావిధి లండనునందు భాసిలెన్. 167

క॥ చాలవఱ కతడు యూరపు
నేల ముసల్మానులదియు నేల నుపన్యా
సాలఁ బరిమళింపించి ని
జాలయలసదమెరికాకుఁ జనియె, బ్రిటనుకున్. 168

క॥ అందుననుండి వివేకా
నందుడు పయనించె, వాని నవకీర్తిశ్రీ
ముందే పయనించి యిటన్
బందిళులుం బటగృహోల్కఁ బలు వేయించెన్. 169

ఉ॥ ఆ రక మైన స్వాగత మనాహిత మెన్నడునేని యేరికే
నీ, రథ మీ మదీయతను వెక్కు-మయాః కొనిపోదు మంచు త
ద్భారతభూపదంకృతినె పట్టను పగ్గము లేని యూపుతోఁ
జేరెను వాని చుట్టు ప్రజ, చేరె నతండును చెన్నపట్నమున్.170

ఉ॥ తొల్లిటి పోలికన్ దనదు ధూర్జటిజాటసమాపతద్ధునీ
తల్లజనిర్భరస్యదవదర్థరుచిధ్వనదు_క్తినిర్ఝరీ
ఝల్లరి కర్పితమ్ముగఁ బ్రజాస్యదలౌకికలౌకికద్విధా
వేల్లితసంశయావళి వివేకమహర్షి తనర్చె నయ్యెడన్. 171

ఉ॥ ఇందు నిరక్షరాస్యత హరింప దరిద్రత యంతరింప నా
వందితబుద్ధి తెల్పని యుపాయ మ టన్నది లేదు కొల్వులన్
గందపుఁగొండ మంచుమెఱుగందపుఁగొండయు రెండు మూగ లై_
నన్ దటినీవరమ్ము లిరు నాఱును నిందుఁ బ్రసిద్ధసాత్యముల్.172

క॥ అం దున్న శ్రీవివేకా
నందున్ గనుగొనగ రైలు నాపిరి మధ్యన్
గ్రందుకొని జనము పట్టా
లం దడ్డముగాఁ బరుండి, రైరి కృతార్థుల్. 173

క॥ పై నుండి యిటకు మతబో
ధానీతులు నైన వారి యార్జన పడిపో
రాణించెఁ బరమహంస
ప్రీణితు వాణి, యిటు లాడి రేల్పడివారల్. 174

క॥ శీలంబో దొడ్డది, జన
జాలంబో శూన్యవాది జాస్తి, 'కోలంబో'
కోలంబో లక్ష్మి, కచట
నా లంబోదరుని యనుజు నట్టిడు పలికెన్. 175

గీ॥ బౌద్ధమున నెల్ల మాయ, యద్వైతమందు
మాయలోన సత్యచ్ఛాయ, మణులు రెండు
బుద్ధు నౌదార్య మద్వైతమూలబోద్ధృ
బుద్ధిసౌందర్యమును జగన్మోహనములు. 176

క॥ బౌద్ధమున మహాయానము
పద్ధతి యద్వైతమునకు బాసట కాదో !
బుద్ధుం డద్వయవాదియు
సిద్ధాంతము లివ్వి రెండు స్నేహితులుసుమీ! 177

క॥ సింహళమున నటు లా యతి
సింహాలలామము వచించి చెప్పెం బురాణీ
సంహితబృంహితమతులకు
బంహిష్ఠధ్వానకల్పితభణితి నొక యెడన్. 179

చ॥ తొణికిసలాడుఁ బ్రాణముల దొంతర బొమ్మలయందునేని ప్రే
మను ప్రకటింప మానవుడు, మంజుల మైన జపానువారి భా
వన యిది నేర్చికోవలయు భారతు, లెట్టి నికృష్టజీవినిన్
గనుకనఁ బ్రేమపాత్రునిగఁ గైకొనుటల్ ధనమిచ్చి మెచ్చుటల్.

ఆ॥వె॥ ఆత్మ హైందవమ్ము నంగ మిస్లాముగాఁ
దలపవలయు భారతమున కెపుడు
నిరువురందుఁ గలుగ నిట్టి నిర్ణయ మిక
వారి వంటి వారు వసుధ లేరు. 180

చ॥ కడిమిఁ దపింపనేల? మెయి గాసిల, నొక్క నిమేష మీకు పై
ముడుపుడు మానసమ్ము నిరుపూటలఁ, జాలును తక్కుకాలమున్
గడపుడు సాటివారి కుపకార మొనర్చియు విద్య నేర్చి, నా
యెడ లిది తున్కలై యటునొకో!రమణింతును దేశసేవలో.181

సీ॥ స్వర్గంబు కా దపవర్గంబుకన్న శో
భాభవ్యపదవి నా భరతపృథివి
నా భారతం బిది .నా ప్రాణమారుతం
బిది నేను బోసినై యెలయు కాశి 182

నా భారతమువాడు నా తోడఁ బుట్టిన
తోడు, నా డోల యిందు జనమేళ
నాకు సంసేవ్యులు నా భారతోర్వీది
వ్యులు దివ్వియలు మన యుటజమందు 183

తే॥ నా భరతఖండసౌఖ్యమె నాదు సౌఖ్య
ము, భరతావని మాట నా పూలతోట
యనుచు నెలుగెత్తి చాటు నీ మనసు తీయ
భారతీయ! జగములు నీకు హార తీయ. 184

శా॥ ఓ! గౌరీ! సకలప్రపంచజననీ! యుగ్రాణమున్ జేయవే
మా గర్హ్యస్థితిఁ బౌరుషమ్మునకుఁ దున్మాదన్ గదే! శౌర్యభూ
మిః గారల్ గొను దుర్బలత్వమ్మును, తల్లీ! మానవత్వమ్ము మా
లో గీల్కొల్పవె యంచు రేఁబవలు వేడుండోయి! కాత్యాయనిన్.

తే॥ బ్రాహ్మణేతరబ్రాహ్మణద్రావిడార్య
భేదముల విస్మరించి యేకోదరులుగ
మెలగుడోః ప్రజలార! యా తెలివి లేదొ
భావిభారతాభ్యుదయసంభవము లేదు. 186

ఆ॥వె॥ చెప్పఁదగినవాడు శ్రీరామకృష్ణుడు
గురువు నాయకుండు హరునిఁ జేరె
వీడు సేవకుండు విద్యార్థి కుఱ్ఱడు
మిగిలె నిచట మిమ్ము మేలుకొలుప. 187

ఆ॥ నాదు బోధమందు మేదురంబైన గు
ణంబు రామకృష్ణనాయకునిది
దోష మున్న నాది, దొడ్డచదువరి రా
యంచలార! గుణము వెంచి మనుడు. 188

క॥ అని మరియు నీ విధంబుగ
వినిచెన్ బలు తావులన్ వివేకానందుం
డెనసి జనము విజ్ఞానము
తన ధైర్యముఁ దనదు బలముఁ దడవుకొనంగా. 189

ఉ॥ విద్దెలు పెద్ద వౌటకును బీదలు వృత్తుల నొంది సౌఖ్యముల్
కద్దుము లౌటకున్ గురుని క్రమబోధము నెక్కువౌటకున్
దద్దమితాంతరంగుడు ధనవ్యయధన్యుడు నయ్యె, స్వార్థముల్
వ ద్దనుకొన్నవారి విభవంబులు దేశసుఖంబు లేకముల్. 190

చ॥ ఎవని యనుగ్రహమ్మున జయించెనొ పశ్చిమఖండగోష్ఠిలో
నెవనికి లోకసేవయె మహీయము లక్ష్యమొ అట్టి రామకృ
ష్ణవరదు పేర సద్గురువసంతుని పేర మఠమ్ము కట్టి యా
ప్రవిమలు శిష్యుల న్నిలిపె స్వామి వసించుచుఁ గల్కటాపురిన్.

క॥ సమబుద్ధికవికలితకా
వ్యము వలె సర్వమతలక్షణాన్విత మై శి
ల్పము తగ "బేలూరు" మ
ఠ మది తనరుఁ బుటువుల యెడారిన్ బ్రప నై. 192

మ॥ అతివాదుల్ మితవాదు లుగ్రులును కార్యవ్యగ్రు లున్నారు తత్
ప్రతిచూడామణిబద్ధబుద్ధులు, "శరచ్చంద్రా"దివేత్తల్ "నివే
దిత" ము న్నౌ విదుషీమణుల్ కలరు తచ్ఛిష్యాళిలో, భారతీ
యతఁ బాశ్చాత్యుల కంటి కద్దిన వివేకానందు నెన్నన్ దగున్.

సీ॥ బ్రహ్మముదలమై నొకటి తద్రాజహంస
కాళికాగాంగతీరప్రకాశిశాంతి
కుంజమున నిల్చె జగ మెల్ల గ్రుమ్మరియుఁ, ద
దాఖ్య "అనిబిసెంటు", తమమ్ము నామె గెంటు. 194

ఆ॥వె॥ అనిబిసెంటు భారతాంబ కీశ్వరుడు పం
చిన "ప్రెజెంటు" స్వామిఁ గని తదీయ
రామకృష్ణసంస్థ యామె "దివ్యజ్ఞాన"
సంస్థ కాప్త మనుచు సంతసించె. 195

శా॥ ఓ!విద్యావతి! హైందవమ్ము మన సౌ వో! తల్లి! త్వత్కేంద్ర "హిం
దూ విద్యాలయ" మల్పకాలమున నొందున్ విశ్వవిఖ్యాతి, మా
(శ్రీ) వై లండను నుండి వచ్చితివి, నీచే సూచితం బయ్యె మా

ఆ॥వె॥ అనిబిసెంటు వెడలె, నా స్వామి వెడలెఁ గా
శ్మీరమునకు, నగరి జిమ్మ చెవుల
విందు లపితనేతృబృంద మౌ నొక సభా
భవనమందు యువకభరితమందు. 197

క॥ నయనములకును సఫలతన్
గయినేసిన యీ సమజ్యా కాగ దివాస్కర్
పయనించెను తిలకుని లే
భ యరసి పూనాకు త్యక్తకలకర్తుం డై. 198

# లోకమాన్య ఖండము

క॥ పూనాలో కలకర్తా
మాణవ్యసదస్య మైన మహాలక్ష్మి య దెం
తో నొడివె దివోస్కరు తిల
కాననమునఁ గాంతి నిండి యటునిటు దుముకన్. 1

క॥ వించెన్ మరియు దివోస్కరు
ప్రాంచత్తరుణజననిశ్చయమ్ము, తటపటా
యించెఁ దిలకు బహిరంగపు
సంచిమడత నంతరంగసాధన మునుచున్. 2

ఆ॥వె॥ ఆత్మగౌరవంబె యఖిలమహోన్నతి
కారణంబు తెగకు, సార ముడిగి
క్షేత్రమందు మొలక క్షీణించున ట్లదో
కొక్క-కాలమందుఁ గొఱత యొకట. 3

శా॥ ఏ దెట్లైన్ మన కేల యన్న మతి ప్రత్యేకప్రజాదంతురం
బై దూరంబు సమష్టిపుష్టి ఫలితస్వాతంత్ర్యభాగ్యంబు త్యా
గోదీర్ణంబు, గతాత్మగౌరవము పూర్వోచ్చావాప్తిం బూంచి న
వ్యాదిత్యప్రభ నెల్ల రొందగ సృజింపంగా వలెన్ వేకువన్. 4

ఉ॥ పిట్టలు పీచుపీచు మను వేళకు లేచి, నిజప్రయత్నముల్
నెట్టుకొనంగ బాగుపడె నెయ్యది ‘రాయగడమ్ముదుర్గ’ మ
ప్పట్టున కేగుదెంచెను శివాజిమహోత్సవశీలి నేతృస
మ్రాట్టు తిలకుబుధుండు స్వపురమ్మునుండి సుహృత్సమేతు డై.

క॥ మంగళ తూర్యమ్ములతో
రంగదుపన్యాసగేయరాజంబులతో
భంగించెఁ బ్రభుతదర్పా
రున్ గాంతము రాయగడము రుచివంగడ మై. 6

గీ॥ రచితశిల్పభూరిప్ర_స్తరచితరుచిత
రుచితసింహాసనమున సౌ రుచితముగ శి
వాజి యుండె సభాజనబహుసభాజ
నమ్ముతోఁ దొల్లి రాయగడమ్మునందు. 7

ఉ॥ ముందు శివాజి యెందు సచివుల్ పరివారము కొల్వ భూమిపై
నింద్రసభన్ సృజించె నటనే యిపుడున్ గొలువయ్యె, నెవ్వడో
యందలి తోటలోఁ జనుచు హై యని యేసెనొ రాయి తోడనే
కుందెలు వచ్చి పై దుమికెఁ, గొంకద లేడియునందు మోడిమై.

శా॥ పూవుల్ తావియు నొప్పు నిందలి లతాపుంజమ్ములన్ మెత్తనల్
లేవే యం చొక క్రొత్తవా డడుగఁ గీలిన్ రాల్చు గ్రీష్మమ్ము మే
ఘావిర్భూతియు లేని పై ఋతువు నై యత్రత్యవృతచ్ఛదం
బావం తేనియు వన్నెవాయ దని యం దౌ 'మావలా' వాకొనెన్. 9

గీ॥ ఛత్రపతికి శివాజిరాజాధిరాజ
రాజమార్తాండునకు దస్యురంధనునకు
నా బలా లనుచుఁ బలుకన్ దావలాలు
మావలాలు గుణమణుల తావళాలు. 10

క॥ అని వినబడుచుండె సభా
ఘనవేదికనుండి బాలగంగాధరు వా
చనము సుధాసేచనము గ
ణన కందని జనమునకు వినంబడె మరియున్. 11

మ॥ జనతన్ దుస్స్థితినుండి ప్రోవ జనితుల్ జాల్మున్ బలిష్ఠున్ జయిం
చిన ధర్మిష్ఠులు కీర్తికాయులు చిరంజీవుల్ గదా! రాముడున్
హనుమంతుండు శివాజి తత్సఖుడు తానాజీయు, దైవాంశ మె
చ్చును లోచ్చానది వేఱుమాట, ప్రజకై శోభించుటల్ ముఖ్యముల్

మ॥ పరపంక్తి న్నిలవేసి తెల్లమొగముం బాటింపగాఁ జేసి మీ
ధర మీదే యిక మళ్లి పోదుము మమున్ దండింపకుం డంచు నా
పరి వేడన్ విజయంబు గొన్న ప్రజ 'శంభాజీ' యు 'సూర్యాజీ'ఁ, యం
ద అభీరాజి శివాజి మిత్రులు ప్రశంసాపాత్రు లెల్లప్పుడున్. 13

శా॥ తెల్లంబోవ బిజాపురిప్రభుత యుద్రిక్తుండు నేతాజి మీ
గుల్లా మాటకు నొప్పి డించెవడునున్ ఘోరుల్ దురాక్రామకుల్
వెళ్లుండీ! యిటనుండి యంచు గదిమెన్ వీకల్ వృథాపోవునే!
ఫుల్లాస్యుండు శివాజి, యీ ప్రజను సంపూజింతు మెల్లప్పుడున్.

క॥ అన్నంతనె ప్రకటించెను
మిన్నున తన గుణంబు ప్రజల మేదురకరతా
శోన్నతిమై ఖేమ్ ఖే మను
సన్నుతిమై, వెండి యిట్లు శ్రావణ మయ్యెన్. 15

ఉ॥ ఆవులు సంఖ్య నిబ్బడిగ నై తనువుల్ పురణించి సర్వసం
జీవని పాల వాన కురిసెన్ దమ దూడలు చెంగలింప, వే
దావళిజాతిటీగె సుమితంబు, సువాసితముల్ దెసల్, శివా
జీ వరుణుండు. భారతభుమీంద్రుల కోర్కెలు పండె వానితో.16

గీ॥ అష్టదళపద్మముఁగ లక్ష్మి కాలవాల
మయ్యె శ్రీ శివాజీరాజ్య, మతని మంత్రు
లష్టదళములు, శతదళ మైనను నిల
పుండరీకగ్రంథమున కా బోలుపు రాదు. 17

క॥ పాౖదుర్భావిత పులకం
బై దొరలెను మరియుఁ దిలకవాణీఝరి, వా
వా దాడెను "శివరామమ
హాదేవపరంజపే" మహాంబుగ హృదికిన్. 18

గీ॥ పక్షవాతము మానవవ్యాధి గాగ
పక్షపాతము మానవత్వమున వ్యాధి
దేశకళకంఠమునఁ గాలపాశ మిదియ
దేహాకళకె తొల్లింటిది ద్రోహాకరము. 19

ఆ॥వె॥ అట్టి పక్షపాత మావరించిన పరి
పాలనమున కతడు బద్ధ వైరి
మతవిభేదములినమతులకుఁ జోటు లే
దాత దేలినంత యవనిమేర. 20

గీ॥ అతని హృదయము జాతీయతాభ్యుదయము
తత్సమాఖ్య శివాజీ, తదనఘు వాజి
ధర్మసమితి దూకె, నెదిరిధైర్యము యము
నాస్రవంతీప్రవాహమునందు దూకె. 21

గీ॥ వస్తువే లేద వెదకు నాస్తి యని య
నంగఁ దగినది సింహాసనంబు దక్క
శ్రీశివాజీమహారాజశేఖరునకు
కృతదమననీతికుత్సితభీకరునకు. 22

మం॥ద్వి॥ రంజకవాణి పరంజపే మరియుఁ
గృషికవృద్ధుం డొక డిట్లు భాషించె. 23

గీ॥ దళితజనులకు శాస నై మెలగవలయు
తల్లి నటులు పరస్త్రీని తలపవలయు
మద్యమును విషంబుగ నెంచి మానవలయు
ఛత్రపతిశివాజీరాజశాసనంబు. 24

మ॥ జిజియాబాయిగ భారతాంబ యయి సచ్ఛీలుం బలోద్వేలు నా
త్మజునిన్ జేసి స్వతంత్ర యైన దపు డా ధన్యాత్మచే, నట్టి రై
ప్రజ నేడున్ విలసిల్లుగాత!మని సంభాషించె బాలుం డొకం
డు, జయం బందగ నాడు ముప్పదియు నేడ్లుంబట్టెఁ గేల్గా రనెన్

శా॥ "ఏసాజీ"ని ప్రతాపనామ నరసింహాభూత "బాజీప్రభున్"
వాసిన్ గొన్న శివాజిసైన్య పతులం బల్ మంది నిట్టింద్ర వా
చాసౌభాగ్య మెలర్ప నెన్ని ప్రజకున్ జైతన్యదీపమ్ముగా
భాసించెన్ సభ యేటనేటఁ దిలకప్రస్థాపితం బా స్థలిన్. 26

చ॥ ఎవని కథన్ సిరా పరిమళించునొ దేశచరిత్ర నక్షర
స్థవిరుడు సానుగంబుగ నతండు శివాజి, సమాధి వాని దా
యవనిధరాన రాయగడ మందున నున్నది, వాని యాత్మ నా
యవని స్వతంత్ర మెప్పు డగునా! యనుచున్ దిలకింట నున్నదిన్

ఆ॥వె॥ శ్రీ "సమర్థరామదాసు" శివాజీకి
దేశికుండు, వాని దాసబోధ
మనెడి గ్రంథమునకుఁ దనికించి మెఱవడిన్
దిలకు రాట్సమాధి నిలిపె గొడుగు. 28

ఉ॥ రాయగడమ్ముకోటను మరమ్మతుసేయ గవర్న రర్థదుం
డాయె, సమజ్యదీప్తిఁ గొఱ కందఱు సాయము సేయుచుండ్రి, బొం
బాయినె కాక పంచనద వంగములన్ దిలకప్రచోదన
స్ఫాయదఖండవై భవశివాజిమహోత్సవముల్ విరాజిలెన్. 29

గీ॥ ఇట్టి పను లవశ్యము లని యెఱుకపఱచి
బడుగునుండియుఁ గొనుచుండుఁ బైసయేని
ప్రజను మేల్కొల్పు రాజకీయజయతత్త్వ
పూర్వుఁడుండు న పశ్చిమబుద్ధి తిలకు. 30

క॥ తనువో ధనమో మనమో
తన దై యిడువాడు తత్కృతంబు తనదిగాఁ
గొను దత్తము పోచయొ, స్వం
దనచాలక మైన మోకు దానెనె కాదే! 31

చ॥ తొలిఁ గల పాఱసాధికృతి ధూత మటంచుఁ గలంక పూర్వ ది
వ్యుల, కిది సత్య, మేరు ప్రథముల్ చెయిచేసికొనంగ నేరిపైఁ
దెలియదు, ఘర్షణం బొదవెఁ దెల్లము వారికి దివ్యకోటికిన్
బలముగఁ బెక్కుచోట్ల నిరువాగునకున్, తుతగాత్రు లెందఱో. 32

గీ॥ ప్రబలె నిది దేవతామహారాష్ట్రరాజ
ధానియందు, పునః పునర్దారుణంబు
నయ్యె దోషము మీది మీ దనుచు నుభయ
కక్ష్యలు పరస్పరస్పర్థఁ గాలుద్రవ్వ. 33

శా॥ అంతన్ యోగ్యులు కల్గజేసికొనఁ బ్రహ్లాదాదు లా ఘర్షణం
బంతం బయ్యెను, తత్పరిస్థితి గణేశారాధనన్ స్వీయగే
హాంతఃకృత్యము నెల్లరున్ గలిసి సేయంబూని రస్వప్న ల
క్ష్యంత శ్రీ నని వెల్వడెన్ గతిపయవ్యాఖ్యాతృసంభాషణల్. 34

క॥ దితిజాదితిజులె యనవలె
దితిజాదితిజమ్ము కాదు, తెంపున నమరా
వతిబాగు కదితిజన్ములు
జతన మలుప మగును వారి జాడయె వేఱై. 35

క॥ వా రేలిననాడుం బలె
స్వారాజ్యముఃబులుపులేరు, సర్వాధికృతుల్
వేఱె కావలె నందురు
పోరామిన్ వీరితోడఁ బొందున్ గలరై. 36

క॥ దైతేయు లాదితేయులు
భ్రాతృసమాజంబు, దానవకులం బది వే
ఱా తెగ దైతేయులతోఁ
బ్రీతి నెఱపి యాదితేయవితతిన్ రాచున్. 37

క॥ అసురులు ననబడు దనుజులు
దిసంతుమైఁ గన్నుమిన్ను తెలియర, తద్ఘో
రసమాజవరు గజాసురుఁ
గసిమసగె గణేశు డమరగణపూజితు డై. 38

ఉ॥ త్రెళ్లెడి పూర్వ మా గజుడు దేవునిఁ గోర వరంబు దేవుడున్
వల్లె యటంచు నా వరుని భాషను,భాషను కాదు వేషమున్
దల్లపనమ్మునే యనుడు తాల్చెను,పో దది వాడు పోయినన్
నల్లలితై దదీయకథ జ్ఞాతము భారతదర్శనమ్మునన్. 39

గీ॥ నాటినుండియు గజవదనార్చనమ్ము
సాంఘికమ్ముగ దివ్యలు జరిపి రనుచుఁ
జెక్కు రనిరి, జరుప మొదల్ పెట్టినాడు
దీని బాలగంగాధరతిలకు తొల్లి. 40

క॥ ఆ యదనున్ దుర్భితము
పాయద యనిపించెఁ, దిలకు పరివారముచే
మోయించెఁ గార్యభరము, స
హాయులతో మంతనమ్ము లాడి వచించెన్. 41

ఉ॥ ద్రోహము చేసె నర్థములు,దుస్థితి యింతటఁ బోదు,శస్త్రహిం
సావహకేళి యత్నము, నవాహ్నిక మై గణనాయకోత్సవ
శ్రీ హితులారః సాగవలె సిగ్గుల కేమి సమన్ సమన్, సమా
రోహము తెల్పి పైఁ బ్రజకుఁ బ్రోడల యెల్లలకల్మిఁ గావలెన్. 42

ఆ॥వె॥ ఆత డనిన దల్లె, యదియు జరుగుచున్న
దల్లె, యెంత యార్తి యావటిలియు
గణవిభూత్సవమున గంద్ర పూనా, తేజ
మేక మే, యటిక మెన్నొ చోట్ల. 43

చ॥ ఎవ డొనరించెనోకద! గణేశుని విగ్రహ మా పురీమహో
త్సవమున, శిల్పపూర్తి యగుదాకఁ దదీయపురస్థ దేమొ! వి
ఘ్నవిభుడు,ప్రాణమున్నదియ కాని జడోపమ మంద్రుకొందఱున్
నవ మిది, పూర్ణ వేళఁ దనశక్తిని చూపు న టంద్రు కొందఱున్.

క॥ కరపత్రముల సభాలం
కరణమ్ములఁ బై డిరంగు కాగిత మధికం
బిరవొందె, నటులె కరిముఖ
చరణమ్ములయందుఁ బూలు సరములయందున్. 45

గీ॥ బాలభటయువ సేవక పటలచిహ్న
పటసుమమ్ములు పాటలభాసురమ్ము
లుదిత మై ప్రాకు సూర్యబింబోజ్జ్వలతకు
నాడు గణపతిగోష్ఠి యామ్రేడితంబు. 46

క॥ శివలీలలు హరిలీలలు
భవానిలీలలును దనుజభంగశ్రీ లై
నవరొంది చిత్రపటముల
హావణించెను నాల్గువైపులందు సమజ్యన్. 47

క॥ రక్తవిభాలంకరణము
యుక్త మనుచు వత్సలార్హ్య లోకరిద్ధ రనన్
సక్తుడు కాడు తిలకు, స
మ్యక్తూర్యధ్వనికి రక్త మావేగి సిరన్. 48

క॥ తద్దింతా తద్దింతా
తద్దింధిమిధిమి యటంచుఁ దాండవవేళన్
బుద్ధి కెడె మృదంగంబులు
తద్ధితగానమున సభమొదల్ ధ్వనితము లై. 49

గీ॥ సత్యవంతు ప్రాణముతీయు జముడు తెల్ల
వాడు, వాని దున్నయుఁ గూడ వల్లనున్న
పట్టుదలకల్మి సావిత్రి పడసెఁ బూ॥
వైభవము నని హరికథాప్రకటితంబు. 50

గీ॥ అది యువన్యాసనమితి, వే లైరి ప్రజలు
నాటి సభమేటి బాలగంగాధరుండు
పలికెఁ బ్రజకు శుభోదయం బగునుగాత,
వక్త లిందు మీ రసనాగ్రవర్తు లండి! 51

గీ॥ చెడుగుచెంప ఛడే ల్మను నుడిఁ గలడు "ఖ
డేల్కరు", కటూ! పొకా ల్మను "కాల్" కలడు వ
రంజపే, భారతాంబ కారాత్రికములు
పత్రికలు వీరివి, సువిద్యపద్య "వైద్య." 52

మధ్యా॥ వాచనాస్మన్మనఃపోషి "వాసుదేవగణేశజోషి"
ప్రాచీనకథల సమృద్ధి "బాబురావుసహస్రబుద్ధి"
నైచికిదుగ్ధరుచిభరనవగీర్ధనుండు "పట్వర్ధ"
నాచారమందు నేటు చరితార్థుడు "సరదారునాటు." 53

క॥ "సేనాపతి బాపట్" మతి
పూనును "ప"ట్టాతుభావము ననర్థముపై
తానే భట్టాత్వర్థం
బేనాడున్ దేశభక్తి కి వి.యం.భట్, 54

క॥ అరుదెంచెను నాసికనుం
డి రయమ్మున వహ్ని నూర్చు నీ శిశుహార్య
తరుచి 'వినాయకదామో
దరసావర్కరు' కవియు స్వధర్మముఁ దెలుపున్, 55

గీ॥ ప్రగతిభావవితర్ది 'కపర్ది' యీ స
దంబు పృథుకాలభోజ్యముదంబు, ప్రజలు!
నిలుడు తుదిదాక, వక్తలు వడివడి నొడు
వన్ గృతార్థుల మగుదుము స్వామి నెన్ని. 56

గీ॥ అట్లు పరిచయోక్తు లాడి హుంకారమా
త్రాపహృతగజాసురపరిపాల
నా! తనర్చు మమ్ము నాలన బాలన
నని గణేశు మ్రొక్కి నినిచె తిలకు. 57

గీ॥ మూషికము బొజ్జవేల్పును మోయు టేమి!
యనుచు హితులార! మీరు న న్నడుగవచ్చు
భరతఖండోద్ధరణకార్యభరణమునకు
నలతియును బలవంతు డై నట్లె యిదియు. 58

గీ॥ సమవిభక్తము దోపని స్వామి తనువు
భారతీయసంఘముగుర్తు, సార మిందు
రాతనతఁ బారద్రోలు సంరంభమున నె
టింగి యౌరా! యనన్వలె నెల్లజనము. 59

ఉ॥ అంతరముల్ గతించి ప్రజ లైక్యముతో భరతోర్వి నోమ దీ
శుంతుగాత! శీతమును గ్రీష్మము గాని తెలుంగుఁ బూని, శి
శుంతురుగాత! క్రూరమును శీఘ్రము సర్కసువ్యాఘ్రముం బలెన్
వింతురుగాత! జాతిప్రథ విశ్వమువీణియ పల్కరింపగా. 60

గీ॥ కూలిసేసికొనెడివారు నేలదున్ని
కొనెడివారు బేరముచేసికొనెడివారు
నెల్లరము మిట్టు కెక్కింత మేకధాటి
పల్లమున నున్న భారతాంబారథంబు. 61

క॥ అని వెండియుఁ గరతాళ
ధ్వనుల నడుమఁ జెప్పె తిలకు ప్రజలార! భవం
బును భక్తి తీర్చును, భయం
బు నైకమత్యప్రయుక్తి పోకార్చునయా! 62

క॥ ఒక తండ్రి తనదు కొడుకుల
నొకొక్క రీ బరువు మోయుడో! యన నయ్యా
యకరుల మనిరి, కలసి యన
సకరుల మని, రైకమత్యజయ మి ట్లుండున్. 63

క॥ రాణా ప్రతాపసింహుడు
మానధనుడు, విజయయుక్తి మనిన శివాజీ
మా నేత లని యెలుంగిడి
మానితులారా! తదీయమార్గులు కండి! 64

చ॥ జననియు జన్మభూమియును స్వర్గముకన్నను గొప్ప, హైమ మై
నను పరభూమి తుచ్ఛ యనినట్టిది శ్లోక మొకండు చాలు రా
ముని రచనామునిన్ భరతభూజనపూజన మందు నగ్రభా
జనుల నొనర్ప, మీ వడి ప్రజల్! తగుగాక! తదీయటీక రై, 65

గీ॥ నిదురబుచ్చు తమోగుణమ్ముం దెగజూచి
మేలుకొల్పియుం గర్మను కిలుకొల్పం
దగని సత్వగుణమ్మును దాచి చదువు
డోయి! భారతకథను రామాయణమును. 66

ఉ॥ రాముని పూజసేయుదుము, రాముని జీవన మాత్మజీవనం
బై మను కోర్కెలేము, ఖరహంత యతండు, ఖరత్వ సేవలోం
గామన లస్మదీయములు, కాంతు స్వదేశము పై ని వాని దై
యీ మన బుద్ధి యవ్యమున, ని ట్లయి సాయమురాడు విష్ణువున్

మధ్యా॥ దేవుడు మనిసి యై వచ్చు దేనికొఱకు? దౌష్ట్యవిషధ
రావళిం బట్టి దంష్ట్రిలు నిరవశేషముగం బెకలించు
పావనక్రియకొఱకు మన పౌరుషము పిలుపు నంది,
పూవె పూయదు పౌరుషంబు,పొదలు నెటులు దైవఫలంబు?

మధ్యా॥ తతుక కాద్రవేయుండు తతకిసలకునుమ మైన
వృతురాజమ్మును కాటువేసి కాలిచె, నట్టిదాని
పతి! చూడర! యని వానిం బలికి వందెమువేసి చేసె
నతయపూర్వశోభా సమాఢ్యమునుగ మన జాతి. 69

ఉ॥ దం డొక యగ్నిపర్వతము, దాని దిక్రౌర్యము "లావ"గా "నలె
గ్జాండరు" మూల మై భరతఖండము భ్రష్టమొ యన్న నాడు దో
ర్దండము నడ్డుకట్టి యిడి తత్సమగౌరవ మంది పీఠమం
దుండిన జాతి యిద్ది, పురుషోత్తము లెందఱో యేతదాత్మజుల్.

క॥ "సెల్యూకస్" మన జాతికి
సాల్యూట్ చేసి వెను దిరిగి చనె, జాణక్యుల్
కల్యాణచంద్రగుప్తులు
లౌల్యరహితపరమశీలలక్షణజన్యుల్ 71

చ॥ జతనమునందు విఘ్నము విషంబు, నశింపగఁ జేసి దాని నా
గతముల హక్కులన్ గొనుచు కౌస్తుభముఖ్యములన్ సుధన్ స్వతం
త్రతగుఱుతైనదానిఁ గొనుదాక సముద్రమథంబు సాగె, నీ
కత మన దైన తొట్టతొలికావ్యములోనిది, వింటిరా! ప్రజల్! 72

క॥ అమృతము చిన్నది స్వాతం
త్ర్యము పెద్దది, యిట్లుభారతమున ధ్వనించెన్
క్రమిత మొక యడుగు ముందున
కు, మాతృదాస్యంబు బాపుకొను గరుడకథన్. 73

ద్వి॥ ప్రాచ్యసాహిత్యము స్వాతంత్ర్యభావ
రుచ్యపేత మని వేరుఁ బలుకరాదు. 74

సీ॥ ప్రాణమ్ము లర్పించి ప్రజను గెల్పించి త
దీయహార్దిక మనిన దధీచిగాథ
పదితీర్ల తలచూపు పరమక్రౌర్య మడప
జనము నడపిన దాశరథిగాథ
ధర్మనిర్వహణమందలి పట్టుదలతోడ
శ్రమము లోర్చిన హరిశ్చంద్రు గాథ
యుక్తికి పైయుక్తి యొప్ప సజ్జనత జ
యింప సారథి యైన కృష్ణు గాథ

ఆ॥వె॥ ఇటులె కలదు మనకు నితిహాసరత్నాల
రాశి కడిమి కన్న రసము పోసి
దీని మఱచి బుద్ధి దేనినో కలచిన
న్నెండ్లు సఖ్యులార! యెదుగలేదు. 75

చ॥ అని యమృతప్రపూరముగ నాతని వాచనకుల్య సాగి తే
ట నొసగె భారతీయుల యెడందపొలమ్మున నాత్మగౌరవం
బను వరికిన్, తిలగ్బుధుని పౌరుష మతుర మౌను వాని ప్రా
త నెటులో చేత నల్లె, లపితం బది ముద్రిత మాస్థయాత్మలో. 76

మ॥ ప్రతికుగ్రామకుటీర మందెను మహారాష్ట్రమ్ములో రొట్టైన
ట్లు తిలగ్బ్రధితరాజకీయము, నతం డుక్తి ప్రతుం డై యొకొ
క్కతటిన్ దేదియుమాటినన్ దెలియ, డుగ్రాళ్మమ్మునన్ గొట్టు మా
రుతికిన్ తాతగ వానిపత్రిక విమార్గున్, గేసరిఖ్యాత మై. 77

క॥ వాచకు లందఱును తిలకు
వాచించిన త్రోవ నొడివి దైవ్యమాతురసా
మీచిన్ బ్రజ వినగా న
ప్రాచీనము గాగఁ జదివిఁ రయ్యారె! యనన్. 78

సీ॥ కడు చిన్న దైనఁ నే యొడలు నీశ్వరు మోయు
ననుటకు నెలుక వాహనము సాక్షి
ఈశ్వరుడు భరించు నెల్ల సృష్టి నని వ
క్కాణింపగాఁ దొడ్డకడుపు సాక్షి
తెలివియు వాడి యొక్కటిఁ గూడిననె జాతి
నలు వని యేకదంతమ్ము సాక్షి
నరునికన్నను మిన్న కరి విజ్ఞత న టంచు
మూదలించుటకు నై ముఖము సాక్షి

గీ॥ సత్వమున ముక్తి వెన్నెలచాయ సాక్షి
విశ్వకల్యాణకృతులు నిర్విఘ్నములుగఁ
బూచి పరిమళించుటకు నీ పూజ సాక్షి
యన్నిటను సాక్షి నీవె బ్రహ్మము గణేశ! 79

క॥ అని వైద్యా చదువగఁ దో
డనె నాటూ పిల్లి కూతల వినేతలకున్
గణనాయక! నీ ఘీంకృతిఁ
దవరింపగదే! సదాముదాయకుల మనెన్. 80

క॥ కుంభీంద్ర వదన! తావక
కుంభధ్వింకృతి కెడంద నొట్టలుపడగా
స్తంభించుగాత! బాహాల వ
హాంభావపు దుష్టశక్తి కనియె ఖడేల్కర్. 81

ఉ॥ సారము దేశదూరము గజానన! స్వార్థము రాజ్య మేల దు
ర్వారము దుష్టవారము, భవద్దయ రావలెగాని యిట్టి బో
ధారులు వేషధారు లనుదారులు నూరును పేరు లేనటుల్
బోరె! సహస్రబుద్ధి యిటులుం బఠియించె వినాయకస్తుతిన్. 82

క॥ బరదా తమ్ములమునఁ బలె
సరదా కలదు మదిఁ, బడెను శక్తికి విధిచేఁ
బరదా వరదా! వెలుపవె
వఱద యనగ దయ నటంచు భాట్టము వినిచెన్. 83

క॥ దినుసులు ఖాళీ గృహముల
మనసులు "జాలీ" త్వదంఘ్రిమహితాసక్తిన్
గణనాథా! పద్యమ్ములు
తినవే! హృదయాగ్ని వండితి మనెన్ జోషి. 84

ఆ॥వె॥ తిలలు తండులములు కలియ నౌ న్యాయమ్ము
ప్రాతవడియె దానిఁ బలుకరాదు
కలలు కండరములు కలియ నౌ న్యాయము
న్నిలుపు గణపతీ! యనెన్ గపర్ది. 85

గీ॥ ప్రాప్తశక్తిస్వరాజ్యాల్ విరాజు లఖిల
భరతవర్ష నూతనహర్ష వర్ధనులును
త్వత్కరుణ నౌదురున్ గావుత! వ్రజ గజాసు
రేట్ప్రమథనా! య టంచు బాప ట్ప్రతించె. 86

క॥ తెఱచినది ప్లేగు నోరున్
ధర తిరుగుటఁ జూచెఁ బేద తా కనులారన్
దొరతనమా! యిది నీయది
యరశే! శశివర్ణ! మంచి దనెఁ బట్వర్ధన్. 87

ఆ॥వె॥ ఎంత జటిల మైన నేమి సందేహము
నుత్తరింప నిడుము కత్తి బుద్ధి
పొట్టివేల్పు తలపఁ బుట్టెడు బుద్ధులు
పెచ్చరిలు పరంజపే పఠించె. 88

క॥ మరణము లేదు స్వధర్మా
చరణంబున, మరణ మనగ సాధ్వసమె యగున్
బరధర్మంబునఁ గల దది
పరతంత్రత దాని మాఱుపదము గణేశా! 89

శా॥ సాహస్రమ్ములు నౌకలన్ గలవు బస్తాల్, స్వర్ణపూర్ణమ్ములై
మా హస్తాఖినయార్పితమ్ము లవి యంభోధిన్ మహాభంగమున్
గా హస్తాగ్రము సాచి లాగికొని దీనగ్రామమున్ బ్రోవవే
హో హేరంబ! ప్రజావిరుద్ధకృతిగిర్వ్యజ్జృంభశంబాకృతీ! 90

గీ॥ కాలమును వణకించెడి కడిమి గలది
యీ మహారాష్ట్రమే యుద్ధరింపగలదు
భారతమును, ప్రతిన యిది, వాడి నడుప
వే! ప్రజన్ గణనాయకా! విబుధతిలక! 91

క॥ అని సావర్కరు పఠిం
ప నూహినిన్ మోహినీసుమామోదంబుల్
తన గమ్య మేతదృద్ధిన్
గను దేశం బను రొదలు సకరతాళంబుల్, 92

గీ॥ తిలకు వక్తృప్రజల నెంచి పలికె ధన్య
వాదములు, సభ ముగిసెను, వేదపఠన
మధుర మగుచు నీరాజనమంత్రపుష్ప
సహితముగ విఘ్నేశ్వరార్చనయు ముగిసె. 93

చ॥ తుది దినమందు విఘ్నవిభుఁ దోయమునం దిడ వీడువీడునున్
గదలిన యట్లు వత్తురు జనమ్ములు, మేఱవణిన్ విభున్ విభా
స్పద శయనమ్ములన్ గనిన చతువుకే భజనమ్ములందు వా
యిదమును పాట విన్న చెవికే చరితార్థత భారతమ్మునన్. 94

ఆ॥ వె॥ ఎపుడు నాశ్రితాళివృతి పరిపాటి నా
యకులకు సరసులకు నఘ పద్మ
ము ముకుళించు రాత్రి సమయమ్మునన్ దక్క
పెద్దనాయకునకు పెద్దగుంపు. 95

ఉ॥ ఆడిన మాట తప్పడు, సహాయము వీ లయినంత సేయు, నె
వ్వా డరుదెంచినన్ స్మితమువట్టుతరంగయై పల్కు, శాంతికిఁ
మేడ, సమష్టిమేలు ప్రథమేద్యము,ొవ్యష్టికి మేల్ ద్వితీయమున్
వాడు సమర్థు డౌనెడల నాయకు డౌట ప్రజాకృతార్థతల్. 96

క॥ గుమిగూడుచుండు నెపుడు జ
నము, కాల మతిక్రమించి నడచెడు గడియా
రము సరిచేసికొను గమని
క మృగ్య మగుచుండు తిలకు కార్యములందున్. 97

ఆ॥ వె॥ ఎక్కడున్నను దిల కక్కడే యొక చిన్న
కొలువు, గృహముఁగూర్చి తెలుప నేల
పడకకుర్చి నుండి ప్రక్కయాను డు తట్టి
వ్యూహములను పిలుచుచుండు నతడు. 98

ఉ॥ నె త్తెలిచూపుతో మనసు నిండు వెలార్చెడి బ్రహ్మవర్చసం
బె త్తిన రూపుతోఁ బృథివి నిండిన ధర్మములందు సంశయం
బె త్తెల గైనఁ దీల్చుటకుఁ బెట్టిన లక్షణమైన నాసతో
మె త్తని బాసతో నొక సమీద్యుడు వచ్చె నమోవచస్కుడై. 99

క॥ ఎవ డీతడు ? హైందవశా
ప్రవిలసనముతోడ నీ తఫా పుట్టిన నే
సవు రౌనో యన్న బుద్ధిన్
దవిలెనో ! బుద్ధుండు, తిలకు తార్కికుడు కదా ! 100

సీ॥ అనెను తిలకు శుభంబు కూర్చొనుము బాబు !
సంజ్ఞ ? మోహనదాస్ కరంచందుగాంధి
యూరు ? పోరుబందరు, వృత్తి ? సారచరిత !
న్యాయవాదిని లండనునందు చదివి 101

ఉ॥ నే నఖిరయోగమందుఁ జని నిల్చితి నచ్చటె దక్షిణాఫ్రికా
లో, నట లక్షమందియు విలుప్తశరణ్యులు భారతీయు ల
య్యా !, నోడువంగరాని వెత లన్ట్రిము లైనవి వారి, కందునన్
ప్రాణవిభుత్వమే, యవి మదుక్తము లౌ వివరంబుగా సభన్.

క॥ అది మీ వల్ల నగు ననుచు
విదితం బొనరింప గాంధి భేషుగ నగు నీ
యదహారకార్యనిరతిలో
యుదాహారణ మగును నాదు నుల్లము సుగుడీ. 103

మధ్యా॥ నా కొక పత్రిక కలదు, నా పని యిట్టి వార్తలను
చేకొని పగటులే కదవె! చేయ నౌ నెల్ల చేసెదను
శ్రీకరు డైన గోపాలకృష్ణ గోఖ్లే రాని యెడల
నీ కడకకు సభ చేయ నేరదు న్యాయంబు సఖుడ ! 104

ఆ॥ నరుడు భరతర్షభుడు గీత నరయు మంటి
పశుబల మని నన్ కేసరిపత్రికేశు
నన్న గోఖ్లే, నవు డతండు నాదు వాకి
లికి నెదురువాకిలిగ సభ యొకటి పెట్టె. 106

గీ॥ ఇతడు సభ కధిపతి యైన నతడు గాడు
రామకృష్ణభండార్కరునాము డుభయ
మిత్రు డున్నాడు పండితమిత్రు డిందు
వత్తు మెల్లరము తదాధిపత్యసభకు. 107

చ॥ అన విని గోఖలేన్ గలసి యంతఁ బ్రసాదముకంధి గాంధి త్రా
వె నతని వత్సలత్వ మను విష్ణుపదీజలమున్, విడెన్ బురా
జనిగతబంధవిస్మృతుల, ఛాత్రుని దేశికుడో! పరీక్షచే
సె నితని వాక్యవంక్తిని, వచించె నతం డజహాత్సహాయతన్.108

క॥ గ్రంథము విని తప్పనిసరి
బంధువు నైతి నని పల్కె భండార్కరుడున్
బంధముతో మోక్షము సం
బంధమె తన రాజకీయ పరిచయ మనుచున్. 109

గీ॥ తిలకుసార్వజనికసభాతలము విడచి
గోఖలేడక్కనుసభాంగణైఖనమును
వీడి యిరుతెగ లన్యత్ర కూడిన సభ
హార్దమంజూష భండార్కరాద్యభాష. 110

మ॥ తన ధర్మంబు ఖనిత్ర మై ప్రభుతచేతన్ బుట్టి గీడ్పాటు మి
ట్టిన చట్టం బను చెట్టుఁ గొట్టుటకు ధట్టీ గట్టి క్రొన్నాఁగ తె
ట్లనువౌనో కను భారతీయజనభాగ్యక్షేత్రసంకర్షణా
ద్యనితాంతోద్యము డై న గాంధి యిటు మాటాడెన్ సుమగ్రంధిగా

ఆ॥వె॥ అయ్యలార! దక్షిణాఫ్రికాఖండము
కనకహీరభూరిఖనిప్రచండ
ము, పరిపాలకంబు కృప ఘనీభూత మై
చాల కలది బ్రిటిషుజాలకంబు. 112

గీ॥ భారతీయులు లక్షపైఁబడిన జనము
కల రచట, పెక్కురు పొలముగనుల పనుల
కాగతులు, వారి యొగ్రిమెం టైదు నేండ్లు
నైదు నేండ్లు వారికి సొంతయాస్తి తగదు, 113

క॥ ఒక్కొకడు కొట్టు నెత్తురు
గ్రక్కఁగ నీ యయిదు నేండ్ల కంట్రాక్టునఁ దా
నిక్కడి వానికి స్వామిగ
నక్కడి యూరోపియన్, మదవగత మిదియున్. 114

ఆ॥వె॥ కొంద ఱాత్మహత్యకున్ దెగి రిండియ
న్లు, ఖలుల కడ కొలువులుంటకన్న
మృతియ మేలుగా వచించియునున్ కొంద
ఱకును తప్ప దయ్యెఁ బ్రభుతకొలువు. 115

క॥ దుష్టస్వాములను విడచి
శిష్టస్వాములనుఁ జేరఁ జేసెడి వినతుల్
కష్టంబున ఫలియించు న
దృష్టయుతుల కెవరికో, వెయింట నొకనికో! 116

క॥ ఈ దిక్కు లేని భారత
యూథపు యజమాను లైన హూణుల కెల్లన్
బాధింపరా దెపుడు నని
బోధింపవలయు మనము ప్రభుత్వముద్వారా. 117

శా॥ ఈ ధైర్యం దేం డ్లయిపోయినట్టు లెపుడేని పత్రమున్ దద్గతుం
డాయుష్కాలము చూపుచుండవలె, కాదా! బందెం జేరన్వలెన్
వాయాడన్ వెనుకాడు, నొక్క సతి తాం బత్రమ్మునున్ జూపలే
దై యిల్ చేర్పంబడెన్ బవుం డ్లిరువ దై తన్మానసష్టాప్తమున్.118

క॥ ఘోరము ఘోరము!, పాలక
వారమునకు బోధములను పంపగవలె లే
ఖారూపమున సరే తం
త్రీరూపముగ నన సభ కథించె నత డిటుల్. 119

గీ॥ ఏండ్లు నైదు నై పోవగ నిండ్లు కలిగి
వారి బ్రతుకులు వారలు బ్రతుకుచుందు
రెట్లొ, వారిం గూలీ లని హిందువులను
కాఫిరులు నని పిలుతు రాంగ్లజన మచట. 120

గీ॥ ఇట్టు లై తలపాగ ధరింపరాదు
భారతులు, కూరుచొవరాదు ప్రభుతజాతి
ప్రక్క, నాంగ్లభోజనశాల త్రొక్కరాదు
స్నానములు కావు బాహిరస్నానశాల. 121

క॥ యూరేషియనులు తుఱకలు
పారసులున్ గొంత మేలు వారలు కూలీ
కై రా రగుటన్, సోదరు
లారా! యీ యక్రమమ్ము లాపరె! మీరున్. 122

క॥ సామాన్యముగాం దొమ్మిది
పై మెలగన్రాదు రాజపథమున భరత
శ్రీమాతృపుత్రు డచ్చట
నేమే నధికారపత్ర మిందున వలయున్. 123

ఆ॥వె॥ భారతీయు వీధిఁ బరికించి యూరకే
తిట్టు, నుమిసి నెట్టుఁ దెల్లవాడు
ఇట్టివానిఁ బిలువ నర్హ మౌ పదముకై
విదుల డిక్షనరీలు వెదకినారు.

ఉ॥ ఇంతకు ఘోరముల్ జరిగె నెన్నియొ, యొంటను రెంట రక్షణా
త్యంతభయద్భట ప్రతతి శాస్త్రివరుల్ మొరపెట్టుకొంగ దు
ష్ప్రాక్కాంతి సిసీః యనన్ దలప రై యిహిహీ! యనినారు శాంతినే
నొంతుము ద్రోహి వాజ్ఞ పయినుండియుఁ దెమ్మనినారు తద్భటుల్

గీ॥ సిగ్గు సి గ్గని కేకలు చెలగు సభకు
మరియు నవె గాంధి రెండవ తరగతిన్ ప్ర
యాణ మో వాడు దిగవలె, నట్లుకాదొ
స్వానుభవ మిదియును తలపాగ వలెనె 126

ఉ॥ ఈ విధ మైన సంగతుల నెన్నిటినో ప్రకటించెఁ బత్రికల్
వావిరి, వానిఁ జూచియును వాడుక మావర, లండనేగినా
నో! వరవర్ణులార! యట నున్న పరిధానికి దాదభాయి తో
డై వివరించినాను గుణులార! ప్రయాణముఖర్చు దండుగై.

క॥ 'ఛాంబర్ లేను'కు దృష్టాం
తాంబరములు తాను చూపినన్ బెలికలే
వెంబరవిత్తునె యయితిని
సంబర మే మిత్తు నాదు జనమున కిటు లై. 128

క॥ హాయికోర్టుజడ్జి యయినన్
బయినసతో భారతుండు భ్రమ కూర్పనిచో
పయనించు నాఫ్రికానుం
డి యు రోముఖశిరుడు నక్రుని చితాతుడు నై. 129

ఆ॥ వె॥ కోటు తొడుగు శక్తి లోటు గావచ్చుఁబో!
వోటు నిడెడు హక్కు నోటుపడునె!
యిట్టివాని నెదుర నేము కాంగ్రెసును స్థా
పించినార మందు నిందుఁ నటులు. 130

శా॥ ఎపుడును లేద వోటును స్పృహించు ప్రభుత్వము భారతమ్మునం
దిపుడును లేద, యెల్లరకు నింతియ, ఛాంబరలేను చెప్పె, నే
నపగత మెట్లు వోటిడెదు హక్కిట మాకని యన్న నందు లే
నపు డది యుందు నేల యనె నాంగ్లవరుం డొక డుక్తిచాతురిన్.

ఆ॥ వె॥ వర్తకమునకు బలె వసియించుటకుఁ బన్న
నేటివఱకు విన్న మాట కాద
యాఫ్రికాని పుట్టె నగచాట్లు నిట్టివి
భారతీయు డగుచె పాప మయ్యొ. 182

క॥ పని జరుగుచున్నయది పౌం
డ్లును మూడైన తలపన్ను లుప్త మగుటకై
వినతి యిపు డిందియాపా
లనమున, కిందును సహాయులరుసుడి! మీరే. 183

క॥ బెదరక యెదురక ప్రభుతన్
సదమలప్రేమన్ వశమ్ము సలుపుకొనఁ బ్రజా
భ్యుదయమ్ముకొఱకుఁ గడగితి
నిది యెల్లరి సానుభూతికృతి ఘనులారా! 184

క॥ వెండియు గాంధి శ్రుతులకుఁ
మండనముగఁ గొంత పలికి మౌనము దాల్చెన్
భండార్కరు గోఖ్లే తిల
కుం డయ్యెక సేతు మని రకుంఠితము కృపిన్. 185

మధ్యా॥ చాపేకరాన్వవాయు లగు సహాజన్ములు ముగురు తత్ప
భావరిషద్భ్యులుగఁ దుదివఱకుండి తిలకాదృతు లయి
శాపించుకొనుచు నాంగ్లేయశాసనమ్ములను కెంజాయ
ప్రాపించిన కమలతోడ స్వభవనోన్ముఖు లయివారు. 186

ఆ॥వె॥ అచటినుండి గాంధి యరిగె మద్రాసు, పూ
నాపురిన్ దదుక్తి పేపరుల న
లభ్యముల నొనర్చె లవకాలమున, బహు
కాలముద్రితములు చాల యెడల. 187

గీ॥ తీసికొనిన యప్పులను భూదేవికిఁ బ్రీతి
హాయనంబు నొసఁగుచు హాయి గూర్చు
తేజసాంరాశి యా యేట తిరిగి యుడక
దొడ్డవాడు నొకప్పుడు చెడ్డవాడు. 138

క॥ ఉడకుండులెఁ కా దవనిని
కడు బాధించెఁ దపనుండు, ఖరభాసమునన్
మిడిసిపడుచున్న వ్యాధులఁ
గడఁద్రోయగలేక జనము కళవళపడగా 139

క॥ పూనానగరి మహామా
రీనామవ్యాధి ప్లేగు రేగెఁ, బ్రభుత య
దాని నిరోధించుటకై
చేనయినంతయును మిగులఁ జేయుచునుండెన్. 140

క॥ ఆ రాష్ట్రరాజధానియు
క్రూరం బీ తెవులు సోకి గోడ్వడె సస్య
శ్రీరమ్యక్షేత్రము క్రిమి
వారంబునఁ బోలె మఱికి బహువిధ మగుటన్. 141

శా॥ ఆ కష్టావధి రోగపీడితుల దాహగ్రస్తులఁ గుండె నీ
రై కారుణ్యరసం బొసంగి మనిపెఁ బ్రఖ్యాత 'రుస్తుంబికా
జీకామా' ధనవర్యు భార్య, పతినిన్ జేకోక 'మీరా' సదా
వైకుంఠున్ గొలిచెన్, ప్రజన్ గొలిచె నీ పద్మాక్షి నిష్కామయై.

గీ॥ బ్రిటిషుపరిపాలనం బన్న పేరు విన్న
పడగ విప్పిన గోధుమపన్నె త్రాచు
భారతీయ స్వతంత్రతాభరితదివ్య
కలశమును చుట్టుకొన్న దా గరితమేను. 143

ఆ॥వె॥ ప్రజల సేవలోన వ్యాధి పొందియుఁ జంద్ర
రేఖ వోలె నామె రెక్కొనియెను
పలువు రిటులె రుగ్ణపరిచర్యఁ జేసిరి
సగముమందు సదుపచారమందు. 144

శా॥ బొంబాయిన్ గ్రమియించి యీ రుజ యిటుల్
పూర్ణోపచారంబు వై
ద్యం బై తగ్గెను, వైద్యశాలలును వైద్యం బిందు నంతంతమా
త్రం బై తగ్గద, రాండ్నమాఖ్యు డొక దక్షుండుగాఁ బ్లేగునా
శం బాళించి ప్రభుత్వ మేర్పరచె సంస్థన్, ముఖ్యు"డై రెస్టు"నున్.

క॥ పూనాలో నీ యిరువురు
హూణోద్యోగు లొక దళము నుంచిరి, వారల్
హూణభటులు, ననభిజ్ఞులు
మానితభారతపరిచితమర్యాదలకున్. 146

గీ॥ ఎలుకనుండి మనిసికిఁ బ్రాకు నిద్ది వ్యాధి
యెలుక సామానుమధ్యలో నెందొ చచ్చె
నట్టి సామాను దేవగృహాదులందు
హూణదళము సోదాచేయుచుండె గృహము. 147

శా॥ వ్యాధిగ్రస్తులఁ బట్టి మోయునెడ నిర్వ్యాధిప్రజన్ముట్టి రే
బాధల్ లే వని తోచి పీడెదరు, సర్వద్రవ్యముల్ కీర్ణముల్
బోధింపన్ వినరైరి, నెట్టెదరు పోపొ మ్మంచు, నిండ్లన్ భటుల్
శోధింపన్ దొడరన్ బ్రవర్తిలెను పెచ్చున్ గీడు, మే లెట్టిదో!

క॥ నాటూసరా రి చే
డ్వాటున్ గరపత్రమున వివరముగఁ బగలెన్
లో టవనము, ధనమానము
లోటుపడిలి మనుచు, లండ నొందెను దానిన్. 148

క॥ రాండును నైరెస్టును మా
గండమునకు మూల మైరి, కదలింపవలెన్
గొండొకచోటికి వారిన్
ఖండితముగ వ్రాసె "నత్తు" కరపత్రములో. 150

గీ॥ వేలమంది క్రమ్మందుచు నేడ్వ, వీరివలని
యేడ్పు, నగరిని రాజందు లెగురుచుండె
కంటినీట నక్షరములు కలకబాటి
నట్టి లేఖలు తిలకు కార్యాలయమున. 151

ద్వి॥ మానవుల మ టంచుఁ బూనాపురమ్ము
నీనాడు రక్షించు నింగ్లీషుప్రభుత
కన్న రోగమె కనికర మెచ్చు కలది
యున్న యీ సిబ్బంది యుబ్బు నిబ్బంది. 152

ఉ॥ ఎంతో వినీతియందు ధ్వజ మెత్తిన యాంగ్లవిభుత్వమందు నీ
వింతలు పుట్టునే! గృహాలు వేడిన కా దని తద్గృహస్థు లై
యింతటి నీచకృత్యముల కిం దొడిగట్టిరకో! భటాళి, ర
వ్వంతయు సైప రీ ప్రజలు, వా రుపసంహృతు లౌట ల గ్గగున్.

గీ॥ వ్యాధి సోకిన వెంటనే వచ్చి చెప్ప
వలయు నా యింటివారు, చెప్పనపు డొందు
దురు కఠినశిక్ష, నిట్టు లేర్పరుప జనులె
జడిసి వత్తురు, దీనికై సైన్య మేల? 154

క॥ క్షామనిధిద్రవ్యము నే
డే మయ్యె? ఋణంబు చేసియేనియుఁ దోడన్
శ్రీమత్పాలనము ప్రజల
నోముత! యీ వ్యాధిపేర నుసు రెడలనటుల్. 155

చ॥ బలితము వ్యాధితోడఁ గలవై ప్రభు! పన్నులుకట్టినాము భా
ర్యల మెడపుస్తె లమ్మి, తిన నన్నము లే దయ! నీ దయన్, బ్రవు
ష్టులఁబచరింపు మమ్ముఁ,బని చూపుము చేత క టంచుఁబోయి రై
తులు! వెస మండలాధిపతితో మొరపెట్టి నిలుండు చెంగటన్. 156

చ॥ అని ప్రచురించె వేల ప్రతు లమ్ముడుపోయెడి స్వీయపత్రికన్
జనసముదాయమానసము చాయఁ గనంబడు తథ్యమాతృకన్
బనితసమజ్ఞు డా తిలకనాయకహేళి, యి దిట్టు లుండఁ బ
ల్కె నధిపు డీత డైన సభఁ గృష్టి యొకండు శివాజిపుష్టిపై. 157

స్రగ్ధర॥ ఘూనెన్ దీక్షన్ శివాజీ పురుషమణి రుజీభూతదేశస్థితిన్ జీ
వామూన(శ్రీ)వౌనర్పన్, బతిఘటనఁ లోనంతమందించె'నవ్జుల్
ఖానుఁ',దోషంబుగాఁదద్ఘనకృతి నెవరుంగాంచరాదట్టులేవా
డే నిస్స్వార్థుండునేని కృతముఖుడె యగున్
గృత్యనిర్వాహకుండున్. 158

మ॥ అని కాలాంబుధరధ్వనంబు ప్రకటం బై బాలగంగాధర
స్వన మధ్యతత నిర్వహించె, నికఁ జెప్పన్ లేను కల్లోల మిం
తని పాలించెడివారి చిత్తమున,'లై మ్సాఫిండియా'పత్రికా
స్వనితంబుల్ మునుమున్నె వానిపలుకుల్ సందేహామూలమ్ము లై

క॥ తప్పనిసరి యగువప్పుడు
గొప్పమనిసినేని దునుమఁగూడును పరికున్
జెప్పెఁ బరాసుల విప్లవ
మిప్పగిదిన్ గేసరిం బఠించిరి జనముల్. 160

క॥ ఆ వాచనముల వర్ష
ప్లావన మాఅకయ మున్న పడనేపడెఁబో!
భావస్థలమునఁ బిడుగు క
రావంబుగ ధైర్య మగుచుఁ బ్రభువర్గమునన్. 161

గీ॥ రాండు నై రెస్టు హాతు లై రి రాణియుత్స
వమున శేగి మగిడెడు రేయి, వధకు లెవరొ
యవిదితము, తిలకుని యుపన్యాససార
మింత చేయించె నని నిశ్చయించెఁ బ్రభుత. 162

చ॥ ఇరువురి హంతలన్ దెలుపు నెవ్వడొ యాప్తున కట్టి శిలి శే
మిరువదివేల రూప్యముల నిత్తు మ టంచుఁ బ్రభుత్వ మాడె, వా
క్కరు డడుగన్ దిల కృలికెౘ్గాహ్యుడెనాకనుశొమ్ముహంత,యొ
త్తెఱగున నెంచినా వతనిఁ దెల్పెద నీకు న టంచు వానితో. 163

ఆ॥వె॥ తెల్లమొగమువాడు తిరిగి మాటాడక
వెళ్లె గూఢచారి, విభుత పురము
వెలిచె సంశయంబు గలిగి నాటూసోద
రుల నధీనమందు మెలగఁ గొనుచు. 164

క॥ పత్రికల నడపుకొందఱు
తత్రయుతాతురులఁ ; బభుత జైలున నిడె, నీ
సత్రాతిథ్యమునకుఁ దొలి
పాత్రుండు పరంజపే సపతులయందున్. 165

శా॥ వైశాల్యమ్మునఁ దక్క భేదములు లేవండీ! స్వతంత్రాన్య మౌ
దేశంబందున జైళ్ల కిండ్ల కని యే ధీమంతు డాడెన్ దిలక్
తా శంకించునొ! ముంగిగా నుడుత నీ గడ్డన్ బ్రభుత్వంబు నా
డాశల్ పంటకు వచ్చె నంచుఁ జెఱసాలన్ జొచ్చె నాహూతు డై.

ఉ॥ రాండుదురాగతమ్ములఁ బరావనిలోఁ బలుకాడి గోఖలే
పండితు డిందు రా, ఋజువుపటుఁ దిలకృధు ఖైదునేసి నా
తొండినుడుల్ క్షమింపు డని తోడనె వేడగఁ గాంచి గోఖలేన్
గండ్రప్రభుత్వమంతఁదిలకార్య 'బెయిల్'పయిఁబుచ్చి తోషిలెన్.

క॥ అనరాదు మీరు వినరా
దు నేను నుడి నిట్టిదాని తొరపడి యెవరో
యనుకొంటిరి న న్ననెఁ దిల
కు నిను విడుతుఁ దప్పు నొప్పుకొను మను ప్రభుతన్. 168

గీ॥ ఇది పరాయియేల్బడి, ప్రజ నేలుట కని
తీర్పుకొనుట కాదు, మఱియు దీనికి మెడ
కాయపైని తలకాయ లే, దీ యొగి నిక
నెన్నొ యిత డాడెఁ గాని పాటింప మేము, 169

ఆ॥వె॥ ఇతడు రాణిగూర్చి యెంత వ్రాసిన నందు
రాజభక్తి యూచె, రాజు నెదురు
కత్తి లేచె నితరకటువాక్యముల నని
తిలకుఖైదు సమ్మతించెఁ గోర్టు. 170

ద్వి॥ భారతప్రతిపురపతిప్రకాలయము॥
జేరి తద్వార్తకుఁ జింతించె జనము. 171

మ॥ అభియోగం బది యర్ధలక్ష లజపత్యాద్యార్జితోద్యన్నిధిన్
శుభకార్యంబు, తిలక్ప్రభారమణి కుచ్చుల్ మంచిముత్యాలతో
సభలన్ గట్టె సముద్రమున్ గడచి, శిక్షాంతమ్మునకై యెందఱో
ప్రభుతన్ గోరి రదేశ్య లిద్దకృతికర్తల్ "మాకున్నముల్ల" ర్మఖుల్,

క॥ రాజద్రోహులకు బ్రిటన్
లో జెయి లది నరకనాకలోకసుసీమన్
రాజిలఁ గారాగార
వ్యాజమ్మున నరక మయ్యె భారతభూమిన్. 173

గీ॥ ప్రభుత పురి వడికించెఁ గారన్ బ్రజఁ బురి
కొలుపుచున్ దన్ను వడకించు బలిమిచేత
నిందునై వను సమతఁ జాటింతు ననుచు
బందెదుస్తులు తొడిగించె పండితునకు. 174

ఆ॥వె॥ కృష్ణు డెంతవాడో ఏ దాది నగుటచే
నిన్ను నంతవడికి నేను పెంతు
నిక్క డుండు కొన్ని యేండ్లని కారాంబ
పలికినటుల నేదో తిలకు వినియె. 175

ఉ॥ ఆ యవధిన్ స్వరాష్ట్రమున నైనది కాంగ్రెసు, దిట్ట శంకరు
న్నాయరు తద్విభుండు తెగనాడెఁ బ్రభుత్వము నిట్లు తన్ను కా
రాయతనస్థుఁజేత యపయం బని, దానిని విన్నతోడఁ దా
నే యల పీఠమం దధివసించినయట్లు తిలక్ ప్రకాశిలెన్. 176

శా॥ నాటూసోదరులన్ స్వమిత్రులను బంధాపేతులన్ జేయ నై
పాటింపంబడె నిర్ణయమ్ము సభలోఁ, బల్కెఁజా జెనర్జి కసుల్
గాటం బభ్రశుభరమ్ములౌచుఁ దన యుక్కట్టున్, జనం బంతె, యీ
మాటల్ విన్న తిలక్ తలంచె నిజజన్మన్ ధన్యధన్యంబుగా. 177

గీ॥ స్మృతిపథమ్మున నిరువైపు చెట్ల నీడ
లై తిలకునకు గతవిషయములు తోఁచె
హ్యూముకర్ష కోద్యమమున కాముదమ్ము
త్రావినముఖమ్ము పెట్టి నేత లగుపడిరి. 178

గీ॥ అంతకును మున్నె యానాఁడొ యనుకొనియెను
వారి మితవాదు లని, వారి వాలకమును
తాను "లాహోరు" కాంగ్రెసులోన భూమి
శిస్తుగూర్చి మాటాడుచుఁ జెనకె నిటులు. 179

ఉ॥ మాఱని భూమిపన్నెవరి మంచికొ యెల్లర మిందు నేటికేన్
దీరుపు నేసి విద్యగడిదేరినవారిదె కాంగ్రెసన్న పెన్
దూరునుఁ బాపి దీనికి విధుంతుద మోహితచంద్రకాంతి చే
కూరిచినామొ? యిందు ప్రజ కోరినటుల్ మన చైదు లొప్పుతన్! 

గీ॥ పార్లమెంటున సభదృష్టి పడని దొకటి
భారతవిభాగ మదియు, 'హెర్బర్టు వెబ్బ
రెయిడు రాబర్ట్సు వాల్టరు కెయిను పాలు
హంటరును నవురొ' జ్యాదు లందుఁ గలరు. 181

క॥ నౌరోజీ యధిపతి, లా
హోరున కాంగ్రెసుసమితి, తదుక్తుల నలుగో
జీ రవళించు స్వరములుగ
నారజములు తనకు కొన్ని యయ్యెవి యిటులై. 182

ఆ॥వె॥ పార్లమెంటునందు భావిభారతభాగ్య
పత్రిరేఖ చెడదు, భద్ర మెపుడు
పుడమి నుండ నోర్పు చెడు మానవశరీర
మునకు దాని కెట్లు పొంత నౌను. 183

మధ్యా॥ తాను బ్రతికియున్నయట్లు తగిన సాక్ష్యము చూపకున్న
చో నెలనెల పెన్ష నెట్లు చొప్పడదో యట్లె భారతస
మీనదారిద్ర్యసాక్ష్యమున మెప్పింపకున్న, లండనున
హూణపాలకులనుండి ధన మూడిపడదు సాయముగ. 184

ఉ॥ లతలులతలున్ జనము లావటిపోవుచునుండ నిత్యదు
ర్భితముతో తలా నగటురీతిగ రాబడి యేట నిందు బు
ఱ్ఱితుత మిర్వదా? యిరువదేడొకొ! రూప్యము లంచుఁ బాలనం
బతమ మౌనొ సారవిభవాంహతిలో హా తి దాని కయ్యెడిన్. 186

ఉ॥ బరిషువార లేలుబడి కైన బొటాబొటిభ రొొంసంగి, స్వో
ర్వీరుధిరాయితాయ మొరుఁ బీల్చగనీక స్వదేశశోభకై
తారె వ్యయం బొనర్చుకొని తారె మహాపదవుల్ భరింపగా
ఘోరములం బడన్ బ్రిటనుకున్ దొరికెన్ బ్రజ భారతమ్మునన్.

ఆ॥వె॥ అడిగె నొకని నొక్క డాతని కొట్టలే
దేమి? నన్ను గొట్టనేల యనుచు
వాడు చెప్పె నతడు బలవంతు డౌటచే
కొట్టఁ జాల నిన్ను కొట్టితి నని. 187

ఉ॥ ఏ నిటవచ్చునప్పుడు వచించెను హాక్కలొందు గూర్చి నా
తో నతివాదిమజ్జనము తో డిది మీకు, త్వదీయ కాంగ్రెసీ
యానము మా యనం బొకటె యంచును లండనునందు పాలనా
స్థానిస్వరాజ్యపతులసితై రిషునేత, శుభమ్ము లీ నుడుల్. 188

గీ॥ తన శుభాకాంక్ష లందింపు మనియె నతడు
వేరువేరున కాంగ్రెసువారి కెల్ల
నీ విధము తోడు మన పోరఁ బోవు ముందు
తొడుగుకొనుటోడు, భారతితొడవులార! 189

ద్వి॥ ఇంతకన్నను నెక్కు వేమి వచించు
కాంతి నన్నగ నుడి రాజి నౌరోజి. 190

క॥ అది పూనాకాంగ్రెసు, తా
వదలుకొనెన్ గార్యదర్శిపదవిన్ బిగుతై
నది యంగీఁ బలెఁ గలహాము
పదమునఁ దీక్ష మయి సంఘసంస్కరణకథన్. 191

గీ॥ ఆకలి జనింప జఠరాగ్ని యటులు కాంగ్రె
సాది మూర్మురసమవచోవాది యగు సు
రేంద్రనాథబెనర్జి వాచించె నధిప
తిత్వమున నుండి ప్రజతెల్వి త్రిగుణ మగుచు. 192

క॥ ప్రజలార! యైకమత్య
ప్రజ మై యీనాటి సభ స్వరాజ్యము నే మై
నిజశక్తి నేలుకొనునో
బుజువొనరించె నిక దొరల యీగియె వలయున్. 193

ఉ॥ నాలుగునూర్ల లతుల జనమ్ముల కచ్చట పార్లమెంటునం
దే లలి నొప్పెనో ప్రతినిధివ్రజ మేడును నూర్ల కిర్వదే
మో లఘు వౌచు సంఖ్య, నిటనో పదిలక్షల కొక్కఁడేగతిన్
బోలునొ! శాసనాస్థలఁ బ్రభుత్వము న్యాయ మెఱింగి పల్కునే.

గీ॥ తాము చేసినవానిని తామె విఱుగ
గొట్టుకొన రెట్టిరేనియుఁ, గొట్టుకొనెను
ప్రభుత వాగ్దానముల నేల? ప్రజలు కారొ!
భారతీయులు, నడిగెడివాడు లేడు. 195

గీ॥ పోలులో నెంతొ యంత్రియ పొడుగునను వ
చించె "వాల్పోలు" ప్రభుత చలింపదు స్వయ
మ దొక యంత్రమె తొలినుండి యని ప్రజ కదు
పవలె దాని జ్వాలాయితబలమున నని. 196

గీ॥ లే దయా దివాలాతీయలేదు దేశ
మని పలుకుఁ బ్రభుతాముణి, యగునుగాక!
యా దివాలాను చేరుట కేది వాలొ
తత్పరణిఁ దాను చనుటలే దనవశంబె? 197

మధ్యా॥ దండయాత్రల కిట నుండు దండిపొజున కగు ఖర్చు
నిండియా భరియించి యిటు లేల? దైన్యంబు నొందవలె
నండయో మనకు నీతికి విడాకు లిచ్చిన రాజకీయః
ముండు నె ట్లిక జనంబు కటికుప్పనిర్నయి నాశ్రయించి?

గీ॥ "హైదరాలీ"న్ శివాజీని నాంగ్లవిభుత
సేనలో సుబేదార్లనుఁ జేయకున్నె!
వారె యిపు డున్న, నింతకు భూరి పదవి
భారతీయున కిడ భూమి యొరగిలదొ! 199

ద్వి॥ తినుట కన్నము లేదొ తెగబడి జాతి
యొనరించు నెదియేని, ఘనప్రభుత్వంబు
యూరపుజాతికి నొరఁ దీసిపోదు
భారతప్రజ యని భావించు టురవు. 200

క॥ లండను కాంగ్రెసు మాచే
వెండిని గొనె ఖర్చులకు, లభించెఁ బయిడి త
న్మండితసాహాయ్యాకృతి
మెండువిలువ సుజనసఖ్యమే యెం దైనన్. 201

క॥ ఏదేని రాజకీయము
తాదృతమున్ గాక ఫలము నందుకొనదయా!
ఏదో యొక పక్షము మన
మేదినికై లండనుసభ మేకొన వలయున్. 202

క॥ వెనుకకుఁ జూచుకొనుచు దు
న్ననొకొ! పొలముదున్నువాడు, నూల్కొనవలె న
య్యనువున దేశాభ్యుదయం
బునఁ బురుషుం డవధి లేకుపోనివడిమెయిన్. 203

ఉ॥ ఎత్తుననున్నవారికి లభించును నిర్మలమైన గాలి, పై
కెత్తిన మానసమ్ములకు నే మతభేదము లేని భావము
న్వెత్తు లభించు, దానఁ బిలపిల్లును దేశము, రాజకీయముల్
మెత్తగ పీవ రాజుకొని మేలిడు, పీవన తృప్తి లేమియే. 204

ఉ॥ తూర్పునఁ బుట్టి నాగరికతోన్నతి పశ్చిమ మేగె సూర్యమా
ర్గాశ్రితవేగ మొచ్చు, నధమర్ణము పశ్చిమ మిప్పుడేని తా
తీర్పఁగ దక్షమంగుఁగాత! తన దీర్ఘ ఋణంబు నిజోత్తమర్ణ మౌ
తూర్పున కేతదర్థితము తోడనె యిచ్చి గృహీతభాగ్యమున్. 205

వసంత॥ ఏనాటికేని లభియింపక తప్పదండీ!
యీ నేలవారికి స్వతంత్రత కాంగ్రెసండన్
యీనాడు కాదు, మన యీతుల కంద, దైనన్
దానన్ లసింత్రు మన పుత్రులు పౌత్రు లెల్లన్. 206

ద్వి॥ జరిగిన చరిత యుత్సాహకారణము
జరుగఁబోవునది యాశ్చర్యకారణము. 207

క॥ గంగాతటజనితర్షిత
రంగిత మాశీర్వచఃపరంపర తో దై
వొంగులు గా కెట్లుండును?
మంగళములు కాంగ్రెసుద్యమంబునఁ బ్రజకున్. 208

ఉ॥ కొండలు నేడు దివ్యపురిఁ గొప్పన దాల్పకమున్న, పెన్నల
గ్గాండరుసేన "సైగ్రిసు"ను గాంచకము, న్నల 'బాబిలోనియా'
పండితదృష్టి చుక్కలకుఁ బర్విడు మున్న, ప్రభాత మెల్లెడం
బండువుగాకమున్న, మధుమత్కృతిభాషలు భారతమ్మునన్. 209

గీ॥ అంత పెద్ద సురేంద్రవాఙ్మ్యాసమందు
నా సఖుని యివి నుడులు భత్యములు పెక్కెఁ
దక్కినవి ప్రజాళనార్థజల మిడిరె
ధ్రాతమధు విడుఁగాక దొరతనమునకు. 210

గీ॥ ఎంత సొగసుగ నుండె! సభాంత మగుడు
తన శివాజ్యుత్సవారంభమును శివాజి
నా బెనర్జి నుతించి మాటాడిన విధ
మటులె యెంత మాళవ్యోక్తి యందగించె! 211

క॥. ఒరవడిగ "మాజినీ" తగు
సురేంద్రనాథునకుఁ, బెఱలు చోద్యపు తెలివిన్
మెఱసినను శివాజ్యాదుల
కరణిఁ స్వదేశమతిపొంగుఁ గల్పింతురొకో? 112

గీ॥ కేంద్రసభ గవర్నరుసభన్ గేలు సాచి
తెమ్ము ధన మనుటను తాను దెప్పిపొడిచె
భర్త స్వధనమ్ము వెచ్చించి భార్యధనము
కూడ లాగికొనుటయె యీ జాడ యనుచు. 213

గీ॥ కాంగ్రెసునఁ గలకత్తానిగమమునందుఁ
దుఱకలకు వారి పౌర తెన్ని త్వరగఁ గాంగ్రె
సీయు తొటకుఁ బ్రెసిడెంటు చెలగఁ బిలికె
భాసపథయాని "రహమతుల్లాసయాని". 214

గీ॥ భారతీయున కేట రాబడి తలసరి
యెంత? పందొమ్మిదవవంతె యింగిలీషు
వాని రాబడిలో, వీని దైనికంబు
కూలి యెంత? పలుచోట్ల నొక్కొకటి యణాయె. 215

గీ॥ భారతమ్మున నిపు డెంత ప్రజల సంఖ్య?
యిరువదియు రెండు కోట్లు, న దెంత బ్రిటను
నందు? నాలుగు కోట్లె, యీ చందమున న
తండు పలు లెక్క లెంత సత్యముగఁ జెప్పె! 216

ఆ॥వె॥ ఎంత విస్తరిల్ల నేమి శాసనసభ
భారతీయు లైన ప్రతినిధులకు
వోటుహక్కు లేదు, భూరి యయ్యు ప్రజది
తెలివి గవ్వ, ప్రభుతది వెనురవ్వ. 217

గీ॥ తాను శాసనసభ్యు డైన నేమి
ప్రజకుఁ జేయఁజాలడ మేలు ప్రభుత నెదిరి
గ్రుడ్డిలో మెల్ల గోఖలే కొంత మేల్, ఫి
రోజిషా వలె నత డాంగ్లరోచనుండు. 218

ఉ॥ రో జొక వింత నాటి యిరు రోజులు, నాత్మసుహృద్విచారణన్
హాజరు తాను కోర్టు, కది యారపి మూగి జనుల్ తిలక్మహా
రాజకు జై యటంచు నలరం బదివేవురు చూచి యో! సుధీం
ద్రా! జననేత వీవె యని త న్నధికారి నుతించె ముగ్ధు డై. 219

చ॥ ఇటులు తలంచుకొంచు నిదురించె నహో! గుఱకన్ తిలక్సుధీ
దృటు, డట బద్ధుఁ డైన తొలివాసరమే గుఱుకొట్టి నిద్రలెన్
ఘటిత మెడందలో దిగులు కా దది యోజన గాని, మైకృశిం
చుట వెతచేతఁ గాదు హితభుక్తము లేమిని గాని వానికిన్. 220

మధ్యా॥ మొదటిశ్రుతిప్రతిని మాక్సుముల్ల రంపఁ జదివి దాన
మొదట నార్యులు వసించిన దుహోత్తరధ్రువమె యటంచు
విదితము సేయు గ్రంథమును విరచించె బంధనంబునసె
యెదలకుఁ బలెఁ దివాచీల కెన్నొ రంగులు వేసెఁ దిలకు. 221

క॥ పూనా నగరము దేశ
ధ్యానుల పురుటింటి యూయె లని పే రొందెన్
నానాసాహేబుదడము
లోని యనేకులకు నందులోనే క్రీడల్. 222

గీ॥ తన్మహోరణమారణ తప్పి వచ్చి
విధృతకాషాయవేషు లై విడిసిరి కతి
పయులు పూనాను బొంబాయిపురమునందు
విప్లవము నూటిపోయుట వీరి వృత్తి. 223

క॥ వీరిని పేర్కొనియె హ్యూం
భారతజాతీయసభకు భవదుం డగుటల్
వీరికి హితు లతివాదులు
ఘోరామిచెలుల్ క్రియాప్రపూర్ణులు మెఱియల్. 224

గీ॥ కలడు ఠాకురుసాహెబాఖ్యుకు డొకడు
వఱగు నొక "దగమ్యానంద పరమహంస"
మఱియుఁ గొందఱు చట్టము సఱకుగొనక
దొరతనము నెదురగ మదిఁ దొలుచువారు. 225

ఆ॥వె॥ యత్న మెట్టి దైన నది ధర్మబద్ధము
ఫలిత మెపుడు ధర్మబద్ధ మగునొ
యింటి నెఱుమువారి గెంటుటలో నెట్టి
క్రూరకర్మము నఘ దూర మగును. 226

ద్వి॥ రాజు కా డాంగ్లు డాక్రామకు డగుట
రాజ విద్రోహాచర్య యెదియుఁ గాదు. 227

ఆ॥వె॥ విష్ణు వైనఁ దదంశభవిష్ణు వైన
చావునకుఁ దెగించినపుడె సర్వ మిడును
భక్తిఁ జూపఁ ముజ్జన్మలు, శక్తిఁ జూప
నొక్కచే జన్మ ముక్తికై, యుదిత మిదియు. 228

శా॥ గీతాచార్యుఁడు కామహీనకృతి నగ్గించెన్, బ్రశంసించె హిం
సాతాదాత్మ్యము పోరు, పోరును సకామంబే కదా?, కాదు, త
న్నితార్థం బిది దేశశోభకొఱకై నిష్కామ మౌ నెట్టి దే
నీ తత్కర్మ, సకామ మౌ నది సఖా! నీ శోభకే మూలమో. 229

క॥ ఎవడు ప్రజోపద్రవహే
తువౌ పులినిన్ ద్రోవ కాచి దున్మినటులు దు
న్మవలెన్ వాని, బ్రభుతతో
బవరముకై ప్రోగుసేయవలె నడిదములన్. 230

క॥ అన్యాయస్థులఁ జంపగ
నన్యాయముసేత తప్పు, దది తప్పును కా
దీ న్యాయము కృష్ణుం డన
ధన్యు లయిరి పాండవులు తదాచరణమునన్. 231

గీ॥ ఇట్టి చెయ్వులు మనతలఁ బుట్టె నెట్లు?
బ్రిటనుముఖ్యదేశమ్ములం బికగట్టి
పొగడఁబడినవి; దేశార్థము తమ దేహ
మాహుతి యొనర్చి యర్చితు లందు నిందు. 232

గీ॥ కలియుగమ్మున నైదు వేల్ గడవ నేండ్లు
శత్రుమిత్రభేదము దక్క జనులయందు
వర్ణభేదమ్ము లేదు, సువర్ణ మొకటె
భారతీయత, గుణము లాభరణములును. 233

మ॥ అతివాదమ్మున మేలుకాంచి మన బోం ట్లాత్మార్పణం బిట్లు సే
యు తెగింపున్ గమనించి యెల్ల ప్రజయున్ హుమ్మంచులంఘింప నౌ
కృత్యుటిం బోదొకో! పెద్దగాలి కొగుడా కై పారతంత్ర్యంబు న
న్న తదుద్బోధము దుద్దుగాగ నరవిందా లెన్ని యో డెందముల్.

శా॥ వంగీయుం 'డరవిందఘో' షహాజు డౌ 'వారీంద్రు'తోడం 'బరో
డా' గాపుండె, నుపప్రధానపదవీలబ్ధుండు, విద్యాలయం
బున్ గర్వింపగఁ జేసె నా పయి, బ్రిటన్‌లోనే స్వరాజ్యాప్తికై
సాంగం బౌ ననుశీలనమ్ము గలవా రా సోదరుల్ పెక్కుటన్. 285

ఆ॥వె॥ వారి చూపు తెల్లవారి యాననమున
నెఱుపుబొట్టుఁ బెట్టు నెఱుగనట్లు
కవిసి వారి నవ్వు కాంగ్రెసువారికి
తండులములు పెట్టు కొం డ టంచు. 286

చ॥ తనువున నంతరింద్రియకదంబము వోలె నెసంగె భారతం
బునను స్వతంత్రతాసభలు, బొంబయి నట్టి దొకండు, నందువా
రన శపథప్రికర్ములు గరాసులు కాని కరాసు, లన్నతో
ననుజుడు నిందు, గీత రసనాగ్రమునందు కరాగ్రమం దటుల్.

చ॥ కడుకొని క్రాంతికారులముగా భరతావనిదాస్యముక్తికై
యొడలునఁ బ్రాణ ముండువఱ కోడక పోరెద మంచుఁ, గొల్వులోఁ
దడవెడు నెల్ల సంగతులు దాతుము, దాచనినాడు ప్రాణముల్
విడుతు మ టంచుఁ, జేసి రరవిందుడు సోదరుడుం బ్రమాణముల్.

వసం॥ దాశేర్కథానామకగ్రంథమున్ మున్
వ్రాసెన్ దివోస్కరు, స్వరాజ్యపదంబు వాడెన్
భాసించె నద్ది యరవిందుని బుద్ధిలో, న
శ్లే శుద్ధపూర్ణిమ స్వతంత్రతయర్థ మౌచున్. 289

మ॥ అరవిందుం డొక వంగముఖ్యుని జతీంద్రాఖ్యున్ బరోడామహీ
శ్వర సైన్యమ్మునఁ జేర్చి సైకవిధశస్త్రప్రౌఢుఁ గావించి యే
దటో వంగంబున దీపెచే దివె లటుల్ తత్ప్రిప్తతసైన్యంబున్
మెఱయన్ దా మొద లై రణంబును దలంచెన్ రాజ్యసంపాద్యుగా.

గీ॥ ఎవడు యోగాశ్వముననుండి భువిని పడెనొ
వాడె యిత డరవిందు డై వఱలినాడు
మఱలినాడు విజాతిని దరియఁ గొలువు
కొఱ కని, స్వజాతికళఁ బెంపఁ గొఱలినాడు. 241

వియో॥ అరవిందకృపాణలాంఛచ
స్ఫురితచ్ఛన్నసదస్సదస్యు డై
యరవిందుడు భారతీయచా
స్వరుళద్వాగసి లండనందునన్. 242

శా॥ స్వాతంత్ర్యంబును రాజకీయముగ నెంచం, డాత్మ రత్నమ్ముగా
నా తథ్యస్థితి దాని కాంతిగ సమష్ట్యాత్మన్ స్వదేశమ్ముగా
నా తారళ్యము మాయఁజేయు నతనిన్ హంతవ్యుగా నిర్గురుం
డై తా యోగము పట్టుచున్న యరవిందాధ్యాపకుం డెంచడిన్.

గీ॥ గిన్నెలో నీరు కత్తితోఁ గెలికి యోగి
యొకడు మంత్రించి యిడుటచే నూదినపుడు
బూది పోలిక వారిందు ప్రోసరిలిన
జ్వరము పోయె, యోగమ్మునఁ బెరిమ మిగిలె. 24

ద్వి॥ అరవిందు సందేశ మామహారాష్ట్ర
మరులకు వినరాని య శరీరవాణి. 245

శా॥ పూనాలో నొకతల్లి పూనె హృదయంపుఁ బుట్టుమచ్చం బలెన్
నా నందుల్ హరు వాలునందు మొనలే, నాదేశమున్ దోచు దు
ర్శ్శ్రేణిన్ గుర్తిమ్మరో యేమెు! రంగు లయి భాసింపింప రేమో! ధ్వజ
శ్రీ నన్నట్టిది చింత, పౌరుషము దాల్చెన్ బౌరుషీరూపమున్.

గీ॥ దేశభక్త్యంగణమున ము త్తియపురంగ
వల్లి యైన యా తల్లికి వారు కొడుకు
లిద్దచాపేకరాన్వయు లిద్దఱొకరు
ధనితళపథు లా వంగసోదరులు వోలె. 247

శా॥ హిందూధర్మసముద్ధరద్దన దశాదృక్సంసదామూర్తికిన్
దెందంబున్ వచనంబు కర్మయుగ సందీపింతు రీ మూవురున్
బొందుల్ మూడును ప్రాణమొక్కటి; కరంబుల్ రెండెయాత్రైన నా
ఉం దా మూడును మూడునాఅయినవీఋల్ గావు సంకల్పముల్

గీ॥ వారు మువ్వురు "దామోదర బాలకృష్ణ
వాసుదేవుల్", మహారాష్ట్ర భాగసభకు
నేత లాయుధ విద్యా ప్రసీతులనుగ
సభ్యులం బొనర్తురు, గరిడిసాల కలరు. 249

క॥ ఆస్యములు సనా విలసన
లాస్యములును, హస్తములు చెలంగు భరతభూ
దాస్యవిమోచనదీక్షా
భూష్యత కంకణప్రశస్తములు వారలకున్ 250

క॥ వారి గణేశోత్సవసభ
సారించె నకాలసాంధ్యసారరుచి నలం
కారమున, ననుజభాషణ
మై రీతికిం దొడుగుం దొడిగె నగ్రజు నుడుగుల్. 252

క॥ ఆదర్శము మనకు శివా
జీ, దోరింపవలె వాని చెలువునం బ్రభుతన్
వైదేశికమును మనము ని
వాదోత్సవకర్మ లది వినా కుత్సితముల్. 252

ఉ॥ స్త్రీలు వలెన్ కథల్ వినుట సిగ్గు, స్వతంత్రతకై తృణంబులం
బోలికం బ్రాణముల్ విడువం బోటున నిల్వవలెన్, నిరర్థక
శ్రీలు శరీరముల్ పరుల సేవలలోం బరతంత్రముల్, ప్రజల్!
మే లిపుడైన మేల్కొని యమిత్రుల రాచుట లాలం బ్రోచుట

ఉ॥ ఉండిన రాజ్యమేలుకొనుచుండవొ! యూడిన స్వర్గమేకదా!
గండరగండ! కొంతికొడుకా! కృతనిశ్చయుడా! సశస్త్రుడా!
ఖండనమాడ లెమ్మనుచు ఫల్గుణుం గృష్ణుడు పల్కె, ధీరతా
మండనముల్ తదుక్తులు సుమా! మనలన్ గని పల్కినట్టివే. 254

చ॥ ఒకపుడు సర్వదిక్కుల మహోజ్జ్వల మైన స్వతంత్రతాఖ్యఁ జం
ద్రిక నెడ మీక కాచినది దేశము భారతమే కదండి! నే
డు కటికి చీకటండి! యిట దుల్లితిమా మన? మట్లు కాదె! జీ
వకులమె, రైన నేమి హృది వాడిమిలే దభిమానహీన మై. 255

క॥ మా రవము షోడశాంబుధి
గా రాజిలుగాత! నిన్ను గానము సేయన్
హేరంబా! మా యిండ్లు స
దా రై పుల్లంబు లగుత త్వత్పూజనకై. 256

క॥ చాపేకరులమె కాని
చాపము కరమందు లేదు స్వామీ! భరతాం
బాపృథుబాధావిమనిధి
యే పొలుపున వట్టిపోవు నెట్టివి సుఖముల్. 257

ఉ॥ నిన్ను భజించుచుంటిమి గణేశ్వర! ప్రాణసపుత్రపుష్పని
ష్పన్నసమర్చనన్, జివరి జన్మము చేయకు దీని మాకు, బ్రిన్
గన్నుల మ్రోత గర్జనముగా భరతోర్విస్వతంత్రతాప్తి దా
క న్నవమేఘముల్ కురియుగాత! మిరమ్మద మస్మదంగముల్.

క॥ జనతతి నెంచి గణపతిన్
గణుతించి వచించి మిగులకాలం బిటులన్
గణనీయుడు దామోదర
మనీషి కలిగించె మంచుమయికిన్ వేడిన్. 259

మధ్యా॥ అయన్నదమ్ములకు నతిహితు డల శాకూరుషాహె
బాయన బొంబాయిపురరహస్యకేంద్రసమితిపతి, వి
నాయకు చపెతి తర్వాత నతనిగనఁ జనినపుడు ని
ఘా యిడి ప్రభుత పట్టుకొనెఁ గడగి చాపేకరాగ్రజుని. 260

మధ్యా॥ బాలకృష్ణు డన్నతోడఁ బాల్గొని రాండును చంపి
యోలమాసగొనియె నడవి,నుండు చోటు తృతీయుడెఱుగుఁ
గూలువ నెంచెను భటులకున్ఁ బెద్దయన్న పట్టువడ
మూలమైనట్టివానిఁబెను ముల్లై కాశించిన వాని. 261

మధ్యా॥ పాలకుల్ సరె యనఁ దిలకు పలుకెంచి చాపేకరాగ్రు
జాలిమైఁ గౌగిలించుకొని స్వామి! నాకు భగవద్గీత
చాలు కనుల కద్దుకొందు జన్మించి నినుఁ గను గొందు
నీ లలిం బలుకు నా స్మృతున కిచ్చె నతు క్లిన్న పుస్తి 262

చ॥ ప్రిదులదు జాడ రాందు నయిరెస్టును బోయిన త్రోవ చక్కగా
నె దొరకు మీకు నెల్లరకు నింక, మదీయులు మేము బోవ మ
మ్మొ దొరయువారు వే లగుచుఁ బోడిమి చూపెద రంచు నేల్పడిన్
మెదలెడి తెల్లవారి కని మే కొనినా డురి కగ్రజన్ముడున్. 263

మధ్యా॥శవదహనమ్మును తిలకు జరిపించె, వ్రేటుగొన్నట్టి
గవరనమోముజల్లి పులి గాండ్రించి కన్నీరు త్రావు
చు వినిచె వాసుదేవునకు సుతమణీ! యిర్వదిన్వేల
కెవడు పాల్పడెను వానిని వధింపరా! తత్క్షణ మనుచు. 264

గీ॥ జరిపి యల్లె యాత డడవిఁ దిరిగె నన్న
తో, దొరకి యిరువురు నురి దోరినారు
వీరమాత యేల్పడిని శపించె నశ్రు
ధార దోసిలిఁగొని నీవు నాఋద వని. 265

మధ్యా॥ రేనడే యొక డురిఁ బడియె, రెక్కలూ డిన డేగ లాస్థ
లోని యెల్లరు, "మహారాష్ట్ర"లోఁ బ్రకాశిలెఁ దిలకు నవి
మానితపత్రికలోన మాణిక్యసఖ్యాతరములు
మానితుల్ చాపేకరు లసమానభారతభక్తు లనుచు. 266

గీ॥ హత్యచాటున నున్న దనంతదేశ
భక్తి యని లజపతిరాయి ప్రస్తుతించె
నవయుగోదయమున కిది నాంది, వీరి
జీవితమునకు జాతి జేజేలు ననుచు. 267

క॥ చాపేకరులనుగూరిచి
యాపత్రకుటీరగృహమహారాష్ట్రి మహో !
బాపురె ! యీ కొడుకులగని
నాపె నరిసింహి యనుచు నభినందించెన్. 268

ఆ॥ వె॥ వారి త్యాగవర్ణవార్తలు పత్రులు
కలకలమ్ము భరతఖండ మెల్ల
కొంత పత్రిగణము కూపారపారంగ
తంబు, లండనురము తాడితంబు. 269

గీ॥ ఇండియాస్థితిలో బ్రిట నుండియున్న
నిట్టి సాహసకృత్యమ్ము లెన్ని చేసి
యుండెడిదో యీ వఱకె ప్రతికోత్కర మని
తరప్రవృత్తముగ నని కొంద ఱని రచట. 270

గీ॥ అటులు పల్కు బ్రిటనువారి నావలేద
దేశభక్తికి సానుభూతి లవమేని
యిండియనుపత్రిక కథింప మండిపడెడి
నింగిలీషువిభుత యని రిచటి బుధులు. 271

గీ॥ 'శ్యామజీకృష్ణవర్మ' ఘూర్జరనివాసి
భరతఖండస్వతంత్రతాఖండనాసి
దీనికై పన్నుగడ యిందు దీటుకొన ద
టంచుఁ బయనమ్ము కట్టె లండనున కపుడు. 272

మధ్యా॥ నాసికాపురము కాపురము నలువొందు సోదరత్రయము
భూసురరాజపాలనవిభూషాయితచతురమంత్ర
భాసురసావర్కరన్వవాయము, మాతృబోధ విగ
తాసుభయము, కడు మంతు తండ్రి దామోదరపంతు. 273

క॥ వారు 'గణేశ వినాయక
నారాయణులున్', బ్రతిన వినాయకు డూనెన్
భారతరిపుమర్దనమున
నాలునుఁబదియేండ్ల బాలు డంబిక యెదుటన్. 274

క॥ అట చాపేకరుల వధము
నిట సావర్కారుశపథ మేకావధు, ల
చ్చటివారి త్యాగపథ మి
చ్చటి వీని కవిత్వరథము సాగించికొనెన్. 275

క॥ సావర్కారు వాంఛాఫల
శేవధి నెలకొల్పె సంస్థ, చిలువలుపలువల్
గా వెలయుచుండె శాఖలు
యావద్రాష్ట్రంబు, వంగమందు సముగమ్ముల్. 276

ఉ॥ స్వస్థలమందు సభ్యులను భ్రాత సుశిక్షితులం బొనర్చి బా
నాస్థుడుగా కళాలయమునం బఠియించు వినాయకుండు స్వీ
న్నస్థపటిత్వ మాంగ్లణితనాయక మూర్తివిదేశ్యవస్త్రకీ
లాస్థగితాంబరజ్వలనలాస్యము హోళినిఁ జేసె పండుగన్. 277

గీ॥ తిలకు బంధనాలయవిముక్తిమెయి వచ్చి
యిల్లు తిరునాళ్ళు గాగఁ గొన్నాళ్ళు నిలచి
ద్రవిడభూలక్ష్మి జయమాల సత్కరింప
నించి లంక గమించి యేతెంచె మగుడి. 278

గీ॥ గ్రామమును ప్లేగు పండెను చఱచుకొని ప్ర
భుత్వ మండగొని విజృంభితత్వమునఁ జె
లంగె ననవలె, రైతుల వెంగలితన
మిందు లేదు కాంగ్రెస్స్వర్గఋభువులార! 279

ఉ॥ రైతుల చేతి పంటలను రాలుపుకొన్నది, తద్బలమ్ముకై
శ్రోతముఃలందు మంత్రముల జోకగ నూదిన దెన్నొ ముచ్చటల్
లోతును చూపి భావిని హాలో! సుఖ మున్నదిపొం డటన్న, దీ
భాతిఁ బ్రవర్తిలెన్ బ్రభుత, వ్యాధియు నాధియు సాతు లీ యెడన్

క॥ పదునై దేడులనుండి వి
పద యనినను, వినని ప్రభుతపై నొత్తిడిఁ దేఁ
గదలించెఁ బ్లేగు మనల న
నెఁ దిలకు 'లక్నో'పురిపనిత కాంగ్రెసులో. 281

గీ॥ ఒక్కటియు రెండు మూడు నా ల్గిక్కరణి గ
ణించి బొంబాయిరాజ్యపాలాంచితేత
రక్రియలఁ దెల్పి కా దందురా? యెవరయి
న నిట వీరి నని సవా లొనర్చెఁ దిలకు. 282

మధ్యా॥ఇట్టి నుడుల్ పల్కరాద యిచ్చట, వీని తీర్మాన
మట్టులుంచుము, విరమింపవా యాధిపత్యమ్ము నుండి
నెట్టన విరమింతు నే ననె "రమేశచంద్రదత్తు", ప్రజ
రట్టు తెలుపరా దని యనరా దెవండే ననెన్ దిలకు. 283

శా॥ సుశ్రేయఃకృతిమైఁ బ్రజన్ దనుపగా శ్లోఘుల్, మహారాజరా
జశ్రీ లందఱు, రాజపూజితులు, వెల్చన్ రాజమాన్యుల్ "త్వమే
వ శ్రీమానసి లోకమాన్య! జనతాభవ్యప్రతిష్ఠాపనే
విస్రబ్ధా వయ" మంచు మెచ్చెఁ దిలకున్ విస్ఫారవిద్వత్సభల్. 284

గీ॥ ఒక మహాసభ లోకమాన్యుఁ బొగడుచు వ
చించె నతని యుపాధ్యాయవృత్తికాల
మెంచి, భరతోర్వి తన్ను దా నేలుకొనును
జాగు జాగే పదునొకండు సమ లటంచు. 285

కం॥ తన రంగు తగ్గకయ ద
ర్శన మిడి పుంభావవాణి సత్యభువిన్ జే
రె నని తిలకు శ్రద్ధాంజలి
మునుపడి ఘటియించె మాకృముల్లరుకు సభన్. 286

కం॥ నా గురువు, నాదు జీవము
నా గరిమముఁగని గతించెనా! పవలున్ రే
లే గురువు లయ్యెను గడచు
టే గతి నని పొగిలె రేనడే చన గోఖ్లే. 287

చ॥ తనదు కుటుంబమం దొకడు తక్కువ యయ్యె నటంచు గేస్తుగే
స్తును దురపిల్లె, నా కతడె తోర్తుఁ బ్రవేశము రాజకీయమం
దునఁ గలిగించె, వాని నుడితోఁ గృతితోడ మరాటజాతి చే
తన మని వాకొనెన్ దిల కుచారసదస్సున రేనడేమృతిన్. 288

గీ॥ ఎందు కనవలెఁ బ్రభుతయు నెంతొ చేసె
నాయకులు నెంతొ చేసిరి సాయము ప్రజ
కవసరమ్మునఁ, గల దొక యవధి యెట్టి
బెట్టిదమునకు నని తెల్పి ప్లేగు పోయె, 289

గీ॥ ఆ మహావ్యాధివేళ గోఖ్లేమనీషి
ప్రజకుఁ జేసిన సేవ చెప్ప వశమౌనె!
బాలగంగాధరుడు నట్లె పాటుపడియెఁ
గాలిఘుట్ట మేగిరి వారు కాంగ్రెసుకయి. 290

# అరవింద ఖండము

మధ్యా॥ కఱవులో నధికమాసంబుగాఁ దలంచెద రని యొకరు
మరొకరి యింటి కాతిథ్యమతిఁ జన నెంచని దినము
లరుగుపై నున్నట్టి వాని నరసి తల్పుబిగించు దినము
లరుదెంచె జనపదమ్ముల కడవులన్ గార్చిచ్చు లట్లు. 1

ఉ॥ పండిన పంట వెన్నెలలు ప్రాకెడు చీకటి నేలసొంపు లె
న్నండొకో! యంచు దేశము కనంబడెఁ గన్నుల నీరు క్రమ్మ, ప
ట్టెండును లేక యన్నము గతించెడు పేదలు పల్లెలందు తే
కుండుట లేదు, నిర్జలము కూపము నిష్కరుణాత్మకై వడిన్. 2

మధ్యా॥ అల్లుకొనె నకాలజీర్ణతావస్థ ప్రకృతికి, సుమన
ఉల్లసనము లేదు, మాడె నోషధు, లారోగ్యశిశువు
తల్లడిల్లె, నెటు పోయెనొకో! దాని జనని వర్ష, జనకు
డుల్లము చెడి యంటియంట కున్నాడు హేమంతఋతువు. 3

క॥ ఈ స్థితిలో జాతీయమ
హోస్థ మొనసె రాజధాని యం, దధ్యక్ష
త్వస్థుడు వాచా ప్రజలన్
స్వస్థులఁ జేయఁ గడు రాల్చె వాచాఫలముల్. 4

అల్పా॥ చెప్పె “దిల్షాయెదుల్ జీవాచా” క
కుప్పలఁ దన కీర్తి కుప్పల్ గాగ
నొప్పె “సోక్రటీసు” తుల్యుడు రనడే
య ప్పండితాత్మ శాంత్యబ్ధివీచి. 5

ఆ॥వె॥ ధీమహితుడు రానడే మహాకవి ‘జార్జి
యులియటు’ పలికినటు బృందగాన
మందుఁ జాల్గొనంగ వరిగె స్వర్గమునకుఁ
దేజరిల్లుచుండె దేవునెదుట. 6

క॥ మన గ్లాడ్స్టన్ మన "మార్లే"
వినిచిరి ఘనకృతు లయి ప్రభవింతురు ఘను లం
చు, వెలినడక గుణుతులు మన
మును కాల మను నిసుక నిడి పోవలె సుండీ! 7

గీ॥ ధర్మపాలనమునఁ జరిత్రన్ బ్రసిద్ధి
కెక్కినా రిరువు ర శోకచక్రవర్తి
చక్రవర్తిని "విక్టోరియా", క్రమించు
గావుతన్! శాంతి నీ దొడ్డగరితయాత్మ. 8

మధ్యా॥ స్వర్గీయు డాస్థానకవి సుబైౖటను డన్నల్లె యామె
నిర్గమించి దివిఁ దాల్చినది నిరుపమామ్లానపత్రసుమ
వర్గసంగ్రథితకిరీటవర మనశ్వరము, కొన్నాళ్ళ
నిర్గతయె యుడకయుండునే! కొన్ని వాక్కులు మనకు. 9

క॥ పతము పాతము లేని స
మేతుణ వికోరియా జయిని యేల్పడిలో
నీ క్షితిజనహృత్పేటిన్
రక్షితరత్నము తదాఖ్య నాల్పలకల దై. 10

క॥ నయన మభారతదర్శన
మయినన్ భరతోర్వియున్నయనమున హృదయం
బయనంబు కలది యాయమ
ది, యామెయెడ లక్కటిక ముదినుసున నయ్యెఁ. 11

ఆ॥వె॥ గద్దె యెక్కఁగలడు ఘనుఁ డైన యువరాజు
మోకరిల్లి గద్దెమ్రోల నపుడు
భరతఖండ మగును భరదదృష్టాఖండ
మిదియ కాంగ్రెసునకుఁ బోదలు నదను. 12

చ॥ మరియొకమారు కాంగ్రెస సమాన నిజప్రభుభక్తి చాటుకోఁ
దరుణము వచ్చె, నిట్టి మన తత్పరతన్ గని యింతో యంతో మేల్
జరుపును సార్వభౌముడు నిజాసనభాసనసూతనోత్సవాం
తరమున, నిట్లనన్ సభ ద్విధా, యొకవైపున పిల్లికూతలున్. 13

రథో॥ గోఖలేముఖులు మెచ్చ వెండి వా
గ్వైఖరీలసితు డయ్యెను వాఘా
యాఖువతిక్కచకిచాయితబాధా
మౌఖరుల్ కలవునన్ బ్రజ కయ్యెన్. 14

సీ॥ శక్తివంచన లేక విశ్వంబు దులిపి
సాయ మొనరించెనుఁ గలవుఁ జాయఁ బ్రభుత
యెన్ని కోట్ల రూప్యములు ఖర్చిడిననేమి
దైవకర్తృక మీ పాటు తప్పదయ్యె. 15

చ॥ ఇరువదియైదుకోట్ల ధన మేల్పడి ఖర్చుపడె న్ని జంబె, యి
వ్వలవున నెన్నికోట్ల విభవంబును దేశము నష్టపోయె గో
డ్లటి? పసిలేని సేద్య మగునా పసిలేనిది ఖాద్య మౌన! యె
త్తెలగునఁ బ్రాణి నిల్చు? నినదింపవొ యింతట నేని మేఘముల్.

ఆ॥వె॥ ప్రజలవలన నిండు భాండారముననుండి
ప్రజలకై వ్యయించు ప్రభుతశక్తి
పెక్కు వగునె! ప్రేలు ముక్కుపైఁ బెట్టించె
బెట్ట కోర్చి పల్లెపట్టుజనము. 17

మధ్యా॥ వచ్చిన వైస్రాయి యైదు వత్సరముల నే మెఱుంగు
నిచ్చట బాగోగు లరయ నింక నైదుంట మెఱుంగు
వచ్చినవాడు కర్త నిట ప్రజల కష్టచ్ఛేదనమున
మెచ్చదగిన సర్త నగుత! మీవత్సమజ్జార్జనుడును. 18

గీ॥ వ్యయము నయ్యె నయోమయాధ్వమున నూట
యేబదియు కోట్ల రూప్యమ్ము లెపుడొ, యెంత
యైన నే మిపు డారోగ్యహారితము లగు
నీటి యొనరుల కిర్వది కోటులె గతి. 19

ఉ॥ బావులు త్రవ్వకోఁ బ్రభుత పంచక రైతులకున్ ధనంబు, గో
దావరినుండి పోలె సరిదావళి సర్వమునుండి నీరు ఙే
త్రావళి కందఁ జేయక సరోవరవృద్ధికరంబుగాక యీ
పోవడి దెచ్చి తానె కల వౌ నిట, దీనిని గుర్తెఱుంగుతన్! 20

ఆ॥వె॥ భరతధరణి నీరభార కేదారసం
భరితభాగ్యసరణిఁ బ్రభుత చేయ
సంఘ మేరుపసుపఁ బవర, ద్రాక్షవనంబు
పంట యెంతొ సీధు వంత దొరకు. 21

గీ॥ వెండిరూపాయికే పదకొండణాల
కన్న విలువ లే దిప్పుడు కాగితమ్ము
రూప్యగౌరవ మొందె, నిర్గుణము, సగుణ
మైన తీరునకు నిది యుదాహృతంబు. 22

గీ॥ సైనికవ్యయకర్తన చాల ముఖ్య
ము, సహకారధనాగారములయు సంఖ్య
వృద్ధి కావలె, నిటుల నింకెన్నొ కలవు
సువ్త పదనకు లివి కాని సొంపు వలయు. 23

మాలిని॥ శ్రుతియుగసుఖపాచాసుతమ్రాహ్మా వాఛా
ధృత మగు ప్రభుభక్తిన్ దేశబద్ధానురక్తిన్
వితతముగ వచించెన్ వెండియున్' సన్నుతించెన్
గృతవిషయవిమర్శం బెంచి యాస్థాని వానిన్. 24

గీ॥ దక్షిణాఫ్రికాప్రజలయుద్యమముఁ గూర్చి
వ్యవధికర్తవదకు డర్బ్గను డిడిన
పంచనిమిషమ్ములనవె యెట్లొ పలికి గాంధి
పొందెఁ దీర్మానమునకు నామోదముద్ర. 52

క॥ తా వాఛాయుతుడు బ్రిటన్
లో 'వెల్బి'దొరయు నితరులున్ భేషన నెం
తో పలికిన వాఙ్మాలపు
భావము గోఖ్లే కథించెఁ బదుగురు మెచ్చన్. 26

గీ॥ ఎండ కెండి వానకు నాని యెపుడు గుప్పె
డున్ మెతుకులకొఱకు చెమటోడ్చుజనము
స్వీయవాగ్దానపత్రము చివికిపోని
ప్రభుతచే సుఖపడు నికఁ బలికె గోఖ్లె. 27

ఆ॥వె॥ అన్నమాటతప్పు దాంగ్లవిభుత్వంబు
మాటలోని శబ్దమండలమున
కన్యవిధము చెప్పు నర్థమ్ము నని మృదు
గల్ల ఘాతభాష ఘనుడు గోఖ్లె. 28

క॥ ఇరువెన్ని, లోకటిన్నర,
వరుసఁ దదర్ధంబు నట్టిపై ని సువర్ణా
క్షరము తగ నిచటి తలసరి
వరుమానము గ్రంథ మొకటి వగలెను "డిగ్బి". 29

గీ॥ అట్లు ముఖచిత్రమున మూడు నంకెలు నొక
దాని క్రిందొక పైన పుస్తము, నబ్రిటిషు
పాలనం బను నౌరోజి వ్రాసిన నెటి
పొత్తమును కాంగ్రెసిరువర్గములు నుతించె. 30

ఆ॥వె॥ కాంగ్రె సనధికారక ప్రజారాజ్యసం
స్థాన మని ఫిరోజిషాయుఁ దిలకు
వర్గయుగళపతులు పలికి, రైనను నేమి
మితికి అతికి వాదమేళ సామి. 31

ఆ॥వె॥ అన్య మైన వృద్ధి యల్పము, రాజకీ
యాభివృద్ధి గొప్ప యనుమ షాయు
శాసనమ్ము మెచ్చు షా పల్కుమార్పుతో
దానిఁ బిల్కుమార్పుఁ దలచుఁ దిలకు. 32

గీ॥ ఇచ్చినన్ని హక్కులు గొని యికముఁ గొన్ని
యంచు నన్నిటి నిడుదాక నాంగ్లవిభుత
కొత్తు లొత్తు ఫిరోజిషాదు క్తభాష
తిలకదృష్టి వైప్రాయ్ఖండితేజిపోష. 33

మధ్యా॥ పది దైవశాసనములను పాటింప కాజ్ఞించిన భర
తధరను వానిఁ దాటించి తగ నేలు కాలము దూలె
కుదుర దవెడి లండన్ రాజ్యగోష్ఠి నాకర్షింప నుభయు
లు దొరకొనిరి గ్లాడ్ స్టన్ దొరపిలుపునఁ దలపు లుడివోవ. 34

క॥ అది యట్లు సాగుచునె యుం
డఁ దదన్యాధ్వముల వెదక డక్కొ-నె నతివా
దిదళము, మితవాదు లటులు
మెదలన్ దలపర శతాబ్దమితఫలు్లైనన్. 35

గీ॥ వార లై రిషుపద్ధతివారుగా న
కృత్యకారులుగా నిరసింపఁబడిరి
వీరిచే, రాజభక్తి లోపించు దేశ
భక్తు లద్వైతులును వీరు ద్వైతు లగుచు. 36

మధ్యా॥ పలికె షా లండనున మన పరిషత్తుశాఖ యొం డలరు
కొలకొల మనుచు నెప్పు డది కొమరొందుతః యితోధికముగ
పలుదొరల్ మెచ్చఁగఁ బూర్వపాలకపాలితం బౌచు
నలదాని పత్రిక యిండియాఖ్య మఖండర్ధి నెసగ, 37

రథో॥ ఈ సువర్ణసుమపంక్తివాసిత
వ్యాసపత్రికప్రచార మిందు నై
మోసులెత్తుఁ బ్రజ రాజకీయచి
ద్భాస మంచు సభ బాగుబా గనన్. 38

ద్వి॥ తిలకాదులును మెచ్చఁ దీర్మాన మిందు
నలదక్షిణాఫ్రికావారిడిగూర్చి. 39

సీ॥ ఎటుల వచ్చెనో మీకె యొఱుక పెద్దమ్మను
సాగనంపు డటంచు, సర్వకృషిక
ఋణదానచణఘనధననిధానముల గ
ముల నెలకొల్పు డంచు, లులితంబు
సౌభాగ్య మిచ్చుటి చదువరులకుఁ బద
వుల నిం డటంచు, నిందలి జనంబు
దక్షిణాఫ్రికనుండెఁ దద్బాధకము చట్ట
మును తొలగింపు డంచు, నిటులె మరి

గీ॥ ప్రత్ననూత్న నిర్ణయములఁ బ్రభుత నెంచి
వేడుకొలునఁ బ్రకటించె వినయశిఖర
ముఖరభారతజాతీయముఖ్యసమితి
విద్యగూర్చియు నొక తీర్పు విన్నవించి. 40

ఉ॥ జాతి స్వతంత్రజీవనము సల్పుకొనన్ దగు విద్య, యంత్రసం
స్పృతపరిశ్రమప్రదము విద్య, స్వదేశముకన్నఁ బ్రాణమున్
కితగఁ జెప్పు విద్య, మన కిప్పుడు లేనిది విద్య, పూర్వ వి
ఖ్యాతిని దెల్పి పౌరుషము కాంతిలఁ జేసెడి విద్య, కావలెన్.

ఉ॥ భారతరత్నగర్భ కుర వైనది కా దిపు డున్న విద్దె, సే
వారతిమిద్దె, సైన్యస విపశ్చితు లిర్వురొ మూవురో యశః
పారగు లింత భారతుల వర్గున, భారతి కుమ్మరావ మై
యేలుకొనంగ నిత్తడివి నేని లభింపవ యిందు పెంచికల్. 43

వసంత॥ చెప్పన్ దగున్ మిగుల నేడు జపాను తెల్విన్
జెప్పించె స్వప్రజకు విద్య స్వతంత్రరీతిన్
కప్రమ్ములున్ మొదలు కప్పి బొగల్ నభంబుకా
గప్పార్చు యంత్రవరముల్ తుది గా రచించెన్ 44

మత్త॥ మన బుద్ధి లొజ్జు మరియును మరగుజ్జు నగుచున్న దీ వి
కిరపు విద్యావిధానమునఁ, గేవలాచార్య గౌరవము
పరమదాస్యంబుపా లౌనె! ప్రాచీస్థితికిచీని నెత్తవలె
గురుకీర్తి మనది పాశ్చాత్యకుస్థలిన్ శంఖ మొత్తవలె 45

ఆ॥వె॥ మరియు నిటులు లోకమాన్యుండు వాచించె
విద్యగూర్చి తగు నివేదిక నిడ
సంఘ మేరుపఱచు సందర్భమునఁ లజ
పతిఫిరోజిషాలు కా గనంగ 46

గీ॥ భారతీయప్రయోజనకారి విద్య
తీరుగూర్చి శ్రమించినవారిలోన
ప్రథమగణ్యుడు లజపతిరాయి తిలక
సహితముగ నేతదుపసంఘసభ్యు డయ్యె. 47

గీ॥ ఉగ్ర వాది యౌ సావర్క, రుల్లము మిత
వాదిపర మౌ బెనర్జియు బలె లజపతి
మాన్య "డిటలీ"పినేతను మాజినీకి
నే లవ్య శిష్యు డు తిలకిష్టు డగుచు. 48

ద్వి॥ అతని విద్యావిషయంబు భాషణము
శ్రుతి కెంతయో అంత మతికి భూషణము. 49

మధ్యా॥ న్యాయము పీటముడివడ నన్యోన్యము మెలిసికొన్న
యాయా ప్రభుత్వశాఖల రయమ్మున విడదీయు, భార
తీయులకుఁ గొలు వీయ, సమధిక ఋణదధనసదనని
కాయ మెక్కువ సేయ, బ్రిటనుఁ గాంతుంచి తీర్పు లా సభను.

ఉ॥ మీ కరమున్ భజించెను సుమీ! తొలినుండియు నస్మదీయచా
మీకర మెల్ల నంటుకొని మింటిని పన్నులు సేనఖర్చు భూ
మీకరముల్, దురాశ విరమించి ప్రజన్ బ్రతికింపరయ్య! ధ
ర్మాకరులైన మీరు దొరలార! య టన్నది తీర్పు నా సభన్. 51

మాలిని॥ చదువుల యుపగోష్ఠిన్ సభ్యులై భారతుల్ సం
వదదుచితవిధుల్‌గాన్ మన్నువై ప్రాయి యంచున్
మొదలిటి వగు తీర్పున్‌మోసు లేపొంది సస్య
ప్రదము లగు న టంచున్ బల్కె నంతాన కాంగ్రెస్. 52

క॥ లాలాలజపతిరాయి శు
భాలాపము సాత్త్య మొప్పె వైప్రాయికడన్
మౌలిక మా సాత్త్యము, ధృతి
మూలము, విద్యోపసంఘపురఉక్తములన్. 53

మధ్యా॥ ఈ మహాప్రభుత్వవిద్యావిధానమును ఖండించుచున్నానునేను,
మొలిచెడి
మా ప్రజాస్వతంత్రనవభావములను మాయించుచున్న దిది,
బహునగ
రప్రసిద్ధాస్మదీయజాతీయకళాశాలలకు మాఱుదల్లి, యాచా
ర్యప్రకాండులకిందు బడుల నిర్వదైదు రూప్యములు సీయదు
జీతము, 54

చ॥ ఇరువదినాల్గుకోట్లకు క్రమింపగ భారతసంఖ్య విద్యకై
కొఱలు ప్రభుత్వపున్ వ్యయముకోటియులక్షలునాల్గెరూప్యముల్
పఱగును దీని యాఱవది వంతు బ్రిటన్ప్రజ, దాని విద్యకి
దొరతనమే వ్యయించుఁ బదితొమ్మిది కోట్లు, క్రమమ్ము లిట్టివో!

గీ॥ అతడు లజపతిరాయి దుర్మతిపరాయి
ఇటులు పల్కె నేల్బడిపెద్ద యాంగ్లు నెంచి
ప్లీడరై గడించు ధనంబు, లీడరై వ్య
యించు నతడు సంఘముశోభ పెంచుకొనగ. 56

గీ॥ శంఖమున సాంఘికమ్మునఁ జక్రమునను
రాజకీయమ్ము నెఱపు నారాయణుండు
స్మృతికి వచ్చు లజపతిరాయి తలపింప
కార్యశూరులలో నగ్రగణ్యు డతడు. 57

గీ॥ స్తవమునకు నోచలేదు క్రైస్తవము పంచ
నదపృథివి లజపతిరాయి పెదవి కదలి
యే మతమువారి కా మతమే జనిత్రి
తల్లి వైరివడ నొప్పెడు తనయు డున్నె? 58

మధ్యా॥ ఆర్యసమాజసాహాయ్య మందిన లజపతిరాయి
నిర్యన్నవోత్సాహాధార నించిన ఫల మైదు నదుల
శౌర్యమ్మునకు మించినయది, శరణాలయ మనాథజనము
పర్యాప్తము చదువు, కృతము వగ్రహమ్మునకు నిగ్రహము.

క॥ మాతాజీ యని పిలువగ
జాతీయంబు బడిఁ బెట్టి స్వాతంత్ర్యముపైఁ
బ్రీతి న్నేపాలున సం
గాతిన్ గల యోర్తు కలదు కలకర్తాలో. 60

గీ॥ కాంగ్రెసును చూడవచ్చి యా గరిత లోక
మాన్యు రావించికొని తన మందిరమున
విప్లవముఁగూర్చి చర్చించె విస్తరముగఁ
బంచె సహచరు నతడు నేపాలమునకు. 61

మధ్యా॥ సహచరుఁడు ఖడేల్కరుఁడు సాధించె నందు సాయంబు
విహితస్వవర్తనంబు రయిఫిళ్ళ కర్మనివసనంబు
విహితవిదేశ్యంబు. కాని వెలువడె దాని వైఱంబు
రహిత మట నృపధైర్యంబు ప్రిహిత మనంతవిఘ్నంబు 62

సీ॥ జోషి సైనికశిక్షణైషి జపాన్‌గత
ఘూర్కాలతోఁ బాటు [illegible]తిలపడియె
అష్టనుస్థానంబు నడసి పట్వర్ధను
వ్యర్థధనుడు తిరిగివచ్చి నసిగె
సిద్ధి లేదు సహాసప్రబుద్ధికి జర్మని
యాత్రి నేత్రానందమాత్ర మయ్యె
బాంబుసాహిత్యంబు పంతు, నోడన్ బోక
నా వంతు, బాపటు నచ్చఁ బలికె

గీ॥ వినియు విననట్లు కనియును గననియటు
నొనరుతటికి నిరీక్షించుచుండెఁ బ్రజల
నుండి రావలె తిరుగుబా టొగి న టంచు
లోకమాన్యుండు యత్నరత్నాకరుండు. 63

క॥ శివనామస్మరణం బె
క్కువ గా మారేడు సిడఁ గూర్చొను యోగి
ప్రవరుండు వివేకానం
దవిదుడు వాచించెఁ దన జనమ్మున కిటులన్. 64

క॥ కైలాసమున కితడు చను
వేళ దరిసె, వీని యొడలు వీని ప్రియశ్రీ
సాలచ్ఛాయ సమాధిన్
జోలుత మని, యొడలు విడిచి పూర్ణుం డయ్యెన్. 65

క॥ కలకర్తా కలకర్తా
విలపించిన దతని శోక విని, భారత మె
ల్లెడ సంతాపసభ, మహో
జ్జ్వలయతి చనె జీవగట్టు జాతి క టంచున్. 66

క॥ ప్రేమానందుడు శిష్యా
గ్రామణి సలిపి గురు వనిన గతి నెలకొలిపెన్
శ్రీమ త్తత్కసమాధ్యభి
తో మీమద్వేదపాఠధామము పురిలో. 67

క॥ వందించె సభ వివేకా
నందున్ శ్రద్ధాంజలిన్ ఘనము, పూనాలోఁ
క్రందిలెను తిలకు వాణి జ
పింద్రుడు జాతీయవాది హీర మ టంచున్. 68

క॥ అటు వేదాంతము నిటు ని
ప్పటి భారత రాజకీయ బాధాంతము నొ
క్కటె నుడి స్వామి పలికె, భూ
ఘటితనుతి యతి యత డుగురు కరణి న టంచున్. 69

ది॥ బాసాడి కాంగ్రెస్సభకుఁ దిలకు చనె
నా సభ కరుదెంచె నరవిందఘోషు. 70

గీ॥ పూర్వజన్మఁ దపస్వి, యిప్పుడు వచస్వి
యా "యహమ్మదాబాదు" పురాభిరామ
కాంగ్రెసునఁ బల్కెఁ దొడగె నగ్రాసనాధి
నాథుడు సురేంద్రనాథ బెనర్జిబాబు. 71

శా॥ న న్నధ్యక్షునిఁ జేసినారు సభ కీనాడున్ హితుల్! పెద్ద లు
న్న న్నాకన్ననుఁ, గార్యదక్షతఁ బ్రథన్ మర్యాదఁ గూర్మిన్ బ్రజన్
వెన్నాడించిన నమ్మకమ్ము కలవాడే నేత, లేకున్న వా
డన్నందాలనుఁ లేత, నేత నని న న్ననొ్కందుఁ బీఠమ్ముకై. 72

పృథ్వీ॥ శరద్ద్విగుణశోభలో వఱలెఁ గాంగ్రె సేతత్సమన్
బరిశ్రమసమాకులం బగు నహమ్మదాబాద నై
పరిశ్రమము లంగకవ్రజము రాజకీయాఖ్యమౌ
శిరంబు గల దేశలక్ష్మి, కివి పాయుతన్ గార్శ్యమున్. 73

గీ॥ క్రాలె నిరుడె పారిశ్రామికప్రదర్శ
నంబు కాంగ్రెసుతోఁ గూడి, నవ్యభావ
విపణి శ్రీబరోడేంద్రు డావిష్కరింప
నీ ప్రదర్శనము ఘనత కొప్ప మంచె. 74

మధ్యా॥ పసితనమ్మున నున్న వివిధవస్తు పరిశ్రమములను
కసి యేమొ! పెంచదు ప్రభుత కనలేదు తా ననినట్లు
పొసగించి భారతవస్తువుల ఘనోత్పత్తిని మన
మెసకొని కొనవలె వీనినే దిగుమతివానిబదులు. 75

క॥ నవజీవనమునకును వ
స్త్రవితతకిన్ రంగువేయు చతురత్వంబున్
భువికెల్ల ఘూర్జరమె నే
ర్పె, వేయు నిక రాజకీయరీతికి రంగున్. 76

గీ॥ అగ్గిపెట్టెలో నిమిడెడియట్టిది, యుద
కాంతరమునుండి కాన్పించునట్టిది వస
నంబు భారతము క్తంబు నలుదెసలకు
లంకణముల మనుగుడుపు లయ్యె స్మృతులు. 77

గీ॥ రాజకీయనపుంసకరాజి యైన
మన కిపుడు వృత్తికళయును మంద మయ్యె
జబ్బులనుఁ బాయ మనపడు శ్రమము చక్ర
వృద్ధితో లాగికొనదొ సమృద్ధశక్తి 78

గీ॥ విశ్వవిద్యాలయనిబంధవిధుల మా
రెంచి యొక సంఘమును నియమించినాఁడు
నేఁడు వైస్రాయి, వాని కండిచ డిన
పెక్కు సలహాలు కలహాలు పెంచునవియు. 79

గీ॥ వత్సరముల బరువు మోసి వంగి జను
లెన్నఁడును తమ గొంతు విన్పింపని జను
లేర్పడినిఁ గొల్చు జనులు, ముస్లిములు, కంఠ
నిభృతరవమునఁ దెగడిరి సభల వీని. 80

క॥ ఒక కి డొక మేలున కొ
ను, కద బించినవి మతులు నుడులు ముసల్మాన్
ప్రకరములవి మనవియు నీ
మొకరిదొరల విధుల నెదురు పూన్కి కుదురుగా. 81

చ॥ అమవసనాటి చీకటుల కందవు పున్నమినాటి వెన్నెలల్
క్రమ మిది భారతీయుల కగమ్యము కానిదె కాని నేటి సం
తమసమునందు దీపముగఁ దక్కిన దున్నతవిద్య యొక్క చే
యమితథనైకసాధ్యమగునా! యదియుం, బ్రజపాట్లు చెప్పనా! 82

గీ॥ పలుకుడకొక్కలు పురపరిపాలనము స
మున్నతము విద్య యాంగ్లవిభుత్వ మిప్ప
టి కిడిన వరంబు లివ్వి, నేటి విధి విద్య
బహువిషయపుస్తకం బౌనా! పతిత వెడగు. 83

గీ॥ ప్రభు వనుమతింపనిది పని ప్రజకుఁ గాదు
ప్రజ యనుమతింపనిది యట్లె ప్రభువునకునుఁ
గా ద టంచునుఁ దెలియుఁడో! "కర్జను"దొర
సామిగూఢము నడత, యాగామి వ్యాఖ్య. 84

గీ॥ అంత విద్యావిషయికసంఘాంతరమున
హైందవు డొకండె, దేశమం దధికసంఖ్య
ప్రజ నడపు కళాశాలలు, వానిఁ బ్రభుత
యర్ధదూరములనుఁ జేత యబ్బురంబు. 85

క॥ విద్యార్థు లెన్నుకొనియెడి
హృద్యులకున్ దావులేక యేల్బడిచే సం
పాద్యం బగునేమొ "సెనేట్"
మద్యము త్రాగినది కోతి మన దశ యొకచే. 86

గీ॥ జీవిలో జీవి జీవిద్వారా వెలుంగఁ
జేయు జీవము విద్యనాఁ జెలగు ననుచుఁ
బలికె డాక్టరు "త్రింగ్" దీనబంధు వగుచు
దీన బంధముఁ గలిగిన దేశికుండు. 87

గీ॥ విద్య నరికట్ట కందఱు విత్త మది య
టంచు సెలయేటిఁ బలె దాని నరయఁగలడొ
దానఁ గర్ణను దానరాధాసుతుండు
తద్రహితుడొ! యహితుడు బాధారతుండు. 88

గీ॥ లేమి భారతమందుఁ దూలింపలేమొ
మనము దానిఁ బాలింపకయునికి తగవు
"లార్డుజార్జిహేమిల్టను"లపిత మిద్ది
లేమి తొలగద, ప్రభుతయు నేమి యనద. 89

మధ్యా॥ కమిటీలను కమీషణులనుఁ గల ఘనోన్మేషణప్రభుత
క్రమ మిది భారతదైన్యరాహిత్యమున కని తెలుప
కమిటీని వేయ దేలకో తన కథ తానెఱింగియొ తనవి
రమణమె కావచ్చు ననియొ! రాకుండుఁగా కట్టి యదను. 90

చ॥ కఱవులు వచ్చు వృష్టి తఱుగైయనివార్యము లన్నపల్కులం
దుఱవులు లేవు, భారతమె యొందునొ! దేశము లెన్నొ వానికిన్
గుఱియగుచుంట లేదొ!యవి గోడ్వడ వేల యిటుల్?వినా యవృ
ష్టి రగిలె హేతు విం కొకటి చేడ్వడి భారత మింత బెగ్గిలన్. 91

మధ్యా॥ ప్రజలకు దండన కలదు ప్రభుతకు ద్రోహము సేయఁ
బ్రజలకు ద్రోహము సేయు ప్రభుతకు దండన లేదు
గుజగుజఁ బన్నులు వేసి గుంజుకొన్న యొడమె సీమ
కు జరుప ధనధాన్యనిధులఁ గోల్పడి ప్రజ కలఁ వీఁదు. 92

మధ్యా॥ రూపాయలకుఁ గరెన్సీగ రూపము మాఱి చెలామ
ణీ పౌండ్ల మార్పున నగుచు నిన్నయున్న విలువ నేడు
రూ పఱి తమ సరుకులకు రుద్ధమై తగిన మూల్యంబు
పాపాయిల కెటులో పెట్టి పస్తులున్నారు భారతులు. 93

మధ్యా॥ పెరుగుట లేదు జనమ్ము విపరీతరోగమ్ములకు ని
కర మౌ చికిత్స యందక, జగాపోదువున భారతీయు
డురరీకృతోదాహృతి, యిటు లుండియున్ దిండిలేక మృతు
లరరె! లతులఁ గోట్లు, దీని కంతకు మూలంబు ప్రభుత. 94

గీ॥ తన ధనమును తనకొఱకుఁ దా వ్యయించు
కొనెడి యధికృతిఁ బ్రభుతలో జనత పొంది
నపుడె యీ పస్తులునుఁ జావు లంతము, లిది
యాపభ్రాతము చీక టన్నంత నిజము. 95

మ॥ ఇది యష్టాదశమంబు కాంగ్రె, సిది మధ్యేవార్ధి పోతం, బి కిం
త దవున్ బోవలయున్ దిమింగిలగిలాద్యవ్యాప్తమార్గాన న
స్మదభీష్టం బగు దీవిఁ జేరుటకు, విశ్వాసమ్ము రాణించు వ
ట్టుదలన్ జేరకయుందు మె ట్లటకు?గోట్లున్లేవు కార్యార్థికిన్. 96

క॥ స్నానము భోజన మటులన్
మానవజన్మాధికార మగు వో టిడుటల్
మానితుని రాజకీయస
దోనిష్ఠగ నెన్నుకొని కృతార్థుడగుటయున్. 97

గీ॥ బ్రిటనువిభుత యన్ మామిడివిరివినీడ
నందఱము నొకటిగ మన మమరుచుకొని
నట్టి కాంగ్రెసు దివ్యవరాయితంబు
చెట్టునీడ పెద్దది కాపు చిన్నదైన. 98

ఉ॥ కర్మమె ధర్మ మంచు, ఘనకర్మహితంబె మతం బటంచు నే
మర్మవిదుండు చాటెను, సమాధియు వేనిది ఘూర్జరంబు శ్రీ
వర్మముఁ జేసె ద్వారక విభాసిత మై మన నాయకుం డతం
డర్మిలిఁ బ్రోచు కృష్ణుడు త్వరాత్తఫలం బగునట్లు కాంగ్రెసున్.

గీ॥ ప్రజల వాణి దివ్యవాణిగాఁ గైకొని
వారు కోరినట్లు వర్తిలి, కడు
ప్రేమపాత్ర మగుచుఁ బెద్దరికమ్మును
బ్రిటనుప్రభుత నిల్వఁబెట్టుకొనుతః 100

వినో॥ అని మరియు నిజోక్తిగంధవాహ
మ్మున కెరటాల్ కెరటాలు కేకిసల్ గా
జన మను సరసున్ జగన్మనోజ్ఞం
బునుఁబొనరించెను ప్రోడ యా బెనర్జీ. 101

క॥ దెబ్బతినిన జాతికిఁ బెడ
బొబ్బయిడన్ గాక ధారపోలుపున వావా
దిబ్బడిగొనినను ఫలితము
బెబ్బెగ నరవిందు డెంచి విసుగున వినియెన్. 102

ఉ॥ హూణుల కొల్వుఁ గొల్వ మది నొల్లక నిర్వసు వయ్యు దేశ్యసం
స్థానము నందుఁ జేరి యొక సన్నని దా వదవిన్, గ్రమక్రమా
ధీనకళాలయాధిపత ధీధితి నొందెఁ బ్రసన్నకాకరుం
డా నరవిందసూరి యకళంకుడు, రోహిణి వాని భాషయున్.

క॥ అరవిందుడు బహుభాషల
నెఱిఁజదివినవాడు, చదివె నిగమమ్ములనున్
సరిక్రొత్త యర్థమును కొ
న్ని ఋఙ్నిగమమంత్రములకు నిర్ధరియించెన్. 104

క॥ అరవిందమున మరందము
లరవిందుని యాంగ్లకవిత నర్థమ్ములు, త
త్పరిశీలనమున ఝుంకా
రరవమ్ములె కాదు ఖేచరమ్ములు మనసుల్. 105

మధ్యా॥ "ప్రాతలాంతర్లకుఁ గ్రొత్తలాంతర్లు" శీర్షిక గాగ
నాతని గ్రుడ్డికాంగ్రెసెటు లధ్వప్రదర్శక మన్న
వ్రాతలు పత్రికన్ జదివి భగ్గుమన్నారు నాయకులు
వ్యాతత మిటుల నెల్లెడల వ్యాసప్రబోధ మాతనిది. 1C6

చ॥ తెలియనివాఁడఁ గాను ప్రజ తెల్వని తేటను పైకిఁ దేర ని
య్యలఁ గల సంస్థ కాంగ్రెసొకటే యని, దాని నిశాతముం బొన
ర్పు లలిఁ గడంగినాఁడ, నొకరో మరి యిద్దరో నాకుఁ దోడుగా
నిలుతురొ కాంగ్రెసీయఘననేతలు నా నుడి సార్థకం బగున్.

చ॥ నిలువరుగాక కాంగ్రెసుగణేయులు, వీ లయినంత వేగ నా
త్మల పరిశీలనంబునకుఁ దార్కొనుచో ఫలితంబు కొంత నా
పలుకు, బ్రిటన్విధాన మలవాటయి పెద్దలు రాజభక్తితోఁ
గలుపుచు దేశభక్తి కపకారము సేయునెడన్ సహింతుమే ! 108

మ॥ దయతో హోని యొనర్చుటల్ బ్రిటనుచేతల్, రాజకీయమ్ములో
నయిదాఱెయ్యవొ కొన్ని హక్కు లిడి జాత్యస్వాయితోద్యన్మహో
రయపూర్ణోద్యమ మార్తిశయ్యము నొనర్పన్ జూచు నవ్వారి తె
ల్వియ గెల్పున్ మనమల్పలాభమునఁ దృప్తిన్ గర్వమున్ జాటినన్

గీ॥ దేశమునకునిరోధముక్తి గలిగింప
నైంద్రజాలికశక్తి యెట్లనువుపడును ?
రొమ్ము విఱుచుకొవలయుచిత్రమ్ము నిదియుఁ
గాదు శాసనాసావిస్తరాదికంబు. 110

ఉ॥ తల్లియె యానొ ! యీ సవతితల్లి భ్రమన్ మతి నెల్లి దేవుడే
తల్లి గ వచ్చె నాంగ్లవిభుతాకృతిఁ బుణ్యము పుచ్చెఁ గాంగ్రెసై
యెల్లర కంచుఁ గొందఱు వచించినయంతనె, పారజూచి యీ
తల్లిని నేడు భారతమతల్లి దృశన్ గురిసెం బ్రశోణిమల్· 111

ఉ॥ అందఱు కూడబల్కికొనినట్టిది లండనుగుంపు,
ఊన్ దొగరొందనీకఁ నెఱఁ జెప్పచుఁ, జేయక యాస చంప కా
మందుడు కాదు నేను నిను మెచ్చెద నంచు నొక శ్లోకళ్ళఁ బై
కిన్ దెగనాడుకొఁ దెలియకిపొర కాంగ్రెసు నమ్మెనాంగ్లులన్. 112

క॥ మాన్యతరము కాంగ్రెసు చై
తన్యసరోవరము స్తబ్ధతామరుభూమిన్
శూన్యంబు రాజకీయా
ధ్వన్యులకు దగ యని చిత్తదార్ఢ్యం బొదవెన్. 118

మ॥ ఇది లేకున్నను తేజరిల్లఁగలవా రే యొక్కరో యిద్దఱో
యిది కాంగ్రెస్ ధ్వజ మౌనుడస్సిన సిపాయిఁదేర్చి పూన్పంగఁదో
హదముం బల్ప్రకృతుల్ చిగుర్ప,గుడి యా నాశామహాదేవి, కా
నిది విద్యాలయ మైకమత్యమున శిక్షింపన్ సమస్తప్రజన్. 114

మధ్యా॥ శ్రమపడినారు ఫిరోజిషామెహాతాదినాయకులు
తమ న్యాయవాదవైఖరులు తగు నని రాజకీయమున
నిమిడిచి, యైకమత్యము గడించెను కాంగ్రె సనుట క్ర
మము కాదిది గడించిన దొక మాటపొందిక, క్రియలేదు.

చ॥ క్రియ మొలకెత్తుచుండఁ బుఱుగే పయికొన్నది పక్షపాతులై
బయటకు రాయు సంకుచితభావతలమ్మునుండి నాయకుల్
గయికొన రెల్లరుం బ్రజలు కాంగ్రెసు నీ గతి నున్నదాని, దీ
ని యిపుడు పొల్పు పద్ధతికిసిన్ విజయోద్ధతి కెన్నొయామడల్.

ఉ॥ ఈ విధ మయ్యు నియ్య దొకటే గతి కాంగ్రెసు దేశమంతకున్
బావిగ రాజకీయజలమండిత మై, యిది యెండిపోవు లే
దే విషపూరితం బగును దీనిది యీ విధ మిట్లె సాగినన్
బావురు మన్న నా భరతమాత ననుం బలికించె నీ వడిన్. 117

చ॥ చులుకనగా మొ వైరి కిటుచొప్పన వాదుల నన్న బుద్ధితో
నలుగునొ!కాంగ్రెసీయుడు, నిజాత్మయె వైరికిఁ జోటటంచు దు
ర్బలతయుఁగల్పుగోల్ క అవుస్వార్థముమాంద్యముభీతిస్వీయముల్
బలగము వైరి కంచు మది బాగుగ నమ్మి యతండు గెల్పుతన్!

ఆ॥వె॥ ఇటకు బ్రిటను నుండి యేలవచ్చు జనంబు
మొదటి నీట వచ్చు, మొసలిమచ్చు
వారి దరియక మన ప్రజలకు మన పూర్ణ
వాంఛ వినుప జయము పింఛ మెతు. 119

ఉ॥ ఏనును నంత మోటుగ వచించుట లేదు మదీయభ్రాతలున్
దీనిని నంత తేలికగ ధీ విడనాడి గణింపరాదు, స
న్మానముతోడఁ దూచినవి మద్వచనమ్ములు, కాంగ్రెసీయు లిం
తేని విమర్శనమ్ము సహియింపరొ సంస్థకు మూత సొంపగున్.

గీ॥ ఆయుధవిమర్శనముపైని యాహవము, త
దాయుధమ్మున వీ లయినంత పనిఁగొ
నుట ముదావహము, ప్రశాంతి న్యూన మగును
పాలితుల పాలకుల కత్తిపదునువేళ. 122

క॥ ఇపు డిట్టి వేళ లేదు, స
ఖ ప్రయత్నమ్మునకు జోలఁబాడిన దాంగ్లే
యపరిచితవిధానమ్మున
సపరీక్షాత్మావలోకసమయము వచ్చెన్. 123

క॥ ఇటులే కొనసాగునొ యీ
ఘటనమె, యంధుండు నడుపగా నంధుని వా
రెటులన్ గోతిం బడుదురొ
యటులే నాయకుడు ప్రజయు నస్మద్ధరణిన్. 124

గీ॥ హృదయపూర్వకసక్తిసంప్రేషితధ్వ
నంబు నెఱుగదు నుడి, సంస్థ నాటుకొన్న
పద్ధతులు కా వయా క్రమబద్ధములు! వి
నాయకులు కాంగ్రెసున నున్న నాయకులును. 125

ఉ॥ మాకును కొన్ని హక్కులను మాదొరలార! యొసంగు డంచు నా
జూకుగ నల్పసంఘజనచోదకులై బ్రతిమాలుచుం బ్రజా
నీకనినాదమున్ గొలువ నేరనివారల కాంగ్రెసెట్లు జా
త్యైక మగున్? దదీయములు ధ్యేయములున్ జటకావిహారముల్.

క॥ అంధజనమునకు మార్గము
నంధులె చూపింతు రిట్టిరై నేతలు ని
ర్బంధమున నొప్పికొనవలె
నంధులు కారు కల దొక్క యతి యటంచున్. 127

ఉ॥ ఖాయము దీని కున్న దొక కన్ను, మహాంధము కాదు, కాని జా
తీయము గాదు కాంగ్రెసు, పదింబదిగాఁ బ్రజపేరు చెప్పఁగా
నే యగునా ! ప్రజల్ తెలియరీ సభ యున్నటు,లా ప్రజేచ్ఛ యే
మో యసలే యెఱుంగ దిది, మోసమున న్నిజమంటు కావలెన్.

మధ్యా॥ మేము ప్రజాప్రతినిధులమే కాక కాంగ్రెసధికృతి
నోమింతుము, ప్రకటించెదము సుష్ఠుగ యోజించువారి
శ్రీమదాశయముల ననుచుఁ జెప్పె సమితి నొక నేతృ
సోముడు, ప్రజ యెటు లౌను సుష్ఠుయోజించువార లన? 129

గీ॥ వార లౌదురు తనవంటివారె యాంగ్ల
రాజకీయవస్త్రాదిక ద్రవ్యములను
దిగుమతి యొనర్చి భారతదివ్యసంస్కృ
తి నణచెడువారు, ప్రజ కింత తెలివిలేదు. 130

మ॥ తగ నేకాకియు నేకపక్ష మయినంతన్ దాను జాతీయ మె
ట్లగు మేధావుల దైన కాంగ్రెసు ? పరీక్షాశేషదేశప్రజం
బుగఁ గావచ్చు, మరెప్పుడోయది ! మిధోభూపోక్తులన్ జూచి నే
తృగణం బగ్రఫలార్థి యైనపుడు నిర్భృత్యుక్తి యైనప్పుడున్. 131

ఆ॥ వె॥ బిందువు కృత మయ్యె, సింధువు కర్తవ్య
మయ్యె, బరువు చాల దయ్యె, నిన్ను
తూచినాము కాంగ్రెసూ! చపలుల వార
సూ! శివోక్తి యిదియుసూ! శ్రుతంబు. 132

మ॥ కోఅలెజా వాదిగనిండియా, యెదిరియాంగ్లోయిఁడియావాద మ
య్యారె!కాంగ్రెస్, మెహతాదులెందఱోవకీళ్ళా! లండనే జడ్జి!ఫేమ్!
విటిగెన్ వాదము పెక్కుమంది యగుటన్ బ్లీడర్లు, మాట్లాడనీ
యరుగా! వాదిని, గెల్పు గంటవని తా నైవాది వాదించుకోన్.

గీ॥ వాదబలము లేదన్నట్లు కాదు, న్యాయ
వాదు లాత్మీయులే, కాని పేదవడిరి
శక్తిలో నుక్తిలో, జాతిశౌర్యమునకుఁ
కోర్టునన్ దీర్పు వలయునో! క్రొత్తవింత. 134

గీ॥ వ్యాధితశాఖాలశమనము కాదు, వలయు
దాని నిర్మూలనము, దెబ్బ తప్పుకొనుటె
కాదు, కొట్టవలెన్ బోర, వాది బ్రిటనె
యుండియా కాదు, మన దోష మిటనె కలదు. 185

ఉ॥ ప్లీడరు లీడరైనపుడు పెక్కులు చిక్కులు, న్యాయశాస్త్రముం
బీడితముం బొనర్పక లభించినదానికె తృప్తి నొందుచో
నేడులు నూఱునైన మన మెక్కడ నుంటిమొ యక్కడే, చలం
బోడునొ? యన్న నోడదు, బలోత్థము, జాతియు లేద యోడినన్.

గీ॥ శబ్దకోశమునన్ దక్క శౌర్యము గన
నట్టివారు నాయకు లౌట యప్రతిష్ఠ
రత్నమునఁ గాంతి ప్రజయందుఁ గ్రాంతి పెచ్చు
విద్ధమై బుద్ధమై యది వెలికి వచ్చు. 187

మధ్యా॥ బ్రిటనుదేశచరిత్ర నధికరించి యటులే భారతంబు
స్ఫుటితాధికార మగు నను పొల్లె కాక సకలదేశ
పటల మింతియ యని నేతృపటువు ఫిరోజిషా పలికె
కటుశబ్ద మిది, యసత్యమును, కావచ్చు బ్రిట నట్లు. 188

గీ॥ అమెరికాయిటలీలకు నట్లె యౌనె?
యేడువందల యేండ్లు సాధింపలేని
రాజకీయవిప్లవమును తేజరిల్లఁ
జేసికొనదే! యయిదువేండ్లఁ జెలగి ఫ్రాన్సు. 189

మధ్యా॥ గ్రహియింపగలము వస్తువును గంగామహాప్రవాహమున
గ్రహియింపలే మలంకారఘనబెర్క్వాచనమున
సహియింప మతని పల్కెంతొ సౌందర్యవంత మాంగ్లజన
సహజసంస్కృతి యన, మరియు సరిపోవు నది మనకు ననిన.

చ॥ ఒకడు పదేండ్ల నేర్చు చదు వొక్కరు డొక్కటె యేట నేర్చు, నీ
రకముగ వాలసమ్మునఁ ద్వరన్ బ్రజరాజ్యము లయ్యె దేశముల్
చెకపికలాడె నిం దెదియొ చెల్లక యయ్యది మందయాన మౌ
నౌనొ! మన త్రోవ చూపునది, నొచ్చెను దేశము కాంగ్రెసీయతన్.

క॥ పొరపడి నడచెడు నడతకు
మఱకువయే మందు, ఘనతమాశయములనుం
బరికింతురు వ్యాపారపు
సరళి నెవరో వారితోడ జత వలదందున్. 142

ఉ॥ కాలమహాప్రవాహమున గడ్డి నృపత్వము గాగ భారతే
రాలసితమ్ముగాఁ బ్రజల రాజ్యము సాగును, దీని శోభ కా
వాలము సర్వసామ్యము, సభన్ మొరపెట్టెడి సొరదూరగుల్
వైశము రోమనుల్ పగిది వర్తిల నేర్తురుగాత! మింతటన్. 143

గీ॥ ఒప్పుకొందు మంధుల మోచు నొళ్లు దగ్గ
రుంచుకొని దేశభక్తి కుదించుకొని కృ
తకము నెగ పెంచుకొని మెహాతా ప్రజకు ప్ర
బోధ మిడఁ దగు రోజిది కా దనంగ. 144

చ॥ అనభిమతంబు విద్య తన కంటకయుం బఠియించువానితో
నెనయును దేశభక్తిఁ బ్రకటించెడు కాంగ్రెసువాడు, పెద్ద, నే
ర్చెను కొడు కుద్ధరించు నని ప్రీతిలి యాసల మోసల న్నిరీ
క్షణ మొనరించు తల్లి మది గాసిలదో! భరతాంబ వీనిచే. 145

ఉ॥ మాత కుమారులన్ దడవి మ్రాన్పడి పెంచితి నేమి భాగ్య మ
మ్మా! తని గుండె రొమ్ము తత మయ్యెను, పట్టియుపట్టనట్లె మేల్
సేతయు, వీరు పొంగి పనిఁ జేయరు, తెల్వికి వేడి రాద, యే
మాత్రము తెంపు లేద యని మాన్యలతోఁ జెలియం డతో ననెన్. 146

గీ॥ నీరమో కావలసినది నీటి నుఱుగొ
నీర మది ప్రజారాజ్యము నియుతమేని
తదితరంబు సంస్కరణకదంబ మెల్ల
వట్టి నుఱుగు, దానఁ దగ యెట్టు లరుగు? 147

గీ॥ దేశమునకు మీ రిప్పుడు తెచ్చినట్టు
లెంచుకొనుచున్న యా కీవి యెండమావి
యనెడువారి మనము తిట్టుకొనుట తాల్చి
మనము మన కండ్ల దుము కొట్టుకొనుటె యగును. 148

క॥ పెఱలు వలె మనల మనమే
పరిగ విమర్శించికొని లసత్పథగమనం
బురఁ దొడరినపుడె విజయం
బరపైఁ బాతికయుఁబలిక యధిగత మయ్యెన్ 149

ఉ॥ ఏలుబడిన్ విడిన్ బ్రతిఘటించుట తోడుత రాజకీయముల్
మూలము ముట్ట వేర్చి జనము న్నడపింప సమర్థు డౌచు నీ
నేల కొఱకందు కావలయు నేత నెపోలియ నట్లు, వాని దౌ
శీలము కాంగ్రె సూనవలె శ్రీకరు డట్టి డొకండు లేమిచే. 150

ఉ॥ భారతపాలనమ్మునకు వచ్చిన హూణులు పెక్కు రల్పసం
స్కారులె, యేతదాతపము గాంచని కన్నులవారు తక్కుగా
వారయుచుందు రిచ్చటి జనంబును స్వర్గమునుండి యుందుఁ దా
మూరడిఁ బాపగా దిగితి మంచుఁ, గులీనులు నంద్రు కొందఱున్

ఉ॥ వీరలలోన 'హ్యూము' కురువిందము, ధైర్యగుణమ్ము 'రోము', ని
ద్రారతిఁ బాపి భారతు కరమ్ము గరమ్మునఁ బూని యల్లదే!
దూరమునందుఁ జూడు భవదూర్జితగౌరవతేజ ముజ్జ్వల
త్తారల మధ్య, తూర్పునకుఁదారె, నిటన్ దిగు నంచు వాకొనెన్.

ఉ॥ భారతతేజమున్ ధరణిపై దిగఁ జేయగ నైన యోగము
న్నేరుప డయ్యెఁ దా నెఱిగి నిర్మల "నార్మను" జాతిశౌర్యరే
ఖారుచిరుండు హ్యూము, తనకాంగ్రెసుకప్పటి పాఠమంతె యా
వే! రచియించి చూపవలదే! మొదలే పరిపూర్ణరూపమున్. 153

చ॥ అమితము తా నెఱుంగును క్షుధార్తి నిటన్ జనతాంత్రదృష్టి, వ
ల్వ మడచి పైని బిగ్గ ముడివైచి బిగించిన చింపిరయే బ్రిటన్
క్రమణము భారతమ్ముపయి కాదనరా దని తా నెఱుంగు న
గ్రమహితుడైనహ్యూంహితుడుకత్తెఱ సేయుకయుండెకాంగ్రెసున్

చ॥ ప్రజలను చేతఁబట్టి, కృతభాషలుగాఁ గృతశక్తిభూషలున్
భుజయుగరుద్ధమోషులుగఁ బొంపెసలార్చి, యిడుండి! రాజకీ
యజనితసర్వభాగ్య మని యార్వడ హ్యూం, బ్రిట నీదొ వెంటవే
గజగజలాడి, భారతికిఁ గాదొ వతంసము వాని నామమున్. 155

మ॥ ఎవఁడె న్నన్న విధానబద్ధుడను సుమ్మీ! యన్నచో వానినిన్
దెవడంబోదు, తదిచ్ఛ కో ననదు కాదే యంచు వాకోదు, పా
ము వలెన్ జుట్టుక నందడిన్ గదలిపోవున్, హత్యాము గుర్తించెనాం
గ్లవిభుత్వంబును, మిన్నకుండె నత డేలా? జ్ఞాత మ వ్వానికే. 156

ఉ॥ దాని కిరీట మయ్యదియ దాల్చుఁ బ్రజాశిర, మీ యహంకృతి
స్థానము సంస్థ కాదు, తొలి దౌ వడిదెబ్బనె యుక్తిసీల నెం
దేని బిగించు స్పష్టసులభేద్యసుయత్నమువాడు నుద్యమ
ప్రాణమెఱుంగు హత్యాము పోరపాటుపడెన్ దొలిమెట్టుదాటడున్

చ॥ అని యరవిందఘోషు తొలి వ్యాసకదంబము పత్రికాముఖ
మ్మునఁ బ్రకటించె, మెచ్చి యలవున్ జనసైన్యుడు లోకమాన్య వి
య్యనువునఁదోడెసంగబహిరంగముగాఁ బ్రజఁ గూర్చి యుద్యమ
మ్మున గెలువంగవచ్చు నని పొంచె నొకానొక పుణ్యవేళకై 158

క॥ అరవిందఘోషు తిలకున్
బరిషద్బహిరుచితతలసమాసీనులు గా
నరవిందు డనె మహాశయ !
కలకుదనము స్వప్నవార్త కాంగ్రెసుసంస్థన్. 159

ఆ॥ వె॥ తావకీనకీర్తి తావక కేసరి
పత్రికాముఖాభిభాషణమ్ము
చేరె నాకు, రెండు చిమ్మించెఁ గస్తూరి
యేకరీతిసురభి లోకమాన్య! 160

మ॥ మిముఁబోంట్లన్ గన రత్నగర్భయనభూమీదేవి యొప్పొందె, త్యా
గము నేర్పన్ గురువౌచు మాకు ప్రభుతన్ గద్దించి మాట్లాడి బం
ధములన్ సైచిన తావకప్రకృతి, విద్వద్వర్యవార్యత! వా
క్యమునందేని బలప్రదర్శనము మృగ్యం బైన యీ వేళలన్. 161

ఉ॥ నీ వొకరుండవే మగడు, నీవలె పంచనదేంద్రు డొక్కడున్
గావలె, తక్కు నేతలకు కావలె మగ్గములే స్వతంత్రతల్
గావు, నరోత్తమా! నడవఁగాగదవే ప్రజ నెల్ల సంయుగ
జ్యావిలసత్స్వరాజ్యవిజయాభరణారుణరత్నదీప్తిగా. 162

చ॥ మునగను చింతగాఁ దలతువో పడిపోదుము దాని నెక్కి,యి
యయ్యనువునఁ గాంగ్రెసట్టిది మహోమహా! నెత్తిని నోరు పెట్టు కొం
తో నొడివి వ్యాసధార విరతుండను, మానస ముచ్చిపోవు వ
ల్కిన కది యంద కున్నది,యకుంఠిత మీవు శ్రమింపకుంటి వే!

మధ్యా॥చెవి నిలఁ కట్టుక పోరి శీఘ్రమే ప్రతిపట్టణమునఁ
బవిసమయువకఁసంస్థలను పాదుకొలిపి శిక్షణంబు
నవశస్త్రవిద్య నందించినయెడ నాయుధము లార్జించి
బవరమునఁ బ్రభుతన్ మనము పడవేయ వాలుగాఁ దలతు. 164

ఉ॥ ఆ సమయమ్మువచ్చుదను కాగక మీరును మేము కూడి నా
నాసదుపాయముల్ తగ జనమ్మునఁ జేతనఁ బెంచి గోష్ఠులున్
వ్యాసములున్ స్వతంత్రకు ప్రష్ఠము లౌచుఁ బరాక్రమింత మ
య్యా! సమరంబునం దవగతాయుధమం దరిభీషణంబుగా. 165

చ॥ అన నరవిందబాబు! యిపు డన్నది మిక్కిలి బాగు, గోవుగాఁ
గనబడు వ్యాఘ్రమంచుఁ బ్రజగాంచినవాడు ప్రభుత్వముత్త్వమున్
జొనిపి ద్రుధాతువున్ శరణుజొచ్చును, మున్ బవరంబు వీగిపో
యెనుప్రజతోడులేమినెయహీనబలాఢ్యులుయోధు లైనమన్. 166

ఉ॥ ఎల్లసిపాయిదండు నొకచేసమయమ్మునఁ దాడిసేయమిన్
బుల్లసిలెంగదే! జయము పూర్వము, నేడు నదే సమస్య, యే
వల్ల లభించు శస్త్రములు? వ్యర్థుడ నైతి దొడంగి, యీవు నే
నెల్లిద మౌదు మీ యువకు లేగరొ యస్మదనుజ్ఞ చొప్పునన్. 167

ఆ॥ వె॥ ఒకటి సేయ బోవ నొకటి కావచ్చును
సంస్థలందు యువకజనము వ్యష్టి
హాణహత్యవలన నురిఁ బడవచ్చును
దాన నుద్యమమ్ము తగ్గవచ్చు. 168

క॥ నీవో నేనో చెప్పక
యేవాడున్ గాల్పరాద యేల్బడివారిన్
పోవడి యిది మన యువకుల
లో వెలయకయున్న సమితు లొప్పవు సఖుడా! 169

చ॥ అది యటు లుండెఁ గాంగ్రెసు సమర్థమె యైనను రాజకీయపుం
ఖదును ప్రజాగృహీతము నొనర్చుట కెవ్వటికేని దానిసే
కుదు రగునట్లు సేయవలె ఋణము నీయది వ్యాసమాలలో
నిదియ పఠించినాఁడఁ దగవే యది తత్పము మొండు లేమిచే. 170

గీ॥ ఒక పనికి బుడ్డిదీపమె యొనరుఁ గాని
యెన్ని బుడ్డిదీపము లైన నేమి "గ్యాసు
లైటు" కాదు, కాంగ్రెసు గ్యాసులైటు దాని
వెలుగునందు స్వరాజ్యపుఁ బెండ్లి విందు. 171

చ॥ మనలను వీడినన్ మనముమాత్రము వీడము కాంగ్రెసున్, బ్రజన్
గొని పురిగొల్పి కాంగ్రెసునకున్ గల కంపము దీర్చి దీనిచే
సునిశితభాష దెల్పెడికిఁ జూపుడువ్రేలును చూపి యూపున
ట్లొనరిచి దీని కంపము మహోదయ! దానికి మార్పకుందు మే! 172

క॥ నీ బలగమె నా బలగము
నీ బాసయె నాదు బాస, నీ బాటకును
న్నా బాట కలియు నరవిం
దా! బృంహితసుగుణబృంద! యని తిల కనియెన్. 173

క॥ అరవిందువైపు కొందఱు
మరుసమఁగాంగ్రెసున కేగ మదరాసుపురిన్
సురుచిరనాయకవాచన
విరచనములు వినిచెఁ గొంత వీనుల విందై. 174

గీ॥ విశ్రమించి లేచినవాఁడు వేగ ముందు
వాని పరుగిడి యందుకోవచ్చునేమొ!
రాజకీయమ్ములనను కళారంగమందు
సాధ్యపడదు నిత్యాశ్రమస్థలము లివ్వి. 175

ఉ॥ సాహితిమగ్నుఁడై గడపె సంసదధీశుడు కొన్నినాళ్ళు "లాల్
మోహనఘోషు" రాచరికపున్ దలపుల్ విడి, రాజకీయయో
గీః హాసదూ! య టంచుఁబలికెన్ మెహతా యుతనిన్, వచస్వితా
దోహలి యీత దెల్పడి నెదుర్పని యందఱు జోగులేయనెన్. 176

ఉ॥ మోహనఘోషు వాఁడౌనె వపుర్వ్యసనమ్ముల వైభవమ్ముతో
మోహితముం బ్రజన్ సలుపు ప్రొద్దులు పోయినవండి! సూరి రైఁ
బాహిరపెట్టునో పిహితభారతధైర్య మెవండు వానిదే
యా హసదన్నవర్ణనము, హాస్యములన్యులమెచ్చిపల్కుటల్. 177

ఆ॥వె॥ రాజకీయ మనగ రాజ్యానఁ బ్రజలకు
బాగుగూర్చుసేత, యోగి యనగ
స్వార్థరహితవృత్తి, ప్రజలార! న న్నెంతొ
గౌరవించె నిటులఁ జీరి మెహత. 178

క॥ "క్లికుక్కలు" టక్కులు నెక్కువ
తక్కువలున్ రాజకీయ ధర్మము అగుచో
మక్కువసేయని మాదృశు
డెక్కడనో దాగియుండుటే యుచిత మగున్. 179

ఉ॥ బైటకు లాగినారు నను పల్వురు మిత్రులు నేడు, వారికిన్
గాటముగాఁ గృతజ్ఞుడను, కాని కృతఘ్నుఁడ నౌదు నొక్కటే
బాటనుఁ బట్టి నాయకులు వర్తిలరో ప్రజమేలుగూర్చి యా
రాటముతోడ, నేలుబడిబాగకుఁ జక్కగ బుద్ధిఁజెప్పరో, 180

గీ॥ నీరు లేకగాలికిఁ బండునెట్లు పంట?
కర్మ లేక వాగ్ధాటికిఁ గలుగు నెట్లు
రాజ్యమందుఁ బ్రజాస్వామ్యరమ్యశోభ?
దీని నెఱిఁగి నాయకులు వర్తింపవలయు 181

ఉ॥ వేనిది వెండితీగలును వెన్నెలతీగలు జుట్టు? దేశసే
వానిభృతాత్ముడై ముదియువానిది, వేరొకఁడైన వారపి
చే నెఱు లౌను, విశ్వసుఖజీవనపావనభావనాయుతుం
డే నరశబ్దవాచ్యుడు, నుతింపము వానరశబ్దవాచ్యులన్. 182

గీ॥ అల్పసంఖ్యాక మను మాట నధిగమించి
కాంగ్రె సిరువదియవయేటి కళుకు లొఱికె
నల్పసంఖ్యాకులైన మహర్షులెకద!
భారతమునకు దీపాలు పట్టినారు. 183

గీ॥ కాళిదాసాదికవికావ్యఘట్టము గొని
యెంద ఱెంత సొగసుగ విరచింతు రేని
వారి సాహిత్యవృక్షాన ఫలములే గ
దండి! తొలివారు మలివారు నల్లె నుండి॥ 184

గీ॥ బిరుదు లిడి బిరుదులు గని పీట వేసి
పదవులన్ దగువారలఁ బెదవిఁ గదవ
నీద నీ దయ యను మడినిన్ వినా ప్ర
భుత్వ, మట్టిరు నిందు సభ్యులును గలరు. 185

గీ॥ ప్రజల కాంతకుఁ ఛత్రము పట్టదేని
కాంగ్రెసునకు నాయుఃకాలగణనము కల
దిది ప్రకాశించుగావుత, మిందుబింబ
సఖ మగుచుఁ గాల్చనిది శిఖజ్వాల యగుచు. 186

గీ॥ కంచుకంఠము, నూఱు నాల్కలును వదన
శతము మృత్యువు నెదురించు శ్వాసకోశ
మివ్వి కావలెఁ బ్రజను దీపింపఁజేయ
"వర్జిలు" క్తి "సైబిలు" సూరి పలికినట్లు॥ 187

ఉ॥ నల్లనినీటియేట నృపు నైననుఁ బీడక నావఁ జేర్చి యే
బల్లి టు డేనియున్ దిరిగి వచ్చుట లే నటు లావలొడ్డునన్
జల్లగ నుంచు నావికుడు జల్లెడ చేసిన నేమి కాంగ్రెసున్
పిల్లలు వెళ్లి లే నటులు చేర్చిరి పెద్దలు నై శుభంయువుల్. 188

గీ॥ యువకులార! పునాదిపై నుప్పరిగ వ
మమ్ముగా యుష్మదీయభావమ్ముపైని
భావిభారతకల్యాణభరము కలదు
ధర్మ మిది యని చెప్ప మా తరము కాదు 189

ఆ॥వె॥ పారితోషికంబు పదికోట్ల వరహాలు
కోటి బిరుదు లైన సాటిరావు
ప్రజల భావమునకుఁ బరిపోషకం బైన
వర్తనమ్ముతోడ వాక్కుతోడ. 190

ఆ॥వె॥ తన్ను తప్పుపట్టు జనముమాట న్నిజ
మరసి కోపపడమి మానవత్వ
మవును, తన్ను తానె సవరించుకొనుట దే
వత్వ మవును, దానవత్వ మెదురు. 191

క॥ జాతీయతతో నంత
ర్జాతీయత సర్వవర్ణసమత యొకరి వౌ
వెత సుఖమును తనవే యని
మతి నెంచుట ప్రగతియందు మానవగుణముల్. 192

గీ॥ ప్రభుత మన్నింపవలయును ప్రజల నుడి ను
పాయనీభూతరత్నమ్ము చాయఁ, జదువు
గౌరవించిన మెదడునఁ గోరవోవ
రాదు బుద్ధి ప్రజాస్వత్వవాదము విని. 193

మధ్యా॥ భారత మాతృసంతానబాధకుం డైన యాంగ్లునకు
ఘోరదుష్కృతికి దండనము కోర్టున తగినట్లు లేదు
గోరంత తప్పు సేయంగ కొండంతఁ జేసి దాని నిట
వారిని దండించి బ్రిటనువారిని మెప్పించు జడ్జి. 194

ఆ॥వె॥ సబబు తూచి యిచ్చు స్వాతంత్ర్యలక్ష్మికి
పెద్దకొడుకు కాడొ! బ్రిటనువాడు
వాని చేత పిదప దానె! భారతమందు
పక్షపాతమునకుఁ బట్టువడుచు. 195

చ॥ ఋజు వొనరింప కాగడము నేనినిగూర్చియునేని శృంఖలా
భజనముతీర్పు తప్పుగద! వానిదొ బాధ్యత తప్పుసేయమిన్
ఋజు వొనరించుకోగ, నిది యిందలివారిని కష్టపెట్ట నౌ
సుజనవిరుద్ధశాసనము చొప్పడె కర్జనువల్ల నేటికిన్. 196

గీ॥ జనులలో హంతకులు నలెగ్జాండరాది
"కై జ"రంతరాజన్యులు కర్జను తమ
కర్మలను దైవసంకల్పధర్మములుగఁ
బలుకు టెంత! విడ్డూరమో! తెలియరయ్య! 197

గీ॥ కలవు దేవుని దినచర్యగ్రంథకనక
పత్రమున కాటకమ్ము నిప్పచ్చరమ్ము
తన ప్రభుత వంగభంగమ్ము ననియె కర్జ
నరసివచ్చి సరిగాఁ జెప్పు మనుడు వాని. 198

గీ॥ ఇరుగుపొరుగులె యౌను నాగరకతయు న
నాగరకత, ఫ్రా న్సెనాడో నలిపి పాఱ
వేసె నవతల నిర్బంధశాసనముల
నేఁటి తెచ్చి బ్రిటను వాని నిందుఁ జేర్చె. 199

ఉ॥ పన్నులు పెంచి యీ ప్రజ విపన్నులనున్ బ్రిటనుప్రజన్ సుసం
పన్నుల నీ ధనమ్మున నొనర్చుట యిచ్చటి చేతి వృత్తులన్
దన్నుట దేవు నిష్ట మను నాలిక వైతరణీప్రణాళికా
ఖిన్నమటే! ద్విదేవు లొకో! వెన్నెడెనే మన దేవు డూబ యై

చ॥ తనువును రెండుచేసెడి విధమ్మున కర్జను వంగభేదమున్
బొనరుప నెంచె భావబలపూర్ణ భవద్వచనక్రియల్ రయ
మ్మున మదరాసురాష్ట్రజనపుంగవులార! యెదుర్చుమమ్ము గె
ల్పునవిలసింపఁ జేయుత! ప్రభుత్వమునున్ విరమింపఁ జేయుచున్.

గీ॥ పేదప్రజలు తిండికిమాడి బెగ్గిల నిటఁ
జేసె యువరాజపట్టాభిషేక ముత్స
వంబు వైస్రాయి ఢిల్లీపురంబునందు
కాకులనుఁ గొట్టి విం దిడె గ్రద్దల కన. 202

క॥ ఈ యుత్సవమున వ్యయిత
శ్రీ యిందలి కలవుఁ బాపి జీవం బిడదో!
కూయిడుచు బడుగు లయ్యో!
ఆయువు కలిగియును చచ్చి రన్నము లేమిన్. 203

గీ॥ గుడిసె జాతిజీవమునకు కోట యగుట
నుచితవిద్య గ్రామీణుల కొనరవలయు
గ్రామమునగ్రామమున నొండు గ్రాలవలయు
పాఠశాల చైతన్యాదిపీఠలీల 204

చ॥ అనియుఁ బునఃప్రసంగకరు డా సదళుకుడు మిన్నకుండె, నా
తని మృదుచాతురీభరసుధామయసూక్తికిఁ గేకిసల్ తగన్
జనము సమస్తముగా గెలసెఁ జల్లని సౌరభమందమారుత
మ్మునఁ బలె, వచ్చురచ్చుకు శుభోదయమైనది బొంబయీపురిన్. 

ఆ॥ వె॥ బాస యనెడి కత్తి దూసిరి వైప్రాయి
నడువడిపయినిన్ బెనర్జిగోఖ
లేలు, చెరిగిపోయె నాడు మితాతివా
దాంతరమున మున్న హద్దుగీత. 206

గీ॥ నిత్యకృత్యమ్ములో! పెక్కునిర్ణయములు
పూర్వములు, కొంత బెంగాలుభూమి వేఱు
చేసి యస్సాములోఁ గల్పు చేతకు నిర
సనముగాఁ గ్రొత్త తీర్మాన మొనరె నొకటి. 207

క॥ అది తక్క తక్కినవి తమ
కదివఱకే యవహసింప నైనవిగా సుం
త దనిసి రరవిందు హితులు
మది శుక్లప్రతిపదిందుమానిత మగుచున్. 208

# భవానీ మందిర ఖండము

శా॥ నిర్మాణాత్మక మైన తీర్పొకటియేని లేదు కాంగ్రెస్సభన్
గర్మం బీ గతిఁ గాలె నేటికిని సంగాతీ! యనన్ స్నేహితుల్
దీర్మానించెను వ్యాసరూపమున బోధింపన్ బలావాహనా
మర్మజ్ఞుం డరవిందఘోషు ప్రజకున్ మాతృస్థిరామోతమున్.

ఉ॥ వ్యాసము ముద్రితం బయిన స్వల్పమె కాలము పట్టు నెల్లెడన్
మోసుకపోయి పంచుటకు, మోపరు లెందఱో, పంచు మిత్రులున్
ఖాసిలు పల్లెలున్ బఠనపాఠనముల్ తగి దీన కేతకీ
వాసితముల్ వనమ్ము లటు, పత్రిక తోడ్పడె నొండు దినికై. 1

క॥ కేవలము వాచనమ్మున
నీ వైభవ మెట్లువచ్చు? నెందో యెందో
ప్రావృణ్మేఘము కురిసిన
యావద్భారతము పంట నందుకొనునోకో? 2

క॥ ఇరువురునున్ వారీంద్రుడు
నరవిందుడు కర్తలైన యావ్యాసముపే
రు రహించె భవానీమం
దిర మని, తత్సారఘంట నినదించె నిటుల్. 3

గీ॥ భారతి భవాని భారతాంబ యన నొకరె
యాయమయ శక్తి, ప్రకృతిరమ్యగిరిహృదయ
మందు నిర్మింపవలె నొక మందిరమ్ము
నామె, కర్పింపవలె నామె నందఱమును. 4

గీ॥ మందిరానుబంధమ్ముగ మఠము వలయు
బ్రహ్మచారు లా మఠమువారలు సమస్త
భారతీయవిజ్ఞానమున్ బంచిపెట్ట
వలయు వేఱై విదేశ్యుల కలత లేక. 5

క॥ కొందఱు దేశ్యులకున్, వీ
రందఱు కృతకృత్యులౌచు నా పదపడి పెం
డ్లిన్ దలపవచ్చు, నర్చకు
లుందురు కదలకయ, మాఱుచుందురు వీరున్, 6

గీ॥ ఈ జగం బను చక్రము నెవరు త్రిప్పు
దురు? భవాని, యా యమ్మయ దుర్గ కాళి
సృష్టికర్త్రి, భ్రమణమ్మున దృష్ట యామె
యొకొక్కకప్పు డీ జగతి నొక్కొక్క కళగ. 7

గీ॥ జాలి, త్యాగము, ప్రేమయు, జ్ఞాన మగుచు
దత్తదర్శనయును తత్తదవసరముల
యా రమాదేవి యా రాధ యా భవాని
శౌర్యజననిగ నిల నేడు శక్తి యయ్యె. 8

ఉ॥ కూపములోని భేకములకుఁ జత గాక నభః ప్రడీనముల్
రాపులుగుల్ బలెన్ గను జనమ్ము లెఱుంగు నసాధ్యసాధ్యగం
డోపలమూర్తులన్ రణమహోగ్రుల లచ్చిమికచ్చుసంతు యా
రోపుముఖస్థలాన దృశిరుచ్యుల శక్తిపదైకవాచ్యులన్. 9

ఆ॥ వె॥ వివిధవిధము వెలసె విజ్ఞాననిధి నూఱు
రెటు కన్నుల మిఱుమిట్లుగొలుపు
నాయుధములు భారతాప్రాప్తములు వేయి
రెట్లు, నేడు శక్తి యిట్లు విరిసె. 10

గీ॥ అంబయొడినుండి రాక్షసు లసురులు సుర
లెందఱో దూకుచున్నార, లిపుడు మాత
నిర్విరామమ్ముగాఁ గార్యనిరత, లేచె
నపరదిశ బలభూరిరాజ్యమ్ము లెన్నొ. 11

ఉ॥ నిన్నటమొన్నటన్ గదవె!నిండు స్వయంకృపి ప్రాణమై జపా
నన్నిట మిన్నుముట్టె మన యక్షుల ముందఱ, మ్లేచ్ఛశక్తులున్
గొన్ని తమోవినీలములు గొన్ని రజఃపరిధూమ్రముముల్ మొగి
ళ్లన్నటు లావరించినవి, యచ్చపు త్యాగమయార్యశక్తులున్. 12

ఉ॥ తల్లి, నిజావతారలసితాఖిలవ్రభ లిట్టి వయ్యె దుః
ఖిల్లుట తోఁచె నెందులకు? కేసరు లై తొలి భారతాళి కుం
దే ళ్ళపు డై నయందులకు, నిందున తన్ను ప్రజల్ దలంపమిన్
వల్లడి వచ్చినందులకు, వచ్చునె? యాయమ పిల్వకున్న చోఁ. 13

క॥ మన భుజముల హృదయమ్ముల
నణుమాత్రము తావు లేదయా! శక్తికి, నీ
తనువులు మాఱక యే మన
మనములు మాఱవలె, శక్తి మైకొనవలయున్. 14

ఉ॥ ఇందులకున్ గడంగితిమి నెన్నియొ సార్లు ఫలింపదయ్యె నే
చందము రాజకీయమును సాంఘికమున్ మదిలో బలమ్ము ని
ష్పందము గాక చేసెడి జపమ్ము విధమ్మున, నాది నైన పూ
న్కిన్ దుదిముట్టఁ గల్గ, మిక నేగతి శక్తి యనుగ్రహించెడిన్? 15

గేయ॥ బలము లేని జ్ఞానమ్మున బడుగుల మైనాము మనము
తొలినుండియు, త్రుప్పుపట్టె దొడ్డశక్తి యీ జ్ఞానము
తెలియక దానిని త్రిప్పుట త్రెంచికొంటి మవయవము, ప్ర
జ ! లికనైక పౌరుషంబె జ్ఞానఫలం బని తెలియుడు. 16

ఆ॥ వె॥ జ్ఞానమునకుఁ దోడు కావలె విజ్ఞాన
మట్లు గాక జాతి యణగియుండు
శక్తిహీన మైన భక్తియు వృథ యింధ
నంబు లేనిది జ్వలనంబు వోలె. 17

ఆ॥ వె॥ ప్రకృతిజ్ఞానకలన భాసిలి కర్మబ
లంబు కలిమి నియమలలిత మగుచు
మనసు నెత్తి యీశ్వరునిఁ జేర్పఁ, జేరిక
పాయకుండు దశను భక్తి యంత్రుడు. 18

క॥ బలహీనం బగు ప్రకృతి క
తులితం బగు భక్తి శక్తి దూరం బగుచోఁ
గలుగునె ? చుఱుచుఱ మండియు
వలతిరెయొః కాగితపు మంట వంటకు నిలువన్. 19

ఉ॥ కావున భారతమ్మునకుఁ గావలె శక్తియె, జ్ఞానశక్తు లా
పైఁ వలయున్, ద్రిరూప మిది భౌతికనైతికమానసమ్ముగా
నే విధ మౌ త్రిశక్తిఁ బ్రసవించిన దేదొ య దాత్మశక్తి, యా
నో విగతంబు శక్తి మన యొళ్ళను స్వాప్నికదృశ్యమొక్క చే.20

ఉ॥ కాలముతోడ శక్తి యొడికం బగు, సంశయమానసమ్మునన్
దూలినప్రాయ మై ముదిమితోఁ దపియించిన శక్తి వచ్చునా?
మే లొనరించునా ? యతడు మేదినికిన్, జడికారు పీనరై
చేలును శక్తివంతునకు శ్రీ లిడునా ? యిడు మన్న శారదిన్.21

మధ్యా॥ తల యెత్తికొని భారతంబు తా పదికాలాలపాటు
విలసిల్ల వలె నన్న వేగ వెలయవలయునండి! శక్తి
జలధిగ, వాహినుల్ పౌరుషాఖ్యముల్ వచ్చి కలియంగ
వలయు నిందు, జయమునురుగు వరవళ్ళు తరగలయందు.22

ఉ॥ ప్రాణము లేదు, భారతము రక్తము చచ్చి కృశించి పాండురం
బైనది, జాతికిన్ శరణ మైనది నారక మంచు షండులఁన్
హీనులు తామసుల్ వలికి రేని వినన్‌దగదండి ! కోర్కెకున్
మానుగ లబ్ధి కోరుకొనువే! యెవడేనియుఁ గష్టనష్టముల్. 23

గీ॥ జాతి యన్నను భారతమాత యన్న
తోలు కాదు మట్టియుఁ గాదు దోర్బలప్రభు
శక్తి, కోట్ల శక్తులు కూడి ఘోరమహిష
మర్దనీశక్తి విజయరమాప్రసక్తి. 24

గీ॥ ఆవరించె శక్తిని భారతాంతరమున
మాయ బ్రహ్మము నటులు తమోగుణంబు
జనచయాజ్ఞానరూపంబు, జనము నిజ మె
ఱింగినంతనె ! తమము దూరీభవించు. 25

ఆ॥ వె॥ స్వామి రామకృష్ణపరమహంసయు వాని
సింహకంఠు డైన శిష్యమణియు
సంయములు పగటిన శక్తి త్రింశత్కోటి
ప్రజకుఁ దొడవు, జయలువడుటె తడవు. 26

క॥ భూపాలునిలో నట్లే
గోపాలునిలో, దవుతొలగు నొక నరునిలో
నేప్రొద్దును నైష్ఠికు డగు
భావనిలో దివ్యశక్తి భాసిలు సమమై. 27

ఉ॥ క్రొత్తగ నేత సృష్టి యనుకోవలెనా ? కృతవస్తురతయున్
దుత్తునియల్ పొనర్చుటయునున్ సృజనం బనుకోను రాదొ ? యీ
మొత్తము జాతి దేవుని విభూతి, యెవండును దేవుడే మదిన్
జిత్తొనరించె మాయ యని చింతలకుండిన భీతి యొండినన్. 28

ఉ॥ మానితసర్వధర్మముల మానవజాతికి మార్గదర్శకం
బైనది భారతం బొకటె, భావియశోవలయంబు ప్రాగ్యశో
భానిలయంబు నియ్యెదియ, స్వాప్నికకల్పనగంబు కల్పటా
ధ్యానియుగంబు కన్నయది యతికిఁ దోచి ఫలాలు రాల్చెడిన్. 29

గీ॥ భౌతికాధ్యాత్మశాస్త్రశోభలను కలియఁ
బోసి వివిధమతమ్ములఁ బోగు సేసి
వండిన రసాయనమున నఖండమాన
వాత్మఁ బోషించునది యొక భారతంబె. 30

ఆ॥ వె॥ చెడుగుతనముపురుగు నుడిపి నీతిక్షేత్ర
ఫల మొసంగునదియు భారతంబె
యఖిలజగము నిదియ యార్యీకరించుఁ గృ
త్యాదియందు మరియు నార్య మగుచు. 31

శా॥ ఆలస్యం బనుమానముం భయము లేన ట్లైనచో నెన్నడో
యీ లోకమ్మున కెల్ల నా గురువు కాదే భారతం బన్నిటన్!
జాలున్ జాలు తమస్వినీకథ, తమిస్రం బేరిదో దానిలో
పాలా అందఱకున్, ప్రభాత మిది సంభాసించె లెం డో! ప్రజల్! 32

చ॥ అడుగక అమ్మయైనఁ దన కన్నము బెట్టునె ? శక్తి యిచ్చునే
యడుగనిదే భవాని? జగదంబకు భక్తి నొసంగి శక్తినొం
డుడు జనులార! యంతటను దొట్టిన ప్రాణము నల్పబుద్ధి యె
వ్వడు కమలార శాంచియు భవానిని కొల్వడొ కీడు వానిదే. 33

చ॥ అడుగున నీరు పొంగి యపుడప్పుడె వానయు లేక గట్లపై
నడరు ప్రవాహ మొప్పు నదియా!యనిపించె జపాను, దాని యీ
గడవ మతైక హేతువు, మికాడొసమాఖ్యము దివ్యవిగ్రహం
బిడినది శక్తి తత్ప్రజల కీడిత మర్జునగాండివప్రథన్. 34

చ॥ ప్రకృతియ మాటిపోయి నవభావము గుండెగులాబిపూతగా
పొక యనిదంప్రపూర్వము మహోజ్జ్వలసంఘ మనంగ భారత
ప్రకరము భాసిలన్ వలయుపట్టున సైన్స్ మెపిన్లు సాయమౌ
పొకొ రమ ఆదిశక్తి ప్రమనోదిని వాణి భవాని తక్కగా. 35

క॥ మతమే హృదయము జాతీ
యతయె శరీరంబు శక్తి, కళలావసర
స్థితసత్యం బీయది భా
రతమున రవి ముఖ్య విడ విరాజి యను నటుల్. 36

మ॥ మతబోధం బసమగ్రమైనయపుడే మ్లానత్వముం బొందె శ
క్తి, తదీయోల్లసనమ్ము తక్క నెదియేన్ దీపించె నాంగ్లేయసం
స్కృతిమై, దేశమునందు క్రోటనులు హెచ్చెన్ సంపెగల్ తగ్గెని
స్థితి యేమాత్రము సాగఁగూడ దిక నుజ్జీవించుతన్! దేశముల్. 37

గీ॥ తానె యెల్ల, యెల్లయుఁ దాను, తానె బ్రహ్మ
మయిన యానందకాసార మాత్మశక్తి
దీని తామరపూలైన దేహశక్తు
లఖిలఖండముగ్ధకళాకరములు. 38

గీ॥ ఆత్మశక్తి బ్రహ్మానంద మలఘుమధుర
ముదధిగా, తదంతరమున నోలలాడు
సుకృతి పాశ్చాత్యభౌతికసుఖమనెడి గ
భీరతాహీనఝురమును కోరునొక్క? 39

గీ॥ ఆ మహానందమయమూర్తి నా భవాని
నాత్మశక్తి గౌరిని మన మందఱమును
మందిరమును పర్వతసానువందుఁ గట్టి
కొలువవలయు, నంతట నామెచలువ మలయు. 40

ఉ॥ అర్చిత యాచు నామె మన యాత్మల మేధలఁ జొచ్చి యజ్ఞశి
ఖ్యర్చి బలెన్ వెలుంగునట,యామెయెబ్రహ్మము,లోన వెల్పలన్
జేర్చిన యాదిశక్తియట, విశ్వజగజ్జనయిత్రి యైననున్
గూర్చును భారతమ్మునకు కోలట, తానె భవాని వాకొనెన్. 41

ఆ॥ వె॥ ఇచటి మట్టిఁ బుట్టి, యిచ్చటి గాలికి
వాన కెండ కెదురుగువారు, తనను
మఱచిపోయి రనుచు మరిమరిఁ దడవె నా
యంబ భారతాంబ యా భవాని. 42

ఉ॥ మందిర మేలనోఁ దనకు మాత వచించె, నిజాజ్ఞయంచు, ము
న్మ్మం దగు భూరిదివ్యమతమున్ జనతైహిక మోక్షసాధనం
బున్ దెలియంగఁ జాటఁ దగు ముఖ్యనికేతన మౌట కంచు, వెం
దున్ దొలిపీఠి నొందు బలధూర్వహజాతి సృజింప నంచునున్, 43

క॥ ఒక స్వర్ణయుగము నెలకొను
టకు, జగ మార్యీకరించుటకు, వాక్కర్మల్
వికసితసురభిళములు తన
నికేతనమునుండియట, యనెన్ శివ మరియున్. 44

చ॥ ఇటులు వచించు తల్లిమది కింపితమౌనటు పుత్రకుల్ చరిం
చుట తమ ధర్మ మౌను, మది సొంపిలు మాతను భౌతికమ్ముగన్
ఘటితసమగ్రవై భవ నొనర్చుట కర్జము, పెద్ద కాలమున్
జిటులని తామసమ్మునకుఁ జిక్కి యొనర్పము,పిల్వమాయమన్ 45

ఉ॥ ఘోరతమశ్ఛటాకలితకుడ్యములన్ బడగొట్టి మానసా
గారము వెల్గునింపుకొని, కానక యుంటిమి యిన్నివాళ్ళ నీ
తీరు క్షమించు తల్లి యని తెల్విమెయిం బతిమాలి, సర్వముం
గోరచిపెట్టి, యెల్లరు జనుల్!యజియింపరె! భారతాంబికన్. 46

మధ్యా॥ ఆయమ చెప్పిన నియమ మాచరణమ్మునఁ బెట్టి
పాయక కర్మయోగులుగఁ బ్రజ దవరునపుడు భార
తీయభాగ్యమ్ము చూడవలె! తెగి సేయ కటు కేవలము త
దీయపూజ మతి సేత వృథ, తెలిపె భవాని యిట్టి విధ. 47

క॥ చెప్పినటులఁ జేయక కొఁడు
ఎప్పుడునుం బొగడుచున్న నేమి? జననికిన్
మెప్పులు పుట్టునె? యెదలో
నొప్పులు కాక, యిది తెలిసి సుతకృతు లగుడీ! 48

ఉ॥ కర్మ మనంగ స్వార్థమున కంటని భారతసేవ, తెల్వికై
నిర్మిత మైన మతం బెసగు, నిందుఁ బొసంగదు గేస్తు స్వార్థపున్
మర్మర ముండుటన్, బల మనన్ జలమే యదిఁ బోవు రంధ్రవ
చ్చర్మఘటమ్ము నౌటను,కృతం బిచటన్ బలపూర్ణ మౌటనున్. 49

ఉ॥ ఇందును బ్రహ్మచారులు మహేశ్వరి కంకితమైనవారె యెం
దెందును శక్తి మోసికొని యేగి జయింపగలారు, లక్ష్యముం
బొందవు భల్లముల్లమును బుద్ధికి నిల్కడ లేదొ, తొంటి వా
డెందపుఁబోకడల్ విడుచులే పరమార్థమువైపు రాకడల్, 50

ఆ॥ వె॥ సకలభారతమును సారవంత మొనర్చు
శక్తి నిండి పొరలు సంతతులకు
స్వాగతము, భగీరథాదుల దేశమే
మాది యనుచుఁ దెలుపు మానితులకు. 51

గీ॥ జ్ఞాన మాధారముగ భక్తికర్మ లొప్పు
జ్ఞాన మను గోతమునుండి కర్మవస్తు
చయముఁ గైకొనవలె బ్రహ్మచారి, యట్టి
గోత మున్నది "సోహమ్మ" రాతిమీద. 52

క॥ వేదాంతముఖ్యసూత్రం
బై దనరియు నందలేదు సోహమ్మ ప్రజా
సాధారణహృదయమున, కి
దే దారిని నడపుఁ గర్మదెస, భయ ముడుపున్. 53

చ॥ పిలిచిన రాని పల్కు చెవిబెట్టని వారిని గూర్చి తా మహో
జ్జ్వలదశ సింహపీఠిపయి భాసిలినప్పుడు భారతాంబ కో
పిలిదొకో! సుంత సాయ మొనరించియుఁ బెద్దగ నొందఁవచ్చు ద
ల్లలితముఖీదయామృతము, దాగక ముందుకు రండు సోదరుల్!

ఆ॥ వె॥ భరతమాతపేర వచ్చు ధనం బది
యామెకొఱకు భోజనాదికముల
నామెభటులకొఱకు వ్యయ మౌను, భటుల సం
పాదనమున సగము మాతకొఱకు. 54

ఉ॥ ఇందలి భిన్నవర్గముల కేకవిధాధృతి, వర్గనాయకుల్
కొందల మందు వర్తనము కూడదు, వ్యష్టియశఃప్రయత్నముల్
నిందితముల్, స్వధర్మవిమలీకృతజాతి సమష్టిగా బలం
బొందును,పొందుగెల్పులను, పొందుయశంబుభృశంబుగన్ననన్

చ॥ ప్రజకు సమైకమత్యము శుభప్రదకృత్యనిబద్ధబుద్ధి నే
ర్పి, జడుల విజ్ఞులన్ సలిపి, పేదల బాధలఁ దీర్చి, వారికిన్
రుజల సపర్యఁ జేసి, మతిరోధము పో మతబోధముం బొన
ర్చి జరుపు నెవ్వి భాగ్యరమనృత్యము లవ్వి భటాళికృత్యముల్,56

క॥ రైతులకున్ గార్మికులకు
ప్రీతి నొకరిపై నొకరికిఁ బెంచుట, ధనిక
వ్రాతమతిన్ బ్రజపనులకు
నై తేగను నించుటయును నగు సభ్యకృతుల్. 57

గీ॥ ధనము సమకూరఁ గొందఱు తరలి నేర్చి
వత్తురు విదేశములనుండి వైభవమున
కైన నైకవిభేదవిజ్ఞానశాస్త్ర
ములను, సిద్ధము విజయ మీ భూమినెల్ల. 58

గీ॥ పాదుకొలిపి కర్మాగారపటలి వారు
ప్రాప్తలాభధనమున విద్యార్థిబృంద
ములను శాస్త్రరహస్యముల్ తెలిసికొనగఁ
జేయుదురు తాముబలె భారతీయమణులు. 59

గీ॥ పాదయాత్రల నైకవిభేదదేశ
పర్యటకు లయి కొందఱు స్వగుణశీల
వచనముల నించి యటవారి భారతాప్త
లుగ నొనర్తు రస్మద్ధ్యేయలోలురుగను. 60

ఆ॥ వె॥ ఎపుడో మందిరమున నెలయు భవాని, త
న్మఠము కర్మఠముగ మంజు వెపుడో
యపుడె భారతాశయమునకు భద్రగ
జాధిరోహణోత్సవాతిశయము. 61

మాలి॥ మరియు నిటు భవానీమందిరాఖ్యన్ రచించెన్
స్థిరతమ మగు వ్యాస (శ్రీ), ప్రతు ల్లక్షసంఖ్యన్
పరువడిఁ బ్రజమధ్యన్ బంచ నై ముద్రితంబుల్
చెరగని యొక ముద్రన్ జిత్తముల్ కీలితంబుల్. 62

ఉ॥ భారతధాత్రి నారసె శివాజి భవానిగ, ఝాన్సిలక్ష్మి ము
న్నో రుచిసాంద్రకీర్తులు తదైక్యమునొందిరి యట్లె యెంచి దో
స్సార ముపాసనమ్మగ, ప్రజామతిలో నరవిందఘోషుహుం
కారము తద్భవానిగుడిఁ గట్టెను నిర్మితి లోకమాన్య మై. 62ఎ

ఆ॥ వె॥ ఉక్కు కొల్మి నుంచి పెక్కు కత్తులఁ జేయు
కమ్మరీనితనము గలిగి ప్రజల
భీతి పిఱిచి పదునుఁబెట్టె మనసుల శా
వ్యాసము, సమధికము వంగమందు. 63

ఆ॥ వె॥ ఇరువు రీ ధరన్ సురేంద్రనాథబెనర్జి
"బిపినచంద్రపాలు", వీ రుపన్య
సించువారిలోనఁ నెంచుకోఁదగువారు
మరియువారు తక్క మాన్యు లెల్ల. 64

గీ॥ "లాలు బాలు పా" లనుజగల్లలితకీర్తి
మూర్తులందు బిపిను పేరు మూడవయది
అతనివలన జాతీయవిద్య ప్రజ కందె
నతడు "న్యూయిండియా" పత్రికాధిపతియు. 65

క॥ అరవిందుడు కలకత్తా
కరిగి బిపినచంద్రపాలు నరసి యితరులన్
దరిసించి యొక సమజ్యన్
వఱలించెను పాలన మఱవఱలుగఁ జేయన్. 66

ఆ॥ వె॥ "అశ్వినీకుమారు" "డవివాళుడు" దివోస్క-
రాదిగా సముజ్య నందఱును స్వ
తం తతోద్యమ ప్రధాను లౌటకుఁ జేత
గీతఁ బూని పంతగించినారు. 67

గీ॥ బిపినపాలు తొలుత బ్రిటనువస్తువుల బ
హిష్కరించినంత నేమి యగు స
టంచుఁ బలికియును సమర్థించెఁ జర్చించి
యుద్యమమున కదియ హృద్య మనుచు. 68

ఉ॥ కర్జను చేయుచున్న యపకారములన్ గణియించి పాలనా
భర్జితభారతమ్ము మనుపం బ్రిటనీయసమస్తవస్తుసం
వర్జనమున్ స్వదేశ్యవహానంబును తత్సభ నిర్ణయించె నా
వర్జితవంగమానసము, పత్రిక కందిన వార్త యయ్యదే. 69

గీ॥ వంగభూమి రెండైనను ప్రజ యొకటియ
యెండ యగు దీని శౌర్య మీ యెల్ల ధరకు
ప్రజయు రెండౌనొకో దాని పనులు రెండు
దండమును సామము స్వతంత్రతార్జనమున. 70

క॥ దెబ్బలు తిని వెత కోర్చుచు
నబ్బా! యన కగ్రగామి యగుచుఁ బ్రజ పడన్
ద్రొబ్బును ప్రభుతను, శస్త్రము
లుబ్బునఁ గొనుఁ దప్పదో మహోగ్రరణమునన్. 71

గీ॥ ప్రబలు గాత! జాతీయత రాజకీయ
సాంఘికాధ్యాత్మికం బైన చదువువలన
పాఠశాలలు సర్వత్ర వఱగుగాత!
త్రిపథగాకుల్యలుగ క్షేత్రదీప్తికొఱకు. 72

మ॥ వనితం బీ జతనంబు వ బుకొనగా వ్యాయామశాలల్ దన
ర్చును గ్రామమ్ములయందునున్ బలరమాళుద్ధాంతముల్, వంగధా
రుణి జాతీయత పంటపండి యది సర్వుల్ పంచుకో భారతం
బొనరున్ బాలనభారభుగ్నభుజు లై ప్రమొక్కం బ్రిటన్ పాలకుల్.

క॥ ఈ చెలువున నరవిందుని
వాచన మైె బిపినచంద్రు వాక్సారము నై
లేచి కొలువు మీసము మెలి
వైచెఁ బ్రచారమున గాలివస నోడింపన్. 74

ఆ॥వె॥ ఘన మ దెంత యైన మన నాదు చౌరదు రి
వాల్వరుసడి దక్కఁ బ్రభుతచెవిని
చెవుడు చిత్ర మనుచు నవినాశబుధు డాడె
సభ్యశతము మెచ్చి సన్నుతింప, 75

శా॥ రాజీ లేదిపు డున్న పద్ధతులు మాఱన్ దక్క నంబేదకే
హోజారం బగు కాంగ్రెసీయసభతో, వ్యాఘ్రంబు మార్జాలమున్
దేజున్ గూర్చును నీదు మైత్రి యనునే! దేనంగముల్ దానివే
యీ జోకన్ బలుకంగ నొక్కడు తథాస్త్వక్తు లా యెల్లరున్. 76

గీ॥ తిలకు లజపతిరాయియు దిద్దవలయు
కాంగ్రెసున్, వారిచేతను గాకయున్నఁ
దీర్పదే ఖాయ మనుచు నేతెంచె బొంబ
యీన్ దనరు కాంగ్రెసున కరవిందఘోషు 77

ఆ॥ వె॥ పిలువుపిండుమేటి పలికె ఫిరోజిషా
బొంబయీపురప్రభూతగోష్ఠి
మూడు పొట్టిదినము లేడేడు పొడుగుకో
ర్కెలను సంస్థ తీర్పగలదె? ప్రజకు. 78

ఉ॥ ధార్మిక మైన యాంగ్లవిభుతన్ గొనియాడి క్రమక్రమమ్ముగా
శర్మము తద్దయన్ బెనుచు చైదము కాంగ్రెసుసొమ్ము, తద్దయున్
కార్మిక కర్షకాదిజనకాండసమస్యలు పెక్కు, వానికిన్
మార్మ్యగ మిద్ది పెట్ట దయినన్ బ్రజ వేఁడుగఁ గూడుకోవలెన్. 79

క॥ పారిశ్రామికజగతికి
దారుణహాని సంఘటిల్లె తాతామృతిచే
తీఱెను "విలియండిగ్బి"
భారతహితు, డాత్మశాంతి వానికి ననుచున్. 80

క॥ అధిపతి హెస్రికాటన్
మధురోక్తి బుధులకు మఱునాడు లభిం
చు ధనికగృహభోజనమును
కథించు నుడి వెనసి వినిచె కాంగ్రెసున నిటుల్. 81

గీ॥ బకమత్యమ్మునకు సరి యైన యర్థ
మొకటె ప్రతిమనుజుడు నీతి నుల్లసిలుట
గౌరవమునకు దేశసౌఖ్యమున కదియె
యాటపట్టు కాదనువాని యాట గట్టు. 82

మధ్యా॥ ఘనతరముగ నాలోచించి కడు నుదారముగ వర్తించి
వినుతకార్యము లొనరించి, పే లయినంత బ్రతుకుద
మనుభవమ్ములనె కాని యెపు డంకెలన్ గాదండి! తలపు
లనె యూరుపులను గాదు, పనులనె గాని పలునేండ్ల గాదు.83

మ॥ తమ పూదండనుగా ధరించుకొనుచున్ సౌదర్యసౌందర్య ము
ల్లముక్రొందామరతేనె యొండొరులగ్రోలన్ జేసికొంచున్, నిరం
తము పన్నీరు కృతజ్ఞతాఖ్యము పయిన్ జల్లాడు కొంచున్, సుగం
ధము కీర్తిన్ దెసలం భరించుచు మనుండా! భారతీయప్రజల్! 84

క॥ మీ బాధ్యత లుగ్రము ల
య్యా! బలి యిడకుండు పరువు నవి తీరుటలో
మీ బరి దాటని పోకడ
నో బాధకుఖంబు పంచు డౌరసులకునున్. 85

గీ॥ "ఆశుతోషముఖర్జి" తో ననియె కర్జ
నాంగ్లదేశము పంపింతు నరుగు మనుచు
నమ్మ నడిగి చెప్పెద నవె నతడు, మాతృ
భక్తి యిది, చూచి వైస్రాయి బండ యయ్యె. 86

మధ్యా॥ పాలనాసౌలభ్య మురును వంగంబు భంగంబు గాగ
నీ లీల వైస్రాయిమాట యెంతయొ తప్పులమూట
మాలోని "లిబరలు-వాడు" మంత్రి యైన నిల్లానె!
పాలకవర్గంబు పెంచి పాటింపమొకో! సుభంగతను. 87

గీ॥ జాతిమతసంస్కృతుల నేకరీతిఁ దగు
వారి విడదీయు పని హృద్విదారకంబు
ఆక్మ యు క్కొనో! కావచ్చు, నాశయంబు
అంప మెపుడు కారాదు, కర్జ నెఱుగండు 88

గీ॥ ఎన్నికలలోన మేము జయించినాము
పార్లమెంటుసభ్యుల మౌచు భారతీయ
భరము స్తంభాలు మందిరజరము నట్లు
మోసెదము, చేసెదము ఖండములుగ సేగి. 89

గీ॥ అధినివేశస్వతంత్రత యఖిల భార
తీయతత్వం బటంచు వాదించినాము
పార్లమెంటుపై కప్పున పగులు నూపి
వాదఫలిత మందురు ప్రతిపక్షచయము. 90

ఉ॥ అక్షయసౌఖ్యచిహ్నముఁగ హాకుక్కల యుత్పలమాల భారతీ
యక్షితిలక్ష్మి కాల్చుటకు నై లిబరల్ బల మైన మేము మీ
సక్షము, రెండువైపుల శుభమ్ములు పెండిలి చేసికొన్నవం
డీ! తత మెప్పు డౌనో! బ్రిటనీయుల ప్రాపనకండి! పాలితుల్. 91

ఉ॥ దున్నుచుదున్నుచుండి భరతోర్వర నాగలినుండి లండ నే
తెన్నునఁ జేయు తీసికొను। దీసికొనన్ మన మొప్పుకొందుమే
యన్నలు! నొప్పికొందుము, తదాఁగ్లము లేనిది భారతమ్ము లే
దన్ననుఁ దప్పు లేదు, కలదా యిపు। డున్నటు తెల్వి మున్నిటన్.

ఉ॥ ఇచ్చటి పెద్దవారు బ్రిటనేగి యటన్ బ్రిజ కిందుగోడు వా
కుచ్చి యనుష్ఠసత్వమును గోరుట వ్యర్థ మటంచు, నాంగ్లులన్
మెచ్చు లనాప్తు లంచుఁ దన మ్రుక్కడిబుద్ధిని చాటు తెల్విని
వ్వచ్చరపున్ జనమ్మును సభా! జనుషాంధముగా నెఱుంగవే. 93

గీ॥ గ్రహాగణము నిర్ణయించు నాంగ్లప్రజబాగు
నాంగ్లప్రజ భారతీయభాగ్యమును నిర్ణ
యించు ననుచుఁ గాటను నగియించె సభను
వెడలె నందు నిలక యరవిందఘోషు. 94

చ॥ మరియు ననెన్ సభాధిపతి మాన్యబలం బగు కాంగ్రె సేలనో
సరిగ నిజాశయమ్ములను చాపి ఫెడే ల్మెనిపించి నేటి యీ
దొరతనమున్ ఛలస్వపనదూషితమున్ గనువిప్పఁ జేసి వి
గ్గరగఁ గథించి యుష్మఖత్కై నిలవేయము రాజ్యదేహళిన్. 95

ఉ॥ జీవితసంధ్యలో వదనసేమవిడిన్ బ్రకటించెఁ బల్కులన్
బోర్రివుగ దాదభాయినవురోజి, కుటీరము లిండ్లు మేడలున్
సావడు లోవరుల్ సభలు సద్దుగఁ బేర్కొను పెద్ద లెందఱో
సేవకు లీ మహీరమకు, చిత్రము కోర్కెలు తీరకుండుటల్. 96

గీ॥ పట్టుదల దూరదృష్టియు వాసి యోర్పు
స్థైర్యకార్యసంసిద్ధతల్ చకర్కఁ గలరు
నాయకులు యుష్మదీయులు, మీ యదృష్ట
మిది సగర్వ భారతులార! యుదితులార ! 97

ఉ॥ ఐనను దీనసే విజయమందరు నాయకు నాజ్ఞ మీకు దిం
డైనసె దక్క నిద్రసమయంబుననున్ బ్రజలార! కార్యసం
తానము నిష్ప్రయోజనము నాయకధర్మము సర్వసభ్యులుం
బూనిన,విద్య వచ్చి నినమొన్నటి యే తరుణుండు పూనినన్.98

క॥ లిబరల్ పార్టీ సాయము
గఁ బొసగకున్నెడల పొందగలుగునె ? యైర్లాం
డు బిటీనఁ గొన్ని హక్కుల
నుఁ,బొందు భరతోర్వి యల్లె నుతనాయక మై. 99

గీ॥ టాప్రిన్సువాలున బోయర్లు రాజ్య మేల
బాధ పడిన భారతులకు బాధ దీర్తు
మనుచు నంతకు బోయు లై యడరి మనుప
లేని దొరల నే మన్నను లేకి గాదు. 100

మధ్యా॥ భారతమునఁ బ్రజాప్రభుత పరివర్ధిత బు కా దంత
యూరపునందుఁ బలెఁ దొలి గండి ... చపోకడలు
వేరులుపాతుకొనెనట విపొందనతె నైన నిదు
తోరము కొన్నళ్ళు విద్య తొడవుగఁ గల రిపోడ. 101

క॥ అఱచేతియంత ముగిళులు
పెరిగి పెరిగి కుఱసినటు పిన్నగ నిపుడౌ
భరతోర్వ్యపరిశ్రమము లు
మఱసించుత ! మరిరకాలముందే బ్రిటనన్ 102

ఆ॥ వె॥ ఇటులు శ్వేతనీతి మృదువుగా వాచి చి
పెలుచ నైన కొలువు పలుచబడగ
సద్దుమణిగె నదను పెద్ద 'కాట' నుపన
సించువారి తటి క్షమించు ననుచు. 103

గీ॥ ఉన తాధికారమ్ముల కురరు భార
తీయు లను నేటి వైప్రాయి తెలిగు గాక
రాణివాగ్దానములఁ బూడ్చి పైని బీట
నుంచి కూర్చున్నవారె యయోగ్యు లనుచు. 104

గీ॥ చిత్తమున లేని మాటలు చెప్పి చెప్పి
చేతఁ జేయమి యాంగ్లేయరీతి యన్న
నగ్నసత్యము చాటుగనైనఁ దెలిపె
"లిట్టు" నభివంద్యు డనుచుఁ బల్కెన్ జెనర్లి. 105

క॥ స్వాతంత్ర్యప్రమఁ బ్రేమించెడు
జాతి యనుచు భారతీయజన మాంగ్లేయ
వ్రాతమునకు లోబడెఁ, దగు
రీతిని జయ జయ! ప్రభుత! యనె శ్రీమాలవ్య 106

గీ॥ అటకయ పురుషత్వమ్ము నవగతమ్ముఁ
బొందుచుకొను స్త్రీత్వమ్ము, నా బుద్ధ యెడౌ
కంటి నడుగకె చెప్పెను కర్జ నిటకు
వచ్చుటలు మన భాగ్యము హెచ్చుట లని. 107

ఉ॥ రావణు చేతలే యతని రాజ్యవిహారమ్ములు, కాని రామునే
నావిలసత్పరాక్రమము నల్గడలన్ బ్రకటీకృతంబుగాఁ
దావలమైనవాడు ఖరదైత్యుడు, భారతగాథ ఆరణం
బా విధి సాగునా? శకుని యయ్యెను మూలము, కర్ణ నిప్పుడున్.

చ॥ అనియెను లోకమాన్యుడు, మహాంగ్లజనమ్మున కస్మదాశయ
మ్మను బ్రిటనం దుపన్యసనభూరిగఁ బల్కి తదీయసానుభూ
తిని రవిదోచుముందు మలిదిక్కున లేతెలిడాలు వోలె నొం
దనువలె నంచుఁ దీర్పు, చను దతులు పంచనదేంద్రగోఖలేల్.109

క॥ అన్నా! మహమ్మదాలీ
జిన్నా! నీ వేగకుంట చెన్నా! యని కొ
ల్వన్నదియు పిలుగామిన్
జన్నదిలే దతడు బ్రిటనుసర్వంసహాకున్. 110

గీ॥ బ్రిటనులో నొప్పు భారతపృథ్వికార్య
దర్శిపదవి ఖర్చు, "టిబెటు"దండయాత్ర
ఖర్చు బ్రిటనే భరించుట, కౌన్సి లిచట
విరివిగొనుట ము న్నగు తీర్పు లిరవుకొనియె. 111

క॥ పలువురు పలువిషయమ్ములు
పలికిరి, వచ్చు సభ కాశిఁ బరగుట తెలిసెన్
ములుచదనము బెంగాలును
పలుకులు సేయు టను తీర్పు ప్రతినినద మిడెన్. 112

ఆ॥ వె॥ రత్నకాంతి గాజురాళ్ళలో, నీ రెండ
మావులందు నటులు భావిభార
తీయశోభ కాంగ్రెసీయనిర్ణయముల
ననుచుఁ నందఱు విన ననియె ఘోషు. 113

# ఇంగ్లాండు ఖండము

గీ॥ గోఖలే లజపతిరాయి కూడి పయన
మైరి బ్రిటనున కా యోడ నీరధిన్ ద
రంగములఁ ద్రోసికొనుచు వేగన్ గమించు
చుండెఁ గడగండ్ల నీది ధీరుండు వోలె. 1

ఉ॥ సందునసందునన్ దొలిచి చంద్రుడు వైవ మయూఖబృందమున్
బిందువుబిందువున్ గ్రమణవిందువు చుక్కలగుంపునవ్వులో
సింధువునందు, నోడపయిఁ జేరలఁ గన్నులు ద్రావి దృశ్యని
ష్యందరసంబు, తా మవగతాంగము లౌనెడ కోడి కూసెడిన్. 2

శా॥ నా లోతుం గమనించువారి కొదవున్ రత్నాల కుప్పల్, తటం
బాలోకించెడువారికిన్ దొరకునయ్యా! కాకిచిప్పల్, కవి
త్వాలోకమ్మును నేను, కష్టసుఖమం దా భావముల్ నా తరం
గాలే యంచునొ!ఘోషిలెన్ గడలి, నైకార్థమ్ము లాఘోషముల్.

క॥ వెనుక కడుగు ముందు కడుగు
నొనరగ నౌక లయనుఁ బట్టి యుదధివళుల్ చే
సినవి మహానాట్యము, మే
సినవి కనుల్ సృష్టిచిత్రచిద్వైభవంబున్. 4

క॥ పలురంగుల చేపల తళ
తళలున్ తరణికిరణముల ధగధగలు స్వని
ర్మలదేహాభరణము లై
వళు లాడుచుఁ బాడు నొకపె పాట యొక శ్రుతిన్. 5

ఉ॥ ఏ క్షణమందు విశ్రమము నెయ్యునొ! యాశ్రితజీవకోటితో
నక్షయకర్మశాలను దిగంతగతారవమున్ విశాలమున్
శిక్షితపద్ధతి న్నిలిపి చెమ్మట నుర్వులుగా శ్రమించు న
ధ్యక్షగుణాల రత్ననిధి, యంతయు నెప్పుడు నోడబేరమే. 6

శా॥ పై నాకాశము క్రింద సంద్రము, వివస్వత్కాంతి సర్వత్ర, యెం
దేనీ యాకయు హద్దు లేదు దృశకున్, వేగమ్మునన్ సామ్యము
ల్లేనేలేనిది యాత్మ మేఘములఁ బల్టీల్ గొట్టి పిచీకృతిన్
దానం బాల్గొని చుట్టుచుండె దెసలన్ మైయెందొ! తా నెందునో!!

గీ॥ పొలము దున్నును నాగలి, జలము దున్ను
నావ, మలఁపుదిరుగు నివి, నలి యయి పొద
లిందుఁ గలవేమొ! అలలకూలీలు వాని
గట్టునం బెట్టుదురు, తదోఘంబె నాచు. 8

గీ॥ భువన మను హండలో నీరు పోసి పైని
మంటఁ బెట్టి కాచుచునుండెఁ గంటబడని
వేడొ! నరు డైనచోఁ గ్రిందఁ బెట్టు మంట
మంట ద్యుమణి, నీ రంబుధి, వంట ముయిలు. 9

గీ॥ కడలినీ రుప్పు, దానిది గాలి తీపి
నొప్పు, మిను కప్పు, తత్రాపి యుభయసంధ్య
లందు వివిధాంశుఘన మోచు నందు మెప్పు
సృష్టి పొగసులు విప్పు, నిం దెవడు చెప్పు? 10

గీ॥ ముంచుగాక పోతము నొకపుడు, తటంబు
నెపుడు తగ్గించుగాక హెచ్చించుగాక
కణముకణమునఁ బ్రాణము తొనకు నబ్ధి
యెంత కలగియు మర్యాద నెడయకుండు. 11

ఆ॥ వె॥ హృదయ మెన్నివేల యేండ్ల లో తున్నదో
పర్వతముల లోనఁ బదిలపఱచెఁ
గడలి, యన్ని నదులు కలసియుఁ దత్కటు
త్వమును మార్పలేక తామె మాఱె. 12

గీ॥ పిల్లచేపల మ్రింగెడి పెద్ద చేప
లలల దూకుడు తిమితిమింగిలము లున్న
నారథిన్ జగద్గురు వని నావయాత్ర
జీవయాత్ర యొకటని వారు చెప్పికొనిరి. 13

చ॥ ధనమును చూచిచూచి జిగిదప్పిన లుబ్ధుల కంటి పాపలన్
గొని మెఱుగార్చె, దుశ్శ్రమములకున్ గతప్రాణము లేచివచ్చి కూ
డిన విధ మైన సౌఖ్యమును గూర్చె సముద్రము, కాని యాత్రికా
ళి నొకడొకండు జబ్బుపడెడిన్, జత భోగము రోగ మొక్కెడన్.

గీ॥ చేపలను పట్ట వచ్చిన చిన్నపడవ
అలల తాకిడి కోర్వ కల్లాడుచుండె
ఘనమతులకే తగుంగాక! తొనకకుంట
అల్పమతులు వ్యసనాహతి కాగగలవె? 15

గీ॥ కంట దుము గొట్టు, దానము ఘన మొసంగు
నినుముతోడి సిమెంటె కాదు నగరంబు
సగముమంది కన్నము పెట్టు జగమునందు
క్షారజలమాత్రమే కాదు సాగరంబు. 16

చ॥ పడమటికొల్మిలోఁ గనకభారముకాంతికి విక్రయింపగా
బడె సగ మాకసంబు, వెల వట్టువబొజ్జ వెసంగి వెండియం
గడి తొలిదిక్కునన్ దెఱచె, గంతులు గంతులు కా విశన్ గనం
దడవె యొడంద పెట్టినవి, దానికి కాంత కడింది సొమ్మువై. 17

గీ॥ ఆ మృదుల మైన వెన్నెల నల్లనల్ల
(ఉ) 'బెథోవెను'నాల్గవ"సింఫనీ" వి
నంబడియె మందవాయువశంబునన్ సు
ఖస్వ మేడవ స్వర్గంబు కానబడియె. 18

గీ॥ రంగు వలపు మ్రోత హొరంగు రంగరించి
చేసి నొక ప్రపంచమునకుఁ జేర్చె నావ
"యీడెను"వనంపు నిర్మాణ మీడనె యన
వెలయు పురిదరి లంగరువేసె నావ. 19

గీ॥ శ్వేతముఖుల లండనులక్ష్మి స్ఫీతసౌధ
వీధికూటస్థ వెన్నెలవిరివి ద్రావి
విఱుగబడినవ్వినది తమ్ము నరసి యనుచుఁ
దలచె లజపతిరాయి సందరపుదరిని 20

గీ॥ వార లొక మిత్రు నింటికిఁ జేరి విడిసి
తీయ నైన సల్లాపము తిండిరుచిని
త్రిగుణ మొనరింప ఖుషియించిరి నిదురించి
రదిర! టన్నుల గంట తొమ్మిదిట మ్రోగె. 21

క॥ పైఁబోసె వేకువచలి గు
లాబులతో 'టామరిస్కు-క్రాబాపిలు' పూల్
లేఁజాట పికరుతం బై
యా బ్రిటనుపురీమతల్లి కరమెలకువలో. 22

గీ॥ ఎవి యెగిరిపోవ సామ్రాజ్య మిగిరిపోవుఁ
గూసె నవి యాలు 'రావెనుల్' గోపురమున
నిలువురెండునిలువుల ముండ్లు గలది గగన
మందు బిగ్బెనుగడియార మైదు గొట్టె. 23

క॥ దుగపాళు తెలుపు నొకపా
లుగ నీలము పసుపు కలిసి లోచనహార మౌ
జిగితో లకుముకిపిట్టలు
దిగె బెస్తలకన్నఁదొలి నదిం రేవకడన్. 24

ఉ॥ తల్లులు కన్న పిల్లలను దాదులు పెంచిన రీతి మాధవ
ప్రోల్లసితాహముల్ కనిన పువ్వుల గ్రీష్మదినాలు పెంచు, సం
ఫుల్లవిచిత్రవర్ణసుమపూర్ణతటమ్ములు పెంచు 'థేమ్సు'కున్
మొల్లము, దాని గొన్లతికి పూంచును సంజలు రెండు చేటికల్.

క॥ పొగమబ్బు చీల్చుకొని వ
చ్చు గగనరత్నంపు బెట్టుసొబగును చూ
పి గొలలు నటు మన స్వాతం
త్ర్యగరిమ మనెఁ బంచనదుల దణి గొళ్లతో. 26

ఆ॥ వె॥ అంటి ముద్దుగొనుచు నంతంత జరిగి పై
బడుచుఁ జక్కిలిగిలి యిడుచుఁ గౌగి
లించుకొనుచుఁ ధరణిఘృణి థేమ్సునదిని తే
లించె మఖరసమున విచ్చుకొలది. 27

గీ॥ పలుకు లందుకో(జాలని భావవై భ
వమును చిత్రించె మానసఫలకమందు
వాద్యమేళసంగీతము వసధితీర
సంశ్రుతము తత్సమయవర్ణసారతమము. 28

ఆ॥వె॥ మనలఁ గని హసించె మాపు లండన్ ద్రవీ
భూతరాజకీయము నది ఛేమ్సు
పగలు పరిహసించె స్వనితహంస మనె ల
జపతిరాయి స్వసహచరునితోడ. 29

ఆ॥వె॥ వీరి వసించు నిల్లు తరువీధిసమావృత, మింటివారి స
త్కారము వీరికే పరిమితం బనరా దది పక్షిజాతికిన్
గూరుఁ, బెనంగుచున్ దరుముకొంచును గీమునఁదూటి పాటుఁజి
త్రారవముల్ పులుంగులు,కులాయములున్నవియున్ గృహమ్మునన్

ఉ॥ పెంపుడుపావురాల్ గలవు వెల్లవి, పిల్చినయల్లె యీల వి
న్పింపగ గువ్వకోల్గొని గృహీంద్రుడుచల్లినయోట్లగోధుమల్
తుంపెసలాడుచున్ దినుఁ బులుంగులు, పంజర మొప్పకోరు త
ద్దంపతు, లింత చూచుచు ముదంపడి రాగతు లింటితోటలో. 31

గీ॥ రెండుపచ్చదనమ్ములు నిండు గఱులు
తొగరుతల తెలిబొజ్జ యొండఁ గొఱలంగ
ముక్కుతో గూటికై చెట్టుమొదలు తొలుచు
మ్రానుకోయిల కన్నుల మయిల తొలిచె. 32

క॥ లండనులో నది యొక తుది
నుండు గృహారామ, మందు నొనరెను నెలయే
ఱొండు సరస్సొండు, చొరదు
గుండు తుపాకిది విహంగకులములు మెండున్. 33

చ॥ అదుకదొ ప్రేమ మెత్తదన మాఱడిపోయినచోట, జొంపముల్
ముదిరిన-యొండలో మెఱసిపోవగ నిచ్చెన వేసి పచ్చనల్
కదిసిన "యెల్మ్"మ్రానున శిఖన్‌గనశాని రెండు"పింఛులున్"
మదముల సంచు లాడుకొను మాటల మెత్తన లేదు వెన్నకున్. 34

క॥ వెలిసెపులుగు పిలువకయే
యలరులతటి రాదు, గ్రీష్మ మల్లే "స్వాలో"
పిలువకరా, దిది వచ్చుటఁ
దెలిపెన్ 'బెన్నెట్లు' ఘాసి తృణమున మొలకల్. 35

క॥ ఒకచే తటి దిగు నన్నియు
నొకచే తటి నెగురు నన్నియును, లెక్కకద
ల్పొకచే లయమై 'పివి'
క్లైకిరించెడి నైకమత్య మెఱుగని జాతిన్. 36

గీ॥ ఏప్రియలుజల్లుతోడ భూమిప్రియపరి
తాప ముడిపెను మేఘుండు తత్క్రమంబె
యాది శృంగారరసమున కాకుపచ్చ
రంగునకుఁ, బులకించిన రాణ తృణము. 37

ఉ॥ సంకటమందు సజ్జనులు సౌఖ్యమువైపును చూపినట్లుగా
'జంకెసు' మొక్క లంబువుల చాయకుఁ ద్రోవను చూపు దప్పి ని
ట్టింకులుగొన్న జంతువు సుఖింపగఁ, ద్రోవను బోవ సాంద్రప
ర్ణాంకురవారి యే పడియ యైనను కన్నులు ద్రావ దోచెడిన్.

క॥ సర్వపిశాచసభమునకు
గర్వితమతులైన మంత్రగాండ్రకు నెదురై
'వెర్వేన్' మొక్క యెదిగె, నది
ధూర్వహమో రాజకీయదుష్టత కలదే! 39

ఉ॥ పిట్టల గ్రుడ్లు దొంగిలెడి పిల్లలలోన నొకండు కాలికిన్
జెట్టునఁ గొట్టుగొట్టుకొనిచేడ్వదె,గాయముమెండు, 'సెల్ఫ్‌హీల్'
కట్టున మాన్పె బామ్మ, యవి కాలము గర్భము దూఱె నోషధుల్
ముట్టడివేయ నాగరలోకరసాయనికంపు వైద్యముల్. 40

క॥ వంచన సేయని మిత్రము
లంచున్ మొక్కలను కొన్ని యగఖగములఁ జూ
పించి చనె బ్రిటిషుహితుడు స
మంచన్నిష్కుటము వదల రా యిరువురునున్. 41

మ॥ గొడుగున్ బట్టినయట్లె వృక్షముపొసంగున్ 'మేరిల్యాండ్పైను',నూ
అడుగుల్ వెండియు నేబదిం బొడుగు దీపారాధనాశాఖలన్
బెడ గా స్తంభముబాదరించునది 'నార్వేస్ప్రూసు',నిల్వెల్లఁ బూ
దొడుగే తెల్లని 'బీము',సృష్టి పరమాత్మున్ గొల్చునెందేనియున్.

గీ॥ దేవదారు వొక్కటియ విదేశ మని స్వ
దేశ మని లేక సర్వత్ర తేజరిల్లు
నదె 'సిడారు', చలిమలయందమువిడారు
చేసె వడ్రంగి దాన జేజేల తేరు. 43

క॥ ఓహో! యనె సహాకృద్వరు
డోహో! యని మాఱువచ్చె, నౌరు లిట లేరే!
యాహా! యదె! స్టార్లిం గను
వైహాసికపక్షి యనుచుఁ బలికెను గోష్ఠి. 44

క॥ 'నను మఱువకు' మను పూబొద
లను సీతాకోకచిలుక లన్నియు రంగుల్
తనరినవి తేనె ద్రావగ
జనమునకుఁ జ్ఞప్తి సృష్టి సమపోషణమున్ 45

క॥ ఆమోద మెఱుగవు సుమ
శ్రీమంతము లయ్యు నెత్తటిన్బొద లెన్నో
నోమించె 'స్వీట్ బ్రెయరు' బహు
ళామోదము పొంది కొంత యవధి విరిసియున్. 46

క॥ 'స్కార్లెటుపింపిర్నెలు' పలు
తీర్లదె విరిసి యిడె భూమిదేవికిఁ బసరుల్
దొర్లాడు నాస్తరమున ము
హుర్లసదసితమణిలోహితోపలముత్యాల్. 47

ఆ॥ వె॥ సుగుణదుర్గుణములఁ జూపె మనిసియందు
వలచు పూలు ముండ్లు గల గులాబి
వ్యసనిప్రక్క సుగుణి, యంటునఁ దెలియును
దురదగొండివరస విరుల "క్లోవరు". 48

చ॥ తన జిగి యంతయున్ భువికి ధారగఁ బోసె నినుండు దాని వ
చ్చన లితరాభలన్ మిగిలి చర్మదృగింద్రియ మందుకోనటుల్
తనియ నలందునట్లునుఁ బ్రధానముఁనెల్లెడ, నటు కాదొ యె
ట్లు నవనవల్ గనంబడె శిలౌఘము బీటలువాఱు నెండలన్? 49

సీ॥ చెలగి పుఙ్గంగు 'లార్కెస్ట్రా' బలెన్ బ్రోయ
మరిమరి నిక్కెఁ దన్మయత వీను
పచ్చందనము మేసి పంచదారల నవ్వు
నెమరువేయుచును కన్ను మరి మొగిసె
గాలిఁ బీల్చియుఁ బీల్చి చాలక యిరుపుటాల్
మరియుఁ గోర్కొనె ముక్కు సురభి మఱగి
చివు రంటి పువు లంటి చెయి తనియక బ్రొద్దు!
మంచిదాన వెదుగు మరియు ననియె

గీ॥ తనదు నీడను తాఁ ద్రొక్కుకొనుచునేని
యొడలుఁ తోటకుఁ బరువెత్తు గడియ లొత్తు
మరియుమరితటియందు గ్రీష్మమ్మునందు
జలదకాలవర్ష ప్రదోషమ్మునందు. 50

గీ॥ భారతీయుల నిరువురఁ బలుకరించె
"రాబిను" పుఙ్గంగు లెచటివారలయ! మీర
టంచు నాయుధహైన్యమ్ము నరసి దరిసి
యోరచూపులఁ దరుశాఖ నుండి చూచి. 51

ఉ॥ ప్రక్కఁ దటాకమందు దిగి బాతువు లీదుచుఁ దీరగాములై
రెక్కలన న్ విదుర్చుచుఁ బొరింబొరి ముక్కులతో నవర్చికొం
చక్కడివారు పెంచికొనినట్టివి మిక్కిలిగా ధ్వనించె క్వే
క్వేకని త్రోటిఁ జెట్టుకొమ కిట్టటు రాచెడి డేగఁ గాంచుచున్.

ఉ॥ గారుడరత్నడోల నృపకాంతనుఁ బోలి యయారె నీరమం
దీరముఁ నన్ సితారుణ మి దే? పులు గం చదుగంగ నందుఁ గా
సారతటిన్, సఖున్ దెలిపె సారసపర్ణ తతిన్ మునుంగవ
ల్లై రచితమ్ము గూడున విహంగము "గ్రే" బిది యంచు గోఖలే.

ఉ॥ సాలమునుండి దూకి సుమసౌరభ మీతలుకొట్టుచున్న దీ
నీళుల నంచు గోఖలె యనెన్ సరసొడ్డున, నెట్లు వచ్చెనో
వ్రాలెను చెట్టుపై, సరిగఁ బల్కెను "బజ్జెరిగారు" చిల్క య
ల్లే లలితాంగపీతహరితేంద్రమణీఘృణు లుజ్జ్వలింపగా. 54

క॥ లజపతిరాయి ఁ గనె న
క్కజమున, మతగురువుపత౦ తడు నెలఁగిడు నా
రజము నిజముగా సరసియు
మజా గలదు కాంచు డిందు మరియు నని యనెన్. 55

శా॥ వంచారించిన వుర్విజమ్ము లుభయప్రాంతాలఁ, "జాఫించిబుల్
ఫించుల్' బంగరుపిచ్చుకల్' రెనులు' "గ్రాస్ఫీకెక్కెనరిల్''
మున్ను పల్
ప్రాంచత్పతులఁ గల్గి కొమ్మల, సరఃపానీయమం దింద్రు విల్
కొంచన్ మానుచు నానబెట్టినవి, యిట్లుండున్ ప్రకృత్యుద్ధతుల్.

గీ॥ సరసి యీ యందమును వార లరసినపుడు
నిండు విరిసిన పువ్వుల గంద్రనవ్వు
వాసిల న్నవ్వినది, జాతివాసి సుమప
రిమళంబు విడిపోనిది యామళఁబు. 57

గీ॥ ఫ్రాన్సు నోడించె బ్రిటను నావల్లఁ దొల్లి
విల్లుగొని- "యాగిసికోర్టు' విగ్రహాముున
నన్ను గాంచి 'యాల్ ఫ్రెడు' లేడు ననిచె ననిరొ
'రెన్'రుతమ్మున "వ్యూ"చెట్టు రెమ్మ లూగ. 58

గీ॥ ఆకసమునఁ జుక్కల పోక ననుసరించి
భూమిపైని మొక్కల నంచు, మొక్క పిలుపఁ
బులుగు వచ్చె నన్పించు, "మేబ్లూం" సుమమ్ము
విరియుటకు "స్విఫ్ట" దరియుట కురును లంకె. 59

గీ॥ గూడుకట్టుకొంటకుమున్న నీడజమ్ము
లెదుటనెదుట విటపముల రొదల మిగిలి
సరగ నెగురుచు నొండొంటఁ దలుముకొనచు
గూడు గాగఁ బార్శ్వము లొత్తుకొనుచు నిలిచె. 60

గీ॥ నలుపుగలిసిన యెఱుపురంగులని, పసుపు
పచ్చనివి వ్రాలినవి యేట వాలు నిసుక
తిన్నెపై మందపిచ్చుకల్ సన్నపాఱు
నిర్ఝరమ్మున జలకమ్ము నిచ్చగించి, 61

ఉ॥ మోచెయియొద్దఁ బొల్చునటు పొల్చుప్రసంగము సేయుచున్ దమున్
గాచుకొనంగ శరీర మరగానబడన్ సెలయేటిపిచ్చుక
ల్లేచి పొదర్లఁ గ్రేళ్ళుటికి లిప్తకు నెన్నియొ సార్లు పాటలు
నొచ్చని తీపిమైఁ బలికెనో! యని కొమ్మల వ్రాలి మూకముల్

ఆ॥ వె॥ ప్రేమ, పెండ్లి, గృహము, వీని సుఖము నరు
లందఱికిని లేదు కొందఱికెనె
పులుగు లన్నిటికినిఁ గలదు, సాధువులకుఁ
దత్సమాజమునను దప్పదు వెత. 63

శా॥ శాపేమో! తమ భుక్తియేమొ! పరపిత్సద్రోహముం గోరవే!
గోమా నెల్గునఁ బాడుచున్ బెలిసెపుల్గుల్ భూమిజాకల్పముల్
గీముఁ వెల్చెను తద్యుగమ్ము నయయో! క్రేడించి పీడించి క్రో
శ్రామర్దధ్వని వచ్చి కాకములు, సర్వత్రైకము ల్లోకముల్. 64

మ॥ తన దౌ కూతయె లేని దయ్యెఁ బెలకూతన్ గూయుటం బేరు గాం
చిన దై, యొంటనుపట్టు నెట్లు? పరవాక్చిత్రమ్ము, లీ సృష్టిలో
ధ్వనులున్ రూపులు భిన్నభిన్నములె కావా! 'సెడ్జిరిడ్లింగు'పు
ల్గున కావంతయుఁ దెల్పిలేదు, 'బయరన్లు షేక్స్పియ' ర్లుందురే!

ఉ॥ రెన్నులకన్నఁ జిన్నవి మరెవ్వియుఁ బతులు లేవు పోటునన్
మిన్నవి లేవు, పాము తమ నీడకు వైపు నగంబు ప్రాకిరాఁ
గన్నవి, వీపునం బొడిచి గాటముగాఁ, బడిపోవ దానిపై
నున్నవి, వెండియుం బొడుచుచున్నవి రెండవి తన్మృతాంతమున్.

క॥ అప్పుడు పాడినవి చెవుల
త్రుప్పు వదల విజయగీతి దొందము రెన్నుల్
చెప్పినటు విని "వయిను"తరు
వ పువ్వులుగులజాతిమహిమ హరితమట సదా. 67

గీ॥ తేనెముంతలు వలపుల వాన లైన
తీయ'వైలెట్'పువుల ఝురీతీరమందు
పంటపండిన గాలి దోయింటఁ బట్టి
యెంత త్రాగిననుఁ దనివి కంతు లేదు. 68

క॥ సెలయేటఁ దోగి వచ్చిన
బలిభుగ్యగళమ్ము జలలవమ్ముల గూటన్
దులిపెను గఱు లాడించుచుఁ
జలిమిరిమైఁ గఱుకుటెండ సంతు సుఖింపన్. 69

గీ॥ తినియుఁదిని నాస వలపు వద్దనెను, శ్రవము
వినియువిని కలనాదముల్ వెగటుగనెను
అరసియరసి సొగసుల కన్నలవుగొనెను
విశ్రమించినా రెల్ముల వీధి వారు. 70

ఉ॥ ఓ యని వేడి మార్వలికె నూ యను "టర్టిలుడోవు"కూతకుఁ
బాయక పక్షిపంక్తి తమపై ఫలభారముతోడ వోలె ము
న్నేయవి వంగె నవ్వి ధరణీరుహశాఖలు పుల్గుజంటకే
యూయల లయ్యెఁ బయ్యెరల నూగుచు నయ్యపసాంధ్యవేళలన్.

క॥ "టర్లీ టర్లీ"యని పలు
మార్లు వినిచె భరతపక్షి మాటాడినటుల్
తర్లెను దినరమ హరితో
నర్లబడెన్ దెలుపు తొగరు లొత్తి ప్రతీచిన్ 72

క॥ బింకపుసుడిగాలికి ఘన
సంకుల మంటు దుముఁ దరణి చనుచుఁ బడమటన్
గుంకుమమున్ జేసె, విడునె
క్రుంకుచునే నైంద్రజాలికుడు తన విద్యన్! 73

ఆ॥వె॥ సంచరించి యలసి సర్వశకుంతమ్ము
గూండ్ల కేగుచున్న కూరుచుండెఁ
గొమ్మ లల్ల నూగఁ గ్రోల్చుచుఁ జాతుప
క్రతువు చేసెఁ బడమరబిగి యపుడు. 74

క॥ దినము పొడుగు, పులుగుల ని
స్వనము పొడుగు, పువ్వుల వికసనము పొడుగు, కా
ని నరుని నెనరు పొడుగు కా
దు నెత్తఱిని దానికై యెదురుచూచెదమున్. 75

గీ॥ దొడ్డతన మితరుని తనతో సమీక
రించి గౌరవించుట, యది కొంచెపడిన
మానవత గండిపడినచె ర్వౌను, కప్పు
లేని గృహ మగు నని మొదలింటఁ బలికి, 76

సీ॥ అన్ని శాఖలయందు నున్నతోద్యోగమ్ము
లిడి మమ్ము మన్నింపవలె నటంచు
బాడవలో గడ్డి బలె విస్తరిలె మాకు
వెత పలువిధము లీ విఘుత ననుచు
మా దేశధనమును మా దేశమునకె వె
చ్చించుచో మేము భాసింతు మనుచుఁ
బ్రజలకు సరిపోవఁ బ్రాతినిధ్యాస్థ మీ
కుం బలె మాకు భావ్యం బటంచు
గీ॥ గోఖలే, లజపతిరాయి కొౕసరి మరియు
జనము కిటకిటలాడిన ఘనసమితి ను
పన్యసించిరి "లేబరు"బలము హొంగు
విన్యసింప, 'టోరి'పొంగు సన్యసింప. 77

గీ॥ పైనిరంగుబట్టి లోని గొప్పదనమ్ము
సత్కరింపబడుట సత్యముత క
గౌరవమ్ముకూర్పు కాదె! యనగ అండ
నుత్తరము ప్రతిధ్వనాత్త మదియె. 78

త॥ ఈశ్వరకటాక్ష మునఁ జంద్ర దృష్టి పడి ప్ర
శాంతసంసారము నైన సగము రేయి
నలతి కదలు వృక్షచ్ఛాయ, మఁతో యింతో
యేకడనొ శ్రుత మగుచుండె ఘూకరవము. 79

గీ॥ వెన్నెలలు, తేనెవెల్లువల్ వేసివలనఁ ?
బలుకుచున్న, 'నైటింగేళ్ళ' వలన, నెంత
సేపు నిదుర! మేల్కొను టెంత సేపు! సుప్ర
భాతమంగళసంగీతవశము లవ్వి. 80

వ॥ కరములఁ దట్టి లాలనముగా రవి లేపక నిద్రలేవన
ట్టిరు తొలిజాముతూర్పు ప్రకటించు తురంగలి నారయంగనే
ర్తురె? పొదలందుఁ బచ్చికలఁ దూఱుచు దూకుచుఁబిట్టగుంపు మీ
సర మెలుగింపగా విని నిజశ్రుతులన్ గృతులన్ బొనర్తురే! 81

గీ॥ పులుగు లెచటి వైనను వాని కలరవమ్ము
లచటి గానభేదములకె యంకితములొ!
ఎటను మొగిళుల రంగు లొక్కటియ కావొ?
అన్నిమతముల సూక్తు లైక్యమున లేవొ? 82

సీ॥ వల్లరెక్కలపైని నల్లమచ్చల "థ్రష్" ఖ
వాలిన్ బికము తోడు గ్రాలఁ బాడెఁ
గాఱియల్ ఛదముల గల 'యోరియోల్' పక్షి
బంగారువన్నె, తాన్ పొంగి పాడె
నల్లటోపిపులుంగు తెల్లబొజ్జది గజల్
తేనెపిట్టల శ్రుతిలోనఁ బాడె
కటిమెడ కావితోక గల 'రెడ్‌స్టార్టు' నా
రింజరంగెడద, టుమ్రీనిఁ బాడె

గీ॥ రూకు, పరభాగ్యవ్యాతిజాగరూక మగు త
దీయభగినికులంపు 'మాగ్పి'యు జెముడు
కాకి పసిపోలిగాడు ముఖ్యాతిథులుగ
గానసభలు వనముల నుషఃకాలమందు. 83

గీ॥ అరుణఘట మెత్తి సంజ పింజరము చల్ల
నివె సభలు, రంగు తేలిక, రవళిసౌఖ్య
మూలిక, నయిటింగేల్ రాగ మాలపించె
స్టెడ్జిరిడ్లింగు పాలపతు యతిథులుగ. 84

క॥ నౌరోజీ యధ్యక్షుడు
భారతుల వచస్సు సభకు వర్షించెను 'హా
ఛారన్' మ్రాన్ననల సురభి
ధారన్, మన్ననల రుచికి తక్కువ ఐస్ క్రీం. 85

గీ॥ మొదలు బ్రిటను చేసిన మేలుఁ బొగడు పల్కు
లిపుడు స్వపరిపాలనమున కింత యంత
తక్కువైన నొప్పదు భారతం బని తుది
బిగి నెగడు పల్కు లధ్యక్షునిగదితములు. 86

క॥ ఇది పేరాస యిపు డనుచుఁ
గదిసి సభన్ గూరుచున్న 'కన్సర్వేటీ
వు'దొరలు గొణగికొనిరి, య
ట్లై దుగలిబరలుదొరలు సభ లేచెడి యద నై. 87

క॥ డేగలు రాబందులు న
ల్లే గిరివిభాగములు కొన్ని యెత్తునఁ బురిలో
సాగించెఁ గులాయమ్ముల్
బాగుపడునె? సాధువతు లనె నౌరోజీ. 88

ఆ॥ వె॥ చందమామ యాకసపుగూట బ్రకృతిరా
బందు పెట్టిన యొక బారిగ్రుడ్డు
రాత్రిరాణిపూలు రాణింపఁజేయక
తన్మయూఖములకుఁ దాని కలదె! 89

గీ॥ కావుకా వని కూసెను కాకి యొకటి
కా వపుడు తన పను లని కదలకుండి
ప్రొద్దుటన్ మ్యావుమ్యా వను మ్యూజికల్ ర
వంబు విని పోయెఁ 'బోపు', జయంబు డాపు. 90

ఉ॥ చామనచాయయామని నెసఁగును కూతయు మేత. వేసవిన్
గామము పెంపగున్, శరద గౌరము, దాన సుఖంబు కొంతయే
ధూమల మౌ హిమర్తువున దొడ్డ బుభుక్ష, కృమిగ్రసక్షగ
స్తోమ మపూర్తభుక్తి నెటు ద్రోయును కాలము శీతలావనిన్. 91

ఉ॥ తిండికి మోమువాచి, సిర ద్రెంచెడి సీతున కాగ కాఫ్రికా
ఖండముపోయినన్నియు ఖగమ్ములు పెద్ద యెడారి నంబుధిన్
ఖిండులు గట్టి దాటి పదివేలును మైళ్ళు నిశాప్రదీపముల్
వెండియు నై స్వదేశతరువీథుల వ్రాలెఁ గొమల్ చిగుర్పగా. 92

శా॥ కాకుల్ రెన్నులు 'టిట్లు' నా బినులు నింకన్ గొన్ని పక్షుల్ నరా
నీకంబందున నమ్మక మ్మొదయ కందే కాయనో కంకినో
యే కీటమ్మునొ తించు నెంగిలినొ యుందే యుండు పర్వొత్తి పాల్
చేకో నేలొకో! నిల్చి త్రాగెదము నీళ్లే యస్న చందమ్మునన్ 93

శా॥ 'స్వాలోల్' 'గొల్డినొరైళ్ళు'మైళ్లుద్విసహస్రం బొక్కనాడై ప్లొవ
ర్లే లీలన్ మరి స్విఫ్ట్లు 'వార్బ్లరు' లయారే! యాఫ్రికా కేగునో!
వ్రాలన్ జాలునొ! మళ్ళి వచ్చి సరిగా స్వకుజమందే, విహం
గాలందొక్కటియేని యింత శ్రమ మైనన్ జాడు, శత్రుల్ నరుల్.

సీ॥ పైడిగిన్నెలఁ దేనె పంచి తేట్లకుఁ జిగు
రించె 'సాలి', యెడ్చు 'నెల్మ'నవ్వెఁ
దలి రొంది యూగుచుఁ దగ పూచి 'యాస్పెను'
స్వాగతమగ్మగస్వాన మయ్యె
గగురును సుమనోవికసనమ్ము లై కప
ద్యముగ 'సిల్వరుబర్చి' యందగించెఁ
జిరునవ్వు ఝురి కట్టి తెగి పాఱఁ గంటికి
తాంగంబు నెఱుగక 'యాల్డ' రొనరె

ఆ॥ వె॥ నల్లె మరియుఁ జెట్లు నాగతవిహాగక
లస్వనమ్ముకలన స్వస్వరూప
వైభవము వెలార్చెఁ బల్లెలయందుఁ బ
ట్టణములందు నన్ని వనములందు. 95

ఉ॥ కోయిల పిండుతోఁ గలియ కొక్కుచు పోవును మూగ రైయె, స్వదే
శీయము చెట్టు స్వర్గపురసీమమహీజముకన్న మిన్న యే
మో! యలనీడ చూచుకొని, మొత్తము పుల్గులు నల్లె మోహనో
చ్ఛ్రాయరవమ్ము లైన నవురా! చెలకట్టగనీదు వానినిన్. 96

చ॥ లజవతిరాయియున్ సఖుడు లండనుతోపున నింత చూచి యా
రజముల విన్నయప్పుడు స్వరాజ్యజగన్మధురోహముల్ మదిన్
గజిబిజి గూండ్లమ్రాన గిజిగాండ్లుగ నల్లరి సేసె, యోగ్యదృ
శ్యజనితముల్ తదీయసదృశస్థితులౌ స్మృతు లెందునేనియున్. 98

గీ॥ ఖాతువులు నేలనెమిఖులు శీతశైల
శిఖరములపైని నెగిరిన చెలువు మెఱసె
వారి భావన లంతకుఁ బైని యెత్తు
నందు స్వాతంత్ర్యమండలమందు నెగిరి. 99

శా॥ విప్పెం గంఠము పైని, లేజివురు 'వేఫేరింగ్' మహీజమ్మునన్
జెప్పెం ఖారము జీబునుండి నయిటింగేల్ గాయనీపంక్తికిన్
బుష్పాళ్ళప్పుడు రాల్చె న య్యగము, 'మేపుల్,
'సైనిమోర్', బీచి, పె
న్నొప్పెన్ పూచితదీయగానమున, మ్రానుల్ కూడ ప్రాణుల్ గదా!

చ॥ వలపుల కోట లైన పెనుప్రన్ననితోటలు రాత్రికూటముల్
పులకిత మైన మేనఁ గనుబొమ్మ నటించెడి నాట్యరంగముల్
జలజమనోహరమ్ములు తడాకము, లీదృశసర్వదృశ్యముల్
తలపునరావు తద్వని హితావసథమ్ములు తక్క వారికిన్. 101

ఆ॥ వెబన వారు మృగవిహంగప్రదర్శన
శాల కరిగి రొక్క సమయమందు
వల్లె మరొక తూరి 'హైడ్పార్కు'నకుఁ జిద్వి
లాసరాసహారితవాసమునకు. 102

శా॥ శాదా వం చనలేని యాడపులుగుల్ గర్వించెఁ 'డర్కీ'లలో
ఖేదం బౌ మగపుల్గు"కొక్కురో"రవంబెక్కించి యూర్ధ్వాస్య మై
యూఁదాగొంతుకక్రిందిపచ్చనకు సాహో!నాఁగఖిశంగచ్ఛదాల్
లేదూర్వావళల నీలపింఛకము శాఖిన్ విప్పి వర్తించుచున్. 103

గీ॥ రంగురంగుఱికలకు నోచంగలేని
పిచ్చుకయుఁ దోకవిచ్చి శబ్దించి యాడి
తీవినడక నడచి ఫెంటి కావటిల్లఁ
జేసెఁ దొంటికి మిగిలిన చిన్నబరువు. 104

గీ॥ తోక యెత్తి రెక్కలు విప్పి యొక చెదరఁ
బెంటివయసును దోచె 'ఫీజెంటు' పోతు
మిశ్రవర్ణము హృదియొక మిట్టి మేను
పొంగఁగవయు నారాయణపులుగు వోలె. 105

గీ॥ ఈకెసొగసు లేని పక్షి పికసొగసు
చేఁ గుటుంబి యగు, బరి చేఁగొని కల
హించువారల వలెఁ గొన్ని యెసగి మగవి
యన్ని గెలిచినవే వలపించు పెంట్ల. 106

క॥ ముక్కున వెర గొని రెండవ
ముక్కున కందించుకొనుచుఁ బోరచిగా నే
దిక్కునను ప్రణకు నేర్పెన్
జొక్కపువలపుచెయిదంపుసొంపులు పతుల్. 107

క॥ ఎదురెదురు పెండ్లిచూపుల
కెదలు దరియ సరసి నిలచి 'గ్రేబు'తెగ యహో!
యుదితప్రణయభరం బగు
నిది హంసలలోని ఖేదమే యనవచ్చున్. 108

గీ॥ రాకపోకల రెండు ద్వారములు కలవు
పచ్చలేతపచ్చికపట్టుపఱపు గలవు
పఱపుపైని రాలిన పూల వలపు గలవు
బెడగుపొదరిండ్లు పులుగుల పడకటిండ్లు. 109

ఆ॥ వె॥ ఏమి చెప్పవలె! హనీమూర్కు 'హైడ్పార్కు'
తేనె తేనె పువుల, తేనె నవుల
తేనె పెరలయందు, తేనె నుడిపొరలందు
చూపులందు పొదల దాపులందు. 110

గీ॥ హృదయసీమ పచ్చని కొమ్మ పదిలపఱచి
నావు రాకుండునెట్లు? గానంబుతోడ
ప్రేమపక్షి యని వచించెఁ బ్రియు నొకర్తు
గ్రుక్కిళుల్ మ్రింగినారు కన్గొన్నవారు. 111

ఆ॥ వె॥ "లార్చి"వృక్షశిఖరలతనుండి 'లిన్నెటు'
పక్షి కూయ విన్న బాటసారి
మున్ను మేడచివరిముదిత చేసిన సైగ
సౌరము జ్ఞప్తి వచ్చి పరవశించె. 112

చ॥ 'అమెరిక'నుండి వచ్చె నొక యాతడు ఫ్రాన్సునుండి వచ్చె నొ
క్కమగువ, హైడుపార్కున ముఖాముఖియౌచు నతండనెన్ 'హనీ'!
వెమరుకు వచ్చె నన్ను మరి నీవొ నినున్ మరి నేనొ పెండ్లియా
డి మనినయ టటం చని, ముడిన్గొని కన్బొమ నామె యౌనవెన్.

ఉ॥ బాదముకాయకన్నులది భామిని యోర్తుక బెళుకుచూపులన్
బాదెను గోఖలేమిసిమిబంగరుబుగ్గలపైని, యాత డా
బాదకు మాఱుమో మిడిరె బాలుడు నల్వదియేండ్లవాడుగా
పైదలి నవ్వుకొన్నది, శిఫల్ గద! నీతికి ధీరచేతముల్. 114

క॥ హృదయములు విప్పి నవ్వుచు
మృదుతృణమునఁ బల్లమునకు మిట్టులపైనుం
డి దొరలి యాడుచుఁ బాడుచు
బొదిగొనిరెను సాంధ్యప్రాణములు శిశుగణముల్ 115

చ॥ ఉలి కెన హైయెన ముక్కున కృతోర్వి జగంధ్రకులాయ మై తృణా
దుల మృదువుం బొనర్చి రహితో శతపత్రకపక్షి యయ్యెడ
న్నిలువగ దానినిన్ వెడలనెట్టెను ధూర్తము వచ్చి వానకో
యిల, యిది నిల్చె గూట, బలహీనుల సంపద కిట్టివో! గతుల్.

గీ॥ "శ్యామజీకృష్ణవర్మ" తో చాల తడవు
మంతనము లాడి హైడ్పార్కు నంతరమున
గొఖలేన్ డాసి యతనితో గోష్ఠి కేగె
నొకట లజపతిరాయిమహోదయుండు. 117

గీ॥ పార్లమెంటుసభ్యుడవు కావలయు ననుచు
నెనుబదవ యేడు వచ్చి కవ్వింపఁ దన్ను
దాదభాయినౌరోజీ యత్నస్థు డయ్యె
తద్గృహంబు నాటికి వారి తావరంబు, 118

గీ॥ తారసిలి కన్నతల్లిముత్యాలనవ్వు
శిశువునోడలు నలంకరించిన విధాన
పాలధారలఁ గురిసెఁ బ్రభాతవేళ
జగము తచ్ఛిశువే యేండ్లు జరుగుగాక. 119

ద్వి॥ యువకుల హృదయమ్ము లుత్తూత లూగఁ
బ్రవచించె లజపతిరాయి వావాదు. 120

చ॥ చదు వను ముక్కుతోడఁ దమ సంతుకుఁదిండి గడించి పెట్టు పు
ల్గుదుటుములౌదురో! మరియు గోనెను మోసినయట్లు విద్య మో
యుదురో! స్వదేశగౌరవసముద్ధరణమ్మున కా నరత్వమే
చదివెను, ఛాత్రులార! సరి సల్పుడుప్రాచిఁబ్రతీచి కన్నిటన్. 121

గీ॥ గృహమయములు కారాదు మీ కీర్తి కళయు
దేశమయములు కావలె, తిన్న తిండి
జీర్ణ మౌనొకో! మాతృదేశీయసద్య
ఊనగతి స్మృతిరా శౌర్యసూనులార! 12

గీ॥ మీ తరమున లారీక్రిందిబాతుగ్రుడ్డు
కరణి మన దాస్యము తుమురు కావలయును
మొగ్గ లగు మీరు వికసించి యగ్గలము సు
గంధ మొలుక హాయిగఁ దుదిగాలిఁ బీల్తు. 123

గీ॥ మరియు నిటు లజపతిరాయి మాటలాడె
భారతీయవిద్యార్థి సభాంతరమునఁ
బదపదరసితకఁ తాళబంధురమున
లండనున వాక్స్వతంత్రతామండనమున. 124

క॥ కలిసియుఁ గలియక నిరువురు
పలు గోష్ఠుల దినము రెండు పలు పురములలో
నలసియు నలయనియక్లే
తెలుపుచునుండ్రి భరతోర్విదీనస్థితులన్. 125

క॥ హాాయలు "ఫిరోజా"వన్నియ
బయలున తూరుపుననుండి పడమరదాకన్
పయిడిదరుల నడి ద్రావక
మయి ప్రవహించినది పాటలాంశువు సంజన్, 126

ఉ॥ రాళ్ళు కరంగ మున్ను మధురావని దివ్య డోకండు గొల్లడై
పిల్లన గ్రోవి నూదె నని విందుము భాగవతాన, తద్ధ్వని
న్నల్లపులుంగుగొంతున సనాతన మౌనటు దార్చి పశ్చిమా
తల్లికి వించె సృష్టి, కలదాః మురళీరవపక్షి కానిచో. 127

చ॥ పలుకుచు గోష్ఠిలో వెలుగు వైద్యుతదీపము పోవ రేయి, మీ
జిలిబిలినవ్వు వెల్తురు విశేష మమూల్యము మాకుఁజాలు, మి
క్కిలి యగు యుష్మదాదరణ కి మరపీవన సాటియాః యశ
స్సలిలధులారః యం చనియె సఖ్యలు కేకిసలాడ గోఖలే. 128

చ॥ పొరుగునవారి మీ జనము పోలిక నారయు డన్న క్రిస్తుప
లొ్కరవడిగా మెలంగు డన గోఖలె మీ నిలు పొప్పుకోము మా
పరిసరమందు నందులకె భారతమందును, నిండియా బ్రిటిష్
కలుచుక లేవుగా యనె నొ కాంగ్లుడు లేచి సదస్సు నవ్వగా.

గీ॥ "కాలఘన్" కాలఘనుడు, త్రి "త్రీ", లవలియు
ను "లవులీ", రావెనున్ రావణుండు, "వెగ్ర
సరు"ను వగ్రేసరుడు, నిటు పొరుగుదనము
శబ్దములఁ గల దని బ్రిటిష రనె నొకడు. 180

గీ॥ మా దినుసు ముట్టరా దని మీది తీర్పు
మా మనసు మిమ్ము ముట్ట సమంజసం బె?
యనగ నొక హూణు, డిట్లనె నపుడు గోళ్లె
మాధనము తినువా రెల్ల మాకు హితులు. 181

గీ॥ అన్ని ఖర్చులు పో భారతాయము నలు
బదియువాలుగుమిలియన్ల పౌన్లు గాగ
నేడు మిలియన్ల పౌన్లవే! యిందుఁ బ్రజకు
మిగిలినది. రగిలినదిపో! తెగని బాధ. 182

ఉ॥ నైకవిభేదవతులు కనంబడనట్లు గుబుర్లఁ గల్గి నా
నాకలవాదముల్ సలిపినన్ గుణసంతతి కొప్పుఁగాక పల్
పోకల పల్కులం బలుకు పోబడి సజ్జనజాతి కొప్పునే
మా కనె నెట్లురాణి? యది మాయుట యెట్లు ప్రభుత్వవాక్కులన్.

గీ॥ దళితగోధూమము మరి బీజలము నైన
పొలములోఁ బెద్దపెద్దకుఁ బులుగువోలె
భరతభూమిఁ బ్రత్యుద్యోగచరిత మాంగ్ల
జనము, దేశీయభాగ్యము తనరు టెట్లు? 184

గీ॥ గూడుకట్టుట నెవడు పుల్గునకు నేర్పె?
బ్రిటనునకు స్వతంత్రతను నేర్పినది యెవరు?
రోమను లటందురా! కాదు గ్రామికంబు
స్వాత్మ, భారతజనమున కంతె నుండు! 185

శా॥ 'హారన్ బీం' తెలు పెంతో, పువ్వులును పెన్నందమ్ములే, వైనవే
మీ రవ్వంతయునేని చీల దిగదై యీ వృతకాండమ్మునన్
మూరెన్ సమ్మెటత్రోత, యట్లె ప్రజ చెప్పుంగాక పై వ్రాయిచే
తోరంగమ్మున నొక్క మాట చొరదై దై వారె మా చేతలున్. 186

క॥ పొడు గెదుగుచుండు నీడయుఁ
బొడవడగుచునుండ నెండ, పొడవడగుచు మా
గడన బ్రిటనుదినుసులఁ గొన
నుడుగుట పొడుగయ్యె భారతోర్వి నొక దెసన్. 137

ఉ॥ మీ రడుగంగఁ జెప్పితిని మేవడి యీ పని ప్రస్తుతస్థితిన్
దారులు మూసి పిల్లినయినన్ జడిపింపగ మీద దూకకు
న్నే రయ మొప్ప నయ్యెది, మనీషి యెం? కర్జను దోపిగాక, మా
భారతమందు వంగము ద్విభంగముసేయునె! యూమతింతుమే! 138

ఆ॥ వె॥ పీచిపీచి లేదు విసుగు గాలికిఁ, దిమ్మి
రియును పులుగు కాలికి, యతమాన
భారతాళి కటులె వైఫల్యచింత లే
దండి! బ్రిటనుప్రజ సధర్ములండి! 139

గీ॥ నిప్పులు సెరుగు నెండల కొప్పుఁ జెప్పి
తనువు నాశ్రితులను బ్రోచు తరువులట్లు
ఘనులు పెక్కురు పచ్చని గుణముగలరు.
ధర్మనిష్ఠులు, దేశభేదమ్ము లేదు. 140

గీ॥ 'ప్లేను'చెట్ల నిరువైపుల నూని నిండు
నీడ తనరు ఘంటాపథ మీడనటులు
రాజకీయము నడుపింపరయ్య! నేడు
బ్రిటనుప్రజలు! భారతరేఖ "విటమిను" లుగ. 141

క॥ అని మరియున్ గోఖ్లే లం
డనులో, సహచరుడు 'లీడ్సు'నన్, 'గ్లాస్గో'లో
నను 'మాంచెస్టరు'న నిరువు
రును వాచించిరి "యెడింబరో"లోన్ సభలన్, 142

గీ॥ అధినివేశపాలన మిండియాకునో? య
టంచు వా రొక దొరగారి నడుగుచుండ
ప్రశ్నమే జవాబుగ వచ్చెఁ బంజరస్థ
మైన మైనాముఖమ్మున నతడు మెచ్చ. 143

ఆ॥ వె॥ ఇండియా ప్రసంగ మెత్తగ మీ రాక
యిచటి కిపుడు బొంబయిపురినుండి
యా? జల మట దండియా? యని యిల్లె మ
ళ్లింపఁ దొడగె మాట లిబరలుదొర. 144

గీ॥ ప్రొద్దుతిరుగుఁగుపువ్వులమ సుమి! భరత
ఖండమే లోకబాంధవమండలంబు
కలిసికొందము తరువాతఁ, దెలియు మీకుఁ
బ్రాణ మేకము మన కని పలికె నొకడు. 145

ఉ॥ వచ్చితి రెట్లొ వచ్చితిరి, పౌరనియోజకవర్గసీమలన్
జొచ్చి 'బరో'ల 'బర్గు'ల మమున్ లిబరల్సును పార్లమెంటు కం
దిచ్చి చనుండు, భారతముదీప్తిని నాడు కనుండు; కొల్వు లం
దచ్చము మీవె యంచుఁ బలుకాడిరి కొందఱు, మెచ్చె గోఖలే. 146

చ॥ లజపతిరాయి పల్కె హితుడా! తిలకింతము పెక్కుచోటు లాం
గ్లజనపదమ్ములన్ ప్రకృతిలాస్యసదమ్ముల, నస్మదీయ మా
ప్రజనఫలం బి దొండె, లిబరల్ ప్రజ పండుగఁ దోచి చేదుగా
గిజ రగు దోసకాయ, మన కెప్పుడొ 'లేబరు'పార్టి తో డగున్. 147

క॥ లేబరుపక్షం బయినన్
దా బెడుకదు భారతీయధరనుండి ప్రజల్
రాబందుల వలెఁ బొడువని
చోఁ, బాయునె! జాతి వచ్చుచున్న ధనంబున్. 148

ఆ॥ వె॥ భారతులకు వ్యష్టిపరమస్వభావము
ముఖ్య, మాంగ్లులకు సముఖ్య మద్ది
దేశలాభకరము తెకువను సమష్టి
గా సమాజమందుఁ గాంతుర్వారు. 149

చ॥ మతమును దీనికై తగిన మార్గము పట్టెను, వ్యష్టి శుద్ధుడే
యితరుల వర్తనమ్ముల పరీతుయు నయ్యెడుదాక ముక్తి తే
దతనికి, దేవు డన్న దిది, యాండ్రనుగూర్చిన తిండ్రిమంటుతో
గుతిలయు లేక జాతి కొనగూడెను సాంఘిక మైన స్వేచ్ఛయున్.

క॥ వేదాంతపు తిక మకలే
ప్రాదుర్భూతములు కావు, స్వాతంత్ర్యముతో
మేదురమో నరకంబున్
సాదరమే, యటులు గాని స్వర్గ మితరమే. 151

గీ॥ భారతీయరసాభాసపద్ధతులను
గౌరవించి పాశ్చాత్యసంఘంబు ప్రజల
కందు బాహ్యమైన నీతినే యాదరించి
జాతి ప్రాణము, మేను దేశ మని తేల్చె. 152

చ॥ జడియక యున్నదున్నటులు సర్వము తెల్పుట, పంక్తిలో నిలం
బడి జగడమ్ములేనివడి పైనము సేయుట వస్తుజాల మం
గడిఁగొనుటల్, బలమ్మున నకార్యమెదుర్కొట, కార్యమున్ దటిక్
బడి నొనరించుటల్, బ్రిటిషువారల యొద్దనె నేర్వ కో వలెన్. 153

చ॥ అన విని గోఖలే నిజ మ దంతయునున్, లిబరల్సమీదికే
మన మిది గుంజుచున్నయది, మంచితనమ్మున వారి కించుచున్
మన యధికారమున్ గొనుట మాన్యతమం బని చెప్పుచున్న దో!
యనఘ! య టంచుఁ దత్సహితు డైచనె నల్గడఁ బర్యటింపగా.

సీ॥ కంపజిట్టలు గానకలవింకములు 'సిరిన్'
జీనువాపులుగులు జానుగులకు
నాకుజొంపములతో 'నక్రోట్లు' సుమనిక
రములతోఁ 'బీవిట్లు' ఘ్రాణములకు
పూచిన యెన్నొపువ్వుల మడుంగులును లే
లేతపచ్చికబీళ్లు నేత్రములకు
భారతీయులకు మా స్వాగత మని మంద
హాసు లుపపురనివాసు లెదకు

గీ॥ ధారవోసిన యాతిథ్యసారమున ను
పన్యసించి రా యా చోట్లఁ బరవశించి
గోఖలే లజపతిరాయి, కోవిదులును
జాను పద మన నింగ్లీషుజనపదమున, 155

క॥ ఎగురుచు పాడెడి 'స్వాలో'
ఖగముల రుత మటులు వారి కంఠ మనుగులన్
దగ నాకర్షించె నడ న
రుగునపు డొకచోటు విడి మ రొకచోటునకున్. 156

క॥ తెలిపువ్వుల 'ఛెస్ట్‌నట్' పై
గల 'సాంగ్‌స్పారోలుఁ' బోలి గగనవదను లై
యెలుగింత్రు మధురముఁగ భ
క్తులు దేవునిగూర్చి సుకృతికొమ్మలు పూయన్. 157

క॥ అని యిటు భక్తిన్ మొదలిడి
వినిచిరి వాచనము వోట్లు వేయగ నగు నొ
క్క నెలవున నొకరి తరువా
త నొకరు వారు భరతాంబతాటంకమణుల్, 158

ఉ॥ కోయిలగ్రుడ్లనుం బొదిగి కోయిలపిల్లలుగా నెటింగియున్
వాయిని వాయిఁజేర్చి కొనివచ్చిన మేతలు పెట్టు రాబినుల్
మీయవి, క్రీస్తుబోధమును మీ కెటింగిచును పక్షు లిందు భ
ద్రాయువులార? యెన్నుకొనుడాః భరతావనినోమువారలన్. 159

ఆ॥ వె॥ ప్రభుతయందున జనరంజకుల్ వలయు, స
త్కార్యభంజకులకు స్థాన మేల?
పావురములు పాలపక్షులు వలెఁ గాని
'యోకు' చెట్టుమీదఁ గాకు లేల? 160

క॥ పట్టిన విఱుగును 'విల్లో'
చెట్టుకొమ, లుదారు లటులు చెఱపరు మీమా
పట్టుదలల, లిబరలుగా
జట్టుగలిపి మనలఁ బ్రోచు సఖ్యులు వలయున్. 161

ఆ॥ వె॥ భరతపక్షికూత వారిది, ప్రక్కకుఁ
జనక పైకిఁ పైకి సరిగ నెదిగి
లాలితమ్ము గొలుపు "లాంబరడీ" వృక్ష
శాఖలండిః వారిచైదములును. 162

ఉ॥ వారలు రాక వంచకులు వత్తురొ వాసిలి రైయెదునేండ్లు నిం
డారక ఆకు రాల్పని సిడార్ల వంశం బగు పార్లమెంటులో
నీరము లయ్యె గచ్చ లనిపింపదొ! యింటికి దెచ్చు వేడు బ్లా
క్థారను' చెట్టుకొమ్మల బత్తాం తయుతమ్మల భవ్యకాంతులై?

చ॥ పొలుపుగ రంగు లూని పసుపుకొమ్మల్ మెయి బుడ్లు విద్యుదా
భలవి కసుల్ వెలుంగఁ గనుఁ బడుఁ జేసిన నేమి గ్రుడ్లగూ
బలు పరిహాస్యముల్ గదః రవం బశుభంబు, నమాయికంబు లా
పులుగుల కీతి రీతి యగుయి, ముష్కరు లేల్బడి నుందు రా బడిన్.

క॥ తలకాయ లెగురవేసిరి
పలువురు మీ రనినయట్లె వర్తింతు మటం
చు లలిన్ దద్భాష విని, త
రలిరి మరొక యెడకుఁ దద్విరాజితభణితుల్. 165

గీ॥ అనధికోన్నత మాచ్ఛాద మమరు బహువి
శాలశాలన్ జరించిన లీలఁ దోఁచె
దిగువనుండి పర్దిలిన కొమ్మ గల "ఫర్మ
హీరుహావనమ్ముల విహరించునపుడు. 166

ఆ॥ వె॥ తమకు మించి యెత్తు తగఁ బండి గోదుమ
పైరు పిలువగ నెగబడరి తల్లి
యొడికి వలెనె బాలు రుల్లాసభరితు లై
సకలజనుల జనని సస్యలక్ష్మి. 167

క॥ ఎనిమిదిచదరపుమైళుల
ఘనాటవిన్ వేట యొక మృగయుఁ బోషించున్
దనరునో గోధుమ మా మే
రను పొల మై యాఱువేల ప్రజఁ బోషించున్. 168

శా॥ ప్రారంభోత్సవ మౌనె? సాధిమకు మర్త్యత్వమ్ములో గోధుమ
శ్రీ రాకున్నెడ, వచ్చె. కొంత పసిఁ బశుం బోచె, నక్షత్రసం
చారంబున్ గమనింపఁజేసె, నిది యంతా యేల! తాఁ పిచ్చులై
చేరె న్నాగరికత్వ మీ పయిరు వేసీవేయకే వెన్నుపై. 169

ఉ॥ గాదిలి పంటయున్, బలముగాదెలు మేనులు దాని పంటతో
గోదుమ, కోయగాబడెడిఁ, గోయబడెన్, దెస లన్ని తిత్తులై
యూదెడు పెద్ద కొల్మి యగచున్నది పట్టపగల్, మొగిళ్లు స్వ
చ్ఛోదరముల్, నభం బనెడి యొడ్డగు నంగడిలోనిపుట్టముల్. 170

ఆ॥ వె॥ ఎండవేడి సోకి యెండిన రొట్టెను
పాలముపోయిని నీటఁ బొలతి కాచ
దున్ను హాలము నాపి తిన్నాడు మగడు టీ
తోడఁ, బుట్టగొడుగు కూడ రుచియె. 171

క॥ వాన యొకటి కురియుటఁ బడె
మైనమునందుఁ బలె గుర్తు మట్టిన్ డొంకన్
జేనుల్ దున్నగ 'ట్రాక్టరు'
రా, నది యొక వింత బాటరకుఁ బల్లెలలో. 172

సీ॥ అరత్రమవంశంబు నానేమొ! వీరిది
యనిపించు పాటలతనువువారు
నాసికాదండమ్మునన్ దూచు తలపుల
జిగిదేరు దృఢగండయుగమువారు
కత్తిరించినకావికంచెమీసమ్ముతో
మోసగింపని బృహన్ముఖమువారు
భ్రూకుంజములను నవ్వుల పుంజముల నూను
తుదిముడుతలకన్నుదోయివారు

గీ॥ నేలుసారాయితో శ్రమ మీగువారు
జుట్టుచుట్టు నీడ యొసంగు బుట్టటోపి
రైతులు. త్రివాజిహాలముతో క్షేత్రతలము
పోయిపో! యని దున్నుట లరయవలెను. 173

గీ॥ పాలికుడు బుజావర్తను, డాత డెందుఁ
జూచినన్ వంశ లేమిని చూచి మెచ్చు.
ప్రకృతిభోగభాగస్థుల త్రయము లేదు
ద్వయమె, హాలచాలకుడు పశుపాలకుడును. 174

గీ॥ నరపుతో-వశిపఱపుతోఁ గొఱనునందు
వంకికట్టుపయిన్ హస్తవదన మాన్చి
కనుల గొఱ్ఱెలకాపరి కళుకు లొలికె
నాత డారోగ్యజీవనస్ఫీతనదము. 175

ఆ॥ వె॥ పార్లమెంటుతోడఁ బని లేదు, మిన్నులు
విరిగి మీదఁ బడిన వెఱయు లేదు
నింద్రియముల వశమునం దుంచుకొనువాడు
గొఱెలఁ గాచువాడు సరిగ నొకఁడె. 176

మ॥ అది బంగారము క్రుమ్మరించినది నీలాబ్దంబు, వర్షంబుగా
విదితం బైనది, భూమిబీటలబడిన్ వ్రేళ్ళూని యా పైడియే
కద! సస్యాకృతి నొంది వీథిఁ బని స్వాకారంబు ప్రాప్తించు, ని
య్యదియే కిట్టు సువర్ణవృష్టి నది యొం దైనం బురాణమ్మునన్..

ఉ॥ పొట్టలు తెల్లనై కపిళముల్ గఱు లై యలరార, నల్లనౌ
మట్టముముక్కుతో నినుక 'మార్టిను' పుల్గులు వాకయిర్దరిన్
వెన్నెట్టనఁ దొల్చి, గూండ్లమర నిల్చి యటన్ వెలిఁ దొంగిచూచుచున్
బి ట్టెలుగించె, లోని వెల వెల్వడి కోర్కులు సందడించెనో! 178

గీ॥ ఇవి వసంతమ్మునుండియ యిటులు సంద
డించు, నది ముంచు వేళ నదృశ్యములును
మఱల మధువునాటికి గూండ్లు గుఱుతుపెట్టు
కొని యరుగుదెంచి సరిచేసుకొని ధ్వనించు. 179

శా॥ స్వాలో బాటల బంకమట్టిగొని పల్ పర్యాయముల్ తెచ్చియో
క్నాలంబం దొకచోట గిన్నెపగిదిన్ గావించుచున్ గూడు ప
త్రాలం బైఁ దొడిగెన్ గనంబడనటుల్, తన్నిడమే మేడ యై
హాలన్ దేలెను, మేడ కూలి పడినట్లే తృప్తియే లేనిచో. 180

ఉ॥ గ్లానున నంచు లంటి తొనకాడని ద్రాక్షరసమ్ము వోలె నిం
డై సెలయేటి నీరము బొటాబొటి నాదవారిత్తటమ్ములల్
మోసియు చిందలేదు పెనుపొందిన భూమిరుహాల వాయువుల్
మోసల నూదినన్, స్ఫటికముగ్ధము లోగడ భాస్కర ప్రభన్, 181

శా॥ 'సైకిల్'పై నరుదెంచిదుస్తునొ గసుల్ జాలొందువా రెందఱో
జోకన్ జేసలఁ బట్టఁ చుందురు సరస్సున్ జేరి యం దొక్క డెం
తో కాండయుఁ జెల్లచేపఁ గనలేకు డెన్, గనెం బుల్గు 'నే
పీ కన్నా రెపుడినంతలో, రుతిని చెప్పెన్, వాని కె ట్లర్థ మౌ? 182

క॥ సెలయేటి పాట నర్థము
కలవింకధ్వని నెఱింగి గట్టు పొదలు చె
ట్టులు పుట్టలు శ్యామలములు
తెలిపెన్ 'టిట్లారుకు'ఖగరుతిన్ దమ తృప్తిన్. 183

గీ॥ గాలి గానముగా మాఱి, గలగలమని
యేఱు పాఱి, పసరున సృష్టి సొరుమీఱి
యచట భుజియించు చలిది సహస్రగుణము
చవికలది. సౌధగోష్ఠభోజనముకన్న. 184

క॥ వనమున విం డై, తమ నుతి
ఘనమునఁ గ్రం దై యటు కొనసాగించిరి వా
చనమున్ గోష్ఠిలజపతి
మనీషివరు లొక్కచోఁ గ్రమమ్ముగ గోష్ఠిన్. 185

క॥ నెలమచ్చ నెలకె యది వె
న్నెలకున్ లేదు, పలు పూలు నెఱఁ దెల్లన, మి
క్కిలి తెల్లన నీరము, గ్రీ
ష్మలక్ష్మి తెల్లనిది రేయిఁ జల్లనిదియునున్. 186

ఉ॥ చేవలు దేరుచున్నయవి చెట్లునుచేమలు లోరసంబు మెం
డై, వికసించుచున్నయవి యన్ని సుమమ్ములు సూర్యకాంతి నిం
డై, వెడదల్ ఛదమ్ములు, తృణాంకురముల్ పొడవుల్, సమస్తమున్
దావల మొక్క భారతజనంబు విశా శుభదీప్తి కెల్లెడన్. 187

క॥ చాకులుగఁ దోఁచి తృణములు
బాకు లిచటి వయ్యె, నచట పాండవవీడై
శాకుంతనీడమున కే
నీ కసవులు లేని కఱవు లెన్నో వచ్చెన్. 188

గీ॥ ఎఱ్ఱగాఁ గాఁచబడుచున్న యినుపకడ్డి
నిన్ వినా యెల్ల లాగికొనెం బ్రభుత్వ
మిండియాయూళ్ళలోనఁ జెల్లింతుమండి ;
కఱ వఱగ శిస్తు ముందు కన్న రొద వినక. 189

ఉ॥ పూవులు రంగురంగులుగఁ బొంపిరివోవుచుఁ గాని శూన్యముల్
తావులు, నైకభేదముగఁ దా నుపనామము లెన్ని దాల్చినన్
జేవకు దూరమై యడవి 'ఛెట్టి'యుఁ ద్రోవకు దూరమై మముం
బ్రోవగ నెంచు నేలఁబడి పొందిన వెట్టియు నొక్కరూపగున్.190

చ॥ నలుబది యేండ్లు కాగనె ఘనమ్ముగ 'లిండెను' చెట్టు సౌరభ
మ్ముల నెగదొట్టు పూలు ఫలముల్ గలదా, నిరునల్పదయ్యె నే
డులు భరతావనిన్ విభవలుండన మేసుడి! లండనీయ మే
ల్బడి, పదవుల్ మముం బెదవులాడిన నొక్కె భవజ్జనస్వముల్. 191

ఉ॥ క్రూరఖగమ్ములేని తమ గూండ్లకు దగ్గర నున్న పిట్టలన్
గాఱియపెట్ట కుండుటలు గంటిమి, లండనులో స్వరాజ్యవా
చారతులైన భారతులనైచు ప్రభుత్వము గంటి, మిండియా
నీరము ద్రావ నేమగునొ! నిండు స్వభావము మాఱు దీనికిన్.192

చ॥ లలిత 'మిలెక్సు' మాను వనలక్ష్మికి బండరు, వాకు లుండు నిం
దలివి ద్వివత్సరమ్ములు, వదంపడి రాలు, ప్రభుత్వశాసన
మ్ములు ప్రతివత్సరమ్ము పడిపోవుచుఁ గ్రొత్తవి పుట్టుచుండు హ
క్కులకొఱకై ప్రజల్ సలుపు కొత్తల నాగగ భారతావనిన్.193

క॥ మా క్షితిని ప్రజాపాలన
మక్షయసుఖ మిడగ మాకు నది మీకు నగున్
పక్షులు రాల్చిన విత్తుల
వృక్షము మొలచి యది వాని కిరవున్ గాదో! 194

ఉ॥ 'రోవెను' కుక్కకట్టియుఁ దరల్ విరబూచిన పూల రాశి మీ
వావిరి వాసి, మీ బలము ప్రాప్రజయమ్ము హసించి తోచు 'హాలీ'వెడకావిపూదుటుములిల, నయో! యెటువచ్చి మచ్చ యిం
దౌ!వడి భారతమ్మనకు హక్కులు మీ రిడకుండ టొక్కటే. 195

ఆ॥వె॥ రంగునందె కాని రవములో లేదు భే
దఁబు బ్రిటనుభారతంబులందుఁ
గోయిలలకు నటులె, మీకును మాకుతే
దంతరంబు హక్కు లడుగునెడల. 196

గీ॥ ప్రభుతకన్నను బ్రిటనులో ప్రజయ మేలు
మా యభాగ్యప్రవర్తయమానవర్త
మానమునకన్న భావి మే, లీను నావు
మేలు వట్టినావునకన్న మిత్రులార ! 197

గీ॥ మేము మీ కాచు మా కోర్కె మీరు చెప్పి
భారతమ్మునకు స్వరాజ్యభాగ్య మిడెద
మే మనెడి వారిసే పార్లమెంటు కెన్ను
కొని చదురు నోము డాంగ్లనీతినిధులార ! 198

గీ॥ మీ యశోకవనమ్మును మేము చూచి
యపుడు తచ్ఛాయలోనఁ బ్రత్యూహ మయ్యె
పాలిపోయిన భారతభాగ్యలక్ష్మి
మీ విభీషణసాహాయ్య మెంచినాము 199

మ॥ అని యాభారతపండితద్వయ ముపన్యాసమ్ము సాగింపఁగా
విని యాంగ్లప్రజ సంతసించియుఁ దుదిన్ విస్ఫార కర్ణంబు చూ
చెన గై ప్రణిపతించినొక్కని దెసన్ జిజ్ఞాసమై, జెప్ప నా
తద్భావ ౦ సాన భూతి పకట బై కేకసల్ మ్రోయఁగా.

ఆ॥వె॥ ధూళి పొగయు లేస గాలి కడిగిన జ
లమ్ము లొప్పు సరసు లొమ్ము గలవు
పైడిగనుల బదులు బయలు, నారోగ్యపు
ములైమళ్ల బ్రిటనుపల్లెటూళ్లు. 201

ఉ॥ దాగురుమూత లాఁకుకొని తారొ్కని పెట్టెలు పుంజు లర్మిలి
న్నాగటిచాళ్ల లోఁ బోలమునన్ విహరింపఁ బోలమ్ము బీడునున్
లోగిలి ప్రక్క పక్కగ మనున్ బహుభూమికృషీవలుండు చు
ట్టాగిన పచ్చకంచెకు వెడల్పగు ద్వారము సౌఖ్యతీర మై. 202

ఉ॥ పక్షియెలేనివాడు ధర పండదు, మానవజాతి యుండ, ద
ధ్యక్షము కీటభక్షివిహగాళికి రూకను వింతకాకి, క్షే
త్రక్షితి నూత్నసీరహలితమ్మున నీ తెగ వ్రాల వానిలో
రక్షణ కుండు కొన్ని దెసలం గనుచున్ వెతజాడ నార్చుచున్. 203

గీ॥ ఇంత తెలివి మెదలు చున్న నేమి డేగ
తన్నుకొనిపోయె నొకదానిఁ గన్నుమూసి
తెఱచుకాలమ్ములో సాము తిరుగకయె, యె
రను గొని చను 'నానోసెకండు'నని బైరి. 204

క॥ గాలికిఁ బచ్చని తఱగలు
గ్రాలు కొఱను సుఖముకొలను బ్రతుకున కేనే
చాలిన మూదల ననియె వి
లోల 'చ్చిఫ్ చాఫ్' ఖగావళుల పలుకులతో. 205

క॥ పసరమ్మువీపుపైఁ గ్రిమి
విసరమ్మును తినుచుఁ బులుగు విపదను పసిక
ట్టి సరగఁ గూయుచుఁ దెలుపును
మిసిమిగొనుఁ బరోపకార మీ వడి జగతిన్. 206

శా॥ పూయన్ జాలక తావు లీనవు గులాబుల్ తేనెపిల్పుల్ 'బటర్
ఫ్లై యూర్చిన్సులు' బీటిరాణి మొలకల్ వైలెట్లు, ప్రీవెట్లు ని
శ్లే యెల్లర్లును, పర్ణమాత్రమున వాసించున్ ఖళిః మొల్క 'టా
న్సీ', యేతత్ప్రసవావళిన్ గొఱను భాసించున్ హరిద్రాభ మై.

ఆ॥వె॥ వెన్నగిన్నె ముక్క పెరిగి విరియఁబూచి
పసుపు చల్లి గఱికపస నడంచెఁ
గొలిజనమును గెల్చె మలిజన మన్నట్లు
కళదిడాలు కడిమి కానవాలు. 208

గీ॥ ఎద్దుకన్ను 'డైసీ' పూల బొద్దుకంచె
నవ్వుచున్నది తొలియెండజవ్వనందు
జంట వీడి బెళువ పొదరింటిపైని
కూయుచున్నది తన కూయి క్రోసు వినుప. 209

క॥ క న్ననుభవించినందము
లెన్నిటి మది యనుభవించు? నే కొన్నిటినో
యన్ని యవి, బ్రిటనునందున
నున్నయవి, మనమ్ము మరల దొకవరి గనినన్. 210

ఆ॥ వె॥ ప్రతిభ చిత్తమునకుఁ బగిది పచ్చని చెట్ల
కంచె శాద్వలమున కందగించు
నందు భావములు, విహంగంబు లిందున్ ధ్వ
నించి చుట్టరికము నెరపుచుండు. 211

గీ॥ గ్రుడ్లపైనున్న పెంటి యా గూటి వెలికి
రానటుల మట్టితోఁ గప్పి రంధ్రమునను
తిండి యందించి పిల్లలు గండుకొనగ
మట్టిదీయు నొక పులుంగు గట్టి దొర! 212

ఉ॥ ఇచ్చట దాచ రంచుఁ దలపించెడి చోటుల దాచి విత్తమున్
ముచ్చుల కందనీని జనముల్ బలె పక్షులు కొన్ని వాని రం
గెచ్చిన చిన్నగుంటల శిలేధ్మరవాస్సుల గ్రుడ్లఁ బెట్టి మేల్
పెచ్చుగ జాగ్రతం బొదిగి పిల్లలఁ జేయుట మెచ్చుకోవలెన్. 213

ఉ॥ గడ్డిని బంతి చేసి, యొక కంతను రాకకుఁ బొక కుంచి, యే
టొడ్డున చెల్లులోఁ బొదుగుచుండును రెన్సులు దీర్ఘనాసముల్
గ్రుడ్డుల, నట్టి నీడములఁ గొన్నిటి నాడది కట్టి వానిలో
దొడ్డవసం ది దంచు నయిదో డన నందె వసించి గ్రుడ్లిడున్. 214

ఉ॥ బడ్డి యెవండొకో! ప్రకృతిచైదము తీర్పరి యై వచింపఁ గేం
బ్రిడ్జిని శాస్త్రముల్ జదివి పెద్దగఁ బేరు గడించుగాక, 'పా
ట్రిడ్జి' ధరాతలమ్మున నిడెన్ దన గ్రుడ్లను, బ్రోవ జాలె, భూ
రుడ్జతరమ్ము నీడ మయి బ్రోవగజాలవ పక్షు లెన్నియో. 215

గీ॥ 'ఫీల్డుఫేర్లు' 'వైట్ థ్రోట్లు' 'రెడ్ వింగ్సు' వచ్చు
ప్లోవరులు మంజిమమ్ములఁ బొదిగి స్మృతికు
లాయముల నరశాఖ నుల్లసిల జేయుఁ
బులుగుఁ బ్రేమింపని యెడంద పలుగురాయి. 216

ఉ॥ భారతు లిర్వురుం బ్రజకుఁ బల్కిరి నావిక లీ ధరాతలం
బారయ మూల మైనవి విహంగములే, వల పన్ని కాల్చి త
న్మారణ మాచరించుట లమానుషముల్, చెఱబడ్డ పుల్గులన్
భూరిదయామతిన్ విడిచిపుచ్చు డటంచు ననేకగోష్ఠులన్. 217

క॥ దయ మూన్యము, క్రియ శూన్యము
నని యెపుడో యెవ్వడో యనన్ విన్నా నెం
దునో, మతి వచ్చిన దిపు డిం
దున నది యనె లజపతివిబుధుడు గోఖ్లేతో. 218

చ॥ విడియెద లోప్పు రావినులు వీనుల విందుగఁ బల్కు నేమి? యె
క్కడ విడిరంగు కన్పడినఁగాల్ ద్రవుచుంబయిదూకుచుండు, ప్రము
క్కడిపను, లిట్టి వేయగును, కార్యము లన్నిట నెల్ల రేకతన్
గడిగి స్వరాజ్యసాధకులు కం డని యె న్నవురోజి వారితో. 219

గీ॥ పోయివచ్చెద మని దాదభాయియొద్ద
సెలవుగైకొని రిరువురు, చెప్పవచ్చి
నట్టి లజపతిరాయితో ననియె నిటులు
శ్యామజీకృష్ణవర్మ శౌర్యమ్ము మెర్మ. 220

మధ్యా॥ కాకులు బలె గాలిలోన గారడివిద్దియ చూపి
చేకొనగలమె రాజ్యమును సింహోపమజనభోజ్యమును
లోకువయగునె సృణిహాతి లుత్తమదమ్మ కానిది య
నేకపంబు? మన శస్త్రరుచి నెఱుగని దీ ప్రభుత్వంబు. 221

గీ॥ ఒకటి సేయుడు ప్రజ నెల్ల పోరుకొలిపి
యీ ప్రబోధము భారతీయప్రపంచ
మందుఁ, దగిన విద్యార్థుల నంపు డిటకు
ముగురఁ జదివింతు నిట, వారి పోప్రపు నాది. 222

గీ॥ అత్యధికసంఖ్యాకుల నల్పసంఖ్య
జనము పాలింపగా నపుంసకము కాక
యుండు నెట్లు సంఖ్యాశబ్ది? ముల్లము ప్రీతి
భారతీయునందును నేడు భాంబు కాదొ? 223

మ॥ క్రిమ మౌపద్ధతియన్న రాతఁబడి ముక్కల్ చెక్కలై పోయె డెం
దము మాఱొంట్లది, యింక యేలుబడివంతై యట్లగున్ గాతః శ
స్త్రమహోఘాతములన్, ప్రియత్నములు నిష్పన్నమ్ములీనాటినుం
డిమొదల్, కార్యగృహాలుప్యారిసున బెర్లిన్ లోన్ సుసంపన్నముల్.

మ॥ కల రీ యుద్యమ మొప్పి తోడుపడు పెక్కండ్రైరిషుల్ సార్థకా
ఖ్యులు, నీ బోరిలునను ధ్వనించి బలమున్ గోల్గొల్పగాఁ బెట్టినా
ను లనదోభధపయఃప్రిదానసుర ధేనూపుత్రికం బత్రికన్
వెలుతున్ ఫారింసుననుండి పత్రికలు నిర్భీఃజర్మనీనుండియున్. 225

గీ॥ బాలగంగాధరునకు నా వందనములు
నొడువు మరవిందు సానుజా, నడిగితి వని
లజపతీ! నిను గని మది లగ్గ కెక్కె
నీర లందు, నే నిందు, గె ల్పెందుఁ బోవు? 226

క॥ మనలోఁ దెలి వొకరిదియుఁన్
బని యొకరిది యౌనుగాక, పడరా దీ కెం
డును నింద నొకటిచే నొక
టనువున మెయి గాచుకొనుచు నడరగవలయున్. 227

ఉ॥ అంతము దేనికేని కల దన్నతడో? ప్రతిభాయుతుండు, యు
ద్ధాంతరహీను డై చివుకునాతడొ ధైర్యయుతుండు? జీవితం
బంతయు వెండివెండి యను పల్లవితో నొక పెద్ద పాట, యో
డంతయు గెల్పునందు జమయైయెదొ శేషమువచ్చు లెక్కయున్.

ఆ॥ వె॥ ఓడి వచ్చి పొదర నుండి నృపు డొకండు
సాలెపురుగు తంతుజాలవాయ
విఘ్నపట్కమునకు వెనుకాడ కేడవ
తడవ నెగ్గు టరసి తాను నెగ్గె. 229

ఉ॥ భారతజాతి కంతకును పల్కక యొక్కని కేల చెప్ప నెం
తే రహి? నందువో లజపతీ! ఘననేతకు నీకుఁ జెప్ప నీ
సారము జాతి కందినది, సాలము పొందిన దాలవాలవి
స్తారితవారి, పాంచనదసంతతియే జయదాయి యెన్నడున్. 280

మ॥ అడుగన్ విస్మృతినందినాడను హితేంద్రా! తీక్ష్ణవాగ్ధోరణిన్
నడలన్ జేయుఁ బ్రభుత్వధీరత సభ 'సర్దారజిత్సింగు', నీ
కుడికే లై మనునేకదా! జెయిలునన్ గోడొందె 'నంబాప్రసా
దుడు' 'సూఫీ'కులు డాస్తి పోయి ప్రభుతాదుశ్చర్యనెట్లుండెనో,

శా॥ ఆ సూరీంద్రుని దొంటిచేయి, రచితవ్యాసాలు కోదండవి
న్యాసాలై పలుకుల్ నెఱామలుకులై యాంగ్లప్రభుత్వాంగమం
దా సంధుల్ వికలమ్ములోయి! ప్రభుతాదానోద్యపలభ్యార్థ మెం
తో నీకొట్టె నతండు, భారతము రత్నోదంత మవ్వానిచే. 282

క॥ నా విని యానౌ ననె, సౌ
ఖ్యావృతులే యుభయు లనెఁ, గ్రమాగామిని నీ
త్రోవ కనె, సెలవుగొనె, గో
ష్ఠే విడిదికిఁ బంచనదభగీరథుడు చనెన్. 283

గీ॥ అసలె చలిదేశ మిద్ది, న్యాయంపుఁబాలు
గడ్డగట్టునేమో! శీతకాలమం ద
టంచు వేసంగిలోనె యిం దరుగుదెంచి
యరుగు హితులకు శుభ మనె నైరిషుతతి. 284

క॥ జాలరుల వలలు కొంగల
యోలగ మేల్పడిగ, భారతోర్వీపసిడి మ
త్స్యాల కువగఁ, దలపించెను
కిలాలధియొడ్డు రాజకీయపుబొడ్డున్. 285

ఆ॥వె॥ నల్ల టోపి గలవి నలితొగరంచుప
సుపుముకులు తగఁ బెలుచోట్లు కొల్ల
గొట్టునవియు 'గల్సు' 'స్కూవాలు' 'జాగర్లు'
వారి పీడుకొలిపెఁ దీరమందు. 286

ఆ॥వె॥ శిలలు తిరుగవేయు పులుగు 'టరన్‌స్టోను'
'సాండుపైప' రినుక సద్దు కలది
పేరు నడతబట్టి మాఱుచో నరజాతి
యెంత బాగుపడునో యింతకంటె! 287

చ॥ నవనవలాడు సుందరవనమ్మునఁ వెన్నెల ప్రౌఢిలిన్నెలా
రః వచన మిందు మీది యవురా!యను నాంగ్లులతో మహీధర
ప్రవరదరిప్రభాత మిదిరా!యనిపించు వెడంద మీ యెడం
ద,వెడలివత్తు మంచు నిధిఁ దద్విబుధుల్ పయనించి రోడలన్.288

# బెంగాల్ ఖండము

గీ॥ నిర్విరామశ్రమంబున నెట్టు జబ్బు
చేసి శస్త్రచికిత్సతో సేమ మందెఁ
బోతమందె గోఖ్లేసూరి, పులుగడిగిన
మౌక్తికము వలె మెఱసె బొంబాయి చేరి, 1

గీ॥ గురువువంటి ఫిరోజిషా, కరివి నీవు
పెద్దపులి లజపతిరాయి, యిద్ద రించు
మించు నొకశ్రుతిప్రమోయుట మెచ్చఁదగును
దూరమున భిన్నమతులకు దోస్తి యగును. 2

క॥ నౌరోజీ సుఖరయే? త
ద్ధోరణి తెల్పు మన, సుఖరయె, దొందము తెరు వో
భారత మొక తెరువునఁ జని
యూరె! స్వరాజ్య మని దొరలఁ బృచ్ఛింత మనెన్. 3

గీ॥ అమెరికాకుఁ బోబోవుము న్నాలకించె
లజపతిబుధుండు హింస తక్క జయ మిడు స
మస్తయత్నములును ప్రజాహస్తనూత్న
భవ్యరేఖలు నని దాదభాయి పలుక. 4

మ॥ సభలందు న్నపురోజి ప్రాప్యము స్వరాజ్యంబె, యిదే భారత
ప్రభ,సాధ్యం బిది తోడనే యనిన నొప్పన్ లేదు 'మార్లే'ముఖుల్
రభసం బీయది యంచు వందు మనవారల్ కర్జనున్ దూరియు
న్నభముం దాకిన రాజకీయశిఖ కౌనా మెట్లులే కెక్కుటల్! 5

క॥ అని చెప్పెను గోఖ్లే,'షా'
జననాడి పరీక్ష చేసి సరిగా నే నె
య్యానువునఁ బలికెద నీ వ
య్యానువునఁ బలికితివి మిత్రమా! యని మెచ్చెన్. 6

మ॥ చనె గోఖ్లే నిజపట్టణమ్మునకు, మర్షూరే! బ్రిటన్‌గోష్ఠివా
చనముల్ నీయవి సౌధసేచనము లై సొరోందె వంగోద్యమ
మ్మునకున్, వింత తెగించి పల్కిన నినున్ గోపాలరాయా! నుతిం
తును పూజింతు నమింతు నంచు తిల కెంతో పొంగె భారిసభన్. 7

గీ॥ మల్లెపూలు మామిడిపండ్లు కొల్ల బెట్టి
నా వుపన్యాసమున నాంగ్లభావుకులకు
మాకు వినుపింపు మికనుండి మానవస్వ
తంత్రతానయిటింగేల్ రుతమ్ము సఖుడ! 8

మ॥ నే నేమో యనుకొంటి నింతదనుక న్నీ ధీరతన్ వాగ్మితన్
దా నీనాటికి పీ॰మాత యిది పూనా, దీనితో భారత
శ్రీ నీ బిడ్డడె ఒక్కకొల్కికినిదెచ్చెన్ లండనున్, వీనిగా
కేనిన్ గాంగ్రెసధీశుఁ జేయ నవె గోఖ్లేవంశచూడామణీ! 9

ఉ॥ నేడు ఘొటోదిగెన్‌గదవె! ని న్నొడిలోఁ గొని భారతాంబ, యీ
పోడిమి, చాటి పత్రికలు పొల్చెను పౌరుషధాత్రికల్, నినున్
వేడెద గోఖలేకులమణీ! యిపు డున్నదె చాలు పల్కనన్
వేడిమి, దీనినిన్ విడకువే! పెదపెద్దవకీళ్లు చెప్పినన్. 10

మధ్యా॥ అని నొడువుచు లోకమాన్యు డా గోఖలేమెడన్ వై చె
ఘనతరమందారమాల, కావచ్చు నిది వాడిచిన్నె
యని సదము కరతాళయుగళావిష్కృతమనోనినదము
వినిచె వినమ్రము డై సరము వెలిచి గోఖ్లేమహాశయుడు. 11

మధ్యా॥ లోకమాన్యుని హృది చాల లోతు, మందారమధువుల
ప్రాకట్యముకలది, నాకుఁ బ్రాప్తము తద్రుచి నేటి
కి కార్యమునఁ, గృతజ్ఞుడను, హీరంబు కాంగ్రెసాకాంతు
నాకు, వ్యక్తుల పొగడికకు నడరఁ, దెగడికకు నడల. 12

సీ॥ 'జార్జినెథానియల్ కర్జ'నౌరంగజే
బొకసె యేల్బడి ననుటకు వెఱవను
అధినివేశస్వత్వ మర్థింతు, యత్నింతుఁ
గాదుకఠ్కస మని కలికిఁ జొరను
పూర్ణ మౌ స్వాతంత్ర్య మును కోర, నాంగ్లాధి
కారంబులోని యోగ్యత మఱపను
ఊరంత యొక త్రోవ, యులిపికట్టె యొక త్రో
వ యను వారల ను క్తిమెయిఁ గఱవను

గీ॥ పప్పునకు నుప్పునకును సంబంధ మెంతొ
నాకుఁ గ్రమవర్తనమునకు ననువు నంత
రాజక్రియసాంఘికసంస్కరణము లేక
కాలకల్యాణకరణముల్ గాఁ దలంతు. 13

క॥ అని మరికొంత పలికి కొ
ల్వునకుఁ దెలిపె ధన్యవాదము బుధుడు గోఖ్లే
వినుపించెను పరిషద్వర
మణమునఁ దధిపతి లోకమాన్యుం డిటులన్. 14

మధ్యా॥ ఈయన లజపతిరాయి యింగ్లాండులోఁ బ్రజగూర్చి
యీ యిండియాకోర్కెతెలుపు టిపుడె ఫలింపదు, దీన
నే యేమి యగు నిల్లలుకగనే పండు గానె! యధికృతు
లాయ మౌ సాయము సేయ, రన్నిపతములవా రంతె. 15

మ॥ తనియం బల్కి యరంటిపం డొలిచి చేతం బెట్టిన ట్లేది కా
దన రీ హూణహితుల్, శపింత్రు మనమ ల్లై నింద్యులన్ వీరు,నెం
దను కి ట్లాఁమన తోడునం బ్రభువులౌదన్కన్,బయిన్?బై నిచూ
చి నిదానింపు డటంచ్రడు,చూడమొకొ!అతింబక్కముల్ మాటునేః

ద్వి॥ అని పల్కె తిలకు తదాస్థ నానాడు
కణకణలాడె వాచనము మర్నాడు. (16—ఎ)

గీ॥ సార్వజనికసభాంతర సందు లేదు
పిక్కటిలిరి శ్రోతలు, వినుపించు వక్త
ఆ వినాయకసావర్కరగ్నిసంఖ్య
నేడు పెట్టి హెచ్చించిన యీాడు కలడు. 17

ఆ॥ వె॥ దేశభక్తులార! నా సంస్థ యభినవ
భారతాఖ్య. మిద్ది ప్రాతక్రొత్త
కలయికలకు మిద్దె, కల విందు సూట్లు ధీ
వతులు కుచ్చుటోపివయిజమాలు. 18

ఉ॥ ఏల్పడి మండలీకృతి రహించినటుల్ సమితీకృతమ్మగా
నుల్బణ మెల్ల రాష్ట్రముల నుద్ధతిభాధితభారతాంబికా
కిల్బిషహారిసంస్థ యిది, కే ళ్ళసృగార్ద్రితరక్తవర్ణముల్
బుల్బులుపిట్ట కూయు మనముల్ గలవారలు రండు చేరికన్. 19

గీ॥ అమెరికా ఫ్రాన్సుజర్మనీలందు బ్రిటను
నందు నీ సంస్థ యను శాఖ కంట్లు ద్రొక్కు-
చుండి, రనతికాలమున సూనోదయంబు
గుప్పు మనని సుగంధంబు గుణధులార! 20

క॥ చేతల యూారపుతీరుపు
చేతము భారతము, తంత్రశీలితవేదం
బై తగు నభినవభారత
చాతురిచేతం బ్రజ సింహసంహనన మగున్. 21

గీ॥ భారతాత్మ సింహమ్మన వఱలుం, గడుపు
మండకున్న వేనిని౦ ఔండకుండి మఱలు
కావలసినది జాతికి గౌరవ, మది
ఖండిత మగునెడ కడుపు మండకున్నె! 22

గీ॥ కష్టమునకేని యొక హద్దు కలుగకున్న
మనుజుడు తెగింపం బూనని పనియు కలదె?
వ్యష్టికష్ట మ ట్లుండ సమష్టికష్ట
మన్నది యగౌరవంబునకన్న కలదె? 23

ఉ॥ ఒళ్ళు కనంబడన్ దగిన యుఫ్ఫని యూదఁ జలించు వల్వలున్
రైళ్ళు, తపాలసంచులును, వ్రాతల ముద్రణముల్, మెఱుంగుదీ
వెల్లవమేని వేని మురిపించును? విద్దియరానివాని, వి
ద్యోల్లసితుల్ సహింతురె! నిజోక్తికిపీనులొసంగనేల్పడిన్. 24

మ॥ ప్రజ వేడన్ వినరాని యేడుని మహారాష్ట్రమ్ము భాగించిన
ట్లె జడున్ గర్జనః నాడకుఁటిమటె! నే డీ వంగభాగక్రియన్
గజముల్ కొల్చిరొ మంటబెట్టితిమ ఛే! గ్లాస్కొ-పటాలన్, మహా
భుజులారా! మెయి భారతం,బవయవంబుల్ సర్వరాష్ట్రంబులున్.

ఉ॥ రెండుగ నైన వంగమును రే పతికించి ప్రభుత్వ మీ ప్రజా
చండిమ కోర్వ కొక్కటిగ సల్పెను గా, కతికింపనేర్చునే
రెండుగ నైన మానసము, రెక్కొనఁ జూచునుగాక భారతం
బుం డిగనాడునే! మనము పూనిన దక్క పటిష్ఠరీతిమై. 26

ఉ॥ సభ్యులు కండు మత్రప్రబలసంస్థకు, తద్భృతనైకభేదశీ
ఘాభ్యుదితాత్ములై యువకు! లర్హ్యాకృతిన్నతిగొండు, మాఁయెడన్
బిభ్యదరాతితల్ గతుగ పెద్దలు దీవన లిండు, వైభవం
బిభ్యము! తెండు, పండ్లు మన యేత్తైలకొమ్మల ముష్టిబంధముల్. 27

గీ॥ వ్యర్థమే యగు నర్థము, బలము పొలము
నలమినలమే, యవద్యయే యగును విద్య
దేశమందు సర్వోత్తమదీప్తిశాలకు
కానినాడు, పౌరుష మసదైననాడు. 28

క॥ అని సావర్కరుకంఠము
వినిచె మరియు భారతమున భీమగదాకిం
కిణి యగుచు, తద్బలమ్మున
వనాయుజము లాలకించువారి మనస్సుల్. 29

గీ॥ వ్రాత లెక్కువ చెల్లని పత్రమునకు
నటులె గీతలు చెల్లని నాణెమునకు
పార్లమెంటు చెల్లు ననుచు భారతమున
నాణె మైన వైస్రాయినిం బంపె నిటకు. 30

గీ॥ వాని పేరు కర్జన్, వాని పత్రిమందు
వ్రాతలే వాని గీతలు, ప్రజల యెడను
కాటువేసె నం దొక జిహ్మగంపు గీత
వంగభేదాఖ్య, మాతని పదవి నదియె. 81

ఉ॥ తూరుపువంగమందుఁ దమ దొడ్డబలంగము గల్గి ముస్లిముల్
'తేరె కమాల్ పసం' దని నుతించిరి పెక్కురు కర్జనున్ బ్రజా
వైరిని, నేను కాంగ్రెసును ప్రాణము తీయక రాజభక్తిని
స్వైరము సేయ కేగ నను వానిని బింకము రాజధానినిన్. 83

మధ్యా॥ అంతంతమాత్రపువాని కంద దతని దర్శనంబు
చింతిలక తన దర్జాను చెప్పులతో బైట విడచు
నంతరాగతుడు, కర్జనుమహాత్మ్య మది యెవర్జి యెఱుగు
కాంతాసము అని నృపుల్ నగల్ దాల్చి యిట మాటబడిరి. 84

గీ॥ అతనిబుద్ధియెదుట వక్రకాగ్రముగ కు
శాగ్ర మగపడు, చిటికించినంతలోనె
నిర్ణయంబు, తత్కార్య ముదీర్ణ మవుదె
జటిలవిషయ మెఱుగదు కర్జనుచరిత్ర. 85

ఉ॥ ఘోరము వంగభంగకృతి కో; యని యెల్గిడనేమి, తమ్మతూ
ర్పారగఁ బట్టినన్ బడమ రాలఁగఁ దిట్టిననేమి యన్నిటన్
బారిగ మోచి వాకవడఁ బొంగెను కర్జను నిర్ణయంబు, దు
ర్వారము పోటునన్ బ్రజ యపాంనిధి, తుంగతరంగముల్ సఫల్

ఉ॥ వాకొనివార లుర్దుకవివర్గము 'తుఖ్ లఖు'వచ్చె నేడు భి
న్నాకృతి నంచుఁ బంచనదమందునఁ గర్జనుగూర్చి, 'సీజ'రి
ష్టే కడరోజులం దనిరి యింగ్లిషునేర్చినవారు, సంస్కృత
శ్రీకులు జన్మ మెన్నడో చెప్పిరి రావణి యెత్తినట్లుగా. 87

ఉ॥ గ్రామములం బురమ్ములఁ బురాణము చెప్పుచు రేల రచ్చలన్
రామకథన్ మనీషులు మరాటులకున్ దిలకార్యు శాసనం
బై ముడివెట్టి రాకరుల పాలన కాంగ్లకరవ్యపాలనన్
గామెర రాజకీయ మనె కర్జనుకంటికి వెజ్జువెజ్జునన్. 88

గీ॥ ప్రజకు వలయు నాగటిగీత పదియురెండు
గీతలగా లేద, యేల్పడి కీత యనుచుఁ
గర్జనున్ లోకమాన్యుండు కడకుఁ ద్రోనె
వచ్చినట్టి వై ప్రాయీాల వరుసయందు 39

గీ॥ నాటినాటికి దిగజారు నేటి దశను
వలికె సేమము నెగ త్రాకు వగిది గాగ
తెలియలేదు ప్రజానాడిచలన, మేమి ?
రాజకీయ వైద్యుండు కర్జ ననె నతడు. 40

శా॥ ఆవేశమ్మునకున్ విమర్శనము తో డై లౌకికాలౌకిక
శ్రీ వొందించు నెటుల్ మనమ్ము నటులే చెందించు స్వాతంత్ర్యల
క్ష్మీవాల్లభ్యముఁ దోడు వంగమునకున్ మెం డై మహారాష్ట్ర మీ
యావద్భారతమున్, గ్రహించెఁ బ్రజ సత్యంబున్ ద్విరాష్ట్రమ్ములన్

ఉ॥ ఏమి గ్రహించినన్ వివణి కెక్కవ మిక్కిలి రాజకీయముల్
కామిత మల్ప మెయ్యదియొ కల్గిన నయ్యది తీరుదాక గుం
పై మొర దెల్పి నాయకుల యండన యాపయి రచ్చబండలం
దే మృదుధోరణుల్ ప్రజలు, తీండ్రకుఁ గాంగ్రెసు తేదు వారలన్

క॥ జనమందుఁ గొంత చోరబడి
తన క్రమయత్నంబు చేయఁదగినంతయుఁ జే
సినయది కాంగ్రెసు కావథ
మునుండి ప్రభుతన్ మరల్ప ముక్తగళం బై. 42

క॥ ఎప్పుడు ? తప్పనిసరి యై
నప్పుడు, బలతిలకజనహృదరవిందములన్
గొప్పగ నావేశమ్ములు
చిప్పిలి నప్పుడు ప్రజల్ రసించినయపుడున్. 43

శా॥ అన్నం బెంతయొ బోధ మంతియ యదేదైనన్ సకాలమ్ముగా
దిన్నన్ విన్న రుచించు జీర్ణమగు, సందీప్తమై మహారాష్ట్రమున్
ము న్నెన్నండును కానియంతబలితమ్ముగా లోకమాన్యుండు చే
సె నైజం బగు కేసరిత్వమును గర్జింపించి వంగస్థితిన్. 45

గీ॥ సభలు మీవి వ్యాఖ్యాయుధ ప్రభలు కల్క
టా మొదల్ కడపల్లె కూటాలదాక
నాసురేంద్రహలీంద్రను దేశభాగ
ధేయరంగీయులార వంగీయులార ! 46

చ॥ అగపడనట్లు విన్పడని యట్లు నటించెడి నౌర! లఘులా
దిగ పజ దూయబట్టి తన దిమ్మరిచేతల రాజవీధులం
బిగిసిన బారు లైతె మెఱవణిన్ జన వంగము నెల్లెడన్ రెయిం
బగ, లిది యేమి యేలుబడి! వంగకు డో! హితులార! దేనికిన్. 47

చ॥ కని విని కొట్టినం బ్రభుత కండలు కావివి బండలే య టం
చును మహనీయుబంకిముని శోభితగీతము నాలపించుచున్
వనముల చెట్లు పెల్లగిలి వచ్చెనొ! వంగసమూహ మెచ్చె, వీ
ధిని చనలేదు సైకిలు, నుతింతు స్వదేశ్యము యుష్మదుద్యతిన్ 48

క॥ మీ యాగస్తుమహోద్యమ
మీ యెల్లకు సార్థకాఖ్య మెంతో గురిసెన్
స్వాయదృలవర్షము జా
తీయత పండించు వంగ తేజములారా ! 49

శా॥ వందల్ వేల్ బ్రిటనంబరంబులు రగుల్పన్ బావకజ్వాలతో
'వందే మాతర' మంచు భారతిని నివ్వాళించు మీ హారతిన్
సందృశ్యత్రప్రభుతంత్రయంత్రతన ప్రతిజ్ఞాయజ్ఞ పూర్ణాహుతిన్
వందింపన్ దగు వర్ణమాల యిరవొందగా లేదు వంగప్రజా ! 50

క॥ వ్రాతల వ్రాలిన జతనల్
చేతల నిలబెట్టి సెగలు చెరిగించెడి నీ
కై తోడు సిఖలభారత
జాతి మొకసె, వంగమా! పిసరు లొంగకుమా! 51

గీ॥ దూరగత మైన నేమి మీ తీరు కనులఁ
గట్టిన ట్లై శరీరము గగురుపొడిచి
యుట్టటల నూగుచున్నది యురక లెత్తి
మా మహారాష్ట్రజనము మైమఱువు మీకు. 52

శా॥ మీపై నాడిన వెన్ని యో ప్రభుతదౌష్ట్యమ్మున్ దండముల్ భారత
క్ష్మాపత్రిత్యాత్మను గుర్తిమ్మె నన్నియు నహాఃసంపూర్ణ శోభాకృపిన్
మీ పాలించిన ముందునాగలికి వంగీయపత్రికా! యందుకో
వేః పొత్తిద్దుంబోడువుంజిగిన్ దగిన మా యాబంతిపూదండలన్. 53

ఉ॥ పాలితు లెట్లు చెప్పెదరొ పాలకు లట్లు వినంగ లెప్పలై
గారిలుదు, రట్లు కానియెడ రాలుదు, రాంగ్లులె సాతు లీయెడన్
జాలదు భారతం బటులు సల్పగ శస్త్రవిహీన మౌట, న
ట్లై లఁలితప్రయత్న మగునా! తగినంతయు సేయకుండునా! 54

ఆ॥ వె॥ కత్తి లేనివాని గొత్తియుఁ గఱచు, నా
మాట లేల యిపుడు? మనము దాని
పట్టు వెరచునపుడు, బంధింతము ధనంబు
బ్రిటను పొందనటుల వీలుకొలది. 55

క॥ స్వాతంత్ర్యవేళ నింగ్లాండ్
చేతకలుగువస్తువును నిషేధింతు, రిదే
మీ తప్పు కా దమెరికా
చేత, మనకు దిక్కు నీ విశిష్టక్రియయే. 56

గీ॥ ఇది బహిష్కారయోగమె, యింకొకటియు
నది సహాయనిరాకరణాఖ్యయోగ
మేలుబడికి సాహాయ్య మందింపకునికి
ప్రభుత లేవదు కునికి యీద్వయము చెనకి. 57

గీ॥ జ్ఞానయోగంబు సాంఖ్యయోగంబు నది యి
ది యొనయు ననుభవించు దుస్థితిని త్రెంప
కాల్బలం బాశ్వికబలంబు కరణి నివ్వి
పోరు కాని పోరున మిథఃపోషకములు. 58

శా॥ ఓ నీయోగయుగమ్ము బోధము నవ్యాఖ్యల్ గ్రంథముల్, తత్ఫలిన్
రానౌ లాభముకన్న నాచరణముం బ్రత్యక్షమున్ జూడ నెం
తే నౌ లాభము, వంగ మేగి కనరే! నేతల్! స్వరాష్ట్రాల న
ష్టే నిండింపరె! యుద్యమమ్ము నగరాళ్స్వాంతరాసంస్థితుల్! 59

మ॥ మితవాదుల్ మతిపాదు లెందఱో యిటన్ మిల్లుల్ పటాలన్ సుమ
ప్రతతిన్ వల్లు లటున్ సృజింపగ బ్రిటన్ వస్త్రా నిషేధించుటన్
బ్రతిపాదింతు మటందురే! భళి! జల బందున్ బ్రవేశింప కే
విత మీఱాడగవచ్చు? దీక్ష తోడి మై విచ్చుం బువుల్ కోరికల్ 60

గీ॥ ఇంతమంది వత్తు రటన్న నంతమంది
కైన గుండిగతో వండు నన్న మొక్కడు
ఎవ్వరును రాక వండి వా డేమిసేయు
నటులె దీక్షితులకు స్వదేశాంబరంబు. 61

ఉ॥ పెండిలి ఖర్చుపెట్ట మిక వేలుగ రూప్యములన్, బహుప్రజన్
దిండికిఁ బిల్వమున్ మనకు దేశజయమ్మన రాజ్యమేలఁ గోఁ
బండుగ వచ్చుదాక, మనువారము స్వామితవ్యయమ్మునన్
దండిపిరమ్మొ తొల్త, నయినన్ గొనువారము దేశ్యవస్తువుల్. 62

క॥ కేవలపట్టమ్ములకై
కావు కలాశాల, లొజ్జగమి ఛాత్రులనే
భావనల భరతమాతకు
సేవిరి వేయింపవలయుఁ జిత్తాసనకున్. 63

ఉ॥ మూడవ కన్ను కాని చదువున్నను లేనిదె, యాత్మగౌరవం
బూడిన మేనిలో నసువు పోయినదే. యెది దేశభక్తికిం
బోడిమి లేదొ అట్టి బడి పూచిన మోదుగుతోడిదే. యిటుల్
రూఢిగఁ దెల్పె యాచరణరోచన మైనది వంగ, మబ్రతిన్. 64

ఉ॥ ఒజ్జనుబట్టి వానియుడుపు న్మఱువుం గని చోద్య ముట్టి నే
డొజ్జల గౌరవింపరు శుభోదయతద్ధ్వని భారతాంబపూ
సెజ్జగనైనఁగాక, పరసీమలవారల పంతులుల్ సరే
యొజ్జలబతులే పలుకకుందురొ దేశభక్తరోక్తులన్. 65

గీ॥ పూర్వపదము పోర్వ బ్లై యపూర్వగురువు
'స్పెన్స' రోకడె, 'సెల్ఫి'యు నెల్ఫియుఁ గాని
మా ముతుక మాటలం బడి మాఱుమసల
రాదు, రాజకీయముల మార్దవము లేదు. 67

క॥ దేశీయులు జరిమానా
దేశికు లై శిష్యులకు విధింతురో! దైవా
దేశముక దే! స్వాతంత్ర్యము
దేశోత్సవకారకుల్ గదే! విద్యార్థుల్. 68

శా॥ మొన్నన్ మొన్న నె కాదె! గోఖలె బ్రిటన్ భూమిన్ బహిష్కారయో
గౌన్నత్యమ్మును పన్యసించి సభలన్ గల్హారషండమ్ములన్
విన్నుంజూలి విధాన నూపినది, యే విఘ్నుండునున్ లేదు త
ప్పన్నాతండు మ రెట్లు త ప్పిచట? ధీవారాశికుల్ దేశికుల్.

ఉ॥ చాల యుపన్యసించెఁ, జెవిఁ జప్పుడు లిప్పుడుఁ బోవు, విశ్వవి
ద్యాలయమ దు లండనుమహాసభ ఛాత్రులకున్ స్వతంత్రతా
మూలము భారతాభ్యుదయభూజ మ టంచును, తప్పుపట్టలే
దే! లవ మెవ్వడున్ లజపతిన్, మరి యిచ్చ ట దెట్లు త ప్పగున్?

శా॥ ఏ వై పూర్వముగాఁ దుపాకి బుజమం దె ట్లూనుటో యిప్పుడే
లా? వాకొంటిని రెండుపాయములు తో ల్తన్ లేని వేయాయుధ
ప్రావీణ్యమ్మున మొక్కవోని వివిదొప్పన్ దైన్యమున్ ద్రోవ లెం
డీ! వీరప్రజలార! గెల్పు మనద డీ: పోర వెన్నీనిచో. 71

గీ॥ అయ్యనున్ జిచ్చ్యనే కాద యయ్యవారి
నిన్ గా వక్షు డెదురించు జఘన్యవర్త
నమ్ము చూచి, క్రమున క ర్తనమ్ము కాద
దీన, మన్నింపరాని దెందేని దోసగు. (71 ఎ)

గీ॥ ప్రజల వాంఛకుఁ దలయొగ్గఁ బలికి జారు
చక్రవర్తికి రష్యా పసంగమందుఁ
బలుక దౌర! 'లండను టైమ్సు' పత్రిక ఖర
తోర్వియుద్యమమునుగూర్చి హూణపతికి. 72

చ॥ అది పరదేశపత్రికల కైనది మూగతనంబు పక్షపా
తదశముగా, స్వదేశజనతన్ దగుకొందఱు దుర్విదగ్ధులై
వదరిన నస్మదుద్యమముఁ బైకొను హాని తృణంబె కాని చె
ప్పఁ దగిన మాట చెప్పెదము, వారిది సంశయ మైనఁ దీఱెడిన్.

శా॥ వంగం బొక్కటి యౌను గాక భరతాంబాశృంఖలాల్ రెండుగా
కంగీభూతశరీర మైన దిటుమార్తాండుం డటుంబొడ్చినన్
భంగం బొందద అస్మదుద్యమము, యంత్రాగార మాంగ్లావనిం
భంగింపంబడు, నొయ్యనన్ బ్రభుతతంత్రాగార మార్గావనిన్. 74

చ॥ ఇది ప్రజశక్తి యీ జతన, యీశ్వరసూతికరాగ్రమందు ను
న్నదియు నొకండు శక్తి, యది నాసి గుణమ్మునయందు దీనిక
న్న,దశనశీల, మొక్కెడఁ గనంబడు, నంతటఁ దానె యౌచు ని
య్యది దమనమ్మునం బగర నంబుధియావలియొడ్డు చేర్చెడిన్. 75

మ॥ ఒక వంగాంగమునన్ గవర్న రగువా డోహో! యనెన్ దీని వా
లకమున్ గుర్తిడి పుల్లరాఖ్యుడు, పరిమ్లానమ్ము హూణాధికా
రికసర్వస్వము భారతమ్మున నికన్ రేపెల్లుటన్ దీని ద్రుం
పక యంచుం బ్రజపై నయూధముగఁ బ్రోన్మత్తద్వీపంబెపడెన్.

క॥ ముంగాలు సాచి నడచుచు
నంగన్ వెనుకకును వేయు టనునది లేకే
బెంగాల్ బెంగాల్ మొగిసె, మె
ఱుంగు లురిసెఁబో! గవర్నరులు నరులెకదా! 77

గీ॥ వ్రాసె కేసరిపత్రికన్ వ్యాసము నిటు
లోకమాన్యు, డానందలోకైకగృహము
దాని గని వంగపంచనదాదిజనము
కనులు మెరమెరలాడె నాంగ్లునకు ఘనము. 78

మధ్యా॥ అమెరికానుండి విచ్చేసె నపుడు లజపతిరాయి, ప్రజ
గుమి రైలుస్టేషనుదరిని గూడె లాహోరులో, మంది
రమునకుఁ గొనిపోవ బండి రాజాలదో! వచ్చెనో! హ
నుమ రామునకుఁ బలె నయ్యె నొకడు తా వాని వాహనము.79

ఉ॥ వేడికి దుగ్ధముల్, చలువవెల్లికి నాత్మలు పొంగు స్నిగ్ధముల్
పీడునువీడు కూడి రవళించెను నేతకు స్వాగతమ్ము, క
న్జోడు ముదశ్రుతైలమున నొప్ప ముఖం బను తళ్కుఁ గుందు లై
వేడిమిపావలన్ ద్యుతులుపోః సహజమ్ములు మంగళారతుల్. 80

శా॥ తా నా పశ్చిమఖండ మేగుట హోయల్ దర్శింపనోః కాదు, వి
ద్యాసై పుణ్యనిధానబోధనవిధానాభిజ్ఞతాకాంతుమైఁ
దా నాధానముచేసినవ్విధము లిం దా గోష్ఠులం బల్కఁ నౌ
గానీ వచ్చియు నోటిదాక నవి పొంగన్ లేద వంగస్థితిన్. 81

క॥ ఇటు లై లజపతిరాయి ప్ర
కటించె శకటమ్ము వెనుక కశ్వమ్మును పూం
చుటగా వై స్రాయిపనిని
ఘటించె జోహారు వంగఘనతకు సభలన్. 82

ద్వి॥ కరము ఘనమ్ముగా కల్కటాపురిని
జరిగెను సభ యొండు సరిగ న త్తఱిని. 83

మ॥ వినుపించెన్ స్తవనమ్ము కొల్వుతొలి ఋగ్వేదాంతసూక్తాంగిరో
మునిసమ్రాట్కృతవర్ణనామధురసంబున్ ద్రావి 'బంకిం' రచిం
చిన ఝుంకారము గేయరూపమున 'వందే మాతర'మ్మంచు జా
తినిజాతిన్ గదలించి నాడి యమృతోద్వేలర్ఘురిరూఢిగా. 84

గీ॥ పండువెన్నెలదుప్పటి నిండు కప్పు
కొన్న పున్నమ వడువునఁ గొలిలి గోష్ఠి
పులకరించె నిలువున గీతి పలుకరింప
నిదురిలిన యంతరాత్మను కదిపికదిపి. 85

సీ॥ చల్లనైనది కవోష్ణం బౌచు నుడుకెత్తి
నది మలయజసమానమ్ము నయ్యె
శాఖలు పోయిన స్థాణువులకును తత్
క్షణము కెంజిగురాకు దండడించె,
వీళ్లను చౌళ్ల నె న్నెళ్లొ నాగటికట్టు
మోపకున్ననుఁ బైర్లు మొలకలెత్తె
గడ్డపాఱలు ప్రమోగి కఠిన మైన తడి రాని
చట్టుబండలలోన జలము లూరె
గీ॥ మూడుకాళ్ళ ముదుసలియుఁ, బేడి పిఱికి
యసి ధరించినయట్లు చే విసరి యార్చె
ఝుమ్మనంగ వందేమాతరమ్ముగీతి
మారుతమ్ము మోసుకపోయి మలయు మేర. 86

గీ॥ కత్తినాలుకవానికి ఖండశర్క-
రోపమోక్తియు, బ్రతుకెల్ల రుసరుస లగు
వాని శాణిముత్యపునవ్వు దాన మొసగె
రమ్యరీతి వందేమాతరమ్ముగీతి. 87

సీ॥ నీరు నిండారు కాసారమ్మునందు నె
త్తుని తమ్మి విరిసిన రాణ విరిసె
నాగస్వరస్వావభోగనాగర్య మౌ
కోడె త్రాచుపడగ వోలె నెఱసె
పరిణయోత్సవమందుఁ బారాణి పెట్టిన
చండికాచరణమ్ము చాయ మెఱసెఁ
కైలాసగిరితాండవాలోలచండీశ
కటకసజ్జము గజ్జ యటులు మొరసె

గీ॥ ప్రజమనసులో నొకానొక భావము పర
తంత్రతాకంటకారణ్యదావ మిక వ
కాతరమ్ము శిర మెత్తిన నీ తరమ్ము
లె మ్మని చెవి వందేమాతరమ్ము ప్రమోయ. 88

సీ॥ కిలకిల నవ్వి కేకిసలు భారతభాగ్య
లక్ష్మి కొట్టినది కే లంద మొలుకఁ
బసరు తీసెదను నీ బాహుకోటిషష్టి
నముచుఁ దిట్టినది రాజ్యాంగలక్ష్మి
బాడబాంబుదము నీ పైని వర్షించుచును
త్వరపడకే యనె భారతాంబ
యిదిమొదల్ మెదలుడీ! యెవరి తెల్వివి వారు
మాట లే లని విధి పోటుఁ దీర్చె.

గీ॥ చదువుచదువున హృదయము పావదేర్చు
తవర బంకిమచంద్రచటర్జిగీతి
ధ్వనిత మగు వేళ, నెండిపోవు నొక జాతి
సస్యచరితన్ స్తనిత మైన స్వాదువేళ. 89

క॥ అది యొక పంచాతరసం
పద 'వందేమాతరం' క్రమత్‌స్వాతంత్ర్యం
బు,దళించెఁ గుచితభావముఁ
గదలించె జవమ్ము నొక్కకడక న్నడకన్. 90

ద్వి॥ రచితము లజపతిరాయిచే లేఖ
యుచితము తొలిపతి, కున్న దం దిటులు. 91

ఉ॥ ఎందునొ విత్తనమ్ము మొలకెత్తును క్రొత్తగ నొక్కచోట ము
న్నందుగ, దేశ మెల్ల పొలముంగదవేః మఱునేట దానిదే
అందటిదిన్ స్వరాజ్యమువ కా పృథుయత్నము, నేడు దీనికిన్
గందువగడ్డగా ప్రథమగణ్యము వంగము కీర్తిశృంగ మై. 92

ఉ॥ వందలువేలు నే పనికి వచ్చిన వచ్చును తెల్లకాగితాల్
మందులచే మపిన్ మసటు కానొకో! తావులుతావు లేలువా
రికా దరఖాస్తు లై పలుకరింపగఁ గాక, అవహేళనవస్తుసం
బంధుల మెల్లవారమును మార్మసలన్‌వలె తెల్లవారికిన్. 93

ఉ॥ ముద్దులుగుల్కు పిల్లలకు మోదిలి కోరిక తీర్చుచుండరో
పెద్దలు, ముద్దు లేదు మురిపెమ్మును లేదు, ప్రభుత్వ మెత్తుకో
దద్దిర! ముద్దుముద్దువలు కాదెడు నేతల కోరికన్, దెసల్
దద్దరిలంగ వంగజనులార! ధ్వనించి యెదుర్త మేల్పడిన్. 94

శా॥ భూగోళమ్మునఁ దోలుకన్నులకు దవ్వుల్ దోపనీ, యాత్మను
శీగ్రోళమ్మున వంగపంచనదముల్ చేర్వల్ గదో! కూతపె
ట్టై, గన్నుల్ తగ తైజసమ్ములును, చిత్తాహంకృతుల్ రెంటి కె
ట్లో గాఢమ్ముగ నట్లు మైత్రి తగ నాటోపింత మర్హక్రియన్.

గీ॥ ఆమెరికాఖండమునఁ బెక్కు రనిరి భరత
ధరణి వంగసంఘట్టము నరచరిత్ర
లో సువర్ణాక్షరాధ్యాయభాస మనుచు
నేత్రములు నాకు సమ్మద క్షేత్రములుగ. 96

చ॥ లజపతిరాయిచీటి యిది లాజలు చల్లిన దక్షరమ్ములం
బ్రజపయి పాదలక్షపయి, పంక్తులు నూటిట వ్రాయవచ్చు న
గ్రిజ మగు భావముం బుధుడు వ్రాసెను దీపిల నిర్వదింట నం
చుఁ జదివెఁ గల్కటాసమితి సూరి బెనర్జి ప్తవమ్ము కాగనే, 97

ద్వి॥ కిల్లా కిటులు గోష్ఠికిఁ జదువఁబడగ
నెల్లరి ముద కోటి కెత్తెను పడగ. 98

ఉ॥ ఎన్నిగ వంకరల్ తిరిగెనేని సరిన్ జొరు పుట్టలోనికిన్
పన్నగ మన్నటుల్ మెలికబాటలఁ బీడ్వొని రాజమార్గమం
దున్నది యస్మదీయ ముచితోగ్రము సంచలనమ్ము, సర్వతో
భ్యున్నత మౌత! భారతము పూర్ణమనోరథ మౌతః దీనితో, 99

క॥ వంగముకడుపున నెప్పుడు
సింగములే పుట్టుఁగాని చీలులు కా, వీ
సంగతి పాలకతతి యెఱు
గన్ గడగుడు, పౌరుషమునఁ గానిది కలదే! 100

చ॥ ఉడుతయు రాము సేతువునకో యన నేనును వచ్చి సేతు నీ
పుడమిఁవి రత్నగర్భతనముల్ బుజు వౌటకు మిమ్ముఁగూడి నా
వడిమెయి స్వల్పకాలమున, వంగవసుంధరఁ దొల్లి ( దారకల్
పడి యవి మీర లైన ప్రజలార! కడక కిరీట మూనుతన్! 101

ద్వి॥ అని బరోడానుండి యరవిందఘోషు
పనిచిన యా లేఖ పఠితమ్ము సభకు. 102

ఆ॥ వె॥ పఠిత విపినచంద్రపాలు, విన్న జనము
ముప్పదై దువేలు, మోదశిశువు
హృదయశయ్యయందు నిటునటు దొరలాడఁ
గెరలి కొట్టినదియుఁ గేకిసలను. 103

గీ॥ కాశినుండి గయనుండి ఝాన్సినివార్ల
నుండియును కమ్మలు ప్రయాగనుండి వచ్చె
పత్రిక యగు బెంగాలీకి వంగకలన
భారతీయు లస్వప్న లైనా ర టంచు. 104

ఉ॥ లిఖితగాఁ బ్రభుత్వభ్రువశిన్ గను ద్రావిడు లంపి రస్మది
యతిశిసారకారకమహాజనులార! స్వరాజ్యచిద్వని
వృతభవత్ప్రయత్నముల కేమను శాఖల మంచు లేఖ ల
ధ్యతుడు పర్వుచెర్వునెఅతామరరేకులుగా నుతిన్ గొనన్. 105

గీ॥ జనము మంచముపట్టుగా ధనము నున్న
దాని నూడ్చిపెట్టి యుత్సవము సేయు
నెవడు? కర్జను తక్క, పఠించె సభలు
ఖే మనంగ లాల్ మోహనఘోషు తొల్లి. 106

క॥ ఆ లాల్ మోహను డేబది
వేల సభాస్తారులు నతివేలానంద
శ్రీ లెగఁజల్లగ నా లే
ఖాళి చదివి వినిచెఁ గంచుకంఠముతోడన్. 107

ఉ॥ దీక్షితు లైతి మేము భవదీయవిధానమునందు వంగవా
ర్యతములార ! దిగ్విజయ మౌ మన పూనిక కంచు నుత్తరం
బతతదేశభక్తు లగు నాంధ్రుల నేతలు వ్రాసి పంపినా
రతర మతరమ్ము హృదయాభరణమ్మన మౌక్తికమ్ముగా. 108

శా॥ గంగాస్నాతరవీంద్రగీతవిలసద్గానామృతోపేతది
ణాంగీభూతనిబద్ధకంకణులు నింకన్ వచ్చినారల్ ప్రజల్
తుంగం బయ్యె సదస్యసంఖ్య పదివేలుం బెచ్చు, నేనాటి గో
ష్ఠిన్ గై సేయద యంత, యా సభయుఁబొల్చెన్ వీటికిన్ వెల్వలన్

గీ॥ చదువగా 'శ్యామసుందరచక్రవర్తి'
సంశ్రుతాంధ్రసంగతి సభసభయు మాగి
పోయి కనుబొమ లెగిరించె మాయురేః ప్రభు
త నెదుర తెనుగుమీరె నంతట న టంచు 110

గీ॥ మంత్రపూతముగా హోమ మాచరింత
మాంగ్ల దేశ్యాంశుకములతో నని యొ కడు
మంత్రయుత మైన నందవో! మన సురలకు
వారు నవి కట్టిరా దనె సూరి యొకడు 111

ఉ॥ వేని నొసంగ డగ్ని మన వేల్పులకున్ దినువానిఁ దక్క 'స్వా
హా'నినదాన వ్రేల్చినను నన్యబుధుం డనె వహ్నియిష్ట మే
మేనియుఁ జేసికొని మన మీ నవచేలము లొవ్వఁ జెప్ప 'నా
హా'నినదానఁ దీరె నని యందఱి నిర్ణయ మయ్యెనయ్యెడన్.112

గీ పట్టణబహిర్జ్వలత్ బ్రిటన్ పటపటలద
హానమహోర్చి స్వగృహమంటుకొనిన యటులె
కల్కటాలోని ప్రత్యాంగ్లు డుల్కిపడెను
కాల దింతన మన కొంప కర్ష ననెను, 113

ఉ॥ ఒక్కెడ సాగుచుండె సభ యొక్కెడ యీ శిఖ రేగుచుండగా
నక్కడ కేగుదెంచె మును పన్నొనినట్లు కువిందబృందముల్
రొక్కములున్ గ్రహించెఁ బలురూపుల నేలలు నేయ మగ్గముల్
పెక్కువ సేయ కొల్విడగ, లేచెను మోహనఘోషు ఛాపి యై.

శా॥ ఛాయామాత్రులుగాఁ దలంచి భరతక్ష్మామండలీమర్త్యులన్
జేయంబూనె మనస్సు దొల్లిన యటుల్ చేతల్ ప్రభుత్వంబు తా
న్యాయాన్యాయవిచక్షణత్వరహితం బై, సాక్ష్య మీ వంగమున్
బాయల్ సేయుచె, యూరుకొందురె ప్రజల్ పాదద్వయిన్
సింహముల్! 115

గీ॥ మూడు వేళల ముచ్చోట మూడు సభలు
వత్సరమునుండి విభజన వద్దటంచు
నీ విదేశవస్త్రదహన మెన్నవదియొ
యిప్పటికి బుద్ధి రా దయ్యె నేలుబడికి. 116

మ॥ అతివాదుల్ మితవాదు లందఱును నే డై కట్టుగా సర్వసం
తతి "పిన్ టూ యెలిఫెంటు" నాంగ్ల ధరణీదత్తమ్ము నెద్దానినిన్
వ్యతిరేకింతము ముట్టుకోక యొక వల్వన్ గూర్చియే యేల? భా
రతవస్తుక్రయదీక్షఁ బట్టి ప్రజలారా! గెల్పు లాస్మాకముల్. 117

క॥ ఈ పూటన్ జనిపోయిన
రేపటికిన్ రెండు, వలదు బ్రిటిషౌషధముల్
చేపడనీ దానమ్ముగఁ
బాపపడగ బ్రిటిషునగ యపారార్థంబున్. 118

ద్వి॥ కత్తుల వలయముల్ కార్యాలయములు
తొత్తుల మై ప్రభుత్వోద్యోగ మంచుఁ
జొరబడినవాళ్లు పొరపడినాము
వెలివదు, మన మాట వినదు నేలుబడి. 119

క॥ చిలుకా! పలుకవె యనగాఁ
బలికినటులు నిదియుఁ దీని బాబున్ బలుకున్
గలికితనముతోఁ దెగ బ్రెం
పులు మన మొనరించుకొనిన మూఁడు సెకండ్లన్. 120

గీ॥ ఇంతటి మహోద్యమమ్మున కేము కాము
ప్రజలె సంచాలకులు ప్రాచ్యవంగజనము
బహుజనము నడచిన చోటఁ బాట పడును
మెచ్చి చనని నేతకు ముండ్లు గ్రుచ్చుకొనును. 121

మ॥ అని 'లాల్మోహనఘోషు' పల్కిన దుపన్యాసంపు సారాంశమై
జన మౌనౌ నని సందడించినది, ప్రస్తావించి శ్రీఘోషుధో
రణి మా ప్రక్కనె బాల యోర్తు బ్రిటను ద్రవ్యమ్ముగా మందు ద్రా
గను పొమ్మన్నది తల్లి వేడినను, పల్కెన్ సురేంద్రుం డిటుల్

ఉ॥ పుట్టినరోజుపండు గని ముద్దు కొసంగెను తెచ్చి గ్లాసుగో
పట్టణమందుఁ గుట్టిన యుపానహయుగ్మము మత్సఖుండు, తా
రట్టొనరించి నా మనుమరా అది ముట్టిన నొట్టు దానినిన్
బొట్టియ యేడు నేండ్లు మొనమొన్ననె నిండిన వంచు వాకొనెన్

క॥ ఔరా యన్నది ప్రజ, సొం
పారె ధ్వని తదుక్తిమురజ మరియును హాంసల్
సారించిన గఱు లటు వం
చారించిన యశము లొప్పె, సజ్జనులారా! 124

ఉ॥ సజ్జనులార యన్నపుడు శౌర్యము లో టని యెంచరాద, అ
స్మజ్జవధాని పూనిక యమాసను వెన్నెలగా, జలంధరాల్
విజ్జిననాడు నెండగ ఖళీ ; యనిపించెఁ, బ్రభుత్వ మేసినన్
లొజ్జను గాదు తేజు, బదులుం బ్రహరింపము, సజ్జనత్వముల్. 125

ఆ॥వె॥ ఎంతఘోరమునకు నేర్పడి యొడిగట్టె
దేశవిభజనమ్ము బాసబట్టి
సేయవచ్చుగాక చేయరానౌనే? యేక
భాషమండలముల భాగములుగ. 126

శా॥ హైందవసంఘ మొక్కటియె హక్కులుగోరును,వంగమందె యా
సందడి హెచ్చు, ముస్లిము ల సంఖ్యయు నందునె పెచ్చు, దీనితోఁ
బొందు కుదుర్చుకొంచు నది పోరును, రాష్ట్రము రెండు చేసి ద్వి
నన్ దత మైన తునకకు మనం బిడి దాని నొనర్త మద్యుతిన్.

మ॥ అని, పై వారును నీ తలం పెటులో య ట్లేగాక నాన్ దూగి క
ర్జనువై ప్రాయి రహస్యయోజనములన్ సాగించిసాగించి చీ
ల్చెను వంగమ్మును రెండుగాఁ, దుఱకలన్ జేపట్టినా నంచు గు
ల్కెను, తేలున్ బ్రజలార! దీనికులుకున్ గిల్కన్ ద్రిమాసమ్ములన్.

గీ॥ తూర్పుబెంగాలునందునఁ దుఱకలందు
విజ్ఞులైన కొందఱు నేడు బిక్కుబిక్కు
మనుటయుఁ దెలియుచున్నది, మానవుండు
సంఘజీవి, మతము లేదు సౌహృదమున. 129

గీ॥ వంగ మను పంచఁ జేసి ద్విభాగము నొక
తడికఁ బెట్టు కర్జను ప్రౌఢతనము నెంచి
మురియు జన మెరియు నికఁ బ్రభుత్వము నకుఁ
బ్రజకు నడి గోడ గట్టె వై ప్రాయి యనుచు. 130

క॥ చెఱపకుమా! చెడెద వనెడి
వరాల నీతి కపురాణపరిదృశ్యోదా
హారణము వంగముఖంగి
కరణము, ప్రజయొరిమ చెఱగ కధికము మెఱసెన్. 131

శా॥ లూతాతంతు వకృత్య మీ పనిగ నాంగ్లోయిండియన్ పత్రికల్
సైతమ్ముం బ్రకటించె, మమ్ముల జ్వాలజ్వాలావళిం జేసికో
కో! తీరైన ప్రభుత్వమా! యనుచు నెన్నో పెట్టి రర్జిల్ ప్రజల్
నేతల్, దానికిఁ జీమకుట్టినదియంతేన్ గాద యింతైననున్.132

క॥ వ్రాతలు లేతలు, మోతలు
చేతలు నిర్దిష్టకార్యజేతలు, లాలా
జీతిలకాదుల బోధ మి

ఉ॥ హింసకుఁ బూనుకోక మనకెంత సమర్థత యున్న దంతయున్
మాంసల మౌచు నేలెడిసమాజపుటాటలు కట్టునట్టు లు
త్తంసితసిద్ధి యౌత! మన దారి, జరూ రని లండనందునున్
శంసనకారి యౌత! హితసంతతి యంతయుఁ దొంటిపోలికన్. 184

క॥ సింధీకిం బంజాబీ
కాంధ్రునకున్ ద్రవిడునకు మహారాష్ట్రకున్
సంధించు వంగ మంజలి
సంధకుఁ దోడైన యెల్లజాతికి నెపుడున్. 185

క॥ సరిపెట్టె బెనర్జీ యీ
వరుసఁ బలికి, బిపినచంద్రపాలుడు లేచెన్
వఱలించె నుపన్యాసము
సరస్వతికిఁ దెలిసె తనదు శక్తియ దెంతో. 186

గీ॥ గుండె పగిలి వంగజనని కుములుచున్న
తరుణ మిది, స్వస్థముఁబొనర్చుదాకఁ బ్రజకు
వ్రీడయే తక్క విలసించు క్రీడ లేదు
క్షణ మనగ లేదు, మధురభక్షణము లేదు. 187

క॥ పౌరుషము మొలిచి యెదుగుట
కీ రీతియ యాలవాల మింతేన్ క్షితిన్
గూరక దేశవిపత్తిని
కారణశపథమున నడుముకట్టుండు ప్రజల్! 188

గీ॥ నడుము నవరించుకొనుచు విన్న దపుడు సభ
వందనము చేసి మాతకు వంద కత్తు
లెదుర విఱువుం డని, ధ్వనించె సభ యఱచెయి
రాయు వ్రేళ్ళ వందేమాతర మ్మటంచు. 189

గీ॥ విప్పుకనుల లోతున నుండ నిప్పుగనులు
బిపినబా బుపన్యాసంబు వినిచె ప్రజకు
కదనకరణసమబలసంగ్రథితులార!
వీతప్రహారణరణవిశ్వవిదితులార! 140

క॥ పలుబడిబడులలోనికి
బాలురఁ బంపమియ గాక పంపెడువారిన్
గేలూని బతిమిలాడుచు
మీ లీలన్ జేయఁ జేయు మిమ్ము బొగడెదన్. 141

మ॥ తగె జాతీయకళాలయమ్ములు భవత్సంతానసమ్మర్దముల్
తెగెఁ బాశ్చాత్యవిభుత్వమున్ గొలువ నౌ నీచత్వముల్ వాటికిన్
లగుడమ్ముల్ గొని కొట్టు రక్షకభటు ల్లజ్జింప కాలేజిమం
డెగమున్ ఛాత్రుని త్రొక్కనీయని ప్రజా! నీశీలముల్ కీలముల్. 142

ఉ॥ ముద్దిడుకొన్నదో! పయిని మూరిన యేల్బడివేటకుక్కకున్
బుద్దిని చెప్పుచున్, బ్రిటనుపుట్టము అమ్మనువద్దయా! కొనన్
వద్దని యార్చుచున్, విపణి బంకిముగీతము పాడ, పీడుపీ
డద్దిర! యన్న నిన్ను బొగడ న్నుడుగుల్ బడుగుల్ గదే! ప్రజా!

శా॥ 'వందే మాతర'మన్న తల్లికి నమోవాకమ్ము లర్పించుటే!
యిం దెవ్వారికి హాని నిందయును లేదే! బాంబు వేయంగ నీ
క్రందే పి ల్పనవచ్చునా! యిది సెలన్ కర్ణమ్ములన్ గ్రుచ్చునా!
కందోయిన్ సెగ దెచ్చునా! ప్రభుతకే గణ్యమ్ము లిఖావనల్. 144

ఉ॥ కొందఱు మిత్రు లిందు నను కూడ దటన్నను చెప్పనెంచితిన్
పందలు వోలెఁ బ్రాణములు వాయరు వంగజనమ్ము లేటు కే
టున్ దగ నేయువా రొకపుడున్ 'బికెటింగు'నఁ వాత్మరతులై
కొందఱు మిత్రు లిందు నను కూడ దటన్ననుఁ చెప్ప నెంచితిన్.

చ॥ పొగలు ధరిత్రి లేక ఘనమున్ ఘనమండల మౌనె! యీ గతిన్
బొగులుట తెచ్చిపెటదో ప్రభుత్వము వంగమువంగ మొక్కశ
క్తిగ నొక యుక్తిగా నొరుల కెన్నడు లొంగ నటంచు గర్జితం
బెగయ ధ్వనించు నేఁయవుర! యిక్కము తెచ్చెను మేలుచొక్కమున్.

శా॥ వందే మాతర మంచుఁ బత్రికయు నుద్భాసించు గీతంబె కా
దెందున్ భారతమందు, భావబల మొందే భాషతే మొందు, నం
దందున్ గ్రంథము గేహ మేతదభిధన్ ద్రష్టవ్య, మేకమ్ము చే
సెన్ దేశమ్మును గేయ, మెంతు నకృశశ్రీచంద్రుగా 'బంకిము'న్.

ఉ॥ వ్యక్తివిముక్తి కౌచుఁ దనయంతటఁ దాఁ గనుపట్టు నాత్మయున్
వ్యక్తము నయ్యెఁ ద్రోవ తనయంతనె జాతివిముక్తి కి ధరన్
సూక్తులు రెండె దేశ్యములనొప్పుట, యన్యము లొప్పకుండుటల్
సక్తము కాద యిందు గురుసంగతి, దేశమునొజ్జ దేశమే. 148

మ॥ తను తా రక్షణచేసికొంట మనుజత్వం, బిద్ది దేవుండు నే
ర్పినదే, యల్లై స్వదేశపాలనము, వే ఱెవ్వండునున్ దీనినుం
డి ననుం బాపగఁ జాల డంచుఁ బ్రజ! కంఠేకాలహుంకారగం
జనగర్జ న్నినదింపవే! ప్రభుతరంధ్రా లన్ని బంధింపవే! 149

క॥ ఒక భేరీధ్వన మగుచుం
బ్రకటింపంబడియె లోకమాన్యునిచేఁ బె
ద్దకొలఁపున న్నా జన్మా
ధికారము స్వరాజ్య మనుచు తిలకబుధునిచే. 150

గీ॥ బాలగంగాధరుండు శివాజి యొకఁడె
వాని మాఱుగ నిను మేలవణిని సత్క
రింతు మన్నట్టి ప్రజను వారించెఁ దిలకు
మరొక డైన చంకలుకొట్టి మురగకున్నె! 151

ఉ॥ నే నను శబ్ద మెప్పుడు ధ్వనించును గర్వమునన్? స్వదేశ్యసం
వ్యానము లాల్చి పైఁ గలిగి, యట్టిదె పింజలుపోసి దోవతిన్
జానుగఁ గట్టి, హూణకృతశాసనధిక్కృతి చేసినప్పుడే
మానక నీతిబోద్ధ యయి మత్తుపదార్థము రోసినప్పుడే. 152

క॥ అని మరియు నొడివె విపినుడు
కనపడినప్పుడె ధ్వనించు కరతాళమ్ముల్
భణితి విని చెప్పవలెనా!
ధ్వనించె కంఠములును తెగబడితి మ టంచున్. 153

ఆ॥ వె॥ ప్రజల యుత్సుకతకుఁ బట్టి పగ్గాలు లే
వతడు లేచె మాటలాడ నొకడు
పేర నశ్వినీకుమారదత్తుడు, పేరు
కన్న వాని తీరు కమ్రతరము. 154

ఆ॥ వె॥ యువకులార! కడిమిగవకులారా! యెల్ల
పెద్దలార! పరువుముద్దలార!
ఝూన్సిలక్ష్మిసుగుణసారాగమముశాఖ
లార! యువతిరేఖలార! వినుడు! 155

శా॥ కొంపల్ తీసెడి నాలిముచ్చులు వలెన్ కొల్లాడెపోః భారతీ
యంపుంభాగ్యము నాంగ్లచేలములు, మీరయ్యా! కొనన్‌రా దటం
చింపౌ పల్కులతోఁ బ్రచారముల సాగింపన్ దుకాణమ్ములన్
గుంపుల్ యోధులు వారలన్ జెనకునేః క్రూరాంగ్లరాట్దండముల్.

క॥ ఆ తరుణీపతి "వందే
మాతర" మను గీతి వినుచు మణిగమణిగ వ
స్త్రాశ్రితము మూయబడె, నొక
ఘాతకులున్ దక్క బ్రజ సుఖంపడెఁ జెవులన్. 157

శా॥ కంచున్ గొట్టినకొద్ది యద్ది నినదోగ్రం బౌను, ఫుల్లర్లు మూ
యించన్ జాలరు నోరుఁ గిల్లరులు నై యీ యద్భుతుల్యప్రజన్
ద్రెంచన్ వచ్చు శిరమ్ము. నయ్యదియు "వందేమాతర"మ్మంచుఁ గా
వించున్ గానము రక్తధార లొడియన్ వీర్యస్ఫురాధానమున్.158

క॥ ఎవరనుకొన్నదొ! యేలుబ
డి వంగజనము న్నిజాత్మ, డిల్లపడవలెన్
గవిసిన నిది, ము న్నెన్నడు
చవిచూడద కాను దీని చలమున్ బలమున్. 159

గీ॥ కార్తవీర్యార్జును కథ నీ కర్జమనకుఁ
జెప్పు నాతని సభ్యుల కొప్పు దయ్యెఁ
జెప్పు దీ సభయును క్రియాశీల మగుచుఁ
జిటికె వేసి భవిష్యమే చెప్పు ననుచు. 160

ఉ॥ తండ్రియె కాదతండు పరదాస్యపు విద్య పఠింపఁజేయువా
డెండ్రియె, హీను డౌనుకదవే! యటులుంబఠియింప సూనుడున్
గుండ్రని వాని మోము విషకుండము కోర్టున కెవ్వ డేగినన్
జంద్రలు మొల్వగావలె! విశాంపతికార్యగృహమ్ము లన్నిటన్. 161

మ॥ నను నిర్వాసితుఁ జేయనీ' ఖయిదులోనంబెట్టనీ! కొట్టనీ!
తనువుం బ్రాణము కూడియున్నవఱకున్ దర్పించి యీ పాలన
మ్మును కట్టింతును కట్టుకంబమున కేన్గుం బోలె మీచేతనే
రణవత్కార్యనిమగ్నులార! ప్రజలారా! నిల్వుడీ! తోడుగా. 162

ద్వి॥ ఆ రీతి మాటాడె న య్యశ్వినీకు
మారదత్తు, సదస్సు మనరున నౌడు
గలచి వాహ్వా! యని కదలించి బుజము
శిరమెత్తి కన్నులఁ జిమ్మె తేజస్సు. 163

గీ॥ లోన ధీరుడు పైకి విలోలనయను
డై సురేంద్రుు డెగాదిగ నరసె దత్తు
నితడు సభవైపె చూచె సింహేక్షణుండు
"బిపినఘోషు" 'లచ్ఛా' యన్న పిఱుఁ బఱప. 164

గీ॥ సరగునన్ శ్యామసుందరచక్రవర్తి
లేచి సభఁ దేటిపారగఁ జూచి పలికె
సకలభారతమార్గదర్శకదృఢప్ర
తిజ్ఞులార! సశాస్త్రారవిజ్ఞులార! 165

ఉ॥ ధీరుడు నీ సురేంద్రుడు, సుధీవరముండు రవీంద్రనాథతా
కూరుకవీందు్రిడున్ గడమకోవిదు లెందఱో యఁంతచెల్వుగాఁ
దీరిన యెన్నికోల్వులఁ గథించిరో! చెప్పగలేము, లేదు ము
య్యేరున కీ ఘనుల్ పలుకు నింతటి హెచ్చినధాటి నేటికిన్. 166

క॥ మన మేగలిపై సారిం
చిన దేషాఖండ మీఁడ చేన్ దున్నుచుఁ దాఁ
దన నాగలిపై హలి వలెఁ
బనితం బీ స్థితియు వీరి వాక్ఫలితం బై. 167

శా॥ అంతే కా దితరప్రపంచము ని దె ల్లానో య టంచున్ బలే
వింతన్ బోలిక జూచుచున్నది, యథాభిప్రాయ మీ యుద్యమ
క్రాంతిన్ జాటుచునున్న దెల్లజన మాకర్ణింపగా బత్రికా
సంతానంబు దినంబు నెన్నొ మహి భాషల్ వాని యన్నింటిలో.

మ॥ ఇది భంగం బొక వంగభూమి కనరా, దీచుట్టు సంద్రమ్ము స
మ్మదమో దుఃఖమొ భారతమ్మునకు సర్వేల్ తేల్చుకో నౌ పరీ
క్ష, దగన్ జీవయొ జావయో ప్రజసమైక్యం బైశ్వరం బౌ పరీ
క్ష, దృఢం బంగమొ తత్ప్రసంగమొ దిదృక్షాఘట్టము న్నేటిదే.

మ॥ అటులై రెం డయినట్టి వంగ మొకటౌనందాక నే కాక యె
వ్వటికిన్ దేశ్యపువస్త్వలంకృతులె యొప్పన్ దేహమున్ గేహమున్
ఘటియింపంగదరే! నిసర్గవరమున్గా, విద్య జాతీయమై
పెటిలింపన్ గదరే! ప్రభుత్వపు శిలాపీఠంబు నౌ చాకిరిన్. 170

చ॥ అపుడు బజారు దేశ్యములె యమ్మగ,దల్ప్రలుమూయగా బ్రభు
త్వపుబడి, కెందు నుండదుకదా! పికెటింగుళ్రమంబు కార్యధా
మపునెదుటన్ వినా, యది సమర్థముగా బచరింపవచ్చు, న
ల్లై ప్రతిఘటింపవచ్చు నవలీలగ నన్నియు శాసనమ్ములన్. 171

క॥ ఇది మీకు జెప్పవలసిన
యది మీ నాయకులు, వార లగ్రగణులుగ మీ
రెద లొడ్డి పోరవలసిన
యది, యెందఱ ఖైదుసేయు నాంగ్లవిభుతయున్? 172

గీ॥ అశ్వినీబాబుచెప్పినయట్లు ప్రభుత
మదకరిణి తానె కట్టుకంబమున వచ్చు
నింత యగుచు, శస్త్రము లేద యంతెకాని
ప్రబలయుద్ధము విజయ సమృద్ధ మిదియ. 173

గీ॥ ప్రభుత నావ, ప్రజాసముద్ర మురకున్న
వఱకు నాడిన దాటయు బాడినదియు
బాటగా బనుచుండు, జెప్పవలెనేల?
దీని కల్లోలహతి నది దీనపడదె! 174

మ॥ అని యీ సృష్టిరహస్యమున్ వినిచినారా! బాలగంగాధరా
గ్రణి వోలెన్ భరతావనీసకలదిగ్భాగప్రజాపాళికిన్
ఘననేతల్ ప్రజలారః యప్పుడె పడెన్‌గా! యర్ధరాజ్యమ్ము చే
తను, తక్కర్ధము చేవడున్, సగము పత్రం బెట్లు చెల్లింపగున్? 175

శా॥ ఏష్యాయగ్నియు యూరపగ్నియని యున్నే భేదముల్? మొన్న నే
రష్యాపై విజయమ్ము గొన్నది జపాన్, క్రాంతిన్ మతిన్ గీర్తి వై
దుష్యంబందునఁ దీసిపోముక దః, శస్త్రిల్ కాము పో ర్వేఱు, మా
నుష్యం బైన ప్రతిక్రియన్ విడి వివన్నుల్ మిన్న కేయుందు రే! 176

ఉ॥ భారతమందునన్ మనది భాగ మటంచు, స్వారాజ్యనిష్ఠ మా
పోరున నిత్తఱిన్ మనము పొందిన కీడును పాచికోగ నౌ
పోరును భాగమంచుఁ దలపోసి కడంగెద ముక్తరీతి బా
లారుణభాంగవంగజనమా! విజయమ్ము రయమ్ము రాకడన్. 177

క॥ అని శ్యామసుందరుం డన
జన ముత్సాహమును దెలుపు శబ్దము లెల్లన్.
విని యోగించికొనెన్, వా
కొని రా వరవడిని వాచకులు తక్కురునున్. 178

మ॥ తన రాజాలనమై తనుస్థితి సభాధ్యక్షుండుగా నెట్లో వ
చ్చెను కుర్చీపయి మోయగాఁబడి దమశ్రీ మోసు 'నానందమో
హనబో' సంతమునన్ వచించెఁ బ్రజలారా! వింతు రెండేనుడుల్
తను పాలించెడివాడ నన్న నెవనిన్ ధర్మచ్యుతున్ మెత్తుమే : 179

మ॥ మృదువాగ్వైఖరినొక్కమారుతుదిగా 'మింటో'ను 'మార్లే' దొరన్
గదలింపఁగా దగు వంగ మేక మొనరింపన్, వారు కా దన్న నె
య్యది కాంగ్రెస్ స్వచియించు కృత్య మది, దాహంబున్
జలం బోజఁ దో
చుఁ దదీయం బగు తీర్పు ద్రోహము నటంచున్, వల్కెనన్లేమరిన్

క॥ జనములు వందేమాతర
మను వెలుగున లేచి కాళికాలయమున వ
చ్చి నుతించి దేవికడ కం
కణధృతిఁ బ్రతిన గొని రైకకంఠ్యముగ నిటుల్. 181

శా॥ మాతా! యాంగ్లధరిత్రివస్తువుల సంబంధమ్మునన్ బోము రెం
డో తున్కల్ మన వంగభూమి నొకచో నందాక, నాంగ్లేయవి
ధీతామమ్మునఁ గాము, సర్వకృతముల్ దీర్పంగ నస్మజ్జనుల్
శ్వేతాస్యాఖిలరత్వ మొందము, దనుశ్రీభంజనాగ్రేమతా! 182

ఆ॥ వె॥ అదియ వంగళపథ, మా సంజ మరియొక
పరమగోష్ఠి జరిగెఁ బురమునందు
సుప్రసిద్ధు లెందఱో ప్రసంగించిరి
తొంటివారుఁ దొవరుకంటివారు. 183

ఆ॥ వె॥ ఆ సదమ్ము ముగియ నర్ధమరే యయ్యెఁ
బొడిచెఁ జుక్క కొంతవడికి, నంత
మాత్రఁ దొలగునెట్లు? మడ్డిచీకటి, కాని
తూర్పు తెలివికొలదిఁ దొలగుచుండె. 184

క॥ నిన్న సభ జరుగుచున్నపు
డున్నది పాశ్చాత్యముఖ మహో! చూడవలెన్
క్రొన్నెత్రు చల్లుకొనినటు
ల న్నలువున్ జూచి తూరు పప్పటి కాగెన్. 185

ఉ॥ ఇప్పుడు వారతీర్చెను ముడింగినపువ్వుల నెల్ల మెల్లగా
విప్పుచు, వేనియందు విడి వెత్తియె వాని విడిన్ దనర్చుచున్
జప్పుడు కాళికాలయమునన్ ఘనఘంట నెసంగె, నంత లే
దెప్పుడు, లేదు నంత తడవేనియు నే నవరాత్రమందునన్. 186

క॥ సాయము పాశ్చాత్యరుచికి
సాయము, ప్రాచ్యపుఁజనకు పసందు ప్రభాతం
బె యని శీతము సేల్వన్
ద్రోయుచు నవెఁ బొరుగువానితో నొక బుధుడున్. 187

క॥ మొత్తము నెటులఁ గనినమున్
గ్రొత్తదనము దోప దందు, కోర్కొని చూప
యొ్యత్తున నొకట నిలచి దరి
హత్తుకొనుచు నుండఁ దోచు నందలి మార్పుల్. 188

ఆ॥ వె॥ చుక్క పొడిచి కోడి 'కొక్కొరొకో' యన్న
యదనునుండి ధామనిధి పొడిచెడు
వఱకుఁ బ్రతిని మేషవర్ణన చేసిన
కలము గళము ధన్యకౌస్తుభములు. 189

గీ॥ పెద్దయుంబొద్దు నగ్ని కర్పించిన తన
తేజమున్ దీసికొని యుష్ణదీధితి యుద
యించెఁ దూర్పున నాశామహీజమందు
బండినొక పెద్దయాపిలుపం డనంగ. 190

మ॥ ఉదయించెన్ దినరత్నబింబము నిశాంతోద్వేజితోద్వేలద
ర్పదురావారనినాదనిర్దళితదిక్ప్రద్మిశ్రవస్సారఘూ
ర్ణదుదన్వత్సమవంగభంగకృతిశీర్యత్సామనిర్యత్ప్రజా
హృదయార్చిఃప్రతిబింబమై, సమయపున్ గృత్యమ్ములారంభమై.

మ॥ ఉదితుం డర్యము డయ్యెఁ బ్రాక్శిఖరిపై నుచ్చుంఖలాచారపా
రదధారాతిత రాంప్రసారబలసారాభీలనిస్త్రింశసం
పదుదారక్రకచావతారకరవన్మందేహదేహచ్ఛిదా
స్యదనిశాసప్రసహప్రధారుణకృతోపాంతాఖిలాస్థాను డై. 192

క॥ ప్రాచీమాతకు 'వందే'
వాచనముం బలికి రథముపైని క్రమవ్యా
కోచమ్ముబుగాఁ దీక్ష్ణత
తోచు వెడలెఁ దరణి పశ్చిమాభిముఖుం డై. 193

ఆ॥ వె॥ తోయజాప్తు బండి తూరుపువల్లమ్ము
నుండి మిట్టు కెక్కె నుద్ధతముగ
కూర్చొనిన నియంత కుంటివా డని మన
కెట్లు తెలియుః రథి వచింపకున్న. 194

ఉ॥ ఓయి! యనూరుడా! చనగ నున్నది చాల యెడారి, సుంత జా
గై యరుదెంచినా మరదమందున, నిప్పటికేని మించియుం
బోయిన దేది లే, దయిననున్ ఝుళిపింపర! నీ కళన్ ఫెడేల్
బ్రోయ, హాయాల్ రయాల్ గలుగ బొందికమై,
రవి పల్కె నీ మెయిన్. 195

ఉ॥ ఓయి! సితాస్యుడా! యని మహోగ్రనిశాతమె నీది, యైననున్
గోయగలేదు దైవ మొనగూర్చిన నేటి ప్రజాస్వమైక్యదా
ర్ఢ్యాయతబంధమున్, మదసి రాతుసి కోయు నటంచు నిన్ను నీ
వే యనుకోవలెన్ భ్రమసి, పెన్రవళిన్ గవి పల్కెనీ మెయిన్.196

మ॥ ఇది గేయమ్ముగ నా రవీంద్రకవితో నేతెంచు వేలున్ జన
మ్ము దురావారము తార మంటమొరసెన్, మొన్నంజలెన్ నిన్నయ
టు దుకాణమ్ములు పట్నమంతటను నేడున్ మూయవాలాయ్య, మి
య్యది సుగ్రీవులయాజ్ఞ యంచు ప్రతివీధ్యాఘోషణల్ పేచ్చిలెన్.

గీ॥ కొల్చిన రవీంద్రనాథశాగో రుపన్య
సించుమున్ను తద్రచితమ్ము ప్రాంచితమ్ము
జాలి కాగణో గ్గీతమ్ము పాట యిటులు
విశ్వమునకుఁ జూపినయది వెలుగుబాట. 198

గేయం॥ మేలుకొలుపుము నా దేశమును, మేలుకొల్పుము నా తండ్రీ!
ఎచట మనిసి తలయెత్తి తిరుగునో,
యెచట మనసు భయ మెఱుగదో!
యెచట తెలివి స్వచ్ఛందమో,
ఆ స్వేచ్ఛాస్వర్గమ్ములోనికి ॥మేలు॥
జగము విభాగము కాదో యెచటన్ స్వార్థపుగోడల గదులతో
సత్యగర్భమునుండి యెచట వాక్సమవాయ మవతరించునో
అచటికి స్వామీ! అచటికి,
ఆ స్వేచ్ఛాస్వర్గ మ్ములోనికి ॥మేలు॥

యతనము పరిపూర్ణత కభిముఖ మై
అలయక బాహువు లెచటఁ జాచునో
ప్రాతనడువడి యెడారియిసుక బడి హేతుఝురి యెచటనినుక దో?
అచటికి స్వామీ! అచటికి,
ఆ స్వేచ్ఛాస్వర్గమ్ములోనికి ॥మేలు॥
విశాలభావాచరణాభ్యుదయనవీనసుపథమున హృదయమున్
ఎచట నీవు నడపింతువో? అచటికి స్వామీ! అచటికి,
ఆ స్వేచ్ఛాస్వర్గమ్ములోనికి ॥మే॥ 199

మ॥ సభలో ప్రార్థన యై రవీంద్రుడు ప్రజాచైతన్యమున్ స్ఫోక్తిసా
రభరణ్యమ్మొనరించె నెంతో, జనులారా! వంగభూమిభిదా
రభసక్రోధనులార! జాతి యొరిమన్ భ్రాజిల్లి గ్రొచ్చు దథా
ప్రభుతాగమ్మును మూతిదంతగరిమన్ ప్రచ్ఛన్ యథా పూగమున్.

గీ॥ పల్లెజనము పట్టణజన మెల్లఁ గలిసి
జాతి, సత్య మహింసయు సంఘటించి
నీతి, బహువిధశౌర్యమ్ము జాతి, యత్ర
మమ్ము నెదిరి నిల్చుటయును సుమ్ము! నీతి. 201

క॥ చెట్టుకుఁ గొమ్మలు పోలికఁ
బట్టుదలయు గుబురుగొనగ బహుశ్రేయములన్
నెట్టుకొనవలయుఁ బల్లియ
పట్టుల జాతీయములుగఁ బ్రబలోత్సవముల్. 202

చ॥ ఋతుఋతు వొక్క వేడుక ఘటించితి బాలురఁ బెక్కువిద్యలన్
జతురులఁ జేయు నాదు బడి శాంతినికేతనమందుఁ రంగుని
రు తెలుగునన్ ముదమ్ము నొకరొక్కరిపై గుమిగూడి చల్లుకోన్
మతులు స్వతంత్రభావనల మల్లియపందిరు లోచు నల్లుకోన్. 203

చ॥ పడియను నీరు పుస్తకపుపాఠము, గంగజలమ్ము లోక మి
చ్చెడు చదు వంచునున్ సభలు చెప్పెడి వంచును సంబరాలు చే
సెడివి న టంచునున్ దెలిసి చిన్నవి పెద్దవి యైన మేళలం
దుడుగక పాల్గొనన్ వలయు నూళులఁ బౌరులు కల్పుగోలుగా

ఆ॥ వె॥ పౌరులార! యిటులు పల్లీయులును మీరు
కూడబలుకుకొనగఁ గొనరు బలము
వంగమునకె కాదు సాంగభారతజగ
తీప్రదీప మగును, దిగును ప్రభుత. 205

ఉ॥ ఎంత నినాదముల్ సలుప నే మగు! వీధుల రాజధానిలోఁ
గొంతగ సీమమిల్లులకుఁ గూర్చిన నష్టముతోడ నే మగున్,
బంతులు దీర్చి ఛాత్రులును మామకసన్నిశపాఠశాలలన్
గాంతిలసేయ నే మగును? కగ్గదు వీనఁ బ్రభుత్వ మంతగా. 206

గీ॥ తాను తనపైని జాతి యాధారపడన
లయుఁ బరిశ్రమముల నెన్నొ నెలకొలిపియు
లోని పౌరుష మను దివె పైని పెట్టి
యొందు వీధివీధిని వెలిగింపవలయు, 207

మ॥ నిర్మాణాత్మక ముద్యమమ్మున వెత న్నిర్జింతు, మా త్రోవనే
యఁర్మల్ మెర్మలు నెన్ని యేని, పెడ యాహా! త్రోవ పొల్లీనదిన్
గూర్మమ్మల్ మనవిజ్ఞతల్ ప్రభుత వౌకువ్వాదముల్ పెక్కు వేం
డ్లర్మన్, సాగదు సాంఘికప్రగతి, ధ్యేయమ్మల్ మహోలస్యముల్

గీ॥ సంఘచైతన్యమున మార్పు సంఘటిల్లి
విప్లవమున బ్రహ్మాస్త్రము విజిత మగును
అయుధికమె కార్యం బని యనుట తప్పు
శ్రీ యనగఁ బైడియే యని చెప్పినట్లు. 209

ఉ॥ న్యాయము, నాత్మగౌరవము, నా సహజన్మలె యంద అన్యయా
న్యాయత, కాళిమాత యన నౌను మదీయము శక్తి, నాకు నే
నే యగుదున్ సమస్త మను నిర్భరచేతము, కార్యలక్ష్మా
లీయని, జాతి దించును మహేంద్రుని పీఠముమండి వీనితో. 210

గీ॥ తూర్పుబెంగాలునకుఁబోయి తుటుములుతుటు
ములుగ గ్రామోద్ధరణకార్యముల సహాయ
పడుదు ముస్లిముసోదరవర్గమునకు
హిందువులు! వారుఁ బ్రభుతకు నెదురుతిరుగ. 211

గీ॥ సల్పిన దమూల్యసేవ నిస్లాము భరత
ఖండమునకు శిల్పమునందు గానమందు
చిత్రకళయందు సాహితీక్షేత్రమందు
రంగుబల్బుల విజిలీ తెలుంగు గాగ. 212

క॥ కాడియు మేడియు నొక్కై
జాడవనున్ దున్ని పంట పండించినటుల్
కూడుచు హైందవ మిస్లాం
వాడిజతన చేసి పొందు స్వాతంత్ర్యంబున్. 21?

ఉ॥ పూసిన రంగుతో నెటియ పూడునె గోడను? దానిపూడ్చ్రయే
వేసిన రంగు భాసిలును, భేదచయమ్ముసు బాసి యొండొరుల్
చేసిన మైత్రి వాసిలును చిత్రిగ, సంస్కృతి భిన్నమైన నే
మీ! నమమానవత్వమలె యెందునువేని తెగల్ ధరిత్రిపై. 214

క॥ భారతజనబలరాశికి
నీరాజన మిత్తు హృదయనిభృతజ్యోతీ
రారాజనముగ, దేశో
ద్ధారక మగు దీని నమ్మెదన్ త్రికశుద్ధిన్. 215

గీ॥ ఆర్థికముగను రాజకీయముగ సాంస్కృ
తికముగన్ బ్రజ యొక చూచు దేజరిలుట
వేరె త్రికరణశుద్ధి, యీ తీరు నొద్ది
క గల యుద్దియ చేతనే కార్యసిద్ధి. 216

గీ॥ దయదయ య టంచు హృదయము కారసిల్లి
దీనజనము నాదుకొనుట దేశభక్తి
జయ! జయః యు టంచు గుంపులో జాతీయము బలె
నాదుకొనుట భారతి గుండె బాదుకొనుట. 217

గీ॥ పాదకటకఝుళంఝుళధ్వనితభార
తేందిరయ, వాచాలమందిరయుఁ గాదు
ప్రజను దేర్పగ, కావ్యజీవమ్ము మసిర
సమ్ము కాదు మనీషిరసమ్ము కాని. 218

గీ॥ గోత్ర మున్నదియే కాని కులము లేదు
పాత్రిను మనస్సు సతము సౌభ్రాత్రమునకు
నా మతం బన్ని మతముల నామతించు
నని తలచువారికి జయమ్ము హస్తగతము. 219

చ॥ ధనము ఋణ మ్మొసంగెడి విధమ్మునఁ గాక సుఖమ్ము కష్టమున్
జనములు పంచుకోవలయు, సాహ లిడన్ దగుఁ గాని యప్పు వ
డ్డని ధనరూపమందున గడింపక యాదరణమ్ము రూప మై
కొనవలె, నిట్లు నై గెలుచుకొన్నది పో, భువి యెన్నడో దివిన్.

గీ॥ తన క గౌరవకరముగాఁ దలచినపుడు
భారతం బెదురించును ప్రభుత నని వ
చించె రామమోహనరాయ లెపుడో మామ
కీనగురువు, నేటికిఁ దులకించె దినము. 221

గీ॥ పాటు రా నిది యిది యని స్పర్శఁ దెలిసి
గ్రుడ్డి బలె దాని తప్పించుకొనుటె కాదు
కనుదెఱచి పెఱరాచరికంపుబెడద
వేరుతోఁ బెల్లగించు తెల్వి మనవలయు. 222

క॥ యూరపులో జాతీయత
వేలు శరీరాత్మకముగ భేదము లే దై
పాటింప డొక్క- డొక్కని
కై రక్తము ధృతుడు తక్క- వతిఖిద లిం దై. 223

మ॥ స్వజనం బాడిన మాట రాచరికపుంజట్టుమ్ముకన్నన్ గరం
బు జగా యంచుఁ దలంచి, యొుందురులపైఁబోరాని విశ్వాస మై
ప్రజ దాస్యమ్మును పొందుఁగాని యిటనే వచ్చెన్ దగా,యంతలో
గణమంతల్ త్రుటిఁబిచ్చికంత లగుచున్ గాఁగాని యావేశముల్.

శా॥ ఆవేశం బొక వహ్ని, భావముల నాహారించి భస్మీకృతిన్
గావింపన్ సృజనాత్మక ప్రతిభ దక్కన్‌జాలునే! పండితుం
డో? వానోపిక, వాని కల్పితనమున్, దూరేతతో(దెల్వి, త
త్కావిత్రాంతకృతుల్, కడింది యుపయుక్తంబుం బొనర్చున్
సెగన్. 225

ద్వి॥ ఆవేశ మను గట్టి మధిరోహణీయ
మే వేళ ? కళ్ళము హేతు వౌ వేళ. 226

క॥ ఆవేశము సంఘర్షే
యోవిధిమై మలచుకొనగ నొప్పిన తెలివిన్
జేవను పెంచుకొనము, యౌ
రా! వింతలు నింత లౌనె! యాలస్యంబుల్. 227

క॥ రేకులు పూవులలో వలె
నాకులలో నీనెలు వలె, నలగవలె సమా
జాకుంఠితశుభగుణములు
ప్రాకవలె దిగంతములకు భారతయశముల్. 228

ఉ॥ ఛాయలు చెట్లవిన్ మొగిలుచాయలు పాఠము( జెప్ప వాదు వి
ద్యాయతనమ్మె వేలు, ప్రభుతాచ్ఛిదుపాయమె కాక జీవనో
పాయము వృత్తినేర్పవలె వల్లె! యనంగనె కాదు బళ్ళు జా
తీయము లాంగ్లపాఠవసతిఙ విడి వచ్చిన ఛాత్రపాళికిన్. 229

క॥ అంతగ( జేసి నినాదము
నింతగ( బలికెద వటందు రేమొ, ప్రభుతకై
యంతియ యెప్పుడు, ప్రజకై
యింతియ, మనలో నిమాట లిట్లే వలయున్. 230

క॥ శరువలి మృదువై కదలెడు
సరసీజవనమ్ము వోని సదమున జన మా
కర మై యామోదమునకు
వ్యాలెన్ సభతుది రవీంద్రభారతి మరియున్. 231

గీ॥ భారతము తనయంతఁదా వలయు వాదు
నికము గాఁగ నన్నింటఁ, బూర్ణిమసితాంశు
బింబమటు వెలుఁగవలయు, విజ్ఞమయ్యు
సాయపడదదె యెందునను పాశ్చాత్యజగతి. 282

ఉ॥ వచ్చెనుగాక ! దైవవిధి వారడి రైయె యది పాలకమ్ముగా
విచ్చము పెట్టవే ! యనుచు వేడదు ప్రాచి ప్రతీచి నెందునన్
గచ్చర మెంతయో కరడుగట్టిన స్వార్థము, దాని కగ్గమై
యిచ్చున దేది? కైకొనున దేది ? యగౌరవ మొందు తక్కఁగన్.

శా॥ 'సీలీ" చెప్పెను దీని, "మిల్లు" ప్రవచించెన్ దీని నంచున్ వృథా
కాలక్షేపము పాఠ్యపుస్తపఠనన్ గావింపనేలా ? బల
శ్రీలారా ! ప్రజలార! భారతధరిత్రీగ్రంథ మధ్యాత్మమై
గాంలన్, దీని పఠింపరేల ? యెదదన్ జాటింపరేలా? సెగన్ 284

మ॥ ఇరు వర్గమ్ములు పార్లమెంటున, నెదేని గెల్చినన్ వాదనన్
కరముల్ రెండవి లండనందుఁ బ్రజమై కాంచెన్ జయం బయ్యదే
భరతక్ష్మాపరిభుగోష్ఠిలోనఁ బ్రభుతాపక్షమ్ము తోఁడేలు, సొం
పటి వోటింగున వాక్కులేనిది పరిజాపక్షమ్ము కుందేలునున్. 285

చ॥ అనుపమవాగ్మి వాంగ్లమునఁ, బ్రజాంచితతర్కము తెల్పి వాది యం
చు నెవదు వాక్కు వేడినను చొచ్చలుకొట్టును, రాజ్యయంత్రమం
దున వదు లైన భాగమునఁ దోఁడుత సీల బిగించి కొట్టు, నాం
గ్లుని విధ మట్టిదై జయము గొందుమయా ! చెయి చావ
మెత్తమున్. 286

చ॥ ఇటు లయి వేడు నుద్యమము నింకను వెన్నను తీయఁ జాలు చి
ల్కు లెట యని యంచు మీర లనుకొందురో!పా లెట నుండె!మీవి చి
లుకుట లెట నుండె!చిలుకుటలు లోగిట నుండగఁ గేంద్రమందునన్
ఘటముల నుండెఁ జాలు, కొలఁగాని ప్రయత్నము తీసడింపుడీ!

క॥ యోజించి దిటవుమై సా
మాజికముగ స్వార్థరహితమతిఁ గవియుడి ; య
ర్థి జువ్వియాకెకాదా !
రాజసభకుఁ, గామికా విరాగకథనముల్ ! 288

క॥ ఒకచోట రవీంద్రు డిటుఁ బ
లుక వారీంద్రుడు గురిసెఁ బలుకుజడి నటు వే
ఱొకచోట బెల్ల మిడవె చె
అకా! యనగ నిడునె! యశ్లై ప్రభుత య టంచున్. 289

# ఉద్యమ ఖండము

శా॥ వారీంద్రుండు యుగాంతరాఖ్య మొక దివ్యత్పత్రికం బెట్టె నిం
తేరా! యిప్పటి కర్జ మంచును తనున్ దీవించి పంపంగ వి
ద్యారణ్యుం డరవిందఘోషు కలకర్తావాసమున్ గోరి, తై
దాఱున్ వ్యాసములం బఠించి యువకుల్ తారస్థితిన్ మెచ్చగా. 1

గీ॥ ఒకడు శ్రీవివేకానందునకు ననుజుడు,
శోధితము వ్రాత్తు 'భూపేంద్రనాథదత్తు'
నొకడు 'దేవవ్రత' రచించు నుగ్రత, నల
పత్రికకు వీరు కలరు సంపాదకులుగ. 2

ఉ॥ అక్షరమక్షరంబు భరతాంబపదంబున బంధుజీవకం
బై క్షుధ గొన్న సింహమున కౌ కనుపాపకుఁ జిత్రలేఖనం
బై శమయం దనాదరము నాహవమందు సమాదరంబుగ్గేవం
గఱితిప్రోధిచిత్రిక యుగాంతర పత్రిక పెంచె నెల్లెడన్. 3

క॥ అరవిందుని వ్యాసవరం
పర స్వాతంత్ర్యంబు ప్రాణ మై యుపనిషదం
గరుచి నెసగుఁ బత్రిక, యం
దురుతర మాకాశరామనో త్తరచయమున్. 4

గీ॥ పర్యవేక్షకు డవినాశభట్టసూరి
యేబదియువేలు ప్రతుల నమ్మించుచుండె
దినిముం దెన్నొ వారపత్రికలు దుర్మ
హార్థమున మొదలిడినవే మొ! యనిపించె. 5

క॥ 'మానిక్తోలా'లో స్వ
స్థానము నిష్ఠుటముతోడఁ దగఁ బత్రిక కా
స్థానికి నాయుధగుప్తికి
దానిని వారీంద్రు డూవెఁ, దా నం దుండెన్. 6

క॥ తనరు నఖిలపురశాఖల
'వనుశీలనసమితి' యతని, దధిపత్యాజ్ఞ
న్నెనరు విడి తను విడియుఁ గా
లనసేయన్ వలయు సఖ్యుఁ డను నియమముతో. 7

క॥ ఆ సమితి గ్రామసంఘే
మాసక్తము, వ్యాధిపీడితాశీసేవో
ల్లాసము, సంఘీభావవి
భాసురబోధావసథము, భయనాశదమున్. 8

సీ॥ పమ్మి వేని, భటశతమ్మునకుఁ దుపాకిఁ
ద్రిప్పిపట్టుకొనుట తప్పు దయ్యె
సప్తిపై నెవ్వఁడు సాగ లిత్తలతోడ
కొలువంబడును మైళ్ల కొలదిదవ్వు
నెకక్కటిబవరాన నెవఁడు బాకునఁ గ్రుమ్మి
పెడబొబ్బపెట్టించె పెద్దపులిని
శ్రీవివేకానందశిష్యపరంపరా
ప్రథమపంక్తిని వేని ప్రఖ్యా కలదు

గీ॥ కుడిబుజము యతఁ డరవిందఘోషునకు, 'జ
తీంద్రనాథముఖర్జీ' మృగేంద్రనాద
మెలుగు గలవాడు మెలకువ మెలగువాడు
నెదురువాడు కొండాడెడు చదురువాడు. 9

ద్వి॥ ఆ సూరిమణియు దేశాసనారోహి
దేశవిద్రోహిబృందాసువుల్ గొన ని
శాంతఘననియమతన్మహాసమితి
క్రాంతిపత్రమున చేవ్రాల్ చేసినాడు.
"బాలకృష్ణుండు, కంజీలాలు కన్హా
యాలాలు పులినవిహారిదాసుండు.
ఇందుభూషణుడు, సత్యేంద్రనాథుం, డు
పేంద్రబెనర్జీ, పరేశచంద్రుండు

వీరేంద్రచంద్రుడు, చారుచంద్రుడు, ఖు
దీరామబోసు, సుధీరకుమారు
డుల్లాసకరదత్తుడు, నవినాశుడు, ప్ర
ఫుల్లచాకీయు, విభూతిభూషణుడు
చంద్రదాసుడు, హేమచంద్రు, డశోక
చంద్రనందియును, శైలేంద్రనాథుండు
నింద్రదాసుండు' నిట్లే సంఖ్య మెండు
నందు దస్కతుచేసినట్టిర పిండు
యువకరక్తము విద్య యుష్మాంగఁ గలిసి
ద్రవిణమైరమ్మద ప్రాణమై వెలసి. 10

క॥ అది యొక రహస్యసభ య
య్యె దాని ప్రేరకులు సభ్యు లున్నతసంఖ్యన్
బొదలిరి, వాకిట నిరువురు
మెదలిరి ప్రభుపతు లచట మెలగినఁ దెలియన్. 11

గీ॥ భారతస్వతంత్రత గోరి పోరిన మృత
వీరులను, ఫాడ్కేను, చాపేకరులను
పేరుకొని మొదలైన యా తీరుసమితి
నాధిపత్యము వారీంద్రనాథు డొందె. 12

గీ॥ నలిఁ బలుకుచుండె వారీంద్రనాథఘోషు
ధృతిగుణనిషధులార ! పారిషదులార !
చెఱకుఁ బిండిన బెల్లము చేయవచ్చుఁ
బ్రభుతఁ జెండిన రాజ్యముఁ బడయవచ్చు. 18

చ॥ ఇది యొక సేనగా యువకు లెందఱో యాచు ఘటించు దీనికై
మొదలిడినాము పూన్కి, నలుమూలల దేశమునందు సంఘముల్
పెదవి కదల్చినట్లు కనుపింపని యాయుధసాధనాంగముల్
పదుగురు కూడి ద్రవ్య మిడి ప్రశ్రయయోగ్యభటాళి ఁగూర్పుడీ!

ఉ॥ సాయుధ మై ప్రజావళి జయమ్మున పట్టముగట్టుకొంట కా
లాయతిపంట, యేల్బడి వడంకగ నిప్పుడు రాజకీయహ
త్యాయతమాను లై యచట నచ్చట దుష్టుల నేయు డంచు వం
గీయులు పెక్కు రాడిరి, ధ్వనించెడి చీట్లును మాకు వచ్చెడిన్. 16

మ॥ ఇది రెం డైనది వంగ మొక్కటిగఁ జేయింపంబడఁ గోరుచు
న్నది భావంబు, విదేశ్యవస్తువుల నంటన్ బోక చట్టమ్ములన్
మది మన్నింపక యెల్లరున్ గలిసి సంబాళించుకోవచ్చు దీ
ని, దితం బౌను స్వరాజ్యయత్న మిపు డిం దేముం బ్రవేశింపగా.

గీ॥ చచ్చుదెబ్బ తిన్నదో పాము జారుకొని ప
గగొని కొట్టినవానిని కాటువేయుఁ
బ్రభుతనుఁ జంప కొకనిఁ జంప నది జాగ
రూక మై ముందె మన పూన్కి ద్రుంచివేయు. 17

మధ్యా॥ నా యన్న యరవిందఘోషు న న్నిందుఁబంపుచుఁ జెప్పె
నీ యుక్తి, లోకమాన్యుండు నిటులనె చెప్పె నాయనకు
వే యేల? భారతదేశవిప్లవసంస్థ లన్నియు ని
దే యాశయంబును మాకుఁ దెలిపె, వంగము ప్రోవ మలిపె. 18

క॥ ఓ! యనుపమభారతమా
హేయీసుతవృషభులార! యికఁ జిల్లరగా,
జేయుటయో ! తెలిపులితల
కాయల బేరంబు తేలగాఁదగుఁ నేఁడే. 19

క॥ మన మిపుడు త్రొక్కుత్రోవయె
చను నెల్లెడ నెట్టి దైన, సావర్కరు ని
ట్లని కబురంపె, నతడు త
క్కును సంస్థలు వేగ నందుకొను మన తీర్పున్. 20

క॥ సామూహికవిప్లవమున
కై మన కాయుధము లంపగా లండనులో
శ్రీమంతుడు కల, డతనికి
నీ మన మతి శ్యామజీకి నెఱిగింపవలెన్. 21

క॥ అని మెల్లగ, మృదురవనుతి
వినుచుఁ వారీంద్రు డాగె, వినిచె జతీంద్రుం
డనితరసాధ్యోద్యమరం
జనులారా ! సజ్జనులకు సజ్జనులారా ! 22

శా॥ నావన్ గాక సముద్రమున్ గడవనౌనా! యాతతో, నాయుధ
ప్రావీణ్యమ్మునఁ గాక దాస్యమును ద్రోవన్ జాలెనా! దేశ మే
దే విశ్వమ్మున ప్రేమతో, సురపురిన్ దీపించునా యెప్పుడున్
జావన్‌జాలక పోరున న్నరుడు యజ్ఞాదిక్రియల్ సేతతో! 23

మధ్యా॥ మనుజుడు పరిమళించు నొక మంచిగంధపుచెక్క యగుచుఁ
దనరి స్వాతంత్ర్యంబు, లేదొ తా దానికై రణయజ్ఞ
ఘనవహ్నికుండంబు చొచ్చి కడలను పరిమళింపించు
మనుచుండు నీ రెండు లేవొ మనుజుండు తుమ్మమొ ద్దగుచు. 24

మ॥ అది కాదో రణయజ్ఞకుండము, నరుం డావేశి యై దేశభ
క్తి దలిర్పంగఁ బరిమళించుఁ బరిపంథివ్రాతమం దొక్కనిన్
జదుపన్ గీర్తిమెయిన్ హుతత్వమున, దేశం బెట్లు స్వాతంత్ర్యసం
పద ప్రాపించి పరిమళించు నిదియే మంతవ్య మే ప్రొద్దునన్. 25

గీ॥ ఒక డొకని సంహరించు నెంతో శ్రమించి
సంహృతుని గుంపు వీనిని చంపు, వీని
గుంపు గుమ్మడికాయయే గొప్ప దయ్యెఁ
గడిమి యెదిరిది శస్త్రి యై కత్తిపీట 26

మ॥ ఇట్లైతె యొక్కరు నొక్కరొక్కరు ప్రజాహీరమ్ములుంబోవ ను
త్కట మౌ యత్నము కీకటం బగును, శస్త్రప్రాప్తిమైఁ గూడి యొ
క్కటియే సారి జనమ్ము చెక్కవలె, ముక్కల్ గావలెన్ గొంట్లు, చ
క్కటి పాఠంబును నేర్పెబో! మన కనీకం బెబదేం డ్లయ్యెనున్.

క॥ చాటుగఁ గూల్త మటన్నను
కూటపు తెలివాడు దొరకకుండు నొకండున్
జాటితతద్భృతభారతు
లాటయు మన కర్మ, దీన నౌ ఫల మేమీ ? 28

శా॥ సంపాదింతును ఘోరశస్త్రచయమున్ జర్మన్ జపానోడలన్
ఝంపన్ రా నొనరింతు జేని విడి యస్మద్భారతానికినిన్
వంపింతున్ దల వైరిచే, నిలువుడీ! నా తోడుగా మిత్రముల్!
నింపాదిన్ జయ మౌను, వే అనెదరో నే వత్తు మీ శ్రోవకున్. 29

క॥ భగవద్గీతాకృతిగాఁ
బొగడొందెడు జీవితమునఁ బోలుచు జతీంద్రుం
డిగఁ బలుకడ, కన్నాయలాల్
తగ దోర్చుట లంతదనుకఁ దగులుద మనియెన్. 30

గీ॥ ఒక్క యజ్ఞాతవాసము దక్క లే ద
రణ్యవాసము మనకుఁ, బో రావటిల్లు
దనుక నుండరః నినుఁ జేల్తు మనగ నేల?
మనము దుశ్శాసనుని, నొంటిఁ జనను నేను. 31

ఉ॥ అందెడి వేవో యాయుధము లందెడి, వందిన వాని నందిన
ట్లుం దొరలింత మస్త్రముమదుంగున, దుష్టుని దూరవర్జితుం
డందు మెు! రూకకుం బడుగు లైనను పీకకు శారు భారతం
బందు యువుల్, గతుండొకడొ ఆగతు లుందురు వేయిమంది యై

గీ॥ పాఠశాలయుఁ దగు ననుబంధముగను
పురి కలాశాలతో, నల్లె మెఱయుఁ జాటు
పోటు ననిజతనమ్ముతోపాటు ప్రభుత
కాంతి విలుగఁ బ్రజయందున కాంతి పెరుగ. 33

గీ॥ మూడు ముక్కలలోఁ దేల్చినాడో యిటులు
కన్నాయాలాలు సభ యిదే కాయ మనియె
తక్కు వక్తలు నీ తీరె తగిన దనగ
వారివారి యువన్యాసధారలందు. 34

ఉ॥ అందెను సేన పాండవుల, కట్లు పొసంగదొ గీతఁ జాటుపో
టుం దగు నంచుఁ జెప్పక యుడుంగునె కృష్ణుడు సైగ రాజరా
జున్ దొడ నేయ భీమునకుఁ జూపినవాడు, దొసంగు లేదు, దు
ష్టుం దునుమాడ నన్ని సరిచొప్పులె,చెప్పె నుపేంద్రు డీమెయిన్

గీ॥ పలికె నుల్లాసకరదత్తు పయనములకు
వచ్చు నభియోగములకు శస్త్రోచ్చయమున
కెంతొ ఖర్చు కాగల దిక నిందు యోధు
లక్కడికిఁ దమ భుక్తి తా మైభరించి. 36

చ॥ తగిన ధనమ్ము కూడనెడఁ దప్పవు దోపిడు లందునందు, నీ
తగని పనిం బొనర్పఁ బరితప్తుల మేమును, కాని యేమి సే
యగలము కన్నతల్లి భరతాంబిక బావురు మంచు బాని సై
వగచుట చూచికూడ ధనవంతులు పట్టనియట్టు లున్నచో. 37

క॥ పోలీస్ స్టేషనులం బడి
పీలుంబడి శస్త్రచయము పెంచగవలెనెన్
బాలకులకు మముఁ దెల్పెడి
కూళలఁ ద్రుంపంగవలెనెఁ గొంకక యనుచున్, 38

ద్వి॥ దేశవిద్రోహుల ద్విశిరమ్ము లేని
దేశసింహాసనాధిష్ఠిత జాతి
శిరమేని యగు యుగాంతరపత్రిక కిక
సరివెల యనిరి తత్సంపాదకులును. 39

క॥ ఆ రేయి హేమచంద్రుని
వారీంద్రుడు బాంబు సేతఁ బటుశిక్షణకై
ప్యారిసు పంపెను, సమితుల
కి రీతిన్ బగలుఁ బొడుచు చెల్లెడ నందెన్. 40

శా॥ వామాచారులు తెల్ల మేక బలిఁదోపన్ గాళి నర్చింపగా
హోమంబుం బచరించి, రన్యులును నా డుచ్చాటనాబీజమం
త్రామంద్రధ్వనిఁ గర్జనున్ బరవిభుత్వంబుం గుటిన్ జేసి, యు
ద్దామం బైనది దేశభక్తి దసరా పద్యాలు కొంగ్రొత్త లై. 41

మం॥ ద్వి॥ దేశీయవస్త్రజాతీయవిద్యలనె
పాటింతు మని ప్రజల్ ప్రతినఁ బూనండి!
అయ్యవారికి నదే యైదు వరాలు
పిల్లవాండ్రకు పప్పుబెల్లాలు నదియె. 42

చ॥ ముదిరెను వెన్నెలల్ ధవళముల్ నెలమచ్చను మాపునంతగా
ఏదకము నిర్మలంబు, కుసుమోత్కరచారిమ లారబోసి పె
ట్టె దెసలఁ గావలా ప్రకృతి, కీవి యి దంతయు ఖౌతికంబు, గ్ర
క్కదలెఁ బ్రజాత్మనుండి కళ, కమ్మని నవ్వులు నవ్వి రెణ్ణెలల్.

ఆ॥ వె॥ సభ యనంగ నదియె సభ, యందు వినబడెన్
బ్రిటిషుపదితలలను మించు భార
తీయుని తల తెలివిఁ దెలియుగావుత! కర్జ
నంచు గర్జ నెంచు నాద మొకటి. 44

ఆ॥ వె॥ వంగమందు నేడు, పరిపూర్ణ భారత
రంగమందు రేపు, ప్రజయు జేచు
ప్రభుత దా పులిగఁ బ్రవర్తింపరా దని
యెంత త్వరగ నెఱుగ నంత మేలు. 45

గీ॥ నిన్నటనె శనివారము, నేడు భాను
వార, మెల్లుండి మంగళవార మిందు
భారతమునకు బ్రిటనుకు వార సుంత
కాలమానమ్ముసఁ దెలియుగాత! ప్రభుత. 46

మ॥ ఉపవాస మ్మొనరించి వంగ మెవు డౌనో యేకరాష్ట్రమ్ముగా
నపుడే విప్పెద మంచుఁ గట్టి మనికట్లం దెత్తుతోరాలు, శ్వే
తప్రభుత్వం బను బండయుం బగులు నం తౌ పట్టునుం బట్టి,దూ
రపుమేల్ డగ్గరసేయుమీకుఁ బ్రజలారా!నూలు నేం డ్లాయువుల్

క॥ శ్రీ 'మోతీలాల్ ఘోషు'ని
దీ మాటల పంక్తి, యింక నెంతో వినిచె లే
దీ మధ్య సభల నీదృ
గ్దామాధ్యతవచన మని తద్జ్ఞులు పలుకన్. 48

గీ॥ అంతఁ బుంభావభారతి యనఁ దగిన 'స
తీశచంద్రముఖర్జి' కథించె, నమవ
సనిసియందు దీపావళి చాల వోలె
నాపదన్ ధైర్యముఖ్యగుణాళి వలయు. 49

గీ॥ చీకటిని గెల్చి మర్త్యుఁడు చేసికొన్న
భౌతికమ్ము దీపావళి పండుగ యిది
భారతాత్మ చీకటిఁ గెల్చి వఱలు వఱకు
జరుగరాదు కాళీసమర్చనము దక్క. 50

చ॥ మఱదల! చిచ్చుబుడ్డి వన మాటకు మాట చిచింద్రి బావ నాన్
వరుసలకల్మి నాడుకొనువారలు మాటలు రూపకమ్ము లై
భరతధరిత్రి కన్నిట శుభంకరు లౌదురొ వంగభంగముల్
త్వర నొకచోటె కాదు, తృటి పట్టదు చెట్టకు శృంగభంగముల్.

క॥ దీపమ్ములు ముట్టింపగ
దీపావళి పండు గైనదే? భారతల
క్ష్మీపరమసమర్చనమున
దీపావళి యై ప్రజాళి దీపింపనిచో. 52

మ॥ పడవల్ గానయి యిండ్లు, నోడలుగ నై ప్రాసాదముల్ దోనెలై
గుడిసెల్ సాలున నొక్క రాతిరి రుచాకూపారమందున్ దన
ర్చెడి దేశమ్మున నేకముల్ స్థితిమతుల్ చెన్నొంది నిత్యమ్ము మ
న్గడ దీపావళి కావలెన్ దన స్వతంత్రత్వమ్ము దీపింపగా. 53

మ॥ ఒక రో జంతయు దుర్దినం బగుచు లేవో వెన్నెలల్ పున్నమై
సుక మేమీ? భరతావనీస్థితియె యీ జోకన్ దగెన్, వంగధా
త్రికి నే రాత్రిని గ్రుడ్డివెన్నెలయు లే దీ రెండు తునకల్ కదం
బక మౌదాక, ప్రభుల్ శ్రవద్బధిరు లుండన్ బశ్యదంధుల్ ప్రజల్

ద్వి॥ జనలక్ష్మి పూజలో దునుక సుమండి!
ధనలక్ష్మిపూజ యీ తరుణమునుండి
ప్రముదవద్రహితముల్ బాణసంచాలు
ప్రమిదలన్ వెల్గింత్రు ప్రమదలు చాలు. 55

గీ॥ గొప్పగాలి వీచినఁ దట్టుకొనెడి తరువు
లటులు యువకులు గాగ వ్యాయామశాల
లెన్నియేని కావలయు వే డిందు వివిధ
శిక్షణదములు ప్రాగ్వంగసీమ నట్లు. 56

గీ॥ అనియు మరి చటర్జీ పల్కె నొ నవంగ
వేల ప్రజ, ప్రకంపన మగ్నికీల నటులు
వాచకుల వాచనము జనవలయహృదయ
భావమును విన్నమేరఁ బ్రజ్వరిలఁ జేసె. 57

చ॥ పలికె "సుబోధమల్లికుడు" పత్రిక వీధికి నొక్కఁడై ప్రజన్
జలమున మిక్కిలించుటకు సత్వరముఖ్య మ టంచు, వాకొనెం
"బులినవిహారిదాసు" కరమున్ గరవాలము నొక్కఁడైన జో
దుల మొనగాడు యత్నమునఁ దూరుపువంగము చూపు నేరుపున్.

శా॥ 'ఢాకా'లోని నవాబు ముస్లిములుఁ దో డౌచున్ గవర్నర్ ఫటా
నీకంబుం బయిగొల్పి యెవ్వనిని 'వందే' యన్నఁ గొట్టించి యిం
ట్లే కొల్లాడిన నుద్యతుల్ మెటిక లై వెన్డియమిన్ దెల్పి త
ల్లాకీర్ణోద్యమ మిందు లే దని "మనోరంజన్‌గుహా" వాకొనెన్.

గీ॥ లోకమాన్య కేసరితోడ మాకు మిగుల
మాల్మి, యరవిందుని భవానిమందిరమున
మా మదికిఁ గలదు గది, మ మ్మరయ రెవరు
నేత, లి ట్లోచు మా క్రాంతి నెట్టుకొనిరొ. 60

గీ॥ మనకు వడుమను గిర గీచి మనగల మగ
వాడు లేడు, నొక త్రుటి వేచువాడు వీడు
సంజ్ఞ వీనిది భూపేశచంద్రనాగు
ప్రభుత ప్రజత్రోవ కడ్డమురామి బాగు. 61

గీ॥ అనుచు నొక పొడుగరి పల్కె జనము సంత
సవడ, "సచ్చిదానంద ప్రసాదవసువు"
హైందవమహమ్మదీయసమైకమత్య
మస్మదీయదాస్యచ్ఛిదామత్య మనిరొ, 62

ఇంద్రవ॥ సంజీవనీపత్రిక సర్వవంగ
శింజానమున్ జేసె చిరోద్యమంబున్
బుంటీభవద్ధీరతపొల్పుతోఁ బ
ల్కెన్ జానుగా "కృష్ణకుమారమిత్రా". 63

క॥ నరకు డనెడు 'క' ప్రత్యయ
ధరు డొక నరు డుండె, వాడు తన బలగముతోఁ
జెలసాలగ భారతమును
పరిపాలించెఁ బలునేండ్లు, ప్రజ కవి ముండ్లున్. 64

గీ॥ ఒండునింటి దీపము వెల్గి రెండుకనులఁ
జూచి యోర్వగలేడు, కచ్చుకొని నెగడు
వలెనె తన యింట దీపము వెలుగవచ్చుఁ
బగటి దివిటీలతో వాడు బయలుదేరు. 65

క॥ గీతాచార్యుడు నాయకు
డై తగప్రజచక్ర మప్పు డడచెను వానిన్
జోతుల జన మా నృతిలకుఁ
బ్రీతి నివాళించె సత్యభామోపేతున్. 66

గీ॥ అస్వతంత్రత్వ మనునదె యంధకార
మది నరకద త్త ముడిగిపో నంతట భర
తావనిం బండుగ యయి దీపావళి విల
సించె, వేల యేండ్లుగ బ్రపంచించె నిదియు. 67

మధ్యా॥ అలవడె పెద్దల కిందు నష్టాంగయోగ, మిహంబు
కల యనంబడె, నిది యదనుగా నరకజ్ఞాతు లడరి
కల యైన యిలను గైకొనిరి, కైవల్య మందు డీ రనిరి
భళి! యనినారు మనవారు, బాధింపఁబడితి మీ తీరు. 68

ఆ॥ వె॥ పరమహంస చచ్చి పర మందుకొన్నాడు
బ్రతికియున్న వచ్చి పలుకకున్నె!
మనకు సాత్య మిందుఁ, దనతోడ నాంగ్లుడు
చెప్పినదియుఁ దాను నొప్పినదియు. 69

గీ॥ భౌతికం బైన యిట్టి యీ పారతంత్ర్య
మందునుండి ముక్తిని బొంద నైన యోగ
మా త్తపాతంజలగురుత్వ మరసినాము
నృతిలకుండు గీతాబోద్ధ యిందుఁ బెద్ద. 70

సీ॥ దేశ్యవస్తుధారణము విదేశ్యముల బ
హిష్కృతియు, విద్య జాతియమే చదువుట
శాసననిక్రృతి ప్రభుతకు సాయపడమి
వగు స్వరాజ్యయోగంబు పంచాంగ మిటులు. 71

మ॥ ఇల స్వారాజ్యసమస్వరాజ్యమును రాదే! వేగమే యెల్లవా
రల కీ యోగము పూర్ణ మాకలిత మై, రాణింపగా రెండు తు
నకలు నొందై మన వంగ మిందలివి యంగంబుల్ తుదిన్ రెండు కా
వలెనా! యాద్రిత్రయంబు చాలు, నవియే పాటింత మీ ప్రొద్దునన్

మధ్యా॥ కనుపింపనట్టి భూతమును కాళికామాతమంత్రమునఁ
గనుపించునట్టి భూతమును కడగి "వందే మాత"ర మను
ఘనమంత్రమున వదల్చుకొనఁగలము, కరాంగన్యాసములు
మనమున శుద్ధి వలయును మహాత్ములార! రెంటికిని. 73

క॥ బంకించంద్రుడు ఋషిగా
సంకల్పం బై కమత్యసంరంభముగా
పొంకం బగు నీ మంత్ర మ
లంకారముఁ జేసె రసనలకు నిపు డెవడో! 74

గేయం॥ ఓ! దుర్విధిబద్ధులార! ఓ! కుశాగ్రబుద్ధులార!
బోధించెద యోగము తత్సాధనసంపత్తితో, నా
కే ద్రోవ నాకే తేవ నిదే చేర్చును రాజకీయ
భూధరవరశృంగమున కపూర్వవిభవరంగమునకు. 75

గీ॥ దేశభక్తి జనింపదు శ్వాసకోశ
బలముకొలది మొరసియు శౌర్యబలము లేక
కొలిమిలో నిప్పుకణిక లేకున్న తిత్తి
యెంత యూదిన జ్వాల జనింపనట్లు. 76

గీ॥ రాజకీయతంత్రవ్యక్తి రకరకాల
ద్రవ్యభుక్తి యశోధికారముల రక్తి
యేదియును వద్దను విరక్తి కాదుకాదు
దేశభక్తి త్యాగంపుముక్తియముశక్తి. 77

గీ॥ స్వార్థసన్న్యాసమున దేశభాగ్య మెసగుఁ
గాడి యుపన్యాసమున నేమి పొసగు? నెందు
వడ్లు దంచిన బియ్యము వచ్చుగాని
ఊక దంచిన వచ్చునే నూకలేని? 78

ఆ॥ వె॥ భరతఖండవివిధవైభవశ్రవణంబు
లేని చెవులు కొండలోని గవులు
భారతుల యనేకతారుచిరైకత్వ
మెఱుగని మది జలహీనము నది. 79

గీ॥ పైకి గృహ మెంత మంజులం బైన లోని
దుమ్ము దులుపక యారోగ్యదమ్ము కాదు
అఖిలసుగుణాళి తోఁచి వానడుగునఁ గల
భయము పోక బ్రతుకు జయప్రదము కాదు. 80

గీ॥ వనములందు ప్రసూనసంభరితము సుమ
గన ము టందు, రయ్యది సమరసమె యౌను
దానిఁ గ్రోలి సమాన మౌ స్థాయి నెల్ల
తుమ్మెదల జాతి ఝుంకృతిఁ దొడరుగాదె ! 81

చ॥ ఇటు లని యెత్తెఁ జేతులను కృష్ణకుమారుడు, లేచి మంత్రమున్
స్ఫుటముగ నెల్లబుట్టలవి భూతము లుల్కిపడం బఠించుచున్
రటనముతోఁ బ్రజల్ వెడలి రగ్రగవాచకు లేకధోరణుల్
భటులగుడారాళిం బడుచు బట్టల కొట్లను మూయఁ జేయుచున్ 82

ఉ॥ కొన్నియు హోటళ్లు క్రిందఁబడెఁ, గొన్నియు కల్లులు లాగికోఁబడెన్
వెన్నవవేయగాఁబడియె, వేడవురా! మముఁ గొట్టఁ గాల మా
సన్నము మీ కనంబడియెఁ, జాల జనమ్ములచేత చెంప ఛె
ళ్లన్నది పాండరంబు, కవియన్ బిడిగ్రుద్దులు తిన్న దొళ్లనున్. 83

చ॥ ఒకడు పడంగ ప్రేటుదిని, యూర్చి దళాధికు లేగుదెంచి వా
ని కడక పూర్తిచేసిరి ధ్వనించి దుకాణముఃనుండి లేచిరా !
యికక్రయికా ! విదేశ్యముక్రయింతువొ పుట్టము, నెత్రు నీది దే
శ్యక మనరాదు, విక్రయిక! యమ్మిన నీదియు నంతె యంచునున్

మ॥ పరధర్మంబు భయావహంబు, భగవద్వాక్యం బిదై గీతలోఁ
బరదేశ్యాంబరధారణంబు నిటులై వార్యంబు మా స్వేష్టముల్
కరముల్ గావివి మీవి కా వ్లనుచుఁ, జేల|కాయికాళిన్ మర
ల్చిరి స్త్రీల్ స్త్రీలను పూరుషుల్ పురుషులన్ జేపెట్టుచున్
జట్టుగా. 85

సీ॥ మీ చేతి గాజులు మిలమిలలాడుచు
న్నవి, కొత్తరక మెంత! సవురటంచు
నుంగ్రము తీయకు, డొగి ముట్టి చూచినఁ
జాలు, రా యెంత! పసందటంచు
చోళి శా గున్నది, చాల మందియు మని
కట్టంటఁ దోడుగుట గంటి మనుచు
నీ షర్టుసొం పౌక యెత్తును, కప్పుగుం
డీల సొంపౌక యెత్తు, నిజ మటంచుఁ

గీ॥ చేయి పట్టి, మీ కొకమాట చెప్పవలెనఁ
జాటుగా నని కొనిపోయి సతులు సతులఁ
బుంస్తతులు పుంస్తతులఁ బ్రాతి బుద్ధిఁ జెప్పి
పంపినారలు బ్రిటనువల్వ కొననీక. 86

శా॥ ఎన్నాళ్లాయెను మిమ్ముఁ జూచి, సుఖులే! యీ రందఱున్,
మిత్రు లం
దున్నారల్ మనవారు, మీ రనిన నెంతో యుత్సుకుల్ రండటం
చున్నెమ్మిన్ గొనిపోయి కొందఱుఁ గ్రియాశూరుల్ బ్రిటన్ బట్ట ల
న్నన్నా! వద్దనిపించి యిండ్లకు నదూరాధ్వమ్ము పట్టించిరిన్.

క॥ బ్రిటనుద్రవ్యము భారత
పటిమ నడచె, దాని ముట్టవల దను నట్టుల్
ఘటితమహోత్కరములు ధ్వజ
పటములుగాఁ బిల్లలకును పఱలెను వేలై. 88

క॥ "బ్రిటనువలువలు కొనకుడీ !
యిటను తులువతన మడంచుడీ ! యిది ప్రజ ఖా
రట "వందే మాతర" మను
దిటము రవముతోడ నేలదియు మిలియన్లన్. 89

గీ॥ కొట్టి కొనిపోయి తిట్టియు గొణగికొనియు
ప్రభుత గెల్చినయది లేదు, ప్రజయు నోడి
నదియు లే, దుద్యమము క్రమోన్నతము బందె
విశ్రమించి ప్రవాసపృథ్వి విహరించి. 90

క॥ తరగతి తరగతి కొక డే
మెఱుగనటులు చని యుపన్యసింప మొదటిదే
చరమము పాఠం బయ్యెను
కరువలియున్ దూర దయ్యె కాలేజిగదిన్. 91

గీ॥ మధురవంటి దూరపు నిగమములఁ జెన్న
నగరమందు విశాఖపట్నమ్మునందు
గుత్తిమొదలు రాయల సీమ పత్తనముల
నైనవి స్వరాజ్యసభలు వంగాంగవిభలు. 92

చ॥ పలికిరి వల్లమారిన సభన్ బలుమంది స్వదేశదీక్షితుల్
వలువయె కాదు కాకు ప్రతివస్తువు భారతనిర్మితమ్మె కా
వలె నని "జై" నివాదమునఁ బౌరులు పల్లెలనుండి వచ్చినా
రలు మొరయంగ నుత్కరులు రాజమహేంద్రపురీవరమ్మునన్. 93

గీ॥ పమితి మొగియ మేకల మందలు, ముగియ నది
పులులు వందలు వందలు పూర్ణజనము
రవము విరిసె "వందే మాతరమ్ము" బొబ్బ
రింత ప్రభుత నెంచి తనుల నెఱుపు కొంత. 94

గీ॥ బట్టనను కుట్టుసూదియు భారతీయ
మే వలయు, కార్మ్యాగార మెసగవలయు
గడపగడపకు, విద్యార్థిగణము వేగి
ధనము గూర్చెను రాజ్మహేంద్రపురమందు. 95

సీ॥ నిరుపేద ముసలియు నెవడో గ్లోస్గోది క్రొం
బుట్ట మిచ్చెద నన్ను ముట్ట ననియె
గెలుపు గ్యారంటీ వకీలిడెన్ రాజీప
డెను కొంప లార్చు కోర్టని యొకండు
పరమదరిద్రుఁడే పరదేశప్రభుతను
కొలువ నంచు నొకండు కొలువు మానె
నిది గుమాస్తాగిరిన్ సృష్టించు ఫ్యాక్టరీ
విద్యార్థి కాలేజి విడిచె నొకఁడు

గీ॥ రైతొకఁడు శిస్తు చెల్లింపరాదు ననియె
న్యాయవాదివృత్తి విడెద ననియె నొకఁడు
వంగసంస్థాప్రబోధతరంగవతికి
నాద్యపృథుకుల్యయ్యె త్రివ్విన దాంధ్రజనము. 96

సీ॥ చుట్ట లేనిది నాల్క చుట్టుచుట్టుకొనె న
యా ! యన్న నే డమ్మ ననియె నొకఁడు
ప స్తుండవలెనె నీవయ్య ! బియ్య మ టన్న
నొకరోజు కేమి పో మ్మి కనె నొకఁడు
వట్టియన్నము తిందు మెటులు కూర లే
కనఁ బెరుగున జూటు మనియె నొకఁడు
ప్రాణము మీదికి వచ్చె మం దమ్మవే
యన నేడు దాటదా ! యనియె నొకఁడు. 97

గీ॥ నాడు తెలవడ రయే దుకాణమ్ము నెవడు
నాంగ్లదమననీతిని వంగసానుభూతి
మత్స్వదేశ్యచేలాదిసంభరణమతి స
దస్సు ఖండించునాడు బందరు పురాన. 98

సీ॥ నాల్గుద్వారముల నింద్రధను వలంకృతి
దేశభక్తికి సీత తెనుగు వ్రాత
మాతృస్వరూపసమ్యగ్మిళచ్చిత్రిత
భారతపటుపటధ్వజము కలదు
ప్రతివీధిపొడుగున ప్రజ చౌకునందు, మే
డలు మిద్దె లెక్కిరి వలనువారు
మంగళవాద్యంబు మధురగానంబు వం
దేమాతర మ్మను దివ్యగీతి

గీ॥ మొనసె సభ పతాకాభివందనము గాగ
నిందు వాగ్ధోరణులు స్వరాజ్యేందిరాక
రాగ్రకమలమధుసారణు లగ్రిమములు
బందరున తెన్గు, కల్కటాన్ వంగభాష. 99

క॥ కృష్ణాపత్రిక మున్నుగ
నుష్ణమ్ముగ తెలుగువెలుగు నొగి వెలిగించెన్
ధృష్ణియు కడు సహజంబుగ
విష్ణుని కుడికంటి కాంధ్రపృథివి యటన్నన్. 100

క॥ మనమే యనుకోన్ మనకం
టె నొక యడుగు ముందువేసెనే! ఆంధ్రము మో
హానబలనీరంధ్రము భే
షనిరి సురేంద్రాదు లాప్త లద్దాయనగా. 101

ఉ॥ ఆర్యసమాజబోధముల హైదరబాదునఁ గూడ నుద్యమ
స్థైర్యము బూరటిల్లియు నిజాంపరిపాలనదుర్దినమ్ములో
నర్యమకాంతి యయ్యె, నటు లయ్యు స్వదేశపటమ్ము లేయటన్
ధార్యము లయ్యె పెక్కురకు తక్కువయయ్యె సదఃప్రసంగ
ముల్. 102

ఉ॥ బోనున బోను, పంజరకమున్ బెనుపంజరమందు నిందు సం
స్థానము, భారతోద్యమసదాగతి సేవన బంధుదర్శనా
ప్యాయనముతోడ మెల్చి బెజవాడకు, బొంబయి నాగపూరు పూ
నా నగరాలకున్ జను జనావళి హైదరబాదనుండియున్. 103

ఉ॥ అవిధిఁదెల్పెరయెగ్గృహగృహమ్ముననగోష్ఠియునైప్రజల్ "క్రియా
కేవలముత్తర" మ్మనిన కీలున నేరికిఁ దీసిపోని దీ
తావహు లైరి,ధన్యపృథుకాళియు నెందఱో తాల్పరైరి యెం
తే వెలఁ బెట్టి కొన్న పరదేశ్యపు నిస్తులరీతిదుస్తులన్. 104

సీ॥ అనవచ్చు ప్రమిద లటంచు వీనిని, కాని
యివి నిఖిలప్రజాహృదయ రేఖ
అనవచ్చు తైల మటంచు దీనిని, కాని
యిది సమగ్రబలమ్ము హృదయభృతము
అనవచ్చు వత్తు లటంచు వీనిని, కాని
యివి హృత్తుటిగి వెలయించు కోసలు
అనవచ్చు దీని దీపావళి యని, కాని
యిది యెల్ల హృదయాల యేకరశ్మి

గీ॥ యిటులు వచియించి భారత మెల్లపుడు జ
యించుగావుత! మని యెలుగించి సతులు
సుతులు వెలిగించినారు దీపతతి నెందు
ప్రజల కీనా డొక రసంబు పాయసంబు. 105

గీ॥ కర్జ నుచ్చాటితుడు పోయె కా దనుకొని
వచ్చె లిబరలువై ప్రాయి, వాని పేరు
వఱలు 'మింటో', బ్రిటనునుండి వార్త తెచ్చె
వస్త్రకర్మాలయాల్ మూతవడెడి ననుచు. 106

గీ॥ వంగసంఘటనల విని పొంగె గాంధి
యిరువిధమ్ముల జతన మిత్తె అగుచ నయి
భారతమునందు బ్రిటనుసంబంధము నిక
కత్తిరించు కర్తెర సమాయత్త మనుచు 107

గీ॥ ఇంధనము లేని చిచ్చులై యెల్ల ప్రజకు
రేల రచ్చలు చలిని పోఁద్రోలుచున్న
వనుచు నిరువదియొకటవ యఖిలభార
తీయసభ కేగె కాశివర్తికి బెనర్జి. 108

# స్వారాజ్య ఖండము

గీ॥ బ్రహ్మబాంధవోపాధ్యాయు పత్రిక యగు
'సంధ్య' తత్కాలకృత్యప్రస్తావనమున
పేరు గొని 'యుగాంతర' బలె విడిని గలిగి
వారణాసీయువకులకు పరిచితంబు. 1

గీ॥ కవి 'సరోజినీదేవి' పికస్వరమున
హిందుముస్లిమైక్యత వెలుగింపఁ దొడగె
'చిత్తరంజనదాసు' దేశీయవాది
న్యాయవాదిగ ప్రజమది నలుమఁ గడగె 2

గీ॥ కాశికిం బ్రాకినది వారి వాసి యపుడె
అగపడిన రూపు మితవాద మైన నేమి
అగపడని తత్వ మతివాద మన్న తిలక
కోవిదుని విశ్వపతి మెచ్చుకొన్నదపుడె. 3

క॥ ఆ దక్కఁ గురువు లే దై
ఆ దిక్కై తిలకు రాగ తను గన ఘంటా
నాదముతో విశ్వేశ్వరు
డూదించెను శంఖ మెంత యుత్సాహంబో! 4

ఆ॥వె॥ విశ్వనాథు గుడిని వినుపించు సొన్నాయి!
అపుడు జీవునితన మరిగిపోయి
బ్రహ్మతనమె నిలుచు ప్రాణిలో,నా నాద
మునకు ఆకులోని ముడుత పోవు. 5

మ॥ వలువుం బో నరుణంబు నంత పసుపు న్నానావిధావర్ణముల్
దొలగన్ దోచెను తూర్పునన్ భువనబంధుజ్యోతి,విశ్వేశు కో
వెలలో లో నరవిందు డారసె,ప్రజల్ వేడన్ బ్రసంగించె శ్రీ
తిలకుండున్,మునివంటి గోఖ్లె గుడి కేతెంచెన్ జనెన్ వెంటనే.6

గీ॥ గోఖలేగూర్చి మీ రనుకొన్న దేమి?
యని యడుగ పాత్రికేయు డిట్లనియె తిలకు
ఆత డెచ్చుతగ్గులు లేని యగ్నికీల
నుడి ఫిరోజిషాదే కాని యెడద మాది 7

గీ॥ అంటరానితనమ్మును గెంటఁ దలచి
యతడు పోరిన పో రింతయంత గాదు
సంఘసంస్కర్త లన పడిచచ్చిపోవు
వారు సన్యాసులైన చెప్పఁ బని లేదు. 8

గీ॥ గోఖలే నావలెనె కాడు గొప్ప వక్త
వివరములతోడ నెదిరి నొప్పింపగలడు
పోటరితనమ్ము. ప్రజలతో పొత్తు, పట్టు
విడుపు,రాజకీయము లివి వేరు సుండి! 9

ఆ॥వె॥ విదితసత్య మిది యు,వేరు సాధారణ
నీతి, రాజకీయనీతి వేరు
తొలి విధమున నతని మలచిన పెంపుడు
తల్లి వినతి, గరుడితల్లి వినత. 10

ఆ॥వె॥ అతని కెవరు శిష్యు? లల్లె మీ కెవ్వఁర
నంగ నతనికన్న నాలుగేండ్లు
చిన్నవాఁడైన గాంధి తన్నెత్రిశిష్యుడు
మిత్రు లుంద్రు నాకు, ఛాత్రులు నహి. 11

మ॥ అటులే ప్రష్టుడు గోఖలే పలికె నేనారంభమం దా మహో
ద్భటు నా కన్నులనిండకప్పుకొని యాపై వాని భావోష్ణము
త్కట మై తాళక దూర మైతి,నెపుడేన్ గావచ్చు తద్ధోరణీ
పటిమం జే యిట రాజకీయమున ద్రోవన్ జూపు దీపమ్ముగా. 12

గీ॥ ఒక మహావ్యక్తి లోకమాన్యు, డతని విసు
వింపఁగలుగు సమర్థుండు వేడు లేడు
దాదభాయినౌరో జియె దక్క, మేము
వానియంతటివార మెవ్వరము గాము. 13

గీ॥ కలవు మందాకినీతరంగముల యులివు
హర! హరా! మహాదేవ! యన్న రవ మొక్క-
చోటనే, అదె కాశి, యచ్చోట కాంగ్రె
సుభయపక్షనేతలు కూడి రుల్లసమున. 14

గీ॥ అప్పటికి సంస్థలోన సభ్యత్వ మొప్పు
వారితతి పదివేలకు పైని యుండె
వచ్చుచున్నవి దరఖాస్తు లెచ్చుసంఖ్య
తిలకువిపినచంద్రుల కృషి ఫలిత మగుచు. 15

క॥ నూతనవేదాంతమత
స్నాతకు డగు రామకృష్ణ ఛాత్రమణికి లో
లోతు లిడిన యరవిందుడు
కాతంత్రము లేల? "బాయికాట్" వలయు ననెన్. 16

ఆ॥వె॥ 'ఓల్డుకాల్పె' కాక యొప్పొందవలెఁ 'బాయి
కాట్టు' కూడ, నపుడె కలదు శోభ
కాంగ్రె సనగ జాతి కట్టుకొన్నట్టి గి
మనియె నశ్వినీకుమారదత్తు. 17

క॥ లాల్ పాల్ బాల్ మేల్మే లనిరి-
అల్పములుగఁ దోపరాద ఆచరణంబుల్
జల్పము లేలా? యొకవడిఁ
గల్పింతము తావు దాని కనియెన్ గోఖ్లే. 18

ఆ॥వె॥ మును విదేశ్యవస్తువులను సర్వత్ర బ
హిష్కరింత మనుచు నిపుడు మాటె
గోఖలే యనఁ దిలకు, 'కపర్ది' మారలే
యనియె మెల్లగ దరహాసితముఖుడు. 19

క॥ అందించినావు మాటను
క్రిందేలా? రాజకీయఘనసంస్కరణా
నంద మిడెద నని 'మార్లే'
బంధించెను గోఖలేరవము తిల కనియెఁ. 20

ఆ॥వె॥ లోకమాన్యుఁ డౌనుగాక! దేశముకోస
మతడు చేయఁదలపట్టిన పని య
కృత్యపటలమున నహిా యిటులు ననియె మా
ర్లే య టంచు గోఖలేయు పొడిచె. 21

క॥ నేయిని విషముగఁ జూచెద
వేఁడైనను బుద్ధి యెంత పెరిగెన్! శూర
ధ్యేయుడు 'బాపూగోఖ్లే'
మాయురెః యనుకొనడో! స్వర్గమందు నిను వినన్. 22

గీ॥ దుష్టశక్తి కెఱగెడి దురదృష్టశక్తి
తిరుగా జుట్టుకోలేదు తేరకీర్తి
నన్ని విద్యలలోన నున్నాఁడు మాన్యు
డనియె తిలకు బెనర్జియు నదిరిపోవ. 23

ఉ॥ ఎట్టులనైనగాని తరలింపమొ వామపథాన సంస్థ న
న్నట్టిది యాస ఓపికకు నంతము లేని తిలక్మనీషిలో
కొట్టుకలాడుచున్నది,యకుంఠితయత్నముతోడ సంస్థ చే
పట్టి గణాంకసఖ్యు నతివాది నొనర్చుట గోఖలే హృదిన్. 24

గీ॥ పెద్దతలకాయతో నొప్పు పెంచుకొనును
గుండెకాయ, విప్లవమున కొనర డనుచు
దెలిసియున్ దిలకును సంప్రదించి గాని
కడగ డరవిందు, డిది మైత్రి ఘటన మనగ. 25

క॥ దరఖాస్తులేల?అస్థులు
పరవిభుతన్గూర్చి,దాని ప్రతిఘటియింపన్
దరలుదము నిరాయుధముగ
నెఱి నను నరవిందు మాట నెగ్గకపోయెన్. 26

క॥ ఎదిరించిన బెదిరించిన
వదుమంబడి మనము పొందు వాక్కులు చెడవే!
యిది నే,డది రేపు,నొకా
క్కదాని నొందుదము వేడుక యనెన్ 'వాఛా'. 27

క॥ షై మెం? తని యడిగె కవ
ర్డీ,మూడున్ దక్కు వెన్మిది యనెన్ వాఛా
యీ మీ వాచీ ఆడదో!
నా మగదే యనియె నతడు నగవుపిసరునన్. 28

గీ॥ కీ_ర్తిశేషుడు వాఛా యి కేమి పలుకు
నింతకును మించి యని నగ వెగయ నెదిరి
కి నవె కీ_ర్తిలో శేషుడు కీ_ర్తిశేషు
డనుచు 'పాల్' దివ్యభాషపాల్ద్రాగినతడు. 29

గీ॥ స్వాగతము వదు యువరాజజంపతులకు
భారతాగతులకు నని పట్టుఁబట్టి
యును సడలినార లతివాదు లోలగమును
సంగరాభీలగముఁ జేయ సంశయించి. 30

క॥ ఒనరెను రాణీ 'ఎడ్వ
ర్డునకున్' విక్టోరియా' యెటుల్ తలచెనో య
య్యానువున పాలన లేదని
వినుచుత!యువరా జటంచు వినతి యురునటుల్. 31

ద్వి॥ క్రితమే రాజభక్తికి కాంగ్రె సనుచు
స్వాతంత్ర్యవాదుల సభయును జరిగె. 32

క॥ గీతను 'సిన్ఫి'నుద్యమ
చైతన్యస్ఫూర్తఁ జేసి చదువుకొనెడివా
రేతెంచిరి 'నిహిలిష్టుల'
భ్రాతలతో సమితి మొనసె 'వందే'గీతిన్. 33

క॥ మీటింగున శ్రీకాశీ
కోటింగుని విశ్వపతిని స్తుతియించి యిటుల్
మాటలతో నరవిందుడు
మీటెను తత్తాండవమున మెలగెడి వీణన్. 34

ఆ॥వె॥ కణుదురిగ యెద్దుఁ గదలించు నెప్పుడు?
మెట్టినపుడు గాదు కుట్టినపుడు
భారతుండు ప్రభుతఁ బడనెట్టు నెప్పుడు?
తిట్టినపుడు గాదు కొట్టినపుడు. 84

గీ॥ ఎందు స్వాతంత్ర్యమున గుబాళించు గాలి
అందలి ప్రభాతమును దాని యలరె వేరు
నిందు సుప్రభాత మని వచించుకొనుట
యెఱుగకె పరస్పరము మోసగించుకొనుట. 84a

క॥ ప్రజ ముప్పదై దు మిలియ
న్లె జపానున, గెల్వ గొనె ననిన్ రష్యాఁగొ
ట్టి! జయింపదొ! బ్రిటనున్ దొ
ట్టి జన మిటన్ మూడునూ ర్లకే!మిలియ న్లై. 85

గీ॥ ఈ దశకు కోటిదశనుండి యెక్క మనిసి
యన్న సిద్ధాంతమున కుదాహరణ మైన
యొకడు పోయిన నేమి? తత్ప్రకృతి పోదు
పరవిభుత దృశ్య మిది కొట్టవచ్చినట్లు. 86

ఆ॥వె॥ అన్యదేశజనుల అంటు లేనట్లు స్వ
తంత్ర మగుట భారతమున కురవు
అరిగుణమ్ము లంటి అమృతమ్ము దొరకునా?
వెండి సాగె నారవిందవాణి. 87

గీ॥ తిలకుతోఁ గూడి మనలఁ దేర్ప లజపతిని
గోఖలే కోరుట, యితండు కుదుర దనుట
చెవినిఁబడెను "ప్రిన్సాఫ్ వేల్సు" కెవడు చెప్పు?
స్వాగతము వంగయువకుడు శ్వాప గలిగి. 88

ఉ॥ భారతభూమి కీశ్వరకృపారస మాంగ్లప్రభుత్వరూప మై
జారె నటన్న శ్రీబిపినచంద్రుడు సత్య మెఱింగి దానితో
వేరముఁ బూనె,సోదరి 'నివేదిత' లేఖల నెన్ని వ్రాసినన్.
శూరుడు గాడు గోఖలె,వచోవిసరమ్మున లేదు మూడియున్. 89

గీ॥ బ్రిడ్జి యాడి,బిలియ ర్డ్సాడి,ఫ్రేజు లొప్ప
నాగ్లభాషఁ బల్కాడి, యధ్యక్షపదవి
కాంగ్రెసున సమకూడి,యోగ్యతకు బిరుద
మొందుచే గాదు ప్రజగూర్చు క్రందు వలయు. 40

క॥ 'తమసో జ్యోతి,ర్మృత్యో
రమృతం మా గమయ!'యనెడి యామ్నాయము మూ
లము స్వాతంత్ర్యాపేతకు,మో
క్ష మనన్ భౌతికము నైన స్వాతంత్ర్య మగున్. 41

ఆ॥వె॥ హిందువులది 'బైబి' 'బీజము' లలో లేదు
తనరు రాజకీయదర్శనమున
నీతిశాస్త్రమున,ననేకత్వ మేగ నా
నంద మపుడె సిద్ధ మిందు నందు. 42

మ॥ అవిముక్తమ్మున కాలుపెట్టిన క్షణంబందే ప్రజల్ మూగి యీ
యవె సందేశ మనంగ శ్రీతిలకలోకారాధ్యు డే ముక్తికిన్
స్తవనీయం బరివర్గసాత్త్వికనిరోధం బే యటంచుఁ మనో
జ్ఞవచస్కమ్ముగఁ జెప్పెఁగంట,యదె యీనా డస్మదాదేశమున్.

గీ॥ దేశవస్త్రాదరణము,విదేశ్యతతి బ
హిష్కరణము,దేశీయ మై యొసగు విద్య
యివి స్వరాజ్యమునకుఁ గాక వృథలు,శూల
మూలములు గాక వృథ గావె మూఁడుమొనలు! 44

ద్వి॥ అనుచు మరియుఁ బల్కె నరవిందసూరి
తొణికె సదస్యరంజనరసపారి. 44a

ఆ॥వె॥ బిపినచంద్రముఖ్యు లిపుడు గాకున్నఁ గాం
గ్రెసు వశమ్ము గాదొ రేపు నవిరి
వారివారి నుదులు "బైడ్ గురూశదివో
స్కారు"లు నొడివినారు గట్టినరులు. 45

క॥ మంచమునకు, దూరం బై
కంచమునకు నగుచునున్న కడువృద్ధు బలెన్
కొంచెము నుష్ణము లేదో వ
రించునె కాంగ్రెసును స్వేచ్ఛ,యెలుగిడె నొకడున్. 46

క॥ ఇటులు విశేషప్లవసం
ఘటితప్రయాణకుల సమితి కాగా గంగా
తటమునఁ బెనువందిటఁ బి
క్కటిలిన ప్రేక్షకులతోడ కాంగ్రెసు ముగిసెన్. 47

క॥ మాధుర్యస్రుతి'మున్షి
మాధవలాల్ 'స్వాగతము నమస్కృతజన మై
శాధకనిజకృతు లెన్నిన
నాధిక్రోధములు లేని దనె నేలుబడిన్. 48

సీ॥ సతతనిస్వార్థభారతసేవకసమాజ
సంస్థాపకుడు నుడిచదురువాడు
దండింపరాని శత్రుం డితండే యని
కొంద ఆంగ్లులు గొణ్గుకొనెడివాడు
ఊగిఊగి స్ఫురించు నుజ్జ్వలభావాల్ ఖ
చించి వ్యాసాల్ విరచించువాడు
'బడ్జెట్'ప్రసంగ మెవ్వని దన్న ప్రశ్నార్థ
కమున శాశ్చర్యార్థకాఖ్యవాడు

గీ॥ అరసినంతనే యెవ్వనియందునేని
దాగిన మహాత్మతను పైకి లాగువాడు
నింట నతిథిగ మెఁలగువా డీ సభేకు
డిప్ప శ్రీఖండముమిఠాయి నిడియె నుడుల. 49

క॥ సహచరులకు పెద్దలకుఁ గా
మహిళలకును ధన్యవాద మర్పించెద నీ
మహనీయతమము పదవిన్
వహియింపించితిరి నన్ను భారతసేవన్. 50

గీ॥ కాంగ్రెసధ్యక్షతను మించు ఘనతరంబు
పదవి లేదు దేశమున, నీ పదవికన్న
దొడ్డదైన బాధ్యత పయిఁ బడ్డ దిపుడు
నావ కాంగ్రెస్ తుపానులో, నావికుడను. 51

ఉ॥ రావలెఁ గాని విశ్వపతిరమ్యకటాక్షదృశిప్రకాశముల్
కావలెఁ గాని తోడు హితకాండసమర్థత దేశభక్తి, యీ
పోవడిఁ బాయు చెంతపని,అంతియ కాద, యపూర్వగౌరవం
బై వెలిగింపదో!ప్రజలభాగ్యము కాంగ్రెసుతొంటికంచెనున్.

గీ॥ భారతోద్ధరణమ్మునఁ బ్రాతిగలడు
జననిపోలిక యువరాజు జార్జి, యతడు
వచ్చినప్పు డీవలయును స్వాగతంబు
చెప్పిపంపవలయు నటుల్ చేసెద మని. 53

శా॥ వచ్చెన్ధీరుడుదూరదృష్టియుతుడున్వై స్రాయిమింటోయిటన్
రచ్చల్ మెచ్చగ,రెండునైనవి మనోరాష్ట్రమ్ము లేకమ్ముగా
వచ్చుఁగా వీని యుపజ్ఞచే,నితని సంభావింప నౌ స్వాగతా
భ్యుచ్చస్థాయిని,కర్జ నేగెను,శుభంబుల్ సాగె నొక్కొక్కటిన్

గీ॥ వంగభంగీకరణసామ్యపరమఘోర
కృత్య మెన్నడు జరుగలే దిండియాన్, ద
దుత్థ మింతటి జనశౌర్య మొకట్కట్టు
నెపుడు లే, దొక యొగ్గొక నిగ్గుకొలుకు. 55

మ॥ ఇదియేనా!శతవత్సరాల ఫలితం బీ యేల్బడిన్! మూగలై
పదముల్ రెండు గలట్టి జంతువులుగాఁ బాలించునాంగ్లాశికిన్
తుదిఁ గన్పట్టిరచే!ప్రజల్,మరల వద్దున్వద్దు సంబంధ మే
యధికారాంధునితోడ నో!జనత!భావాతీతశక్త్యున్నతా! 56

గీ॥ విన్న ప్రజ కరతాళాన వెన్నుదట్టి
నట్లు గాగ నిరాత్మవంచకుడు గోఖ
లే వచించె మరియు నిటి లేతవనులు
తిరిగి జరుగనటులు నివదింపవలయు. 57

ఉ॥ నీరు ప్రవాహమై దరులు నిండుచు పొర్లి నదీసుదూరభూ
మీరచితాంకమైన కడిమిన్ మన వంగమహోద్యమం బహో!
భారత మెల్లఁ బ్రాకినది, బంధమునుండి స్వతంత్రతాదిశన్
గారుతమమ్ము నుండియుఁ బ్రకాశమువై పునకున్ బ్రయాణముల్

గీ॥ ఇపుడె మొదలైన కడకలో నెన్నొ అడ్లు
వానిఁ దొలగించుకొనుచు త్యాగాన నడచు
వంగదేశీన రాష్ట్రము లంగకములు
వంగమున కైన దెబ్బ సర్వత్ర బొబ్బ. 59

గీ॥ ఉద్యమంబు స్వదేశీయ మొనరవలయు
నొనరుచున్నది దేశ్యవస్తునికరాభి
మానరూపంబు, కాని యుద్ధాని బెరసె
బ్రిటనువస్తునిరాకృతి జటిలనీతి. 60

క॥ తప్పనిసరి యగునప్పుడె
యి ప్పని యొప్పు, నిపు డేల? యింగ్లీషుప్రజల్
త ప్పిది యని మన పెనుపని
ముప్పున ముంచెదరో! యన్న బొలకువ తోచెన్. 61

గీ॥ అధినివేశస్వతంత్రత యస్మదీయ
లక్ష్య, మీ త్రోవలోన మెల్లగ మనము న
డువవలయు నెదిరికి నొప్పి దవులనట్లు
నెదిరి మనతృప్తికై వేగిరించునట్లు. 62

క॥ అని మరియు నెన్ని సంగతు
లనొ వినిచెను, కోరగావలయుకొ శ్కెల పా
లనవారికిఁ బంపగ వ్రా
సిన పట్టి చదివె సుగుణసింధువు గోఖ్లే. 63

క॥ మనకు జయము చేకూరుత!
మని మెహతా, తీర్పు నేయ మౌను స్వరాజ్యం
బని నౌరోజీ యుం బని
చిన లేఖల మున్నె చదివె శ్రీజంజాలాల్. 64

ద్వి॥ గోపాలకృష్ణగోఖ్లేపల్కు లురవు
దీపంబుకళుక్కులు, తెలిపె బెనర్జి. 65

గీ॥ వంగభంగము సేడయ్యె, భారతమ్మ
నందు గౌరవభంగ మేనాడో యయ్యె
నన్యదేశ్య మపాకృత, మాత్మదేశ్య
మోను స్వీకృత మంతట, నసెఁ గపర్ది. 66

క॥ జీవాహారముగా బ్రజ
భావనిధిన్ గొలుచు గుప్తపఱచుకొనె నదే
వావాదు లజపతింద్రుని
దా వీట న్నుఱిపి డైన దా సభ ఖల మై. 66a

ద్వి॥ కాము మనము బిచ్చగాంద్రము, హాక్కు
సామమ్మనన్ గోరు సామ్రాజ్యజనము. 67

ఆ॥వె॥ ఓ బెనర్జిబాబు! ఓ గోఖలేబాబు!
ఇంగ్లమిత్రు లేమి యనుకొనెదరొ
ఈ బహిష్కరణము నెఱిగి బ్రిటనునం ద
టంచు మీరు చింత నందరాదు. 68

చ॥ మన మిట దెబ్బఁ గొట్ట పడిమై బ్రిటనీయుల జేబు పైఁబడఁగా
మన కిది యేలొకో ఒగిలె నంచు విచారణ సేయు నప్పుడా
జనము,తథాకృతిన్ జొరక చక్కటిమాటల వారి బ్రోలఁజ
ల్లినయెడ నేమగున్ ?పులుగు లేలగ్రహించును మౌక్తికమ్ములన్

శా॥ లాల్ పల్కాడిన దిట్లు,వాని నుతి నోలాడించె చప్పట్లు, "బెం
గాల్ పూర్వం బటు లేక మై మనుట కాంగ్లద్రవ్యనై షిద్ధ్యముల్
తెల్పెన్ పాలక లన్ బ్రవర్తితము" లీ తీర్మాన మాకొన్న చో
నల్పాహారము పెట్టినట్లె యనుకొన్నా రుగ్రవాదప్రియుల్ .70

ద్వి॥ అదె తీరుపున వంగమందు వర్తిలిన
యధికారిదుశ్చర్య లవధీరితములు. 71

క॥ ఆ నిముసాన సభవిడచి
పో నళివాదు లనుకొనివపోడిమిమై తి
ర్మానము యువరాట్స్వాగత
మే వాదము లేద వే లయిన ప్రేతకులన్. 72

క॥ ఇక రాజకీయముగమన్
బ్రకటింపంబడు బహిష్కరణము స్వదేశ్య
ప్రకరణము, కొందఱిం దొ
ప్పకున్నఁ బ్రజ యొప్పు నని సభన్ దిల కాడెన్. 73

శా॥ మాలవ్యా వలికెన్ బరిశ్రమము లస్మద్ధాత్రిపై పుష్టముల్
గ్రాలన్ జేతస్వదేశ్యముద్యమమనంగానంచు, మీ యూహముఙ్
గ్రాలుంబో కళ యొచ్చు,నుద్యమమనంగాబింబమండీ! యవేళ
దోడఁడో బ్రజలకొ తిలక్ పలుకుపొందున్ గోష్ఠివందింపగా.74

చ॥ వలికె స్వరాజ్యమే నిఖిలభారతలక్ష్యముగా సదఃప్రజల్
భళి!యన లోకమాన్యుడు, తలంపర దానిని తీర్పు సేయ న
వ్వుడు,తలయూపె నెక్కడకు పోవునుతీరుపు గాకముందునే
కొలువున నంచు తద్బుధుడుగుంఫితతత్ప్రథమోక్తికీర్తియున్

క॥ మున్నే క్రమశిక్షణ లే
కున్న స్వరాజ్యమ్ము తెచ్చి యొసగద దానిన్
చిన్నతనమున న్నేర్వక
మన్నయ స్వరయుక్తవేదమువతి, యత డనెన్. 76

క॥ నీ త్రోవయె నీ దగుచున్
నా త్రోవయె నాది యగుచు నడిగితి, మికపై
నాత్రోవయె నీది వలయు
నీ త్రోవయె నాది, యిటులు నిగదించె తిలక్. 77

ఆ॥వె॥ ఎన్ని మతము లున్న నేకమతి వలయు, మ
రెన్ని భాష లున్న నేకదేశ్య
రాజభాష వలయు, తేజస్కరంబు హిం
దీయె యది యటంచు తిలకు వలికె. 78

ఉ॥ ఏయది యాత్మశక్తి భరియించి స్వయంపరిపోషకంబో జా
తీయము విద్య యయ్యదియ, దీనివి కావలె ఖిల్లు,నోళ్లు జా
తీయము వల్వ కట్ట నగు తీరున, నాత్మ స్వరాజ్యకాంత జా
తీయము నైన తీరున,కథించెను లాల్,సభతీర్పు వేర్పడెన్.79

చ॥ కఱవులు పెంచునట్టిదియకా పరిపాలన మయ్యె,నంతయున్
సరి, తిన తిండి లే దనిన సామెత కగ్గము కాను రాద యీ
ధర యని లోకమాన్యుడు కదల్చె సభాహ్వాది నతిత్రైణ్యసం
భరితదిశారుణప్రభుడు,పైకొనె నయ్యది తీర్పుగా సభన్. 80

గీ॥ గోఖలేన్ బ్రిటనుకు పంపి కూడగట్టు
కొనవలయు వారి భావము మన మటంచు
వీరరాఘవాచార్యులు వినిచినాడు
పెట్టినాడు వావాదున పెరుగుబువ్వ. 81

శా॥ బీ.యన్.శాస్త్రి యు లాలు వోలె పలికెన్ భిక్షించునే!హాకుక్షి
వే యంచున్ మనజాతి యొడ్లను జగద్విఖ్యాతసమ్రాట్ బుధా
గ్రీయశ్రేణిని గన్న తల్లి యని,'వారేవా! ధ్వనత్ప్రేతుక
ప్రేయస్త్వాబ్ధికి చేతి యూపులువళుల్,లేనవ్వులే ఫేనముల్.82

సీ॥ శాసనసభల విస్తరణ.'ఎక్సైజు సై
జు, పరిపాలనమునన్ సుంతమార్పు
కార్యాచరణకసంఘప్రవేశంబును
పార్లమెంటునయందు ప్రతినిధిత్వయు
పెద్ద యుద్యోగాల నిర్దేశజనులకు
నిడుట. ఫౌజ్ ఖర్చుతగ్గింపబడుట
భారతీయార్థికవ్యయనంబు, బ్రిటనువ
లసలలో నిండియున్న యవనంబు

గీ॥ న్యాయనిర్వహణంబు వంగవిభజనము
మున్నయినవానిగూర్చి సంపన్న మయ్యె
తీరుపుల బారు-అనధికృతి తిలకు పేరు
కలకటా ఖని, ఆగామికాంగ్రెసు మణి 83

ఉ॥ తూరుపువంగమందుఁ గొనె దొడ్డయొకండుబుణమ్ము గాజమీం
దారు ప్రభుత్వదత్తము ధనమ్మును వేలకువేలు రూప్యముల్
కోరి రతండునున్ మరియు కొందఱు ముస్లిముపెద్ద లేల్పడిన్
పోరుగఁ బల్కి వేరుగ నియోజకవర్గములన్ మహార్థులై.84

ఉ॥ వంగము రెండుగా నగుటవల్ల ప్రభుత్వము కొంతయాత్మలో
పొంగెను రెండుపిట్ట లొక పుంఖమునన్ బడినట్లు ఖిన్నమై
కాంగ్రెసు మెత్తచిత్త మగు కత్యు తనున్ గయికోగ, వేరు పా
ర్టిన్ గొని ముస్లిముల్ తనకుఁ బ్రీతిమెయిన్ జరిపింప నొప్పగా

మధ్యా॥ ఐదేండ్ల కొక హా క్కొసంగి యైదువందలయేండ్లు నేలి
యాదాయ మొందు భాగ్యమ్ము నతివాదమును సృష్టిచేసి
పోద్రోలుకొనుచుంటి మనియుఁ బొగిలెను ప్రభుత, సున్నాలె
యీ దొంద, మతివాదమంటె, యిప్పుడే మనుకొన్న నేమి!86

మధ్యా॥ నాడెపునుడి వాడె కాని నాయకత్వమున కర్హుండు
గాడు గోఖ్లే, వానికన్న గతి లేదు, వాని నుఖ్యించి
నేడు 'నాగాఖాను'నున్ గణించి సుంస్కరణకము లిడి
తీడు నెవ్వండు ప్రజల మదిన్ వాని దండింపవలయు. 87

క॥ ఇది సిద్ధాంతము, 'మింటో'
అదనున్ కనిపెట్టు ఁట్ట యాహ్వానించెన్
సదమలమతిగోఖ్లేన్, గని
కథించె కనువాపుఁ జాయఁ గలిగిత నంచున్. 88

క॥ నెలజీత మష్టశతమున
నలుబది యుంచుకొని తక్కునది లోకార్థం
బిడు నీ ప్రియమిత్రుం డల
రెలయునొకో? 'ప్రఫుల్లచంద్రరే' యని యడిగెన్. 89

క॥ లండనురాగానే ని
న్నుం డాయు మటంచు పంపె నుడి మూర్లే యం
చున్ ఢకుకసంగతు లెవో
వెండియు మింటో వచించి వీడ్కొనె గోఖ్లేన్. 90

గీ॥ గోఖలే దాదభాయికి లేఖ వ్రాసె
వ్రాసె తిలకునకున్ దాదభాయి లేఖ
నీదు వాదాన పడిపోవునేని కుదుట
బడుటకున్ గాంగ్రెసున కేండ్లు పట్టు ననుచు. 91

అను॥ ఆలోకించి తిలక్‌సూరి
యాలేఖన్ జిత్తుబుట్టలో
దాచి వచ్చెను నిఃపూనా
పురుడై కల్కటాపురిన్. 92

అను॥ మోతీలాల్ ఘోషు డధ్యక్షు
డైన కొల్వునఁ బాల్గొనెన్
శివాజీయుత్సవంబందు
శవప్రాణప్రదోక్తిడై. 93

అను॥ రవీంద్రుండు శివాజీపై
రచియించిన గేయమే
శ్యామసుందరు పాఠంబు
శ్రావ్యం బయ్యెన్ సభల దొలిన్. 94

సీ॥ దేవత్వమున కెక్కి దిగి మానవత్వాన
ప్రజలతో కొలువున్న పలుకువాడు
పాత్రికేయత కెంతొ పాండిత్యమును దాన
మిడినవాడును భయంపడనివాడు
నభిమానమంత లో తైత్యాగమంత వె
డంద యైనట్టి యెడందవాడు
గత మైన చరితకు గర్వ మయినవాడు
నాగామి లోక యాశ యైనవాడు

గీ॥ లోకమాన్యుడు దైన్య మపాకరించి
సైన్యముగ భారతజనమ్ము నలిపిన తన
వంటివాని సంస్మరణోత్సవమ్మునందు
పలుకు నిపుడు విను డనె సభాధినేత. 95

ద్వి॥ కనుచూపుమేర నెక్కడనేని సం ది
డని సభకు నమించి వినిచెను తిలకు. 95a

చ॥ భుజగముపైఁ బడన్ దెలివి ముంగిస కెవ్వడు నేర్పె నాతడే
ప్రజకును నేర్పె దుష్టపరిపాలనపైఁ బడు తెల్వి నన్న యా
భుజబలసారబుద్ధిబలపూరమహానద మౌ శివాజితో
డఁజనదు పోల్ప నెంత ఘను డైన మరొక్కరినీధరాస్థలిన్. 96

క॥ వల దనిన వినక సలిపిరి
పలువురు 'దత్తున్' రథోత్సవము నాకుఁ, గడున్
దలమించిన దర్పాత, వ్య
క్తుల కొలు పొప్పదు శివాజి కొకనికిఁ దక్కన్. 97

సీ॥ కాళి లేకున్న బెంగాలీ విధాన భ
వాని లేకున్న శివాజి లేడు
ఆదిశక్తియె కాళి యన్న, భవాని య
న్న, భరతమాత యన్నఁ బ్రజలార!
నిస్థలభేదసంకీర్తనీయులు మహా
నీయులు, వారిలో నెటి శివాజి
ప్రతివత్సరమహోత్సవనిదాన మంతటన్
దమితభారతజనోద్ధరణకీర్తి

గీ॥ బందెలోని ముసల్మానుసుందరిని స
గౌరవము పతిఁ జేర్చిన ఘనతగలడు
జడధిలోఁ జొచ్చు మతముల శక్తి నిపుడు
జనసమైక్యమునకుఁ ద్రిప్పు చరితగలడు. 98

చ॥ అదిమె శివాజి పెక్కుర నిరంకుశపాలకు లంచు, నంతె కా
ని దురక లంచుఁ గాదు,ధ్వజినిన్ దురకల్ గలరున్ దదీయమం
దు,దునుమ గోరి యొద్దికను ధూర్తులు దీనిని తల్లక్రిందుగా
వదరిన నేమిశివమ్మకుడు భారతభక్తమతద్వయీప్రజల్! 99

ద్వి॥ తలకాయ యొకటె చెవులు రెండు, మఱియు
తల వోలె నొకటె, మతాల్ రెండు గాని. 99a

క॥ దినదినమృతుడు మృతి యనన్
దొనకడు, గడగెదము, మన మనోనిచితైక
త్వనిరూఢి యూయ లై యూ
గునుగావుత! విజయలక్ష్మి కోవిదులారా! 99b

గీ॥ తావి ముఖ్యము పుష్ప మే దైనఁ గాని
వచన మైన, ఛందోబద్ధరచన మైన
భావముఖ్యము చైతన్యజీవనాడి
దేశభక్తియ ముఖ్య మే దైన మతము. 99c

గీ॥ మానవునకు రెండేరెండు మండనములు
దేశభక్తి, సత్వమున నెదిర్చు శక్తి
దానవునకు రెండేరెండు దండనములు
సాయసడమియు నవ్వాని సరకుగొనమి. 100

క॥ వన్నెచెడక కష్టాల్ పై
కొన్నను గెల్చుట శివాజి గురు వై నేర్పెన్
సన్నుత మిపు డున్నది జన
మన్నేతను బట్టి జెయి లనఁగ 'హెయి' అనుచున్. 101

ఆ॥వె॥ రాతిఁ గొట్టి నీరు, హేతువున్ దొట్టి వ
మ్మనికము, నస్వతంత్రత కెడయించి
గొనవలెన్ స్వతంత్రత నని వచించెన్ శి
వాజి సింహగడసభన్ వసించి. 102

క॥ 'అష్టై, చేసిన నెపుడున్
'రిష్టై' సరి లే, 'దెల్ట్స' వేది? సెలెక్షఁగ
'చిప్లంకరు' చెప్పెను మును
విప్లవము సృజించు నిట్టి విభుత యటంచున్. 103

ఆ॥వె॥ నిద్రవోయి రాత్రి నిన్నటి సంగతి
మఱచిపోవువారు మంచివారు
ప్రభుత, కిట్టివారు ప్రజలకు నేతలో
యెన్నితరము లైన నిదియ యునికి. 103a

ఉ॥ కట్టిలు చాచి కొట్టబడి గాయము లైన యొడళ్లు తోడఁగా
వెట్టినిపూలు పూచియెలుగించు పులుంగులతో మహీజముల్,
చట్టున గాల్పు వెండ కనుసూరెల వాతలువెట్టె 'బారిసాల్'
గిట్టున కన్నులన్‌దిరిగె, గ్రీష్మమహో! యిక వాన రావలెన్ 104

శా॥ జాతీయం బగు విద్యయే యురుము, దేశ్యంబైన సామగ్రితో
నేతద్భారత మొప్పుచే మెఱుపు, నెన్నేయత్నముల్ మేఘముల్
ఏతేరన్‌వలయున్ స్వరాజ్య మను నెంతే శ్రేష్ఠ మౌ వాన, నా
దేశింద్రించు పరిశ్రమమ్ములు ప్రజా! హేరాళ శౌర్యప్రజా! 105

ఆ॥వె॥ ఇపుడు మనము పడెడి యిక్కట్లె యొకనాటి
ప్రజయు పడెను, దాని బారు దీర్చి
బారి దీర్చియు తల వంపులేనటు నిల
బెట్టెలో! శివాజి వినుతిభాజి. 106

క॥ అని మరియు లోకమాన్యుడు
వినిచెన్ గడుతడవు, 'షాట్సు' వెనిచెన్ పొడవున్
వినిచితరో దోంతరములు
వినినా రరవిందుడున్ విపినచంద్రుండున్. 107

గీ॥ ఓ మహాశయ! రానున్న యోలగమున
కాంగ్రెసధ్యక్షుడవు కమ్ము శాంతసేయు
చుంటి మన వా, రతడు పనికంచెం బదవి
సత్యదృష్టిన్ లఘు వని మస్తకము మాసె. 108

క॥ వఱలించెను వందేమా
తర మను పత్రికను పాల్, తదంచద్వ్యాపా
లరవిందుడు కలకత్తా
స్థిరవాసుడు వ్రాసె నధిపతియు కాలేజిన్. 109

ద్వి॥ ఆ రాజకీయతేజోరాశిపత్రి
కారాజమున వ్రాత లీ రీతి గొన్ని 110

ఉ॥ ప్రాంచిత మైన హూణుల నిబంధనమాలను మించిపోక య
త్నించిన వందయేం డ్లయిన నేమి?స్వరాజ్యమువచ్చు,నింతలో
ముంచుక పోద యేది యను ముట్టిన కందెడివారి మాట వే
ష్టించిన నేటి వెల్తురున చీకటి, దేశముదిక్కు దేవుడే. 111

క॥ చిత్రము "రిప్ వాన్ వింకిల్"
పాత్రలు మన కొంతమంది 'బాయ్కాట్', బెంగాల్
ధాత్రీపతి, 'ఫుల్లరు'గతి
'అత్ర న భూతా' యటన్న యటులు మెలగుటల్. 112

గీ॥ ప్రాతలవుదీవిలోఁ జౌకపారుదేశ
భక్తివ్యాపారమును జేయువారు దీవి
యభ్యుదయభావకల్లోలహతము నేడు
వగుచును న్నగుచుంట హాస్యాస్పదమ్ము. 113

క॥ ప్రజకుఁ ప్రభుత్వమునకు మ
ధ్యజంపవో చత్తువనెడి దద్యతవము, దీ
వి జయము సంతతిపైఁ ద్రో
యఁ జనదు, కనఁ జనదు వెట్టియలలన్ గలలన్. 114

ఉ॥ 'మే' యను విన్నపం బనుగమింపకగోంద్రలితూర్పువంగ ము
ద్రాఫ్యయము ఫుల్లరున్ దటిమె, స్థానికకాంగ్రెసుబిడ్డవిద్యా జా
తీయము, బారసాల వినుతింప నెసంగెను 'బారిసాలు'లోఁ
ద్రోయగఁ గంసునిన్ మధురఁదోచిన హేమరసాలజాలులో. 115

గీ॥ పిచ్చివారి వైద్యాలయాల్ పెచ్చు మెఱుగు
స్వార్థపరు లున్న శాసనసభలకన్న
చెడినచోడ మనసును బాగుజేయు నవ్వి
బాగుపడిన మనసును బాధపఱచు నివ్వి. 116

క॥ ఆనందబాబు! చెంచా
వై నీ పదవికొఱ కుద్యమాంచజ్జనతా
మానసమును మందోష్ణము
గా నొనరింపకము చాలు గణ్యత గలుగున్. 117

మధ్యా॥ బాబూసురేంద్రనాథుండు బారిసాల్ కాంగ్రెసునందుఁ
దాఁ బెద్దపూజారి భారతాంబ కని ప్రకటించుకొనె
నా బుద్ధు డేమనుకొనునో! అంబకు ముఖముచెల్లనటు
నీ బిగిలేని చేష్ట లయి నిఘ్నేంద్ర! ఆనందచంద్ర! 118

గీ॥ కన్య గాదు, కుమారియుఁ గాదు, నాహి
మాద్రికన్యాకుమారిభూమాత దీని
మాత, బాయికాట్ శిశువును మఱుగుపఱచ
నేల? యేల్బడియొద్ద గప్పాలపెద్ద! 119

గీ॥ కార్మికులు సమ్మెసేయ నాంగ్లాధిపత్య
మొప్పు కొన్ని కార్ఖానాలు మూతపడియె
నుద్యమఫలమ్మె గా దిది యొడయుల ప్రని
రంకుశక్రకచోపమప్రకృతిఫలము. 120

గీ॥ ప్రజను పొంగించెఁ బల్కి శివాజియుత్స
వమున, 'భోపట్కరు'ఁ బొగడె స్వాగతమున
జైలునుండి రాగనె, యివి సరిపడ వగు
"నిండియన్‌మిఱ్ఱరు"న వికృతుండు తిలకు. 121

గీ॥ ఎవరొ సూచింపగా నేమి? యితడు తగడు
కాంగ్రెసధ్యక్షు డగుటకు, కనిడి యూర్పు
రెచ్చిపోవు పటంచు వల్లించెఁ బ్రభుత
మాట లా ప్రపత్రిక లోకమాన్యుగూర్చి. 122

ఉ॥ ఇంతటి రాజకీయభయ మిందలి నేతల కున్నయంత యే
క్రాంతను లోకమందుఁ గనరాదు, ఛీ! సలహా యొసంగు సం
ఘాంతర మౌనె! యేల్బడికి కాంగ్రెసు జాతిని విస్మరించి, దు
శ్చింతులయాజమాన్యముస్ఫురింపక సమ్మెను తిట్టుయూనియన్

మ॥ భరతక్ష్మాతలనేత లేలుబడి నొంపన్ జూపు చాతుర్యమే
యరయన్ ''స్లీవు''లయందునవ్వుకొనవా! ఆనాటి 'బిస్మార్కు' 'కే
వరు' నీడల్, తల నిప్పుకోడి సికతాభారమ్ములోఁ దూర్చి యీ
వెరవై పాటఁబెనన్న తెల్విమన తెల్విన్నేఁడు పాలించెడిన్. 124

గీ॥ ఆ పెషావరు కొల్హాపురాంతభూమి
బొంబయీ కలకత్తాంతరంబు భూమి
పొలము పొలముపండిన పంట తిలకు కీర్తి
యిది రుచింపదు మితవాది, కేలుబడికి. 125

అను॥ ఒక్క బొంబాయి కేరాజు
మెహతా, లోకమాన్యుఁడో!
చక్రవర్తి మహారాష్ట్ర
సర్వసర్వంసహాత్ముకున్. 126

గీ॥ వాది క్రియ, నిర్ణయము ప్రతివాది యైన
ఘట్టమున మోతిలాల్‌ఘోషు గట్టివాడు
బారిసాల్‌సభ కల్కటాపట్టణసభ
యితని చేవను మరిమరి బుజువుపఱచె. 127

ఉ॥ "చర్చిలు"వంటివారు తమ స్థానబలమ్మున గర్జ చేసినన్
జర్చలకున్ దిగండ చిరునవ్వుచు సోషలిజంబె భావికా
లార్చిత మౌ నటంచు బహుళాబ్దులఁ బల్కిన "కేరుహార్డి", పో
కార్చును భారతప్రజల కష్టము లేబరుపార్టి యొక్కటే. 128

గీ॥ ముందుబెంచీలలో నున్నపుడదియును ధ
రింపవచ్చు ముఖాన టోరీల ముద్ర
కాని నీతి నియమము కాకట్టు పెట్టి
న లిబరలుపక్షమునకన్న నయము కాదొ! 129

గీ॥ అక్రమమ్ముగఁ దొలగించి, యైకమత్య
సంస్థనున్ ద్రోహకరమనిచాటి, హీన
యాజమాన్యము కర్మాలయముల కార్మి
కుల నలంచె, "జమాలూన్సరు" కలదు సాక్షి. 130

శా॥ వంగం బెల్ల తదేకనాయకునిగా వందించెఁబో యేసు గా
రాంగుండున్ తన సాటివా రనుచుఁ బల్కన్ వచ్చునా? రాజసూ
యాంగీభూతమునుత్సవం బనుచుఁ దన్నా ధర్మరాజే యవన్
పొంగన్ వచ్చునె? తాల్చునా? బొమిడికంబున్ శ్రీ బెనర్జీ యహో

ఉ॥ బొమ్మిడికమ్ము కాదనది ముండ్ల కిరీటము కాద యే యపా
యమ్మును లేని పూల తొడు గంచును రక్షణ గోరి మంత్రపా
తమ్మున విప్రు లుంచు నొక టంచు వినంబడె పుల్ల రేగ, శీ
ర్షమ్మున రాలదుం బిడు, గసాంప్రత మియ్యది పో! బెనర్జికిన్.

ఉ॥ "సీజరు" మూడుసార్లు నిరసించె కిరీటము, లోకమాన్యు డీ
యోజను మెచ్చలేదు పునహోత్సవమందు శివాజి నట్లు ని
న్నోజన మర్చ సేయువన, నెంత ఘనుం డగుగాక వ్యక్తికిన్
పూజలు తప్పు జాతికి ప్రపూజన మొప్పు సురేంద్రుడొప్పుతన్!

ద్వి॥ కార్మికావళిపయిన్ గాల్పులు జరిపి
దుర్మతు లని వారి దూషించెఁ బ్రభుత. 184

అను॥ ప్రభూతం బయ్యు వైస్రాయి
సభన్ దేశీయసంఖ్య తా
వర్ణాల సంఖ్యయేగాని
ఫలసంఖ్యయొకో? వనిన్. 185

క॥ వాడిన పూదండయె యీ
నా డీ సంస్కరణ తెచ్చినన్ గోఖ్లేజీ
వా డాఱవ వ్రేలే యె
వ్వాడు ప్రజకు మేలు సేయు ప్రౌఢిమ లేడో. 186

ఆ॥వె॥ పిట్ట గోడమీది పిల్లికి పెట్ట ల
క్షించినట్లు సభను విభుత తప్పు
సభ్యునకు లభించి సరిదిద్దబడుట, యొం
దున్న నేమి నిష్ప్రయోజకుండు. 187

ద్వి॥ అర్జీలు వద్దు, బెనర్జీలు వద్దు
సర్వస్వత్యాగపరులు కావలెను.

ద్వి॥ క్లేశమ్ము భరియించి దేశమ్ముకొసలు
వాసింప పెను విడువారు కావలెను. 188

మ॥ మితవాదుల్ తిలకాధిపత్యమునకున్ మేకొక నౌరోజినిం
బలిగాఁ జేసి భవిష్య కాంగ్రెసును డొల్పన్ జూచుచున్నారలే!
అతివాదుల్ తమ నిర్ణయమ్ములను చాపోటించి తీర్పింతు రే
మతి యద్భుతత నున్ననున్! వ్యతికరంబా సంస్థ భగ్నంబగున్.

క॥ మిపుల కలంగిన "జాన్ బుల్"
గవర్నరగు 'హేరు' ప్రక్కలన్ మును వెనుకన్
దొవరున్ దక్క నరయ డా
ర! వేరు నొక రంగు, నెందు రాజద్రోహుల్. 140

క॥ భూపేంద్రచంద్రబోసూ!
రేపా "ఆనందచంద్రరే"తో సభ, మీ
స్థాపించు తిరోగమనము
నే పతియు నొప్పుకోద యీ వంగధరన్. 141

క॥ భృశసంఖ్యల మముఁగని బా
రిపాలు కాంగ్రెసున నొప్పిరి మదిష్టములన్
వసిగిరి పై మితవాదులు
శిశిరమతి నరేంద్రచంద్రసేన్ గుప్తసుధీ! 142

మధ్యా॥ ఆధారపడము విఱిగిన యాయుధముపయి యుద్ధమున
బాధించు జాతిని జ్వరము వలె పలు సార్లు వచ్చునెడ
క్రోధ, మావేశ మాద్యంబె కొఱవడనీక పోరవలె
రాధాంతము, నడుమనడుమ రారాదు విశ్రమంబునకు.

గీ॥ అష్టదిగ్బంధనము చేసి ఆ ఫలితము
శాసనమ్మున కోశాన జయముగాగ
సర్వతంత్రస్వతంత్రతసాధ్యపడును
కదన మొక్కటె రెండుగాఁ గావఁబడును. 144

ఉ॥ నూతనపక్షవాదమును నూల్కొనినార మటందు రెండటో
ప్రాతవడిన్ మెలంగిన విపశ్చితు లాస్థ నుపన్యసించి మా
రీతులు, చేతులున్ వలయు రిత్తలు గాక పరిశ్రమమ్ములన్
మూతులెగాదు, మేనులును బోవలెముందుతరాల కర్త్వ్యముల్.

శా॥ దాదా కాంగ్రెసునాథు డౌటకు తిలక్ ధర్మేంద్రుడొప్పెన్ సరే
దాదా యొప్పుకొనెన్,వివాదమొకచే, తాదాచె దీనిన్ సమ
స్తాధిష్ఠానమువారికిన్ దెలియవ ట్లాహ్వానసంఘంబు, కా
వా! దౌరాత్మ్యము లివ్విపాళియితరత్ పాళిన్ దగాచేయుటల్.

క॥ 'కోమిల్లాన్' 'చిటగాంగు'న
'మైమన్‌సింగు'న "బిపిన్' సమాగతజనతా
స్తోమము క్రమవృద్ధిమెయిన్
సీమోల్లంఘన మొనర్పఁ జెప్పెన్ సభలన్. 147

ఆ॥వె॥ బలిత మైన గుంపు పసలేనివా రంచు
కొలది యైన కాదు బలిత మంచు
నెదిరికొలువుఁ జూచి పెదవితో ముడిచి పై
కెత్తు ముక్కు గోఖ్లె జిత్తువాడు. 148

క॥ ఒక పత్రిక యతివాది య
ని కథించె సురేంద్రు, నెత్తినియొలువుకో టా
వికసితముఖునిది నావా
టికి వెలియన్‌దోడగె నప్పటినుత యదేమో! 149

ద్వి॥ ఏ పనిన్ జేయడో ఆ పనిన్ గాల
యాపన మార్లే తమాపణం బాడు. 150

గీ॥ ఇండియాకు రాజద్రోహ మెత్తితేను
కంటిలోనలుసంతయు నంటనపుడె
రాజకీయసంస్కరణవిరాతి యగు న
దని వచించె భారతకార్యదర్శి మార్లె. 151

ఆ॥వె॥ నావ క్రమపథమున నడపు నావికుడె మా
ర్లే, యతండు నేమి సేయు నిపుడు
అక్కటా! కరమున చుక్కాని లే దని
'వెడరుబర్న్' 'వుడ్డు' నొడివినారు. 152

ఆ॥వె॥ ఓడి తొమ్మిదింట నొకదానిలోఁ గెల్చి
విన్నపములు సేయు విచ్చగాడు
పన్నకములు పన్ని అన్నిటిలో గెల్చి
కార్యశూరు డైన కచ్చెగాడు. 153

మ॥ నదులున్ గొండలుదాటుచు న్నెగసివాహానాలోచనంబిప్పుడు
న్నది"సిల్హెట్"పయి వ్రాలి,యెచ్చట బిపిన్పాలానవిద్యార్థితో
టి దళన్నైపుణి నేర్చి పూనివడొ లాఠీ!రాజవిద్రోహముల్
శ్లథముల్ గాకెట'స్ట్రీటుమన్‌మరియు'మేజస్ట్రీటు'మన్ గొన్నవో.

శా॥ 'థేబెన్' తెల్వినినై నికస్థితికి వృద్ధిన్‌గాని నైమోవితో
ని బాలావళి యాంగ్లపాలనముఁబాల్ నే పట్టుకొన్నాను ర ం
డి బాదంగ నటంచు పిల్చును ప్రజన్,విచ్ఛేయ డే విజ్ఞుడున్
సేబాస్! యత్నముపట్టుతప్పవనె "సింగ్లిష్‌మేన్",మడుల్ దబ్బిలల్.

ఉ॥ గోదుమవన్నెపాటలను కొన్నిటి,కొన్నిటి తెల్లపాటలన్
గాదిలి యంచు దేశ ముదకమ్ము స్రవించిన శక్తినిన్,బ్రిటన్
పైదలితొత్తుపత్రికల ఖాతి తనుం బ్రకటించె 'పేట్రియిట్'
గాఁ దన పేరుపెట్టుక యొకండును'హిందువు',నెత్తివంగెడిన్.

గీ॥ పత్రికలు పంజాల్ గోళ్లు పండ్లుఁ బఱపి
తన్ను హిందూమహాసముద్రమునఁ ద్రోయ
నుండి రని తెల్పె పెక్కుర కుచితవసతి
భోజనము లిడె నౌర! ప్రభుత్వగుణము. 157

ఉ॥ లండనుపోయె గోఖలె, వలంతుల యొందఱ యిండ్లకో చనెన్
రం డనివట్టి మార్లె మతరాం పలుకాడడ వంగసంగమున్
మండితమందహాసములుమంచిదిటీయును కాఫి, యొన్నొ షేక్
హాండులు నందఱిండ్ల నొకచో, నపురోజికి జేగురుల్ కనుల్

ద్వి॥ పంచనదమున నంబాలా పురి నుతి
గాంచిన ప్రదేశకాంగ్రెసు జరిగె. 159

ఉ॥ ఏమి ప్రయోజనంబు మన కిప్పటి శాసనసంస్థతో ననం
గా మహితుం డొకం, డొకడనకావలదిద్దృశ సంస్థ యంచులా
లామురళీధరుం డనె, జల మ్మురియన్ సదనమ్ము గూల్తుమే!
భూమిజమున్ దళింతుమె యెవో పురువుల్ బడిపించె రాలినన్.

అను॥ బారిసాల్ సభలో తీర్పు
ప్రభుతన్ వేడకుండుటల్
ప్రభుతావిచ్ఛిన్నమై వై
ప్రాయికి సభ వైరిడెన్. 161

ఆ॥ వంగవిభజన రద్దగువఱకు దాని
గూర్చిన ప్రతిజ్ఞ యేటేట కొమ్మవేయు
నదియె జరుగు రాఖీబంధనం బనంగ
తోర మొకరికి రెండవవారు కట్ట. 162

క॥ వందేమాతరమున నర
విందు డిటులు నెన్నొ వ్రాసె, వెలసెను రాఖీ
బంధనదినమున వంగము
నం దంతట హృదయఘోషణధ్వనితసభల్. 163

శా॥ వచ్చెన్ లండనునుండి బొంబయికి,నావన్ వీడుచున్ బోయిస్మె
రాచ్చశ్రీమెహాతాను చూచికుశలప్రశ్నుండు గోఖ్లే సఖా!
ముచ్చెల్ నీయవి తెల్పనీతిరుగుడున్ బూజ్యుండు దాదాకు మే
లెచ్చెగా?యని పృష్టు, డాతనికి వాచించెన్ సవాఛా కిటుల్.

ద్వి॥ మది బలువున కోకెమగడు నౌరోజి
యెదురు ముప్పటి కన్న వేల్బడిన్ మిగుల
స్పష్టమ్ము నిరుడె "అమ్‌స్టరుడాము" సోష
లిష్టుల సభ మహోత్కృష్టవాదమున. 165

ఉ॥ నాలుగు దిక్కు లున్న భువనమ్మున దేశము లెన్ని? అన్నియు
ద్వేలము తెల్వితోఁ బ్రతినిధిత్వము భూషిత మైనవారి నా
యోలగ మొప్పఁ బంపినవి,ఓయి!మహాశయ! దానినేత 'శా
న్కో'లల దచ్చిరాజ్యసభకున్ మణి,వాచనముల్ ప్రశస్తముల్

క॥ ఆ షాన్కోల్ కృతపరిచితి
మై వాకొని బ్రిటిషుభరతమహాదుర్దశ, మౌ
నావిష్కృతబాధ సభ న
హో! వెడతడవు నిలబడగ నొనరిచె దాదా. 167

ఉ॥ మెత్తది గాదు దూది వలె,మెండుకఠోరము కాదురాయటుల్
కుత్తుకకోసికోయనొకకోమలఖడ్గము వాని వాద మో!
సత్తమః సిగ్గుమారు్క నిడ సల్పెను భారతభూమి నౌ బ్రిటన్
కృత్రిమపాలనమ్మునయి చేకరవం బగు తీర్పునన్ సభన్. 168

గీ॥ బ్రిటనుపై నసమ్మతిసభ పెట్టినారు
భారతీయులు లండనుపట్టణమున
దాని యధ్యక్షు డైనట్టి దాదభాయి
నిప్పు గ్రక్కెను తిన్నది పప్పు నాడు. 169

గీ॥ అంగుళము మేరయును సాగ దాంగ్లప్రభుత
భారతమ్మున నీరీతిపాలనమున
నన్న దొక నిప్పుకణిక, నే డతడు పంచ
దారపూతల మందుమాత్రలను కొనడు. 170

గీ॥ ఒకటి పత్రిక హూణమిత్రకము చింత
విఱిగిన పులుసు విఱుగలే దరెరె! యనగ
చింతయే విఱుగద పులు సెట్లు విఱుగు?
ననుచు దానికై వ్రాసి పంపె నవురోజి. 171

ద్వి॥ అన విన్న మెహాతా త్వదేతదుక్తంబు
మొనమొన్ననె చదివితి పత్రిక ననె. 172

శా॥ నిన్నన్ మొన్ననె కాదు పాలుతొలిఁగంటిన్ బల్కెవాఛా బ్రిటి
ష్వన్నెన్ మెచ్చెడు దేశభక్తులకు చాచా, వ్రాసె వంగమ్మునన్
సన్నాహం బఖిలంబు ముఖ్యమని "బెంగాలీ"కి తత్పత్రికన్
దన్నాథుండును రేంద్రునిన్ బొగడుచున్నా రోజి మిత్రోత్తమా

క॥ "మేడం కామా శస్త్ర
క్రీడఁ బ్రభుత నడప నెచ్చిలినది కలదుకా
దా!డగరకు డగర యయిన
చేడియ నౌరోజివద్ద సెక్రటరీగా. 174

క॥ అని పల్కన్ వాఛా, యా
వనితాస్థానమున నేడు పనిగొనె జిన్నా
యనగా గోఖ్లే, గాంధిన్
గని కడు తడ వయ్యో నో! సఖా! యనె మెహతా. 175

మధ్యా॥ అడవి నాఅడుగుల కొకటి యడ్డము చెట్టు, వసింప
నడుగడుగున కొక చట్ట మడ్డమె అఫ్రికా, నందలి యొక
చెడుదాని పెకలించుకొఅకు శ్రీగాంధి వచ్చె లండనుకు
నుడి విని మొగిళు లెత్తువడెను తరులు పూల్ రాల్చుకొనెను.

మధ్యా॥ గంధమున్నవి కొన్ని పువులు, గాంధి వెనుకన పురోజి
ముందు, నెందఱో యధికృతులు పొందిరి సుప్రభాత మిది
సందర్భముగ, నుడు లోలికి జడికొల్పిరి నవసూనములు
గంధహీనములు, గాంధి చనె, గ్రక్కదలితి నేను నిటకు. 177

క॥ అన గోఖ్లే విని యయ్యో!
యని, సిగిరెట్ పీల్చి వలపు లలమన్ బొగ యో
జనమై మెహతా దాదా
మనము స్వరాజ్యగత మొట మనకున్ దెలియున్. 178

ఉ॥ బాలుడు వోలెఁబల్కు, మృదుభావ మహో! తిలకింప గంగలో
పాలు, పరప్రకాశితుడు పట్టుడు కాంగ్రెసు నేలు గద్దెలోఁ
జాలిన వానినిన్ బరులు సైతము కాదనరానియట్లుగాఁ
జాల క్రమించి యెన్నితిమి సజ్జనుడౌనవురోజి వా పుత్రునిన్. 179

క॥ తంత్రీ వార్త నిదియు ని
శ్చింతగ నాతనికిని పనిచితి, మత డొ॰వెప్వెన్
చింత యిపుడు కలిగెను తత్
స్వాంతమును విదేశవస్తుశత్రువొ॰ యనుచున్. 180

క॥ ఐన దెదో॰ యైనది, రే
పే నౌరో॰జి దిగు పెరలు వేడిననున్ స్వా
ధీనుఁడు గానటులున్ గో॰
ఖ్లేనాయన! చూచుకొ॰నవలెన్, బలికె నిటుల్. 181

క॥ 'అజీదాబాజీ ఖే
రే'జీ మెహతాదు లనుసరింపగఁ గలక
ర్తాఁజేరెను నౌరో॰జీ
భ్రాజిలెను మదీయమందిర మనె బెనర్జీ. 182

క॥ 'దాదాభాయీ నీవే
కాదా స్వాతంత్ర్యదాయి' కలకర్తాలో॰
వీదుల గో॰డలు త న్నా
మాద్రి పలుకరింపఁ జిత్ర మనె నౌరో॰జీ 182a

శా॥ కూర్చున్నారు ఫిరో॰జిషాజనులు నాంగ్లో॰యిండియ న్లెందఱో॰
చర్చన్ గో॰ష్ఠిని దాదభాయి కొ॰క ప్రశ్నన్ వేసినా రో॰!దయా
చర్చి!నే డతివాదు లుగ్రులు సశస్త్రప్రోద్యముల్, నీతికిన్
మిర్చిం బెట్టిరి కంట,నేమనెద?వెన్నే ప్రాణముల్ పో॰యెడిన్.

శా॥ దాదా వాకొ॰నె నేమనందు జగ మంతా యేమను న్నే నదే
చీదున్ వాడనె గాని కంటతడితో॰ జీర్ణించుకొ॰ందున్ వెతఁ
బై దౌష్ట్యం బిటులే గనంబడిన జర్మన్ గాని ఫ్రాన్సైని వ్యా
పాదింపన్ దొ॰రకొ॰రో॰?యీ దొ॰రలు తత్ప్రాలావళిన్ బాలితుల్

ఉ॥ అతఁడు చావలేదొ॰ ప్రజ లతఁడదృష్టి ప్రభుత్వమందు చా
లా తఱయ మ్మై రుజల్ పెరిగి,ప్రాణము లో॰మగలేము, పాలనా
భిక్షము పెట్టలేదు కడువేడినమం బ్రజకున్ ప్రభుత్వ, మా
ర్యా[illegible]తి యూరుకొ॰దుగద!ఐననుయత్నమొనర్తమాపగన్.185

క॥ అని దాదా వాక్కొన నా
ఘనులు పొంకాలిరి, యనర్ఘ్యకవిత వలె వెడ
ల్పునఁ, గోరికవలె బొడవునఁ
గనబడె సమలంకృతంబు కాంగ్రెసు'పెండాల్'. 186

చ॥ అదివఱ కెన్న డంత జన మాగత మైన సదస్సు లేదు, నం
దిది కడు ముఖ్యమై ప్రతినిధిత్వవిరాజి యనాగతుండు లే
డు,దొని క డింది,మెత్తని యెబుంగున వోటుకుఁబెట్టఁ బోకుడీ!
యెదిరిప్రభుల్ త్వదిచ్ఛ గమనింతుము మేమనిగోఖలేయనెన్.

ఆ॥వె॥ వఱలు వామపాళి నరవిందు డాది,ద్వి
తీయుడున్ గపర్ది,తిలకొనరు తృ
తీయుడుగను, లజపతి చతుర్థుడును, పాలు
వాని వెంట, యి దొక పంక్తి యింతె. 188

ద్వి॥ అజితసింహుడు దత్తు నల్లై యింకెంద
ఱొ జనులు వెన్క బారులు దీర్చి కలరు. 186

అను॥ బెనర్జీ, మెహతా, గోఖ్లే
ముఖ్యు లిస్లాంమతస్థులున్
స్థితుల్, దక్షిణపక్షాన
తతుల్గా, జర్నలిస్టు 'లున్' 190

చ॥ అది సభ, దాని నాథుడు హిమర్తువు లెన్బదిరెండు దాకినన్
మృదు వగు వేడితోడ నెదురించిన యోధుడు నేది దారి య
న్నది యడుగంగరానిది, జనైక మె దైన నదే వటారి, దా
న దినములో స్వరాజ్య మను నా నపురోజిబ్రిటి ష్వ్యఖావుడున్

చ॥ అతడొకఘోషువంశ్యుడు,తదాఖ్యయు'రాసబిహారి',వల్కులో
నతిసుకుమారి, వెన్కమును నాడుప్రభుత్వమువాడగోరి, స్వా
గతమిడె రారయాయనుని కాయముఠాయడుగాఁతదాఢ్యు డా
గతులకు తెల్విరాలుబడి నాంగుల యేలుబడి న్నుతించుచున్.

ఆ॥వె॥ ఎల్ల లోకసభల తల్లి లండనుసభ
మనను మనల నేలుకొనగఁ జేయు
నన్న దాది వాక్య మతని యుపన్యాస
మందు, నుద్యమేచ్ఛ యంతమందు. 193

అను॥ ఈ సభాధ్యక్షునిన్ గాఁ ద
న్నెన్నుకొన్నట్టి వారికిన్
ధన్యవాదము లర్పించి
ధర్మనిర్వహణాత్ముడై 194

అను॥ బోనర్జికి, తయాబ్జీ, కా
నంద మోహనబోసుకున్
వీరరాఘవునకునున్
శ్రద్ధాంజలి ఘటించుచున్ 195

ద్వి॥ 'ఐరిషులీగు'ముఖ్యాంగ్ల దేశస్థ
పౌరసంస్థలఁ గృతజ్ఞత వినుతించి
పాలనాప్రకటితపత్రమ్ములందుఁ
బోలిన ముఖ్యాశముల మూదలించి 196

గీ॥ రాజు, రాణి, 'బెన్నరుమేను, బ్రైటు, మార్లె
సయ్యదహమదు, దేవను షైరుడ్యూకు
హంటరున్, మెకాలే,' పల్కినట్టి నుడు లు
దాహరించి, యీ రీతి దాదా వచించె. 197

ఉ॥ ఎట్టిదివర్తమాన, మది యెట్టిది భావ్యము? భారతావనిం
బుట్టినవారి కన్నదియ మూలము సంగతి చర్చనీయ మి
ప్పట్టున, నైనదాని కఱవన్ వృథ, యింతకుఁ గానిదానికే
గట్టిగఁ బూని సక్రమముగా నగునట్లు ప్రవర్తిలన్ వలెన్. 198

క॥ ఏ పద్ధతి యే నియమము
లీ ప్రభుత వహించు ముందు, నిది యొకటి, ప్రజల్
శ్రీపాలన మది యగుటకు
నే వస బోధింత్రు దాని, కిది రెండవదిన్. 199

ఆ॥వె॥ మొదటిదానిగురించి మొదలింతుఁబెదవులు
బ్రిటనుప్రజల కున్న వెన్ని హక్కు
లన్ని పాలితులకు నగు భారతుల కని
రెండుపార్లు పగలె బ్రిటను ప్రభుత. 200

ద్వి॥ బ్రిటనులోనే పుట్టి పెరిగిన యటులు
బ్రిటనుపాలితుల భావింతుము ననియె. 201

క॥ మా యూపిరి స్వాతంత్ర్యము
సాయము స్వాతంత్ర్యమం దొసంగ నెవరికే
నీ యీ మా జాతి తయా
రీ యుక్తులు మంత్రివరుని విప్పుటతనివే. 202

ఆ॥వె॥ మనిసిరొమ్ము పెంచు మందు పేరే స్వతం
త్రత యటంచుఁ బలికె హితుడు మున్ను
వానిపేరు మార్లె, యేనికేనియు స్వతం
త్రతయు సహజ మతని తనువుతోడ! 203

ఉ॥ కావున భారతీయు నధికారము తక్కువ కాద ఆంగ్ల జెం
డావిడినీడ నీతడు నిలంబడియుండ స్వతంత్రతాప్తికై
యే వడిమై స్వతంత్రులయి రిప్పటి "బోయరు"? లేల! కారొల
మేవడి వందలేండ్లబడి మిట్టును చూచెడివారు భారతుల్. 204

గేయం॥ నాగరకత తక్కువైన నాడె అంత నీతి చెప్పి
యీగరాదు నేడు, లండ నీయవలె స్వరాజ్యమున్
బాగు స్వపరిపాలనమ్ము వందరెట్లు, పరుల దై
యోగు సుపరిపాలనమ్ము, హూణు లన్న మాటలే. 205

• ఏది దైన కోరినప్పు డిచ్చునేని దాతవై
నాదటయు గ్రహీతకున్ ఘనంబు లోకవిదితమే
కాదు దాన మిదియు నెవరి కలిమి వారి కిచ్చుటల్
సాదరముగఁ బ్రభుత ప్రజ కొసంగుతన్ స్వరాజ్యమున్. 206

చ॥ తిరిపెము కాదు, మానవుడు దేవుడు సాతులు గాగ భారతో
ర్వర తనహక్కు నొందుటకుఁ బడ్డయభాష్యముకష్టమెంచియున్
బరిగణియించి మానవత భ్రాతృత ధర్మము న్యాయకర్మమున్
త్వర నిడుగాత! గ్రేట్ బ్రిటనుపాలితవాచనమై స్వరాజ్యమున్.

మధ్యా॥ తన శాఖలను తా నగము కదల్చుకొనును, తన యిచ్ఛ
తన రాజ్యసర్వశాఖలను తా నిర్వహించుకొను నిక
జనము, నైజ మిది సాంఘికము సాంస్కృతికము నార్థికము
నను విభవముల స్వాతంత్ర్య మను జగత్ప్రాణమ్ముతోడ. 208

క॥ పన్నులు గొని ధనము తమరి
కు న్ననువున ఖర్చుపెట్టుకొని చట్టము లా
తోమ్మన్నతికృతములుగాఁ బ్రజ
లెన్నుకొనినవార లిటను నేలుదు రవనిన్. 209

గీ॥ బ్రిటను పర్యవేక్షణము సంఘటిత మిచట
నధినివేశరాజ్యమ్ములయందు నటులు
నంత యొకసారి గాకున్న నింతయింత
పుడుకుచున్ స్వరాజ్యము పూర్ణ మిడుత! ప్రభుత. 210

క॥ తరుణము సర్వవిధమ్ముల
పరిపోయిన దిపుడు, భరతసర్వంసహా భూ
వరుడు నతని వర్గమ్మును
స్వరాజ్యమును నాటి యరయవచ్చు ఫలంబున్. 211

ద్వి॥ రమణీయ మైన యారంభమ్ముతోడ
కమనీయ మంతమ్ము గనుగొనవచ్చు. 212

మ॥ ఎవ డా చెప్పెడివాడు భారతజనం బెన్నేండ్లో నేర్వన్వలెన్
నవు రా పాలన నల్పకో ననుచు, నా నర్వజ్ఞు డజ్ఞుండె,యీ
యువని న్నాగరకత్వరేఖలకు బీజావాపనం బేడు శ
పె విచారించిన భారతున్ గుఱిచి యాశీర్ణోక్తివల్కాడునే! 213

కం॥ ఇప్పటికిని లండన్‌సభఁ
జెప్పగలరె యందఱున్ సుశిక్షితు లని యిం
దిప్పుడు ప్రజ కడుమెలుగు-అం
దప్పటి యా పార్లమెంట్‌సదస్యులకన్నన్. 214

అను॥ చైనా పరిష్కారపష్యాల
యేవ్య మూహించి, యా జపాన్
మిట్టమేల్ గాంచి, దేశంబు
కుట్టేల్పడి సహించునే! 215

కం॥ దయ చల్లి యభ్యుదయ మవ
నయించు నేర్పు భరియింప మనునది తీ రై ప
రయమునఁ గోరు స్వరాజ్యము
నియతంబుగఁ బ్రజకుఁ బ్రభుత నే డిడుఁగాతన్! 216

(గీ॥ చింతకాయలు రాలవు మంత్రములకు
కాని దిగ్గజములై యున్న వానిచెవులు
పీలికుండునె! తత్సభోద్వేలకుతుక
మేదురీభూత కరతాళ వాదమునకు). 217

కం॥ వానికపై నికబలములు
మావే, మాకోఅకె యవ్వి, మావే వ్యయముల్
మా వితరణ కప్పమె, య
య్యావియు గణికానుసారి యింగ్లీష్‌ప్రభుతా! 218

కం॥ అది యీావ ద్దని సభలో
నెదిరిన పెన్నాదమునకు నెలనవ్వుచు నా
పదవి యిపుడు కా దర్భకు
ని దశన్ చాటవలె యకావనేచ్ఛకు వనుచున్. 219

కం॥ మ.సలియశే! యిత డోకతీ
ర్మోసలి యని హాపించెడి సదమ:వ కిపుడే యీా
పనలు సిపలుగా నమలున
మసలశావలె నమచుఁ బలికె మరియును దాదా. 220

గీ॥ ఆత్మసాక్షిగ జనితమో ఆశయంబు
సంగతం బగు పాకిస్తాన్ సంగతంబు
మావి మీవి భావాల్ గూడి మనవి యైన
యంత నమ్మిక మున్న దాంగ్లాళి పైని. 221

శా॥ ఆరంభించిన యత్న మంతగముగా నక్రాంతు లై గూడి యె
ల్లారున్ దేశ్యులు నిర్వహించునెడ నేలా? మోసగించున్ జయ
శ్రీ. రాధాబలరూఢమున్ భరతధాత్రిన్ జేయగా నేమముల్
దారా లైనవి యేకవర్ణములు తోరాల్ కట్టుకొండి! ప్రజల్

ఉ॥ అంగడి నన్ని వస్తువుల యట్లు తనర్చెను పార్లమెంటులో
నన్ గడు మిత్రు లైన బుధనాథుల భావము, లిందునందువా
గ్భంగులచేఁ బ్రజాత్మ మన కానికగాఁ బలికింపఁజేసికో
శృంగముఁ బ్రాకువాంఛితము, హెచ్చుగవిత్తముఖర్చు కావలెన్.

గీ॥ ఆస్వరాజ్యము ప్రభుతచే నన్నిపనులు
సరిగఁ జేయింపఁ గాంగ్రెసు మెఱయవలయు
నెట్లు మెఱసె నిర్వదిరెండు నేండ్ల నుండి!
అవిగో! తీర్మానముల కట్ట లారయండి! 224

క॥ అని మెహతాదుల మోమునఁ
దన దృష్టిన్ బఱపి మరి పదంపడిఁ బలికెన్
చనుఁ బోరగ బెంగాల్ విభ
జన మఱ, నిది నీతి దాటి చనరా దెపుడున్. 225

చ॥ తెలివిడి రోషితో స్థిరమతిన్ భుజియింతురు హూణులెప్పుడున్
బల మది వారి, కా బలమువల్ల జయింతురు, దీని పేరె పె
న్నలరుఁ బ్రచార మంచుననినన్, తవరల్ బ్రిటనందుఁబత్రికల్
పలపలవో యెడిన్ మనవి వానికి శిష్యరికమ్ము చేసియున్. 226

గీ॥ హాక్కు లేల కావలయునో యిక్క డాడి
హాక్కు లేల యీవలయునో అక్క డాడి
ప్రజకుఁ బ్రభుతకు, నాయకుల్ పఱలుచుంద్రు
గాక! భారత గౌరవాకాశమందు. 227

ఆ॥వె॥ బొంబయీనగరియె యంబ స్వదేశోద్య
మమున, కిద్ది నాదు మణిగఁ జొచ్చెఁ
గ్రుమ్మరించె దీని గోపాలరావ్ మహా
రాష్ట్రమందు బ్రిటనుపత్రికరి నొవ్వ. 228

క॥ తలయు కిరీటము జాతికి
వలరున్ బెంగాలు, జాతి యనగ ముసల్మా
నులు ప్లస్ హిందువులు, నిటుల్
పలికెన్ సయ్యదహామద్ విఖ్యాతుడు తొలిన్. 229

అను॥ మతాలు కిటికిగోడ
దర్వాజాకప్పు లిండియా
జాతీయతాగృహంబందు
దీనిన్ గుర్తుంచుకోఁ దగున్. 230

శా॥ పారిశ్రామికరాజకీయములతోఁ బాటున్ దగన్ సాంఘిక
ప్రారంభంబు త్రిమూర్తమభ్యుదయ ముద్భాసించుఁ బత్యక్షమై
సారింపన్ వలె దృష్టి భారతము దుష్టం బాంగ్లికాపాలనం
బై రట్టొందెడి భారతీయులవయిన్ దత్రత్యదీనాళిపై. 231

ద్వి॥ ఇకనుండి కాంగ్రెసునకు పార్లమెంటు
నకువోలె నొక నిబంధనపాళి వలయు. 232

అను॥ శ్రీదాదాభాయినౌరోజీ
యీదృగుక్తి వచింపగా
మోదించు సభఁ దీర్పుల్ త
ద్వాదానుగతి వర్తిలెన్. 233

క॥ బిత్రిట నేగి యచటివారిన్
స్ఫుటితభరతఖండసానుభూతులనున్ జే
యుట కుంకించె ననుచు సభ
పటుమతి గోఖ్లేకు ధన్యవాదముఁ బలికెన్. 234

ద్వి॥ ఘన మైన రాబోవు కాంగ్రెసు వర్తి
లున వాగపూరునం దని యొక తీర్పు. 235

క॥ కారముగాఁ దోఁచె బహి
ష్కారము మితవాది, "కంబికాచరణముఖం
దారు" ప్రవేశింపించెను
తీరుపుకై దాని, గుండెలి పడి ప్రభుతన్. 236

గీ॥ అపుడు ప్రతిపాదితం బది యాంగ్ల దేశ్య
వస్తువుల బహిష్కారము, మెలిచెఁ దిలకు
వంగమున కని రవతలివారు, సాంగ
భారతమునకు నివతలివార లనిరి. 237

ద్వి॥ 'కాదుకా' 'దానౌను కాంగ్రెసు ప్రజది'
'మాదే ప్రజల మాట' వాదముల్ మొనసె. 238

సీ॥ కరము మీ నుడి దొడ్డ కర మిత్తురే యన
కరచాలనముముందె విఱిగె నొకడు
గుడ్లగూబఘాటోను కొనివచ్చి తత్సామ్య
తను గూర్చి పొగడె నొక్కనికి నొకడు
జితరామబాణ మై శ్రుతిపంక్తినిన్ దూసు
కొనిపోయె నొక యువాగ్రణిది యీల
'మీరు రౌడీలురా' 'మీరు కేడీలురా!'
'షేంషే' మని పగలు చిచ్చుబుడ్లు

గీ॥ ఒప్పుకో మొప్పుకో మని యొక్కవైపు
తప్పుకోం తప్పుకో మని తక్కువైపు
రవ్వ, కణిక, కింజ్వాల లై రగిలె మంట
యిట్టిదేనేమొ! అగ్ని పరీక్ష యనగ. 239

మధ్యా॥ గునపాలుగా ప్రలాపాలు కూలెను కాంగ్రె సన్నారు
కననయ్యె నుడి 'హిట్సు' 'ఫిట్సు" కాలముచేసె 'మైనార్టి'
మొనమొన్ననే తీరినట్టి మురిపాల కాంగ్రె సన్నారు
కనినవారు వినినవారు కావలెననుకొన్నవారు. 240

మధ్యా॥ కాంగ్రెను కూలనున్ లేదు కాలమున్ జేయలేదు. కడు
నింగితజ్ఞుండు తిలకు డీ పట్టు పళ్ళించినాడు
సంగతంబు స్వదేశ్యవస్తుసంధన్ విదేశ్యనిరసన
మంగీకృతము మోతు మగునె స్వర్గము నికృత మన్నాడు.

గీ॥ దాదభాయిఆనందగద్గదము స్వరము
కావలె స్వరాజ్యమే యనెన్, గ్రాలె తీర్పు
కలకటాచెట్లమీది పతు లెగిరి పఱ
చినవి తద్గోష్ఠికరతాళనినదమునకు. 242

ఉ॥ ఈ నిముసమ్మువాక బ్రతికించి సభాంతరమందు నాథపీ
ఠాన వసింపఁ జేసి కొరకై న నను బిలికించె దేవు డీ
మానున,నేను ధన్యుడను మత్సఖులార! యటంచు వించె దా
దా నిపు రేగి నిప్పుబిగిదండడి యిప్పు డనన్ సభాసదుల్. 243

ద్వి॥ జాతీయగీత మై సంపఠితం బ
దే తొలిసారి వందేమాతరంబు. 244

గీ॥ ఎగిరె 'బాల్'కన్నుబొమ, సరాళించె 'పాల్', క
థించె'లాల్' పరిశ్రమములఁ బెంచవలె, స్వ
దేశ్యములను కొనవలెఁ ద్యాగవశ్య మై ప్ర
జాళి యెల్లెడ నని, తీర్పు నందడించె. 245

ద్వి॥ ఆత్మగౌరవము స్వయంపోషకత్వ
మాత్మవిశ్వాస మిం దౌ ఫలా లనిరి. 246

ద్వి॥ వంగభంగములు రెండున్ గల్పఁ బడఁ జె
లంగెఁ దీ ర్మానిక మునల్మాకా పఠియింప.
జాతీయవిద్యతో కాల లొహ్పొందు
గాత! మెల్లెడ 'పాల్'ప్రకథితము తీర్పు. 247

గీ॥ ఓరగంటఁ గర్గొని తల యూప 'మెహాత'
వచ్చి తన కంటఁ జిరునవ్వు వారుఁబోయు
నా సురేంద్రుని బారిసాలందు 'ఫైను'
పడియుఁ బెదరనతని తిలక్ ప్రస్తుతించె. 248

మధ్యా॥ అరవిందుడు గోణుగఁ బూర్ణమా?స్వరాజ్యం బిది యనుచు
నరరొక్ట రానిమ్ము ముందు నా తక్కు నర నడిగెదము
తరువాత, మన యుద్యమంబు ధణితపూర్ణస్వరాజ్యంబు
తటి యున్నది,పరి యున్న దని తగఁ బల్కె లోకమాన్యుండు

ద్వి॥ రాజకీయముగ స్వరాజ్యంబె ఆర్థి
కౌజస్సున స్వదేశ్య మనె లజపతియు. 250

క॥ తను మించిన సింహంబునుఁ
గనె బొంబయిసింహ మిపుడు కలకత్తాలో
నని యెఱిగిన సందర్శివ
రనిచయమం దొకడు 'చిత్తరంజనదాసున్'. 251

మధ్యా॥ అంతటి రభసంబు జరుగ నా నవురోజి కేల్ మోడ్చి
శాంతముశాంత మని యొక సామరస్యంబు సృష్టించెఁ
గొంత లజపతిరాయి తిలకున్ దోడువడిరి, జలమున
శాంతించు జ్వాల,వెనుకటి చాల దర్పాల్ నేడు పీల. 252

గీ॥ ఎన్నిటన్ గొప్పవా డైన నన్ని దేశ
సేవలో తొన లై వాని స్వీకరింత్రు
కానినా డట్లు వా డణాకాణివాడె
లక్ష లున్న నియంతృత్వలక్షణమున. 253

ద్వి॥ మరణశిక్ష విధించె తరుణత కాంగ్రె
సు రహింప నటు చేయుచున్న వృద్ధతకు. 254

మధ్యా॥ అవినీతిపరుడు కావచ్చు, నతినీతిపరుడు కావచ్చు
సవరించుకొనవచ్చు తప్పు, సవరించుకొనకపోవచ్చు
పవము పీచువలుకు బ్రిటిషువా డస్వతంత్రుండు కాడు
గువల కూతల కొడిగట్టి కొడిగట్టిపోయె భారతుడు. 255

ఆ॥వె॥ ప జనుండు నెలవురోజున దేశభ
క్తుండో వాని జాతి కోరిమె లేదు
నేడు కాదొ రేపు నెగ్గును రష్యాను
విప్లవంబు, దీని బీజ మొరిమె. 256

ద్వి॥ ఇటు లనుకొనిరి యం దేతెంచినట్టి
పటుమతుల్ ప్రతినిధుల్ వసతికిఁ జనుచు. 257

క॥ ఎట్టసిరాలోఁ జగ చెను
హుల్లా! యని పత్రికలు తదూహనిలోనఁ
మిట్టుకొనిన క్రొందిర్పును
గుట్టమ్ములు కలముపోరఁ గొన్ని ప్రభుతకున్. 258

గీ॥ విసురుగాఁ బోవునపు డరవిందఘోషు
కాలిపై నొకసార్జెంటుకాలు పడెను
చిత్తరంజనదాసింటఁ జేరె ఘోషు
దాసు కట్టు కట్టింపగ తగ్గె నొప్పి. 259

ఆ॥వె॥ ఇంచుకంత నిలచి యేదో వ్యాసోహాము
మెఱయ మనసులో నెవరికిఁ జెప్ప
కేగె వేగ ఘోషు, హితులు విస్మితులు త
త్పార్శ్వనిష్టతిలకప్రముఖబుధులు. 260

చ॥ తిల కిది యేమొకో?యనియె,తీ రిది వానిది నేనెఱుంగుదున్
బలికెను దాసు,నేఁ జనెదపాల్ నొడివెన్,జనుడయ్య! యేరిని
న్నిలుపదు వేచ దుద్యమము,నేనును శ్రీతిలకుండు నుండుతా
పులు సభ కానిచో జెయిలు,పోరచి దేశముకై శరీరముల్.261

క॥ అనె కేల్ మీసమ్మును తా
ననుకొన కంటుకొన లాల్,భళా!యనె బాల్,పాల్
చను టిపుడు చెన్నపురి కి
రనుమానింపకుడు చిత్తరంజను డనియెన్. 262

చ॥ విపిను డుపన్యసించునెడ 'బీచి' నగోచర మౌను పైకతం
బు పలికినంతసేపు,కడు మొక్కలం మేల్పడివారి దండలో
టిపని బజారులందు,నొక చేమిటి మొత్తుకపోయి కల్కటా
మ పలచినట్లె చెన్నపురిమాత్న విశాపము,దత్తువాకొనెన్.263

ఆ॥వె॥ మనకు నాగపూరున నెసంగు 'కా'మ్మని
యజితసింగు 'గ్ర'స్పనెడిలోన
కూడినాము దానిగూర్చి, యెవరిత్రోవ
వారి దయ్యెను లజపతి వచించె. 264

క॥ ఘూరకాంగ్రెసునన్ మన
పోరు బలియు ననెను దాసు, పొనరెడి నటులే
భారతదుస్థితి మది 'బ
ర్మా'రీతిగఁ దొలిచె,సెలవు! లజపతి నొడివెన్. 265

ఉ॥ దేవత లప్పుడప్పుడు నెదే నొక శాపవశమ్మునన్ ధరి
త్రీవసతిన్ గ్రహింతు రని తెల్పగ వింటిమి, చూడకుంటి, మా
కోవకు చిత్తరంజను డగున్ మణి, యాతని చేతి టీ సుధా
స్రావము, గోష్ఠివారి ననిషణ్ణుల నా సుహితుండు వీడ్కొనెన్,

ద్వి॥ అవకాశ మున్న సంధ్యావందనంబు
హావనంబు, నిరుపెద్ద లరిగిరి బనకు. 267

సీ॥ కపిలవర్ణంపుమేఘమున రేఖలు కట్టు
విడిపోయి యురియాడు జడలు గాగ
శ్వేత వర్ణంపు జీమూతమందలి చాటి
కలు మెడలో భుజంగములు గాగ
రక్తవర్ణపుముదిరంబు పచ్చిగజాజి
నంబుతో నుత్తరీయంబు గాగ
పసుపుతోఁగూడి త్రివర్ణంపు చాలిల
మబ్బు బెబ్బులితోలుమడత గాగ

ఆ॥వె॥ పగలె వర్ణచిత్రముగను పాశ్చాత్యాశ
తాండవంబు సేయ దట్టి గట్టి
అటుగఁ దిరిగి చూచు నధ్వరధ్వంసి యీ
శానమూర్తి వెన్నుచాయరూపు. 268

ఉ॥ అమవసఅండ చూచుకొని అంధతమం బది యెంత మించెనో
క్రమముగఁ నంతమించినవి కాంతిలి చుక్కలు, నెంత మించినన్
శమితముకాద చీకటి, శశాంకుని కాంతియుఁజుక్కయయ్యె, పం
ద మదికిఁ గృష్ణపక్షమె సదా, అది త్యాగికి శుక్లపక్షమే. 269

క॥ 'కొక్కొరొకో' యను కూతయు
కుక్కురొకో! పేను గాగ కుచ్ఛిత మనుచున్
వక్కాణించును కొందఱి
క క్కృతులకుఁ బ్రొద్దు పొడుచు నద్దమరేయిన్. 270

ద్వి॥ వారింద్రబృందంబువా రిట్టివారు
వారికి కందుకప్రాయంబు బాంబు. 271

క॥ ఎండ్రూఫ్రేజ రనెడి యొక
డుండె గవర్నరుగఁ బొడుతు నొరదీయకయే
దుండగు లగు విప్లవకృ
త్కాండము ననుచుండువాడు కండగలాడున్. 272

క॥ వానికి భూమిన్ మెతుకులు
లేన ట్లొనరింప వార లిరుపర్యాయాల్
పూనియు సఫలత్వంబున్
గానమిమై కుంటుపడక కడగిరి మరలన్. 273

సీ॥ కనులు పొడుచుకున్నఁ గనపడనట్టి చీ
కటి యంజనము గాగఁ గాంచువారు
చీమలు చొరలేని చిక్కని యడవుల
పుడమిపై వసివారు వెడలువారు
క్రమశిక్షణమ్మున గమనాన నొడుపున
సింహమ్ముతో పోటిసేయువారు
భీకరజంతువుల్ తోక ముడుచుకొని
పరువెత్తునటు జబ్బచఱచువారు

గీ॥ దెబ్బ యొకటి తునకలు రెండు, దిటవువారు
నేడు చావ రేపటికి రెండె యనువారు
భారతస్వతంత్రతదీక్షఁ బట్టినారు
బిట్టురయము రైలును పడగొట్టినారు. 274

గీ॥ రైలు వ్రాలె, ఫ్రేజరుబొంది రాలలేదు
కాని యా గడియ మొదలు వానిగుండె
రెండు పట్టాలుగాఁ జనుచుండె రైలు
తెల్లవారి యాత్మల పర్వు దీసె రైలు. 275

క॥ నీటుగ నిలబడి మేజ
స్ట్రేటు పదుగురందుఁ బరిహసించుచు స్వాతం
త్ర్యాటని నొక బాంబు పడన్
గాటము గాయపడె, బ్రతుకుకై మోయఁబడెన్. 276

క॥ ఏ పార్టీ? యన పోలీస్
టీపార్టీ, వాద మేమిటి త్వదీయము హిం
సాపదమో? ధన్యవాదము
మా ప్రజకై, యుగ్రవాది మార్వలుకు నిటుల్. 277

ఆ॥వె॥ చంద్రనగరమందు జాతీయదళమును
దృఢతరంబుఁ జేసి తిరిగి వచ్చి,
కల్కటాపురాన 'కన్హాయిలాల్‌దత్తు'
గతిక ఛురిక సేయఁ గడగినాడు. 278

మ॥ అది వ్యాసంబు ప్రజన్ బురిన్‌గొలిపె సంధ్యాపత్రికాంతర్గతం
బు,దొరల్లే రెవ, రున్న దెల్ల ప్రజయే, దుస్తంత్రనిర్ముక్తమౌ
చుఁ దనున్‌దానికనుండియేలుకొను,విజ్ఞుల్ హరాణులీ పద్ధతిన్
గదుమన్‌రా దని,బ్రహ్మబాంధవుని లేఖల్ సంతతస్తుత్యముల్.

చ॥ కల విటు కొన్ని వ్రాతలు యుగాంతరపత్రికయందు,'జారు'సే
నల పలుకుండి విప్లవజనమ్ములఁ జేరిరి,చేరుచున్నవా
రలు తెలివైన రష్యనులు, ప్రాతిగ నిందును నల్లై చేరువా
రలు ప్రభుసైన్యదేశ్యులుత్వరన్ మనలన్‌గడగుండుశాంతియాల్!

ఆ॥వె॥ ఫ్రెంచివిప్లవముగురించియు నిల్లె త
దీయవృద్ధి, యిందు న్యాయ మొకటె
వెలుపడిన యింటివార లందఱుఁ గూడ
బూజుపట్టినిల్లు తేజరిల్లు. 281

ఆ॥వె॥ 'ఏది ముక్తిమార్గ?' మిట్టి శీర్షికతో యు
గాంతరస్థము లగు వ్యాసముఖ్య
ము లొక పుస్తకముగ వెలసె, నక్షరములన్
బ్రాణ ముండు ననుచుఁ బ్రజకుఁ దెలిసె. 282

శా॥ కప్రంపున్ వలపున్ వెలార్చినవి ప్రాగ్భారమ్ముగా దేశభ
క్తిప్రాసాదమునందు నెన్నడులు వందేమాతర మ్మంచు, శా
వప్రౌఢిన్ బ్రకటింపఁ జేసినవి శోభల్, దక్షిణంబందు నాం
ధ్రప్రాశస్త్యము మెట్లుకట్టినది స్వాతంత్ర్యాది) శాసై పుగా.

ఉ॥ శ్రీముదిగొండవంశపుకరీరము, సత్కవిమల్లికార్జున
స్వామికి నాగమాంబకుఁ బొసంగిన సంతు, మనస్వికోకిలా
రామము వీరభద్రుఁ డిది వ్రాసెను, మోసెను దేశభక్తిచూ
డామణిమానసమ్ములకు దప్పికతీర్చితి నన్న తృప్తినిన్. 284

గీ॥ కవితలో షడక్షరిదయగలడు వీర
భద్రమూర్తి మనోబలభంజితార్తి
వ్రాసి యొసగె వందేమాతర మ్మటంచు
కైకొనియె భారతాంబ దీర్ఘాయు వనుచు. 285

అను॥ ప్రజాస్వామ్యప్రభుత్వాయ
ప్రజార్యై మంగళం సదా
నిస్వార్థేభ్యః ప్రజాసేవా
నిరతేభ్యశ్చ మంగళం. 286



# తప్పొప్పుల పట్టిక

| తప్పు | ఒప్పు | పేజీ |
|---|---|---|
| నాగ్లుల | నాంగ్లుల | 41 |
| శూ్య | శూన్య | 48 |
| తుపాలో | తుపానులో | 51 |
| ధారతమే | భారతమే | 57 |
| వా్రమ | వ్యా్రమ | 78 |
| హాణుండు | హూణుండు | 112 |
| దౌంతరాయా ! | దౌలతరాయా ! | 115 |
| హాణులు | హూణులు | 124 |
| గలినేమి | గలిగనేమి | 125 |
| బాలినోయెన | బాలివోయెన | 128 |
| యేల్లడిన్ | యేల్బడిన్ | 133 |
| మెగెను | మేగెను | 133 |
| దికంబరా | దిగంబరా | 139 |
| రెందటా | లెందటా | 151 |
| వెన్కఁటోయె | వెన్కకుఁటోయె | 157 |
| అకులములు | ఆకులములు | 158 |
| నటంను | నటంచు | 177 |
| గాకార్కా | గాగార్కా | 202 |
| రపకుండము | రసకుండము | 206 |
| కపంబు | కంపంబు | 217 |
| అడి | అడ్డి | 219 |
| నదించుటా | నందించుటా | 221 |

| తప్పు | ఒప్పు | పేజీ |
|---|---|---|
| బ్రటిమ | బ్రిటిమ | 221 |
| జారియూన్ | జార్జియూల్ | 234 |
| సాగునవేడు | సాగునేడు | 235 |
| మహి | మహిత | 238 |
| గూనాకరు | గూడనాకరు | 240 |
| పతున్ | పతుల్ | 241 |
| సమముజ్జ్వల | సమసముజ్జ్వల | 242 |
| స్పృశమున్ | స్పృశ్యముల్ | 243 |
| శిష్టన్ | శిష్టిన్ | ,, |
| మమత్ృ | మమృశ | 249 |
| లశిది | లశది | 256 |
| బ్రహోదాదు | బ్రహ్లోదాదు | 271 |
| దీక్షింతుగాత | దీక్షింతురుగాత | 275 |
| మహా | మహాః | 280 |
| సరారీ | సర్దారీ | 288 |
| లాంభచ | లాంఛన | 302 |
| సపుత్ర | సపత్ర | 304 |
| తధాస్త్వితుక్తులా | తథాస్త్విత్యుక్తులా | 352 |
| హీణ | వారాణ | 471 |
| కపర్థి | కపర్ది | 480 |
| నాంగుల | నాంగ్లుల | ,, |

ఇత్యాదులుగా గలవు

అక్కడక్కడ అచ్చులో ఒత్తులు ఎగిరిపోయినవి; హ్రస్వాలు దీర్ఘాలైనవి. వానిని పాఠకులే ఊహించుకొన ప్రార్థన.